# విక్రమాంక దేవచరితము

(బిల్హణకవి సంస్కృత మహాకావ్యానువాదము)

అనువాదకులు

శిరోమణి - ఆంధ్రబిల్హణ - బ్రహ్మభూషణ - సుధీంద్రమౌళి

**కప్పగంతుల లక్ష్మణశాస్త్రి**

ఆంధ్రబిల్హణ

**మాదిరాజు విశ్వనాథరావు**

ప్రకాశకుడు :

**కప్పగంతుల లక్ష్మణశాస్త్రి**

హైదరాబాద్

**1974**

# విక్రమాంక దేవచరితము

( బిల్హణకవి సంస్కృత మహాకావ్యానువాదము)

అనువాదకులు

శిరోమణి - ఆంధ్రబిల్హణ - బ్రాహ్మీభూషణ - సుధీంద్రమౌళి

కప్పగంతుల లక్ష్మణశాస్త్రి

ఆంధ్రబిల్హణ

మాదిరాజు విశ్వనాథరావు

(भारतीय शिक्षामान्त्रलयसहाय्येन प्रकाशितम्)

ప్రకాశకుడు :

కప్పగంతుల లక్ష్మణశాస్త్రి

హైదరాబాద్

1974

# విక్రమాంక దేవచరితము

(బిల్హణకవి సంస్కృత మహాకావ్యానువాదము)

అనువాదకులు

శిరోమణి - ఆంధ్రబిల్హణ - బ్రాహ్మీభూషణ - సుధీంద్రమౌళి

కప్పగంతుల లక్ష్మణశాస్త్రి

ఆంధ్రబిల్హణ

మాదిరాజు విశ్వనాథరావు

(भारतीय शिक्षामान्त्रलयसहाय्येन प्रकाशितम्)

ప్రకాశకుడు :

కప్పగంతుల లక్ష్మణశాస్త్రి

హైదరాబాద్

1974

ప్రథమ ముద్రణము 1000 ప్రతులు
శా. శ. 1895 - క్రీ. శ. 1974

వెల రు. **13-00**

ప్రాప్తిస్థానము
**కప్పగంతుల లక్ష్మణశాస్త్రి**

ప్రకాశకుడు
**'అమర భారతి'**
5-9-22/97, ఆదర్శనగర్
హైదరాబాద్-500 004 ఆం. ప్ర.
టెలిఫోన్ 33782

ముద్రాపకులు
శివాజీ ప్రెస్,
గంజ్ బజార్, సికింద్రాబాదు




చాళుక్యరాజు—విక్రమాంక దేవుఁడు (షష్ఠ విక్రమాదిత్యుఁడు)

పరిపాలన కాలము - క్రీ. శ. 1075-1126
(కల్యాణీ నగర దేవాలయము గోడపైనున్న చిత్రపు ప్రతిరూపము నుండి)

# ఉపోద్ఘాతము

సంస్కృతవాఙ్మయమందలిఅత్యుత్తమమహాకావ్యములలోఁ జేర్పఁ దగినది బిల్హణమహాకవి రచించినయీవిక్రమాంకదేవచరితము. మీఁదుమిక్కిలి మిగిలినవాని వలెఁ గాక యిది చారిత్రికము. ప్రాచీనపౌరాణికకథాశ్రయము గాదు. కవి తన ప్రభువుయొక్క చరితమునే కావ్యముగా రచించినాఁడు. కావున నుత్తమకావ్యగుణములే కాక సమకాలికచరిత్రయు నిందు జేరి యున్నది. కథానాయకుఁ డైనవిక్రమాంకుఁడు కల్యాణకటకము రాజధానిగా ద్రవిడదేశమునేకాక మిగిలినదక్షిణాపథమునంతటిని జయించి యేఁబదియేండ్లు ఎదురు లేక పరిపాలించినఆఱవచాళుక్య విక్రమాదిత్యుఁడు. ఇతనిరాజ్యకాలము క్రీ॥ శ॥ 1076-1126 సం॥ వఱకు ఉండినది.

ఈమహాకావ్యమును చిరకాలముక్రిందనే శ్రీతిరుపతివేంకటకవులు ఆంధ్రవచనకావ్యముగా రచించి 'సరస్వతి' యనుపత్రికలోఁ దిరుపతిశాస్త్రిగారు జీవించి యుండినపుడే, ప్రకటించి యుండిరి. ద్వితీయముద్రణము 1935 సం॥లో వెలువడినది. సంస్కృతమూలముయొక్క ప్రాశస్త్యమును, సుగృహీతనామధేయులు, తమగురువర్యులు కీ॥ శే॥ శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారివలన విని, వారియాదేశానుసారముగా వనపర్తిసంస్థానవిద్వత్కవు లైన శ్రీయుతులు కీ॥ శే॥ మాదిరాజు విశ్వనాథరావుగారును, మిత్రులు శ్రీకప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారును చిరకాలము క్రిందనే పద్యకావ్యముగాఁ, బ్రాచీనకవులసరణిలో నాంధ్రీకరింప నారంభించిరి. నడుమ శ్రీవిశ్వనాథరావుగారు గతింపఁగా శ్రీకప్పగంతులవారు పూర్తిగావించి యుండి, యిప్పుడు, అవకాశము కుదురఁగా ముద్రించి ప్రకటించు చున్నారు. నాయందలిమైత్రిచేత నన్ను దీనికి ఉపోద్ఘాతము వ్రాయవలసినదిగాఁ గోరిరి.

ఈ కావ్యమును సంపాదించి ముద్రించినకీర్తి పాశ్చాత్యులది. డా॥ జార్జి బ్యూలర్ అనునతఁడు 1874 సం॥లోఁ దనమిత్రుఁడు డా॥ హెచ్-జాకోబీ పండితునిసాయమున, రాజస్థానమున సంచరించుచు జైసల్మేరుజైనభాండాగారమున నతిప్రాచీనలిపియందు వ్రాయఁబడినప్రతినిఁ గనిపట్టి, ప్రత్యంతరము వ్రాయించి, పరిశోధించి, చారిత్రికోపోద్ఘాతముతో 1875 సం॥లో మొదటిపర్యాయము ప్రకటించెను. పిమ్మట

శ్రీరామకృష్ణభండార్కర్‌పండితులును, డా. ఫ్లీటుగారును దమచారిత్రికగ్రంథములలోఁ జాళుక్యచరిత్రములను బ్రకటించిరి. తమిళములో శ్రీ ఏ. వి. వెంకటరామయ్యర్ అనువారు పరిశోధించి విక్రమాదిత్యునిచరిత్రను 1920 సం॥లోఁ బ్రామాణికచారిత్రికగ్రంథముగాఁ బ్రకటించిరి. 1927 సం॥లో మహామహోపాధ్యాయ పండిత శ్రీరామావతారశర్మగారు, కాశీ జ్ఞానమండల ముద్రాక్షరశాలవారి ప్రకాశనార్థము పునఃపరిశీలన మొనర్చి యీయఁగా వారు ప్రకటించిరి. అటుపిమ్మట సాహిత్యాచార్య పండిత మురళీలాల్‌నాగర్ అనువారు జైసల్మేరుప్రతితో పూనాలోని భండార్కర్‌పరిశోధనాలయమువారిప్రతిని, ఇంకను వారికి దొఱకిన యితరప్రతులను సంపాదించి, పాఠభేదములను బరిశీలించి, కాశ్మీర సరస్వతీభవనము (Prince of Wales Saraswati Bhavan Text Series) వారికి శుద్ధతరప్రతిని సిద్ధము చేసి యొసంగిరి. ఇట్లుండియు నేవేవోకారణములచేత స్ఖాలిత్యములు తగ్గ లేదు. నాగరపండితుఁడు బ్యూలర్‌పండితుని చారిత్రికోపోద్ఘాతమును విమర్శించి, అచ్చటచ్చట ఖండించుటయేకాక, కావ్యాంతమందు, పైజైసల్మేరుభాండాగారమందే దొఱకిన 'చరిత్రచంద్రిక' యనుటిప్పణినిఁగూడఁ జేర్చిరి. ఇటీవల శ్రీపండిత విశ్వనాథశాస్త్రిభరద్వాజ అనువారిసంపాదకత్వమున జైనగ్రంథాఽదికములపర్యాలోచనపూర్వకమైనప్రతి, సంస్కృతటీకా-హిందీభాషాఽనువాదములతో, బనారసు హిందూ విశ్వవిద్యాలయమువారిచే 1958 సం॥లో మూఁడుభాగములుగాఁ బ్రకటింపఁబడినది.

ఇది పదునెనిమిదిసర్గలమహాకావ్యము. కాళిదాసాఽదులమార్గమున రచితమైనట్టియాలోకోత్తరప్రబంధమునకు నుపోద్ఘాతమును వ్రాయుటకు, గొప్పవారు, సంస్కృతాంధ్రసాహితీనిష్ణాతులును, చారిత్రికపరిశోధకనిపుణులును బూనుకొనవలసినదిగాని నావంటివాఁడు ఏమి చేయఁ గలఁడు; ఐనను, గల్యాణీచాళుక్యుల చరిత్రను గొంత పరిశోధించినందువలనను, మిత్రులయాదేశానుసారమునను, వారికోరికను గాదనఁ జాలక యేదో వ్రాయు చున్నాను. శ్రీకప్పగంతులవారేకాక మిత్రులు శ్రీతిరుమల రామచంద్రగారును దీనికిఁ బ్రేరకులు. వీరికిఁ గృతజ్ఞుఁడను.

ఈ నాయుపోద్ఘాతమును మూఁడు భాగములుగా విభజించి (1) కవిని గుఱించియు (2) కావ్యప్రతిపాదితవిషయములనుగుఱించియు వ్రాసి (3) ఆధునికమార్గమునఁ జారిత్రికవిషయచర్చను గొనసాగించి, చివరకు, నుపసంహారముగా నాకుఁ దోఁచినకావ్యగుణములను నాంధ్రానువాదప్రాశస్త్యమును గొద్దిగా వ్రాయఁ



దలఁచితిని. ఇందుఁ బ్రధానపురుషుఁడు చాళుక్యవిక్రమాదిత్యుఁడుగాన నాతనిం గూర్చి ఉపక్రమణిక :

## చాళుక్యవిక్రమాదిత్యుఁడు

భారతదేశమందుఁ జరిత్రప్రసిద్ధులు విక్రమాదిత్యు లనేకులు. అతిప్రాచీనుఁడు, శకారి ఒకహర్షవిక్రమాదిత్యుఁ డుండె నని కథలు చాలఁ గలవు. విక్రమమందు ఆదిత్యునితో సమానుఁ డని బిరుదార్థము. విక్రమశకాబ్ద మొకటి, ఎక్కువగా నుత్తర హిందూస్థానమున నీతనిపేర, క్రీ.పూ. 58 నుండి గణింపఁ బడునది కలదు. వింధ్యకు దక్షిణమున శాలివాహన శకము క్రీ.శ. 58 నుండి యారంభింపఁ బడినది వాడుకయం దున్నది. విక్రమాదిత్యుఁ డనుబిరుదును దర్వాత గుప్తచక్రవర్తి చంద్రగుప్త - విక్రమాదిత్యుఁడు (క్రీ.శ. 4వ శతాబ్ది) ధరించెను. ఇతనియాస్థానివాఁడే కాళిదా సని యొక యభిప్రాయము కలదు. ఈ 'విక్రమాదిత్య' బిరుదమును 'విషమశీల, సాహసాంక, సాహస విక్రమాంక' ఇత్యాదిగాఁ బ్రయోగించు చుండిరి. భోజునితండ్రి సింధురాజునుగుఱించి 'నవసాహసాంకచరిత' మని 'పరిమళకాళిదా' సనునతఁడు క్రీ.శ. 1010 సం॥ ప్రాంతమున నొకచక్కనిచారిత్రికకావ్యమును వ్రాసెను. విక్రమార్కభేతాళకథలును, భోజవిక్రమార్కచరిత్రలకథలును, అర్వాచీనులు అతిప్రాచీనవిక్రమాదిత్యునికి ముడివెట్టి, కాలానుక్రమణిక యెఱుఁగక వ్రాసినవి.

చాళుక్యరాజులలో నీవిక్రమాదిత్యనామధారులు అనేకులు కనఁ బడు చున్నారు. క్రీ.శ. 550 సం॥ ప్రాంతమునుండి 750 సం॥ వఱకుఁ బాలించినవారిలో నొక విక్రమాదిత్యుఁడు పల్లవచక్రవర్తులవిరోధి కలఁడు. ఇట్లు వచ్చినవారిలోఁ బరిపాలింపక ప్రవాసమునఁ గొందఱు విక్రమాదిత్యులు పోఁగా మఱల సామ్రాజ్యమును సంపాదించిన తైలపుని (972 నుండి) మనుమఁడు ఐదవవిక్రమాదిత్యుఁడు (1008-1012). ఇతని తమ్మునిమనుమఁడే ప్రస్తుతకావ్యనాయకుఁడు, కర్ణాటక చాళుక్యచక్రవర్తి, ఆరవవిక్రమాదిత్యుఁడు (1076-1126) 'త్రిభువనమల్ల' బిరుదాంచితుఁడు. ఈతనియాస్థానమున 'విద్యాపతి' పదవి నధిష్ఠించిన 'బిల్హణ' మహాకవియే యేతత్కావ్యరచయిత.

## ౧ బిల్హణకవి చరిత్ర

ఇతఁడే, కావ్యాంతమున, పదునెనిమిదవసర్గలో వ్రాసినది, ఆత్మకథ (ఆధునిక 'స్వీయచరిత్ర' వంటిది), ఒకపూర్తిసర్గయే కలదు. అం దిట్లున్నది :-

[1] కాశ్మీరదేశము శైవమతమునకుఁ బట్టుకొమ్మ. వితస్తా(ఝీలం)నదీతీరము నందలి 'ప్రవరపురము'(నేఁటిశ్రీనగరము)దానికి రాజధాని. అదివిద్యలకునాలవాలము, సంపదలకు నిలయము. స్త్రీలుకూడ సంస్కృతము మాటాడువారఁట. 'వితస్తా-సింధు' నదులసంగమము కాశ్మీరమందే. అచ్చటిరాజులు, శివభక్తిపరాయణులు కట్టించిన మఠములు దేవాలయములు విద్యాస్థానములు గణనాతీతములు. 'అనంతదేవుఁ' డనురాజును (క్రీ.శ. 1028-1063), అతనికుమారుఁడు 'కలశదేవ'రాజును (1063-1089), అతనికుమారులు 'హర్షాదిత్య - ఉత్కర్షదేవ - విజయమల్లులను' (1089-1101), బిల్హణుఁడు ఎఱుఁగును. వీరిలో విజయ మల్లుఁడు మన్మథుఁడే యఁట.

ప్రవరపురమునకు రెండుక్రోసులదూరమున 'జయవన' మనునొకవనమును, దానియందు 'తక్షకకుండ' మనుతటాకమును, నాప్రాంతమున [2] 'ఖోనముఖ' మను ఊరును గలవు. అందుఁ గౌశికగోత్రజులు బ్రాహ్మణు లుండిరి. వీరు 'గోపాదిత్యుఁ' డనురాజుచేత మధ్యదేశమునుండి పిలిపింపఁ బడినవారు. వీరిలో నొకశాఖకు 'ముక్తికలశుఁ' డనుపండితుఁడు కూటస్థుఁడు. అతనికి 'రాజకలశుఁడు', అతనికి 'జ్యేష్ఠకలశుఁడు' ను జనించిరి. ఇతనికి నాగాదేవియందు మహాపండితుఁ డైన 'ఇష్టరాముఁడు'ను, ఈమహాకవి 'బిల్హణుడు'ను, 'కవీంద్రదుర్మదలీలాకుఠార' మగు'ఆనంద'కవియు జనించిరి. ఇట్టిపావనపండితవంశమున వేదఘోషములనడుమ బిల్హణుఁడు జనించెను. అధ్యయన మొనర్చి, పాతంజలమహాభాష్యముతోఁగూడ శబ్దశాస్త్రముఁ జదివి, కర్ణామృత మగుసాహిత్యవిద్యయందుఁ బ్రవీణుఁ డై లేఁత వయసునందే మహాకవి యాయెను.

1. వివరములకు శ్రీతిరుపతివేంకటకవులయాంధ్రానువాదమును జూడుఁడు.
2. నేఁటి 'ఖుమ్మఖ్' అనుగ్రామము, 'పంపాక్' అను చోటికి మారురిదిశలో మూడుమైళ్ళదూరమునఁ గలదు.



కారణాంతరమునఁ గాశ్మీరదేశమును వదలి, బిల్హణుఁడు మథురాపురమునకు వచ్చి...అందలిసూరిచక్రమును జయించి...బృందావనంబునం గొన్నాళ్లు వసించి యుండి...' తనశిష్యులే...సర్వదిగంతజైత్రయాత్ర గావించి తనకీర్తి నివ్యాపింపఁ జేయఁగావెలసెను. ఇతనికావ్యములను జదువనివారు లేరఁట (ఆకావ్యము లేవో చెప్ప లేదు). తర్వాత కాన్యకుబ్జాధీశునియాస్థానమునఁ గొంతకాల ముండి (అయోధ్య ?) 'ప్రయాగ, వారాణసి' మున్నగుక్షేత్రములు దర్శించి, 'కాలంజరగిరి' ప్రభువునకు యముఁ డైన డాహళప్రభువు'కర్ణుని'కడఁ గొన్నా ళ్ళుండెను. (ఈకర్ణుఁ డెవఁడో ? ముప్వురు కర్ణులు పరిపాలించిరి. 'చేది'రాజు 'గాంగేయదేవుని'కుమారుఁడు 'కర్ణుఁడు' 1041-1070, సం॥ లోను, అతనితర్వాత ఇరువురుకర్ణులు 'యశఃకర్ణ-గయాకర్ణులు' పరిపాలించిరి). డాహళాధీశునియింట గంగాధరపండితుని జయించి, అట నుండి 'భోజుఁడు' పాలించిన 'ధారా'నగరమునకుఁ బోయెను.

నాఁటికి భోజమహారాజు గతించి కొంతకాల మై యుండ వలయును. ఏల యన నాఁటికి భోజుఁడు లేఁ డని బిల్హణుఁడే వ్రాసి యున్నాడు:-

"నీత్వా గంగాధరమధరతాం డాహళాధీశధామ్ని,
క్రీడాఽఽక్రాంతప్రతిభటకవేః పూర్వదిక్కోటరేషు ।
నిర్జిత్యైరావతమదజలభ్రాన్తభృంగాఽలినాదా
సుత్రామ్ణోఽపి శ్రవసి లుఠితం యస్య శక్యా కథాభిః"॥(18 = 95)

దీనికి నాంధ్రబిల్హణుల యనువాదము :-

మ. "ఘనుఁ డౌ 'డాహల' భూపుసౌధమునఁ దా 'గంగాధరున్' గెల్చి, గె
ల్వ నెదుర్కొన్నరిపుధీరులన్ గెలుచువిద్వచ్చంద్రుగాథాఽఽళి, ప్రా
చ్యనగప్రాంతచరత్సురేభమదతోయభ్రాంతభృంగాఽరవం
బును నిర్జించి సురేంద్రుకర్ణపుటినేన్ బొర్లాడు నం చెంచెదన్".
(7 = 97)

* "భోజః క్ష్మాభృత్స ఖలు న ఖలైస్తస్య సామ్యం నరేంద్రైః,
తత్ప్రత్యక్షం కిమితి భవతా నాఽగతం, హా! హతాఽస్మి।
యస్య ద్వారోడ్డమరశిఖరక్రోడపారావతానాం
నాదవ్యాజాదితి సకరుణం వ్యాజహారేవ ధారా"॥ (18 = 96)

*భోజుఁడు లేఁ డని యిందువలనఁ దెలియుచున్నది. భోజుఁడు గతించిన యనంతరమే బిల్హణుఁడు 'ధారా'నగరమునకుఁ బోయినందువను, భోజునిచివరి తారీఖు క్రీ. శ. 1050 సం॥ అగుటచేతను, (నాచే నిర్ణీతము చూ The Later days of Bhoja 'The Great' JOR Vol xvi part III March 1947) ఆటుతరువాతనే బిల్హణుఁడు దచటికిఁ బోయి యుండవలెను. ఇట్లుండఁగా దీనికి శ్రీ తిరుపతి వేంకటకవులయాంధ్రానువాదమున భోజుఁ డుండఁగానే బిల్హణుఁ డచటికిఁ బోయినట్లు కలదు. అట్లయినచో 1050 కి ముందే కావలసియుండును. వారియనువాదమున వేఱువిధముగా నున్నది — 'దాహళాధీశునింట నున్న గంగాధరుని జయించి, విలాసముగాఁ బ్రతిపక్షకవికోటి నాక్రమించినయేరాజ దేవేంద్రునికథలు పూర్వదిక్కూటరంబులం దైరావతమదజలాస్వాదమత్తంబు లై యున్నతుమ్మెదలరొదలతోఁ బ్రతిస్పర్ధ గావించుచు, దేవేంద్రునికర్ణద్వయముం బ్రవేశించి యచ్చెరువు పుట్టించెనో యట్టి భోజరాజున కితరనృపాలురకును సామ్య మెట్లు లభించును? ఆమహారాజుగుణములు ప్రత్యక్షముగాఁ జూడక పోయితిరి. హా! దైవమా! నేను వర్ణించిన నమ్మరుదురో నమ్మరో కదా। అతనిధారానగరమే సర్వదా ద్వారోపాంతములయం దున్నవిటంకములమీఁద నున్నపారావతముల యారావములనెపమున నతని నుతించు చుండును. 'తాదృశమహనీయగుణగరిష్ఠుం డగుభోజరాజకవీంద్రునిం గూర్చ నానారాజసందర్శనకుతూహలంబునం బోయి కాంచి, యతనిచే మిగుల సత్కరింపఁ బడి, యయ్యనఘునిసాన్నిధ్యముం బాసి......'

అని వారు అనువదించుటకు ఏయాధారమో తెలియదు.

దీనింబట్టి వారి కెట్టిప్రతి, ఎట్టిపాఠాంతరములతో దొఱకినదో యని అనుమానము కలుగుచున్నది. అది దొఱకినఁ జాల బాగుండును. కాని ఫ్లీటు, భండా



దీనికి నాంధ్రబిల్హణులయనువాదము :—

ఉ. "కారు సమంబు భోజునకుఁ గానరపాలురు; నీవు నుంటి వే
లా! రహి రాక యానృపలలామునికొల్వున; 'నేను దుర్విధి
ప్రేరిత' నంచు, ద్వార్ధమరకృచ్ఛిఖరోడ్డయనప్రవర్తితో
దారకపోతరావమిష యై తగె దీనత 'ధార' వల్కె నాన్."
(7 = 98)

ర్కరు, బ్యూలరు మున్నగు చరిత్రకారులు 'బిల్హణుఁడు భోజరాజును బొత్తిగా దర్శింపలేదని వ్రాయుచుండఁగా 'గాంచి యతనిచే మిగుల సత్కరింపఁ బడి' అని వారు వ్రాయుట చాల నాశ్చర్యకరముగ నున్నది. పైశ్లోకములకు బ్యూలర్ పండితుని ఆంగ్లానువాదము—

"When in the palace of the Lord of Dahala he conquered Gangadhara, the tale of him who in sport overthrew his rivals in poetry, came, I ween, to the ears of Indra silencing in the caves of the East the hum of the bees that were drunk with ichor flowing from Airawata's temples" (95).

"Simulating the Cooing of the pigeons that nested on the lofty turrets of her gates, Dhara cried to him in pitiful tones : 'Bhoja is my king. He, forsooth, is none of the vulgar princes. woe is to me ! "why didst thou not come into his presence."

ధారానగరమునుండి యాతఁడు గూర్జరదేశమునకుఁ బోయి, యచ్చటి పండితులు తన్నుజక్కఁగా గౌరవింపనందున వారియలక్ష్యజనితపరాభవమువలని మార్గాయాసమును సోమనాథక్షేత్రమందలి జ్యోతిర్లింగదర్శనముచేఁ బోఁ గొట్టుకొనెనఁట. అటనుండి పశ్చిమసముద్రముమీఁదుగా (మళయాళదేశముమీఁదుగా) సేతువునకుఁ బోయెను. అచటినుండి కల్యాణకటకమునకుఁ బోయి చాళుక్యవిక్రమాదిత్యుని నందర్శించి, యారాజునాస్థానిలో 'విద్యాపతి' పదవీనియుక్తుఁడై సుఖముండెను*.

* తిరుపతివారియనువాదమున మఱికొన్ని విషయములు లేవు. ముఖ్యముగా గూర్జరయాత్ర కానరాదు. భోజరాజదర్శనానంతరము ఇట్లున్నది — 'అయ్యనఘునిసాన్నిధ్యముం దాసి సముద్రము స్వేచ్ఛాప్రసారముఁ గావింప కుండ భార్గవుం డానర్చిన......పశ్చిమాంబుధితీరమునకుం బోయి సేతువుం గాంచితి' (పు. 120) 1935 ముద్రణము.

బిల్హణకవిజీవితవిశేషములంగూర్చి సంస్కృతవాఙ్మయచరిత్రకారులు వ్రాసియున్నారు. మల్లాది సూర్యనారాయణశాస్త్రి గారు తెనుఁగున వ్రాసినదానిలోఁ జాలకొద్దిగాఁ గలదు. ఆంగ్లములో శ్రీ ఎం. కృష్ణమాచార్యులవారు కొంత వివరముగా వ్రాసి యున్నారు. బిల్హణుఁడు భోజుని దర్శింప లేదనియే వీరియభిప్రాయము.

"He intended to see Bhoja of Dhara, but he could not. He went to Anhilwad in Gujarat, but he was not heartily welcomed there and he Complains of this indifference.

"క్షాదన్నం విదధతి న యే సర్వదైవావిశుద్ధా
స్తద్భాషన్తే కిమపి భజతే యజ్జుగుప్సాఽఽస్పదత్వమ్।
తేషాం మార్గే పరిచయవశాదర్జితం గుర్జరాణాం
యః సంతాపం శిథిలమకరోత్ సోమనాథం విలోక్య"॥ (విక్రమాం 18-97).

దీనికి నాంధ్రబిల్హణులయనువాదము :—

చ॥ అనయ మపూతులే యగుచు, నాడటఁ గచ్చమురిన్ గడింపఁగాఁ
జనక, నుడుల్ వెలార్చునెడఁ జాల జుగుప్సను గూర్చు 'గూర్జ'రా
వనిజనసంగ మధ్యమున వర్తిల నందినవంత సోమనా
థు నభవుఁ గాంచి యక్కవివిధుం డల శాఁ దొలఁగించె నెంతయున్.
(7=99).

"He offered his devotions at Somanath and setting out southwards he visited Ramesvara. On his way back he reached the court of Kalyan where Vikramadity VI, Tribhuvanamalla admired his learning and made him his Vidyapati... ...". దీనింబట్టి చూడఁగా బిల్హణుఁడు భోజునిఁ జూడ లేదు. నత్కారము అనలే పొంద లేదు. ఎట్లు పొందఁ గలఁడు లేని భోజునికడ? ఇంత వ్యత్యాసముతోడి మూలము తిరుపతివారికి ఎక్కడ దొరికినదో తెలిసినఁ జరిత్రకుఁ జాల ప్రయోజనకారిగా నుండును.



బిల్హణుఁడు విక్రమాంకుని దర్శించినకాలమునుగుఱించి భిన్నాభిప్రాయములు కనఁబడు చున్నవి. క్రీ. శ. 1085 సం॥ నాఁటి కితఁడు ఈకావ్యమును రచించియుండు నని బ్యూలర్ పండితునియభిప్రాయము. శ్రీకృష్ణమాచారిగారు క్రీ. శ. 1088 సం॥ నాఁటివిక్రమాంకునినర్మదాతటదండయాత్ర ఈకావ్యమందుఁ గానరా దనియు, నీతనికావ్య మసంపూర్ణ మనియు, నందులకుఁ గాశ్మీరమందు దొరికిన 'చౌరపంచాశిక'యందలియీక్రింది రెండుశ్లోకములచేత నెఱుకపడుచరిత్ర-(ఈకవి రాజాదరమును గొన్నాళ్ళకుఁ గోలుపోయి, ప్రభువు సర్వస్వమును హరింపఁగా దేశత్యాగ మొనర్చె ననుట) - కారణ మని యొకయభిప్రాయము కల దనియు (JRAS iv-5) వ్రాసి యున్నారు.

ఆశ్లోకములు :—

"సర్వస్వం గృహవర్తి కుంతలపతిర్గృహ్ణాతు కిం మే పునః;
భాండాగారమఖండమేవ హృదయే జాగర్తి సారస్వతమ్।
రే ! క్షుద్రాస్త్యజత ప్రమోదమచిరాదేష్యన్తి మన్మందిరమ్
హేలాఽఽన్దోళితకర్ణతాలకరటిస్కంధాధిరూఢాః శ్రియః"॥
"అయి కిమనిశం రాజద్వారే సముద్ధరకన్ధరే
కువలయదలస్నిగ్ధే ముగ్ధే విముంచసి లోచనే।
అమరరమణీలీలావల్గద్విలోచనవాగురా
విషయపతితో న వ్యావృత్తిం కరిష్యతి బిల్హణః"॥

కాని క్రీ. శ. 1088 సం॥లో విక్రమాదిత్యుఁడు ఉత్తరదేశదండయాత్ర కావించినట్లు కానరాదు. చక్రవర్తి యైనతర్వాత నటు పో లేదు. పైఁగా, మఱలఁ జోళులతో యుద్ధమును ప్రస్తావించుటచేతను, నది యాతనిరాజ్యపుచివరిసంవత్సరములలో (1118) నగుటచేతను బిల్హణుఁడు అంతవఱకుఁ గల్యాణకటకమందే యుండె ననియో లేక ఆకాలముననే విక్రమాంకుని దర్శించె ననియో తోఁచుచున్నది.

"భ్రామః కిమన్యదయముత్సహతేస్మ యత్ర
ద్వయ్యేవ తత్ర గతిరావిరభూన్నృపాణాం।
కారాగృహే పతనమాశుపలాయనం వా
చోలోఽపి శీఘ్రమపసారమతశ్చకార."॥ (17 = 67)

దీనికి నాంధ్రబిల్హణులయనువాదము :—

ఉ. వేఱు వచింప నేలఁ బృథివీపతి యెచ్చట మచ్చరించినన్
దీఱుఁ దెఱంగుగా వసుమతీతిలకంబులకున్ ద్వయంబె, 'పెన్
గాఱియఁ గారఁ గాంచుట వికావిక లై దవు వాఱుటల్' ద్వరన్
బాతె ననిన్ ద్యజించి గరువం బఱి చోళుఁడు ప్రాణభీతిమై.
(6 = 213)

"అథ శిథిలితచాపశ్చోలలక్ష్మీం గృహీత్వా
కృతవివిధవినోదస్తత్ర కాంచీనగర్యాం।
నిజనగరమగచ్ఛత్సాంద్రమాతంగసేనా
భరభరితదిగంతః కుంతలక్ష్మాభుజఙ్గః"॥ (17 = 68)

దీనికి నాంధ్రబిల్హణులయనువాదము :—

ఉ. అపయి నజ్యచాపుఁ డయి యప్పతి చోళరమన్ గ్రహించి, కాం
చీపురమందు సత్కవులశిష్టవినోదములందుఁ దేలి తా,
రా పగుదంతివాహినిభరంబు దిగంతర మావరింపఁగా
మో పగునెమ్మెమైఁ దనదుప్రోలినిఁ జేరె సముత్సహించుచున్.
(6 = 114)

విక్రమాదిత్యుఁడు ఈకాలమునఁ (1118) గాంచీనగరమునకుఁ బోయినట్లు శాసనప్రమాణము కలదు. వేంగినిఁ జాళుక్యదండనాయకులు 'అనంతపాలుఁడు,' అతనిమేనల్లుండ్రును, జయించి కంచివఱకుఁ బాలించు చుండిరి. దీనింబట్టి చూడఁగా బిల్హణుఁడు విక్రమాంకుని నతనిరాజ్యపువిదిదశలోఁ జూచిన ట్లున్నాఁడు. కాశ్మీర



మును బాలించినరాజులలో శ్రీహర్షునితర్వాతఁ బాలించినరాజును బేర్కొనక ఉత్కర్షదేవునిఁ జెప్పుటచేతను, దాహళమును బాలించినకర్ణునికడనుండి యటు విమ్మట ధారానగరమునకుఁ బోయి, యటనుండి సోమనాథము, మళయాళము, సేతువు నిత్యాదులను దర్శించి చివర విక్రమాదిత్యుని దర్శించినందువలనను నిదంతయుఁ జాలకాలము పట్టియుండవలెను. కాశ్మీరమును 1089 సం॥ లో హర్షదేవునిరాజ్యాధిరోహణానంతరమే వదలి యుండును. మఱి దాహళమం దెప్పు డుండెనో ? విక్రమాంకదేవునిచరిత్రను సంపాదించి వ్రాయుకాలమునకు బిల్హణుఁడు వృద్ధుఁ డై విశ్రాంతి నపేక్షించు చుండె నని ఈశ్లోకములచేఁ దెలియు చున్నది:—

"నీలచ్ఛత్రోన్మదగజఘటాపాత్రముత్తున్నచోలా
చ్చాలుక్యేంద్రాదలభత కృతీ యోఽత్ర విద్యాపతిత్వమ్।
అస్మిన్నాసీత్తదను నిబిడాఽశ్లేషహేవాకలీలా
వేల్లద్బాహుక్వణితవలయా సన్తతం రాజలక్ష్మీః"॥
(18-101)

దీనికి నాంధ్రబిల్హణులయనువాదము :—

శా. చోళాఽభీల'చళుక్య'భూమిపతిచే సూరీంద్రుఁ డొందన్ మహా
నీలచ్ఛత్ర-మదేభరాడ్ధ్వజముతో'న్విద్యాపతిత్వంబు' నా
పై లాలించె దృఢోపగూహనకళావాల్లభ్యవేల్లద్భుజా
హేలాశింజితహస్తభూష యయి యెంతే వానిరాలచ్చియున్.
(7 = 103)

"దిఙ్మాతంగైరపి సపులకైః శుశ్రువే యస్య కీర్తిః
నిద్రాముద్రాప్రణయిషు మదాఽస్వాదతః షట్పదేషు।
తేన ప్రీత్యా విరచితమిదం కావ్యమవ్యాజకాన్తం
కర్ణాటేందోర్జగతి విదుషాం కంఠభూషాత్వమేతు."॥
(18 = 102)

దీనికి నాంధ్రబిల్హణులయనువాదము :—

మ. మదపానంబునఁ దుమ్మెదల్ నిదుర మైమై మైకొనన్, గగ్గురుల్
గదురన్ దిక్కరులేని వేనియశ మాకర్ణించు, నాతండు దా
నగరియించెన్ గమనీయకావ్య మిది కర్ణాటేంద్రుప్రీత్యర్థః మి
య్యది యొందున్ జగతిన్ బుధప్రకరకంఠాలంక్రియాసుస్థితిన్.
(7 = 104)

"లబ్ధా లక్ష్మీర్ధృతిరితి; కృతాః సంపదః సాధుభోగ్యాః;
ప్రాప్తా యోగ్యైః సహ కలహతః కుత్ర నోచ్చైర్జయశ్రీః?
గోష్ఠీబంధః సపది సుజనైః సారనిష్కర్షదక్ష
ప్రజ్ఞాలబ్ధస్తుతిభిరచిరాదస్తు కాశ్మీరకైర్మే"॥ (18 = 103)

దీనికి నాంధ్రబిల్హణులయనువాదము :—

ఉ. కూరెను లక్ష్మి నల్గడలఁ; గూర్చితి సజ్జనభోగ్యసంపదల్;
ధీరుల నోర్చి గెల్పుసిరిఁ దేఱితి నెల్లెడ వాదులందునన్;
సారముఁ దేల్చు దక్ష మయి సన్నుతిఁ గాంచెడుప్రజ్ఞ మీఱుకా
శ్మీరబుధాళిగోష్ఠి త్వరఁ జెందుత నన్నిటమీఁద నాదటన్.
(7 = 105)

"అరుషామ నృపప్రసాదకణికామద్రాక్ష్మ లక్ష్మీలవాన్
కించిద్వాఙ్మయమధ్యగీష్మహి గుణైః కాంశ్చిత్పరాజేష్మహి।
ఇత్యజ్ఞానమయీమకార్ష్మ కియతీం నానర్థకంథాం మనః;
స్వాధీనీకృతశుద్ధబోధమధునా వాంఛత్యమర్త్యాపగామ్"॥
(18 = 104)



దీనికి నాంధ్రబిల్హణులయనువాదము :—

శా. చెందం గంటి నృపప్రసాదకణికన్; శ్రీలేశమున్ గంటిఁ; గా
సం తౌవిద్యను నేర్చితిన్; గుణగణం బాధార మై కొందఱి
న్నిందం జేసితి; నిట్లు జ్ఞాన మఱి యెన్నే నేరముల్ సేసితి;
న్డెందం బిప్పుడు తేఁటతెల్విఁ గనె; వాంఛింతున్ వియద్వాహినిన్.
(7 = 106)

"మందాకిన్యాః పవనచటులోత్తాలవీచీదుకూలే
కూలోత్సంగే విరచితవతాం యోగనిద్రాఽభియోగమ్।
శేషాః కేషామపి పరిణతా వాసరాః పుణ్యభాజామ్
కాన్తస్వాన్తస్థితగిరిసుతావల్లభానాం ప్రయాంతి."॥
(18 = 105)

దీనికి నాంధ్రబిల్హణులయనువాదము :—

చ. పరిణతి, శాంతచిత్తమును బార్వతివల్లభునందు నిల్పి, యు
ద్ధురమరుదుద్ధతోర్మితతి దూఁగుదుకూలముగాఁగ నొప్పునా
మరతటినీతటాంకమున మా నగుయోగసుషుప్తి, రక్తిఁ, బు
త్తురు కడవాసరంబులను, దూలఁగఁ బాపము పుణ్యమానవుల్.
(7 = 107)

పైశ్లోకములకుఁ దిరుపతి-వేంకటకవులయాంధ్రానువాదము—"...చోళేంద్రుని జయించినచాళుక్యరాజదేవేంద్రుం డగువిక్రమాదిత్యభూపాలునకు విద్యాపతి నై, యాభూపతివలన నీలచ్ఛత్ర-గజఘటాఽఽదిసన్మానములకుం బాత్రుండ నై, బిట్టు కౌఁగిలించుకొనుటంజేసి, గల్లుగల్లు మని మ్రోఁగుబాహువలయంబులు గలరాజ్యలక్ష్మి సౌఖ్య మనుభవించు చుంటిని. కడుపునిండ మదము ద్రావి యొడ లెఱుంగక షట్పదంబులు నిద్రించుచుండ దిగ్గజంబులుసైతము ఎవ్వానికీర్తి పులకితశరీరములతో వినునో అట్టినేను రచియించినయీయవ్యాజసుందర మగుకావ్యము కర్ణాట భూపాలునికీర్తి నాచంద్రార్కస్థాయిగ నొనర్చుచు విద్వాంసులకుఁ గంఠాలంకార

మగుఁగాత. ఐశ్వర్యమా లభించినది. సాధుభోగ్యము లగుసంపదలా ప్రతిదిక్కు-నందును వెదచల్లితిని. సజ్జనులతో సహవాసముఁ జేసితిని; ప్రతిభటకవికోటిని నిర్జించి జయలక్ష్మి నార్జించితిని. నా కేమియుఁ గొదువ లేదు. కాని, సారాసార విచారదక్ష మైనప్రతిభాసామర్థ్యము గలిగి కొనియాడం బడుకాశ్మీరకసుజన సంఘములో నా కచిరకాలంబున సహవాసంబు లభించుఁగాత అని కోరు చున్నాఁడను. మహారాజులయనుగ్రహము సంపాదించితిని. సంపదల ననుభవించితిని. కొంచెమో గొప్పయో చదువుకొంటిని, ఎందఱనో కొందఱినిఁ బ్రతిపక్షుల జయించితిని. ఇఁక నీయజ్ఞానమయప్రపంచముతో సంబంధము విడిచి దివ్యబోధ నీయఁగలగంగాద్వారమున నెప్పుడు నివసింతునో! నా కంతటిభాగ్యము ఎన్నఁడు కలుగునో! మందాకినీరంబునం బవనచలితంబు లగుతత్తరంగంబులనుండి వచ్చు శీకరమిశ్రితం బగుచల్లనిగాలి మెయి సోఁక యోగనిద్ర ననుభవించుచుఁ గాంతం బగు స్వాంతంబునఁ బార్వతీకాంతావల్లభునిం దలంచుచుఁ గాలము పుచ్చుమహాభాగ్యము పుణ్యాత్ములకుఁగాని కలుగదు."

వీనినిజూడఁగా బిల్హణుఁడు మంచివృద్ధుఁ డనియుఁ, జిత్తశాంతిఁ గోరు చున్నాఁ డనియు విశద మగు చున్నది. 'ప్రాయ మింతకు మిగులఁ గై వ్రాలకుండ' అన్న శ్రీనాథునికాశీఖండమునాఁటివయసును దాఁటినదశ, నాగానందనాటకమున జీమూతకేతువు శ్లోకమును జ్ఞప్తిపఱచు చున్నది. (నాగానందము-చతుర్థాంకము) శాతగారియాంధ్రాను వాదము.

"భుక్తము లయ్యె యౌవనపుభోగము; లేలితిఁ గీర్తి యొప్పఁగా
దిక్తతి; నేకవృత్తి గడతేరెఁ దపంబు; సుతుండు శ్లాఘ్యుఁడున్
ద్యక్తరజస్తముండు; సదృశాన్వయసంభవ కోడ లీమెయిన్;
వ్యక్తము గాగ నే నిఁకఁ గృతార్థత మృత్యువుఁ గోరఁగాఁ దగున్."

ఇంతటిమహాపండితునిచేత నింతగొప్పకావ్యమును వ్రాయించుకొని, తుదకుఁ గృతజ్ఞత లేక, రాజు ఇతనిసర్వస్వమును హరించి, వృద్ధాప్యమున దేశము వెడల నడచె ననునది నమ్మ రానిమాట. శ్రీయుతకృష్ణమాచార్యులవారి 'సర్వస్వం గృహవర్తి' యన్నశ్లోకముంగూర్చినవృత్తాంతము ఇతనింగూర్చినది యై యుండదు. వృద్ధుని కితనికి నీచౌర్యశృంగారము అతుకదు. ఏదో సంబంధము లేనివ్రాఁత చౌరపంచాశికకు సంబంధించి యుండును.



## బిల్హణుని యితరరచనలు.

బిల్హణుఁడు తనయితరరచనలంగూర్చి యిందుఁ జెప్ప లేదు. నాలుగంకముల 'కర్ణసుందరీ' నాటిక యొకటి, రత్నావళీ-విద్ధసాలభంజికలవంటిది కనఁ బడు చున్నది. 'అణహిల్లనగర' పాలకుఁ డైనగూర్జరాధిపతి, చాళుక్య 'కర్ణదేవుని,' 'భీమదేవ' కుమారుని గూర్చినది. విక్రమాంకదేవచరితమందలి గూర్జరప్రస్తావము చేత, గూర్జరరాజాస్థానమందుఁ గొంతకాల మీతఁ డుండి యుండును. రాజాదరమున్ను లభించి యుండ వలెను. కాని దాహళకర్ణునిఁ బేర్కొనుటయు గూర్జరుని మానుటయు, నచటిపండితులయనాదరమును బ్రస్తావించి యచ్చటితన కావ్యనాటకాదిరచనను బేర్కొనక పోవుటయు వింత! 'కర్ణసుందరి' యితనిది కాదా! లేక, ఏమో, ఎందుచేతనో అనాలోచితముగాఁ జెప్ప లేదో! ఆకాలమున నంతటిబిల్హణుఁడు గూర్జరమునకుఁ బోయినవాఁడు మఱియొకఁడు లేఁడుగదా!

శ్రీమల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు తమ సంస్కృతవాఙ్మయచరిత్రమున 'ఇతఁడు కల్యాణపురము చేరకముందు దాహలపురమురా జగు కర్ణభూపాలుని యాస్థానమునఁ గొంతకాల ముండి, యాతఁడు నాయకుఁడుగాఁ గర్ణసుందరీనాటికను రచించెను.' అని వ్రాసి యున్నారు. ఇది నిరాధారము.

'దాహళమం దుండినప్పుడు బిల్హణుఁడు రామాయణమును రచించి యుండు నేమో' యని శ్రీకృష్ణమాచారిగారు ఈక్రిందిశ్లోకమునుబట్టి యూహించు చున్నారు.

"యస్యాతృప్తః స్ఫటికగిరిణా తం వినిక్షిప్య వామే
ప్రాలేయాద్రేః క్షణమభిముఖో దక్షిణః పాణిరాసీత్ ।
తం పౌలస్త్యం విదలితవతః సూక్తినిఃస్యందశీతామ్
సీతాభర్తుః వ్యరచయదసౌ రాజధానీమయోధ్యామ్" ॥

(విక్రమాంక 18 = 94)

దీనికి నాంధ్రబిల్హణులయనువాదము :—

చ. మును స్ఫటికాద్రిచేఁ దనివిఁ బొందక దాపలికేల దాని నుం
దను నిడి, మంచుకొండను నిడం ద్రుటి దక్షిణహస్తమున్ నిగి

ద్భినదశవక్త్రుఁ ద్రుంచురఘుశేఖరురాజ్యనగరం'బయోధ్య' నీ
ఘనకవి స్వీయసూక్తిరసగాహనఁ జేసెను శైత్య మందఁగన్.

(7 = 96)

"He was received well in the Court of king karna of Dahala (Bundelkhand) and in that court probly composed a poem in honour of Rama."

దీనికిఁ దిరుపతివారియాంధ్రానువాదము - "పదంపడి కుఱిచేశం గైలాసముం గదల్చియు సంతసింపక, ఎడమచేతహిమవత్పర్వతముంగూడఁ గదల్పుటకు యోజించినమహాబలశాలి దశకంఠునిం జంపినశ్రీరామచంద్రమూర్తి రాజధాని యగు నయోధ్యనుసైతము సూక్తినిష్యందశీతలముం గావించితిని." తా నయోధ్యకుఁ బోయినట్లు చెప్పక దాహశప్రస్తావమునదుమ దీవినిచెప్పుటచేత నిది కావ్యరచనయే కాని ఆయూరికిఁ బోవుట గా దని బ్యూలరుగారుగూడ నిర్ణయించి యున్నారు.

The Statement that he cooled by the floods of his song Ayodhya the Capital of the husband of Sita, seems to me rather.......than to point to a journey to Oud.
(Intro. పు. 18)

ఈతనిరచనగా నొక 'శివస్తుతి' యున్న దనియు, నందలి లెక్క లేనన్ని శ్లోకములు జల్హణుని'సూక్తిముక్తావ'ళ్యాదిగ్రంథములలో నుదాహృతము లనియుఁ బ్రసిద్ధము వానినిగుఱించి పరిశోధన యింకను జరుగ వలెను.

'చౌరపంచాశిక' యనునది ఏఁబదిశ్లోకములకావ్యము. అది కాశ్మీరమున దొఱకినది. దీనికే 'చౌరీసురతపంచాశికా' యని నామాంతరము. కాని యిది బిల్హణుఁ డనుకవియొక్క చరిత్రయగునుగాని దీనిరచయిత బిల్హణుఁడు కాఁడు. ఎవఁడును నట్టితనదుశ్చరిత్రమును వ్రాసికొనఁడు. పైఁగా, ముద్రితప్రతులలోఁ 'బంచాల'దేశ మందు 'లక్ష్మీమందిర' మనుపురవరమున 'మదనాభిరామ'నృపతి యుండె ననియు నాతనికుమార్తె 'యామినీపూర్ణతిలక' యనియు, నాయూరివాఁడే బిల్హణకవి, ఆరాజకుమారికి సాహిత్యవిద్య బోధింప నారంభించి చౌర్యముతోఁ బెండ్లి చేసికొనె ననియుఁ గథ. దీనికిని బిల్హణకవి చరిత్రకును గవియొక్క నామమందుమాత్రమే సామ్యము. మఱి విక్రమాంకదేవచరితరచయిత యైనబిల్హణునియందు నెట్టి



దుశ్చరితముగాని కాన రాదు. ఈచిన్నికావ్యమున కీపే రెట్లు వచ్చినదోకాని యిందు 'అద్యాపి తాం' అని ప్రారంభించునాయికావర్ణనశ్లోకములేకాని, పైకథ కొన్ని ప్రతులలో లేదఁట. ఎవఁడో ఒకప్రేమికుఁడు తనప్రియురాలింగూర్చి చేసినస్మృతి శ్లోకములుమాత్రమే అవి. మఱికొన్నిట 'వైరిసింహుఁ' డనుగూర్జరరాజుయొక్క పుత్రి యైన'చంద్రలేఖ' (లేక శశికళ) యనుదానికి బిల్హణుఁడు విద్యాగురు వని కలదు (కృష్ణమాచార్యులు). ఈవైరిసింహుఁడు క్రీ.శ. 920 నాఁటివాఁడు, బిల్హణునిపుట్టుకకుఁ జాలపూర్వుఁడు, పైఁగా, సంస్కృతవాఙ్మయమున గురువునకు శిష్యురాలికి నడుమఁ దెర వేసి చదువు చెప్పింపఁ బూనఁగా వారు పెండ్లి చేసికొన్నకథలు చాలఁ గలవు. 'ఉదయన-వాసవదత్త'లవీణాశిక్షణకాలమందుఁ బ్రద్యోతుఁడు వారినడుమఁ దెర కట్టింపఁగా వారు, గాంధర్వముగాఁ బెండ్లిచేసికొని పాఱిపోయి రని కైనుల కథలు గలవు (ధమ్మపదము), ఇందుచేత నెవరో రచించినశృంగారశ్లోకములకు భిన్నప్రదేశములలో భిన్నరీతులకథలు కల్పింపఁ బడిన ట్లున్నది. 'శ్రీనాథా'ది యాంధ్రకవులు 'బిల్హణునిఁ' 'జోరుని' భిన్నకవులనుగాఁ బేర్కొనుటచేత నితఁడు వే అని శ్రీకృష్ణమాచార్యులుగారు వ్రాసినారు. 'చోరుఁ' డనుకవియొక్క పేరుమాత్ర మున్నది. కావ్యము కాన రాదు. ఈయకార్యమువలననే అతనికి ఆపేరు కలిగిన దనుటకును నాధారము కాన రాదు. సంస్కృతవాఙ్మయచరిత్రలో రాజకుమారికను బెండ్లి చేసికొన్నవాఁడు క్రీ.శ. 900 ప్రాంతమువాఁడు రాజశేఖరకవి యొకఁడు కనఁ బడు చున్నాఁడు. ఇతఁడు బ్రాహ్మణుఁడు, అమె క్షత్రియ.

"చాహువానకులమౌలిమాలికా
రాజశేఖరకవీంద్రగేహినీ ।
భర్తృసత్కృతిమవంతిసుందరీ
సా ప్రయోజయితుమేతదిచ్ఛతి."॥

కాని రాజశేఖరునిఁగుఱించి యిట్టికథలు లేవు.

క్రీ.శ. 1798 సం॥లో రామతర్కవాగీశభట్టాచార్యులు 'చౌరపంచాశిక' యనునొకకావ్యమును వ్రాసి రనియు, నం దొకరాజపుత్త్రుఁడు 'సుందరుఁ' డనువాఁడు, కాళీపూజకుఁడు ఒకరాజకన్యను అపహరించె ననుకథ యనియు శ్రీమల్లాది వారు వ్రాసి యున్నారు.

ఎందువలననో పంచమహాకావ్యములలో నీవిక్రమాంకదేవచరితము చేర లేదు.

ఇంతకన్న బిల్హణమహాకవినిగుఱించి చరిత్ర తెలియ రాదు. మఱి యీతని విక్రమాంకదేవచరితము సరయుదము.

## ౨ విక్రమాంకదేవచరితకథాసారము.

సర్గ—౧. ఇష్టదేవతాస్తుతి – వైదర్భీరీతియొక్క ప్రాశస్త్యము – సుకవిస్తుతి–కుకవినిందాఽఽదులు – కవులకు రాజాఽఽదరణము – ఇత్యాదులతర్వాత–చాళుక్య రాజవంశోత్పత్తి – బ్రహ్మ తనసంధ్యావందనసమయమున లోకోద్ధరణార్థము, తన చుళుకముపైఁ జూడ్కి నిగిడించి యొకవీరుని సృజించుట–అతఁడే 'చాళుక్యుఁడు'–ఆకులమందు 'హారీతుఁడు', 'మానవ్యుఁడు'–పెక్కురు రాజులు జనించి అయోధ్యను పాలించు చుండుట–తర్వాత దక్షిణదేశమునకు వారు వచ్చుట–వారిలోఁ బ్రఖ్యాతుఁడు 'తైలపుఁడు' (వంశావళిలేదు)–అతనికి 'సత్యాశ్రయుఁడు'–(ఐదవవిక్రమాదిత్యునిఁ జెప్ప లేదు). పిదప 'జయసింహుఁడు'–అతనికి 'త్రైలోక్యమల్లుఁ' డను 'ఆహవ మల్లుఁడు'– ఇతఁడు 'చోళ–మాళవ–డాహళ' రాజులను జయించుట–చోళరాజుపేరు లేదుగాని, మాళవపతి 'భోజుఁడు,' 'ధారా'నగరాధిపతి; డాహళపతి 'కర్ణుఁడు' (ఈకర్ణుఁడు తాను దర్శించినకర్ణుఁడో కాఁడో తెలుప లేదు) – 'కాంచీ'విజయమును రెండవమాఱు తెల్పెను. ఇప్పుడును జోళరాజుపేరు చెప్పఁడు.

సర్గ—౨. ఆహవమల్లునిక్రమాభివృద్ధి–'కల్యాణపుర'నిర్మాణము–దానిని బ్రతి క్షణము నేమఱక కాపాడు చుండుట–సకలదిగ్విజయానంతరము చిరకాలము పుత్త్రులు లేక పరమశివు నారాధించి వరము పడయుట–శివానుగ్రహమున 'ముగ్వురు కుమారు లనియు, వారిలో నడిమివాఁడు దిలీప–మాంధాతలవంటివాఁ డగును' అనియు నాకాశవాణి–తర్వాత 'సోమేశ్వర–విక్రమాదిత్య–జయసింహులు' జనించుట–విక్రమా దిత్యునిజననకాలమందు ననేకశుభసూచకములు–ఇట్లు పుత్త్రోత్సవము వర్ణితము.

సర్గ—౩. విక్రమాదిత్యునిబాల్యము–రెండవవాఁ డైనను గుణశాలి యైనం దునఁ దండ్రి యతనినే యువరాజుఁ జేయఁ దలంచుట–వల దని విక్రముఁడు అన్ననే చేయించి తాను యుద్ధాఽఽదికములలో సాయపడు చుండుట–భ్రాతృప్రేమ, ధర్మబుద్ధి, పరిపాలనాదక్షత–తండ్రి విధి లేక యెట్లును దైవనిర్ణయముప్రకారము



విక్రముఁడే రా జగు నని తలంచి పెద్దకుమారునికే యువరాజపదవి నిచ్చుట–విక్ర మునిదిగ్విజయములు(చోళము, మలయము, కామరూప–గౌడ–మాళవములు)–శరణుఁ జొచ్చినమాళవపతిని మఱల నతనిరాజ్యమందుఁ బ్రతిష్ఠించుట.

సర్గ—౪. పేరునకు రెండవసోమేశ్వరుఁడు యువరా జైనను, క్రియచేతఁ దమ్ముఁడు, విక్రమాదిత్యుఁడు యువరా జై దిగ్విజయము లాచరించుట–కేరళులను జెండాడుట–సింహళీయులు శరణాఽఽగతు లగుట–'గంగాకుండ'పత్తనకాంతలకుండల ములు జారిపోవుట–'కాంచి, చక్రకూటము' మున్నగుప్రదేశములను జయించి, దక్షిణ దిగ్విజయయాత్రసమాప్తిఁ గావించి రాజధానికి మఱలునపుడు దుర్నిమిత్తము లగు పడుట–'విక్రముఁడే తొలుత సోమభూపాలునికి యౌవరాజ్య మిప్పించి యిపుడు సామ్రాజ్య మిప్పించు చున్నాఁడు' అని తలంచుచుఁ దండ్రి తీవ్రనిదాహజ్వర పీడితుఁ డై తుంగభద్రలో మునిఁగి శివైక్యము నందినవార్త వినుట–అపుడు కృష్ణా నదీతీరమునఁ దా నుండి, విలపించి, తండ్రికి నుత్తరక్రియ లాచరించి అన్నకడ కేగుట–అన్న ఆదరించుట–తాను జయించి తెచ్చిన దంతయు నన్నకు సమర్పించుట ('నాస్తి లోభో యశస్వినామ్').

తర్వాతఁ గ్రమముగా సోమభూపాలునకుఁ బాపబుద్ధి కలుగుట–తద్వర్ణనము–విక్రముఁడు భరింప లేక తన కపకీర్తి లేకుండ, ద్రావిడాఽఽదిరాజన్యులచే నన్న కుపద్రవము లే కుండునట్లు, సామ్రాజ్యరక్షణార్థము దక్షిణసముద్రతీరమునకుఁ బోఁ దలంచి రాజధానిని వదలుట.

సర్గ—౫. విక్రముఁడు తమ్మునికి నాపద రా నీయక వెంటఁ బెట్టుకొని యేగఁగా అన్న విరోధము శంకించి తమ్ములను శిక్షించుటకు సైన్య మంపుట–మఱల మఱలఁ బంపినను వానిపరాజయము, విక్రమునివిజయము–దిగ్విజయార్థము విక్రముఁడు చోళరాజ్యముమీఁదికి బయలుదేరుట–మార్గమున 'వనవాసి, మలయము, కొంకణము' మున్నగువానివిజయము–ఇది విని ద్రవిడభూపాలుఁడు తనకుమార్తె నిచ్చుటకు వార్త నంపి తుంగభద్రాతీరమునఁ దాము సంధించుటకు నియమించుట–పెండ్లి.

సర్గ—౬. చోళరాజుతో సంధి – వివాహబాంధవ్యము – ద్రవిడభూపాలుఁడు తనరాజ్యమున కేగుట – విక్రమునిరణాభిలాష – ఇంతలో ద్రవిడపతిమరణము–తత్క్షణమే విక్రముఁడు 'కాంచి' కేగి, యటఁ గొన్నా ళ్లుండి, పిదప 'గంగాకుండ'

మనువట్టణమునకుఁ బోయి, శత్రువులను జయించి, బావమఱఁదిని ('అధిరాజేంద్రుని' పేరు లేదు) రాజ్యమందు స్థాపించి, నెలదినములుమాత్ర మచట నుండి మఱలఁ దుంగభద్రాతీరమునఁ దనస్కంధావారమునకుఁ బోయెను.

కొలఁదిదినములలో బావమఱఁదికిఁ బ్రకృతివిరోధము కలిగి, వా రతనిఁ గడతేర్పఁగా, వేంగినాథుఁ డగు'రాజిగుఁడు' చోళసామ్రాజ్యము నపహరించెను; విక్రమాదిత్యునికి వెఱచి సోమేశ్వరునితో సంధి చేసికొనెను. రాజిగునిమీఁదికి విక్రమాంకుఁడు ఎత్తి రాఁగా సోమేశ్వరుఁడు రాజిగునికి సాయముగా విక్రమాంకుని మీఁదికి వెనుకనుండి దండు పంపెను. అన్నపై రణ మొనర్ప విక్రముఁడు శంకింప శివుఁడు స్వప్నమునఁ బ్రత్యక్షమై 'యతఁడు (విక్రముఁడు) దేవకార్యమునకు నవతరించినవాఁ డనియు, నాతనియన్నకు అదృష్టము లే దనియుఁ, శంకింపక యన్నను జయించుట మే లనియుఁ' బ్రోత్సహింప – ఇరువాగుల రణమొనర్ప, విక్రముఁడు రాజిగునిఁ దఱిమి, యన్నను జెఱపట్టి, కర్ణాటకసింహాసనము నధిష్ఠించెను, తమ్ముని 'జయసింహుని' యువరాజును జేసెను.

సర్గ—౭. తర్వాతఁ గొన్నాళ్ళకు, విక్రమాంకుఁడు మఱల నొకపర్యాయము చోళరాజ్యమును జయించి కల్యాణమును బ్రవేశించెను. వసంతఋతువర్ణనము.

సర్గలు—౮, ౯. 'కరహాటరాజ'కుమారి 'చంద్రలేఖ'ను విక్రమాంకుఁడు స్వయంవరమార్గమునఁ బెండ్లి యాడుట.

సర్గ—౧౦. విక్రమాంకుని వనవిహారము.

సర్గ—౧౧. రాజు 'చందల'దేవితోఁ గాలము పుచ్చుట-వర్ణనలు.

సర్గ—౧౨. మామగారిరాజధానియందుఁ జిరకాల ముండి విక్రమాంకుఁడు మఱలఁ గల్యాణకటకమునకు వచ్చుట – నగరాంగనశృంగారచేష్టలు – గ్రీష్మర్తువర్ణనము.

సర్గ—౧౩. క్రమముగా గ్రీష్మము తొలఁగి వర్షాఋతువు వచ్చుట-చందలదేవితో వర్షాకాలానుభవము.

సర్గ—౧౪. శరత్కాలవర్ణనము. చోళునికడనుండి జయించిన'వనవాసి'నిఁ బరిపాలించు చుండినజయసింహుఁడు ద్రవిడరాజుతోఁ గలిసి కుట్ర సాగించుట-విక్రముఁడు తమ్ముని ననునయించుట.



సర్గ—౧౫. జయసింహుఁడు యుద్ధ మొనరించి ఓడిపోఁగా విక్రముఁడు క్షమించుట.

సర్గ—౧౬. హేమంతఋతువర్ణనము – మృగయావిహారవర్ణనము.

సర్గ—౧౭. సుఖపరిపాలనము – పుత్త్రోదయవర్ణనము – దానధర్మములు-ప్రతిష్ఠలు – మఱలఁ జోళరాజుతో యుద్ధము-విజయము-కాంచీనగరమునఁ గొన్నాళ్లుండి మఱలుట-సుఖాంతము.

సర్గ—౧౮. కాశ్మీరదేశవర్ణనము, కవియొక్క ఆత్మకథ, (ముందే వర్ణితము).

### ౩. చారిత్రిక సమన్వయము

బిల్హణుఁడు విక్రమాంకుని క్రీ.శ. 1118 లేక అంతకుఁ గొంతముందు దర్శించి యుండు నని ముందు వ్రాసితిని. అందుల కనుగుణముగా నాతఁడు ప్రత్యక్షముగా నెఱుఁగనివిషయములను విని గ్రహించి యుండినందువలన, విన్నవారు చేయుపొరపాటులవంటివి యీతనిరచనలోఁ జాల పడినవి. ఏ వనఁగా:—

(1) ప్రారంభమందే 'చాళుక్య'వంశము బ్రహ్మచుళుకమునుండి జనించిన దనెను. చుళుకమునుండి జనించి యుండినయెడలఁ 'జౌళుక్య'వంశ మగునుగాని చాళుక్యము కాఁ జాలదు. బిల్హణుఁడు గూర్జరమున నుండినవాఁడు వారిచాళుక్యనామమును, వంశోత్పత్తికథను గ్రహించి, యిచ్చటిశాసనములవక్కాణనుగాని ఉత్పత్తికథలనుగాని గ్రహింపక నూతనకథను జమత్కారార్థము గ్రహించెనేమో! చాల సంగ్రహముగా నయోధ్యాపురసంబంధమును మాత్రమే చెప్పెను.

(2) వంశమును వర్ణించునెడ 'వాతాపిచాళుక్యు'లనుగాని, 'గూర్జర-వేం'గ్యాది శాఖలనుగాని చెప్పక వదలి తటాలున తైలపునితోఁ బ్రారంభించెను. 'సత్యాశ్రయుని' తర్వాతఁ బాలించినతత్సోదరపుత్త్రుఁడు ఐదవ'త్రిభువనమల్ల విక్రమాదిత్యుని' (1008-14) చెప్పక 'జయసింహునిఁ' బేర్కొనెను. అట్టివాఁ డొకఁడు పాలించి యుండఁగా నది యెఱుఁగఁడో లేక తనకావ్యమునకు ననవసర మని తలంచెనో! జయసింహునికి, 'జయసింహుఁ' డనియే మఱియొక కుమారుఁడు శాసనములలోఁ గనఁ బడు చున్నాఁడు. బిల్హణుఁడు వీనిని జెప్పఁడు.

(3) ఈకవికి నుత్తరదేశములతో నుండినంతపరిచయము దక్షిణదేశముతోఁ గాన రాదు. 'కాశ్మీర-కాలంజర-దాహళ-మాళవ-గూర్జ'రాదుల నెఱింగినంత చక్కఁగాఁ 'జోళ-వేంగీ'నాథుల నెఱుంగఁడు, 'కర్ణ-ముంజ-భోజు'లను, 'వేంగి-రాజిగునిఁ' 'గొంకణ-జయకేశినిఁ' బేర్కొనెనేకాని 'చోళ'రాజు లగు'రాజాధిరాజ-రాజేంద్రచోళ,-వీరరాజేంద్ర-అధిరాజేంద్రు'లను మందున కైనను బేర్కొనఁడు. ఊరక 'చోళరా'జని చెప్పు చుండును. చారిత్రికపురుషుని నాయకునిగా గ్రహించిన వాఁడు తారీఖులను జెప్పుటకు వీలు లేకపోయినను చారిత్రికవిషయములను జక్కఁగాఁ జెప్ప వలసియుండ నూరక దాఁటుకొని పోవును. తాను రచియించిన 'కర్ణసుందరి' నాటకనే పేర్కొన లేదు.

(4) మొదటిసర్గలోఁ ద్రైలోక్యమల్లునిదిగ్విజయవర్ణనలోఁ గర్ణ - చోళ - మాళవవిజయములను వర్ణించి భోజునిధారానగరమును బ్రస్తావించినాఁడు, రెండవ సర్గప్రారంభమున 'చకార కల్యాణమితి క్రమాదసౌ పురం పరార్ధ్యం పృథివీపురందరః' అని, ఈరాజుపట్టాభిషిక్తుఁ డైన (కొన్నాళ్ల) యనంతరమే, కల్యాణకటకమును నిర్మించుకొన్నట్లు చెప్పినాఁడేకాని మొదటిరాజధానిని 'మాన్యఖేటము'ను జెప్ప లేదు. ఏల ఈనూతనరాజధానిని నిర్మించుకొన వలసివచ్చినదోకూడ వివరింప లేదు. ఎఱుఁగఁడు కాఁబోలు.

## కల్యాణకటక నిర్మాణ చరిత్ర

త్రైలోక్యమల్లుఁడు క్రీ.శ.1042సం॥కు రాజ్యమునకు వచ్చెను. కల్యాణకటకప్రస్తావము పశ్చిమచాళుక్యులశాసనములలో క్రీ.శ. 1033 సం॥నుండియే కలదు. బసవపురాణమున జగదేకమల్లునిప్రస్తావమునఁ గల్యాణకటకమునందలి విష్ణుప్రతిమ వీరశైవయోగిమహిమవలనఁ గరఁగిపోయిన దని యొకకథ(4-ఆశ్వా). మఱియొకకథ, తేదర (దేవర) దాసిమయ్య, జగదేకమల్లునిరాణిప్రోద్బలమున నతనిని జైనమతమునుండి శైవమునకు మార్పించుట (6-ఆశ్వా). ఈజగదేకమల్లుఁడు ఆహవమల్లునితండ్రి, జైనుఁడు, 'మల్లికామోద' బిరుదాంచితుఁడు (1015-1042). ఇతనిరాణి 'సుగ్గలదేవి'. దాసిమయ్యయేకాక కాలాముఖగురువు 'బొంతెయ'మహామునికూడ జయసింహునికి బోధించినవాఁడే. తుదివదిసంవత్సరములు మతము మాఱుటయేకాక రాజ్యభారమును మహాసమర్థుఁ డైనకుమారునికి ఆహవమల్లసోమేశ్వరునికి నప్పగించి, తాను రాణులతో 'పొట్టలకెఱె' (హైదరాబాదు



దగ్గరి'పటంచెఱువు') కడనుండి శైవజంగములను సేవించు చుండెను. కుమారుఁడు సోమేశ్వరుఁడు క్రీ.శ.1033సం॥నాఁటికే ముప్పదియేండ్లకు మించినవాఁ డై యుండ వలెను. ఏలన 1044-45 సం॥ ప్రాంతమునఁ జోళులతో యుద్ధము లొనరించు నాఁటికి, నీతనికి సమర్థసేనాపతి కాఁ గలరెండవకుమారుఁడు, ఈవిక్రమాంకుఁడే కలఁడు. కావున 1000 సం॥ ప్రాంతముననే జనించి ఆహవమల్లుఁడు, తల్లి సుగ్గలదేవి, శైవమతాభినివిష్ట, 'సోమేశ్వరుఁ' డని శివనామ మిడఁగా నెదిగి, ముప్పదియేండ్లకు మించినవయసునఁ దండ్రికిఁ గుడిభుజ మై తయా రగుటయేకాక, పూర్తి విశ్రాంతి యొసంగి యుండ వలెను. 1042 సం॥లో రా జై 1068 సం॥ వఱకు 26 ఏండ్లు పాలించినందువలన, 68 లేక డెబ్బదియేండ్లు జీవించి యుండును.

సోమేశ్వరుఁడే కల్యాణకటకమును, దండ్రికాలముననే శత్రుదుర్భేద్య మైన కటకముగా నిర్మించి యుండును. ఇందులకుఁ గారణము చాల గొప్పది, ఎంతో చరిత్రతోఁ గూడినది. తైలపచక్రవర్తికాలము (క్రీ.శ.973) నుండియుఁ జాళుక్యులకును జోళులకును వేంగికొఱకు స్పర్ధలు కలవు వేంగివారికిని జోళులకును బాంధవ్యము కుదిరినది. తమఅల్లుండ్రను నెలకొల్పుటకుఁ బశ్చిమచాళుక్యులను బోరాడ నారంభించి దాదాపు డెబ్బదియేండ్లు కృష్ణా-తుంగభద్రాతీరములేకాక, వేంగీ-కల్యాణ-కాంచీ-ధారా-దాహళములు రణరంగము లై, యివి యఖిలభారతపర్యాప్త యుద్ధము లైనవి. భారతదేశమండలిరాజు లందఱును నెవరో యొకరిపక్షము చేరి పోరాడిరి ఈవివరములను జరిత్రగ్రంథములలోఁ జూడ వచ్చును

ఇచ్చటిరాజకీయములు పరిశీలింపఁ దగినవి. మాళవరాజులు మొదటినుండియుఁ దమిళులమిత్రులు. తైలపచక్రవర్తికిఁ జోళ'రాజరాజు' శత్రువుగా నుండినంతకాలము 'ముంజ'మహీపతి చోళులకు సాయముగాఁ దైలపుని వెనకివైపునుండి బాధించు చుండెను. సత్యాశ్రయునికాలమునకు భోజుఁడు రాజ్యమునకు రా లేదు. చోళ రాజేంద్రుఁడు పరాక్రమించునాఁటికి భోజుఁడు మాళవమందును, విక్రమార్కుఁడు చనిపోయి జగదేకమల్లజయసింహుఁడు కర్ణాటకమునను రాజు లై పరాక్రమించిరి. ఉత్తరమునుండి మాళపతి భోజుఁడును, దాహళపతి గాంగేయదేవునికుమారుఁడు కర్ణుఁడును, కోసలులు-కళింగులు-చక్రకూటపురాజులును దూర్పునుండియుఁ, గొంకణ ప్రాంతమండలిరాజులు పశ్చిమమునుండియుఁ జోళులకు సాయపడు చుండఁగా

దక్షిణాపథమండలిరాజుల నందఱినిఁ గూడగట్టుకొని పాండ్య-సింహళీయాదులను గూర్చుకొని చాళుక్యులు పోరాడిరి. విమలాదిత్యుఁడు చోళులసాయముతో రాజ్యమును సంపాదించుకొన్నను నిలుపుకొనుట కతనికిఁ గష్టముగా నుండెను. ఇతఁడు 1019సం॥లో గతింపఁగా నితనికుమారుఁడు, మనరాజరాజనరేంద్రుఁడు, రాజేంద్ర చోళచక్రవర్తి మేనల్లుఁడును. అల్లుఁడును నైనవాఁడు, తనసవతితమ్ముఁడు విజయాదిత్యుఁడు చాళుక్యులసాయముచే రాజ్య మవహరింపఁగాఁ దనమామసాయ మపేక్షించి తిరువయ్యారుకుఁ బోయెను. నాఁడు వేంగిరాజ్యమునకు వేఁగి (నేఁటిపెదవేగి-ఏలూరికడ) యు, బెజవాడయుఁ, జాళుక్యులకు మాన్యఖేటమును, జోళులకుఁ గాంచీపురమును, మాళవులకు నుజ్జయినియు రాజధానులు.

యుద్ధములు తీవ్రరూపమును దాల్చినవి. రాజేంద్రచోళుఁడు వేంగిమీఁదుగా గంగవఱకుఁ బోయి 'గంగైకొండచోళుఁ' డని బిరుదము ధరించి, మహాప్రయత్నముతో క్రీ.శ 1032 సం॥లో రాజరాజనరేంద్రునికి వేంగియందుఁ బట్టాభిషేకము చేసెను. చాళుక్యులు తనకాంచీనగరమును ఎక్కడ ధ్వంసము చేయుదురో యను భీతిచే రాజధానిని దూరముగా 'గంగైకొండచోళపుర' మని నూత్నముగా నిర్మించుకొన్న నగరమునకు మార్చుకొనెను. అదే ఈకావ్యమందలి 'గంగాకుండపట్టణము', 'గంగైకొండ' అనఁగా 'గంగను గొనిన=గ్రహించిన=పొందిన' అని యర్థము. దీనికి 'గంగాకుండ' సంస్కృతీకరణము.

మఱల యుద్ధములు; 103. సం॥ ప్రాంతమున రాజరాజనరేంద్రుఁడు మఱలఁ, దమ్ముఁడు విజయాదిత్యునికి ఓడి, చోళదేశమునఁ కేగుట, మఱలఁ జోళులు దీకొనుటలు జరిగినవి. కర్ణాటకసోమేశ్వరుఁడు తండ్రికన్నఁ బరాక్రమశాలి. తండ్రికి విశ్రాంతి యొసఁగి రాజ్యభారమును దాను వహించి రాజధానిని, మాన్యఖేటమునుండి కల్యాణమునకు మార్చి, దానిని గట్టుదిట్టము చేసెను. ఇది 1033 సం॥లో జరిగినది. 1042 సం॥లో 'రాజేంద్రచోళుఁడు' మరణించుటయు, 'రాజాధిరాజు' చక్రవర్తి యగుటయు 'జయసింహుఁడు' మరణించి 'ఆహవమల్లుఁడు' చక్రవర్తి యగుటయు సమకాలికసంభవములు కాఁగా మఱల యుద్ధములు ప్రారంభమైనవి. శత్రుభీతిచేత నిరువురును దమరాజధానులను గాపాడుకొను చుండిరి. అదే బిల్హణుఁ డనెను—



"ప్రతిక్షణం క్షోభితమన్యునా రణే
ప్రయుక్తరక్షస్య నృపేణ మానినా।
న యస్య కక్షాం శతమన్యురక్షితా
పురీ పురప్రాగ్రహరస్య గాహతే."॥ (2 = 11)

దీనికి నాంధ్రబిల్హణులయనువాదము :—

క. అలమునఁ బ్రతిక్షణమును
క్షోభితమన్యుఁ డగుతేఁడు కాచుపురికి
నేలీలన్ బోటీఁ దలిర్పఁగఁ
జాలద శతమన్యురక్ష సౌ రగుపురమున్. (2 = 12)

వేంగీవిషయ మిట నరయఁ దగును. 1031 సం॥లో విజయాదిత్యుఁడు రాజరాజనరేంద్రునిఁ దఱిమి పట్టాభిషేకము చేసికొనెనుగదా. 1035సం॥లో మఱలఁ జోళులు వేంగినిఁ బట్టుకొనిరి. మఱల 1039 సం॥లోఁ జాళుక్యులు వారినిఁ దఱిమిరి. రాజరాజనరేంద్రుఁడు చోళదేశమునకుఁ బోయెను. మఱల 1042 సం॥ నాటఁకి వేంగికి వచ్చుటకుఁ బ్రయత్నించెను. 1044 సం॥ నాఁటికే గొప్పయుద్ధములు జరిగి వానిలో విక్రమాంకుఁడును, విష్ణువర్ధనవిజయాదిత్యుఁడును, తమ్ముఁడు జయసింహుఁడును బాల్గొన్న ట్లున్నది.

తండ్రిపట్టాభిషేకమునాఁటికే విక్రమాంకుఁడు సేనాపతి కాఁ దగినంతటి వయసువాఁడు. వానితమ్ముఁడు జయసింహుఁడుగూడ అట్టివాఁడే. నాఁటికే కల్యాణకటకము నిర్మింపఁ బడినది. కాఁబట్టి 'క్రమాదసౌ' అన్నబిల్హణవాక్యము నిలువదు.

(5) చిరకాలము పుత్రులు కలుగక సోమేశ్వరునికిఁ దపస్సుచేఁ బరమేశ్వరానుగ్రహమున ముప్పురు పుత్రులు పుట్టి రనియు, వారిలో నడిమివాఁడు గొప్పవాఁ డగు నని యీశ్వరానుగ్రహ మనియుఁ, బెద్దవానికి నదృష్టము లే దనియు బిల్హణుఁడు వ్రాసినవ్రాఁతలకును శాసనములలోనివిషయములకును సరివచ్చుట లేదు. ఆహవమల్లునికి రాజ్యమునకు వచ్చునాఁటికే నలువదియేండ్లకు మించిన వయసుగా నుండ,నాఁటికే యుద్ధవీరు లైనరెండవ-మూఁడవకుమారు లుండ, వీరు ఆహవమల్లునిరాజ్యాధిరోహణానంతరము చిరకాలము పుట్టక తర్వాత పుట్టి రనుట అసత్యము.

"విజిత్య సర్వాః కుకుభః స భార్గవ
ప్రచణ్డకోదణ్డపరిశ్రమో నృపః।
ఉవాచ తత్రార్థిశతాని పూరయ_
ఫలం హి పాత్రప్రతిపాదనం శ్రియః॥ (2 = 26)

దీనికి నాంధ్రబిల్హణులయనువాదము :—

ఉ. అప్రతిమానచాపవిభవా_యతభార్గవుఁ బోలుపార్థివుం
డప్రతివీరుఁ డై దిశల నాజి జయించి పురిన్ వసించి య
ర్థిప్రకరార్థకోటిఁ గడుఁ బ్రీతినిఁ బూరణ సేసెఁగాదె; పా
త్రప్రతిపాదనంబు ధర ధన్యతఁ గూర్చు నపారలక్ష్మికిన్.
(2 = 23)

"జగత్యనర్ఘేషు సమస్తవస్తుషు
క్షితీశ్వరః పాదతలే స్థితేష్వపి।
అభూద్వినా పుత్రముఖేందుదర్శనం
ప్రభాతనీలోత్పలదీనలోచనః."॥ (2 = 27)

దీనికి నాంధ్రబిల్హణులయనువాదము :—

చ. ధరణి ననర్ఘవస్తుసముదాయములెల్లఁ దమంత వచ్చి యా
ధరణిపుపాదమూలమునఁ దద్వశతాస్థితి నొప్పు చుండినన్
వరసుతుమోముచందురుప్రభన్ గన లేనివిభుండు దోఁచె నాఁ
డరయఁ బ్రభాతనీలకుముదాయితదీనవిలోచనుండుగాన్.
(2 = 24)

ఇదంతయు బిల్హణునికవిత్వము. ఆహవమల్లునికి దాదా పిరువదియైదేండ్ల ప్రాయముననే పుత్రులు ఒకరివెంట నొకరు ఎక్కువ వయోవ్యత్యాసము లేకయే పుట్టిన ట్లున్నారు.



పుత్త్రులు కలుగుటకు మునుపే ఆహవమల్లుఁడు మహోశేత యై చక్రవర్తిగాఁ బాలించు చుండె నని బిల్హణుఁడు, కావ్యార్థమునకు, దైవనిర్ణయమునకుఁ బ్రాశస్త్య మిచ్చుటకుఁ, గల్పించినాఁడు. యువరాజుగా నాహవమల్లుఁడు చేసినయుద్ధములు కలవుకాని మాళవ—దాహళ—చోళాదివిజయము లన్నియు, రాజై, తన పట్టాభిషేకమునాఁటికే పెద్ద పెరిగి చేతికి నందినకుమారులతోఁ గలిసి ఆర్జించినవే యని చరిత్ర తెలుపు చున్నది.

(6) ఆహవమల్లుఁడు తనరెండవకుమారునిఁగాని మూఁడవవానిఁగాని నియోగింపక, పెద్దకుమారునే రెండవసోమేశ్వరుని, ఆదినుండియు యుద్ధములకుఁ బంపక, రాజధానీరక్షణార్థము నియోగించు చుండెను. పైనఁ జూచిన 'ప్రతిక్షణం' అనుశ్లోకమువలన రాజధానీ రక్షణావశ్యకత యింతంత గా దని తెలియు చున్నది. పైఁగా, యువరా జనునది యీకాలమున నొకపదవిగామ నందులకు రాజకుమారుఁడే కాక తదితరులుగూడ నియుక్తు లగుచుండి రనియుఁ దెలియు చున్నది. క్రీ. శ. 1044 సం॥ లో 'శోభనరసు' అనునతఁడు 'వేంగీపురవరేశ్వరుఁ' డను బిరుదము ధరించి యున్నాఁడు, రెండవసోమేశ్వరుఁడు అటుతర్వాత 1049 సం॥లో నీబిరుదేకాక 'భువనైకమల్లుఁ' డనుబిరుదునుగూడ ధరించుటచేఁ, దండ్రిచేతఁ దర్వాతిరాజుగా నుద్దిష్టుఁ డని తెలియు చున్నది. విక్రమాదిత్యుఁడు 'త్రిభువనమల్ల' బిరుదమును పట్టాభిషేకకాలమున ధరించినాఁడు.

రాజధానీనగరరక్షణము ఈకాలమునఁ జాల ముఖ్యము. లెక్క లేనిసేనాపతులతోఁ గలిసి పోరాడుట అంత గొప్ప కాదు, చోళరాజులు రాజధానిని దూరముగా మార్చుకొనుటయే యిందులకు దార్కాణ. ఇంచుమించుగా క్రీ. శ. 1044 1045 సం॥ ప్రాంతములకు భోజరాజుకూడఁ దనరాజధానిని ఉజ్జయినినుండి నూతనముగా నిర్మించిన 'ధారా'నగరమునకు మార్చుకొనెను. అట్లు దూరము పోయియు క్రీ. శ. 1049 సం॥ ప్రాంతమునఁ జోళులు కల్యాణకటకమును దగులఁ బెట్టిరి. అందులకు బదులు చాళుక్యులు కాంచీనగరము, ఉజ్జయిని, ఉదయపురము, ధారానగరము, మున్నగువానిని దగులఁ బెట్టిరి. కల్యాణకటకరక్షణము కన్న వేంగీపురమునకుఁ జోళులను రానీయక యుండుటయే చాల ముఖ్యముగాఁ గనఁ బడు చున్నది. అచట నతిసమర్థులు ఉండ వలసి యుండెను. 1044సం॥లో 'శోభనరసు' అట్టివాఁడు, 1049 సం॥లో రెండవసోమేశ్వరుఁడు నట్టివాఁడే. ఎవరు జయించినను నాయాప్రదేశములు శత్రుగతములు గా నీకుండ గాపాడుకొనుట

గొప్పవని. అట్టిసమర్థుఁడుగావుననే రెండవసోముని దండ్రి యెచ్చటను యుద్ధములకు రానీయక రాజధానీరక్షణార్థమే నియోగించు చుండె ననుట విదితము.

(7) తృతీయసర్గలో వర్ణింపఁ బడినవిక్రమాదిత్యునివిజయము లన్నియు నాతఁ డొక్కఁడే సాధించినవి గావు. తండ్రితోను, మంత్రి—సేనాపతి-సామంతాదులతోను మహాసైన్యము కదలి దిగ్విజయయాత్ర చేయఁగా వారితో విక్రమాదిత్యుఁడును బరాక్రమింప, శక్తిమంతుఁ డైనరాజకుమారుఁడుగానఁ జోళరాజులు ఇతని నామధేయమును బలుమార్లు పేర్కొని యుండిరేకాని యావిజయములు అతఁ డొక్కఁడే సాధించినవి కావు. ఈకాలమున వేంగియే ప్రధానఫల మని తెలిసినది గదా ! మిగిలిన వన్నియు దాని ననుసరించినవి. రాజాధిరాజు, అతనితమ్ముఁడు రెండవరాజేంద్రుఁడు, అతనితమ్ముఁడు వీరరాజేంద్రుఁడును, వారిసామంత—మాండలిక-సేనాధిపతులును, రాజరాజనరేంద్రునికి వేంగిని సాధించుటకుఁ జేసిన మహాప్రయత్నము లేవియు 1049 సం॥ వఱకు నేమాత్రమును ఫలించినట్లు కానరాదు. కాని, చోళులకు సాయముగా భోజుఁడును డాహళాధిపుఁడు కర్ణుఁడును, అటు పడమటఁ గొంకణప్రాంతమువారును. ఇటు తూర్పునఁ జక్రకూటమువారును గల్యాణీచాళుక్యులకు నిరంతరము బాధ కలిగించు చుండిరి. సోమేశ్వరుఁడు ఒక వైపు వీరి నందరిని శిక్షించుచు వేంగికి రాజరాజనరేంద్రుని రా నీయక యడ్డు చుండెను. మొదటఁ గావేరీ—తుంగభద్రాతీరములకుఁ బరిమిత మై యుండినయుద్ధరంగము అఖిలభారతవ్యాప్త మై, రాజు లందఱును, చోళమిత్రులును చాళుక్యమిత్రులునుగా, రెండుకక్షలైరి.

ఇప్పటఁ గాకతీయులయభివృద్ధి గమనింపఁ దగినది. ఆహవమల్లసోమేశ్వరుఁడు తూర్పున వేంగినుండికాని, చక్రకూటమునుండికాని, ప్రాగుదక్కోణమునుండికాని, ఉత్తరమునుండికాని శత్రువులు ఎత్తి రాకుండఁ గాకతీయులను ఆదరించి వారికి అనుమకొండరాజ్యమును నిర్మించుకొనుట కవకాశ మిచ్చెను. కొంకణ-మాళవభూపతులు బలగర్వితు లైనందున వారిని శిక్షింప నాహవమల్లుఁడు గొప్పసన్నాహములో బయలుదేరెను (1049). కొంకణమునఁ గొంతసైన్యము నుంచి తాను భోజునిమీఁదికిఁ బోయెను. నూటముప్పదిమందిరాజులు కలిసి భోజుని ఎదిరించి రని 'మేరుతుంగాచార్యుఁడు' 'ప్రబంధచింతామణి'లో వ్రాసియున్నాఁడు. నూటముప్పదిమంది పూర్తిగా లెక్కకు రాకపోయినను నాహవమల్లుఁడును, నాతని



సామంతులును, హొయసల-కదంబ-పల్లవ-కాకతీయాదులును, పశ్చిమమున గూర్జర-భీమాదులును బాలమంది కలిసి విద్యాధికుఁడు కవిపండితపోషకుఁడు నైనభోజు నెదిర్చినట్లు తెలియు చున్నది. భోజుఁడు కల్యాణీచాళుక్యులకు నింతటి వైరి యైనందులకుఁ గారణము పూర్వపు 'ముంజ—తైలప' వైరమే. నాఁడు ముంజమహీపతియొక్క రత్నాలకిరీటమును జయించినచాళుక్యులు దానిని తమజయభేరికిఁ గట్టి తమయుద్ధప్రయాణములలో నాడంబరముగాఁ బ్రదర్శించు చుండిరి. దాని నెట్లైనను మరలఁ బట్టుకొనుటకు భోజుడు పంపినరాజపుత్రులు ప్రయత్నించు చుండిరి. ఇట్టియుద్ధములలో నాహవమల్లుని సేనలు భోజునినగరములను దగులఁబెట్టినవి, భోజుఁడు ఎనుబదియేండ్లు దాఁటినవృద్ధుఁడు. అందఱితోను పోరాడు చుండి నడుమ నతిసారభేదులతో మరణించెను. చాళుక్యులు మాళవమును బట్టుకొని భోజునివంశస్థుని తమ్మాశ్రయించినవానిని మాళవమందుఁ బ్రతిష్ఠించిరి.

కాని, ఈపని యింతసులువుగా నెఱవేఱలేదు. చాళుక్యులు భోజుని ముట్టడించి యుండఁగాఁ జోళులు కల్యాణకటకమును దగులఁబెట్టిరిగదా ! ఈవార్త విని కొంకణమండలిచాళుక్యసేనాధిపతి బయలువెడలి వచ్చి కాంచీనగరమును దగులఁబెట్టెను. ఆహవమల్లుఁడును వెనుదిరిగెను, చోళరాజులు కల్యాణమునుండి చక్కని శిల్పఖండములను హరించుకొని పోయిరి.

ఈసమయమున జరిగినయొకయాశ్చర్యకరమైనసంఘటనము ఏ దనఁగాఁ, చోళరాజులదౌహిత్రుఁడు, రాజేంద్రచోళునియల్లుఁడు రాజరాజనరేంద్రుఁడు లెక్కలేనన్నిపర్యాయములు పదభ్రష్టుఁ డై, ఇఁక మార్గాంతరముఁ గానక 'నన్నయ'నీతిప్రయోగమువలనఁ జాళుక్యులమైత్రిని సంపాదించి మరల వేంగిని నొందెను. నన్నయ్యకు, వాఁడస-నారాయణభట్టు, కర్ణాటకమహామంత్రియొక్క బంధువు సహాధ్యాయి. అతనిని వేంగికి రాయబారిగాను బందితుఁడుగాను దెచ్చుకొని, కర్ణాటకుల పక్షము చేరి, చోళులను వదలి, తనతొంటిస్వాతంత్ర్యమును వదలక రాజరాజనరేంద్రుఁడు నన్నయసాయముచే వేంగిని మరల నొందెను. ఇదియు ఈ 1049—50 సంవత్సరములకాలమున జరిగినది. ఇదిమొదలు పదేండ్లు నిశ్చింతగా రాజనరేంద్రుఁడు 1061 సం॥ వఱకు, శత్రుబాధ లేక రాజ్య మేలెను. ఈ పదేండ్లలోనే ఆంధ్రమహాభారతరచనయు జరిగినది. ఎవనికొఱకుఁ దాము తరతరములుగాఁ బోరాడు చుండిరో యావిజయాదిత్యునికిఁ జాళుక్యులు తమకడనే

పదవుల నిచ్చిరి. చోళులతోడియుద్ధములు ముగియనందువలనను, వారు పగ సాధించు ప్రయత్నములతో నుండినందువలనను విజయాదిత్యుఁడు కర్ణాటకులకడనే యుండి యుద్ధములలోఁ బాల్గొను చుండెను. సోమేశ్వరుఁడు కల్యాణకటకమును, రాజేంద్ర చోళుఁడు గంగైకొండచోళపురమును, భోజుఁడు ధారానగరమును నిర్మించు కొన్నట్లు రాజరాజనరేంద్రుఁడును రాజమహేంద్రపురమును గోదావరికిఁ దూర్పున శత్రువులకు దూరముగా నిర్మించుకొని అచ్చటనే యాంధ్రమహాభారతరచన చేయించెను.

ఎక్కడి మాళవము, ఎక్కడి డాహళము, ఎక్కడి కాంచీ-కల్యాణ-వేంగీపురములు. ఇవన్నియు నాఁడు ఈరాజులరణరంగము లై యుండఁ దండ్రిచెంత నుండి యితరులతోఁ గలిసి పోరాడినవాఁడేకాని విక్రమాంకుఁడు తా నొక్కఁడే యా స్థలములలోఁ దనపరాక్రమమును జూపినవాఁడు కాఁడు. చోళశాసనములలో 'విక్కి, విశయాదిత్త, శింగణ' అని విక్రమాంకుని, విష్ణువర్ధనవిజయాదిత్యుని, జయసింహునిఁ గలిపియే పేర్కొను చుండిరి చోళులు. విక్రమాంకుఁడు శరణాగతుఁ డైన మాళవపతిని రాజ్యమందుఁ బునఃప్రతిష్ఠితునిఁ జేయుటయు నీకాలము నాఁటిదే.

చోళరాజులకు యుద్ధపరాజయములకన్నఁ దమయల్లుఁడు శత్రువులతో సంధి గావించుకొనుటయే పెద్ద దెబ్బగా నుండినది. ఈయవమానమును దాళఁ జాలక గొప్పసన్నాహముతోఁ జోళులు బయలుదేరి, కృష్ణ కుపనది యైన 'హిరెహళ్ళ' నదీతీరమున 'కొప్పం'అనుచోట (నేటికొప్పల్) క్రీ. శ. 1054 సం॥లో ఘోర యుద్ధ మొనర్చిరి. అందుఁ జోళరాజాధిరాజు ఏనుఁగుమీఁదనే చంపఁ బడెను. అతనితమ్ముఁడు రెండవరాజేంద్రుఁడు రణరంగమందే పట్టాభిషేకము చేసికొని యింటిదారి పట్టెను. తర్వాతఁ గొంతకాలము చోళులు చేయునది లేక ఊర కుండ వలసినవా రైరి. క్రీ. శ. 1059 సం॥ ప్రాంతమున మరలఁ దలయెత్త సాగిరి. ఈకాలమునఁ జాళుక్యవిక్రమాంకుఁడు గంగపాడినిఁ (నేటిమైసూరుతోఁ గలిసిన కోలారు రాజ్యమును) బాలించు చుండెను. చాళుక్యులకు నుత్తర-పశ్చిమ-ప్రాగ్దిశల నుండి శత్రుభయము లే కుండెను. ఇట్టితరుణమునఁ జోళరాజు రెండవరాజేంద్రుఁడును, వానికుమారుఁడు రాజమహేంద్రుఁడును గంగపాడిమీఁద దాడి సలిపిరి. తర్వాతఁ జోళరా జైన వీరరాజేంద్రుఁడును ఈయుద్ధములలోఁ బాల్గొనెను. విక్రమాంకుఁడు తుంగభద్రాతీరమునకుఁ బారిపోయెను.



ఇందులకుఁ గారణము గొప్పదే. వేంగియందు రాజరాజనరేంద్రునికి నవ సానదశ. 1059 సం॥ నాఁటికి నన్నయ్య గతించినాఁడు. 1061 సం॥లో రాజనరేంద్రుఁడును పోయినాఁడు. విష్ణువర్ధనవిజయాదిత్యునికి వేంగిమీఁదనే కన్ను. రాజనరేంద్రునికుమారుఁడు రాజేంద్రుఁడు (బిల్హణుఁడు పేర్కొన్నరాజిగుఁడు, తర్వాతఁ జోళ-వేంగీమండలములకు రెంటికిని అధిపతి యైనకులోత్తుంగచోళుఁడు) తనమేనమామలకడఁ జోళరాజ్యమందే యెదుగు చుండెను. విజయాదిత్యుఁడు అదను చూచి వేంగిని ఆక్రమించి తనకుమారునికి రెండవశక్తివర్మకు వేంగిని బట్టము కట్టెను. విక్రమాంకునికి నెంతటిశక్తి యుండినను విజయాదిత్యుఁడు కుడిభుజము. అతనిసాయము లేకపోయినందునఁ గాఁబోలుఁ జోళులు గంగపాడిని ఈకాలమున నపహరించిరి. మైసూరురాజ్యము విక్రమాంకునిబలహీనతచేతఁ జాళుక్యులు పోఁ గొట్టుకొనిరి.

కాని వేంగికిమాత్రము ఎట్టిభయమును లేదు. రెండవశక్తివర్మయుఁ జాళుక్యసైన్యములును గాపాడుచుండుటచేఁ జోళులు అంతదూరము పో లే కుండిరి. అందువలనను, జోళులను బై కి రా నీయక యుండుటకును, విజయాదిత్యుఁడు గంగపాడి-నొళంబపాడిప్రాంతములకు వచ్చి చాళుక్యసైన్యములను నడప నారంభించెను. మొదటిపర్యాయము విజయాదిత్యునిసాయము లేక పోవుటచే, విక్రమాంకుఁడు పరాజితుఁ డగుటయు, మరల విజయాదిత్యుఁడు వచ్చుటయుఁ జింతింపఁ దగినవిషయములు. అన్నకన్నను బరాక్రమశాలియే యైనను విక్రమాంకుఁడు, బిల్హణుఁడు వర్ణించినంతటిపరాక్రమశాలిమాత్రము కాఁ డని తోఁచు చున్నది.

యుద్ధములు మరలఁ దీవ్రరూపమును ధరింప సాగినవి. రాజేంద్రచోళునికుమారుఁడు రాజమహేంద్రుఁడు ఈసందర్భమున నెప్పుడో రణమరణము నందిన ట్లున్నాఁడు. వీరరాజేంద్రుఁడు వేంగిమీఁదికి విజృంభించెను. వేంగి స్వాధీనము కా లేదుకాని విజయాదిత్యునికుమారుఁడు రెండవశక్తివర్మ, బెజవాడకడ జరిగినయుద్ధమున నభిమన్యునివలెఁ బోరాడి మరణించెను. క్రీ. శ. 1062-1063 సం॥ ప్రాంత మై యుండును. వీరరాజేంద్రుఁడు ఇంకను మీఁదికి రాక వెనుదిరుగ వలసినపరిస్థితి, అతనియన్న రాజేంద్రచోళునిమరణముచేతఁ గలిగినది. సందర్భములు విషమపరిణామము నందు చుండినవి. వేంగికిని జోళ

రాజ్యమునకును మార్గము కడప-కర్నూలు-లేక బళ్ళారిప్రాంతములనుండియేకాని నేఁటి మదరాసు-బెజవాడ మార్గము బొత్తిగా లేదు. కాఁబట్టి విజయాదిత్యుఁడు తన కుమారుఁడు గతించినను వేంగికి రాక, గంగపాడి-నొళంబంపాడి మార్గములయందే యుండెను. కృష్ణా-తుంగభద్రాతీరములే శత్రుమార్గములు.

రాజధానికి వడివడిగా వచ్చినవీరరాజేంద్రుఁడు పట్టాభిషేకము చేసికొని, వెంటనే వేంగిమీఁదికి బయలుదేరెను; పరాక్రమశాలి గొప్పసన్నాహముతో 'కూడలసంగమ' మనుప్రదేశమునఁ జాళుక్యులతో ఘోరయుద్ధ మొనరించెను. విక్రమాంకుఁడును, వానితమ్ముఁడు జయసింహుఁడును రణభీరువు లై పారిపోయి రని చోళశాసనములు చెప్పు చున్నవి. ఇ దంతయు 1064 సం॥లో జరిగిన ట్లున్నది. వేంగియేమో స్వాధీనము కాలేదు. విజయాదిత్యునిశాసనములు వేంగియందు క్రీ.శ. 1063, 1064, 1065 సం॥ ములలోఁ గలవు. చోళులకు మఱలఁ దమయూరికిఁ బోవలసి వచ్చినది.

ఇందులకుఁ గారణము చాళుక్యులనీతిప్రయోగమే. 1064 సం॥లోఁ జోళులను దండించుటకును, వారు గృహోన్ముఖు లగుటకును నుపాయముగా నాహవమల్లుఁడు విజయాదిత్యుని దక్షిణదేశయాత్రకుఁ బంపెను. కూడలసంగమమందు విజయాదిత్యుఁడు కాన రాఁడు. ఈప్రయోగముచేతఁ జోళులు వెనుదిరుగఁగానే వారిని మార్గములో 'పొత్తపి'రాజును, ధారానగరజననాథునితమ్ముఁడును ఎదిరించిరి. చాళుక్యమిత్రు లైనపాండ్యులును జోళులమీఁదికి ఎత్తివచ్చిరి. ఈసందర్భమునఁ జోళులను ఆహవమల్లుఁడు ఎక్కడనో పేరు చెప్పనినదీతీరమున నోడించెను.

విజయాదిత్యునికృషిచేత 1067 సం॥ వఱకుఁ జోళు లూరకుండి మఱల ఎత్తివచ్చిరి. విజయాదిత్యుఁడు బలవంతుఁడేకాక చాళుక్యసోమేశ్వరునికిఁ దాను 'కుమారుఁడ' నని (అభిమానముచేత) చెప్పికొని యున్నాఁడు. ఇచ్చట మఱల నూతనపరిణామములు కలిగినవి. ఆహవమల్లునికిఁ జరమకాలము సమీపించు చుండినది. వీరరాజేంద్రుఁడు తన 'మణిమంగళ' శాసనమునఁ జాళుక్యచక్రవర్తి, తానును, దనకుమారులును నోడిపోయినయవమానమును బోఁ గొట్టుకొనఁ గోరి తన్నుయుద్ధమునకు ఆకూడలసంగమప్రదేశమునకే, 'గంగాకేతఁ'డనుదూతముఖమునఁ బిలిచె ననియుఁ, దాను బోయి నెలదినము లుండినను నాహవమల్లుఁడు రా లే దనియు-నింకను వివరములు వ్రాసి-చాళుక్యవీరులు పారిపోఁగాఁ దాను జయించినట్లు



చెప్పికొని యున్నాఁడు. ఇది యెంతవఱకు నిజమోకాని దీనినిగుఱించి చాళుక్య శాసనములుగాని, విక్రమాంకదేవచరితముగాని యేమియుఁ జెప్పవు.

(8) నాల్గవ సర్గములో ఆహవమల్లునియవసానకాలము, విక్రమాదిత్యుని యనంతరదిగ్విజయములును, నాతఁడు తండ్రిమరణానంతరము మఱలఁ గల్యాణకటకమునకు వచ్చి కొన్నా ళ్ళుండి యన్నదుష్ప్రవర్తనను సహింప లేక బయలుదేరుటయు వర్ణింపఁ బడినవి. వీనిసత్యాసత్యముల నరయ వలయును.

విజయాదిత్యుఁడు దక్షిణమునకుఁ బోయి వచ్చి వేంగియందు ఎదురు లేని ప్రభువుగా నున్నాడు. 1067 సం॥లో నాహవమల్లుఁడు కొల్లిపాకప్రాంతమున నున్నాఁడు. ఇతఁ డేల వీరరాజేంద్రుని మఱల యుద్ధమునకుఁ బిలిచెనో, పిలిచియు నేల రాలేదో, ఇ దెంతవఱకు నిజమో కాని. యీకాలపుసంభవములు చాల వడివడిగా జరిగి పోయినవి. ఆశ్చర్యకరము లైనమార్పులుకూడ వచ్చినవి. ఆహవమల్లుఁడు పిలిచియు రానందునఁ గాంచై (కందనవోలు = కర్నూలు) అనుచోట నెలదినము లుండి, రట్టపాడిని (కన్నడరాజ్యమును) జయించి, తుంగభద్రాతీరమున జయస్తంభము నాఁటి, 'వేంగిని జయింపక వెను దిరుగను' అని ప్రతిజ్ఞ చేసి, కృష్ణను దాఁటి, బెజవాడసమీపమునఁ జాళుక్యులసైన్యములను ఓడించి, యటనుండి గోదావరిని దాఁటి కళింగ-చక్రకూటములకుఁ బోయిఁ వేంగినిఁ బూర్తిగా (నలువైపుల) జయించి, తనకుఁ బాదాక్రాంతుఁ డైనవిజయాదిత్యునికి వేంగిని ఇచ్చి, గంగాకుండపట్టణమునకుఁ దాను బోయినట్లు వీరరాజేంద్రుఁడు చెప్పికొని యున్నాఁడు. చక్రకూటము ఈకాలమునకుఁ జాలప్రాముఖ్యము నంది యుండినది. ఈకాలముననే రాజరాజనరేంద్రునికుమారుఁడు, రాజిగుఁడు, వీరరాజేంద్రునితోఁ జక్రకూటప్రభువు ధారావర్షుని జయించి, వానికడనుండి ఏనుఁగులను గప్పముగా గ్రహించి, చాళుక్యసైన్యములను, విక్రమాదిత్యుని నెదుర్కొని యుద్ధ మొనరించినట్లు తెలియు చున్నది.

ఇ వన్నియు నేకకాలమందు జరిగినవి కావు. 1067 సం॥ సెప్టెంబరులో వీరరాజేంద్రుఁడు రెండవమాఱు తుంగభద్రాతీరమునకు రాఁగా నాహవమల్లుఁడు కొల్లిపాకకడ నుండెనుగదా! అటువెనుక, తీరనివ్యాధి పట్టుకొనఁగా నాహమల్లుఁడు 1068 సం॥ మార్చి 29వ తారీఖునఁ దుంగభద్రలో మునిఁగి మంత్రపూర్వకముగా శివైక్యము నందెను. ఈకాలమున వీరరాజేంద్రుఁ డింకను వేంగీప్రాంతమున

నుండెను. గాఁబోలు. విజయాదిత్యుఁడు చాళుక్యులబలము తగ్గిన దని తలంచెనో, లేక రాజనీతిప్రయోగమో తెలియదు. వీరరాజేంద్రునితోఁ జెలిమి చేసికొని వేంగినిఁ గాపాడుకొనెను. రాజిగుఁడు ఎచ్చటనుండెనో తెలియదు. ఆహవమల్లుఁడు ఇంకను జీవించి యుండఁగానే విక్రమాంకుఁడును వానితమ్ముఁడును దక్షిణ దిగ్విజయమునకు బయలుదేరి అంతయుఁ బూర్తి గావించుకొని మరలి తుంగభద్రాతీరమునకు వచ్చినపుడు తండ్రిమరణవార్త వినిరఁట. దీనింబట్టి చూడ ఆహవమల్లుఁడు తాను ఒకపాటిఆరోగ్యమున నుండినప్పుడే, చక్రకూటమున రాజిగునితో యుద్ధ మొనరించినవిక్రమాంకుని, ఈపర్యాయము దక్షిణదిగ్విజయమునకుఁ బంపిన ట్లున్నాఁడు. వెంటనే రాజిగునిఁ జక్రకూటముననే వదలి వీరరాజేంద్రుఁడు వేంగికి వచ్చి, విజయాదిత్యునితో, ఆత్మగౌరవభంగము గాకుండ, సంధి చేసికొని మరలినాఁడు. ఇంతలో నాహవమల్లునిమరణము, భువనైకమల్లునిపట్టాభిషేకము, విక్రమాంకుఁడు వెను దిరిగి తుంగభద్రాతీరమునఁ దండ్రిమరణవార్తను వినుటయు జరిగి యుండును. విజయాదిత్య-విక్రమాదిత్యులు కలిసియే యుండువారు. 1063 సంIIలో గంగపాడి (మైసూరు) చోళులవశ మైనది మొదలు కలసి యుండుట కవకాశములు లేక పోయినవి. కావుననే గంగపాడి పరాజయానంతరము విక్రముఁడును జయసింహుఁడును జట్టు వీడక యుండిరి.

విజయాదిత్యుఁడు యుద్ధవీరుఁడేకాక. రాజనీతికుశలుఁడు. చోళులు పూర్తిగా జయించినయెడల వేంగి రాజిగునిదే యగును. కాని వారికి జయించి నిలుపుకొనుశక్తి యుండెనో లేదో! రాజిగుఁ డింకను చిన్నవాఁడు. పైఁగా రెండవశక్తివర్మమరణానంతరము విజయాదిత్యునికి రాజిగుఁడే వారసు. తానును బెద్దవాఁ డైనాఁడు. ఆహవమల్లుఁడును వృద్ధుఁడు. ఎందులకైన మంచి దని, మునుపు రాజనరేంద్రుఁడు తటాలున శత్రువులను మిత్రులనుగా మార్చుకొన్నట్లు, తానును ఇపుడు అపనియే చేసినాఁడు. రాజిగుఁడును, దర్వాతఁ బినతండ్రితో సంధి చేసికొని వేంగియందు జీవితాంతము పరిపాలింపనిచ్చినట్లు శాసనములే కలవు. కాఁబట్టి ఇదంతయు విజయాదిత్య - రాజిగ - వీరరాజేంద్రు లొప్పియే చేసికొన్నఏర్పాటుగా నుండును.

విక్రమాంకుఁడు దక్షిణదిగ్విజయము ముగించుకొని వచ్చునప్పటికి ఇన్ని మార్పులు - తండ్రిమరణము, అన్న రాజ్యమునకు వచ్చుట, చోళులయాధి



క్యము, అంతటిప్రాఁతమిత్రుఁడు వేంగీమండలేశ్వరుఁడు విజయాదిత్యుఁడు చోళమిత్రుఁ డగుట. ఇప్పుడు తా నేమి చేయఁ దగు ననునది పెద్దసమస్యగా నుండి యుండును. గత్యంతరము లేనందునఁ గల్యాణకటకమునకే పోయెను. అన్న రెండవసోమేశ్వరుఁడు ఎదురు వచ్చి తోడ్కొని పోయి ఆదరించెను.

(9) భువనైకమల్లునిరాజ్యాధిరోహణము క్రీ. శ. 1068 ఏప్రిలు 11వ తారీఖునఁ, దండ్రి గతించినపదునైదవదినమున, జరిగినది. తత్క్షణమే క్రొత్తరాజు నున్మూలించుట సుకర మని వీరరాజేంద్రుఁడు దండెత్తి వచ్చెనుగాని గుత్తికరచాళుక్యులు ఎదుర్కొని తఱుమఁ గొట్టిరి. వెంటనే వీరరాజేంద్రుఁడు ఆ మార్గము వదలి కంపిలినిఁ దగులఁబెట్టి చక్రకూటమునకుఁ బోయి అచటఁ గా వుండిన చాళుక్యసైన్యమును దాఁకెను. అటనుండి కర్ణాటకులను జయింప లేక వెనుదిరిగెను. ఇట భువనైకమల్లుఁడు యుద్ధమునందును రాజ్యరక్షణమందును సమర్థుఁడుగానే కనఁ బడు చున్నాఁడు.

ఇటుతర్వాతనే విక్రమాంకుఁడు నగరమునకు వచ్చుటయు, నన్న నాదరించుటయు జరిగినవి. క్రీ. శ. 1068 సంII నాఁటికే విక్రమాంకుఁడు ఇంటిలో నన్నతో నున్నాఁడు. అప్పుడు తండ్రి మరణించినరెండవనెల. అటువెనకనే భువనైకమల్లుఁడు, తమ్మునితో సంప్రతించికాఁబోలుఁ జోళులు ఎత్తి రాకుండునట్లు నడిమిరాజ్యమును బంచి యిచ్చినాఁడు, తనప్రధానసహాయకునికి లక్ష్మణదండనాథునికి 'బనవాసి'రాజ్యమును, నొళంబపాడి - సిందవాడి' రాజ్యములను దమ్ముఁడు జయసింహునికిని. అలంపురమునుండి యుండుకర్ణాటకప్రాంతీయ రాజ్యము నంతటిని విక్రమాదిత్యునికిని నిచ్చి, చోళులు ఏమార్గమునుండియుఁ బ్రవేశించుటకు సందు లేకుండఁ జేసెనఁట. గుత్తికోటను బాగు చేయించి యచ్చట గొప్పబలగము నుంచెను. భువనైకమల్లసోమేశ్వరునిమొదటిశాసనమందే, రాజ్యమందు నందఱకన్నఁ దాను గొప్పవాఁ డనియుఁ దనకుఁ దర్వాత విక్రమాంకుఁ డనియు నాతనికిఁ దర్వాత జయసింహుఁ డనియుఁ దమకు మువ్వురకును దర్వాత లక్ష్మణదండనాథుఁ డనియు గొప్పగాఁ జెప్పుకొన్నాఁడు. ఈయేర్పాటు లన్నియు క్రీ శ. 1068 సంII జూనునెలకుఁ జేయఁ బడినవి.

విక్రమాంకుఁడు అటువెనుకఁ గొంతకాలమునకు. అసంవత్సరమే, తిరుగఁబడి చోళరాజుతో సంధి కుదుర్చుకొన్న ట్లున్నాఁడు. అన్నక్రింద దాను బాలకుఁడుగా

నుండినట్లు ఎక్కడను నితనిశాసనములు లేవు. తమ్ముఁడు జయసింహుఁడు 1070 సం॥ జూనువఱకుఁ బెద్దన్నకు సామంతుఁడు. చోళరాజు వీరరాజేంద్రుఁడు 1069 సం॥లోనే తాను విక్రమాంకునికి నతనియన్న రాజ్యమును జయించి యిచ్చినట్లు చెప్పికొని యున్నాఁడు. కాఁగా, మొదటికొన్నినెలలలోనే విక్రమాంకుఁడు చోళరాజుతోను, గొంకణజయకేశితోను గుట్ర చేసి యన్నకు నెదురు దిరిగెను. కాని తనరాజ్యమందుఁ దుంగభద్రాతీరమందే యతఁ డుండెను. క్రమముగా బలగము కూర్చుకొని, చాలమంది విక్రమాంకునిపక్షము చేరఁగా, అది చూచి జయసింహుఁడు కొన్నినెలలతర్వాత విక్రమాంకునితోఁ జేరెను బిల్హణుని వ్రాఁత - విక్రమాంక-జయసింహులు ఏకకాలమునఁ దిరుగఁబడి కల్యాణకటకమునుండి వెడలిపోయి రనుట అసత్యము. అందులకు నింకను బ్రబలకారణములు నాఁటి సంభవములే.

క్రీ శ. 1069 సం॥లోనే విక్రమాంక-వీరరాజేంద్రులకు సంధి కుదిరినది. తత్ఫలితముగాఁ జోళరాజు విక్రమాంకునికిఁ దనకుమార్తె నిచ్చి తుంగభద్రాతీరమందే పెండ్లి చేసి తనరాజ్యమునకుఁ బోయి యాకస్మికముగా మరణించెను. వెంటనే విక్రమాంకుఁడు చోళదేశమునకుఁ బోయి, యచటిశత్రువర్గమును జయించి తన బావమఱఁదిని అధిరాజేంద్రుని రాజ్యమందు స్థాపించి, నెలదినములు గంగైకొండచోళపురమున నుండి వెనుదిరిగెను. ఇంతలో వేంగిని రాజిగుఁడు, తనమేన మామ విక్రమాదిత్యునిపక్షము చేరినందువలనఁగాఁబోలుఁ, దటాలున వేంగినిఁ బినతండ్రి విజయాదిత్యునికడనుండి నాఁచికొని వేంగిప్రభువుగా 1070 సం॥ జూనునెలలోఁ బట్టాభిషేకము చేసికొనెను. విజయాదిత్యుఁడు కళింగములోఁ దలదాచుకొనెను. చోళదేశమందు విక్రమాంకునిచే జయింపఁ బడినవారు రాజిగునిమిత్రులు. రాజిగుఁడు ఎక్కువకాలము తమిళదేశ మందే యుండినవాఁడుగదా! ఒకనెలదినములు పరిపాలించెనో లేదో అధిరాజేంద్రునిఁ గడతేర్చి రాజిగుఁడు 1070లోనే చోళచక్రవర్తి యాయెను.

ఇచ్చట మఱియొక చిత్రము. ఈకాలపుసంభవములు గందరగోళముగా నున్నవి. తారీఖులచేత విడఁదీసి చిక్కు లేకుండ విషయమును అనుపూర్విగాఁ జెప్పుట కొంత దుష్కరము. కాని, కొన్నిప్రధానాంశములను గ్రహింప వచ్చును. విక్రమాంకుఁడు అన్నకు నెదురుదిరిగి తనమేనమామతోఁ జేరఁగానే రాజిగుఁడు, (బిల్హణుఁడు చెప్పినట్లు) రెండవసోమేశ్వరునితో సంధి కుదుర్చుకొని, కల్యాణీ



చాళుక్యులబలముతో వేంగిని గ్రహించినాఁడు. ఇంతలో మేనమామ గతించి యాతని కుమారుఁడు రాజు కాఁగా, బినతండ్రితో మఱల సంధి కుదుర్చుకొని, ఆయన జీవితాంతము వేంగియందుఁ బాలకుఁడుగా నుండునట్లు నిర్ణయించి తాను జోళసింహాసనమును బట్టుకొని 'ఉభయకులోత్తుంగుఁ' డనుబిరుదును ధరించి తండ్రిరాజ్యమునకును మామరాజ్యమునకును నధిపతి నని ప్రకటించుకొనెను.

ఇప్పుడు విక్రమాంకునిది విషమపరిస్థితి. తాను ఏకాకి యైనాఁడు. కాని, తుంగభద్రాతీరమును వదలక గంగవాడిని గుత్తిప్రాంతమును స్వాధీనము చేసికొనెను. జయసింహుఁడు 1070 సం॥ జూలైవఱకుఁ బెద్దన్నకు సామంతుఁడుగా నుండినవాఁడు. అటుతర్వాతఁ జిన్నన్నతోఁ జేరినాఁడు. 1071 సం॥ నాఁటికి విక్రమాంకుఁడు 'త్రిభువనమల్ల'బిరుదముతో నున్నాఁడు. ఈకాలమున విక్రమాంక - జయసింహులమీఁదికి భువనైకమల్లుఁడు సైన్యములను బంపి యుండును. రెండవ సోమేశ్వరునిరాజ్యకాలము క్రీ. శ. 1076 సం॥ వఱకును నడచినందువలన నాలేండ్లు విక్రమాంకుఁడు అన్నతోఁ బోరాడి యున్నాఁడు. కాని, ఈయాలేండ్ల కాలము ప్రయత్నములతో సరిపోయినది. మొదట 1071 సం॥ లో విక్రమాంకుని ప్రయత్నములు ఫలింప లేదు. రాజిగునిబలముచేత సోమేశ్వరుఁడు విక్రమాంకునిఁ దాత్కాలికముగా నాఁపఁ గలిగెను. కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపురములలోఁ గొంత, మైసూరులోఁ గొంతయు విక్రమాదిత్యునియధీనమున నుండినవి. వేంగీ - చోళసామ్రాజ్యములు రెండును రాజిగునియధీనములు.

1075లో విక్రమాంకునికి నవకాశము దొఱకినది. సింహళ - పాండ్యులను జోళులమీఁదికి ఎసకొల్పెను. చేదిరాజగు యశఃకర్ణుని వేంగిమీఁదికి 1072-73 సం॥ లో రెచ్చఁగొట్టి గోదావరికిఁ బైనుండి అన్నకు (విజయాదిత్యుఁడు) సాయము రానీయక అరికట్టెను. కళింగులతో మైత్రి నెరపెను. 1076 సం॥లో విజయాదిత్యుఁడు వేంగిలో మరణించెను. రాజిగుఁడు దానిని గాపాడుకొనుటకుఁ దనకుమారుల నచటికిఁ బంపియు దక్షిణమున సింహళ - పాండ్యులబాధను దప్పించుకొనుచు నుండియు రెండవసోమునికి సాయముగా సైన్యమును బంపెను. కాని, ప్రయోజనము లేకపోయినది. మొదటఁ జోళులతోనే విక్రమాంకునికి యుద్ధ మాయెను. చోళులసాయముతోఁ జాళుక్యులు గంగవాడిని స్వాధీనముఁ జేసికొన సాగిరి. బనవాసికూడ పోయినది. ఇట్లు చోళులతో యుద్ధ

మొనరించు చుండినవిక్రమాంకుని, నన్న భువనైకమల్లుఁడు పైనుండి వచ్చి తాఁకెను. తుంగభద్రాతీరమే రణరంగము. దీనిలో దురదృష్టముచేత సోమేశ్వరుఁడు విక్రమాంకునిచేతఁ జిక్కి బంది యాయెను. ఇఁకఁ జేయునది లేదు. రాజిగుఁడు వెనుదిరిగెను. కాని, గంగపాడి, నొళంబపాడి మున్నగురాజ్యములు చోళులకే దక్కినవి. క్రీ.శ. 1076 సం॥ ఫిబ్రవరినెల 11వతారీఖున విక్రమాంకుఁడు చాళుక్యచక్రవర్తిగాఁ బట్టాభిషేకము చేసికొనెను. అంతటిపరమధార్మికుఁడు అన్నకు ఎట్టిమర్యాద చేసెనో తెలియదు. తమ్ముని జయసింహుని యువరాజుఁ జేసెను.

విక్రమాంకుఁడు తాను రా జగుచునే తనపేరట నొకశకమును, 'చాళుక్య విక్రమ'శకమును స్థాపించెను.

(10) తర్వాతఁ గొన్నాళ్లకు విక్రముఁడు మరల నొకపర్యాయము చోళ రాజును జయించె నని బిల్హణుఁడు వ్రాసెను. కాని, యిది పెద్దవిజయము కాదు. వనవాసిని జయించి దానికి జయసింహుని నధిపతిఁ గావించినాఁడు. జయసింహుఁడు చాలవఱకుఁ జుట్టుపట్ల రాజ్యములను మరలఁ జోళులనుండి గ్రహించినట్లే యున్నాఁడు. వనవాసియేకాక గంగపాడికూడ స్వాధీన మైనది. వేంగిమీఁదికిఁ బోవఁ బ్రయత్నించెను. సాధ్యపడ లేదు. విక్రమాంకుఁడు పాండ్యసింహళీయులను గులోత్తుంగ చోళ రాజిగునిమీఁదికి రేపి వారిని అతఁడు దండించులోపల నీప్రయత్నములు చేసినట్లున్నాఁడు. ఇవన్నియు క్రీ.శ. 1080 సం॥కు ముందే జరిగినవి. ఇందులో మరలఁ జోళరాజిగుఁడు జయసింహునితోఁ గుట్ర సాగించినట్లు తెలియు చున్నది. జయసింహునిశాసనములు 1080 సం॥కుఁ దర్వాతఁ గాన రానందున, మొదటి నాలుగేండ్లలోనే యాతనితిరుగుబాటు జరిగి యుండ వలెను. అటుతర్వాత జయసింహునిమాట లేదు. అతనిని విక్రమాంకుఁడు మన్నించె నన్నది యెంతవఱకు నిజమో తెలియదు.

ఇది ౧౨వసర్గములో వర్ణితము. ఈనడుమ 'చందలదేవీ'స్వయంవరాదిక ములు వర్ణితములు. క్రీ.శ.1084సం॥లో విక్రమాదిత్యుఁడు తనతోఁ జోళులు యుద్ధమునకు రాక యున్నా రని యనుటచేత నీయుద్ధాదులు నాఁటితో నిలిచినట్లున్నవి. వేంగియుఁ జోళులచేతియందే యుండినది. కులోత్తుంగ రాజేంద్రచోళుఁడు జీవించి యుండినంతకాలము విక్రమాంకునికి వేంగియందుఁ బ్రవేశము దొరక లేదు.



(11) ఇఁకను మిగిలి యుండునది చోళరాజుతోడికడపటియుద్ధము. ఇది 17వసర్గములోఁ గలదు. విక్రమాంకుఁడు క్రీ.శ.1076 సం॥ ప్రారంభమునుండి 1126సం॥ చివరివఱకు ఏఁబదియేండ్లు పాలించినాడు. క్రీ.శ.1084సం॥కుఁ దర్వాతఁ బశ్చిమచాళుక్యులకు వేంగితో యుద్ధప్రసక్తి రాలేదు అంతవఱకు నుండినకులోత్తుంగునిరాజప్రతినిధులు బలహీనులు. 'చోడగంగఁ' డనుకుమారుఁడు 1084 సం॥లో వేంగికి రాజప్రతినిధి యగుటయు జయసింహునితిరుగుబాటు అణఁచ బడుటయు నైనతర్వాత నంతయు శాంతించినది. కులోత్తుంగునిచివరి దినములలో మరలఁ జాళుక్యసైన్యములు వేంగినిఁ దాఁక నారంభించినవి. కుమార తైలపుఁడు 1110–1113సం॥ నడుమ తాఁకెను. ఇందువలన నెక్కువప్రయోజనము లేదు. కాని, 1118సం॥లోఁ బశ్చిమచాళుక్యులు వేంగిని జయించి 1131సం॥ వఱకుఁ దమయధీనమం దుంచుకొనిరి. త్రికళింగములుకూడ వీరికి స్వాధీనము లైనవి. చోళరాజప్రతినిధి, రాజపుత్త్రుఁడు పరాంతకుఁడు నిలువ లేక పాఱిపోఁగాఁ జాళుక్యసైన్యములు కంచివఱకు వెంబడించి ఆక్రమించినవి. కంచిలోఁ గొన్నాళ్లుండి విక్రమాంకుఁడు మరలె నని బిల్హణుఁడు వ్రాసినది సత్యమే. నెల్లూరినిఁ జోళరాజులు కంచితోఁ గలిపి నెల్లూరిరాజ్యమును పాలించుటకుఁ బునాదులు ఈకాలమున వారు విక్రమాదిత్యునిసామంతులుగా నుండఁగా, నేర్పడినవే.

సంస్కృతవాఙ్మయమునందుఁ బ్రత్యేకముగాఁ జరిత్ర యనఁ దగినకావ్యము లేదు. చారిత్రికజ్ఞానము లేక కాదు. ఇతిహాస-పురాణములు, రాజవంశావళులు, పంచాంగగణనము, వివిధశకాబ్దములు, పౌర్వాపర్యజ్ఞానము, కృతయుగాది విభజనము ఇవన్నియు లేకపోలేదు. ఆధునికులదృష్టిలోనికాలమానవివరములు కానరావు. దేశము ఆసేతుహిమాచలము అతివిశాల మగుటచేత జనులజీవితములలో విశ్రాంతి లేక యెంతో కాలగర్భమున లీన మై పోయినందున మనకుఁ దెలియుట లేదు.

కాని, యనాదినుండియుఁ గావ్యగుణములు పెంపొంది అన్నివిషయములను హృదయాహ్లాదకరముగా వర్ణించుట యేర్పడి, నగరార్ణవశైలాదివిభజన మేర్పడి యొకరసపువక్కణ హృదయములలోఁ గుదురుకొన్నది ఎంతటిచరిత్ర నైనను నీవక్కణ యధఃకరించినది. చారిత్రికవిషయముల నితివృత్తములుగా గ్రహించినవారుగూడ నీతిబోధకొఱకు నాయకునిలోనిదోషములను బరిహరించియో,

యన్యథా కల్పించియో రచించుసంప్రదాయ మేర్పడినది. చరిత్ర యిట్టిరచనను సహింపదు. నాయికా - నాయకులదోషముల నెంతవిశదముగా వ్యక్తీకరించిన నంతమంచిది చరిత్రకు. అప్పటి మైనవాస్తవకథనము చరిత్రము. నాటకాఽదులలోఁ బ్రతినాయకునిఁ జాల దోషిగా వర్ణించుటగూడఁ జరిత్ర సహింపదు. కావ్యగుణములు బొత్తిగా లేకపోవుటయే చరిత్రలోనియుత్తమగుణము. కావున విక్రమాంక చరితాఽదులు చరిత్ర కాఁ జాలవు.

ఇట్లు విక్రమాంకదేవచరితమందలివిషయములకుఁ జారిత్రికవిషయములను బోల్చినయెడల వాస్తవము స్ఫురించు చున్నది. బిల్హణుఁడు ఇచ్చటఁ గావ్యోపసంహార మొనరించి పుత్రోదయాఽదికములను వర్ణించినాఁడు. కాని, నాఁటికే పెద్ద పెరిగినకుమారులైలప-సోమేశ్వరాఽదులు కనఁబడుచున్నారు. బిల్హణుఁడు రాజతరంగిణీకారునివంటివాఁడు కాఁడు చరిత్ర వ్రాయుట అతనియుద్దేశమున్ను గాదు. మనచారిత్రికకావ్యము లేవియుఁ జరిత్రలుగాఁ బనికి రావు. ప్రభువును స్తుతించుటయు, నందుఁ గావ్యగుణములను జొప్పించుటయుఁ, బ్రభువుయొక్క దోషములను బూర్తిగాఁ గప్పిపుచ్చి యతనిని ధర్మరాజుగా వర్ణించుటయే బిల్హణునియుద్దేశము. అతఁడు కావ్యమును వ్రాసి కృతకృత్యుఁ డైనాఁడు. ఈభావమే యాతనిచివరియాశ్వాసమందలి ఆత్మకథలోఁ గాన నగు చున్నది. చాళుక్యవిక్రమాదిత్యునిపరిపాలన సర్వదక్షిణాపథపర్యాప్త మైయుండి యాతనిసామంతులుగాఁ గాకతీయులు, హొయసలులు, యాదవులు, శిలాహారులు మున్నగువా రెందఱో కనఁబడు చున్నారు. రాణులు పలువురు. కాని, యావివరములు కావ్యమునకు అనవసరములు.

ఈచరిత్ర మంతయు నాకు నొకచోట దొఱక లేదు. చిరకాలముగా నేను జేయు చుండినపరిశోధనయొక్క సార మిది. శ్రీ డా॥ నేలటూరు వెంకటరమణయ్యగారు, ఆచార్య నీలకంఠశాస్త్రిగారు, ఇంకను ఉత్తరదేశపుచరిత్రకారులు పలువురును వ్రాసిన ఆయారచనలలోఁ జాళుక్యులమూలాఽధారశాసనములను వాఙ్మయమును సమన్వయించి వ్రాసితిని. జిజ్ఞాసువులు ఆయారచనలను జూడఁ దగును.

మహాకవి బిల్హణుఁడు త న్నాదరించినప్రభువునెడఁ గృతజ్ఞుఁ డై, యాప్రభువు కావ్యనాయకుఁడు గాఁబట్టి, యాతనిచరిత్రను రచించునెడఁ బూర్తిగాఁ గావ్యమర్యాదలను బాటింప వలసినవాఁ డాయెను. వరుస(క్రమము)ను బాటించుటకును, సంభవములను వర్ణించుటకునుమాత్రమే చరిత్రను గ్రహించెను. రెండవసోమే



శ్వరునిఁ బ్రతినాయకునిస్థానమున నుంచినందున నాతనిపై దుశ్చరితముల నారోపించెను. అట్లే తమ్మునికి జయసింహునికిని నాయకుని. నత్యుత్తమునిఁగా వర్ణించెను. చందలదేవిని నాయికఁగా, వేఱురాణులు పలువు రున్నను, స్వయంవరాఽదికకల్పనలచేతఁ, బ్రధానీకరించెను.

మహాకావ్యలక్షణముల నన్నిటిని బిల్హణుఁడు వదలక పొందుపఱచెను. అష్టాదశవర్ణనలలో దేనినిగాని వదల లేదు. నవరసములు, ద్వాత్రింశదలంకారములు, కాళిదాసాఽదులను స్మృతికిఁ దెచ్చుశైలీవిభవము, శయ్యాసౌభాగ్యము మున్నగువానిచేతఁ బఠితలహృదయముల నలరించెను.

## ఆంధ్రానువాదము

శ్రీకప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారు, కీ॥ శే॥ శ్రీమాదిరాజు విశ్వనాథరావుగారును గలిసి ఈమహాకావ్యమును ఆంధ్రకావ్యముగా నొనర్చి ఆంధ్రులకు మహోపకార మొనర్చినారు. సంస్కృతాంధ్రములలో నిష్ణాతులు, కవితాశక్తి గలవారు. 'కావ్యాలంకరణజ్ఞ మేవ కవితాకన్యా వృణీతే స్వయమ్' అని బిల్హణపంచాశికలోని పద్యములోవలెఁ గవితాకన్య వీరిని స్వయముగానే వరించిన ట్లున్నది. సంస్కృతమం దెట్లు కవన మల్లఁ గలరో ఆంధ్రమందు నంతకు మించి అల్లఁ గల రని ఈకావ్యానువాదమే ఋజువు సేయు చున్నది. ఖండకావ్యములును, గేయములును, జానపదానుకరణములును, ప్రాసవాక్యములును వ్రాసికొని ఆమాత్రమునకే పరమాఽనందభరితు లగునేఁటికవులకాలమునఁ, బూర్తిగాఁ బ్రాచీనమహాకవులధోరణిలో వీరు ఈకావ్యమును ఒకమహాసాధనగా వ్రాయుటయు, బిల్హణమహాకవియొక్క సంస్కృతకావ్యమునందలిగుణములను దేనినిగాని తెనుఁగున వదలక యాంధ్రీకరించుటయుఁ బ్రశంసనీయములు. ఇతరానువాదములలోఁ గాన నగుమూల విరుద్ధార్థములు వీరికడఁ గాన రావు. ఏపద్యముఁ జూచినను చక్కఁగా, మనకు దొఱకుమూలములకు సరియైనయనువాదములేకాక వివరణములుగాఁ గూడ నున్నవి. రుచిని వర్ణించుటకన్న రుచిఁ జూచి యెఱుఁగుట మేలు. వీరిలో శ్రీనాథుని'వార్తాప్రసిద్ధి'తోఁ బోతరాజు మడికారము, తిక్కన'రసాభ్యుచితబంగి'యు మేళవించి రచన చదువను జదువను హృద్యముగా నున్నది చదువరులే యెఱుంగఁ గలరు. మచ్చునకుఁ గొన్ని యనూదితపద్యములు చూడుఁడు:—

భోజునిఁగూర్చి :—

"భోజక్ష్మాభృత్ స ఖలు న ఖలైః తస్య సామ్యం నరేంద్రైః
తత్ప్రత్యక్షం కిమితి భవతా నాఽగతం, హా ! హతాఽస్మి ।
యస్య ద్వారోడ్డమరశిఖర క్రోడపారావతానాం
నాదవ్యాజాత్ ఇతి సకరుణం వ్యాజహారేవ ధారా॥"

దీనికి ఆంధ్రబిల్హణులయనువాదము :—

ఉ. 'కారు సమంబు భోజునకుఁ గానరపాలురు; నీవు నుంటి వే
లా, రహి రాక యీనృపలలామునికొల్వున; కేను దుర్విధి
ప్రేరిత' నంచు ద్వార్డమరకృచ్ఛిఖరోడ్డయనప్రవర్తితో
దారకపోతరావమిష యై తగె దీనత 'ధార' వల్కె నాఁ॥

ఇందుఁ 'గానపాలు' రనఁగా 'నీచనృపతు' లనియు, 'డమరకృత్' అనఁగా 'నుపద్రవము చేయు' అనియు, 'ధార' యనఁగా 'భోజునిరాజధాని' యనియు నధోజ్ఞాపికలోఁ పఠితలసౌకర్యార్థము వివరించినారు. మూలమందలి 'సకరుణం' అన్న పదభావము 'దీనత' యనుటలో బాగుగాఁ గుదిరినది.

మూలముతోఁ బోల్చి పఠించువారికి ననువాదకులసంస్కృతభాషాపరిజ్ఞానము, ఆంధ్రకవితాపాటవమును చక్కఁగా విశదము లగును. శ్రీనాథ – పోతరాజాఽదులవలె మూలమునందలి ఒక్కెడ శ్లోకమునకుఁ బద్యమును నొక్కెడ నైదారు శ్లోకములను గ్రహించి వానిభావమును, మూలకారునిపదప్రయోగౌచితినిఁ బోనీయక వాని కింకను మెఱుఁగుగాఁ బ్రత్యేకకావ్యమో యన నాంధ్రభాషామర్యాదకులోనై యాంధ్రీకరణము నడచినందుల కొక యుదాహరణము. అష్టమసర్గములోఁ జంద్రలేఖాలావణ్యాఽదికమును విక్రమాంకుఁడు విన్నభాగము :—



"సమయే తత్ర పుష్పాస్త్రమిత్త్రే విక్రమభూపతేః ।
ఉద్ఘాతనూతనాఽశ్చర్యా శ్రోత్రమైత్రీమగాత్కథా ॥ (1)

యథాఽస్తి విజయస్తంభప్రశస్తిరివ మాన్మథీ ।
కరహాటపతేః పుత్త్రీ త్రిజగన్నేత్రకార్మణమ్ ॥ (2)

విద్యాధరకుమారీ సా గౌరీదయితశాసనాత్ ।
కృతే కస్యాపి కురుతే స్వయంవరమహోత్సవమ్ ॥ (3)

చన్ద్రలేఖేతి నామ్నాఽస్యాశ్చన్ద్రలేఖాసమత్విషః ।
మృత్యుఞ్జయమహామన్త్రమైత్రీమేతి మనోభువః ॥ (4)

అన్తరఙ్గమనఙ్గస్య శృఙ్గారకులదైవతమ్ ।
అఙ్గీకరోతి తన్వఙ్గీ సా విలాసమయం వయః ॥ (5)

తస్యాః పాదనఖశ్రేణిః శోభతే లటభభ్రువః ।
రత్నావలీవ లావణ్యరత్నాకరసముద్గతా ॥ (6)

న నఖాలోఽత్ర వక్త్రేన్దుచన్ద్రికావరణం మమ ।
ఇతి తత్పాదయోర్లగ్నా వేద్మి ప్రాఙ్గణపద్మినీ ॥ (7)

అమూల్యస్య మమ స్వర్ణతులాకోటిద్వయం కియత్ ।
ఇతి కోపాదివాఽతామ్రం పాదయుగ్మం మృగీదృశః ॥ (8)

వీనికి నాంధ్రబిల్హణులయాంధ్రీకరణము, చతుర్థాశ్వాసము :—

"ఈలలి నలినవిశిఖసఖు
కాలం బారంగ మిగులఁ గర్వోత్సవ మై
చాలఁగ నబ్బుర మొదవెడు
జోలిన్ విక్రమనృపాలసోముఁడు వినియెన్. (2)

ఉ. కంజసపత్నలేఖ కెన కాఁ దగునంగవిభాతి, మారమృ
త్యుంజయమంత్ర మై, మనసిజోర్ధృతజైత్రపతాక నా జగ
త్పుంజదృగాళికార్మణతఁ బొల్పుఁ గనన్ గరహాటభూమిభృ
త్కుంజరుకూర్మిపుత్రి సొంపుగన్ గనఁ బేరునఁ 'జంద్రలేఖ'వాన్. (3)

క. వరవర్ణిని యగువిద్యా
ధరకన్యక కామె కిందుధరునాన స్వయం
వరమహము జరుపఁ బడు నొ
క్కరునింగూర్చి యెఱుంగఁ గా దెవ్వ రనన్. (4)

క. అంగన దాలిచి మించున్
శృంగారముదై నతంబు చేతోభవహృ
ద్రంగము విభ్రమములకు న
భంగప్రాంగణము నై నవయౌదయంబున్. (5)

సీ. లావణ్యరత్నాఽకరాఽవిర్భవన్మణి
శ్రేణిగాఁ బన్నఖశ్రేణి యలరు,
నసి గలతమముందుఁ బసిఁడియందెలఁ గిన్క
గనియె నా నెఱు పగుకాళ్లు దనరు;



వదనేందుచంద్రికాఽఽవరణము లై పాద
సంగతాబ్జినిఁ గాచుస్తనము లమరు;
మరుకేలుదోయిదండముఁ దెల్పుపల్కు నా
నెలతాజిగిని మించుమొల రహించు;

గీ. హస్తసర్వస్వహరణ నిభాఽళి కంటఁ
జననిమాతంగతను గూర్చుసక్థులు దగుఁ;
గలికి కల లేతఁదనము వే తొలఁగి లలిగఁ
గ్రొత్తజిగిజవ్వనము గూడికొని రహింప. (6)

ఈ సీసము 5, 6, 7, 8 శ్లోకముల కాంధ్రీకరణము. ఇత్యాదు లెన్ని యేనియుఁ జూప నగును. అనువాదకులసమాసఘటనయు, శైలీసారళ్యమును బూర్వకవిరచనాఽనుగుణ్యము లై యలరారు చున్నవి.

పంచమాఽశ్వాసమున రాజు కల్యాణపురప్రవేశముసందర్భమున 83 వ పద్యమునుండి 138 వ పద్యమువఱకు నచ్చతెనుఁగున రచియింపఁ బడినదికూడ సహజధారవలె మనోహరముగా నున్నది. ఇందలి 85 సంఖ్య గలవచనము ముక్తపదగ్రస్తము. ఇట్టిదే 44 వ సంఖ్య గల సంస్కృతసమాసప్రాచుర్య మైన ముక్తపదగ్రస్తవచనముగూడ మనోహరముగ నున్నది.

వీరిషష్ఠాఽశ్వాసమందలియుద్ధవర్ణనాఽదికసీసపద్యములు ప్రబంధకవుల శైలిని జ్ఞప్తికిఁ దెచ్చు చున్నవి.

ఉదా :- 71 'జయరమాపరిరంభ శంసిభుజంబున,'
73 'స్వోపరిస్థిత నృపప్రాపిత శ్రీదృశాయుతి'
75 'రదనాంశుకౌముది, మదజశైవలశృంగ'

ఇత్యాదులు చాలఁ గలవు. యుద్ధవర్ణనమందుఁ దదుచితసమాసఘటనకు ఉదా :-

మ. 'రథసాఽయోధనసక్తమత్తకరిసంరంభోర్మికాస్ఫారమున్
నథలాభోగతరంగచంక్రమణరంగద్వాహసాహస్రమున్
స్వభుజాఽటోపసముత్సుకోద్భటబహుస్ఫాయద్భటోత్సేధ మ
వ్విభుయుద్ధోద్ధతసైన్య మొప్పె క్షుభితాబ్ధిం బోలి దుర్దాంత మై.'
(6-69)

ఇది ప్రబంధమార్గానుగుణ్యమే. శరదృతువర్ణనమందలిపద్యములును మనోహరములు :-

శా. 'అంతఀ దోచెను యామినీరమణసద్యశ్శ్రీప్రసాదక్రియా
త్యంతప్రాభవశారదాగమము నీలాంభోదసంతానసం
క్రాంతశ్యామలిమక్షమావలయదుగ్ధక్షాళనప్రక్రమో
ద్దాంతస్వైరవిహారధీర మగుచుఀ దర్పించి యింతింతగఀ.'
(6-17)

పై పద్యములను జూచి చదువరులే యెఱుంగఁ గలరు. అనువాదకు లగు శ్రీకప్పగంతుల లక్ష్మణశాస్త్రి - శ్రీమాదిరాజు విశ్వనాథరాయ కవిసోదరుల కివే నాధన్యవాదములు.

(శాస్త్రిమనుమఁడు)

24-11-1973
మదరాసు.

(వేదము వేంకటరాయశాస్త్రి)



"ఇద్దియె మేము; మేమె యిది; యిద్దియె మాదువిశిష్టకార్య మౌ;
నిద్దరియన్యకృత్యము ల వెల్లరతోడిసమానధర్మముల్;
పెద్దది యొక్కకార్యమును బేర్కొని చేసిన జన్మ సార్థ మౌ;
నిద్దియె సృష్టి కర్త మగు; నీకృతి మాజను వొందె సార్థతన్.

అని యభిజ్ఞులు పేర్కొన్నదుర్లభము లగుమేలిసుణములన్నియు నిందు నెలవుకొన్నవి. కాళిదాసాదిమహాకవులకుఁ బ్రియతమ మగువైదర్భీమార్గమునఁ బ్రసాదసురభిళ మగునీబిల్హణమహాకవిరచనము విచ్చినవిరజాజులపొద.

అబ్ధిషు స్థలపథీకృతేషు నః
పూర్యతే జవవిధౌ కుతూహలమ్ ।
ఇత్యకుర్వత దిగన్తగోచరం
నూనమస్య తురగాః క్షమారజః ॥ 14-62

అనునిందలితురగవర్ణనపద్యభావమును :

ప్రయాతుమస్మాకమియం కియత్పదం
ధరా తదమ్భోధిరపి స్థలాయతామ్ ।
ఇతీవ వాహైర్నిజవేగదర్పితైః
పయోధిరోధక్షమముత్థితం రజః ॥ నైష. 1-69

అని చింతామణి మంత్రసిద్ధుఁడు శ్రీహర్ష మహాకవి ప్రతిస్వనించుటయును,

నీలనీరదనిచోళకోజ్ఝితే
వ్యోమదర్పణతలే శరద్వధూః ।
చంద్రమాననమివ వ్యలోకయత్
తత్క్షణోన్మిషితకైరవేక్షణా ॥ 14-32

అను పద్యభావమునకు

వికచపద్మనిరీక్షణమాత్మనో
ముఖమవేక్షితుమాత్తకుతూహలా ।
నియతమభ్రనిచోళకగర్భతః
శరదకర్షదహర్పతిదర్పణమ్ ॥
మధురావిజయము 5-45



అని వైదర్భీమార్గము నుద్ద్యోతించిన మధురకవయిత్రి గంగాదేవి కైవారము పలుకుటయును, ఆలంకారికశిరోమణి యప్పయదీక్షితులవారు :-

తత్పాదనఖరత్నానాం యదలక్తకమార్జనమ్ ।
ఇదం శ్రీఖండలేపేన పాండురీకరణం విధోః ॥

అనుశ్లోకమును చిత్రమీమాంసయందును,

"రథస్థితానాం పరివర్తనాయ
పురాతనానామివ వాహనానామ్" విక్ర 1-1

ఇత్యాదిశ్లోకమును ఉత్ప్రేక్షాలంకారమునకును,

"సాహిత్యపాథోనిధిమన్థనోత్థమ్
కర్ణామృతం రక్షత హేకవీన్ద్రాః"
విక్ర. 1. 11, 12.

ఇత్యాదిశ్లోకద్వయమును ఆక్షేపాలంకారమునకును నిందుండి యుదాహరించుటయును బరిశీలించినచోఁ బెద్ద లీకావ్యమునెడ నెంతటియాదరాభిమానములను బ్రదర్శించిరో గమనింతుము

ఇంత గుణసంభృత మగునీమహాకావ్య మింతవఱకును నాంధ్రసహృదయుల యనుభవమున కందక దూరదూరముగనే యుండిపోయినది. దాదాపు అర్ధశతాబ్దికి ముందు సుగృహీతనామధేయు లగుశ్రీతిరుపతి - వేంకటేశ్వరకవులు దీనిని వచనకావ్యముగా నాంధ్రీకరించిరి. కాని వారు దానియెడల వలసినంతశ్రద్ధ వహింపమికారణముగా నది యుండియు నసత్ప్రాయమే యైనది. మఱి యిప్పుడు మన్మిత్రులును, మొన్నమొన్నటివఱకును నాంధ్రప్రదేశప్రభుత్వవిద్యాశాఖయందుఁ బ్రాచ్యభాషావిభాగమున "డిప్యూటీ డైరెక్టరు"గా నుండి ప్రకృతము విశ్రాంతి నందినవారును, బహుభాషానిష్ణాతులును నగుబ్రహ్మశ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి గారును, దన్మిత్రులు కీ॥ శే॥ శ్రీ మాదిరాజు విశ్వనాథరావుగారును గలిసి దీని నాంధ్రమున ననువదించి ప్రకటించి యాగొప్పకొఱఁతను దీర్చి యాంధ్రసాహితీరసజ్ఞులకు నాదరపాత్రు లైనారు.

# సమీక్ష

పదునొకండవశతాబ్దియందు బిల్హణమహాకవి యనల్పశిల్పసుందరముగా సంతరించి పశ్చిమచాళుక్యయశస్సౌధమున కెత్తినసుమనోహరసువర్ణకలశము 'విక్రమాంకదేవచరిత్రము'. సంస్కృతమున విరళవిరళములుగా నున్నకతిపయ చారిత్రికకావ్యములలో నిది పేర్కొనఁ దగినది. లభ్యము లగువానిలోఁ బ్రాచీనము గూడ. హమ్మీరవిజయ, మధురావిజ, యాచ్యుతరాయాభ్యుదయాదు లింతకన్నను నాధునికములు. అందందు గ్రంథాంతరములఁ గన్నవియు, నానోట నానోట విన్నయు నగుకథాంశములను గుదిగూర్చుట కాక, కవి తాను స్వయముగా ననుభవించినట్టిదియుఁ బ్రత్యక్షముగాఁ జూచినట్టిదియు నగుచరిత్రమును సర్గబంధముగాఁ దీర్చినచో దాని వైశిష్ట్యము ద్విగుణీకృత మగును. అట్లయ్యును సంస్కృత చారిత్రికకావ్యములలో వానిచారిత్రికతకన్న కావ్యత్వమే విస్పష్టముగా భాసించును. రసబంధాభినివిష్టు లగుకవులు అంతశ్చైతన్యమున కిచ్చినంతగా బాహ్యశరీరమునకుఁ బ్రాధాన్యము నీయ లేదు. ఇతివృత్తమును గావ్యశరీరముగా భరతుఁడు నిర్దేశించినను మహాకవులు దానిని దమకవితాశిల్పచిత్రణమునకు ఫలకప్రాయముగ మాత్రమే గ్రహించిరి. ఇతివృత్తము ఇతిహాసమువలననే సిద్ధించు ననియు, నందువలనఁ గవి తన్నిర్వహణపరుఁడు గాక రసైకదర్శనుఁడు కావలె ననియు ఆనందవర్ధనులు వక్కాణించినారు. ఆసహృదయసాహితీవిమర్శకులయాదేశము తరువాతివారికి శిరోధార్య మైనది. అందువలనఁ 'జరిత్ర' మనుపేరుతో నున్నను నీకావ్యమునఁ జారిత్రికాంశములు పెల్లుగా లభింపవు మఱి కావ్యశిల్పమునకే సామ్రాజ్యము.

సంస్కృతమునఁ బంచకావ్యములతరముతరువాత వెలసినకావ్యములలో 'విక్రమాంకదేవచరిత్రము' కవితాశిల్పమునఁ బ్రథమగణ్య మై యున్నది.

"నవోఽర్థో, జాతిరగ్రామ్యా, శ్లేషోఽక్లిష్టః, స్ఫుటో రసః,
వికటాక్షరబన్ధశ్చ కృత్స్నమేకత్ర దుర్లభమ్"

అనువాదము నొకకళగా దిద్ది తీర్చినఖ్యాతి యాంధ్రసాహిత్యమునకు మాత్రమే దక్కినది. "అనువాదము నొకకళయా?" యనువారును లేకపోలేదు. ఒకవ్యక్తి నెదుట నుంచుకొని తత్ప్రతిబింబమును జిత్రించుటను గళ కాదందుమా? ఊహాకల్పిత మగుస్వేచ్ఛాచిత్రమును జిత్రించుటకన్న నిది దుష్కరమును, ప్రతిభావంతమును నగు ననుట సహృదయైకవేద్యము. ఉత్తమరూపచిత్రణమును జూచినపుడు అందు వస్తుసౌందర్యమునేకాక చిత్రకారునిశిల్పనైపుణ్యమును గూడఁ బ్రశంసింపమా ? ఇందు మఱియొకవిశేషమున్ను గలదు. ఊహాచిత్రమున నేవేని లోపము లున్నచో నవి విశిష్టభావుకులకుమాత్రమే యెఱుకపడును కాని ప్రత్యక్షవస్తుచిత్రణమునందలివి - బింబప్రతిబింబములు రెండును నెదుట నుండుటచే-సామాన్యునకు సయితము తెలియవచ్చును. అనువాదమువిషయమునను నింతే. మూలగ్రంథమున కాభాషలో నెట్టిస్థానము గలదో, యట్టిస్థానమును భాషాంతరమున ననువాదమునకును నెలకొల్పుట సామాన్యము కాదు. కావుననే అందుఁ గృతార్థులైననన్నయాదులను, శ్రీనాథాదులను నాంధ్రలోకము మహాకవులనుగా సంభావించినది.

నన్నయపురాణానువాదమునకు మార్గదర్శకుఁడు కాఁగా, శ్రీనాథుఁడు కావ్యానువాదమునకు దేశికుఁడైనాఁడు. అతఁ డామార్గమున మెఱుఁగుమెఱుఁగులను గనిపట్టి వెలయించె. "యాంధ్రభాషానైషధాబ్జభవుఁ," డైనాఁడు. అతని సూత్రములు తరువాతివారికి నిర్దేశకము లైనవి. ఆధునికులలో ననువాదము మూలమునకు మఱింత సన్నిహితము కావలె ననుదృష్టి గోచరించును. అది మంచిదే కాని దానివలన ననువాదము స్వతంత్రతారేఖను, గళాప్రతిపత్తినిఁ గోలుపోయి మూలమున కొకకృత్రిమవ్యాఖ్యగా మాఱిపోవుప్రమాద మున్నది. దానిని దప్పించుకొని కృతార్థు లగువా రెందఱో! ఇంతకును నిది కత్తిపై సాము.

'ఆంధ్రబిల్హణ'ఖ్యాతి నందిన యీకవిద్వయ మొనరించినప్రకృతకావ్యానువాదముగూడఁ బ్రాచీనమహాకవులు చూపినమార్గముననే సాగినది. ప్రాయికముగా నిది మూలమునకు నన్యూనానతిరిక్తమై పరమవిధేయముగ సాఁగిన దన వచ్చును, మచ్చున కొకటిరెం డుదాహరణములు చూపుదును :—



"క్షపాకరః కాతరరశ్మిమణ్డలః
పురన్ధ్రిగణ్డస్థలకాన్తిసమ్పదా ।
వికీర్ణసమ్మార్జనభస్మరేణునా
బిభర్తి యస్మిన్ ముకురేణ తుల్యతామ్"

మూలము (2-3)

కం॥ భీతైణాక్షీగండ
ప్రాతరుచిన్ గాతరాంశుపరికలితుం డై
శీతాంశుఁడు సమ్మార్జన
ధూతరజఃకీర్ణముకురతుల్యతఁ గనియెన్.

అనువాదము (2-4)

ఇందు మూలభావము చెక్కుచెదరకుండ నశిథిలబంధమున స్వతంత్రరచనమువలె భాసించుట కానవచ్చును. ఇట్టిదే మఱియొకటి:—

గాయన్తిస్మ గృహీతగౌడవిజయ స్తమ్బేరమస్యాహవే
తస్యోన్మూలితకామరూపనృపతిప్రాజ్యప్రతాపశ్రియః ।
భానుస్యన్దనచక్రఘోషముషితప్రత్యూషనిద్రారసాః
పూర్వాద్రేః కటకేషు సిద్ధవనితాః ప్రాలేయశుద్ధం యశః॥

(మూలము 3-74)

మ. కలనన్ 'గౌడ'గజంబులన్ గొనుచు వీఁకన్ 'గామరూ'పాధిపా
మలతేజోవిభవంబులన్ దులుచునాక్ష్మాపాలుప్రాలేయని
ర్మలకీర్తిన్ గడుఁ బాడు చుండిరి సహర్షస్వాంత లై ప్రాగ్గిరిన్
నలినీమిత్రరథారవాహృతనిశాంతస్వాపసిద్ధాంగనల్.

(అనువాదము 2-139)

ఇందు భావముతోఁబాటు బంధచ్ఛాయయును నందగించుట స్పష్టము :-

ఇందలిపద్యములయెత్తుగడలు కొన్ని శ్రీనాథాదులరచనములను దలఁపించుచున్నవి. చంద్రలేఖాస్వయంవరఘట్టమునందలియీపద్యమును దిలకింపుఁడు :

సంగరనిస్పృహప్రతిరసావరవాసములన్ బరాక్రమో
త్తుంగభుజుండు గాంచునిజతూర్ణవిలాసచపేటభిన్నమా
తంగనివాసముల్ హరివిధంబున; గోపగిరిప్రభుండు వీఁ
డంగన ! యీతఁ డీపుడమి స్వచ్ఛయశస్వియు నేకవీరుఁడున్.
4-150

విక్రమాంకునిచోళనగరప్రస్థానమును వర్ణించుసందర్భములోనిమఱియొక పద్యమును జూడుఁడు :

కకుబిభకర్ణనిర్దళనకారిభయానకదుందుభిధ్వని
ప్రకటన నభ్ర మభ్రమువరధ్వనినిర్భర మైనటుల్ తగెన్
సకలదిగంతభిత్తులను సామజఘట్టన సస్వనంబుగాఁ
బెకలినటుల్ స్ఫురించె శ్రుతిభీకరభేరిరవప్రతిధ్వనిన్. 3-50

దుందుభులు మ్రోఁగినట్లే యున్న దీరచనము. మూలమునందలి పదబంధవైచిత్ర్యము శ్రీనాథునియడుగుజాడల సురక్షితమాఁ గావింపఁ బడినది.

కందపద్యములు వీరిరచనమున వింతవింతయొయ్యారములను సంతరించుకొని "రసవన్మాకందము" అనుసూక్తిని సార్థకపఱచుకొన్నవి. వసంతవర్ణనము నుండి యొకదాని నుదాహరింతును :

దోలావిలాసరత లగు
బాలలవదనాబ్జములను బరిచుంబించెన్
మేలిదుకూలము లాగెన్
బ్రాలెన్ గటిపైఁ బటీరవాయువు గరిమన్.

రెండుసమాపకక్రియలను ద్వితీయ – తృతీయపాదములతుదల నిలిపి మూఁడవక్రియను జతుర్థపాదాదిని నవ్యవహితముగా నిబంధించుట భావవిశేషద్యోతక మై



పద్యగతికి నొకయొయ్యారమును జేకూర్చినది. ఇట్టివిశేషము లీరచనమునఁ గోకొల్లలు.

ఓజః-ప్రసాదములసమాహార మగురమణీయోదాహరణ మిది మఱియొకటి:-

"యస్య భ్రామ్యద్భ్రమరపటలీశ్యామకేలిద్రుమాణా
మారామాణామవిరలతయా కోఽప్యసౌ సన్నివేశః ।
యస్మిన్ రామాః కుసుమధనుషం దృగ్భిరున్మార్గభర్గ
క్రోధజ్వాలాకిసలయచయే సుప్తముత్థాపయన్తి"
(మూలము 18-13)

"అనగరిణా భ్రమన్మధుకరాసితకేళిమహీరుహోల్లసత్
కాననదంతురత్వమును గాంచి వచింపఁగ నేల ? శూలి కో
పానలవిస్ఫులింగకిసలావళిసుప్తలతాంతసాయకో
త్థానము సల్పు నందుఁ బ్రమదాజన మాత్మకటాక్షవీక్షణన్."
(అనువాదము (7-14)

ఇట్లెన్నియేనియు నుదాహరింపవచ్చును.

ఇంతేకాదు; ఒకవంక ఇట్లు క్లిష్టతమ మగుననువాదకార్యమును నిర్వహించుచునే, మఱియొకవంక పంచమాశ్వాసమున, మధుపానగోష్ఠీవర్ణనవచనమున సుమధురజటిలసమాసభూయిష్ఠ మగు ముక్తపదగ్రస్తమును; నందే 'కల్యాణ' పురప్రవేశవర్ణనమున నచ్చతెనుఁగుకూర్పును; నంతలో నాఁగక పౌరాంగనామన్మథచేష్టావర్ణనవచనమున నచ్ఛాంధ్రముక్తపదగ్రస్తమునుగూడ నిర్వహించుట వీరియప్రతిమానప్రతిభావ్యుత్పత్తులకుఁ దార్కాణము. అబాలసులభము లగునిట్టి గరిడీసాములు సాధారణపాఠకుల కొకింత యుద్వేజకములయినను, ప్రగల్భమతులకుఁ బరమాఽస్వాద్యములు కాకపోవు.

ఈయనువాదమునఁ బ్రాయికముగాఁ బ్రౌఢశైలియే యాదృత మైనది. మూలకారునివైదర్భీరీతి నాదరింపకపోవుటకు వీరిపాండిత్యాభిమానము, నిరంతరప్రౌఢప్రబంధపరిశీలనాభ్యాసమును గారణములు కావచ్చును. అభిరుచిభేదమునుబట్టియు, నధికారితారతమ్యమునుబట్టియు నీమార్గము సాహితీలోకమునఁ బరమాదృత మైన దనుటకు సందేహము లేదు

ఈసందర్భమున నొకవిషయము సహృదములకు నివేదింప వలసి యున్నది. క్రీ. శ. 1875 సం॥ లో జర్మన్‌దేశీయుఁ డగు 'డాక్టర్ జార్జి బుహ్లర్' పండితుఁడు ప్రప్రథమముగాఁ బ్రకటించినమూలగ్రంథముప్రతి యాధారముగా నీయనువాదము సాగినది. ఆమూలగ్రంథము, ఆపిమ్మటఁ గ్రమాభివృద్ధి నందినపరిశీలనములతో ముమ్మాఱు ప్రకటిత మైనది. తుదిముద్రణము 'వారాణసీ' హిందూవిశ్వవిద్యాలయమునందలి 'సంస్కృతసాహిత్యపరిశోధకమండలి' వారియాజమాన్యమున సంస్కృతవ్యాఖ్యతోను, హిందీయనువాదముతోను క్రీ శ. 1958 సం॥ లోఁ బ్రకటిత మైనది. ఈయాంధ్రానువాదము ముగిసినతరువాత మూలగ్రంథము మమ్మాఱు ముద్రిత మైనది. వ్యాఖ్యానముగూడ లేనిమూలగ్రంథసాహాయ్యముతో నీకవిద్వయ మింతశ్లాఘ్యముగా నాంధ్రీకరించుట వారిప్రతిభావ్యుత్పత్తులకు గీటురాయి యన వచ్చును.

ఈయనువాదము సంపూర్ణ మై చాల కాలము గడచినది. అనువాదకర్తలలో నొకరగుశ్రీవిశ్వనాథరావుగారు కీర్తిశేషులును నైనారు. ఇంతకాలమునకుఁ దరువాతనేనియు నీగ్రంథమును బహుళము లగువ్యయప్రయాసల కోర్చి సర్వాంగసుందరముగా ముద్రితప్రకటితము గావించి యాంధ్రసహృదయలోకమున కందించిన బ్రహ్మశ్రీ లక్ష్మణశాస్త్రిగారిని హృదయపూర్వకముగా నభినందించుచున్నాఁడను.

ఆంధ్రభాష విక్రమాంకదేవచరిత
మవతరించుటయె ముదాఽవహంబు;
కడుసమర్థులైనకవులచేఁ బడుట నె
త్తావి కుందనమునఁ దావు గొనుట ॥



రసమహోదధి బిల్హణురచన; దాని
తలము స్పృశియించి, జాతిరత్నముల నెత్తి,
మెఱుఁగు లిడి తెల్గువాణికి మేలితొడవు
సంతరించుట వైదుష్యసారఫలము ॥

ఇంతటికావ్యముఁ బ్రతిభా
వంతముగాఁ దీర్చి తెనుఁగువాణి కొసఁగున
త్యంతకృతి సుకవిమిత్రు వ
లంతి న్నిను నభినుతింతు లక్ష్మణశాస్త్రీ !

పూర్వచాళుక్యశాఖ కద్భుతయశంబు
నలవరించెను నాఁడు నన్నయమనీషి;
నేఁడు పశ్చిమచాళుక్యనిబిడకీర్తి
మీకతనఁ దెల్గువీటియ మేళవించె ॥

హాయి ! "సుధీంద్రమౌళులు !" బు
ధాఽదృత'విక్రమ'కావ్యము౯ సుధా
పేయముఁ దెల్గు సేసి మరి
పించిరి రాంధ్రుల నాంధ్రబిల్హణాఽ
ఖ్యాఽఽయతి; మీయనుంగుప్రమ
దాశ్రువుల౯ దివిఁ గల్పసూనముల్
వోయఁగఁ గప్పురంబు నెగఁ
బోయుఁడు రోదసి సౌరభింపఁగ౯ ॥

బ్రహ్మశ్రీలక్ష్మణశాస్త్రిగారింకను సముదాత్తతమము లగుసద్గ్రంథములను బెక్కింటిని రచించి యాంధ్రశారద నారాధింతురుగాక ! అందులకు వలయునాయురారోగ్యాఽదికములను బరమేశ్వరుఁడు వారికిఁ బ్రసాదించుఁగాక !

కం॥ "అసమానోల్లేఖరచనఁ
బనఁ గనుకృతికనక మిద్ది; పండితచేతో
వినరకషపరీక్షిత మై
పొసఁగుంగాత జనకంఠభూషణ మగుచుఁ."

ఆంధ్రవిక్రమాంకదేవచరిత్రము (1-124)

ఇట్లు
సుధీవిధేయుఁడు

[illegible]

సంస్కృతాంధ్రాచార్యుఁడు,
శ్రీమలయాళస్వామి ప్రాచ్య కళాశాల.

ప్రొద్దుటూరు
ప్రమాది మాఘ బహుళ పంచమి.
11-2-1974

—o—

కళాప్రపూర్ణ ఆచార్య
శ్రీనిడుదవోలు వెంకటరావుగారు- ఎం. ఏ.

# విక్రమాంకదేవచరిత్ర - ఆంధ్రానువాదము

## I

### బిల్హణునిచరిత్ర

తెలుగుభాషలో వనూదిత మై నేఁడు తెలసినయావిక్రమాంకదేవచరిత్రకు మూలము సంస్కృతమునఁ గలవిక్రమాంకదేవచరిత్ర. సంస్కృతవాఙ్మయమున గణన కెక్కినకవులలో నొకఁ డైనబిల్హణమహాకవి దీనిని రచియించెను. ఉత్తర భారతమునఁ గాశ్మీరదేశవాసి యైనబిల్హణకవి దక్షిణదేశమున నేఁడు కర్నాటక రాష్ట్రమున నున్న 'కల్యాణి' (కల్యాణకటకము) రాజధానిగా క్రి. శ. 1030 ప్రాంతమునఁ బశ్చిమప్రాంతము నేలినవిక్రమాదిత్యనృపాలునిపేర నాతనిచరిత్ర నీకావ్యమున వర్ణించెను విక్రమాదిత్యుఁడు పశ్చిమచాళుక్యరా జగుటచేతను బశ్చిమచాళుక్యరాజులచరిత్ర కిది యత్యంతోపయుక్త మైన దగుటచేతను జరిత్రకారులు దీనిని బ్రామాణికముగ గ్రహించి యున్నారు.

### బిల్హణుఁడు – తెలుఁగు సాహిత్యము

బిల్హణునికృతి విక్రమాంకదేవచరిత్ర తెలుఁగువారి కెంతపరిచితము గాదో, కృతికర్త బిల్హణుఁడు తెలుఁగువారి కంతపరిచితుఁడు సంస్కృతమునఁ, గాళిదాసాదిమహాకవులు తెలుఁగునఁ గవిపండితలోకమునమాత్రమే ప్రసిద్ధులు. కాని, బిల్హణుఁ డట్లు గాదు – అతఁ డాంధ్రప్రజానీకము నాకర్షించినకవి – కాళిదాసాది మహాకవులకథలు కట్టుకథలుమాత్రమే తెలుఁగున వ్యాప్తిలో నున్నవి. కాని కావ్య సాహిత్యస్థాయి కెక్క లేదు – "బిల్హణీయము" అనుపేర బిల్హణకవికథ తెలుఁగునఁ బ్రబంధనాటకప్రక్రియలమూలమున వాఙ్మయచరిత్రలో స్థానము గడించుకొన్నది. ఇది తెలుఁగుసాహిత్యచరిత్రకుఁ గ్రొత్తవిషయ మగుటచే దీని వివరణ మావశ్యకము.

### బిల్హణునిచరిత్ర – సంస్కృతము

తెలుఁగుసాహిత్యమున బిల్హణునిఁగూర్చి తెలిసికొనుటకు ముందు సంస్కృతమున బిల్హణకవిచరిత్ర నెఱుంగుటయు నావశ్యకమే – సంస్కృత వాఙ్మయచరిత్రలన్నింటియందును నాతనిఁగూర్చి యున్నది. కాని తెలుఁగుదేశమున

నాతనికిఁ గలసంబంధముఁగూర్చి యవి చెప్పవు. మొదట సంస్కృతమున బిల్హణుఁడు, తనవిక్రమాంకదేవచరిత్రమునఁ జివరిసర్గలో స్వకీయ వృత్తాంతము తెలిపినాడు

[1]బిల్హణుఁడు కాశ్మీరదేశీయుఁడు-అందు 'ప్రవరపుర'మునకుఁ జేరువగా నున్న 'కోనముఖ'గ్రామవాసి - అతఁడు మహాకవి యై, విద్వాంసుఁ డై, అనేక

---

1. సంస్కృతమునఁ గాశ్మీరదేశీయు లగుకవిపండితు లిట్టినామధేయములు గలవారు గలరు - వారు తెలుఁగు వారికిఁ బరిచితులే అయినను ఆనామముల వ్యుత్పత్తు లంతగాఁ దెలియవుగాన నిట వివరించు చున్నాను - భాషావేదులు వీనిని బరిశీలించెదరుగాక :-

1. మల్హణుఁడు - మల+హణ=మలము నణఁచువాఁడు, పోఁగొట్టువాఁడు. — తెలుఁగు మల్లన - మల్లిదేవుఁడు
2. కల్హణుఁడు - కల+హణ - మదము నణఁచువాఁడు : పోఁగొట్టువాఁడు. — కల్లన - కల్లిదేవుఁడు.
   కల యనఁగా మదము.
   "కలో మదః తద్యోగాద్వా కలః 'కలమదే'
   కల మనఁగా మదము. అది గలిగినది -"
   (అమరకోశము)
3. బిల్హణుఁడు - బిల+హణ=భేదము నణఁచువాఁడు — బిల్లన - వ్యవహారమున బల్లన. బల్లిదేవుఁడు.
   బిల యనఁగా భేదము.
   "బిల్యతే భిద్యత ఇతి బిలం
   'బిల - భేదనే' - భేదింపఁ బడునది" (అమరకోశము)
4. జల్హణుడు జల+హణ - జడత్వము - నణఁచువాఁడు. — జల్లన - జల్లిదేవయ్య - జాలయ్య
   "జలం నీరే జడే త్రిషు. ఇది ఉదకమునకుఁ
   నానార్థరత్నమాల చే రగునపుడు ; జడునకుఁ
   ద్వ్యక్షరకాండ. చే రగునపుడు

పైవానిలో - మల్లనపేరు - శ్రీశైలమల్లన్న - తెలుగున విశేషవ్యాప్తిలో నున్నది — లక్కినవి కన్నడదేశమున వ్యాప్తిలో నున్నట్లు పాల్కురికిసోమనాథుని బసవపురాణ - పండితారాధ్యచరిత్రలవలనఁ దెలియు చున్నది.



రాజాస్థానములందుఁ దనవిద్యావైదుష్యము ప్రదర్శించి, దక్షిణమునకుఁ దరలి - విక్రమాదిత్యునియాస్థానమున స్థిరపడెను. కాని, తాను స్వదేశమగుకాశ్మీరమునకుఁ దిరిగి పోలేనందులకు నెంతో చింతించి, వారాణసీక్షేత్రమునకు వెడలెను.

## కృతులు

అతఁడు విక్రమాంకదేవచరితమేకాక - కర్ణసుందరి అనునాటికను, 'చౌరపంచాశత్తు', లేక 'సురతపంచాశత్తు' అనుముక్తకగ్రంథమును - 'బిల్హణస్తవ' మనుశివస్తవమును రచించెను - వీనిలోఁ జౌరపంచాశత్తు చోరకవిపేరిటఁ బ్రత్యేకముగా వ్యాప్తి చెందినది-చోరుఁ డనునది బిల్హణునకు నామాంతరము.

కర్ణసుందరీనాటిక తెనుఁగున ననూదిత మైనది[1]. 'బిల్హణస్తుతి' సంస్కృత వాఙ్మయచరిత్రకారులకుఁ బరిచితము కాదు. తెలుఁగుదేశమున వ్యాప్తి గలది.

## బిల్హణకవిశివస్తుతి - తెలుఁగుదేశము

'బిల్హణస్తుతి' - ముప్పదియాఱుశ్లోకములు గలశివస్తుతి - ఇందుఁ జక్కనికవితయేకాక చమత్కారజనకము లగుభావములు నున్నవి - బిల్హణుఁడు శివభక్తుఁ డని అతనివిక్రమాంకదేవచరిత్రనుబట్టి మనము తెలిసికొన వచ్చును. అతఁడు శివభక్త్యతిశయముచే రచించినయీస్తవమును దెలుఁగుదేశమున శైవులు మహిమ్నస్తవాదిస్తవములలోసహా పఠించు చుండెడువారు - మహిమ్నస్తవాదు లైదు.

1. మహిమ్నము - పుష్పదంతరచితము.
2. మల్హణము - మల్హణకవిరచితము
3. మలయరాజీయము - మలయరాజకవిరచితము.
4. అనామయము - దండికవిరచితము.
5. హలాయుధము - హలాయుధరచితము.

---

1. ప్రస్తుతవిక్రమాంకదేవచరిత్ర ననువదించినవారే దీనిని ననువదించిరి.

కాని శ్రీనాథమహాకవికాలమున - క్రీ శ. 1426 ప్రాంతమునఁ - శైవపంచస్తవములలో - మలయరాజీయమునకు బదులు - బిల్హణస్తవమును శైవులు పఠించుచుండెడివా రని ఆతనిరచనములనుండి తెలియు చున్నది - పై స్తుతిరచయితలలో - మల్హణ - బిల్హణు ల నిద్దరిని ఇతరసంస్కృతకవులతోఁ బాటు శ్రీనాథుఁడు, పేర్కొని వారికి నంజలించినాఁడు.

గీ॥ భాస-శివభద్ర-సౌమిల్ల-భల్లులకును
మాఘ-భారవి-బిల్హణ-మల్హణులకు
భట్టి-చిత్తపకవి-దండిపండితులకుఁ
గేలుకోలుపుదు నొసలిపైఁ గేలుదోయి-

భీమఖండము (1-7)

ఇట్లు కవిస్తుతిలోఁ బ్రశంసించుటయేకాక, శ్రీనాథకవిబిల్హణస్తవములోని యీక్రిందిశ్లోకమును, దనహరవిలాసమున ననువదించెను :-

బిల్హణస్తుతి - 3వ శ్లోకము

పంచబ్రహ్మషడంగబీజముఖరప్రాసాదపంచాక్షరీ
వ్యోమవ్యాపిపురస్సరేషు మనుషు ప్రౌఢిః కుతో మాదృశామ్ ?
ఓంకారాऽదినమోऽన్తముద్రితభవన్నామాऽవళీకల్పితమ్
సర్వం మంత్రతయా ప్రభో ! పరిణమత్యంతర్బహిర్వ్యాగతః.

శ్రీనాథుఁడు

పంచబ్రహ్మషడంగబీజసహితప్రాసాదపంచాక్షరీ
చంచన్మంత్రపరంపరాపరమనిష్ఠాతత్పరత్వంబునన్
మంచుంగొండయనుంగుపెండ్లికొడుకున్ మధ్యాహ్నకాలంబు సే
వించున్ నిర్జరరాజసూనుఁడు మనోవీథీసదాऽధ్యాసతన్[1] (7-33)

1. శ్రీనాథునిసంస్కృతకవిస్తుతులలో నెన్నియో విశేషము లున్నవి. మల్హణుఁడు, బిల్హణుఁడు మొద లగుకాశ్మీరకవులను దొలుతఁ దెలుఁగునఁ గవిస్తుతిలోఁ బ్రవేశపెట్టినవాఁ డతఁడే - శ్రీనాథునిసంస్కృతకవిస్తుతులనుగూర్చి ప్రత్యేకపరిశోధన చేయుట యావశ్యకము.



ఈబిల్హణస్తవము నాధునికయుగమున శ్రీవింజమూరు లచ్చారాయకవిగారును (1860-1927), శ్రీచిదిరెమఠము వీరభద్రశర్మగారును (1890-1950) తెలుఁగున ననువదించిరి[1].

ఈశివస్తుతిలో బిల్హణుఁడు వివిధవృత్తములు వాడినాఁడు - శివుఁడు శార్దూలచర్మాంబరుఁ డగుటచేత - శార్దూలవృత్తములే హెచ్చుగా (23) వాడినాఁడు. ఆర్య, వసంతతిలకము మొదలైనవిగూడఁ గలవు.

బిల్హణుడు - శృంగారప్రియత్వము

ఈ స్తవమున, నీక్రిందిరెండుశ్లోకములు పైవిషయమును నిర్ధారింపఁ గలవు.

"ధత్సే మూర్ధ్ని సుధామయాంశుశకలశ్లాఘ్యే కపాలస్రజమ్
వక్షస్యద్రిసుతాకుచాగురురజస్సాంద్రే చితాభస్మ చ[1] ।
తద్బాణాऽదికవిప్రణీతలలితస్తోత్రప్రబంధప్రియే
త్వత్కర్ణే లభతామయం మమ గిరాం గుంభోऽపి ॥

సంభావనామ్" 2 శ్లో

"అర్థానర్థనిరూపణవ్యసనితామాధ్యస్తుతివ్యగ్రతా
మేణాక్షీకుచలాలనప్రణయితామద్యాపి వర్తామహే ।
త్వద్ధ్యానవ్యవధావహేతుషు మనస్త్వచ్చాటుకావ్యేషు వాక్
త్వత్పూజావిధురేషు కర్మసు కరః శ్రీకంఠ ! నోత్కంఠతే"

35 శ్లో

1. వేదకావ్యస్మృతితీర్థ, శైవధర్మాऽచార్య - శైవవిద్యానిధి చిదిరెమఠము వీరభద్రశర్మగారు, వీరశైవాऽచార్యులలో విశిష్టులు. వీరు కాశీలోని 'విశ్వాऽరాధ్య జంగమవాడి'మఠమున కధ్యక్షులుగా నుండెడివారు. వీరు ప్రకటించిన శివపంచస్తవి (భక్తరంజనీవ్యాఖ్యతోఁ గూడినది) ఆంధ్రశైవవాఙ్మయమున నుత్తమగ్రంథము. ఇందు శివపంచస్తవములు, ప్రతిపదటీకాతాత్పర్యములతోఁ టీకలతో వెలయుచు, సాహితీవేత్తల కత్యంతోపాదేయములుగా నున్నవి. ప్రకటన 1943.

## బిల్హణీయము - బిల్హణకథ[1]

తెలుఁగుసాహిత్యమున బిల్హణకథ వ్యాప్త మగుటకుఁ బైబిల్హణుని శృంగారప్రియత్వమే హేతువు ఈకథ బిల్హణీయ మనుప్రబంధమునుండి యిట్లు తెలియు చున్నది.

"పాంచాలదేశమున 'లక్ష్మీమందిరము' అనునగరమున 'మదనాభిరాముఁ' డనురాజు పాలించు చుండెను - ఆతనికి 'యామినీపూర్ణతిలక' అనుకూఁతు రుండెను - ఆమె యౌవనవతి' కాఁగానే - ఆమెయభిలాష ననుసరించి, రా జామెకు సాహిత్యవిద్య నేర్పుట కొకయాచార్యుని నియమింప మంత్రి కాజ్ఞాపించెను. మంత్రి విచారింపఁగా నక్కడిపండితులు :

"అనిన, 'మల్హణ - బిల్హణు' లనఁగఁ గవులు
సరసు లిరువు రలంకారసహితు లందు
బిల్హణుం డనువాఁడు గంభీరుఁ డధిక
తముఁడు కవిరా జనంగ స్తోత్రములు వడసె" (1-70)

అని వారలపేర్లు తెలిపిరి, రాజు బిల్హణునిఁ బిలిపించి, ఆతనిసౌందర్యమును జూచి యౌవనవతి, సౌందర్యవతి, యగుతనకుమార్తె కీతఁడు చదు వెట్లు చెప్పునని సంకోచించెను అప్పుడు మంత్రి "మనరాజపుత్రి 'అంధునిఁ జూడ' నని వ్రతము పట్టినది - బిల్హణుఁడు 'కుష్ఠరోగినిఁ జూడ' నని వ్రతము పట్టి యున్నాఁడు - అందుచే - రాజపుత్రికి - 'బిల్హణుఁ డంధుఁ' డని తెలిపి, బిల్హణునకు 'రాజపుత్రి కుష్ఠరోగి' యని యెఱింగించి, వారిద్దఱిమధ్య నొకతెర కట్టించి, రాజపుత్రికి విద్య నేర్పునేర్పాటు చేయుదు" నని యట్లే చేసెను. రాజున్ను దీనికి సమ్మతించెను.

1. బిల్హణీయమునకు సంస్కృతమున ముద్రితమై ప్రచారములో నున్న "బిల్హణచరితమ్" అనునది మూలము. ఇందు 150 శ్లోకములమాత్రమే కలవు- ఈనూటయేఁబదిలో 50శ్లోకములు 'చౌరపంచాశిక' శ్లోకములు - ఈగ్రంథరచన కాలము మనకుఁ దెలియరాదు - కాని శ్రీనాథునికాలమునుండి యిది ప్రచారములో నున్నట్లు తెలియు చున్నది.



యామినీపూర్ణతిలక-కాండపటముమధ్యగా బిల్హణునియొద్ద విద్యల నభ్యసించి సకలకళావిశారద యయ్యెను. ఇట్లుండ నొకనాఁడు పున్నమవెన్నెలరేయి నామె తెర వెనుక శయనించి యుండెను బిల్హణుఁడు, ఆపండువెన్నెలసౌభాగ్యమును దిలకించి, తాను గవిగానఁ, జంద్రునితో మచ్చనుసహితము అద్భుతముగా వర్ణింపఁ దొడఁగెను. తెరవెనుక నామె యీవర్ణనము విని - "బిల్హణుఁ డంధుఁ డని చెప్పినారు - కాని యతఁడు నిజముగా గ్రుడ్డివాఁడే యైనచోఁ జంద్రునితో మచ్చనుగూడ నెటుల వర్ణింపఁ గలఁడు? ఇది నాతండ్రి యెత్తినపన్నుగడ యని, తెర దిగఁ ద్రోసి బిల్హణునిఁ గాంచి మోహపరవశ యయ్యెను. వారిరువురు మన్మథక్రీడావిలాసమగ్నులైరి

ఈసంగతి ఆమెచెలులు రాజున కెఱిఁగింపఁగా నాతఁడు కోపోద్రిక్తుఁడై బిల్హణునికి శిరచ్ఛేదము చేయ నాజ్ఞాపించెను. రాజు, తలవరియు నట్లు చేయుటకుఁ బ్రయత్నించియు నాతనిధైర్యముఁ గాంచి, యట్లే నిలిచిరి. బిల్హణుఁడు అప్పుడు తనప్రియతోఁ దా ననుభవించినక్రీడలన్నింటిని నేఁబదిశ్లోకములలో వ్రాసి పంపెను కాని రాజు వానిని జదువక తిరస్కరించెను. తిరిగికూడ బిల్హణుఁడు, రాజనీతినిఁ గూర్చి ఒకశ్లోకమును వ్రాసి పంపెను. రాజు దానిని జూచియుఁ దిరుగఁ గొట్టెను - అంతఁ గవి యిట్లు మఱియొక శ్లోకము వ్రాసి పంపెను - "కవి శాపానుగ్రహ సమర్థుఁడు. ఎందఱో రాజులు కవులశాపమువలన రాజ్యభ్రష్టులైరి. నీవును న ట్లగుదువు" అని శ్లోకతాత్పర్యము అది చూచి రాజు వెంటనే కవినిఁ బిలిపించి, యామినీపూర్ణతిలక నాతని కిచ్చి వివాహముఁ గావించెను.

శృంగారరసాత్మక మగునీకథ తెలుఁగుకవుల నాకర్షించినది :-

1. బిల్హణీయము : చిత్రకవి సింగరాచార్యప్రణీతము,
ముద్రితము - 17 వ శతాబ్ది.

2. శృంగారసుధాసముద్రపూర్ణచంద్రోదయము,
18 వ శతాబ్ది - అముద్రితము.

3. మదనసాయకవిలాసము : చదువుల సోమలింగకవి,
18 వ శతాబ్ది - అముద్రితము.

4. యామినీపూర్ణతిలకావిలాసము : చెళ్ళపిళ్ళనరసకవి,
19 వ శతాబ్ది - ప్రారంభము-ముద్రితము.

ఈనరసకవి సుప్రసిద్ధు అగువెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారిముత్తాత -

5. నవయామిని : మారేమండ నాగేశ్వరరావు. 20 వశతాబ్ది-ముద్రితము.
(గుంటూరు ఆంధ్రక్రైస్తవకళాశాలలో నాంధ్రోపన్యాసకుఁడు)

### నా ట క ము లు

శ్రవ్యకావ్యకర్తలనే కాక 'గురజాడ'వంటినాటకకర్తలను నీయితివృత్త మాకర్షించినది.

1. బిల్హణీయము — నాటకము - రెండంకములదిమాత్రము లభ్య మైనది. ముద్రితము. ఆంధ్రపత్రిక మొదటిసంవత్సరాది సంచిక - 1909. విశాలాంధ్ర - 1950.
2. బిల్హణీయము - నాటకము - మారేపల్లి రామచంద్రశాస్త్రి (1873-1951). ముద్రితము 1913. రచన 1902
3. ,, ,, ఆ. రామానుజాచార్యులు - 1904
4. ,, ,, గూడా కృష్ణయ్య - 1910
5. ,, ,, ఉమ్రే అలీ షాహ - 1910[1]

### య క్ష గా న ము

బిల్హణునికథ నాటకముగానేకాక సంప్రదాయసిద్ధము లగు యక్షగానములు గాఁగూడ వెలసినది.

బిల్హణీయనాటకము - యక్షగానము -
గొన్నాబత్తుల అమ్మనార్యుఁడు - 1884 - రచన
ముద్రితము - 1901

ఇది ప్రశస్త మైనరచన.[2]

బిల్హణీయము - ధనకుధరం రామానుజాచార్యులు[3] - 1903

పైవివరణనుబట్టి తెలుఁగుదేశమున, బిల్హణునికథ కెట్టిప్రచారము గలదో తెలియును.

1. తెలుఁగునాటకవికాసము - డాక్టరు పోణంగి శ్రీరామ అప్పారావు. (పి. యస్. ఆర్. అప్పారావు) పుట 671
2. ఆంధ్రయక్షగానవాఙ్మయచరిత్ర - పుట 192
3. ,, ,, పుట 210



### బిల్హణుఁడు - చోరకవి.

సంస్కృతవాఙ్మయమున బిల్హణుఁడు, చోరకవి వేర్వే రని వ్రాయఁ బడినది. కాని యది సరి కాదు-'చోరపంచాశత్తు' అను కృతి చోరకవి దని వారిభావన. కాని ఆపంచాశత్తునకుఁ గర్త బిల్హణకవి యని, అతఁడే చోరకవి యని, బిల్హణీయ మందలియీక్రిందిఘట్టము నిరూపించు చున్నది:-

రాజాజ్ఞ ననుసరించి, భటులు, బిల్హణుని వధ్యస్థానమునకుఁ గొనిపోవునపుడు, వీథులలోఁ బౌరజను లిట్లు చెప్పుకొనఁ దొడఁగిరి:—

క. చోరుఁ డనునామ మీకవి
కారయఁగను నేఁటికిని యథార్థం బయ్యెన్.
జారుఁడు; మఱి రెండుం దగె;
సూరులు మెచ్చుదురె జారచోరత్వములన్. (3-84)

సంస్కృతమున నీశ్లోకములు "అద్యాపి" అనుపదద్వయముతోఁ బ్రారంభింపఁ బడును.

### బిల్హణునికథ - మహారాష్ట్రము.

తెలుఁగుదేశముననేకాక మహారాష్ట్రదేశమునఁగూడ బిల్హణునికథ వ్యాప్తిలో నున్నది. 'బిల్హణచరిత్ర'అనుగ్రంథ మాభాషలోఁ గలదు.[1] అం దీరీతిగా నున్నది:-

బిల్హణుఁడు కాశ్మీరదేశీయుఁడు. ప్రవరపురమునకుఁ జేరువ కోనముఖగ్రామవాసి. కాశీనుండి రామేశ్వరమువఱకు నీతఁడు సంచరించి పలువురు పండితుల యెదుట స్వకవితాకౌశలప్రదర్శనమును గావించి, వారిమెప్పును బడసి దైవవశమున గుర్జరదేశపునరసింహరాజుపుత్రిక యగుశశిరేఖకు నితఁడు విద్యాబోధకుఁడుగా నుండి యామెను ప్రేమించి మిక్కిలి కష్టములపాలై తుదకు వివాహ మాడెను.

తెలుఁగుదేశమున బిల్హణకథకును, మహారాష్ట్రమున బిల్హణకథకును వేర్లలోఁ గొంతభేద మున్నను గథాకథన మంతయు నొక్కటే - రెండింటియందును బిల్హణుఁడే కథానాయకుఁడు - కథయంతయు నొకటే:-

1. శ్రీవిఠల్‌కృత "బిల్హణచరిత్ర" మరాఠీ. పుట 163.

| తెలుఁగు | మహారాష్ట్రము |
| --- | --- |
| పాంచాలదేశము | గుర్జరము |
| మదనాభిరాముఁడు | నరసింహరాజు |
| యామినీపూర్ణతిలక | శశిరేఖ |

మహారాష్ట్రమందలికథ, బిల్హణుఁడు విక్రమాంకదేవచరిత్రచివరిసర్గలోఁ దాను జెప్పికొనినదేశనివాసవిషయమున సరిపోవు చున్నది ఇఁక నిందలి బిల్హణకథయుఁ దెలుఁగుదేశపుబిల్హణకథతో సరిపోవు చున్నది - తెలుఁగుదేశమున నీకథలో దేశము-రాజు - రాజపుత్రిపేళ్లలో మార్పు గలుగుటకు హేతు వున్నది. బిల్హణునిఁ గూర్చినయీకథలు గ్రంథస్థము లైననాఁటికి బిల్హణునికిఁ దరువాతఁ జాలకాలము పట్టినది - తెలుఁగున క్రీ - శ. 7వ శతాబ్దిని ఇది తెలుఁగులోనికి వచ్చినది. తెలుఁగుకవి తా నప్పటికి విన్నకథను యథామాతృకముగాఁ గావ్యముగా రచించెను. తక్కినకవు లందఱు నొకరి నొక రనుసరించిరి.

మరాఠీకథలో - "బహుకష్టములపాలై" అనువాక్యము తెలుఁగుబిల్హణీయము కథతో ననువదించుచున్నది. ఈతరువాతఁ గొంతమంది చరిత్రకారులు - బిల్హణుఁడు పెండ్లి యాడినకన్య - గుజరాతునందలి 'అణహిల్వాడు' నగరమందలి దని చెప్పు చున్నారు-తెలుఁగుకవుల కీమహారాష్ట్రమందలికథ పరిచితము గాక పో వచ్చును.

ముందు నేను జెప్పినట్లుగాఁ దెనుఁగుకవు లప్పటిజనప్రవాదము ననుసరించిన కథను గ్రంథస్థముఁ జేసిరి. మొత్తముమీఁద బిల్హణకథకుఁ దెలుఁగుదేశమున నున్నంతప్రచారము మహారాష్ట్రములో లే దని చెప్ప వచ్చును. తెలుఁగుదేశమందలి కథ చెప్పక పోయినను, మహారాష్ట్రదేశమునందలికథ విక్రమాంకదేవచరిత్రకథతో సంబంధము తెలియపఱుచుటచేతను, కథలు రెండును నొక్కటియే యగుట చేతను, విక్రమాంకదేవచరిత్రకర్త యగుబిల్హణుఁడును నొక్కఁడే యని సిద్ధాంతము.



## II

## అనువాదప్రశస్తి

నవ్యాంధ్రసాహిత్యజగత్తులోఁ బ్రాచీనప్రబంధకవిసంప్రదాయములను బునరుజ్జీవింపఁ జేసిన దీవిక్రమాంకదేవచరిత్రానువాదము. మూలమునఁ బదు నెనిమిదిసర్గలు గలయీకావ్యమును దెలుఁగున నేడాశ్వాసములలో, రెండువేల పద్యములకు మించి యొకమహాప్రబంధముగా దిద్ది తీర్చినవా రిరువురు :

(1) [1]శిరోమణి కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారు.

(2) కీర్తిశేషులు మాదిరాజు విశ్వనాథరావుగారు.

సంస్కృతాంధ్రములవలె వీరిరువురును నీకృతిని రచించుటవలన దీని కొక విశిష్టత చేకూరినది. ఇందుఁ దొలివారైన శ్రీలక్ష్మణశాస్త్రిగారు వెలనాటివారు - 'వెలనాటివారు కవితకు వెల నాఁటినవారు' - రెండవవారు విశ్వనాథరావుగారు ఆర్వేలనియోగులు ఆంధ్రభారతి ఆర్వేలవారింటియాఁడుబిడ్డ. కవితా - సాహిత్యములు శాఖాభేదముల కతీతము లని నిరూపించిన దీకావ్యము.

ఇష్టదేవతాస్తుతి, షష్ఠ్యంతములు, ఆశ్వాసాద్యంత గద్య - పద్యములు - రస - భావవర్ణనలతో నీకృతి సర్వప్రబంధలక్ష్య - లక్షణ - లక్షిత మై యలరారు చున్నది -

### కావ్యావతారికా విశేషములు

(1) మనకావ్యము లన్నియు శ్రీకారముతోఁ బ్రారంభింపఁ బడునవియే. అందుఁ బ్రథమపద్యమునఁ బ్రారంభమున శ్రీకార ముండును. కాని, తక్కిన మూడుపాదములయాదియందును శ్రీకార ముండదు. ఇందు 4 పాదములయాది యందును శ్రీకారము లుండుట విశేషము.

---

1. శ్రీలక్ష్మణశాస్త్రిగారియింటిపేరు 'కప్పగంతులవా' రని నేఁడు వాడుకలో నున్నను - వాస్తవముగా వారియింటిపేరు 'కప్పగొంతులవారు'. ఇది వైదికసంబంధము గలది. వేదమున మండూకసూక్తములు ప్రసిద్ధములు. మండూకసూక్తధ్వని యెప్పుడును వీరిపూర్వులయింటిలో విన బడుచుండుటచే కప్పగొంతులవా రని వీరి గృహనామ మేర్పడినది. దీనిని దొలుతఁ దెలిపినవారు. సుప్రసిద్ధవిద్వాంసులు బులుసు వేంకటరమణయ్యగారు. (భారతి - మార్చి 1946).

(2) ఇది తెలుఁగువారియిలువేల్పైన శ్రీపద్మావతీ - వేంకటేశ్వరస్వామి వారికిని, శ్రీలక్ష్మీ-నరసింహస్వామివారికిని నంకితము. శ్రీలక్ష్మణశాస్త్రిగారియిష్ట దైవము శ్రీవేంకటేశ్వరస్వామివారు. అంతేకాక, వారితలిదండ్రులు - పద్మావతీ - శ్రీనివాసశాస్త్రిగార లగుటయు నొకవిశేషమే. శ్రీవిశ్వనాథరావుగారియిలువేల్పు శ్రీలక్ష్మీనరసింహస్వామివారు. ఈకారణముచేత నీకవులు షష్ఠ్యంతములలో. నిలువేల్పు లిరువురుస్వాములను శ్లేషసమాసములతో స్తుతించినారు.

(3) గురుస్తుతియందు, మతిలోకోత్తరులు మానవల్లి రామకృష్ణకవిగారి స్తుతి యుండుట.

(4) సాధారణముగా నిష్టదేవతాస్తుతియందు నొక్కొక్క దేవతకు నొక్కొక్క పద్యమే యుండును. ఇం దట్లు గాక రెండుమూడుపద్యము లున్నవి

(5) కృత్యవతారిక ఒకచక్కనిఖండకావ్యమువలె భాసించు చున్నది.

## అనువాదసరణి - ఒకయుదంతము

ప్రస్తుత మీప్రబంధ మనువదింపఁ బడినవిధానమునుగూర్చి తెలుపుటకు ముం దొకయుదంతమును బాఠకులదృష్టికిఁ దెచ్చుట యావశ్యకము-

ఇప్పటికి నాలుగుదశాబ్దులక్రిందటిమాట-క్రీ. శ 1934లో నేను ఇంపీరియల్ బ్యాంక్ (నేఁడు స్టేటుబ్యాంక్ ఆఫ్ ఇండియా) లో విజయనగరమున గుమాస్తాగాఁ బని చేయు చున్నరోజు లవి. ఉద్యోగనియమితకాలముతప్పఁ దక్కినకాలమంతయు నాకు సాహిత్యవ్యాసంగముననే కడచెడిది - ఆసమయమున నేను యాదృచ్ఛికముగాఁ. దిరుపతివేంకటకవులు రచించినవచనవిక్రమాంకదేవచరిత్ర చదువుట తటస్థించినది - విక్రమాంకదేవచరిత్ర తెలుఁగులోని కనువదించుటలో వారే మొదటివారు. నే నావచనగ్రంథము చదివి, అం దవతారికలో బిల్హణుఁడు కవులనుగూర్చి - కావ్యమునుగూర్చి వ్రాసినభాగములకు ముగ్ధుఁడ నై యాభాగములను ముప్పదిపద్యములలో ననువదించితిని. వానిని మిత్రులు కీ శే. గంటి సూర్యనారాయణశాస్త్రిగారు తమ 'కల్యాణి' పత్రికలోఁ బ్రకటించిరి, ఆపద్యములను నాకుఁ జిరకాలమిత్రు లగు శ్రీమాన్ రంయాజ్ఞి వేంకటవీరరాఘవాచార్యులుగారు చూచి. "మూలమును మీరు చూచితిరా" అని యడిగిరి. 'చూడ లే' దంటిని. వెంటనే వారు బొంబాయివారు ప్రకటించిన విక్రమాంకదేవచరిత్ర నిచ్చి చదువుఁ డనిరి.



మూలముతోఁ దిరుపతివేంకటేశ్వరకవికృతాంధ్రానువాదమును బోల్చి చూచుచుండగా - ఆయనువాదమంతయు సరిగా లే దని పొడఁగట్టినది. మూలములో నున్న చారిత్రికాంశములనేకాక, బిల్హణకవికవితాసామర్థ్యమును వ్యక్తీకరించు రసవద్ఘట్టములును బ్రదర్శితములు కాలేదు - ఎన్నఁడైనను నీకావ్యమునకు మూలముతో సరితూఁగఁ గలయనువాద ముదయించునా యని యువ్విళ్ళూరు చుంటిని. ఈనాఁటికి నీవిక్రమాంకదేవచరితమున కట్టియనువాద మవతరించినది.

మూలగ్రంథమును నేను బూర్తిగాఁ జదివి యానందించినవాఁడ నగుటచేతఁ బ్రస్తుతానువాదము న న్నెంతగానో యాకర్షించినది. మూలమందలియొక్కపదమును గూడ విడువకుండ, నీరచన జాగరూకతతో సాగినది. ఈయనువాదమున నిది ముఖ్యవిషయము. ఏల ననఁగా, నీసంస్కృతకావ్యము చరిత్రకు సంబంధించినది అందలిపదములను విడిచినఁ జరిత్రకు లోపము కల్గును. ఇట్లు చారిత్రికదృష్టితోడనే కాక సాహిత్యదృష్టితోఁ జూచినను నిది ద్వితీయానువాద మైనను నద్వితీయమై యున్నది.

ధారాశుద్ధిలో, రచనరీతిలో, భావవిన్యాసములలోఁ, బాండితీస్ఫోరక ప్రౌఢప్రయోగములలో నీప్రబంధము పూర్వప్రబంధములను బుణికి పుచ్చుకొన్నది. సమాసబంధుర మైనప్రసన్నసంస్కృతభాషావిశేషములతో, ముచ్చటఁ గూర్చు నచ్చతెలుఁగుపలుకులపొంకము మెచ్చుఁ గొల్పు చున్నది. కావ్యకర్త లిరువురు నిరాఘాటకవనధారాపారీణు లగుటచే నిది "సానఁ దీటినజాతిరత్నము" వలె నొప్పు చున్నది.

శ్రీకప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారు, గురుకులక్లిష్టులై, యనవద్య మగు సంస్కృతసాహిత్యవిద్య నార్జించుటయేకాక, యాంధ్రభాషా-సాహిత్యసంప్రదాయ సంప్రవిష్టు లగుటచేత, నీకృతి వారియుభయభాషావైదుష్యమునకుఁ బతాకగా నున్నది. వా రుభయభాష కవులే కాదు - అష్టభాషావిశారదులు (హిందీ, ఉర్దూ, మహారాష్ట్రము, తమిళము, కన్నడము, తెలుఁగు, సంస్కృతము ఇంగ్లీషు).

చారిత్రికకావ్యములు ప్రాయికముగా రసప్రమేయములు గావు. అయినను బిల్హణకవి రసబంధురముగా నీకావ్యము నిర్మించినాఁడు అనువాదమున నిది మూలముకన్న రసస్నిగ్ధమై పఠితలను దన్మయత్వముఁ జెందించు చున్నది.

## ప్రౌఢపదప్రయోగములు -

ఈనాఁడు, పద్యకావ్యములు వెలువడినవి. మహాకావ్యములు వెలువడినవి. కాని, యీకృతియందు వానియన్నింటిలో లేనివిశిష్టత యొకటి గలదు. అది పదప్రయోగపాండిత్యము - ఇం దన్నింటిని వివరించుటకు వీలు లేదు. రెండుమూ డుదాహరణముల నిచ్చు చున్నాను.

విగూర్వణము (1–107)

సంస్కృతమున "గుర్వీ - ఉద్యమనే" అన్నధాతువునుండి "విగూర్వణము" అనుశబ్ద మేర్పడు చున్నది – 'అతిశయించుట లేక విజృంభించుట' యని దీని కర్థము. కాని తెలుఁగుభాషలో నిది, 'విగుర్వించు, విగుర్వణ' యను రూపముతోఁ బ్రయుక్త మైనది–

నన్నయ– 'విగుర్వింపుము చూత మనిన గోత్రభిదుండున్'. ఆది. 7–274.
నన్నెచోడుఁడు– 'తలతల మని విగుర్వించి' – 2–189.
'పటుదోర్బలగర్వవిగుర్వణంబునన్' – 8–28.
యథావాక్కుల అన్నమయ్య – 'రైక్యాలి న్విగుర్వించి' – 16 ప.

ఇట్లు మహాకవులు 'విగుర్వణము'–అని హ్రస్వద్వితీయముగాఁ బ్రయోగించుటచే నీపదము వివాదముల కాస్పద మైనది. ఇది తత్సమపద మని – తెలుఁగుకవుల ప్రయోగములవలన – ముష్టాముష్టి మొద లగువానివలె సాధు వైన దని నిర్ణయించితిని[1]

క్రీ. శ. 13వ శతాబ్దినుండి కవు లెవ్వరును వాడనియీవిగూర్వణపద మిందు సరిగా వాడఁ బడుట యెంతయుఁ బ్రశంసనీయము.

'నభఆభోగ' (6–69)
'యశయావళి' (7–6).

నభశ్శబ్దము – యశశ్శబ్దము సంస్కృతమున సాంతపదములు – 'నభ – ఆభోగము' అని సంధి చేయక ప్రయోగించుట ప్రాచీనరీతి – నన్నెచోడకవి యిట్లే – 'జాతవేదఆహ్వానంబు' (2–16) అని ప్రయోగించినాఁడు –
'యశయావళి' – యశశ్శబ్దము సాంత మైనను దెలుఁగుకవులు దీనిని అదంతముగా వాడినారు –

ఎఱ్ఱనభారతములో

"సమ్యగ్యశశాలి"[2] యని ఆరణ్య – 6–92లోఁ బ్రయోగించినాఁడు.

యశశ్శబ్దముసాంత మగుటచే పదాంతసకారమునకు రుత్వము వచ్చి దానికి యాదేశము వికల్పముగా వచ్చును. కనుక 'యశఆవళి' లేక 'యశయావళి' అని రెండురూపములును సాధువులు. కనుక 'యశయావళి' యిట విశిష్టప్రయోగము.

1. ఈ శబ్దమును గూర్చిన సంపూర్ణవివరణము శబ్దరత్నాకరము – అనుబంధము. సవరణలు – వివరణలు – పుటల 858–860. లోఁ గలదు.

2. శబ్దరత్నాకరానుబంధము – పుట 34.



'నిర్గహనము–(6–79) 'నిర్గహముఁడు' (6–92) అనుపదము లపూర్వములు. 'నిర్గహనము' అనఁగాఁ 'గ్లేశము లేనిది' అని యర్థము. ఇది కేవలము నైఘంటిక మైనను – నిందుఁ బ్రయోగింపఁ బడుటచేఁ బ్రచారములోనికి రావచ్చును

ఇంకను "హైమన" = 'హిమసంబంధ మైనది' మున్నగువిశిష్టప్రయోగము లిందుఁ గలవు.

ఈనాఁడు శబ్దమునుగూర్చినవిచారణ లేకపోవుటచేతఁ బ్రత్యేకముగా నిందుఁ గొంచెము సూచింప వలసి వచ్చినది[1].

వ ర్ణ న లు

ఇందలిగ్రీష్మ – హేమంతఋతువర్ణనలను జూచినఁ గావ్యకర్తలకవితాకౌశల్యము తేటపడఁ గలదు. వాని నన్నింటిని మించినది.

కా శ్మీ ర వ ర్ణ న

ఇంతవఱకు, "అంగ – వంగ – కళింగ – కాశ్మీర"[2] అని బడబడశబ్దధోరణితో "నేకరువు పెట్టుటే" కాని మనసాహిత్యమునఁ బ్రసిద్ధ మైనకాశ్మీరదేశమునుగూర్చి వివరములు మన మెఱుఁగము. కాశ్మీరదేశవర్ణన విక్రమాంకదేవచరిత్రములోఁ జివరిసర్గమునం దున్నది. భూలోకనందన మని పొగడ్త నందిన యాదేశపువర్ణనమిం దద్భుతముగాఁ బ్రపంచింపఁ బడినది. ఈకావ్యము మూలము నందలి కాశ్మీరదేశవిశిష్టతను దెలుఁగువారికిఁ బరిచితముఁ జేసినందులకు ననువాదకర్తలెంతయేని నభినందనీయులు.

తిరుపతి – వేంకటకవులలోఁ దిరుపతిశాస్త్రిగారు ముందే కీర్తిశేషు లైనను, చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు–తిరుపతి–వేంకటకవు లనుపేరితో నే ప్రచురించినట్లుగా, నేఁడీకావ్యమును కీ. శే. విశ్వనాథరావుగారి పేరితోఁగూడఁ బ్రకటించుట యెంతయు నంస్తవనీయ మై శ్రీలక్ష్మణశాస్త్రిగారి "సహృదయత్వము – సౌమనస్యము" వెల్లడిసేయు చున్నవి.

శ్రీనాథుఁడు శ్రీహర్షునినైషధీయచరిత్రను 'శృంగారనైషధము'–అనుపేర–బంగారుమెఱుఁగులు పెట్టి మూలము నతిశయించునట్లు చేసినరీతిగా, నేఁడు, శ్రీలక్ష్మణశాస్త్రిగారు, కీ. శే. శ్రీవిశ్వనాథరావుగారును బిల్హణునివిక్రమాంకదేవచరిత్రము నాంధ్రీకరించి, మూలాతిశాయిగా దానిని దెలుఁగున సువర్ణమయాలంకారముగా నొనర్చినారు– అందువలననే వారికి–

1. నేను శబ్దరత్నాకరమును 40 వేలపదములతోఁ దిరిగి సంస్కరణప్రతిఁ దయారు చేసినాను – అం దీపదములను గ్రహించినాను.

2. పానుగంటివారి 'విమర్శాదర్శ'. తృతీయభాగము.

## "ఆంధ్ర బిల్హణ"

ఈబిరుదము సార్థక మైనది. తెలుఁగుసాహిత్యమున 'అభినవదండి' - 'ఆంధ్రకాళిదాసు' నామములవలె- ఈ నామము శ్రీలక్ష్మణశాస్త్రి - విశ్వనాథరావుగారల యందు లక్షణవంత మై వెలయుఁ గాక.

విశ్వవిద్యాలయములలోఁ బాశ్చాత్యవిమర్శనపద్ధతిమూలమునఁ బ్రాచీన ప్రబంధసాహిత్యాధ్యయనము, ప్రబంధపఠనాభినివేశము ప్రాయికముగా నంతరించు చున్నది. ఈసందర్భమునఁ బ్రఖ్యాతభాషావేత్తలు, ప్రాచీనసాహితీవిమర్శకులు నైనశ్రీతిరుమల రామచంద్రగారు లొకపర్యాయ మొక[1]సదస్సులోఁ జెప్పినమాటల నుదాహరించుట యావశ్యకము.

తెలుఁగు - కన్నడలిపులసమ్మేళనమునుగూర్చి వారు ప్రసంగించుచు నిట్లు చెప్పినారు:-

"ఈనాఁటికే ప్రాచీనకావ్యాధ్యయనము, శబ్దార్థవిచారణ, సాహితీవిమర్శన మున్నగునవి లుప్తము లగుచున్నవి. మహితసాహిత్యజీవి శ్రీమానవల్లి రామకృష్ణ కవిగారన్నట్లు "ఇంకఁ గొన్నాళ్ళకుఁ దెలుఁగుపద్య మర్థము కాకుండఁ బోవునేమో నండీ" అన్నది వాస్తవ మగుచున్నది" - ప్రస్తుతస్థితి ఇదే-

వేయేండ్లనుండి యవిచ్ఛిన్నధారాప్రవాహ మై ఆంధ్రసాహిత్యసౌధమునకు మూలస్తంభాయమాన మైనప్రాచీనప్రబంధసాహిత్యాధ్యయనమును బునరుజ్జీవింపఁ జేయ వలసినసమయము తటస్థించినది. అట్టిపునరుజ్జీవనమునకు నేఁడు వెలువడిన "విక్రమాంకదేవచరిత్రప్రబంధము" ఎంతయేని దోహదము చేయఁ గలదు. ఆంధ్రవిద్వల్లోకము దీనిపై సమీక్షలను వెలయించి, ప్రాచీనప్రబంధాధ్యయనమును బ్రోత్సహింతురుగాక. ఈకావ్య మాంధ్రసాహిత్యప్రపంచమునఁ బ్రచురప్రచారముఁ బడయుఁగాత!

ఇట్లు

నిడుదవోలు వేంకటరావు

లక్ష్మీకాంతనిలయం
2-2-1137/5, క్రొత్తనల్లకుంట,
హైదరాబాదు - 500044.
10-9-1974.

1. తెలుగులిపిసంస్కరణసదస్సు - హైదరాబాదు - 1972.

## 'ఆంధ్ర బిల్హణ' బిరుద ప్రదానము

శ్రీః

శ్రీనివాస పరబ్రహ్మణే నమః

శ్రీమత్కవితల్లజేభ్యః శ్రీవనపర్తిసంస్థానవిద్వదగ్రేసరేభ్యః ఏతత్కలాశాలాప్రాచీనవిద్యార్థిభ్యః బ్రహ్మశ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిమహోదయేభ్యః, తత్సోదరకవితల్లజేభ్యః తన్మిత్రవర్యేభ్యః శ్రీమాదిరాజు విశ్వనాథరావుమహాశయేభ్యశ్చ శ్రీవేఙ్కటేశ్వరసంస్కృతకలాశాలాప్రాచీనవిద్యార్థిసమిత్యా సాదరప్రేమానుబద్ధం సమర్పితమిదం సన్మానపత్రం.

మహాశయాః!

ప్రౌఢరమణీయపదబన్ధం రసబద్ధం సకలసహృదయహృదయాఽఽహ్లాదకం సముద్దణ్డకవితల్లజ-శ్రీమద్బిల్హణకవివరప్రణీతం శ్రీచాళుక్యనవసాహసాఙ్కవిక్రమాదిత్యనృపతికులతిలకచరితం విశుద్ధాఽఽన్ధ్రభాషాయాం మూలాన్యూనరసభావాలఙ్కారాఽఽది-పరికర-పరికర్మితం పద్యప్రబన్ధమారచితవద్భ్యాం భవద్భ్యాం ప్రౌఢిమానం తత్తాదృశం భావగామ్భీర్యం చాఽవలోక్య ప్రముదితాన్తరఙ్గై రస్మాభిః సమితిసదస్యైః భవద్భ్యః 'ఆన్ధ్ర బిల్హణ' బిరుదం సాదరప్రేమానుబన్ధం సమర్ప్యతే. శ్రీ వృషభాద్రిశేఖరమణిః కమలాజానిః నిరన్తరమాయురారోగ్యైశ్వర్యాఽఽదికం ప్రకల్పయతు నితరాం భవద్భ్య ఇతి నిసర్గసమ్యఞ్చి కవికులాని చ నిత్యం రఞ్జయన్త్వితి చ మఙ్గళాన్యాశాస్మహే.

శ్లో॥ శ్రీమాన్ వేఙ్కటశైలశేఖరమణిః కారుణ్యవారాంనిధిః
శ్రీవిద్యుల్లలితః సువర్ణకలికాసాన్ద్రేన్ద్రనీలద్యుతిః।
సంసారాఽఽతపశోషితాఽఽర్తిహరణః భక్తాబ్జకరప్రీణనః
శ్రీమల్లక్ష్మణ-విశ్వనాథసుకవీ చాఽఽకల్పమాకల్పతామ్॥

శ్లో॥ పూర్వం గ్రన్థసహస్రశాణకషణత్రుట్యుత్కలైః స్వైర్గిరామ్
ఉల్లాసైః ప్రణినాయ యాం రసకలాం శ్రీబిల్హణః సంస్కృతే।
శ్రీమల్లక్ష్మణ-విశ్వనాథసుకవీ తత్తాదృశౌ చక్రతుః
తాం చాళుక్యనృపాలవిక్రమకథాం దివ్యాఽఽన్ధ్రభాషామయీమ్॥

శ్లో॥ సర్వజ్ఞః సుమనోజ్ఞ బిల్హణకవిస్త్వాన్ధ్రావనీపణ్డితః
ఉద్దణ్డో నవసాహసాఙ్క-నృపతిశ్చాన్ధ్రావనీవల్లభః।
ఆసీద్ది దివ్యరసప్రకర్ష సుభగా సర్వార్థదా నిస్తులా
తత్సర్వం సువిచిన్త్య బిల్హణకవేర్వ్యాగాన్ధ్రభాషాఽభవత్॥

శ్లో॥ ఆసీద్ది సంస్కృత-దేశవాగ్విలసితా భాషాఽమలా రాజతే
శబ్దద్వన్ద్వమిదం మనోజ్ఞమధురం కర్తుం సుధీర్బిల్హణః।
శ్రీమల్లక్ష్మణ-విశ్వనాథకవిరాడ్రూపేణ విద్యోతతే
ఏతావాన్ధ్రసరస్వతీపతివరౌ శ్రీబిల్హణౌ రాజతామ్॥

శ్లో॥ రసభావాలఙ్కృతి-గుణపరిపాకాత్
రీతి-వృత్తిరమణీయైః।
లలితోచితసన్దర్భైరనుకురుతే
మూలమేవ సన్దర్భః॥

శ్లో॥ ఉద్దణ్డపణ్డితత్వప్రకర్షరమ్యౌ
గభీరసన్దర్భౌ।
అనుకుర్వాతే బిల్హణసుకవిం
సుకవీ మనోజ్ఞమన్త్రజ్ఞౌ॥

శ్లో॥ ఇతి తాదృశగుణగణసమ్మోదితైః
భ్రమరైరగాయి గుణగుమ్ఫః॥
'తిరుపతి' నగరీ-సంస్కృత-విద్యాఽఽలయ
లబ్ధవర్ణసత్తమైః॥

తిరుపతి సంస్కృతకలాశాలా
ప్రాచీనవిద్యార్థి సమితిః
శ్రీపదపురి 2-1-1944

ఇతి నివేదయితా

(తి-కు-వేం-న-సుదర్శనాచార్యః)
కార్యదర్శీ.

శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారియధ్యక్షతన జరిగినసన్మానసభయందు
నొసంగఁ బడినసన్మానపత్రము.

## శ్రీ వేంకటేశ్వరాంధ్ర సాహిత్యపరిషత్తు

తిరుపతి.

శ్రీ శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారికి
శ్రీ శ్రీ మాదిరాజు విశ్వనాథరావుగారికి
సమర్పించు సన్మానపత్రము

*సద్విద్యాభూష - లక్ష్మణశాస్త్రివర్యా!*

విద్యాలతలకు నాలవాల మైనశ్రీవేంకటేశ్వరసంస్కృతకళాశాలామ తల్లికిఁ గొంగుబంగారంబ వై కవితాపరిమళంబుల దశదిశల వెదఁజల్లఁ జాలు విద్యార్థిపారిజాతకుసుమంబవు. నిన్ను వేనోళ్లఁ గొనియాడు చుంటిమి.

*కవివతంసులార!*

యుష్మదాంధ్రీకృతవిక్రమాంకదేవచరిత్రము మీయపారపాండితీప్రతిభల దిగంతమ్ముల వ్యాపింపఁ జేసి మి మ్మనయంబుఁ బ్రోచుఁ గాత. మీకు సమర్పింపఁ బడిన 'ఆంధ్రబిల్హణ' బిరుదము, మీగ్రంథమును వినినమాకు ఎంతయో సమర్థ మని విశ్వసించు చున్నాము.

*అలంకార విద్యాప్రవీణులార!*

చదివినచదువుల జీర్ణింపఁ జేసికొని దేశభాషల నలంకరింపఁ జేయుప్రతిభా విచిత్రితచరిత్రల ననేకంబుల వ్రాసి యద్వితీయభాషావైదగ్ధ్యంబున రసమయం బగుకావ్యజగత్తును నిర్మించుకవిబ్రహ్మల రగుదురుగాక.

*ఉభయభాషాపాండితీవైదగ్ధ్యులార!*

సర్వగుణవిశిష్ట మ్మగుసంస్కృతాంధ్రసాహిత్యపాథోధిం దఱచి కథామృత

నవనీతం బుభయలోకంబుల కందిచ్చుసుమనసులరు సహృదయులరు రసజ్ఞులరు మాపురంబున కరుదెంచుట మాభాగ్యము.

*విమర్శకశిరోభూషణులార!*

దేశకాలంబుల నవలోకించి దేశసేవ, భాషాసేవ చేయుటకు నడుము కట్టి ముందంజ వేయుసాహసగుణంబు సర్వులమ్ములం గూర్చి మున్ముం దనేకకావ్య రత్నమ్ముల సేకరింపఁ బండితసంఘమ్ములు, రాజవంశమ్ములు మిమ్ము నాదరించి ప్రోత్సహించుఁగాత.

ఇట్లు

తిరుపతి
2-1-1944

(చేబోలు సుబ్రహ్మణ్యశర్మ)
కార్యదర్శి

# పండితాభిప్రాయములు

## విక్రమాంకదేవ చరిత్రము

**ఆచార్య బ్ర॥ శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు ఎం. ఏ.**

బిల్హణమహాకవిప్రణీత మగునీమహాకావ్య మింతవఱకు నెవ్వరును దెనిఁగించినవారు కారు. బ్రహ్మశ్రీ తిరుపతి-వెంకటేశ్వరకవులు వచనరూపమున ననువదించిరి అది పెక్కుఘట్టముల మూలానుసారి కాకున్నది. ఇప్పుడు వనపర్తి సంస్థానమున నివసించుబ్రహ్మశ్రీ లక్ష్మణశాస్త్రియు, మ॥రా॥రా॥శ్రీ శాఖాపురము విశ్వనాథరాయాహ్వయుఁడును గలిసి దానిఁ బద్యరూపమున యథామూలముగాఁ దెనిఁగించుట భాషకుఁ బరమోపకారము చేసినట్లే. వీరి పద్యకావ్యములోఁ జాలభాగము మూలముతోఁ బోల్చి చదివినాఁడను. అర్థగాంభీర్యము, భావరసవిశేషములు, చరిత్రాంశములు చెడిపోక రసవంతముగా వీరు దీని రచించి రనుట నిస్సంశయము. అనేకపద్యములు సంస్కృతమునుండి యనువాదము లని తోఁచక యిది మూలగ్రంథమువలెనే కవితాప్రౌఢిమ వహించి విలసిల్లుచున్నది. ఇట్టిరచన చాలదుర్ఘటము. భావికాలమున నింకను రసవత్తరము లగుసంస్కృతకావ్యములఁ దెనిఁగించియైనను నూతనముగా నాంధ్రమున నిర్మించియైనను వీరు శాశ్వతకీర్తిఁ గాంచుచు భాషామహాసేవ సేయుటకుఁ దగినకవితాశక్తి వీరిలోఁ గల దని యీగ్రంథ ముద్ఘోషించుచున్నది. ఇట్టి గ్రంథమును బలువు రాదరించి ప్రచురింపఁ జేయుదురుగాక యని నాప్రార్థనము. వీరలకు సర్వేశ్వరుఁడు కీర్త్యాయురారోగ్యము లొసంగి వీరిజన్మజీవితములు లోకమున కుపకరించునట్లు సార్థకము సేయుఁగాక యని వేఁడుచున్నాను.

తిరుపతి
22-1-1948

కళాప్రపూర్ణ
బ్ర॥ శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు

వనపర్తి సంస్థానవాస్తవ్యులు శ్రీ విశ్వనాథరావుగారు, శ్రీ లక్ష్మణశాస్త్రిగారు- వారు స్వయముగఁ దెలిఁగించినగ్రంథమును, విక్రమాంకదేవచరిత్రమును, హృద్యముగాఁ జదివి వినిపింపఁగా విని తనిసితిని. మహాకవి బిల్హణుఁడు, చాళుక్యవిక్రమాంకదేవునాస్థానమున నెలకొని నేఁటికించుమించు వేయియేండ్లకు ముందు, తుంగభద్రా - కృష్ణాతీరాంధ్రదేశపుఁ బాఁడిపంటల ననుభవించి వెలయించిన మహాకావ్యమును, నానాఁటి యాంధ్రదేశచరిత్రాత్మకము, నగువిక్రమాంకదేవచరిత్రమును వీరు పద్యరూపమునఁ బరివర్తింపఁ బూనుచే మిక్కిలి కొనియాడఁ దగినది. బిల్హణరచనము ప్రాయికముగా వర్ణనాత్మకము, శబ్దాడంబరప్రధానము- కాళిదాసాదులరచనలవలెఁ బ్రతిపదరసస్యంది గాదు. అట్టిదానిని దెనిఁగించుట కష్టసాధ్యము- అయినను నిర్దుష్టమగుభాషతో శయ్యాసారళ్యముతో వీరీగ్రంథమును దెలిఁగించిరి. వడిగా దీనిని వీరు ప్రకటింతురుగా కని కోరుచున్నాను. ఆంధ్రు లభిమానింపవలసినగ్రంథ మిది.

తిరుపతి
22-1-1948

వేటూరి ప్రభాకరశాస్త్రి

---

కళాప్రపూర్ణ-కావ్యస్మృతితీర్థ-అభినవాంధ్ర వాల్మీకి
బ్ర॥ శ్రీ జనమంచి శేషాద్రిశర్మగారు

బ్రాహ్మ్యరాజ్యోభయశ్రీవిరాజమానులు వనపర్తిసంస్థానవిద్వాంసులు సాహిత్యశిరోమణి కప్పగంతుల లక్ష్మణశాస్త్రులుగారును మాదిరాజు విశ్వనాథరావుగారును గలిసి విక్రమాంకదేవచరితము మహాకవి బిల్హణకవికృతము నాంధ్రీకరించిరి, ఇది పదునెనిమిదిసర్గములు గలప్రౌఢకావ్యము. ఈయాంధ్రకృతి కవిద్వయముముఖమునఁ జెక్కుటావుల వినుభాగ్యము నాకుఁ గల్గినది, వీరి కవితాధార హిమవన్నగశృంగనిస్సరన్మందాకినీప్రవాహమువలెఁ బరమపావనమై యలరారుచున్నది. సంస్కృతాంధ్రములు రెండును సమానముగ నీకావ్యమున వెలయుచున్నవి. కవిత్వము సహజగాంభీర్యముఁ గలిగి వెలయుచున్నది. ఈకాలమున నిట్టికవిత యున్నదే యని యచ్చెరువు నొందుచున్నాను. ఈకృతి యాంధ్రదేశమునందు వ్యాపించి యీకవుల నిర్మలయశశ్చంద్రికల వెదఁజల్లుఁ గాత మని వారక కోరుచున్నాను. వీ రింకను నిట్టియుత్కృష్టగ్రంథముల వ్రాసి త్రిలింగదేశవిఖ్యాతినిఁ జెంపొందింతురుగాత మనియు, సర్వేశ్వరుఁడు వీరి కాయురారోగ్యభాగ్యముల నొసంగుఁగాత మనియు నాశీర్వదించుచున్నాను. భావకవులకు గుండెగాలముగా నున్న యీమహాకావ్యము ప్రాచీనకవులఁ దలపింపఁ జేయుచు నిల నాచంద్రతారార్కము వెలయుచుండుఁగాత.

శ్రీ లలితావిలాసము
కడప
16-1-1948

జనమంచి శేషాద్రిశర్మ

---



శ్రీ మన్మహామహోపాధ్యాయ-కళాప్రపూర్ణ-కవిసార్వభౌమ-కవిరాజ-ఆంధ్రవ్యాస-
అభినవ శ్రీనాథ-వేదవిద్యావిశారద
బ్ర॥ శ్రీ॥ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు

ఇది సంస్కృతభాషలోఁ బ్రసిద్ధిం గాంచిన బిల్హణకవి రచించినమహాకావ్యము. ఈకావ్యమును నైజామురాష్ట్రమందలి వనపర్తిమహారాజావారి సంస్థానమందుఁ బండితులై యున్న శ్రీ కప్పగంతుల-లక్ష్మణశాస్త్రిగారు, శ్రీ మాదిరాజు-విశ్వనాథరావుగారు ననుకవు లిద్దఱుం గలిసి యాంధ్రీకరించి యున్నారు. లక్ష్మణశాస్త్రిగారు బహుభాషాప్రవీణులు, పండితులు, కావ్యనాటకాలంకార సాహిత్యము, వ్యాకరణములం జదివి యున్నారు. విశ్వనాథరావుగారు సంస్కృతాంధ్రసాహిత్యములేకాక బహుభాషాపండితులై కొన్నికొన్ని లలిత కళలయందు నేర్పరులై కొనియాడఁ బడుచున్నవారు. అట్టివా రిర్వురుంగలిసి దీనికిఁ గర్తలైరి.

ఈ యాంధ్రానువాదమును నేను చాలభాగము విని యున్నాఁడను. అక్కడక్కడ సందేహములు కలిగినపట్టున మూలముతోఁ బోల్చి చూచి యున్నాఁడను. ఈయనువాదము మూలమునకు సరిగా నున్నది, ఇందు ధారాశుద్ధి చక్కనిది. గ్రంథము గంగానదివలెఁ బ్రవహించుచుండును. కొన్నిఘట్టములు అచ్చతెనుఁగుపద్యములు గలిగి యున్నవి. గ్రంథము శ్లిష్టార్థసంఘటితము

గాదు. ఇందలిసంస్కృతసమాసములు సరసములుగాను మనోహరములుగాను నుండును. బిల్హణునిసంస్కృతకవిత్వ మెంతమనోహరమో వీరితెలుఁగుకవిత్వము నట్లు మనోహరముగా నున్నది. ఈతెలుఁగుగ్రంథమును వినునప్పుడు నాకుఁ గృష్ణదేవమహారాజకృతవిష్ణుచిత్తీయము జ్ఞప్తికి వచ్చినది.

వీరియీకవిత్వము నిర్దుష్ట మై పూర్వకవిమార్గమునకు లవమాత్ర మైనను దొలంగి యుండ లేదు. ఇది బి. ఏ., ఎం. ఏ. పరీక్షలకుఁ బఠనీయగ్రంథ మైనచో విద్యార్థు లెంతయో వివేకవంతు లై విజ్ఞానముం గలిగి యుందు రని నా నమ్మకము.

వీ రీగ్రంథమును మక్కికిమక్కిగాఁ దెనిఁగింపక అక్కడక్కడ వీరిమార్గము లిందుఁ జక్కగాఁ బొందుపఱిచినారు.

ఇది సర్వజనగ్రాహ్య మై సర్వోన్నతిం బొందుఁగాక యనియుఁ గర్త లైనవా రిద్దఱు నిట్టిమహాగ్రంథములు మఱికొన్ని వ్రాసి యాంధ్రభారతి నలంకరింతురుగాక యనిఁ గోరుచున్నాను.

రాజమండ్రి
30-6-1943

---

తింకపీంద్రఘటాపంచానన-కళాప్రపూర్ణ-శతావధాని-
# బ్ర॥ శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు
(తిరుపతి-వేంకటకవులలో నొకరు)

పై నుదాహరించినబిల్హణమహాకవివిరచిత మైనకావ్యమును వనపర్తి నివాసులు, శ్రీయుత మాదిరాజు విశ్వనాథరావుగారు, కప్పగంతుల లక్ష్మణ శాస్త్రిగారు, వీరుభయులును జంటకవులుగా నుండి యాంధ్రీకరించిరి. కొన్ని ఘట్టములు కేవలాంధ్రముగా నుండునట్లుకూడ ననువదించిరి. అనువాద మైనను స్వతంత్రరచనముగా నున్నయది

ఉ॥ వ్యాకరణమ్మునం గలుగువ్రజ్ఞయు సాహితియందు నుండును
శ్రీకళ తక్కుఁగల్గినవిశేషము వీరికవిత్వమందు విం
దై కనుపట్టుచున్నవి మహాకవు లంటకుఁ దగ్గ వీరు స
ద్దీకులు సర్వథా యశముఁ దేకువయున్ గణియంత్రుగావుతన్.

---



అందఱకును వ్రాయుమాటలు-'ధార ధారాళముగా నున్నది'-లోనైనవి వ్రాయవలసినకవిత్వము వీరిది కా దని కవితామర్మజ్ఞులు తెలిసికోఁ గల రని నాదృఢ మైననమ్మిక. విద్యాశాఖవా రీయనువాదమును దప్పక యాదరించి వీరికిఁ దోడ్పడుదు రనియు నాయాశయము. వీరిని భగవంతుఁడు సర్వదా శ్రేయఃప్రదుఁ డై యనుగ్రహించుఁగాక.

క్షీరసాగర బిల్డింగ్సు
బెజవాడ
2-6-1943

---

కళాప్రపూర్ణ
# బ్ర॥ శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు

సంస్కృతమున బిల్హణమహాకవి రచియించినవిక్రమాంకదేవచరిత్ర యనుమహాకావ్యమును వనపర్తిసంస్థానపండితు లైన బ్రహ్మశ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారు మాదిరాజు విశ్వనాథరావుగారు ననుమహాకవు లిద్దరు పద్యకావ్యముగఁ దెనిఁగించిరి. ఆగ్రంథమందలికొన్నిభాగములు నేను వింటిని. ఇది సలక్షణ మై శ్రావ్య మైనభాషతో రచియింపఁ బడినది. కవిత్వము మృదు వై మనోహరముగా నున్నది. ఈ గ్రంథము శ్లాఘాపాత్రముగా నున్నది. ఈగ్రంథము మూలము ననుసరించి యెంతో నేర్పుతో వ్రాయఁ బడినది.

కాకరపఱ్ఱు
తణుకుతాలూకా
30-5-1943

---

కళాప్రపూర్ణ
# ఆచార్య బ్ర॥ శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు

శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారును శ్రీమదిరాజు విశ్వనాథరావు గారును గలిసి రచియించినవిక్రమాంకచరితమును జదివి యానందించినాను. భాషయుఁ గవితాశైలియు మనోహరములు. ఈగ్రంథము పాఠకులహృదయ మాకర్షించు చున్నది. ఈకృతి ముద్రిత మై యాంధ్రవాణి కొకయలంకార మగుఁగాక.

అవధాని శిరోమణి–మహోపాధ్యాయ–కళాప్రపూర్ణ

### మధ్వ శ్రీ కాశీకృష్ణాచార్యులుగారు

క॥ సమలక్షణ వై శివిపో,
సమలక్షణవిశ్వనాథసంభవ వగుటన్;
విమలం బగునీవృత్తము
సమ మగుఁ బూర్వకవివృత్తసరణికి ధరణిన్.

క॥ నవకవు లొకరిద్దరు నిన్
జవి చూడక యున్న నీప్రశస్తతఁ దలపై
న వహించెదుకవిసారస
భవు లుండక పోవ రోప్రబంధమ! యెపుడేన్.

ఉ॥ భాసురవాక్చమత్కృతి, సుధావసమంచితఁ, జిత్రపాదవి
న్యాసవిలాసఁ, బ్రౌఢకవితాంగనఁ, గుత్తుకఁ గట్టికొట్టి రిం
తాసయె! "శాస్త్రసమ్మత మె యయ్యెది"! యం చనరాదు; శారదా
శాసన ముంట దాని నవశాస్త్ర మనం గల రెవ్వ రొకవుల్ !

గుంటూరు
4-6-1943

---

### ఆచార్య సర్ కట్టమంచి రామలింగారెడ్డిగారు కే. టి. (ఆనర్స్) డి. లిట్.

శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారును మాదిరాజు విశ్వనాథరావు గారును గలిసి ప్రబంధరూపేణ తెనిఁగించిన-బిల్హణకృత - విక్రమాంకదేవచరిత్ర మును శ్రీశాస్త్రిగారు చదువఁగా విని ఆనందించితిని. ఇదివరలో విక్రమాంక దేవ చరిత్రము పద్యరూపమున ఆంధ్రములో నవతరించి యుండ లేదు. ఈలోప మీకవులకృషిచేఁ బూరిత మైనది.

వీరి ఆంధ్రీకరణము నిర్దుష్ట మైనమంచిశైలిలోఁ జేయఁ బడి యున్నది. ఈ కవులు ఉభయభాషాప్రవీణు లగుటవలన, ఆచ్ఛికమునను, తత్సమమునను రెంటను మనోహరముగ వ్రాయుట సంభవించినది. ఇది సర్వవిధములఁ బ్రశస్త మైనగ్రంథము. అందఱుఁ జదువఁ దగినది.

చిత్తూరు
4-1-1944



కళాప్రపూర్ణ

### ఆచార్య డా॥ చిలుకూరు నారాయణరావుగారు, ఎం. ఏ., పి. హెచ్-డి.

వనపర్తి సంస్థానవిద్వత్కవీంద్రులు బ్రహ్మశ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి, మాదిరాజు విశ్వనాథరావులచే రచితమయిన విక్రమాంకదేవచరితకృతిని వినుభాగ్యము నాకుఁ గలిగినది. ఈకావ్యము ప్రబంధకవితకు లక్ష్యప్రాయముగ నున్నది కావ్యబంధము చక్కఁగఁ గుదిరినది. అనర్గళధారాశోభిత మై ఔచితీ బంధుర మై యొప్పునీకావ్య మాంధ్రభారతీకంఠహారమున నొకయమూల్య రత్న మై వెలుఁగొందుఁగాక. ఇప్పటిఖండకావ్యయుగమున నిట్టియఖండకావ్య ములు పొడచూపుట ఆంధ్రకావ్యసంప్రదాయపునఃస్మరణమునకుఁ దోడ్పడి, యానందహేతు వై యొప్పు ననుటకు సందేహము లేదు. కృతికర్తలకు నామనఃపూర్వకాభివందనము లర్పించు చున్నాను.

అనంతపురము
31-8-1946

---

### ఆచార్య శ్రీమాన్ కొమాండూరు కృష్ణమాచార్యులుగారు, ఎం. ఏ.

బ్ర॥ శ్రీ సాహిత్యశిరోమణి కప్పగంతుల లక్ష్మణశాస్త్రులుగారు, మాదిరాజు విశ్వనాథరావుగారును గలిసి రచించినయాంధ్రవిక్రమాంకదేవచరిత్రమును గవిపుంగవులముఖమున విని యానందించితిని. విద్వత్కవిత్వము గౌరవపడిన యీకాలమున నిట్టిరచనలు పండితహృదయాహ్లాదకరము లనఁ దగును. కావ్యశ్రవణోత్తరకాలమున నాకుఁ గలిగినయానందము నీక్రిందిపద్యములలో గ్రంథకర్తలకు వెలిపుచ్చి కృతార్థుఁడ నగు చున్నాను.

మ॥ కవితారీతులఁ గాంచి మెచ్చితి; భవత్కావ్యంబు విద్వజ్జన
స్తవనీయం బగు; విక్రమాంకుకథ భాషాకావ్యముం జేయఁగాఁ
గవు లెవ్వారుఁ దలంప రింతకు; వియద్గంగాప్రవాహంబుతో
సవతై మించెను వాగ్విలాసము రసోత్సారప్రకర్షంబుగన్ ॥

క॥ రచియించె సంస్కృతంబున
రుచి పుట్టఁగ బిల్హణుండు రుచిరపుఫణితిన్
రచియించినారు విస్సన
సచివాగ్రణి 'లక్ష్మణార్యశాస్త్రి' తెనుఁగునన్,

గీ॥ రససుధావర్షి యైనగీర్వాణఫణితి
తేనె చిప్పిలుతెనుఁగులతీపిపలుకు
నుభయకవిమిత్రులం దింత యొప్పు చున్కిఁ
దలఁప నూహింప మదికి సంతసము వొడమె॥

క॥ భాసలకైతలు సంస్కృత
వాసనలం గలిసి కావ్యబద్ధము లై భా
షాసతికిఁ గ్రొత్తసొబఁగుల
వేసము లొడఁగూర్చె మీకవిత్వపుఁదెఱఁగుల్॥

గీ॥ మూలమున నొప్పు చుండునమూల్యభావ
సరణి వర్ణనములలోన సడలకుండ
సరసరీతుల ముత్తెంపుసరులఁ బోలఁ
గూర్చినారలు సుకవులగుండె లదుర

గుంటూరు
24-1-1974

---

సహజ విద్వత్కవితా విశారద
బ్ర॥ శ్రీ అనుముల వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు

విక్రమాంకదేవచరిత్ర మనునీకావ్యము సంస్కృతమున బిల్హణుఁ డను ప్రసిద్ధకవిచే రచింపఁ బడినది. ఈమహాకవిచరిత్ర మనుపేరఁ గొన్నిపుక్కిటి పురాణముల నాశ్రయించి రచింపఁ బడినబిల్హణీయ మనునాంధ్రకావ్య మొకటి చిరకాలముక్రిందటినుండి మనదేశమున వాడుకలో నున్నది. ఇంతేకాని యాంధ్రులలోఁ బెక్కండ్ర కీయనకావ్యరసాఽస్వాదభాగ్యము నేఁటివఱకును లభించినది గాదు.



ఈమహాకవి కాశ్మీరదేశసంభవుఁ డైనను నేతత్కథానాయకుఁ డగువిక్రమాదిత్యబిరుదాంచితుఁ డైన విక్రమాంకదేవచక్రవర్తి క్రీ. శ. 11 వ శతాబ్ది మధ్యమునఁ బశ్చిమాంధ్ర-కర్నాట-మహారాష్ట్రములఁ బాలించినపశ్చిమచాళుక్య వంశజుఁ డగురా జగుటచే నాంధ్రుల కీచరిత్రముతోఁ గొంతసంబంధముగూడ నున్నది.

ఈయుదాత్తకావ్యమును నేఁటికి మామిత్రులు విశ్వనాథరావుగారు, కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారును సలక్షణ మైనచక్కనిశైలిలో నాంధ్రీకరించి యాంధ్రులకృతజ్ఞతకుఁ బాత్రు లైరి.

సంప్రదాయశుద్ధ మైనప్రయోగకౌశలము వెలయుతెలుఁగునుడికారమునకు గోరంతయుఁ గొఱంత రానివిధమున వీరు రచించిన యీయాంధ్రానువాదకావ్యము స్వతంత్రకృతియో యనునంతమనోజ్ఞముగా నున్నది.

పరమేశ్వరుఁడు వీరికిఁ జిరాయురారోగ్యభాగ్యములు ప్రసాదించి యేతాదృశకృతిరత్నరచనమునకు నిరంతరముఁ బ్రోత్సహించు చుండుఁగాతమని నాప్రార్థన.

కర్నూలు
3-1-1944

---

అవధాని పంచానన-కవిసింహ-కావ్యకళానిధి
బ్ర॥ శ్రీ డి. రాజశేఖరశతావధానిగారు

చ. మణులును స్వర్ణమున్ గలిపి మంచినగన్ రచియించినట్లు బి
ల్హణకవి విక్రమాంకవసుధాఽధిపుసచ్చరితన్ రచించె; నా
గుణనిధికావ్య మిప్డు తెలుఁగున్ బొనరించిన'విశ్వనాథ-ల
క్ష్మణ'కవులార! సర్వబుధసన్నుతి గుత్తకుఁ గొంటి రెంతయున్.

శా. అన్నా! లక్ష్మణ! విశ్వనాథ! భవదీయం బైన పాండిత్యమున్
విన్నాణంబు కవిత్వవైభవము మున్ విన్నంత కిన్నాళునున్
మున్నూఱంతలుగా నెసంగి కుతుకంబున్ బెంచె! ముద్రించి మా
కెన్నం డిత్తురొ విక్రమాంకచరితం బెల్లప్డు వీక్షింపఁగన్.

మ. ఒకచో దీర్ఘసమాసముల్ నడువఁగా నొండొక్కచో నచ్చతె
ల్గొకచోఁ గోమలసంస్కృతాంధ్రగతితో నొప్పారి మీశైలి, మా
తృక పీఠింపనివారి కందలిరసోదీర్ణప్రభావప్రథల్
సకలంబున్ విశదంబు చేయు ననుటల్ సత్యంబు ముమ్మాటికిన్.

మ. వదునార్వందలపెద్దసంస్కృతపుఁగావ్యం బెత్తి యాంధ్రంబునన్
గొదవల్ చొప్పడ నీక దొడ్డకృతిగాఁ గూర్పంగ సామాన్యమే!
అది మీయిర్వుర కబ్బె మిత్రమణులారా! నాదుప్రేమాంజలిన్
ముద మారన్ గొని దేశమెల్లడ యశంబున్ బెంచి శోభిల్లుఁడీ!

ప్రొద్దుటూరు
6-1-1944

శ్రీ రాజశేఖర శతావధాని

---

విద్వత్కవి

బ్ర॥ శ్రీ మేడవరం రామబ్రహ్మశాస్త్రిగారు

సంస్కృతాంధ్రసాహిత్యపరిశ్రమమునం దుల్లాదరంబు లేమి నెగుడు దిగు డై స్వప్రతిభ మందీభవించుట నెఱుంగక యులుసుపోకమాత్రమ ఫలితం బుగాఁ గావ్యరచనంబునకుం గడంగుకొందఱుకవులయం దప్రౌఢియుఁ గొందఱయం దతిప్రౌఢియుఁ గాన నై సహృదయహృదయాందోలనముం గూర్ప వికృత మై సన్నగిలినయాంధ్రకవితాసామ్రాజ్యముకొఱంతఁ దీర్ప సంస్కృతవాఙ్మయమునందలికావ్యసంపద నుచితగతి నాంధ్రభారతికిం గూర్చు తలంపు మిక్కిలి వినుతిపాత్రము. ఈయాచారము నేఁటిదేకాక శ్రీనాథాదిమహాకవులకును బ్రహతమార్గమే.

నేఁడు వనపర్తిసంస్థానవిద్వాంసు లై యుభయభాషాపండితశిరోమణు లైన, శ్రీ, కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారును, శ్రీమాదిరాజు విశ్వనాథకవి వర్యులును ప్రాచీనసంస్కృతకవితిలకులలోఁ బ్రథితకీర్తి బిల్హణకవీంద్రుఁడు రచించిన విక్రమాంకదేవచరితంబు నాంధ్రీకరించుట ముదావహము. వీరుభయులును స్వరచిత మగునీగ్రంథరాజమునఁ బెక్కురసవద్ఘట్టములను వివిధవర్ణన భాగములను వినిపింప విన నబ్బుట మహాభాగ్యము. తదాకర్ణనంబున నాకొదవినయుత్సాహమును, దదభినందనరూపమును, సహృదయసంప్రార్థనా రూపము నగు నీదిగువ పద్యద్వయమున వెల్లడించికొను చున్నాఁడను.



మ॥ పదచాతుర్యము నర్థసంగతి రసప్రాచుర్య మౌచిత్య సం
పద భావోన్నతి వర్ణనప్రతిభ శాబ్దప్రక్రియాప్రాభవం
బుదితాలంకృతి వ్యంగ్యవైభవము నేయోజం గనన్ లేవ యే
కొదవల్: బిల్హణకావ్యవైఖరికి మీకుం జెల్లె నాంధ్రీకృతిన్.

చం. సుకవులు మెచ్చ సాధుపటుసూక్తుల లక్ష్మణశాస్త్రి - విశ్వనా
థకవులు విక్రమాంకచరితం బల బిల్హణకావ్యభక్కి వీ
డక తెలిఁగింపఁ బూనినకడంకఁ గృతార్థతఁ బొంది రౌర! త
త్సుకృతిసుధాంశుచంద్రికలఁ దొక్కరె యాంధ్రసుహృచ్చకోరముల్.

కర్నూలు
8-1-1944

మేడవరం రామబ్రహ్మశాస్త్రి

---

కవిసార్వభౌమ

శ్రీ అచ్యుతుని వేంకటాచలపతిరావుగారు

గీ. సల్లలిత సంస్కృతపదాలచల్లఁదనము
తొల్లి తెల్గుకై తలకేఁటతెల్లఁదనము
పల్లవగ్రాహిపాండిత్యవల్లభులను
తల్లక్రిందుగ నాడించుమల్లిబలము
'విశ్వనాథ-లక్ష్మణశాస్త్రి' విహితకావ్య
విక్రమాంకచరితలోన వెలయు చుండు,

(మకాం) కొల్లాపురము
1-12-1941

అచ్యుతుని వేంకటాచలపతిరావు

---

ఆచార్య శ్రీ తొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు. ఎం. ఏ.

రసభరిత మై, ధ్వనిగర్భిత మై, ఔచిత్యసమన్విత మై, సౌందర్యసందీపిత మై, ఉదారాశయప్రదీప్త మైనకావ్యసృష్టి గావించినవారిలో సంస్కృతకవులు

జగతియందు అద్వితీయు లని రూఢి చేయ వచ్చును. గుణగుణాన్విత మైన సంస్కృతవాఙ్మయము ఇట్టిరచనముతో విలసిల్లునదిగావున జ్యోతిర్మయ మనఁ బఱఁగినది.

అట్టిసంస్కృతమహాకవులలో బిల్హణమనీషి యొక్కఁడు. ప్రాచీనకవుల వలెఁ బురాణగాథలపై నతఁడు మనసు నిలుప లేదు. దేశచరిత్రపైఁ గన్నుంచి నాఁడు. కావ్యసృష్టికిఁ బురాణములు సహకారు లైనట్లు చరిత్రలు కావు. అతిలోకచిత్రములను, ఇంద్రజాల-మహేంద్రజాలములను జారిత్రికసంఘటన ములందు జొనుపుటకై యేకవియును సాహసింప రాదు.

మహాకావ్యలక్షణముల నెఱిఁగినకవీంద్రుఁడు బిల్హణుఁడు. 'విక్రమాంక దేవచరిత' మనఁ బఱఁగినను నీతనిగ్రంథము చరిత్ర కాక 'కావ్య' మనియే తెలుపఁ జెల్లును. భావనాశక్తికిఁ బరిశీలనానుభూతులు తోడై నప్పుడు కవిత్వము ఘనతరప్రభావముతోఁ బరిఢవిల్లును. కథాంశములకు నాటపండి తైనతావులందు మసలి వానిని బరిశీలించియే బిల్హణకవి 'భావాంబరవీథీవిశ్రుతవిహారి'యైనాఁడు.

కళోపాసకు లైన శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారును శ్రీ మాదిరాజు విశ్వనాథరావుగారును రచియించిన ఆంధ్ర 'విక్రమాంకదేవచరితము'ను బఠించు భాగ్యము నాకుఁ గలిగినది. విశేషకౌశలముతో వీరు బిల్హణకృతి నాంధ్రీకరించిరి. కృష్ణరాయల యాస్థానమున నున్నట్లు భావించి వీరీగ్రంథమును రచించిరి. రాయలు రచించిన 'ఆముక్తమాల్యద' తక్క దీనికి దీటైనకృతి మఱియొకటి ఆంధ్రవాఙ్మయమునందు లేదని ముక్తకంఠముతోఁ దెలుపవచ్చును. ఈనాలుగు శతాబ్దులలో దీనిని బోలు మహాప్రబంధము ఆంధ్రజగతిలోఁ బుట్ట లేదనుట అతిశయోక్తి కాదు.

గ్రంథము గంభీరభావవిలసిత మై, సర్వాంగసుందర మై యొప్పు చున్నది. సౌష్ఠవ-మాధుర్యములు మేలియుక్తితో నిండలి శైలియందు వెలయు చున్నవి. పయంకిలి నెఱుఁగక సరిత్తిలకమువలె నీకావ్యమందలి కవిత యొప్పు చున్నది.

సారస్వతాంగణమునఁ దప్పటడుగు లిడువారు ఈగ్రంథమహత్త్వమును గుర్తింప లేరు. సాహిత్యాశయములను హృదయంగమ మొనరించుకొని కావ్యలక్షణముల నెఱిఁగినవారు విజ్ఞానదృష్టిని, విశాలదృష్టిని నలవఱచుకొనిన వారు ఈగ్రంథమును బఠించి, యిందలివరమార్థమును గ్రహించి యాశ్చర్యానందముల నోలలాడెదరు.



విశ్వవిద్యాలయములందు ఉన్నతపరీక్షలకై యిది పాఠ్యగ్రంథముగా నుండఁ దగినది.

తెలుఁగుతల్లి చల్లఁగా నున్నంతకాలము, ఆంధ్రశారద మని యున్నంత కాలము ఈకృతి అవనియందు వఱలు నని నేను విశ్వసించు చున్నాను.

(మకాము) వనపర్తి
1–6–1947

---

కవితిలక-కవితావిశారద-విద్వాన్

## ఆచార్య శ్రీమతి కాంచనపల్లి కనకమ్మగారు

సంస్కృతమహాకవిసార్వభౌములలోఁ బ్రథితకీర్తి యగుబిల్హణమహాకవి రచించినవిక్రమాంకదేవచరిత మనుచాళుక్యనరేంద్రచరితరూప మైనమహాప్రౌఢప్రబంధము 18 సర్గలు గలిగి 2000 శ్లోకములతో నున్నది. దానిని మహాకవులు, వనపర్తిసంస్థానపండితులు నగు-బ్రహ్మశ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారును, మాదిరాజు విశ్వనాథరావుగారును జంటకవులుగా మిక్కిలి కష్టించి సుమారు 2000 పద్యములు గలప్రౌఢప్రబంధముగ రచించి యున్నారు.

ఔచిత్య ముట్టిపడుపదముల, జాతీయముల, నలంకారముల నీకవులు చేర్చి కూర్చుటలో నఖండప్రజ్ఞ కలవారు. నిరర్థకపదరాహిత్యనిర్దుష్టత, ధారాశుద్ధి గనఁ గాఁ బ్రాచీనకవిత్వమునకుఁ దీసిపోవక యిది యున్నది. ఇట్టియుత్తమగ్రంథము లిప్పట్టనఁ జాల యవసరము. కళాశాలలందు బి.ఏ. ఎమ్, ఏ. విద్వాన్ మొదలగు తరగతులఁ జదువువిద్యార్థినులకు, విద్యార్థులకు దీనిని బఠనీయగ్రంథముగ నిర్ణయించి దేశక్షేమ మొనగూర్తురుగాక యని యాశించు చున్నాను.

కనకప్రాసాదము
బెజవాడ
20–10–1943

### ఆచార్య శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు

బ్రహ్మశ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారును, శ్రీ మాదిరాజు విశ్వనాథరావుగారును గలిసి యాంధ్రీకరించినవిక్రమాంకదేవచరిత మను ప్రౌఢకావ్యమును రెండుతడవలు విని యానందింపఁ గలభాగ్య మబ్బినది.

బిల్హణకవివిరచిత మయినవిక్రమాంకదేవచరితము సంస్కృతమునందలి ప్రౌఢకావ్యములలో నొకటి. ఆంధ్రీకృతకావ్యము శబ్దార్థాలంకార-సమాసభూయిష్ఠ మై చక్కనిశయ్యాపాకములఁ బడి మిగులఁ బ్రౌఢ మై సంస్కృతకావ్యమున కన్నివిధముల దీటు వచ్చుచు మనస్సు నలరించు చున్నది. రచయిత లుభయులును నుభయభాషాపారంగతులును, కవితారహస్యవేదులును. వారికి సంస్కృతమునవలెనే అచ్చతెనుఁగునను మంచిపాండిత్యమును బ్రజ్ఞయుఁ గలవు. కేవల మచ్చతెనుఁగున వ్రాసినప్రకరణములే యిందుకు నిదర్శనము. గ్రంథకర్తల కవితాధార అనర్గళ మయినది. ఆంధ్రీకరణమైనను తెనుఁగుకావ్యము హృద్యముగ నుండి యది స్వతంత్రగ్రంథమే యనిపించు చున్నది. ఇది పశ్చిమచాళుక్యజననాథుఁడును, కళ్యాణపురవరాధీశ్వరుఁడును నయిన విక్రమాదిత్యునికి సంబంధించినచరిత్రగ్రంథ మగుటచేత నా కింకను బ్రియ మయినది.

ఇటీవలనే శ్రీమాదిరాజు విశ్వనాథరావుగారు స్వర్గతు లైనట్లు విని విచారించినాను. శ్రీలక్ష్మణశాస్త్రిగారు మిత్రవియోగవ్యథవలన నిరుత్సాహులు కాక యింకను నిట్టియుత్తమకావ్యములు రచించి యశస్సు నార్జింపవలె నని కోరు చున్నాను.

మల్లంపల్లి సోమశేఖరశర్మ

మద్రాసు
26-10-1949

---

### ఆచార్య బ్ర॥శ్రీ కురుగంటి సీతారామయ్యగారు, ఎం. ఏ.

శ్రీ లక్ష్మణ-విశ్వనాథకవులచే విరచిత మయినవిక్రమాంకదేవచరిత్రయొక్క యాంధ్రీకరణమునందలిచాలపద్యములు శ్రీలక్ష్మణకవిగారు దయతో



వినిపింపఁగా వింటిని. ఆంధ్రీకరణము చాల సంతృప్తికరముగ నున్నది. సుప్రసిద్ధపండితులును, పరిశోధకులును, చారిత్రికులును నగు శ్రీమానవల్లి రామకృష్ణకవిగారిమన్నన నీగ్రంథము వడసిన దన్న దీనిప్రాశస్త్యము వేఱుగాఁ జెప్ప ననావశ్యకము. చారిత్రికప్రఖ్యాతి గల యీగ్రంథము తెనుఁగున ననువదింపఁబడుట మిక్కిలి ముదావహము. ఈగ్రంథము తెనుగుతల్లి కొకయమూల్యాభరణము. ఏతద్రచయితలకు నాహృదయపూర్వకాభివాదములు.

హైదరాబాదు
28-6-49

కురుగంటి సీతారామయ్య

---

న్యాయశిరోమణి

### శ్రీమాన్ వేదాలతిరువెంగళాచార్యులుగారు

శ్రీయుతులు కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారు మాదిరాజు విశ్వనాథరావుగారు, వీరుభయులు గలిసి తెలుఁగులోనికిఁ బరివర్తించినవిక్రమాంకదేవచరితమును బిల్హణకృతమును పుమారుగాఁ జాలవరకు విని సంతసించితిని. మూలములోని భావములను సుపరిచితము లగుపదములతోఁ బ్రౌఢబంధమున నలవరించి యనర్గళ మగుధారతో నాస్వాదనీయములుగా నొనర్చినవీరికవిత మిక్కిలి ప్రశంసాపాత్ర మైనది.

శ్లో॥ పరిచితపదజాలైః ప్రౌఢయా బంధరీత్యా
మధురమధురభావాన్ బిల్హణస్యోక్తికీర్తేః।
వయమనుపమధారాధోరణీసారపూరే
కవియుగపరివర్తే స్వాదు భాఽఽస్వాదయామః ॥

శ్లో॥ అచ్ఛాంధ్రశ్రీభారతీధారాపూరితేఽపి ప్రఘట్టకే।
సౌష్ఠవౌదార్యయో రమ్యం విద్మహే వినివేశనమ్।

గుంటూరు
24-1-1948

వేదాల తిరువెంగళాచార్యులు

విద్వత్కవి శిరోమణి

**శ్రీమాన్ బుక్కపట్టణం అణ్ణయాచార్యులుగారు**

శ్లో॥ రసభావాలంకృతిగుణశయ్యారీత్యాదిభిస్సమాకలితమ్ ।
మృదుగంభీరపదాంచితమనవద్యం రసికజనసమాస్వాద్యమ్ ॥

శ్లో॥ శ్రీవిశ్వనాథ-లక్ష్మణకవివరయుగళీవినిర్మితం కావ్యమ్ ।
శ్రీవిక్రమాంకచరితం ద్రాక్షామధురం సమక్షమద్రాక్షమ్ ॥

శ్లో॥ రసలహరీభరితేఽస్మిన్ కావ్యాబ్ధౌ తృష్ణయా నిమగ్నోఽహమ్।
ఆత్మానం రసతుందిలమనీశ ఏవాభవం సముద్ధర్తుమ్ ॥

బుక్కపట్టణ అణ్ణయాచార్యః

వనపర్తి
25-12-42

---

**శతావధాని శ్రీమాన్ దూపాటి వేంకటరమణాచార్యులుగారు**

(శేషాద్రి - రమణ కవులలో నొకరు)

శా. ఓ సాహిత్య శిరోమణీ ! రసికలోకోత్సాహసంధానధీ
వ్యాసంగోక్తినిబద్ధవిక్రమకథావ్యాకోచపుష్పంబు నా
కాసక్తిన్ గలిగించె మూలమున విద్యారాశి శ్రీబిల్హణుం
డేసాహిత్యపరీమళం బిడెనొ నాకెం దద్దియే తోఁచెడిన్.

మ. ప్రతిపద్యంబు రసాఽస్పదం బయి తలిర్పన్ బిల్హణోక్తిక్రమ
ప్రతిరూపంబుగ నాంధ్రవిక్రమచరిత్రం బీవు నిర్మించి స్వా
దుతరం బై నకవిత్వవైఖరులరీతుల్ చూపినా వద్దిరా !
ప్రతిభాసంపద, సంస్కృతాంధ్రయుగళీపాండిత్య వైచిత్ర్యముల్.

మ. సమరక్షోణిని నీ భోళు గెల్చి జయమున్ సర్వస్వముం గొన్నప
శ్చిమచాళుక్య నృపాలవర్యు విజయశ్రీ విక్రమాదిత్య భూ
రమణున్ బిల్హణుఁ డెట్లు కావ్యమునఁ దీర్పం గల్గె నట్లే మహో
త్తమభంగిన్ దెనిఁగించినాఁడవు ప్రమోదం బయ్యె విద్వత్కవీ !



మ. కవితాచాతురి వర్ణనాతిశయముం గావ్యంబులో నింపె స
త్కవిచూడామణి బిల్హణుం డిది చరిత్రం బౌట మూలానుసా
రవిధిన్ దెల్గొనరించి వాఙ్మయమునన్ రత్నాలవంటన్ సుధీ
నివహోర్థంబుగఁ గుప్పఁబోసినకవీ ! నిన్నుం బ్రశంసించెదన్.

సీ. రసవత్తరంబుగా రాజిల్లు వర్ణనాంశ
ముల్మలఁ జవులూర సంతరించి,
మూలమందలియర్థమును భావమును నున్న
విధముగాఁ దెలుఁగున వెలయఁ జేసి,
ఒకసర్గమున రసాభ్యుచితశుద్ధాంధ్రభా
షాకవిత్వంబును సంఘటించి,
సమవేగమునఁ జారుశైవలినీవిధం
బున నిరర్గళధార యనువుపఱచి,

గీ. విక్రమాంకచరిత్రంబు వినిచి నాకుఁ
బ్రమద మొనరించి తీవు నీ ప్రౌఢకవిత
నన్ను నలరించె నోరసస్విన్నహృదయ !
సరసవాగ్ధుర్య ! లక్ష్మణశాస్త్రివర్య !

హనుమకొండ
14-2-1949

---

ఆంధ్రపితామహ

**పద్మభూషణ డా॥ మాడపాటి హనుమంతరావుగారు**

మీవిక్రమాంకదేవచరిత ఆంధ్రీకరణమును చదివి ఆనందించితిని. విద్వ ద్వర్యు లగుతమవంటి వారిగ్రంథమును విమర్శించుటకుఁగాని, దానిపై నభిప్రాయ మొసఁగుటకుఁగాని తగినపాండిత్యము నాకు లే దనునంశము తమకును విదితమే. కనుక పుస్తకమును చదివియు, నిజాంరాష్ట్రవాసు లగుపండితు లగుకవివర్యు లలో, బిల్హణాదిమహాకవులసంస్కృతగ్రంథములఁ జక్కఁగ ననువదించువారు కలరని గ్రహించియు నేను ఆనందించితిని.

తమవంటికవియుగ్మము సంస్కృతభాషలోనియుత్తమరత్నములను త్రవ్వి బయటకు దీసి వానికాంతి విద్వత్ప్రపంచమున కందఁ జేయుదురుగాక.

ఆంధ్రకుటీరము
హైదరాబాద్
29-4-47

---

కవిసామ్రాట్ - కళాప్రపూర్ణ
**ఆచార్య బ్ర॥శ్రీ విశ్వనాథసత్యనారాయణగారు, ఎం. ఏ.**

శ్రీమాన్ విశ్వనాథరావుగారును శ్రీ క॥ లక్ష్మణశాస్త్రిగారును విరచించిన విక్రమాంకదేవచరిత్రమును వారు చదివి వినిపింపఁగా విన్నాను. వారిరచన మధురముగా నున్నది. వారిపాండిత్యము కవితాశక్తియు నుత్తమతరగతికిఁ జెందినవి. ఈప్రౌఢకావ్యము తెలుఁగులో ప్రౌఢి చెడకుండ మాధుర్యము చెడకుండ నింతయచ్చెరువు గొల్పునట్లు తెనిగించుట గొప్పప్రతిభను సూచించుచున్నది. వీరిప్రయత్నము సర్వథా ప్రశంసనీయము. వీరికిఁ బరమేశ్వరుఁడు దీర్ఘాయువు నితో౽ధికగ్రంథరచనాశక్తియుఁ బ్రసాదించుఁగాత.

బెజవాడ
7-1-47

---

**ఆచార్య శ్రీమాన్ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు**

మీవిక్రమాంకదేవచరిత్ర చదివినాను. సుప్రసిద్ధమైనమీయుభయభాషాపాండిత్యము అందలిప్రతిపద్యమునందును స్ఫూర్తి కెక్కినది. నిరర్గళముగా మీలేఖిని సాగినది. అందువలననే కొన్నియపుణ్ణశబ్దములకుఁ గ్రింద టీకను మీరే వ్రాయ వలసి వచ్చిన దని తలఁచుచున్నాను. ఎట్లును అది పెక్కుచదువరులకు సహాయకరముగా నున్న దనుట నిస్సంశయము. మూలము నే నెప్పుడో చూచి మఱచినది. కనుకఁ బోల్చి చూచుట కిక్కడ నాకు వీలు లేదు. మఱి మీవంటికోవిదులరచన కావని అనావశ్యకముగదా.

బెంగుళూరు
26-11-73



శిరోమణి
**ఆచార్య బ్ర॥ శ్రీ సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు పి. ఓ. ఎల్.**

పూజ్యమిత్రులు 'శిరోమణి-ఆంధ్రబిల్హణ-సుధీంద్రమౌళి' బిరుదవిరాజమానులు శ్రీకప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారును, కీర్తిశేషులు మిత్రవర్యులు శ్రీమాదిరాజు విశ్వనాథరావుగారును గలిసి యాంధ్రీకరించిన విక్రమాంకదేవచరిత్రమును బాలకాలముక్రిందటనే వీరివలన విని యానందించితిని. నేనే కాదు, విన్నవాఁడును జదివినవాఁడును ఆనందింప కుండ లేఁడు. ఈ గ్రంథమున కొకరి యభిప్రాయముతోఁ బని లేదు. ఎవరియభిప్రాయమును నీ గ్రంథవిశిష్టతను సమగ్రముగా నిరూపింపఁ జాలదు. ఇది తథ్యము. అయినను నన్ను గోరుటచే మిత్రుని మాట కాదనఁ జాలక వ్రాయుచున్నాను.

శృంగారనైషధముపిమ్మట నిట్టిగ్రంథము ఆంధ్రభాషలో వెలువడ లే దని పెక్కుమాఱులు సభలలో నేను వాక్రుచ్చితిని. బిల్హణునికావ్యమును బిల్హణుఁడే తప్ప నితరు లనువదింపఁ జాల రనుట తథ్యము, అనఁగా బిల్హణుఁడే శాస్త్రిగారుగా నవతరించి తనగ్రంథమును దానే యనువదించుకొనెను. కావుననే యనువాదము మూలమున కన్యూనాతిరిక్తముగా సాఁగినది. కావుననే ఇది యనువాదము గాక స్వతంత్రకావ్యముగానే కనిపించుచున్నది.

అరితేరినరచన. ఇరువురును గావ్యరచనలోఁ జేయితిరిగినవారు.

ఇంకను శ్రీశాస్త్రిగారు సంస్కృతమునుండి యిట్టియుత్తమోత్తమగ్రంథముల నాంధ్రీకరించి ఆంధ్రసరస్వతి నారాధింతు రని యాశంసింతును.

44, టీరా
సికిందరాబాదు
17-2-1974

---

కళాప్రపూర్ణ-విద్వాన్
**ఆచార్య బ్ర॥ శ్రీ దువ్వూరి వేంకటరమణశాస్త్రిగారు**

'ఆంధ్రబిల్హణు' లని మహామహాత్సభాంతరసీమలందుఁ బెక్కువత్సరములకు మున్నే పేరు వడసిన 'లక్ష్మణ-విశ్వనాథ' కవిసోదరులు ఆంధ్రీకరించిన 'విక్రమాంకదేవ చరితము'నందలి కొన్ని భాగములు సావధానముగాఁ జదివితిని,

చదివినకొలఁది చవు లూరించు నిందలికవితారీతి కడుంగడు వ్యాప్తి నొందించినది. పురాతనాద్యతనరచనభంగులరామణీయకమును సాకల్యముతో నాకళించిన యీప్రౌఢకవులకూర్పుతీరు అన్నివిధములను ననవద్యము. అత్యంతహృద్యము.

కవితామార్గమునకు వలసినదానికంటె అధిక మగువ్యుత్పత్తిని సంతరించుకొని, సాహితీమర్మజ్ఞులై, శాబ్దికశిరోమణులై, ప్రతిభానుభవశాలురయిన విద్వత్కవులరచనములు హృద్యములుగాక యితరము లగుట అసంభవము. అనవద్యము లగుట సహజము. తెలుఁగు-సంస్కృతముల-కలయికలోని-తీరు-తీయముల-సొబఁగుతో నక్లిష్ట మయి పరిణత మయినప్రౌఢశైలితో వెలసినయీకృతి బహుమాన్యత నందఁ గలదు. సందియము లేదు.

ఒక్క విశేషము :

ఈ కవిసోదరులలో 'సుధీంద్రమౌళి' లక్ష్మణశాస్త్రిగారు బహుభాషాప్రగల్భు లగుటయు, వాగ్మిశేఖరు లగుటయు నేఁటివారి కెల్లరకుం దెల్ల మయినయంశములు. అవి యటుండ;

వీరు నిగమాగమసంప్రదాయనిష్ఠామహనీయ మయిన కప్పగంతుల వంశమున నుదయించినవారు. అసలు వీరు కప్పగంతులవారు కారఁట, కప్పగొంతులవారఁట, వీరి పూర్వులు పెద్దపెద్దగొంతులతో నిరంతరము వేదశాస్త్రముల నావర్తించుచుండెడివారఁట. ఆ ఉదారతారకంఠస్వరములంబట్టి వారికి కప్పగొంతులవా రనుపేరు కలిగినదఁట. ఆగొంతు గంతుగా మాఱినదఁట. ఇది వృద్ధగోష్ఠులలో వినఁ బడునిర్వచనము: వాస్తవికమే కానోపును,

పూర్వపూర్వులసంప్రదాయసంస్కారములు వంశక్రమానుగతము లయి ఉత్తరోత్తరులకు సంక్రమించుట సహజసంపన్నము.

ఇట్టిప్రాక్తనసంస్కారములును, శ్రమించి సమార్జించినకావ్యశాస్త్రాది తత్త్వజ్ఞతాపాటవమును నీకవిసోదరులకవితావాహినిలో నచ్చటచ్చటఁ బ్రతిఫలించుచుండును. అట్టితావులను 'ఇదమిద'మ్మని యెత్తి చూపుటకు నోపిక చాలదయ్యెను. వానినెల్లఁ జదువరులే గుఱుతింపఁ గలరు.

మసకపల్లి
తూర్పుగోదావరిజిల్లా
12-5-1973



కళాప్రపూర్ణ
**శ్రీ తుమ్మల సీతారామమూర్తిగారు**
(తలపోఁత)

ఆ॥ వె॥ అలరినాఁడ విక్రమాంకదేవరిత్ర
తీరు చూచి పలుకుసొరు నరసి
తెనుఁగుసేఁతవోలెఁ గనిపింప దీకైత
కవులనేర్మి పేర్మి గన్న దగుట.

ఆ॥ వె॥ తెనుఁగు సంస్కృతమ్ము తీయతీయగ రవా
ళించు, నన్నయాఽదు లంచితాంధ్ర
కవులు చన్ననడలు కన్పించు నిం; దిది
యాంధ్రవాణి కుచిత మైనతొడవు.

ఆ॥ వె॥ తావి లేనివిరులఁ దలఁబరు వై తెల్గుఁ
దోఁట క్రుంగి కుములుపూఁటలందు
రసికభోగ్యసౌరభసమృద్ధ మీకావ్య
సుమము విరిసి తల్లిస్రుక్కు దూల్చె.

అప్పికట్ల
గుంటూరుజిల్లా
17-12-1973

—

**బ్ర॥ శ్రీ చతుర్వేదుల అమరేశ్వరశాస్త్రిగారు**

మ. జటిలాక్లిష్టపదప్రకృష్టము, విశిష్టప్రౌఢభావార్థసం
ఘటనోత్కృష్టము, పాకపుష్టము, సమీక్షాస్పష్ట. మాటిల్లనో
ద్భటవాక్సృష్టము - విక్రమాంకవిభుసచ్చారిత్ర; మద్దాని మీ
కెటు లాంధ్రంబున నోకవుల్ ! పలుక నయ్యెన్ శిష్టజుష్టంబుగన్ ?

మ. సరసంబో, విరసంబో మూలకృతిసంస్థావస్తువిన్యాసవై
ఖరి ; తద్రీతికి భిన్నముండె యగుఁ బ్రేక్షావద్విమృశ్యంబు; ని
ర్భరనిర్దుష్టవచఃప్రచారరుచి నాంధ్రంబందునన్ దాని క
క్షరనిక్షేపముఁ గూర్చు మీ ప్రతిభ సంశ్లాఘ్యంబహో, సత్కవుల్ !

మ. అనురూపాన్వయభావభవ్యనిజదివ్యశ్రావ్యపుంగూర్పుకం
చెను, గట్టా! యనువాదముం గొలువు చెంతే ప్రాణగొడ్డంబె యై
నను. వక్రోక్తుల రౌట బిల్హణకృతిన్ భాషించినా రాంధ్రమం
దున, నో లక్ష్మణ-విశ్వనాథకవిచంద్రుల్! మీర ధన్యోదయుల్.

గుంటూరు
20–6–43

---

కళాప్రపూర్ణ
**ఆచార్య శ్రీ మత్తిరుమల గుదిమెళ్ళ వరదాచార్యులుగారు**

శ్లో॥ పణ్డితోఽసౌ కవిర్వక్తా అహుభాషాస్వనర్గళః।
'గవ్వగన్తుల' వంశీయో లక్ష్మణాఽర్యో మహాయశాః॥

శ్లో॥ వ్యవహర్తా కవిర్విద్వాన్ ప్రతిభావాన్ యశోనిధిః।
'మాదిరాజు' కులః శ్రీమాన్ విశ్వనాథాఽహ్వయః కృతీ॥

శ్లో॥ విక్రమాఙ్కస్య చరితం బిల్హణీయమనూద్య తౌ।
ఉపచక్రతురాన్ధ్యాళ్ళ సతాం ప్రీతిం ప్రచక్రతుః.

చిట్టిగూడూరు
మచిలీపట్నం
12–5–1978

---

వ్యాకరణ-సాహిత్య-వేదాంతశాస్త్రమహావిద్వాంసులు
**శిరోమణి ఆచార్య బ్ర॥శ్రీ ఖండవల్లి నరసింహశాస్త్రిగారు**

శ్లో॥ శ్రీవిక్రమాఙ్కదేవప్రభుచరితం బిల్హణాఽర్యకృతిరత్నమ్।
శ్రీవిశ్వనాథ-లక్ష్మణశాస్త్రిభ్యామాన్ధ్రితం యథామూలమ్॥

శ్లో॥ దేశేషు కతిపయేషు స్వచ్ఛాన్ధ్రగిరా క్వచిత్సుగైర్వాణ్యా।
వాచా గ్రథితృకవీంద్రాఽన్ధ్రాఽమరవిద్యాయుగేఽతిపాణ్డిత్యమ్॥

శ్లో॥ సన్దర్భోచితపదగణకలనాద్వాచ్యం వివక్షితం లఘుభిః।
వృత్తైర్మనోऽనతమర్థం కృతిరభిదధతీయమాదృతా విబుధైః॥



శ్లో॥ ఆచన్ద్రతారకర్కం పరివర్తు గ్రన్థ ఏష; కవియుగళమ్।
ఏవం కృతిరపూర్వా రచయజ్జయతాత్సుధీకనుతియోగ్యాః॥

శ్లో॥ అపూర్వార్థైర్విర్వత్కవిగణమనస్తోషనిపుణైః
సుధాసధ్రీచీనై రలఘువచసాం గుంఫనశతైః।
నిబద్ధేయం సమ్యక్కృతిరలమమన్దాం వితరితుమ్
ముదం దోషజ్ఞానామితి కృశమహం విశ్వసిమి హి॥ ర

సీతారాంబాగు
హైదరాబాదు.
సుభాను-భాద్రపద-
కృష్ణ-తృతీయ

ఖండవల్లి నరసింహశాస్త్రి

---

**బ్ర॥ శ్రీవాజపేయయాజుల రామసుబ్బారాయఁడుగారు**

గీ. విక్రమాంకునిచరితంబు వేడ్క నలరఁ
జూచినాఁడను దని దీఁటఁ జూచినంతఁ
బరవశుఁడ నైతి; మీకవిత్వవిభవంబు
నేర్పుగరిమంబుఁ జక్కఁగా నివ్వటిల్లె.

మ. అనువాదం బని ధార కుంటు వడ తే దావంతయున్; శైలిలోఁ
గనరా దెందును లోటు; చక్కనిప్రయోగంబుల్ కళాసారముల్
గొని రాజిల్లుచు నుండె; మేటియశమున్ గూర్పంగ నౌ నిద్ది; యెం
దున 'శ్రీలక్షణ-విశ్వనాథ' కవిచంద్రుల్ కీర్తిసంపన్నులే.

గీ. వ్రాయఁగా నేటికో పెక్కుగ్రంథములను
జాలు యశ మెంతయైనఁ దేఁ జాలునిట్టి
కావ్య మొకఁడైన; విక్రమాంకచరితంబు
పృథ్విలోఁ జిరంజీవి యై వెలయుఁగాత.

వాజపేయయాజుల
రామసుబ్బారాయఁడు

స్నేహలతాకవితాసంఘము, కొల్లాపురం,
1–12–1941

మహాకవి

బ్ర॥ శ్రీ గడియారం వెంకటశేషశాస్త్రిగారు.

తే॥ శ్రీనిలయ-వనవర్తి సంస్థాన-విబుధ
మౌళిలక్ష్మణపండిత-మాదిరాజు
విశ్వనాథరాయకవీంద్రవిరచితంబు
వింటి శ్రీవిక్రమాంకపవిత్రచరిత.

చ॥ అతులవచస్వి బిల్హణమహాకవి సంస్కృతకావ్యబంధ మ
ద్భుతకవితామహత్త్వములు పొంపిరి వో రచియించె; దాని సం
గతరసభావశుద్ధి సరిగా నుడివోవనిప్రౌఢశైలి వ్రా
సితిరి తెనుంగుబాస బుధశేఖరు 'లౌ' నని మెచ్చు లాడఁగన్.

మ॥ అనువాదంబునఁ జెక్కుచిక్కులకు లోనై స్రుక్కుచేకాక, శ్రీ
యనిపద్యంబులఁ గన్న మూలకృతి 'హాహా!' యంద్రు, లేకున్న నీ
యనువాదంబున లోప మెంత్రు; కవులారా! యన్నిటిన్ దాఁటి మీ
యనువాదంబు స్వతంత్ర మై యుభయకావ్యప్రాభవ్యతన్ గూర్చెడిన్.

చ॥ నవకవితావిలాసము లనంతము లై జనతావినోద హే
తువు లగు; నైనఁ బూర్వకవిధూర్వహధీరగభీరభావలం
ధువులకుఁ బ్రౌఢబంధరసతుందిలతత్కవితాబ్ధిరత్నలి
ప్సువులకు మోదదాయక మవున్ దమకావ్య ముదాత్తవృత్త మై.

చ॥ ఒకయెడ మిమ్ముఁ దీర్చినమహోన్నతసద్బుధవర్యదేశికా
ళికి వరకీర్తిదాయక, మళీకజనుర్ద్విపతార, ఆంధ్రభా
షకుఁ బరమోపకారము యశస్యము మీకృతి యారవీందుతా
రకము బుధోపభోగ్యము చిరం బయి వెల్గెడుఁగాత మీధరన్.

గడియారము, వేంకటశేషశాస్త్రి

ప్రొద్దటూరు
7-1-1944

---



"వ్యాకరణ విద్యాప్రవీణ", "భాషాప్రవీణ"

ఆచార్య శ్రీ ఖండ్ల వేంకటరమణయ్యగారు, ఎం. ఏ.

ఆర్యా,

మీ 'విక్రమాంకదేవచరితము' నామూలచూడము, మూలముతోఁ జోల్చి చూచుచు శ్రద్ధగాఁ బఠించితిని. సంస్కృతవిక్రమాంకదేవచరిత్రము నందునుంబోలె వైదర్భీరీతి మీయనువాదమునందును నాదరింపఁ బడినది. మీ కృతి యనువాదమయ్యును స్వతంత్రకావ్యమువలె రాణించు చున్నది. మూలభావ మేపద్యమునందును గోలువడ లేదు. మూలములోని యర్థచమత్కృతి, శ్లేషసౌభాగ్యము, పదబంధవైచిత్రియు ననువాదమునందు నతిజాగరూకతతోఁ బొందుపఱుపఁ బడినవి.

ప్రథమాశ్వాసమున అహవమల్లుని వర్ణించునెడ రచింపఁ బడినపద్యమున శ్లేషసౌభాగ్యము అషత మై యున్నది. ఆ పద్యమిది:

తే. గీ అతఁడు కాలాంబుదశ్యామలాసి, సకల
రాజహంసలఁ దఱిమి తర్వాత నిలక
భోజరాడ్భుజపంజరమున రహించు
కీర్తిహంసినిఁ గూడ దా బెదరపఱచు. 1-189

ఇందు 'రాజహంస'శబ్దము శ్లేషానుప్రాణితరూపకము నభివ్యక్తీకరించుచు మూలమునందువలె హృదయము నలరించు చున్నది. 'అంబుద'శబ్దము మనోహరముగాఁ గూర్పఁ బడినది. 'నీటి నిచ్చునది' అనునర్థము అంబుదశబ్దమున నుండుటంజేసి, వానచినుకులు పడిన ఱెక్కలయీకలు రాలిపోవు ననుభయముచే రాజహంసలు పరుఁగెత్తి పోయిన వనుభావము సమర్థ మై యున్నది. అతని 'అసిమేఘము' రాజహంససముదాయమునకు బాధక మగుటయేకాక భోజరాజభుజపంజరమునందు నివసించుకీర్తిహంసికిఁగూడ బాధక మగు చున్న దను మూలభావము చక్కఁగా నిర్వహింపఁ బడినది. ఆజిరంగమునఁ బ్రవేశించినరాజు లేకాక యసూర్యంపశ్య లగురాజకాంతలకుఁగూడ నతనిప్రతాపము బాధాకర మనునర్థ మీపద్యమునఁ బ్రతీయమాన మగు చున్నది. భుజపంజర-హంసీ శబ్దములు పరస్పరము సాధువినివేశమును బొంది యున్నవి. అనువాద మెంతేని నాహ్లాదజనకము.

మూలమునందలిపదబంధ మనువాదమునందు ననుసంధింపఁ బడుట మీకృతియందు మఱియొక విశేషము.

కం. బింబారుణమిత్రప్రతి
బింబం బంబునిధిఁ జెంది ద్విరసనవరశ
య్యాం బవళించినతపనీ
యాంబరుకౌస్తుభవిలాస మంది యొసంగెన్. (5 ఆశ్వా. 11)

'బింబ', 'బింబం', 'బంబు', 'య్యాంబ' ఇత్యాదిగా బిందుపూర్వబకారంబు వృత్త్యనుప్రాసముగా నిర్వహింపఁ బడినది. ఇది యనువాదమునందుఁ బాటింపఁ బడిన మెలకువ.

మూలములోనియర్థచమత్కృతి నీక్రింది పద్యమొక్కటి వెల్లడించుటకు సమర్థము.

తే. గీ. త్రిభువనాంగణదీప మద్దినకరుండు
నవనమునఁబోలె బ్రహ్మచేఁ బ్రళయ మొందఁ,
బ్రబలముగఁ బర్వుధూమ్యావరంపర యన
నీలతిమిరవితానంబు నిక్కె నగతి. 1-18

ఇందు బ్రహ్మచే నన 'విధిచేత' నని యర్థముగావున నియతివశముచే ముల్లోకములకు దీప మగుభానుఁడును నస్తమించినాఁ డనుట వాచ్య మై, యెట్టి వానికేనియు విధివిధానముఁ దప్పింప నలవి గా దను నర్థాంతరమును సైతము వెల్లడించు చున్నది. మూలార్థమిందు నావంతయుఁ గడమపడలేదు.

అలఁతియలఁతితెలుఁగుపదములు, ఎడనెడ నాతిదీర్ఘసమాసములు, 'సతతరజస్తమోయుతభూపతిప్రజావైరాపనోదనప్రతిభగల్గి, ఇత్యాది సీసపద్యనిర్మాణచాతురి, కదళీపాకమునఁ బడినమీరచనకుఁ గడుంగడుమాధుర్యమును జేకూర్చు చున్నవి. వీనికిఁదోడు వైదర్భీరీతి మీరచనకు 'హేమ్నః పరమామోద' యను సూక్తి యనుగుణమైనది. మీకావ్య మమృతభాండమయ్యుఁ బ్రౌఢసాహిత్యపరిజ్ఞానము గలవారికే ఆస్వాదయోగ్య మగు చున్నది. ఇది సాహిత్య ప్రణయులయింట నుండఁ దగినగ్రంథరాజము. ఇంతటిప్రౌఢప్రబంధము రచించిన మిమ్ము ఆంధ్రప్రదేశప్రజానీకము సర్వవిధముల గౌరవించి, ప్రోత్సాహపఱుపఁ గలదని యాశించు చున్నాఁడను.



మీకవితకు నుపహారముగా నీపద్యము సమర్పించుకొను చున్నాను.

ఉ॥ మీకవితాకుమారిక యమేయగుణాఢ్యయ సాధువృత్తి, భా
వైకరసార్ద్రి, భావుకసమాహితశయ్య, సువర్ణరమ్య య
స్తోకపదార్థపోషిత, యదోష, సువృత్త, యుదారరీతి, యె
ట్లాకులితాత్మఁ జేయదు సమాగమ మౌనెడ నెట్టిధీరునేన్ !

శ్రీ మలయాళస్వామి సంస్కృత కళాశాల
ప్రొద్దుటూరు
కడపజిల్లా
7-11-78

---

ఆచార్య డా॥ దివాకర్ల-వెంకటావధానిగారు ఎం.ఏ., పి.హెచ్-డి.

మ॥ సురభాషం గవిరాజు బిల్హణుఁడు వాక్స్ఫూర్తిన్ రసాలంక్రియా
భరితం బై తగ విక్రమాంకధరణీపాలాన్వవాయంబున
చ్చరితంబున్ రచియించెఁ గావ్యముగఁ; దత్సారస్య మాంధ్రావనిన్
బరఁగం జేసినయీమహాకవులవిన్నాణంబు నగ్గించెదన్.

తే॥ గీ॥ ఒకఁడు లక్ష్మణశాస్త్రి శాస్త్రోదరాశి
కవరకుంభాత్మజుఁడు ప్రతిభాఢ్యకరుండు,
రెండవయతండు విశ్వనాథుండు తెలుఁగు
కవితపారము ముట్టినఘనయశుండు,

ఉ॥ మూలగతార్థభావపరిపుష్టి సముజ్జ్వలమై చెలంగ, దృ
శ్యాఢ్యనిఁ బారకాత్రియుగశాగ్రమున న్నిలఁ బెట్టువర్ణనల్
చాల వెలుంగ, నయ్యయిరసంబులపోషణ మింపు నింప, మే
ల్మే లని పండితుల్ కవులు మెచ్చఁ గృతిన్ రచియించి రీకవుల్.

సీ॥ సంస్కృతపదసమాసములసంఘటనమ్ము
గిరినుండి నిర్ఝరం బుఱికినట్లు,
లలితంబు లగుతెల్గుపలుకులకూర్పు పూఁ
దేనెకాల్వలు పాఱుదెంచినట్లు,

ప్రకృతిసుందరవస్తువర్ణనంబులతీరు
వర్ణచిత్రము ముందు వఱచినట్లు,
పాత్రలశీలస్వభావచిత్రణరీతి
విరిమొగ్గ క్రమముగా విరిసినట్లు,

తే॥ గీ॥ తనర ననువాదమయ్యు స్వతంత్రకావ్య
కామనీయక మెల్లెడఁ గానఁ బడఁగ
ప్రౌఢసుందరభంగి యొప్పంగఁ గవులు
సంతరించినయీకృతి సంస్తుతింతు.

చ॥ వితతపదప్రయోగవిధివిత్తము లీకవిచంద్రు లార్యసం
స్తుతగతి నర్థభావపరిశోభిత మై, యనవద్య మై, రసాం
చిత మయి యొప్పఁగా రచన చేసినయీకృతి పూర్వకావ్యస
మ్మిత మయి తెల్గువారల కమేయముదం బిడుఁగాత నిచ్చలున్.

బర్కత్‌పురము
హైదరాబాదు.

దివాకర్ల వేంకటావధాని

---

## ఆచార్య బ్ర॥శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు

బ్రహ్మశ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారును శ్రీమాదిరాజు విశ్వనాథ రావుగారును కలిసి తెనిగించిన విక్రమాంకదేవచరితమును వినిపించిరి. అవధానం తోను అనురక్తితోను విని ఆనందించితిని. ఇంచుమించు ఎనిమిదిగంటలకాలం కనబడకుండా గడచిపోయింది.

బిల్హణమహాకవిసంస్కృతకావ్యం దీనికి మాతృక. అనువాదమును యథానేదిష్ఠంగా సాధించుటకై కష్టించినకవులు కృతార్థులు. కావ్యమయినప్పటికీ చరిత్రచిత్రణ మైనఇలాంటికృతులను ప్రతిబింబములుగా తీర్చడమే న్యాయము.

గ్రంథములో ఆయాసంనివేశములను నేను కావలెనని కాంక్షతో చదివించి వింటిని. ఋతుచక్రంలో వర్షోత్కర్ష రాపిల్లాడినా ఋజ్వీగా నిలిచింది. మత్తేభ వర్ణనలలో గతిగాంభీర్యముమీర కవికి గలమమత గోచరించింది. కాని చూలా



తిచొక్కులతో చివిరించి కాలెంతభాగ్యోదయంతో ప్రసవించిన వాచాప్రసాధనం ప్రసన్నంగాను భావనాసంపన్నంగానూ నాకు స్ఫురించింది. కాశ్మీరమండల ప్రశస్తిలో అభిజనసౌభాగ్యంపట్ల కవిఅంతఃకరణసుకుమారాభిమానం ధ్వనింపక పోదు.

కవి ఎంతసమర్థుడయినా అనువాదసంఘటనలో ఉండేఅస్వతంత్రత, అన్యానుసరణపరతంత్రత తప్పనది కాదు. ఈసంకోచసంకటాలను సవరించి సవదరించుకోవడంలోనే అతనిసామర్థ్యసంపత్తులను గుర్తించవలెను. అనివార్యము లైనఇరుకులలో ఈకవులు కుశలంగా కృతకృత్యు లైనా రని నేను విశ్వసిస్తున్నాను.

బిల్హణుడు వైదర్భి తన కిష్టరీతిగా చెప్పికొన్నాడు. అనువాదకులరచన అన్నిరీతులలోనూ అనర్గళంగా విస్తరించింది. చక్కనిశైలి, సళ్లు లేనిపదబంధము, సౌష్ఠవ-మాధుర్యములు గలభాష అనువాదకులరచనకు వన్నె పెట్టుచున్నవి. విషయగౌరవాన్నిబట్టి రచనాపటిమనుబట్టి ఇలాంటిమనోహరగ్రంథములు విద్యాలయములలో పాఠ్యగ్రంథములుగా ఎన్నుకోదగినవి. గ్రంథరచయితలు ఇంకనూ ఇట్టివిలక్షణకావ్యములను తెనిగింతు రని ఆశించుచున్నాను.

రా. సుబ్బారావు

తెలుగుశాఖ అధిపతి
ఉస్మానియా విశ్వవిద్యాలయము
హైదరాబాద్.
వైశాఖ శు: ౧౫

---

## ఆచార్య బ్ర॥ శ్రీ నరిపల్లి విశ్వనాథశాస్త్రిగారు, ఏం. ఏ.

I heard with much pleasure a free poetic rendering into Telugu of the Sanskrit Kavya, Vikramankadeva Charita, written by Bilhana Kavi. The work is the combined effort of the Twin poets, Viswanatha-Lakshmana Kavulu of wanaparty. I had the opportunity of spending a couple of days with the poets. They read their creation, whose language is chaste and sweet, of

lucid and fluent in style, a worthy production of a scholarly mind. The flights of imagination of the original are ably brought out in its Telugu form. I heartily congratulate for their laudable service to "Andhra Bharati".

CAMP WANAPARTY

ఆంధ్ర-సంస్కృతాచార్యులు
నిజాం కళాశాల
హైద్రాబాద్.

---

విద్వత్కవి

బ్ర॥ శ్రీగుంటూరు శేషేంద్రశర్మగారు, బి. ఏ.

శా. ప్రాశస్త్య ప్రణుతాంధ్రదేశమున శుంభత్కావ్యపీయూషభా
షాశేషాహి, రసప్రసిద్ధరచనాసందర్భగర్భీకృత
శ్లేషజ్ఞానమనీషి యెవ్వఁ డనినన్, గీర్వాణసాహిత్యవా
రాశిన్ లక్ష్మణశాస్త్రివర్యునిఁ గదా శ్లాఘించు దిగ్దేశముల్.

ఉ. ఆతతవిక్రమాంకచరితామృతపానముఁ జేసి సాహితీ
గీతపరీమళమ్ము లొలికించి యనుంగుతెనుంగుతోఁటకున్
నూతనవైభవోల్బణము నూల్కొనఁ జేసినశాస్త్రిగారికిన్
జేతులు మోడ్చి యంజలి రచింపఁగరాదె రసజ్ఞశేఖరుల్.

మ. నరులే కాదు సురాసురాఽద్యఖిలత్రింశత్కోటి బృందారకుల్
సరియే, లక్ష్మణశాస్త్రిఁ గావ్యలతికాసంజాతమల్లీవిక
స్వరకింజల్కపరాగకీర్తిని సమస్తగ్రంథసందర్భని
ర్భరవిద్యామహనీయమూర్తి నెఱ సంభావించి వర్ణింపఁగన్.

మ. అతులప్రజ్ఞుఁడు, 'మాడిరాజు' కులదుగ్ధాంభోధిచంద్రుండు, స
త్ప్రతిభాఽలంకృతసత్కవిత్వరచనాధౌరేయమూర్ధన్యుఁ డం
చితవాక్ప్రౌఢిమ 'విశ్వనాథ'కవి, వాక్ఛ్రీచాతురిన్ గావ్యని
ర్మితసౌధంబున నిల్పె బిల్హణునికీర్తిన్ దెల్గువా రౌ ననన్.



చ. తెలుఁగున వేల్పువల్కునను దియ్యనికబ్బము లల్లునేర్పుతోఁ
బలుకులతల్లికిన్ బలుకుపందిళులందున నాణిముత్తెపుం
బెళుకులయుయ్యెలన్ నిలిపి వెల్గులఁ జూపిరి గూర్పునేర్పుతోఁ;
నల సరి లేరు తెల్గుమడి 'లచ్చన' 'విస్సన' తెల్గుకైతకున్.

హైదరాబాదు,
1-9-74,

---

శిరోమణి-విద్వాన్

విద్వత్కవి బ్ర॥ శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రిగారు

ఉ॥ ధన్యుఁడు విక్రమాంకచరితంబును సంస్కృతసత్కవీంద్రమూ
ర్ధన్యుఁడు బిల్హణుండు కడుప్రౌఢి రచింపఁగ దానిఁ దెల్గునన్
మాన్యగుణాఽఢ్యకావ్యముగ మల్చిరి లక్ష్మణ-విశ్వనాథధీ
మాన్యులు, కావ్యలక్షణసమంచితబుద్ధులు, తజ్జ్ఞు లౌ ననన్.

మ॥ కవులై మిత్రులు నై ప్రబంధరచనాకౌతూహలోద్యద్గవీ
సువిశాలామలధోరణీయుతులు నై తో డైన మీ రిర్వురున్
గవనప్రక్రియఁ దన్పినారలు మహాకావ్యైకదీక్షారతిన్
భువిపై విక్రమదేవకావ్యమును పేర్వూరించి కావ్యజ్ఞులన్.

చ॥ పదములకూర్పునన్ మధురభావసమున్నతియందు, శబ్దసం
పద-విపులార్థదీప్తియును భాసిలుశైలినిఁ గావ్యమెల్ల శా
రద నడయాడుపుష్పమయరత్నహిరణ్మయకుట్టిమంబుగాఁ
ద్రిదులనిదీశుఁ గూర్చి, సుకవిప్రియులైతిరి భారతావనిన్.

కం. నన్నయ-తిక్కనపలుకుల
వన్నెలు చిన్నెలును గన్న భారతి మీచే
గున్నతపీఠస్థిత యై
పున్నమవెన్నెలలు నాల్గుమూలల విరిసెన్.

సీ. మాధుర్యధుర్యవాఙ్మంజులతామంజుల
ఘటనావిధికి ననుగలము కలము,
సాధుభావవిభావసారస్యసర్వస్వ
శోభితశబ్దమంజూష భాష,
మృదులపాకవిపాకమేదురమధురతా
రసనీయగుణమణిరసము రసము,
విక్రమాంకసమావిభుసాహసౌదార్య
వైభవగుణపుంజభరిత చరిత,
గీ. గలుగ ననితరసాధ్య మౌకావ్య మిటులఁ
గూర్చి సుకవీంద్రతతి మెచ్చుకోలుఁ గంటి
రౌర! లక్ష్మణకవిచంద్ర! యతులకీర్తి
సాంద్ర! శ్రీవిశ్వనాథభాషాఫణీంద్ర!

కేశవపంతుల నరసింహశాస్త్రి

బర్కత్‌పుర, హైదరాబాదు.
30-11-1978

---

అభినవపోతన
శ్రీమాన్ వానమామలై వరదాచార్యులుగారు

సీ. బహుముఖమ్ములు తాము బహుభాష లై
యొప్పి జిహ్వాగ్రనృత్యముల్ సేయు చుండ,
నహిశీర్ష మంచు నిమ్మహిఁ దాల్చు ననఁ దలన్
గావ్యప్రపంచము గ్రాలు చుండ,
జాతిమణుల్ శిరస్థలి వెలుంగు ననంగ
దివ్యదలంకారదీప్తు లెసఁగ,
రసనిమగ్నక్రీడపస గల్గుమండూక
విప్లుతి యై కావ్యవీథి వెల్గ,



గీ. నాదిశేషుండె శ్రీలక్ష్మణాఖ్యఁ దెలఁగి
వసుధ నవతరించుట వాస్తవమ్ముగాదె !
పాండితీ-ప్రతిభామణిమండితుండ!
కప్పగంతుల లక్ష్మణ కవిబుధుండ!

గీ. మూలమునకు వన్నియ లిడ ముద్దు గుల్కు
నీదుబిల్హణకృతియనువాద మొప్పు
'ఆంధ్రబిల్హణ ఖ్యాతి' నీ కంద మిడెను
కప్పగంతుల లక్ష్మణ కవిగురుండ!

ఉ. ధారణి నాదిశేషునవతారమె లక్ష్మణుఁ డంచు నెంచఁ గూ
పారసమంబు పాండితియుఁ బ్రజ్ఞయుఁ గైకొని కైతనిగ్గులన్
దేరి రసమ్ము లూరి గుణదీప్తి వెలుంగిడ నీకుఁ దోడుగాఁ
జేరెను విశ్వనాథుఁడు పసిండి నెసంగెఁ బరిమళ మ్మహో!

గీ. అమలగీర్వాణపదముల నందగించు
కావ్యగంగ నౌదలఁ దాల్చి ఘనతరాంధ్ర
విశ్వమున కొసంగుటనేమొ విశ్వనాథ!
సార్థనాముఁడ వైతి వీజగతి సుకవి!

గీ. ఆదిలోనె సర్వజ్ఞుఁడు నౌదల నిడ
రసహిమమ్ము వర్షించు నీ రమ్యకవిత;
కన్దోవ ల్విప్ప దశదిశల్ కళల నింపి
'సూరి రాజ'వంశం బని మదికిఁ జాటు.

ఉ. ఈవును లక్ష్మణాహ్వయుఁడు నేరము నై రచియించుసత్కృతుల్
పూవులఁ దావు లై మరియుఁ బుత్తడినిం దళుకొత్తురవ్వ లై
తేవురుపట్టుపుట్టమునఁ జెన్నెసలారుజరీమతాలు లై
గోవులగుమ్మపాలరుచిఁ గొల్పెడిచక్కెర లౌ నిఁకే మనన్.

ఉ. సానలఁ దీరురత్నములచాడ్పున హృద్యము లైనపద్యముల్
గానఁగ నయ్యె మీసరసకావ్యసుధార్ణవమందు నాంధ్రస
ద్వాణికి భూషణమ్ము లయి పొ ల్పమరెన్ భళి! మీదు కావ్య సం
తానము మీదుసత్కృతివిధానము లప్రతిమానము ల్భువిన్.

ఉ. తెనుఁగులు సంస్కృతంబులును దేనెల ముంచరసాలసత్ఫలా
ర్పన అయి కావ్యవాణికిఁ బసం దగువిందు లొసంగు చుండె; మీ
ఘనతరపాండితీపటిమ, కాల్పనికప్రతిభామహత్వ మెం
దనితరసాధ్యముల్ సహృదయాభినుతమ్ములు తెన్గుసొమ్ము లౌ.

క. వాచస్పతి బిల్హణకవి
ధీచాతురి నెసఁగుసత్కృతి న్దెనిఁగింపన్
మీచరిత మాంధ్రమేదిని
నాచంద్రార్కము వెలుంగు నతులితకీర్తిన్.

దెన్నూరు ఆదిలాబాదు జిల్లా,
30–11–78

---

వచనకవితా పితామహ

### శ్రీ కుందుర్తి ఆంజనేయులుగారు

సుప్రసిద్ధసంస్కృతాంధ్రపండితులు, కవివర్యులు శ్రీకప్పగంతుల లక్ష్మణ శాస్త్రిగారితో నాపరిచయం యీనాటిది కాదు. సమాచారశాఖలో మే మిద్దరము సహోద్యోగులుగా నుండుట ఒకవిధంగా విశేషమే. అంతకంటె ఎక్కువగా చెప్ప దగినది మాయిద్దరిమధ్య గలమైత్రీబంధము. శ్రీశాస్త్రిగారు, కీ.శే. శ్రీమాదిరాజు విశ్వనాథరావుగారును కలిసి వ్రాసిన విక్రమాంకదేవ చరితమును వ్రాతప్రతిలోనూ, అచ్చు అగుచున్నసమయంలోనూ నేను చదవడం తటస్థించింది. నాకు గలఛందఃపర్యవిజ్ఞానము పరిమితమే అయినప్పటికీ, దానిని చదివి చాలాచోట్ల నేను ముగ్ధుడ నయ్యానని చెప్పక తప్పదు. మాదిరాజు వారు పరమపదించి యెంతోకాలము గడచినా యిప్పటికి శ్రీ శాస్త్రిగారి సహృదయతాపూర్వక మైనకృషివలన యీమహాకావ్యము వెలుగు చూడడం ఆంధ్రసాహితీవేత్తలఅదృష్ట మనే చెప్పాలి. ఈకార్యమును నిర్విఘ్నంగా పూర్తి చేసినశ్రీలక్ష్మణశాస్త్రిగారు అభినందనీయులు.

హైదరాబాదు
17–9–74



విమర్శక శిరోమణి

### శ్రీ తిరుమల రామచంద్రగారు

కృష్ణరాయల భువనవిజయాస్థానంలో 'అనుష్టుప్-చక్రవర్తి' అనే కవీశ్వరుడు ఉండేవాడు. స్రగ్ధరలలోనో, దండకవృత్తాలలోనో విస్తరించిన భావాన్ని అనుష్టుప్‌వంటి చిన్నపద్యంలోనే ఇముడ్చడంవల్ల అతనికి 'అనుష్టుప్ చక్రవర్తి' అనేపేరు వచ్చింది. కృష్ణరాయలు ఓఢ్రగజపతిని ఓడించి విజయనగరానికి మరల వచ్చి పేరోలగంలో ఓలలాడినప్పుడు పెద్దన మొదలు పలువురు కవులు తెగబారెడు వృత్తాలతో అతనిని వర్ణిస్తే, అనుష్టుప్ చక్రవర్తి మాత్రం అలవోకగా,

> "కృష్ణరాయ! స్తువంతు త్వాం కవయో; న వయం స్తుమః।
> నరసింహకిశోరస్య కియాన్ గజపతేర్జయః. ॥

ఓ కృష్ణరాయా, కవులు నిన్ను పొగిడితే పొగడనీ! నేనుమాత్రం పొగడను, నీవు కొదమసింగం. నీవు గజపతిని గెలవడం ఏంగొప్ప? అని చమత్కరించాడట.

అట్లాగే ప్రియమిత్రుడు, బాల్యమిత్రుడు కప్పగంతుల లక్ష్మణశాస్త్రి బిల్హణుని 'విక్రమాంకదేవ చరితం' ను పదాశ్వాల ప్రబంధంగా ఆంధ్రీకరించాడంటే, ఎందరు మహామహోపాధ్యాయులు, ఎందరు కవిసార్వభౌములు ఎంతగా పొగిడినా, నేనుమాత్రం పొగడను. ఎందుకంటే;

ప్రియమిత్రుడు లక్ష్మణశాస్త్రి మురారివలె గురుకులక్లిష్టుడు. పండిత ప్రకాండులకు పట్టుగొమ్మయిన తిరుపతి శ్రీవేంకటేశ్వర సంస్కృతకళాశాలలో పదేండ్లపాటు అలంకార-వ్యాకరణ శాస్త్రాలలో పరిశ్రమించి స్నాతక పరిణతి పొందినవాడు; చెన్నపురి సంస్కృతకళాశాలలో స్నాతకోత్తరం అద్వైత విద్యలో ఆరితేరిన విద్వచ్ఛిరోమణి; ఈమూడు శాస్త్రాలకు 'ఉపాంగంగా, న్యాయపూర్వమీమాంసలను అధ్యయనం చేసినవాడు. వివిధశాస్త్రజ్ఞుల వ్యాఖ్యానాలకు, ప్రవచనాలకు, ఆంధ్ర-సంస్కృత కవితాకల్లోలినులకు కూడలి అయిన వనపర్తి సంస్థానంవాడు కావడంవల్ల కవిసహృదయాఖ్యమయిన సరస్వతీ తత్త్వం కటాక్షానికి పాత్రమయినవాడు; వివిధభాషలను పుక్కిట బట్టినవాడు. చిన్ననాటినుంచే ఉపాసించినగైర్వాణి, తల్లిబాస అయిన తెలుగు, దాని

తోబుట్టువులయిన కన్నడ-తమిళాలు, పరిసరభాష అయిన మహారాష్ట్రీ, పూర్వపు అధికారభాష అయిన ఉరుదూ, ఇప్పటి అధికారభాష అయిన హిందీభాషలలో గద్గదనదద్గోదావరివలె కాన్పూరువద్ద గంగానదివలె సుందరగంభీరంగా ఉపన్యసించగల మహావక్త; ప్రతిపదాన్ని పలవింతలతోను పుట్టుపూర్వాలతో ప్రత్యక్షం చేసుకొని, పాణినీయ ప్రమాణాలతో వ్యాకరించగల విపశ్చిదగ్రేసరుడు; పాండురంగ సుకవి తన కవితనుగురించి చెప్పినట్టు నన్నయ - భీమన - తిక్కన - శ్రీనాథుల ఫణితులలో కవితను కదం తొక్కించగల కవితల్లజుడు; గంటలతరబడి సంభాషణలో తనియింపజేసే ప్రసంగచతురుడు; ఉత్తరభారతంలోని పెక్కువిశ్వవిద్యాలయాలలో గౌరవాచార్యుడుగా విద్యార్థులను ఉపాధ్యాయులను తనియింపజేసిన "సుధీంద్రమౌళి" అయినప్పుడు విక్రమాంకదేవచరితాన్ని ఆంధ్రీకరించడంలో అబ్బుర మేముంది? అందుకే అన్నాను: ససేమిరా పొగడను-అని.

కాని, ఒక్కవిషయాన్ని మాత్రం కొనియాడక తప్పదు, పాతరోత అయి కొత్త వింత అయిననేడు; వృత్తరచన వెర్రి అయి, గేయ-వచనకవిత పులకండపు పలుకయిననేడు; ప్రబంధాలపై పగ పెరిగి, పిలికలపై, ఖండికలపై చండికలపై ప్రేమ పెరిగిననేడు; వ్యుత్పత్తిని వ్యాధిగా, పరిశ్రమను పరమశత్రువుగా భావిస్తూ, పుర్రెలో పుట్టినదంతా 'పులుగడిగిన కవిత' అనే విర్రవీగుడు విస్తరిస్తున్న నేడు; "మురారేః తృతీయః పంథాః" అన్నట్టు ప్రబంధమార్గం తొక్కి కవితను వల్గిత-రేచిత-ప్లుతగతులలో నడిపించి, మార్గకవితకు ముకురంపట్టిన ధైర్యాన్ని, ప్రాచీన ప్రతిభావ్యుత్పత్తులకు ప్రతిమా పరిపాటిని కల్పించిన సాహసాన్ని ప్రశంసించక తప్పదు. ఇలా సాహసించడానికి ఒడిగట్టినాడు గనుకనే, నేడు ఇలాటి చారిత్రిక మహాకావ్యాన్ని మౌలిక మనదగినట్టు అనువదించి యశశ్శ్రీని వరించాడు. ఔను! సాహసే ఖలు శ్రీర్వర్తతే" అన్నాడు భాసుడు,

చారిత్రికకావ్యాల అనువాదంలో ఒకగట్టి చిక్కు ఉంది. కేవల కవితాధార చాలదు. ధారకు వ్యుత్పత్తికి చరిత్రజ్ఞానం జతపడాలి. లేకపోతే, అనువాదం చరిత్రవిశేషాలను మరుగుపరచి, పఠితలను పెడదారి పట్టించి, సాహిత్యానికి ద్రోహం చేయగల ప్రమాదం ఏర్పడుతుంది, అందువల్ల లక్ష్మణశాస్త్రి కల్యాణీ-చాళుక్య చరిత్రను క్షుణ్ణంగా పఠించవలసి వచ్చింది. (బిల్హణుడు



తెలిపిన చారిత్రికాంశాల నిజానిజాలు ఎలా ఉన్నా.) కనుకనే ఈ అనువాదం చరిత్రకారులూ 'ఇదిగో ఇక్కడ చరిత్రాంశం తప్పుగా అనువదించాడుసుమా!" అని ఆక్షేపించడానికి ఆస్కారం లేకపోయింది. ఏ పనిలోనైనా కర్తస్వభావం ప్రతిబింబిస్తుందని, రచనలలో ఇది మరింతగా ప్రస్ఫుట మవుతుందని మనోవైజ్ఞానికులు అంటారు. లక్ష్మణశాస్త్రిచిత్తశుద్ధి చిన్ననాటినుంచి చెరగనిది, 'నీతో ఈపని కావాలి' అని ఎవరు అన్నా, నెత్తిన పెట్టుకొని పూర్తిచేసికొని కాని ఊపిరి తీసుకొనేవాడు కాదు. ఆచిత్తశుద్ధే ఈఅనువాదంలో అడుగడుగునా ప్రస్ఫుట మవుతుంది ఇదొక అసిధారావ్రతం, ఇదొక రచనాయోగం, ఏ పద్యాన్ని మూలంతో పోల్చినా, 'నామూలం లిఖ్యతే కించిత్', మూలానికి మార్పులు, చేర్పులూ, కూర్పులూ లేని చక్కని తీర్పు ఇది.

ఈతీర్పులో భాగస్వామి నామిత్రునిసోదరకవి యశఃకాయులు మాదిరాజు విశ్వనాథరావుగారు. వారిని దర్శించేభాగ్యం నాకు కలుగ లేదు. వారు తెలుగు-సంస్కృత-ఉరుదు-ఫార్సీ-ఇంగ్లీషుభాషలలో అద్భుతరచనాచాతుర్యం గలవారని. గొప్పప్రతిభావంతులని నామిత్రుడు తరచు చెప్పేవాడు. వారు వ్రాసినప్రత్యేకపద్యాలనుకూడా అక్కడక్కడ వినిపించాడు. వారిలిఖితప్రతిని కూడా చూచాను.

ఈగ్రంథముద్రణసమయంలో సంవత్సరంపాటు పెక్కుప్రయోగాల విషయంలో నామిత్రునితో నిరంతరం చర్చించడం జరిగింది. 'నిర్గహన-విఘూర్ణ-లటభ' ఇత్యాది అపూర్వప్రయోగాలచర్చలో నేను పాల్గొన్నాను. వాటిఅర్థనిర్ణయంలో నామిత్రునిప్రతిభను గ్రహించాను.

ఆ ఆధారంతో దీనిలోనికొన్నిపద్యాలను మచ్చుకు ఉదాహరిస్తాను :—

నీలచ్ఛత్రోన్మదగజఘటాపాత్రముత్త్రిస్తచోళాత్
చాళుక్యేంద్రాదలభత కృతీ యోఽత్ర విద్యాపతిత్వమ్ ।
అస్మిన్నాసీత్తదను నిబిడాఽశ్లేషహేవాకలీలా
వేల్లద్బాహుక్వణితవలయా సంతతం రాజలక్ష్మీః ॥

దీనికి వీరిఅనువాదం :—

చోళాఽభీలచళుక్యభూమిపతిచే సూరీంద్రుఁ డొందన్ మహా
నీలచ్ఛత్రమదేభరాడ్ధ్వజముతో న్విద్యాపతిత్వంబు నా

పై లాలించె దృఢోపగూహనకళావాల్లభ్యవేల్లద్భుజా
హేలాశింజితహస్తభూష యయి యెంతే వానిరాలచ్ఛియున్'(7-109)

మూలం :—

బ్రూమః కిమన్యదయముత్ప్రహితేస్మ యత్ర
ద్వయ్యేవ తత్ర గతిరావిరభూ న్నృపాణామ్।
కారాగృహే పతనమాశు పలాయనం వా;
చోళోఽపి శీఘ్రమపసార మతశ్చకార॥ (17-67)

అనువాదం :—

"వేఱు వచింపనేలఁ బృథివీపతి యెచ్చట మచ్చరించినన్
దీఱుఁ దెఱంగుగా వసుమతీతిలకంబులకున్ ద్వయంబె, పెన్
గాఱియఁ గారఁ గాంచుట, విశావిక లై దవువాఱుటల్; ద్వరన్
జాఱె ననిన్ ద్యజించి గరువం బఱి చోళుఁడు ప్రాణభీతి మై'' (6-219)

ఇలా ఏపద్యాన్ని మూలంతో పోల్చినా ఇదే తీరు.

ప్రసన్నతకు ఒకపద్యం ఉదాహరిస్తాను :—

"చెందం గంటి నృపప్రసాదకణికన్, శ్రీలేశమున్ గంటిఁ గా
సంతోవిద్యను నేర్చితిన్; గుణగణం బాధార మై కొందఱ
న్నిందం జేసితి; నిట్లు జ్ఞాన మఱి యెన్నే నేరముల్ సేసితి;
న్నెందం బిప్పుడు తేఁటతెల్విఁ గనె, వాంఛింతు న్వియద్వాహినిన్.
(7-106)

మిత్రునితత్త్వమధార యెంతవేగంగా ప్రవహిస్తుందో అచ్చతెనుగువాక గూడ అంతటివడితోనే పారుతుంది.

సరములు దెగినను దిగవడి
వఱుఁగిడెదవు చెఱుఁగువల్వ వడిన నిలువ వీ
వరయుమ! నిజ మగుఁ; జాఱెదు
తొరఁగినక్రీఁగోకఁ దెగడి తొయ్యలి! తోడ్తోన్ (5-90)

వెలిముత్తెంబులచాలుఁ బోల్ చెమటసోర్వెల్లిన్ మెయిన్ జెంది జేఁ
డలరెన్ దీటుగఁ 'దామ్రపర్ణి' యనువాగం బిమ్మగన్ సంద్ర మై;



వెలిగందంబున వెల్లనౌచనులతీవెంబోండ్లకౌఁగిండ్లలో
గెలిచెన్ వేసవియుమ్మ గాక మరునేగిన్ గూడుపెన్వేఁడియున్.
(5-106)

"యశయావళి—నథఆభోగ—వయఉదయం" వంటి ప్రయోగాలకు ఈ అనువాదం అకరమంటే అతిశయోక్తి కాదు. ఇలా ఎన్నైనా ఉదాహరించనూ వచ్చు, ఈ ఉదాహరించడం సహృదయుల కుతూహలపానకంలో పుడక కానూవచ్చు.

ఇంతటి విద్వత్కవులకైవాడంతో కమనీయమైన ఈ అనువాదం మూలానికి అన్యూనానతిరిక్త మున్నది సహృదయహృదయైకవేద్యం.

నేను ఇన్నిమాటలలో చెప్పినలక్ష్మశాస్త్రిని కాశీవాసి, సార్వభౌమ-సంస్కృత - ప్రచారసభాస్థాపక - నిర్వాహకుడు, సాహిత్య - వేదాచార్యుడు, మిత్రుడు శ్రీవాసుదేవ ద్వివేది ఒక్కశ్లోకంలో మధుర-గంభీరంగా చిత్రించాడు, దానిని ఇక్కడ ఉట్టంకిస్తాను.

మూర్తిర్మత్తగజేంద్రగర్వదళనీ వాణీ వినోదప్రియా
వ్యాఖ్యాలేఖ-కవిత్వకౌశల కలాపారంగతా శేముషీ।
శక్తిః సంస్కృత భాషసేవ్వనుపమా విద్వజ్జనేష్వాదరః
శ్రీమల్లక్ష్మణశాస్త్రిణాం గుణగణాః కేషాం న తోషావహాః॥

హైదరాబాద్
1-8-1974

తిరుమల రామచంద్ర

శ్రీ

కవితాసమితి

తిరుపతి

సన్మానపత్రము

బ్రహ్మశ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారికి

బ్రహ్మశ్రీ మాదిరాజు విశ్వనాథరావుగారికి

ఆంధ్ర విక్రమాంకదేవచరితను
వినిపించినసందర్భమున సమర్పింపఁబడినది.

మ. సరసాలంకృతగద్యపద్యకవితాసారస్య సంపాదకుల్
విరచింపన్ సమకట్టి రంచితసభావిఖ్యాతసంపన్నులై
కర మాంధ్రమ్మున విక్రమాంకచరితన్ కవ్యాగ్రణుల్ లక్ష్మణు
డరయన్ మిత్రుఁడు విశ్వనాథకవియున్ వ్యాఖ్యానసంపత్తిమై.

ఉ. కేవలతత్సమంబులను గేవలవైకృతభాషలన్ బలే
తీవిగ మిశ్రభాషలను దీకగ వ్రాసిరి విక్రమాంకమున్
పావనవిజ్ఞులుం గొని సభల్ కొనియాడఁగ నాంధ్రమందుఁ దా
రావనవర్తికీర్తి దెస లల్లఁగ లక్ష్మణ-విశ్వనాథులున్.

ఉ. నన్నయతిక్కనాదికవినాథులపోకడ శైలి, లోరసం
బెన్నఁగ విజ్ఞానార్యమతి నించుక వీడనిరీతి, భావసం
పన్నతఁ బోతనార్యుగతి పాదుకొనం దగ విక్రమాంకమున్
వన్నెయు వ్రాసియుం గని యవారితశక్తినిఁ జూపి రీకవుల్.

ఉ. పూర్వకవీశ్వరాళిఁ బరిపూర్ణచమత్కృతి నారగించి యే
గర్వము లేక సర్వరసకాంతులు చిప్పిల విక్రమాంకమున్
బూర్వకవీశకీర్తిఁ గనుపుణ్యులు లక్ష్మణ-విశ్వనాథులున్
సర్వము నాంధ్రమందు సరసంబుగ వ్రాసిరి రీతిచాతురిన్.



తే. గీ. విజ్ఞానార్జితరత్నముల్ పేరు చేసి
యాంధ్రకవితామతల్లికి హార మొసఁగి
'ఆంధ్రవిజ్ఞాన' బిరుదంబు నందు టన్న
విశ్వనాథ-లక్ష్మణులకుఁ బెద్ద గారె!

కం. 'తిరుపతి' కవితాసమితికి
నరుదెంచినయతిథిభాగ్య మందినమే మీ
సరసకవీంద్రుల నిర్వుర
సరసంబుగ గౌరవించుశస్తం బయ్యెన్.

అధ్యక్షులు

2-1-44

కార్యదర్శి
ది. 2-1-44

# మనవి మాటలు

జయంతి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః ।
నాస్తి యేషాం యశఃకాయే జరామరణజం భయమ్॥

అని భర్తృహరి చెప్పినచొప్పున రససిద్ధులైనమహాకవీశ్వరులు పుణ్యాత్ములు. వారికీర్తిశరీరము జరా-మరణములు లేక శాశ్వతముగా వారికృతిసాధనములలో నిలిచి యుండును. అట్టిమహాకవులు కొందఱో జగతియందు నిలిచి యున్నారు. వారిలో బిల్హణమహాకవీంద్రుఁ డొకఁడు.

"బిల్హణునివంశచరిత్ర, యాతనిజీవితచరిత్ర, తత్కృతిభర్త విక్రమాదిత్యచక్రవర్తివంశచరిత్ర, ఆరాజుజీవితచరిత్ర, వీనినిగూర్చి శ్రీవేదము వెంకటరాయశాస్త్రిగారు, శ్రీఅవధానము చంద్రశేఖరశర్మగారు, శ్రీనిడుదవోలు వెంకటరావుగారును సవిపులముగాఁ జర్చించి ఉపోద్ఘాత-సమీక్షలలో వ్రాసి యున్నారు. కాఁబట్టి యావిషయములనుగూర్చి మఱల నేను దడవినఁ జర్విత చర్వణ మగును. నేను వ్రాయవలసిన విషయము లన్నియు వారు వ్రాసినారు. సహృదయపాఠకులు వానిని జదివి, గ్రహింతురుగాక. ఇప్పుడు ఈగ్రంథమును అనువదించుటకుఁ గారణమును అసందర్భమున మాకుఁ గలిగినయనుభవములను, నాకవ్యగ్రజుఁడు కీ. శే. శ్రీవిశ్వనాథరావుగారిక విత్వ-ప్రతిభావిశేషములను గూర్చి నే నిటఁ దెలుపుట నాకర్తవ్యము.

నేను తిరుపతి శ్రీవేంకటేశ్వరసంస్కృతకళాశాలయందుఁ జదువు చుండి నప్పుడు ప్రాతఃస్మరణీయులు, సంస్కృతాంధ్రసాహిత్యపాథోధికుంభసంభవులు, ప్రథితయశులు నైన కీ.శే. శ్రీమానవల్లి రామకృష్ణకవిగారు 1930 సం. ప్రాంతమునందు తిరుపతిదేవస్థానకార్యాలయమునందు విద్యాశాఖాఽధికారిగా నుండిరి. నే నప్పుడు ధ్వన్యాలోకము చదువు చుంటిని. అప్పుడు అచ్చులో నున్న లోచనవ్యాఖ్యానమునందుఁ జాలతప్పులు ఉండుటచేత శ్రీకవిగారివద్ద శుద్ధప్రతి యున్న దని విని వారిని దర్శించి యడిగితిని. వారు మిక్కిలి యాదరముతో నన్ను జేరఁ దీసి 'నాయనా! మీదేయూరు?' అని ప్రశ్నించిరి. 'మాది వనపర్తి' యంటిని, వెంటనే వారు నన్ను గౌఁగిలించుకొని యాశీర్వదించి, 'యెవరి కొడుకవు?' అని యడిగిరి. మాతండ్రిపేరు చెప్పఁగనే వారుకన్నుల నీరు గార్చుచు



'నాయనా! నీవు నాకు మనుమఁడవోయీ! నీవు నావద్ద నుండుము నీ కేది వలసినను ఆపుస్తకము తీసికొని చదువుము. నీసంశయములను దీర్చెదను.' అని యెంతయో యాత్మీయతతోఁ బలికిరి.

శ్రీరామకృష్ణకవిగారు మావనపర్తి రామేశ్వరప్రభుపుల కోరికపై 1900 నుండి 1908 సం. వరకు వనపర్తిలో నివసించి 'శ్రీరంగమహాత్త్వము-ప్రబంధమణిభూషణము ఇత్యాదివిస్మృతకవిగ్రంథములను ఉద్ధరించి ముద్రించిరి. అప్పుడు మాతండ్రిగారేకాక వయస్సు మీరినవారు అనేకులు వారికడ విద్యాభ్యాసము చేసిరి. వారిలో నాకవిసోదరుఁ డగువిశ్వనాథరావుగూడ నొకవిద్యార్థి. ఈ కారణముచేత శ్రీకవిగారు నన్ను సమాదరించిరి.

తిరుపతికళాశాలలో నేను విద్య ముగించి మావనపర్తి చేరినపిదప నొకసారి నేనును-మావిశ్వనాథరావుగారును మద్రాసులో శ్రీకవిగారిని దర్శించితిమి. అప్పుడు కవిగారు అత్యానందము నంది వారివద్దనే మమ్ము 2-3 దినములు ఉంచుకొని అనేకవిషయములను బోధించి 'బిల్హణునివిక్రమాంకదేవచరిత'కావ్యమునకు నింతవఱకు తెలుఁగులో నిర్దుష్టమైనయనువాద మవతరించ లేదు. మీరిరువురుఁ గలిసి దానికిఁ బద్యానువాదము చేయుఁడు. అని ఆజ్ఞాపించి, జర్మన్‌విద్వాంసుడు, డా-జార్జి బుహ్లర్ 19వ శతాబ్దియంతమునఁ బ్రచురించిన ప్రాచీన సంస్కృత ప్రతి నొకదానిని మాకిచ్చి యాశీర్వదించిరి.

అప్పుడు ద్వితీయప్రపంచమహాయుద్ధము ముమ్మరముగా జరుగు చుండెను. దాదాపు 1938-39 సంIIములకాలము. మేము వనపర్తికి వచ్చి కవిగారియాజ్ఞ మేరకు ఒకమంచిముహూర్తమున ననువాదమున కారంభించితిమి. విక్రమాంకదేవచరితమునకు సంస్కృతమున వ్యాఖ్యానము లేదు. మేమిరువురము తొలుత పదిశ్లోకములను అన్వయించుకొని ఒక్కొక్కశ్లోకమునకు నర్థనిర్ణయము చేసి చెరియైదుశ్లోకములను దీసికొని యిండ్లకుఁ బోయి యనువదించి మఱునాఁటియుదయమున నిరువురము చేరి పరస్పరము పద్యములు వినిపించుకొని దిద్దుబాట్లు చేసికొని గ్రంథస్థము చేయు చుండెడివారము. కొన్ని నేను వ్రాసినవి వారు మార్చుటయో వారు వ్రాసినవి నేను మార్చుటయోకూడ జరుగుచుండెను. ఇది మాయనువాదసరణి. ఇందొక్కవిశేషము :-

శ్రీమాదిరాజు విశ్వనాథరావుగారు నాకన్న నప్పటికే వయస్సులోఁ బెద్దవారు. వారిప్రజ్ఞ అతినిశితము. గొప్పప్రతిభాసంపద గలవారు. సంస్కృతాంధ్ర

ములేకాక, ఫార్సీ-ఉర్దూ-ఇంగ్లీషు-న్యాయశాస్త్రము-గణితము-శిల్పము-చిత్రకళ-ఇత్యాదివిద్యలలో నతిచతురులు. అచ్చతెలుఁగురచనలో వారు అందెవేసిన చేయి. సంస్కృతములోఁ నుత్తమవ్యుత్పత్తి గలిగియుండిరి మేము ఒండొరు సంస్కృతాంధ్రసాహిత్య - వ్యాకరణ- ఛందోవిషయములందుఁ బరస్పరము తోడ్పడుచు రచన సాగించితిమి. నేను నామిత్రుని ప్రోత్సాహముచేతనే తెలుఁగులోఁ గవితాభివృద్ధి చేసికొనఁ గలిగితిని. దానికి నేను జదివినసంస్కృతము చాలసహకారిగా నుండెను. అప్పటికి నిప్పటికి నతనికి నేనెంతయో ఋణపడియున్నాను. పగలు హైస్కూలులో నాంధ్రోపాధ్యాయవృత్తిని నెఱవేర్చుచు రాత్రి గ్రంథరచనమును సాగించుచుండుటచేత యౌవనదశలోనే నాయారోగ్యము కొంత చెడినది. విశ్వనాథరావుగారికి ఉబ్బసముజబ్బు ఉండెను. ఆయన కడనే విద్య నభ్యసించి మంచివిజ్ఞానము సంపాదించిన ఆయనతృతీయపుత్రి శ్రీమతి శారదమ్మ, మేము వ్రాసిన చిత్తుపద్యములప్రతిని శుద్ధప్రతిగా వ్రాయుచుండెను.

ఇట్లు దాదాపు మూడుసంవత్సరములు నిర్విరామముగా రచన సాగించి ఒకచిత్తుప్రతిని సిద్ధము చేసి, దానిని విద్వత్కవులకుఁ జూపి సవరించుకొనవలెననునుద్దేశముతోఁ దొలుత గురువర్యులు శ్రీమానవల్లి రామకృష్ణకవిగారివద్దకు తిరుపతికేగితిమి. అప్పుడు వారక్కడ లిఖితపుస్తకభాండాగారములో, 'క్యురేటర్' గా నుండిరి. వారికే తొలుతఁ జూపవలెనని మాయాశ. మూడునాలుగుదినములు ఓపికతో ననువాదమంతయుఁ జూచి దిద్ది మా కిచ్చిరి. వారియధ్యక్షతలో కీ. శే. శ్రీవేటూరి ప్రభాకరగురువులసమక్షమున నొకసభ చేయించి మాచేఁ బద్యములు చదివించిరి. అది విని యానందించి మాకు 'ఆంధ్రబిల్హణ' బిరుదము దిరుపతిసాహితీబంధువు లిచ్చిరి. అతరువాత ననేకులు పెద్దలకుఁ జూపి వారిమన్ననల నందితిమి.

శ్రీశ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రిగారివద్దకు, రాజమహేంద్రవరమునందు, మేము పోయినప్పుడు, వారు' మీకవిత్వము' వినుటకే కూర్చొని యున్నామా! హైదరాబాదులోఁ దెలుఁగుకవిత్వ మున్నదా! తురకదేశము' అని మమ్ము ఈసడించుకొని గ్రంథము వినుటకు నిరాకరించిరి. అప్పుడు యువకుఁడుగా నుండిననేను మాప్రాంతమున మీరు 'ఎంతో సహృదయులు గొప్పవారు' అని ప్రశంసించుటచే వచ్చితిమి. ఇప్పుడు 'మీ రిట్టివా'రని తెలిసినది.



పోయి వచ్చెద' మని యంటిని. ఆమాటకు వారు భ్రాంతిఁ జెంది నన్ను ఆపాదమస్తకముఁ జూచి, 'నీకు అరగంట సమయము ఇచ్చెదను. వినిపింపుము' అని వరము ప్రసాదించిరి. కూర్చుంటిని. నామిత్రుఁడును నాపార్శ్వమున నుండెను. 'ఏమి చదువు మనెదరు?' అని యడిగితిని 'మీకావ్యమునం దేమున్నది?' అనిరి. 'అన్నివర్ణన లున్న'వంటిని. 'వసంతఋతువర్ణనము వినిపింపు' మనిరి. నేను జదివిన మొదటిపద్యమునందే తప్పుపట్టి మమ్ము పంపఁ దలఁచి, వారు, 'ఈపదమున కర్థ మేమి?' అనిరి. చెప్పితిని. 'కా'దనిరి. సమర్థించితిని. ఇట్లు వారు ప్రతిపద్యమును బరీక్షించుచు విను చుండిరి. తొమ్మిదిపద్యములు విన్నతరువాత 'మీరిచ్చిన అరగంట యైనది. ఇంకొకపద్యముమాత్రము చదివి ముగించెద'నని పదవపద్యము చదివితిని. ఆ పద్యముయొక్క అన్వయమునందు, మాయిరువురికి వాదము జరిగెను. వారు చెప్పినయన్వయక్రమము ఏకదేశాన్వయదోషదూషిత మని నిరూపించితిని. వారు సంతోషించి నావీఁపు తట్టి 'నీవు వ్యుత్పన్నుఁడవోయీ! నీగ్రంథము బాగున్నది. గ్రంథము వినెదను. నేఁడు నాతోనే యిరువురు భోజనము చేయుఁడు' అని నాగోత్రముగూడ వారి గోత్రము 'కౌశిక' గోత్రమే యగుటచేత 'మనగోత్రమువారిరచన బాగుండు ననియు, మనమిరువురము నేకశాఖీయులము గనుక నీచనవు తీర్చెద ననియుఁ జెప్పి మాకు భోజనము వారిపంక్తిలోఁ బెట్టి అసాయంత్రమువఱకు గ్రంథము వినిరి.

అప్పుడు బెజవాడయం దున్న శ్రీచెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారిని దర్శించి "మీరు విక్రమాంకదేవచరితమునకు గద్యానువాదము చేసితిరి. కనుక మీకు వినిపించి మాసంశయములను దీర్చుకొనుటకు వచ్చితిమి" అని చెప్పఁగనే వారు సహృదయతతో నాదరించి వినిరి. ఒకచోట సవరణ తెలిపిరి. 'అది బాలవ్యాకరణ విరుద్ధ' మంటిని. అప్పుడు వారు వ్యాకరణముపై నొక బూతుమాట విసరి నవ్వి మమ్మాశీర్వదించి పంపిరి. కాశీ కృష్ణాచార్యులుగారు, జనమంచి శేషాద్రిశర్మగారు, చిలకమర్తి వారు, "చాల దినములకు మంచికావ్యము వినునవకాశము కలిగిన"దని నన్ను గౌఁగిలించుకొని యాశీర్వదించిరి. శ్రీకట్టమంచి రామలింగారెడ్డిగారు చిత్తూరులో నాలుగుగంటలకాలము ఏకాగ్రతతో గ్రంథము విని యభినందించిరి.

ఆనాఁటిపెద్దలందఱిమన్ననల నందిన యీకావ్యము చిత్తుప్రతిగానే ఉండెను. ఇంతలో నేను వనపర్తియుద్యోగము విడిచి హైదరాబాదు సిటీ కాలేజి

యందుఁ దెలుఁగుపండితుఁడనుగా 1947 సం॥లోఁ జేరితిని. ఆతరువాత ఒకసంవత్సరములోనే శ్రీవిశ్వనాథరావుగారు ఉల్బసమువ్యాధితో దివంగతు లైరి. 'ఈ కావ్యము ముద్రించి ప్రకటించినచో నాకుఁ బరలోకమున శాంతి చేకూరును' అని నాకు వారిచివరిమాటలుగాఁ జెప్పిరి.

ఈయనువాదమున నేను అనేకపర్యాయములు పునఃపరిశీలనము చేసితిని. ఆసందర్భమునందు నాకు నుభయభాషావ్యాకరణ-సాహిత్యములలోఁ గలిగిన సందేహములను దీర్చినపూజ్యులు బ్ర॥శ్రీ సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారికిఁ గృతజ్ఞతాంజలి నర్పించుచున్నాను.

ఎప్పుడో కడచినబిల్హణకవికిని నాకును బాదరాయణసంబంధము కలదు. మేమిరువురము 'కౌశిక'గోత్రులమే. అతనిగ్రంథము ననువదించునవకాశము లభించుట నాభాగ్యము. మావిశ్వనాథరావుగారు తలఁపునకు వచ్చినపుడు నాకుఁ గంటఁ దడి రాక మానదు. ఆయనఋణము దీర్చుకొనలేను. మే మనువదించినబిల్హణకవి 'కర్ణసుందరి' నాటికాప్రచురణ సమయమునందు మావిశ్వనాథరావుగారికిఁ గలిగినసంతసము నేఁడు నే ననుభవింపఁ జాలక పోయితి నని చింతించు చున్నాను.

ఇది చారిత్రికకావ్య మగుటచేత దీనియుపోద్ఘాతము వ్రాయుటకుఁ గేవలము సంస్కృతాంధ్రపాండిత్యముమాత్రము చాలదు. పశ్చిమచాళుక్య వంశచరిత్ర నెఱిఁగినవారిలో నిష్ణాతు లై యుండవలెను. సంస్కృతాంధ్రవైదుష్యముతోపాటు కల్యాణీచాళుక్యచరిత్రలో సమకాలికులలో నిష్ణాతు లైన శ్రీవేదము వెంకటరాయశాస్త్రిగారినిఁ బ్రార్థించినతోడనే వారు ప్రేమపూర్వకముగా నంగీకరించి దీనికి ననన్యసాధ్య మైనచక్కనియుపోద్ఘాతము వ్రాసి దీనిశోభ నినుమడింపఁ జేసిరి. వారియుపోద్ఘాతము దీనికి మకుటాయమానము. వారికిని, వారిపేరు సూచించినమిత్రుఁడు శ్రీతిరుమల రామచంద్రకును నే నెంతయుఁ గృతజ్ఞుఁడను.

సంస్కృతాంధ్రసాహిత్య-వ్యాకరణపాథోధినిఁ దఱచి మణులను వెలికిఁ దీసి అలంకరించుకొనినమిత్రుఁడు శ్రీఅవధానము చంద్రశేఖరశర్మగారు పాండితీస్ఫోరక మైనసమీక్షచేత ఈకావ్యము నలంకరించిరి: వారికిఁ గృతజ్ఞతఁ దెలుపక యుండఁ జాలను. ఇఁక విమర్శకాగ్రేసరు లైన శ్రీనిడుదవోలు



వెంకటరావుగారు నే నడిగినదేతడవుగా నద్భుత మగుసమీక్షను వ్రాసిరి. అది 'పీఠికయా? సమీక్షయా? ఉభయమా?' అని అనుకొని 'ఉభయరూప' మని నిర్ణయించుకొంటిని. వారికిఁ జాలఁ గృతజ్ఞుఁడను.

అనేకవిద్వత్కవు లీయనువాదమును బొగడుచు సదభిప్రాయములను వ్రాసి యిచ్చిరి. ఆ పెద్దల కందఱకును గృతజ్ఞతాంజలు లర్పించు చున్నాను. వారిలో ననేకులు దివంగతు లైనవారుగనుక, వారిస్మరణార్థము వారి సంతకములను బ్లాకులు చేయించి ముద్రింపఁ దలఁచితిని. వానితోఁబాటు నేఁడు జీవించి యున్న విద్వత్కవులసంతకములనుగూడ బ్లాకులు చేయించి ముద్రించితిని. ఇట్టిశుభముహూర్తమున మావిశ్వనాథరావుగారు జీవించి యుండిన నెంతగా సంతసించెడివారో. ఈనాయల్పకృషి వారియాత్మకు శాంతినిఁ జేకూర్పఁగాక యని భగవంతునిఁ బ్రార్థించు చున్నాను. ఈకావ్యమును దీర్చి దిద్ది ప్రచురించుటకు నా కనేకవిధములుగ సహకరించినమిత్రులందఱకును నావందనములు

దాదాపు మూడు దశాబ్దులుగా నీగ్రంథము ముద్రింపఁ బడ కుండుటకెన్నియో యంతరాయములు కారణము లయ్యెను. వానిలో నార్థిక మైన యిబ్బంది ప్రధానము. పదెనిమిదియేండ్లక్రిందటిఅంచనా ప్రకారము దీనిముద్రణమునకు రు. 6000/-లు అవసర మై యుండెను. ఇప్పుడు అవ్యయము త్రిగుణీభూత మైనది. ఆచిక్కులనన్నింటిని నేనొక్కఁడనే యెదుర్కొనవలసినవాఁడ నై యున్నందున ననేకప్రయాసల కోర్చి యిప్పటి కీకార్యము, భగవంతునికృపచేతనో మావిశ్వనాథరావుగారు స్వర్గమునుండి న న్నాశీర్వదించుచుండుటచేతనో సంపూర్ణ మైనందుకు నన్ను నేను ధన్యునిఁగా భావించుకొనుచున్నాను.

ఆధునికయుగమునం దీమహాప్రబంధమును జదువువారు పకోలఁదివిద్యాంసులో యుందురుగనుక దీనివలన భవిష్యత్తులో నార్థికలాభ మేమియు లేకున్నను, దీనిని జదువఁ గలిగి యానందించువా రెప్పటికైనఁ బుట్టక పోవుదురా యని, 'కాలో హ్యయం నిరవధిః విపులా చ పృథ్వీ' యనుభవభూతివాక్యమును దృష్టియం దుంచుకొని దీనిని బ్రచురింప సాహసించితిని.

ఈగ్రంథముద్రణమునకు నార్థికసహాయము చేసినభారత కేంద్రప్రభుత్వమునకును, నాంధ్రప్రదేశప్రభుత్వమునకును, నిజాం ధర్మనిధివారికిని, ఆంధ్రప్రదేశ సాహిత్యఅకాడెమీవారికిని నేనెంతయుఁ గృతజ్ఞుఁడను.

ఈముద్రణమునకుఁగాను తోశవెలకు కాగిదము నిచ్చిన శ్రీబిర్లావారికిని, వారినిఁ బ్రోత్సహించిన శ్రీపన్నాలాల్ భండారీగారికిని నాకృతజ్ఞతాంజలులు.

విక్రమాదిత్యునివంశీయుఁ డైనసర్దార్ ఎ.ఎ.చాళుకేయపాటీల్–ఐ.ఎ.ఎస్ గారు, కల్యాణపత్తనదేవాలయభిత్తిశిల్పచిత్రమును సంరక్షించి యున్నారు. దానిని బనారస్ హిందూ విశ్వవిద్యాలయమువారు సంస్కృతవిక్రమాంకదేవచరిత్రలోఁ బ్రచురించిరి. ఆచిత్రముచేత నీయాంధ్రకావ్యమునుగూడ నలంకరింపఁ దలఁచిననాకు ఆవిశ్వవిద్యాలయమువారు, శ్రీచాళుకేయపాటీలుగారును అనుమతి నిచ్చిరి. వారికిఁ గృతజ్ఞుఁడను.

మావిశ్వనాథరావుగారితో నేను మూఁడుదశాబ్దులక్రితము తీయించుకొనిన చిత్రమును, జక్కఁగాఁ దాను వ్రాసి యుంచుకొనినవ్రాఁతప్రతిని నా కిచ్చిన మావిశ్వనాథరావుగారికూఁతురు శ్రీమతి శారదమ్మకును నేను గృతజ్ఞుఁడను. ఆచిత్రమువలన విశ్వనాథరావుగారిరూపమును నేను పాఠకుల కందింపఁ గలిగితిని. విక్రమాదిత్యునిచిత్రమును, మాయిరువురిచిత్రమును సర్వాంగసుందరముగాఁ దీర్చి యిచ్చినకళాతపస్వులు, మిత్రులు శ్రీపి.టి.రెడ్డిగారికిని, శ్రీప్రభుజీత్ సింగ్ గారికిని గృతజ్ఞుఁడను.

ఈప్రబంధమునందలిసంతకములబ్లాకులను, చిత్రములబ్లాకులను, సిద్ధము చేయించుటలో నాకు అమూల్యసహకారమును జేసినప్రభుత్వపాఠ్యపుస్తకముద్రణాలయపుడిప్యూటీడైరెక్టరు శ్రీరామకృష్ణరావుగారికిని, బ్లాకులు చేయించి సకాలములో నిచ్చిన 'అమరావతిప్రోసెస్' వారికిని గృతజ్ఞుడను.

ఈగ్రంథమును సుందరముగా ముద్రించి యిచ్చిన శ్రీశివాజీముద్రణాలయాధికారి జనాబ్ బడేసాహెబుగారికిని, ఆముద్రణాలయోద్యోగులకును నేను జాలఁ గృతజ్ఞుఁడను. జనాబ్ బడేసాహెబ్, శ్రీనాగేందర్ గారల అవ్యాజమైన శ్రద్ధను నేను గొనియాడక యుండఁ జాలను.

ఎంత జాగ్రత్తతోఁ బరిశీలించినను గొన్ని ముద్రణదోషములు దొరలక తప్పలేదు. వానిని సవరణపట్టికలోఁ జేర్చితిని. సహృదయవిద్వత్కవిశేఖరులు మన్నించి సూచన లిచ్చినచోఁ గృతజ్ఞతాపూర్వకముగ స్వీకరించి పునర్ముద్రణమున సవరించుకొనెదను. ఈగ్రంథప్రకాశనమునకు నాకుఁ జేదోడు–వాఁదోడుగా నుండిననాకూఁతురు ఆయుష్మతి శ్రీమతి కమలకు (సంస్కృతమునందు ఎం.ఏ.పట్టమునంది–ఉస్మానియావిశ్వవిద్యాలయమునందు సంస్కృతాచార్య) కును. నా శ్రీమతి, అన్నపూర్ణకును నాశుభాశీస్సులు.

నాశవ్యగ్రజులు, కీ.శే.శ్రీమాదిరాజు విశ్వనాథరావుగారికి స్మృత్యంజలి సమర్పించి యీకావ్యమును సహృదయవిద్వత్కవులకరకమలములయం దిడుచున్నాను :—

## స్మృత్యంజలి

శా. శ్రీవాణీవరరంభవిభ్రమలసచ్ఛ్రేయోఽనుభూతిన్, గళా
శ్రీవిభ్రాజితు, నన్యకోవిదమతిశ్రీ మించుబ్రాహ్మీసుతున్,
భావప్రోద్యతనైకకావ్యకలనాభ్రాజిష్ణుఁ, 'గౌండిన్య'గో
త్రాఽవిర్భూతుని, 'విశ్వనాథ'కవి, నాయన్నన్ స్మరింతున్ దమిన్.

ఉ. పూతుఁడు, 'మాదిరాజు'కులభూషణుఁ, డాంధ్రకవిత్వతత్త్వని
ష్ణాతుఁడు, సంస్కృతాంగ్లయవనస్తుతభాషలఁ గోవిదుండు, రా
జ్యాఽతతకార్యదక్షుఁ, డనయధురతీక్ష్ణుఁడు, న్యాయవర్తనుం
డై తగు'విశ్వనాథ'విబుధాగ్రణి నిశ్చలుఁ గొల్తు నిచ్చలున్.

చ. అనయము నాకు నన్న యయి యన్నిట మన్నన నన్ను దీర్చుచున్
నను విడకుండ నెప్పుడును నన్నొకసత్కవిఁ జేసినట్టి ధీ
వినుతుని 'విశ్వనాథునిఁ' బవిత్రచరిత్రుని సంస్మరించి నే
నన్నృణుఁడ నయ్యెదన్ సతత మంజలి సంఘటియించు చాత్మలోన్.

ఉ. జామతెలుంగుగీము నుడిచానకుఁ గట్టినదిట్ట, కబ్బముల్
మేన గగుర్పొలర్ప గడి మీఱఁగఁ గూర్చినమేటి, కైతలో
సానలఁ దీఱుతీర్పరుల సాగఁగ నీయనిజెట్టి, కర్జముల్
పూనికఁ దీర్పునేర్పు చలమున్ గల 'విన్నన' లెన్సఁ గొల్చెదన్.

మ. కని శాస్త్రాస్త్రములందుఁ 'దిక్కన' యనంగా నొప్పుసత్కీర్తిఁ, దా
దనువున్ బాసెను భౌతికంబు; నయినన్ దత్కీర్తికాయంబు ని
ల్చెను శ్రీ'బిల్హణు' 'విక్రమాంకచరి'తాక్లిష్టాంధ్రకావ్యంపుద
ర్పణమం దారవితారకంబుఁ గవి– విద్వద్వర్యసంస్తుత్య మై.

మ. వ్యవహార–వ్యవసాయ–శిల్ప–కృషివిద్యా–నైకభాషాచణ
త్వవదాతస్థిరకీర్తి, లౌకికపటుత్వంబందు, నీగాన్ సదా
సువిచారప్రథమానమానసమునన్, సుశ్లోకతన్, వాగ్మిత
న్నవ తే రాదురు? 'విశ్వనాథ'కవి కాంధ్రక్ష్మాతలంబందునన్.

ఉ. తమ్ములకన్న నెక్కుడుగ దత్పరతన్ నను నాదరించి యాం
ధ్రమ్మున సంస్కృతమ్మునఁ బరస్పరశిష్యత మేము మేళనన్
ఇమ్మినసెమ్మితోడ 'వనపర్తి' నివాత్మలు నొక్కఁడే యనన్
సమ్మతి నన్ను దీవించినసత్కవిఁ గొల్చెద 'విశ్వనాథునిన్'

ఉ. నిండుమనమ్ము నవ్యనవనీతసమానము, నాల్క దారుణా
ఖండలశస్త్ర మంచు మతిఁ గాంచెను సన్నుత'మాదిరాజు' వం
శుం డగు 'విశ్వనాథ'కవిసోముఁడు, పండినగుండెలో సుధా
భాండము నిండినట్టియుజువర్తను నన్నను సంస్మరించెదన్.

శా. నాకన్నన్ భువి నన్నిటన్ మిగుల మిన్నన్ గాఁగ నెన్నెన్నితిన్.
నాకంబున్ గయికొంటి మున్నుగనె యన్నా! నీదునగ్రేసర
త్వాఽఽకాండల్ మినుముట్టె; నిప్పుడు 'సుధర్మా'ఽలంకృతిన్; మిన్ను మ
న్నేకం బై తగె నీదుసత్కవియశం బీరేడులోకంబులన్.

శా. అన్నా! నీ కిదె పంపుచుంటిని 'సుధర్మా'ఽఽస్థానికన్నన్ గడున్
తె న్నొ 'విక్రమకావ్య'సౌధమును నిర్మింతుండ వై సౌఖ్య మొ
ప్ప న్నానాటికి నుండు మిందు దివిలో స్వర్యాసు లర్పింపఁగా
న న్నాశీస్సుమవృష్టిఁ దేల్చుచు మహానందమ్ముతో నిచ్చలున్.

తే॥ గీ॥ అరయ 'లక్ష్మమ్మ-రామేశ్వరమ్మ-శార
దమ్మ-రామరా' వన నల్గు రనుఁగుసుతుల
నిచ్చు దివినుండి కృపఁ గంచు నీకుభాఽశి
షములఁ గురియించు మని ప్రార్థనములు సేతు.

క. అమరత్వ మొందితివి నీ
వమరం బగుకావ్యమందు నమరపురిని; నీ
కమరెను భువి దివి సుఖములు;
నమస్కరించెదను దీవనను మముఁ గనుమా!

'అమరభారతి'
5-9-22/97, ఆదర్శనగరము
హైదరాబాదు-500004
ఆనంద-విజయదశమి
25-10-1974

# సవరణ పట్టిక

| పుట | పంక్తి | దీనికి | ఇది |
|---|---|---|---|
| 4 | 1 | వసను | వసను |
| 5 | 16 | సన్నిష్ట | సన్నివిష్ట |
| 11 | 16 | ప్రాశ్యా | పాశ్యా |
| 17 | 1 | ఊపద్యము | పునర్ముద్రితము |
| 17 | 5 | జముం | జయుం |
| 17 | 19 | రాజు | రావు |
| 17 | 21 | రాజు | రావు |
| 18 | 20 | ధీయ | ధీయు |
| 21 | 4 | 'సర్గా'ధీ | 'సర్గా'రధీ |
| 28 | 17 | అభ్యుదయ పరంపరాభివృద్ధిగా | సాష్టాంగనమస్కా రంబు లాచరించి |
| 25 | 8 | రచో | రవచో |
| 30 | 14 | ధన్మ | దన్మ |
| 34 | 10 | ధారిణీ | ధారణీ |
| 35 | 25 | లంత | లంకా |
| 45 | 16 | బిల్హణ | శ్రీ బిల్హణ |
| 45 | 19 | దితకవితా | దితగీర్వాణాంధ్రకవితా |
| 45 | 19 | రద్యులు | రద్య |
| 45 | 20 | చితులు | చిత |
| 45 | 21 | నగులక్ష్మణ | లక్ష్మణ |
| 48 | 12 | శించుం | శిన్ గన్ |
| 50 | 5 | వాయితు | వాఽయతు |
| 50 | 12 | దాయిత | దాఽనత |
| 50 | 18 | జబిద్ధు | జంబిద్ధు |
| 60 | 6 | భ్రాజ | భ్రాజీ |
| 62 | 22 | దలంన్ | దలంపన్ |

| పుట | పంక్తి | దీనికి | ఇది |
| --- | --- | --- | --- |
| 65 | 26 | కువలం | కువలం |
| 72 | 14 | రంతు | రంగతు |
| 79 | 22 | రవిఁగుల | రవికల |
| 81 | 10 | త్రైక | రైక |
| 90 | 19 | గాంర | గాంక |
| 94 | 6 | రణుండు | రమణుండు |
| 97 | 1 | థలు | థంబు |
| 97 | 13 | జెయి | జేతి |
| 100 | 8 | తరే | తవరే |
| 101 | 18 | జాడఁగా | జూడఁగా |
| 103 | 7 | పిల్లఁగా | సిల్లఁగా |
| 103 | 11 | ప్లావద్రుచి | లాస్యద్యుతి |
| 103 | 18 | చేంగి | వేంగి |
| 107 | 5 | సరణాఽరవ | గతమౌరజ |
| 109 | 7 | థంబులేదు | థుండు గాఁడు |
| 113 | 4 | బల | ధన |
| 114 | 1 | తెఁగ | రళ |
| 114 | 10 | దాసీగతిన్ | దాసిన్ బలెన్ |
| 114 | 18 | నిచుళానిళాఽత్మకార్మ్యుఁడు | యితనిచుళనిహితకార్ముకుఁడు |
| 114 | 26 | సంక | సకి |
| 115 | 1 | చెందిన | చెంచెనొ |
| 115 | 2 | నగ | ననఁగ |
| 115 | 12 | గలము | గలయు |
| 116 | 23 | రసో | రసే |
| 116 | 24 | శ్వరమణ | శ్వరసు |
| 117 | 7 | మరుఁడుతన | మెయిమరుఁడు |
| 118 | 3 | ప్రిదులు | చెదరు |



| పుట | పంక్తి | దీనికి | ఇది |
| --- | --- | --- | --- |
| 118 | 16 | వసనఁగన్ | ఆనముగన్ |
| 118 | 22 | మూనెన్ | మూనెనొ |
| 118 | 24 | తమో | తనన్ |
| 119 | 7,8 | నితంబ... ...వింతగన్ | ములన్ గుసుమాయుధుండు సుస్థిరుఁ డయి నిల్పె నుచ్ఛ్వసితధీగరిమన్ ఆలదంబు డిందఁగన్ |
| 119 | 16 | నయనపథనూతనమై | హావరపథమై పెలుచన్ |
| 119 | 22 | యుడిగెనొ నా నెఱింగిఁవం | యుడుగుట నెఱిఁగె ననఁగఁ బం |
| 120 | 1 | విరి | యఁగ |
| 120 | 1 | డల | డలు |
| 120 | 2 | పొలఁగగు | భోలఁగ |
| 120 | 2 | రున | రును |
| 120 | 11 | మన మహిఫలకంబున | మున తుణ్ణం బన మహి |
| 120 | 16 | తేఁడె | తేదె |
| 121 | 21 | ఈపద్యమునకు | "అడుగడుగున సంపెంగలు, పొడవు మెఱసె సుభటసైన్యమున్ మదనునకై, యెడఁ గూర్పఁగఁ జైత్రుం డను, గడిదొర వెదఁజల్లినట్టికాంచన మనఁగన్ |
| 122 | 2 | సకల | వివిధ |
| 123 | 3 | విరహ | విరహి |
| 123 | 15 | తాంగుఁడు శశి యైనటు | తాంగుం డైనటు శశి |
| 123 | 16 | గఁ దరంశులు | గ నిజాంశుల |
| 126 | 9 | రోృంగం | రోృగం |
| 126 | 18 | దళపాం | దపాం |

| పుట | పంక్తి | దీనికి | ఇది. |
|---|---|---|---|
| 126 | 25 | లంచు | లించు |
| 126 | 25 | ౖ | 2 |
| 127 | 2 | త్రితం | త్రితవినం |
| 128 | 15 | వగము | వరముహము |
| 129 | 6 | నిదాఁచు | నిఁగాచు |
| 132 | 5 | దుఁగౌను | దుఁగవును |
| 134 | 9 | పవును | వసువు |
| 139 | 25 | ముద | ముద్ర |
| 142 | 21 | కర్మ | కకర్మ |
| 143 | 21 | నలె | నటు |
| 151 | 16 | శ్లామ్య | కామ్య |
| 158 | 6 | ఘనరూ | ఘనురూ |
| 160 | 4 | న్వప | నృప |
| 160 | 20 | సెన | సిర |
| 163 | 8 | గౌనును | గౌనుచు |
| 165 | 15 | ర్వవ | రవ |
| 169 | 1 | ఙించి | ఙించి తా |
| 171 | 25 | లుము | లువలు |
| 181 | 13 | కేకత | కేతక |
| 181 | 20 | యితలు | యితులు |
| 184 | 4 | వీమేనన్ | నీమేనన్ |
| 184 | 7 | నరతు | నరుతు |
| 184 | 8 | వేళి | వెళ |
| 186 | 9 | పని | వని |
| 187 | 23 | కండ్ల నిబ్బు | కన్నులొందు |
| 189 | 18 | 137 | 138 |
| 190 | 4 | కాలుఁ | కాలిఁ |
| 191 | 17 | వివిం | నివిం |



| పుట | పంక్తి | దీనికి | ఇది |
|---|---|---|---|
| 196 | 6 | మీన్ చా | మీంచా |
| 197 | 6 | చుక | చుచు |
| 201 | 23 | పత్వ | పర్వ |
| 208 | 2 | ఖేది | ఖేది |
| 215 | 7 | గర్జాఘ | గర్జన్ఘ |
| 215 | 15 | వు గా | వుగా |
| 217 | 18 | చేంగి | వేంగి |
| 223 | 2 | గా కా | గా |
| 226 | 16 | పంనాన్ | వంక్తినాన్ |
| 227 | 16 | యోద్యత | యానక |
| 230 | 5 | సమిద్రంగమున్ | రణఘోణిసం |
| 230 | 17 | అన | లనఁగ |
| 232 | 19 | స్వాకు | నకు |
| 234 | 18 | నవృద్ద | నవివృద్ధ |
| 240 | 2 | నృపుఁడు | నపుడు |
| 241 | 7 | ప్రవహా | ప్రవహ్వ |
| 243 | 4 | శీధ్ర | శిధ్ర |
| 244 | 13 | ముబ్కు | ముల్కు |
| 249 | 14 | దేశా | దేవా |
| 258 | 4 | స్పృత | ప్రస్పుత |
| 259 | 2 | నుండియ | నుండినయ |
| 269 | 1 | త్తంగ | తుంగ |
| 275 | 1 | సృషి | సృష్టి |
| 280 | 6 | దృటి | త్రుటి |
| 280 | 7 | రాణ్ను | రాజ్ఞ |
| 280 | 9 | భృగా | భృంగా |
| 281 | 19 | కరా | కర్ణా |
| 281 | 20 | ంతా | కంతా |

# విక్రమాంకదేవ చరితము

## ప్రథమాశ్వాసము

### ఇష్టదేవతా స్తుతి

శా. శ్రీమద్వేంకటశైలశృంగవిలసచ్చింతామణిన్ గౌస్తుభ
శ్రీమత్పీఠవిరాజమానవిభవశ్రీభూమివక్షస్స్థలున్
శ్రీమత్పద్మసరోవరాబ్జవసతిశ్రీదీప్తపద్మావతీ
శ్రీమాహాత్మ్యవికాసుఁ గొల్చెదము వాక్సిద్ధికై యాత్మలోన్. 1

మ. కలిబన్నంబుఁ దొలంచఁగా మనమునన్ గాంక్షించి నిచ్చల్ ధరా
తలవైకుంఠము వేంకటాద్రిపయి భక్తవ్రాతముల్ గొల్వఁగా
నెలవై యుండి యభీష్టముల్ గరుణతో నిండారఁ బూరించువే
ల్పులమిన్నన్ భజియింతు మంచితవచస్స్ఫూర్తిన్ బ్రసాదింపఁగన్. 2

సీ. సురభిళఘనసారశోభితోర్ధ్వశ్వేత
తిలకంబుచే సత్త్వతేజ మలర;
బహువిధమణిమయస్వర్ణభూషణములఁ
దేజరిల్లెడురజస్తేజ మమరఁ;
గస్తూరికాకర్దమస్తుత్యచిత్రక
తేజంబునన్ దమస్తేజ మొదవఁ;
త్రిగుణాత్మమాయాపరిత్యక్తసచ్చిదా
నందాఽఽత్మతత్త్వ మానంద మొలయ;

తే. గీ. నంజనాద్రి-వృషాద్రి-నారాయణాద్రి
ముఖ్యసప్తాద్రిశిఖరవిభూషుఁ డగుచు
వెలసి యున్నమాదేవుఁడు వేంకటేశుఁ
డీకృతిన్ బ్రోచుఁగాత సమేధితముగ. 3

శా. ఆనందాబ్ధినిఁ దేల్చునీశ్వరుఁడు కన్నారంగఁ దన్గన్నభ
క్తానీకంబుల, లోకలోచనుఁడు, నిత్యానందసందోహసం
ధానశ్రీమయభవ్యమూర్తి, మునినిధ్యానైకగమ్యుండు కా
వ్యానన్ నిల్చుచు వేంకటేశ్వరుఁడు విఘ్నౌఘంబు ని[1]ఘ్నించుతన్. 4

కం. శ్రీవేంకటగిరివాసుఁడు
సేవాఽఽహితభక్తకోటిచింతారత్నం
బీ "విక్రమాంకచరితం"
బేవిఘ్నము లేక పూర్తి నెయిదఁగఁ బ్రోచున్. 5

కం. భక్తాఽవళిమందారుఁడు
ముక్తిప్రదుఁ డఖిలవేదమూర్ధన్యుఁడు శ్రీ
రక్తుఁడు వేంకటభూధర
సక్తుఁడు మాస్వామి ప్రోచు సత మీరచనన్. 6

ఉ. శ్రీసతి తన్ను మేలమునఁ జేరి యి దేల యుదీన్ సురారులన్
వేసము మాఱి మోసమున బీర మడంతువు ? క్షాత్ర మౌనె ? నీ
వేసవి శౌరి వాదు ? వన దృప్తరిపుక్షతి కిద్ది ధర్మ మౌ
నోసుమగాత్రి ! యంచు ముద మూన్చుముకుందుఁడు ప్రోచు నీకృతిన్. 7

ఉ. శ్రీదయితుండు నిచ్చలు వసించుట నెల్లెడఁ దెల్లఁ జేసి క్ర
వ్యాదపునాస్తికత్వ మడు గంటఁ బరాత్పరువాస్తవంబుఁ బ్ర
హ్లాదునిబాధలన్ దొలఁచ నైనతతిన్ దిర మొందఁ దాల్చు స్తం
భోదితమర్త్యసింహతను పూన్చుత నీకృతి కవ్యయస్థితిన్. 8

ఉ. ఆకృతులందు గర్భభవ మై నరవర్తన డాయులోపముల్
లేక స్వయంబుగా నిల నిలింపరిపుక్షతికై జనించి, తాఁ
బ్రాకృతలీలఁ జూపి, యనపాయతఁ గూర్చునృసింహమూర్తి మా
వాకులయందు నిల్చి యనవద్యకవిత్వమహత్త్వ మిచ్చుతన్. 9

1. ఇది 'హననము చేయుఁగాక' అను నర్థమునందు స్వతంత్రప్రయోగము.



చం. జపతపముల్ క్రతుక్రియలు సర్వము నిన్ గనఁ జేయఁ బోవు; ని
ష్కపుదృఢభక్తిమైఁ గొలువఁ గల్గెడుభక్తజనంబు లిచ్చఁ గో
ర్వపువున గోచరించి యల భక్తవశిత్వము వెల్లడింతు; వ
శ్రపసుతుభక్తి మెచ్చవె; ప్రసన్నతఁ గూర్చుమ ! మర్త్యసింహమా ! 10

చం. తనయన్నన్ గిటి యై వధించె నను క్రోధం బేఁచఁగా రోసి యెం
దును దాఁ గాంచనితంత్రికిన్ హరిపదస్తోత్రంబుచే నెల్లయం
దును శ్రీనేత వసించు నన్సుతుని 'నిందున్ జూపు' మం చశ్రపుం
[1]దనుకోపుం డయి స్తంభతాడనముఁ జేయన్ బుట్టురూ పోముతన్. 11

చం. పొలఁతి మొగంబులన్ నలువ పూన్పఁగ విజ్జులఁ బొందు: వెన్నుఁడున్
జెలి నురమందు నిల్పఁ బరసీమలఁ జేరుఁ; దథావిధంబు నీ
వల కని పోలు మేసగమునందుఁ దవిల్చితి; జాణ వంచు నే
ర్పలవడఁ బల్కుగౌరి స్మితుఁ డై కనుశంకరుఁ డోము నీకృతిన్. 12

చం. ఇలఁ బడుగంగ నౌదల వహించితి క్రొవ్వల పొటఁ బెక్కుపో
కల నిను మీఱి జాలి వలకైపున వారిధిఁ గూడు చుండినన్
దొలఁచవు; పల్లవాధ్వ మిది తొయ్యలి కౌవగనేన్ గణింప వం
చలుక వచించుగౌరిఁ బ్రణయంబునఁ దేర్చుశివుండు మే లిడున్. 13

చం. స్థితి హరికిన్ బ్రశస్తి నిదె; ఛేదము నా కిదె దూఱు; నచ్యుత
స్థితిఁ గన దూఱు వోవు నను చిత్తమునన్ దలఁ దాల్చి గంగఁ గూ
ర్చితివి సపత్నిపోరు; నహిఁ జేర్చి బెదు ర్గనఁ జేసి తంతె, త
త్స్థితిఁ గన వంచుఁ బల్కునుమఁ దేర్చుహరుండు కృతిన్ గనుంగొనున్.

సీ. పల్ల జడలనిన్ను వరియించు నేచెలి ?
తపమున జడ లీవు దాల్ప లేదె !
గట్టుప ట్టగునిన్ను గైపట్టు నేచెలి ?
గట్టుపట్టున నీవు పుట్ట లేదె !

1. అనుగతకోపుఁడు.

కరిచర్మవసను నిన్ గదియు నెకోమలి ?
గతి-కుచస్థితి నీకు గజత లేదె !
కన్నవారలె లేనినిన్ను గోరు నెవతె ?
నీ తల్లి కోరెఁ గా నీ జనకునిఁ;

తే. గీ. దొలఁగఁ జేసితి రూపరిఁ దుంటవిల్తు;
మెలఁగఁ జేసితి చూపున మేలుకొలిపి;
యనుచుఁ దమలోని లోప-సామ్యములు వలికి-
కొనెడు తొలిజంట కావ్యంబుఁ గనుఁ జిరంబు. 15

సీ. గ్రహియించితిని గోరి కదలిఁ బొడమినన్;
వరియించితినె స్వయంవరవిధమున ?
గాంధర్వవిధిఁ గొంటిఁగా యనఁ జెల్లదే !
యిరువురిప్రేమ లెయ్యెడలఁ గూడెఁ ?
గదలిఁ బుట్టిననీకు క్షత్రియవిధి యేల ?
కదలిపదఁతి నీకుఁ గలిగెఁ గాదె !
యురమున నిముఁ బ్రేమ నిరవుకొల్పితిఁ గాదె !
సామేన సతి నిల్పుశర్వుఁ గనవె ?

తే. గీ. చంచలాననిభాంగసౌష్ఠవ మ దెంత ?
మొగులుకప్పునఁ జొప్పడుమురిప మెంత ?
యనుచుఁ గేళీపరత మేల మాడుకొనెడు
శ్రీహరిద్వంద్వ మెపుడు రక్షించుఁ గృతిని. 16

సీ. అతివ ! యెంతటిపుణ్యవతివి శౌరి మగండు;
శౌరి తూ పయినయీశ్వరుఁడ శౌరి;
మత్తదైత్యారి యో మానిని ! నీ భర్త;
అతిహరిదైత్యసంహరుఁడ హరుఁడు;



సురలకు సుధఁ బంచి స్తుతిఁ గాంచె నీహరి;
విష మాని సురపతిఁ [1] దేర్చె హరుఁడు;
భువి లీలఁ బ్రకటించె మూర్తు లూని ముకుందుఁ;
డఖిలంబు హరుఁడ మూర్త్యష్టకమునఁ;

తే. గీ. గననియున్నతి లక్ష్మి ! వాకొనుట తగవె !
తచ్చు నెచ్చనఁగా గౌరి ! ధర్మ మగునె !
యనుచుఁ దుద కేకనామవర్తనత నమత
నెలమిఁ గనెడు వృషాకపాయి కృతి నరయు. 17

## సరస్వతీస్తుతి

ఉ. పట్టపుదేవి యై నలువవక్త్రములన్ నటియించి, తన్వి లే
నట్టులఁ బుట్టపట్టిముఖమందున, దీవినిఁ బుట్టువానివా
మట్టునఁ దూఁగి, పిమ్మట సమస్తకవీంద్రరసనాగ్రపాళిఁ గ
న్పట్టి ప్రశస్తిఁ గూర్చునుడినాతి నటించుత మాదునాలుకన్. 18

మ. చతురాస్యాఽస్యచతుష్టయంబున సదా సాన్నిధ్యమున్ బొంది; గీ
ష్పతిముఖ్యాఖిలవిద్వదాస్యనటనప్రావీణ్యమున్ జూపి, యు
న్నతముక్తాఽఽసనసన్నిష్ఠ యయి, వీణాపాణి యౌ శ్రీసర
స్వతి మావాక్కుల సర్వదా నిలిచి కావ్యం బోము నెవ్వేళలన్. 19

మ. గురునొద్దన్ గళ లభ్యసించి కవితన్ గోర్వారికే నంద రా
కురుభక్తిన్ త్వదుపాస్తి సేయ వశ వై యుత్సాహమున్ గూర్తు; వ
క్షరముల్ నేర్పనివాని కేనిఁ గవితాసారస్వతప్రక్రియల్
పరఁగెం బో తనకైత నిన్ గొలుచుటన్ భాషాసతీ ! మా[2]ద్రియై. 20

శా. గీర్వాణాంధ్రములన్ బఠింప మురుశక్తిన్; శాస్త్రవిజ్ఞానమా
నేర్పన్ లేదు; ప్రబంధపంక్తి ననుసంధింప న్గనన్ జాలమే;
మర్వాచీనపురాణసంగతకృతివ్యాసంగమా సున్న; నీ
నిర్వక్రాశ్రయ మూని పూనితిమి వాణీ ! యాకృతిన్ గూర్పఁగన్. 21

1. అతిశయింపఁజేసె, 2. సామ్యమము.

సీ. అజచతుర్ముఖముల నాడుచు నామ్నాయ
పరిణతిఁ బరఁగించు పాటవంబు,
వల్మీకజ-వ్యాసవరకవితాలతఁ
బ్రబలించి ఫల మూన్చుప్రౌఢిమంబుఁ,
కాళిదాసాదిసకలసంస్కృతప్రబం
ధకవుల నేలుని స్తంద్రకరుణ,
నన్నయాద్యాంధ్రనానాకవీశానుల
నిలఁ గీర్తిఁ గనఁ జేయునేర్తెఱయును,
తే. గీ. గరుణఁ గ్రోడీకరించి విస్తరిలఁ జేసి
మమ్ముఁ గించిజ్జ్ఞులన్ సర్వమాన్యులుగను
నిలిపి మాపూనుకృతిని నిర్నిద్రరీతి
నిలువు మాదండ నండ వై పలుకుతల్లి! 22

## వి నా య క స్తు తి

మ. హరి యైనన్ హరుఁ డైన వారిజభవుం డైనన్ బులోమాత్మజా
వరుఁ డైనన్ బనిఁ బూని తొల్త నినుఁ గొల్వన్ గొప్పయే మాదృశుల్;
వరభక్తిన్ నిను గొల్వ కుందురె! శుభప్రారంభవేళన్ ద్విపే
శ్వరవక్త్రా! చన బన్నముల్ విమలవాచాశుద్ధి మా కూన్చుమా! 23
ఉ. బ్రహ్మకు బ్రహ్మచర్యమున భారతిబంధుత లోటు నాటె; నా
జిహ్మగశాయికిన్ వటుత చెన్నతె వంచన వంచ నబ్బలిన్:
జిహ్మగభూషణుండు పొలిచెన్ గుహనావటుకాఖ్యఁ గందునన్;
జిహ్మత లేక నీవటుత చెల్లు గణేశ్వర! సాటి లే కిలన్. 24
ఆ.వె. ఏకదంతరుచి ననేకవిఘ్నంబులఁ
గడఁగఁ ద్రోచి సర్వకార్యసిద్ధి
ముజ్జగంబులకును మొదలఁ జేసెడివినా
యకుఁడు కృతినిఁ బ్రోచు నాదరమున. 25



## పూ ర్వ క వి స్తు తి

మ. నిగమాద్యాద్యకృతిప్రబద్ధ మయి క్షోణిన్ లేనిఛందఃప్రభా
వగరిష్ఠం బగుకైత రామచరితప్రాశస్త్యగానామృతా
నుగతిన్ నైజమహత్త్వ మీజగతిఁ దెన్నుల్ గాంచఁగా జేయువి
శ్వగగకీర్తిస్థిరు నాకుజున్ గొలుతు మిచ్చన్ ధీరమాసిద్ధికై. 26
మ. రసనావ్యాప్తపురాణముల్ సరసధారాగ్రంథసంతానముల్
రస నానాఘులతాలవిత్రములు నిర్వాణప్రదంబుల్ సుధీ-
రసనానర్తన సల్పుభారతకథాగ్రంథంబు నాచంద్రసా
రసనాథంబుగ నిల్పెఁ; గొల్చెదము పారాశర్యు వాక్సిద్ధికై. 27
ఉ. ఆర్షకృతిస్థవస్తువుల నంది, యనింద్యమహత్త్వ మూన్చి; యు
త్కర్షత వర్ణనల్ రసవికాసములున్ సదలంక్రియల్ సుధీ
హర్షము లధ్వదర్శనము లై తగి నాటకకావ్యపంక్తి దు
ర్ధర్షతఁ గూర్చుసంస్కృతబుధప్రకరంబు నుతింతు మాత్మలోన్. 28
ఉ. సన్నుతసంస్కృతోక్తినిఁ బ్రచారముఁ గాంచినభారతంబు మే
ల్తిన్ననితెన్గుబాసపయిఁ దెన్గుజనుల్ చవిఁ గాంచి యందు మై
కొన్నవినీతిఁ బావనతఁ గూర్చి తెనుంగుకవిత్వమున్ మొదల్
తెన్నుగ నిల్పునన్నయను దిక్కనఁ గొల్చెద మెల్లప్రెగ్గడన్. 29
మ. నయ మొప్పంగ మిగుల్పురాణములు మున్ జన్నన్నయాదుల్ మొద
ల్కయి సేయంగలమార్గ మూని ధరణిన్ గల్యాణముల్ గూర్చి దు
ర్జయ సంసారసముద్రతారకము లై రాజిల్లఁగా నిల్పుధీ
మయ శ్రీనాథునిఁ బోతనాదులను నాత్మన్ గొల్తు మశ్రాంతమున్. 30
శా. విశ్వశ్రేయము కావ్య మన్నుడి జగద్వేద్యంబు: యాభంగి న
వ్విశ్వస్తుత్యులు కాళిదాసముఖు లుర్విన్ దెర్వుగా నిల్పఁగా
శశ్వద్రీతిఁ బ్రబంధముల్ తెలుఁగునన్ స్థాపించుసూరీంద్రులన్.
విశ్వాసంబునఁ బెద్దనాదుల మొద ల్పేర్కొందు మీ సత్కృతిన్. 31

శా. పాశ్చాత్యోక్తియె పాఠశాలలఁ గదుఁ బ్రాముఖ్యముఁ జెందఁగా
దుశ్చింత్యస్థితి సంస్కృతాంధ్రములు పొందుఁ డింద కాసక్తి వై
పశ్చిత్యాఢ్యము గాన్ బరీక్షల నభన్ బ్రాగ్గ్రంథటీకాదులన్
నైశ్చల్యంబుగఁ దీర్చునట్టిబుధులన్ ధ్యానింతు మిచ్చన్ సదా. 32

## అసదాక్షేపము

సీ. సంస్కృతపదసమాసఘటితకవితపైఁ
బామరాగమ్యతఁ బలుకువారిఁ,
దెలుఁగుపలుకులముద్దు లొలుకుకైతనుగూర్చి
పండితాశ్లాఘ్యతఁ బలుపువారి,
మిశ్రభాషగ నాంధ్ర మాశ్రయించినకైత
వరిపెర్వుకూ ర్పని వాడువారి,
నైఘంటికము లయినను దా మెఱుంగక
మూలపదము లని మ్రోగువారి,

తే. గీ. నర్థిఁ బ్రార్థింతు మీసుఁ బోనాడి నెమ్మిఁ
బాక్షికోక్తిని విడి చిత్తసాక్షికముగ
నొప్పుతప్పుల గుఱితించి మెప్పుఁ దీర్చి
శ్రేయ మొందఁగ భారతీసేవనమున. 33

సీ. బదులుపలుకుల భావభంగంబు శంకించి
వడిప్రాసముల దిగ విడుచువారు,
వర్ణభేదమున నన్వయభేద మగు నని,
సంధ్యనుస్వారముల్ సడలువారు,
వస్తు వవస్తువై పరఁగు నంచుత్ప్రేక్ష
ణాద్యలంకృతులఁ బోనాడువారు,
రసగుంఫనమున నీరస మగు ననుచు శృం
గారాదిరసముల దూఱువారు,



తే. గీ. ప్రౌఢకవితను మో టని భావకవిత
మిట్టి మిన్ బ్రాఁకి తెరువేది మిడుకువారు
తమదునేరమియే కారణముగ: మేము
పూర్వపక్షిఁ గృతిన్ గూర్ప మొదలిడితిమి. 34

చ. కవితకు మూల మౌఁ బ్రకృతి; కల్పన యప్ప్రకృతిన్ శ్రయించుఁ; బ్రా
క్కవులు నిసర్గమున్ గడకఁ గైకొని కావ్యములందుఁ గూర్పఁ గ్రొ
క్కవితఁ దదీయకల్పనవికారము నూన్పినఁ జౌర్య మౌ నెటుల్ ?
ప్రవిమలచాతురీమహితభావలసత్కృతిఁ గూర్పఁ గానమిన్. 35

చ. కొలఁదిగ వాచకా ల్పదివి కొద్దిగ గొప్పలుగాఁ బరీక్షకై
నిలిపినకావ్యభాగములనే యెటులో కడఁగాఁ గనుంగొనన్
గలిగి తరించి తద్విరుదకాండములన్ గడియించినంతనే
కలితసువాగలంకరణక్రమరసజ్ఞుఁడుగాఁ జెలంగునే ? 36

ఉ. కన్నులముందు భావములు గ్రాలక తద్రచనాప్రభావసం
పన్నత కైనవాక్పటలి పైపయిఁ దా నయి కాన రాక, మీఁ
ద న్నుతరీతి నెత్తఁబడి దట్టక గంటముఁ జేతఁ బూనినన్
మిన్నులు నూచుటే యగు నుమీ! తుది ముట్టునె కైత లెంతయున్. 37

ఉ. మూలపదంబు లంచుఁ దమబుద్ధికిఁ దట్టనిమాత్రఁ బల్కుచున్
జాలిగ లక్ష్యముల్ దెలియఁ జాలక లక్షణ మాశ్రయించి కా
వ్యాళిపరీచితిన్ గనక యద్దులు వల్కి నిజాజ్ఞతల్ బయ
ల్పాలుగఁ జేయుటే యగు; సెబా సని యందురె సత్కవీశ్వరుల్. 38

## కుకవినింద

ఉ. చెట్టునమండి క్రిందుగ వసించినసజ్జనుపైననేనిఁ దా
రెట్టను వీడుటే సహజరీతి గణించెదునేకదృష్టియై
దిట్టతనంబుఁ గైతఁ గలతీయఁదనం బరయంగ లేక పై
పట్టున నిల్చి రట్టులను వాగెదుకాకవి యేల పుట్టెనో ! 39

మ. నృపమార్గంబున ఠీవిఁ బోవఁ గని యెంతేఁ గుక్క లార్వన్ మద
ద్విప మింతైనఁ గలంగునే! తనదుగాంభీర్యంబుఁ దగ్గించునే!
సపదిస్ఫారకవిత్వధోరణి గతిస్ఫాయత్కవీభంబు ర
థ్యపయిన్ ఘీంకృతి సల్పుచో నిలుచు నేలా కాకవిశ్వానముల్. 40

మ. భవసంబంధతమోవిలుంఠనచణావ్యాజప్రభాయుక్సుధీ
రవి భాషాకిరణప్రసారణములన్ రంజింప లోకంబుఁ, ద
చ్ఛవి సైరింపక గొంది దాఁగికొని దోషావేళ మున్ నిక్కు కా
కవిఘూకంబులు నిర్జనైకవసతిన్ గా కన్యమున్ గాంచునే? 41

## మా ప్రతిజ్ఞ

కం. తలతలగా మునుపటికై
తలవలె వ్రాయంగ లేక తద్రీతులు వోఁ
దలికెడువారికళాఽఽప్తికిఁ
దులగాఁ గొలగా రచింపఁ దొడరితిమి కృతిన్. 42

## గురుస్తుతి

సీ. ప్రవిమలౌపనిషదాద్వైతభాస్కరుఁ డాద్య
శంకరభగవదాచార్యవరుఁడు,
భగవద్రమణుఁడు జీవన్ముక్తమౌనీంద్రుఁ,
డన్యు లద్వైతపీఠాధిపతులు,
'శారదా' 'కామకోటి' రమ్యపీఠాధి
నేత లద్వైతాధినేతృవరులు,
నన్యులు సంస్కృతాంధ్రాఽఽది విద్యలయందుఁ
బ్రనిశితశేముషీప్రథితగురులు



తే. గీ. ఎల్లరను భక్తితో స్మరియించి వారి
పాదయుగళాంబుజములకుఁ బ్రణతి సేతు
మస్మదీయకావ్యంబు నిరంతరాయ
ముగ సదా నెలకొనుటకై జగతిలోన. 43

మ. అతులప్రజ్ఞుఁడు 'మానవల్లి' కులదుగ్ధాంభోధిచంద్రుం డనా
రతసాహిత్యతపస్సమాహితుఁడు గీర్వాణాంధ్రసౌహిత్యసం
హితుఁ డస్మద్గురుఁ డాంధ్రసాహితిని మా కీకావ్యమున్ వ్రాయ నా
నతి యిచ్చెన్, బుధ 'రామకృష్ణకవికి' న్సాష్టాంగనత్యంజలుల్. 44

## లక్ష్మణశాస్త్రి వంశాఽవళి

సీ. వేదవేదాంగాఽదివివిధశాస్త్రముల ని
ష్ణాతులు భువి వెలనాటివారు,
శ్రౌతధర్మాఽగమస్మార్తవిధానవి
జ్ఞానులు ధర వెలనాటివారు,
రాజకీయాధికారప్రాజ్యసంస్తుత్య
నయపారగులు వెలనాటివారు,
ప్రాచ్య-ప్రాశ్చాత్యశాస్త్రప్రఖ్యవిద్వదు
న్నతిసమున్నతులు వెలనాటివారు,

తే. గీ. అట్టివెలనాటి విప్రశాఖాంగ మైన
"కప్పగంతుల" తెగలోనఁ గౌశికాన్వ
వాయవిబుధులు 'వనపర్తి' పత్తనమున
వెలయువా రాంధ్రమున విశ్రుతులుగఁ జెలఁగి. 45

ఉ. ఏముని యింద్రనిర్జరదిగీశుల నన్యుల నన్యలోకముల్
[1] తామస మింత లేక విభుతన్ సృజియింపఁ గడంగె; ఘోర మౌ
నేమముఁ బూని బ్రాహ్మణమునిత్వముఁ గాంచెను; నట్టి సన్ముని
గ్రామణి మత్కులాగ్రజుఁడు గాధిజుఁ డొప్పు నగాధసత్త్వుఁ డై. 46

---

1. ఆలస్యము.

ఉ. ఆకులమందుఁ బుట్టిరి మహామహితాత్ములు, పౌండరీకయ
జ్ఞాకలనప్రదీనిధులు శాస్త్రసదర్థనిధుల్ సమస్తవి
ద్యాకృతు లాగమోక్తసవనాదివిధానవిచక్షణుల్ పవి
త్రీకృతవిగ్రహాత్మ లతిథీకృతనిర్జరు లబ్జజప్రభుల్. 47

సీ. వారిలో వెలసె 'సుబ్బాభట్టుఁ,' డతఁడు 'కృ
ష్ణంభట్టుఁ గనియె విజ్ఞానఖనిని,
బడసె నతండు' 'సుబ్రహ్మణ్య' నామకు,
నాతని పుత్రత్రయంబునందు
నగ్రపుత్రుఁడు 'లక్ష్మ' యాభిధుం, డాతఁడు
వడసె సూనుని 'శ్రీనివాస' విబుధు,
నల 'రామనాథ-కృష్ణార్య-లక్ష్మణశాస్త్రు'
లాత్మజు లాతని కైరి మువ్వు

తే. గీ. రల కనీయుఁడ నే 'లక్ష్మ' ణాభిధుండ
నాంధ్రగీర్వాణసాహితీవ్యాకృతులను,
నుభయభాషాకవిత్వసముజ్జ్వలతను
బార మెయిదితి గురులయపారకరుణ. 48

మ. వరుస౯ మత్ప్రపితామహార్హ్యణుల 'సుబ్రహ్మణ్య - సుబ్బాంబల౯'
మఱి మాతామహ 'లక్ష్మమాంబ - బుధలక్ష్మ' య్యాఖ్యుల౯ బూజ్యుల౯
వర 'శ్రీవత్స' సగోత్రుల౯ దలఁచెద౯ థ 'వ్యాత్మకహ' ర్యాసుల౯
'పెరవ' ల్లన్వయుల౯ శ్రుతిస్మృతిహితశ్రేష్ఠాధ్వరప్రజ్ఞుల౯. 49

క. సతి 'నరసమ' 'లక్ష్మయ' మ
త్పితామహుల 'శ్రీనివాసు' స్థిరమతిఁ 'బద్మా
వతి' మత్పితరులఁ దలఁచెదఁ
గృతిమొదల౯ 'రామనాథ - కృ' ష్ణాగ్రజుల౯. 50



క. 'వామననాయకుఁడు' సుత
ప్రేమ౯ బోషించి నన్ను, విద్యాబుద్ధుల్
నేమముతో నేర్పెను; నే
నామహితునిఁ గృతినిఁ దలఁతు నతిభక్తిమెయి౯. 51

గీ. అన్నపూర్ణకు నుద్ది యౌ "నన్నపూర్ణ"
ధర్మపత్నికిఁ గల్గెఁ బుత్రత్రయంబు,
నందుఁ బాశ్చాత్యవైద్యవిద్యావచణుండు
జ్యాయుఁడు "ప్రభాకరుఁడు" శారదాహితుండు. 52

గీ. "కమల" రెండవసంతతి యమరభాష
నరసి నేర్చినవిదుషి, విద్యావినోద,
చతుర, చతురాత్మజామణిసహిత యగుచుఁ
బతి 'రఘుపతి' మనం బారఁ బ్రబలి మెలఁగు. 53

గీ. మత్కనిష్ఠాత్మజుఁడు ఛాత్రమాన్యుఁ డైన
"కృష్ణమూ" ర్త్య భిధానుండు, క్రీడలందుఁ
విద్యలందు సాంకేతికవిద్యలందుఁ
'జతురవిద్యార్థి' యనుపేర సాగు చుండు. 54

లక్ష్మణశాస్త్రి గురుస్తుతి

చ. తిరుపతి వేంకటేశ్వరుల దివ్యపదంబున శ్రీచిదంబరే
శ్వరుపురి సాహితి౯ మఱియు వ్యాకరణంబుఁ బఠించి యంతఁ ద
త్పరతఁ బఠించితి౯ బరమతత్త్వము వేదశిరఃప్రపంచ మే
నరయఁగ మద్రపట్టనమునందున సద్గురుసేవ సేయుచు౯. 55

సీ. 'కృష్ణమాచార్యుఁడు నిష్ణాతుఁ డఖిలశా
స్త్రములందుఁ 'బరిశి' వంశసితరోచి,
'సేతుమాధవుఁడు' ప్రఖ్యాత 'మహామహో
పాధ్యాయుఁ' డహిపతిఫణితిచణుఁడు,

'కృష్ణశాస్త్రి' విశిష్టకీర్తి 'మహామహో
పాధ్యాయుఁడు' 'కరుంగు' శాలిజనుఁడు;
కృతి 'రామచంద్ర దీక్షిత' 'వేంకటేశ్వర
దీక్షితు' లద్వైతశిక్ష గురులు,

తే. గీ. నరయఁ 'జక్రాల నరసింహ'- 'గిరిధరార్య'
ముఖ్యసురభారతీగురుముఖ్యు; లెల్ల
రను హృదిన్ సంస్మరించి ప్రశ్రయముతోడ
నతిశతంబు సమర్పింతుఁ గృతిమొదలన. 56

తే. గీ. పారశీక - మహారాష్ట్ర - భవ్యతమిళ-
కన్న - డాంగ్ల - హిందీభాష లున్నతముగ
నేర్చి రచనలు సేయఁగా నేర్పినాఁడ
నస్మదాచార్యపాదపద్మాఽశిషముల. 57

ఉ. మున్నల 'హైద్రబాదు' న సమున్నతి నున్న 'వివేకవర్ధనిన్'
బన్నుగ నంత మారు 'వనపర్తిని' నున్నతపాఠశాల యం
దున్నతి నాంధ్రబోధన నియుక్తుఁడ నై యట రాట్సభాబుధ
ప్రోన్నతిఁ గాంచి యన్నిట మహోజ్జ్వలకీర్తి గడించి మించితిన్. 58

క. వనపర్తిని 'రామేశ్వర'
జనపతి యాస్థానకవిగ సన్మానించెన్
నను; గడఁకను విద్యాలయ
మున సభయందును యశంబు మునుకొని కంటిన్. 59

క. నాయున్నతి చూపోప క
సూయాపరు లంత నృపతిశ్రుతిఁ గొండెములన్
వాయోదక నుడివినఁ దా
నేయోచన సేయకుండ హీనతఁ గనఁగా. 60



ఉ. నే నట నుండఁ జాలక యనింద్యుఁడ నౌట మనోఽభిమానమున్
బూనుచు వీడి మాపురిఁ, బ్రభుత్వపురోన్నతపాఠశాలలో
మానుగ నాంధ్రపండితసమర్హణఁ గాంచితి హైద్రబాదులోఁ
బ్రాణముకన్న మానమె వరం బగుఁగా మహి మానికోటికిన్. 61

ఉ. ఆరహి నాంధ్రపండితుఁడ నై యట నుండఁ బ్రభుత్వపున్ 'సమా
చారవిభాగ' మందు బుధసన్నుత 'విద్యలశాఖ' లో మనం
బార సమున్నతాధికృతి నంది తెనుంగును సంస్కృతంబునున్
వే ఱగుభాషలన్ గొలిచి విశ్రుతిఁ గాంచుచు నుంటి వేడ్కమై. 62

క. పన్నుగ నస్మద్విద్యను
విన్నాణము దెలిసి నన్ను బ్రియ 'రామేశుం'
డున్నతసంస్కృతగీర్వి
ద్యున్నతపదమందు నిలిపెఁ; దలఁచెద నతనిన్. 63

మ. అల వారాణసి సంస్కృతీయఘనవిద్యావిశ్వవిద్యాలయ
స్థ లస 'చ్ఛిష్టసదస్యతన్' వివిధవిద్యాసంస్థలన్ సభ్యతా
విలసత్ఖ్యాతి గడించి యాంధ్ర-సురగీర్విఖ్యాతకావ్యక్రియా
కలనాఽత్తస్థిరకీర్తి లక్ష్మణుఁడ నేఁ గాంతున్ మృడానీకృపన్. 64

### విశ్వనాథరావు వంశాఽవళి

సీ. వంశపరంపరావర్ధితలౌకిక
వ్యవహారవిజ్ఞతఁ బఱగువారు,
సమయోచితక్రియాసాధనోపాయమ
నీషావిశేషాఽప్తి నెగడువారు,
దీనావనాఽసక్తదృఢకృపాపారీణ
తాఽలంకృతమనస్కులైనవారు,
ప్రాణభయాఽగతప్రాణిలోకాభయ
దాతృత్వశస్యులై తనరువారు,

తే. గీ. దేవ-భూదేవపూజాఽఽప్తదివ్యదీప్తి
జన్మపావనచర్యాప్రసన్నభువన
శంశనీయులు నిస్సమసారమతులు,
విదితగతి నొప్పువార లార్వేలవారు. 65

సీ. సతతరజస్తమోయుతభూపతిప్రజా
వైరాపనోదనప్రతిభ గల్గి,
లేఖనీనిస్త్రింశలీలాకవిత్వసం
గ్రామసమానవిక్రమము గల్గి,
యర్థార్థివస్తుదానాఽఽస్థానసంగత
కార్యాఽఽత్తనైశ్చల్యగరిమ గల్గి,
మంత్రతంత్రజ్ఞతామహిమప్రకంపితా
రాతిరాడ్బలపరాక్రమము గల్గి,

తే. గీ. స్వామిహితకార్యనిర్వాహచణవిచక్ష
ణాతిశయభక్తిసంభావితాంతరంగ
రంగదుత్సాహసాహసప్రభుత గల్గి
వెలయువారలు పృథివి నార్వేలవారు. 66

మ. పరశాఖాభవు లౌనియోగిజనముల్ ప్రాబల్య మొప్పార భూ
వరులన్ జేరి యమాత్యముఖ్యపదవీభ్రాజిష్ణు లై వచ్చినన్
స్ఫురదాత్మప్రభు లై యమాత్యముఖు లై సొం పొంది రార్వేలవా
ర రహిన్ బ్రెగ్గడ-మం-త్ర్యమాత్య-సచివప్రాజ్యాఽఽఖ్యలన్ మేటు లై. 67

ఉ. ధన్యత మీఱునీతెగ నుదారమనీషిత 'మాదిరాజు' 'కౌం
డిన్య' సగోత్రుఁ డప్పటికడిందిసుధీజనులందు మేటి యై
మాన్యతఁ గాంచెఁ; దత్కులజమండలి దెల్గుధరిత్రి ధీరమూ
ర్ధన్యత విచ్చె నం దొకపరంపర వచ్చి స్వమందిరంబుగన్. 68



ఉ. ధన్యత మీఱునీతెగ నుదారమనీషిత "మాదిరాజు" 'కౌం-
డిన్య'సగోత్రుఁ డప్పటికడిందిసుధీజనులందు మేటి యై
మాన్యతఁ గాంచెఁ దత్కులజమండలిఁ; దెల్గుధరిత్రి ధీరమూ
ర్ధన్యత విచ్చె నం దొకపరంపర వచ్చి స్వమందిరంబుగన్. 68

చ. మును జనమేజముం డలిగి పూన్చినపన్నగయాగకారణం
బునఁ దనుఁ బొందుకిల్బిషము వోవఁగఁ 'గాశి' మొదల్గ సేతువం
ద నిలుపుదేవళంబుల నుదార మొకం డగుకేశవాఽఽలయం
బున నుతిఁ గాంచుమేటిపురమున్ 'మిడుతూరు' నొనర్చి యచ్చటన్. 69

చ. వరకవితావిలాసయుతి భాసిలుచున్ వ్యవహారపద్ధతిన్
బురుడు గనంగ లేక యసముల్ మహితాఽఽత్ములు విశ్వసంస్తుతి
స్ఫురణ వహించి యాకులముప్రోడలు కీర్తిమయాఽఽత్ము లైరి యీ
వరుసను 'వేంక'యాఽఽహ్వయుఁడు వాసిఁ గనెన్ సతి 'సుబ్బమాంబ'నాన్.

క. అతఁ డాసుబ్బమసతియం
దతిచతురుల సుతులఁ గనియె నార్వుర సుత నొ
క్కతె; వారలలో నగ్రజుఁ
డతులగుణుం డలరె 'దత్త'యాఽఽఖ్యుఁడు కవి యై. 71

క. అతనికి వెనుకగఁ 'గన్నయ'
సుత 'కొండమ' 'లక్ష్మనాథ-సుబ్బయ'లు క్రమ
స్థితి 'రామరాజు' బుధవం
దితుఁ డగు 'విధుశేఖరుండు' నెగడిరి సుతు లై. 72

ఉ. ఆసుతషట్కమందు సుగుణాఽఽఢ్యుఁడు ధీరుఁడు రామరాజు వి
ద్యాసముపాఽఽర్జనంబునకు నై తనసోదరి కొండమాంబయా
వాసము 'తక్కశీలఁ' జని, వాసినిఁ గాంచెడు 'సంజి' వాఽఽహ్వయున్
ధీనముపేతు బావ సముదీర్ణవినీతినిఁ జేరి శిష్యుఁ డై. 73

క. నేరిచె నాకవితల్లజు
చేరువ గణితాఽఽగమంబు శిష్టపురాణ
ప్రారజ్యద్వక్తృతయున్
సారాంధ్రగ్రంథవిమలసాహిత్యంబున్. 74

తే. గీ. దిట్టతనమునఁ జేరువ ఘట్టకుట్టిఁ
జేరి యచ్చోటను గచేరివారికెలనఁ
గఱచె మరతీలిపిన్ వ్రాయఁగాఁ బఠింప
వరుసఁ గచ్చేరిపనులఁ దీర్పంగ నంద 75

సీ. "పెనుబాల"వంశజోర్వీపాలపాలిత
'వనపర్తి' సంస్థానపశ్చిమాన,
జనఘనకిల్బిషశమనసామర్థ్య 'కృ
ష్ణా' ఽఽపగోదక్తటాభ్యాశసీమ,
వర్ణాఽఽశ్రమాఽఽచారపరచతుర్వర్ణప్ర
జాఽఽవళీసాధితైకాఽఽలయంబు,
గ్రామప్రజాసుఖప్రాపణప్రవణతా
భ్రాజిష్ణుకేశవప్రాంగణంబు,

తే. గీ. నైన 'శాఖాపురంబు'న నమలభక్తి
శ్రీనృసింహాంఘ్రికమలసంసేవనమునఁ
జెలఁగు చున్న'నియోగి'వంశ్యుఁ డసమ
ధీయుతుం డగు'శేషయ' తేజు మీఱ. 76

క. కనె 'సంజెమాంబ'యందున్
దనుజాష్టకంబు వరుసఁ; దనుజు లౌదవమిన్
దనమూఁడవసుత 'సింగమ'
కనుగుణు వరుఁ గూర్చి తనగృహంబున నిలుపన్. 77



చ. తలఁచి, తలంపు 'తక్కశిల' ధామముగాఁ గల'సంజివయ్యకున్'
దెలుఁప నతండు ప్రేమ మెఱఁదిన్ సవిధస్థుని 'రామరాయనిన్'
బిల్చి సమస్తమున్ దెలిపి వేడుక నంపె హితోక్తిఁ బల్కుచున్;
దలఁపు ఫలించినట్టుల ముదంబున శేషయ తెచ్చి యామెయిన్. 78

క. తనకూఁతుతోడఁ బెండిలిఁ
దనరిచి తనయింట నిలిపెఁ; దదుపరి నతఁడున్
వినయమున నత్తమామలఁ
దనసతితోఁ గొల్చుచున్ ముదంబున నుండన్. 79

క. తనమామవెంటఁ గరణపుఁ
బనికై 'వనపర్తి' నిచ్చ వచ్చుచు నుండన్
గని రాణి కుశలి యౌనా
తని నుద్యోగంబునందుఁ దగ నెక్కొలిపెన్. 80

మ. పయివా రాతని మే లనంగఁ బనులన్ బాటించి యారాజ్ఞి యా
పయి 'రామేశ'నృపాలుమన్నలకున్ బాత్రుండు నై మించుచున్
మెయిమై హెచ్చుపదంబులన్ నిలుచుచున్ మేధావిశేషాఽఽప్తి ము
న్నయి యానాఁటి'నియోగి'వర్గమున నుద్యత్కీర్తిమై వర్తిలెన్. 81

క. 'నరసింగమ్మ' యపత్యం
బరయమి నురుచింత నొగులునల్లునకు ననం
తరతనయ 'లక్ష్మ'మాంబను
బరిణయవిధిఁ గూర్చె మామ పరమప్రీతిన్. 82

సీ. వెలఁదితోఁ గాశికావిశ్వేశు సేవించు
ఫల మనాఁ దొలిచూలు గలిగె సుతుఁడు,
వరదుఁ డౌనిలువేల్పు నరసింహు సేవించు
ఫల మనా మఱుచూలు గలిగె సుతుఁడు,

వైకుంఠగతుఁ డగు శ్వశురుని సేవించు
ఫల మనాఁ గడచూలు గలిగె సుతుఁడు,
తత్తదాశీఃప్రసాధన ముగ్గడింప నాఁ
దలిదండ్రు లలరి పేరుల నిడంగ
ఆ.వె. 'విశ్వనాథరావు' 'వేంకటనరసింహ
రావు' 'శేషయ'యను రమణఁ గాంచి
ఉల్లసనము మిగులఁ దల్లిదండ్రులయిండ్ల
కూర్మివార లగుచు [1]నొఱపుఁ గనిరి. 83
వ. ఆ సమయంబున :-
సీ. 'వనపర్తి'పురిఁ దమబందుగులకొమాళ్ళఁ
బిలిపించి యాంగ్లాదివిద్య వారి
కభ్యసింపఁగఁ జేయునాశయమునఁ బాఠ
శాల వినిర్మించి చదువు జరుప,
శ్రీ'మానవల్లి'వంశీయుఁ డౌ'రామకృ
ష్ణకవి' మొదలుగా చతురగురుల
'రామేశరాయ'ధరాపాలకుఁడు నిల్పి
పాఠముల్ జరుగఁగా వాసిఁ గాంచె.
వీధిబడిలోన మామూలువిద్య నేర్చి
యుండుమము సోదరుల భూధవుండు పిలువఁ
బంచి తిలకించి ప్రియబుద్ధిఁ బండితులకు
నప్పనముఁ జేసె నాంగ్లాదు లభ్యసింప. 84
మ. మము నీరీతి లలిన్ గళల్ గఱచునన్మాన్యుల్గఁ గావించి ప్రే
మముతోఁ జెంగట విశ్వనాథుని ననున్ మన్నించి'రామేశ్వరుం'
డమలస్వాంతముతోఁ బను ల్గొనుచు నత్యంతంబుగా మెచ్చుచున్
క్షమ నేలెన్ దనజీవితం బలరుదాఁకన్ శక్తిమైఁ; బిమ్మటన్. 85

1. సౌందర్యము



క. తేనితనూభవు లిర్వురు
మైనరులుగ నుండుకతన మహిమోన్నతుఁ డౌ
శ్రీ'నైజా'మాజ్ఞను సం
స్థానము 'సర్కా'ధీనసరణికి వచ్చెన్. 86

వ. తదనంతరంబ, దివంగతుం డగు'రామేశ్వ'రావనీంద్రుతనూజులం ప్రథముం డగు 'కృష్ణదేవరాయఁ' డెరిగి కుశలమతి యగుట సర్కారువారతనికి సంస్థానపాలనవిషయములఁ గొంతవఱ కరయ సెల వొసంగిరి. అరాకొమరుఁ డనుభవశాలి గానందున నితరులప్రవేశము గలిగె. ఈ సంధికాలమున స్వకార్యధురంధరులు మున్మున్న కాఁగా రాజకార్యవార్తావరణ మననుకూల మగుడు విశ్వనాథరా వుద్యోగావరణమునుండి తొలఁగి, తన పెదతమ్ముండును లౌకికకార్యప్రవేశసముత్సుకుండును నగు వేంకటనరసింహరాయని దనపదవి న్నిలువఁ జేసి, 87

క. తనరెండవతమ్ముఁడు స
జ్జననుతుఁ డగుశేషగిరిని స్వకుల 'నియోగం
బున' నిలిపి యతఁడు చెంగటఁ
బని వినఁగా నింటిపనులు పరువడిఁ గనుచున్. 88

వ. విశ్వనాథరాయం డగునే నాంగ్ల-యవన-పారశీకభాషల నభ్యసించియు, గీర్వాణాంధ్రంబులఁ దగుపటిమంబుఁ బాటింపఁ జాలక యాకొఱంతల దీర్పం దలపెట్టి మత్తనూజాత లగు'లక్ష్మమాంబ - శారదాంబ'లకు నాంధ్రగీర్వాణంబులందుఁ గావ్యనాటకాలంకారసాహిత్యం బభ్యసింపఁ జేయునుద్యమంబున నభ్యాసలయందు నాకు విన్నాణం బినుమడించె. అప్పుడు లక్ష్మణశాస్త్రియు నేనును వంశానుగతకవితామార్గంబుఁ బ్రవేశించి, 89

ఉ. భారతిసేవ సేయుటకుఁ బాటు వడం దలపెట్టి యొంటిగా
దారులఁ బట్టి పోవుచుఁ బథంబుల సంగమదేశమందు వ్యా
పారులు గూడి యేకముగ వర్తకముఁ జయశీల మౌనటుల్
దీరుచుమాడ్కిఁ గూడి, విశదీకృతసౌహృద మేర్పడంగ దు

ర్వారవిధాశ్లథీకృతసుబంధురపూర్వకవిత్వధోరణీన్
సారరసాఽద్యలంకరణసంగతిగా నొనరింపఁ గోర్కి దై
వారఁగ "విక్రమాంకుకథఁ" బ్రౌఢత "లక్ష్మణ-విశ్వనాథ"లన్
ధీరుల మేము గూర్చితిమి, తెన్గున; నాటికఁ "గర్ణసుందరిన్". 90

## మాతాపితరవందనము

క. మును నాయిలువేల్పులఁ ద
త్సనామపితరులనుఁ 'గుశిక' సద్గోత్రజుఁడన్
మనమునఁ గవి"లక్ష్మణుఁడన్
బ్రణతించెద "శ్రీనివాస-పద్మావతులన్". 91

తే. గీ. చెలఁగి గృహదేవతం బైన శ్రీనృసింహుఁ
గొలిచి తల్లిని "లక్ష్మమ్మ" గురుని "రామ
రాయుఁ" 'గౌండిన్య' గోత్రు సంభ్రమము మీఱఁ
దొలుత నీకృతి విశ్వనాథుఁడను దలఁతు. 92

## షష్ఠ్యంతములు

క. సకలజగద్రక్షకులకు
శకలితసమదాసురేంద్రసందోహులకున్
వికలస్వభక్తపాలన
సుకలాకోవిదుల కఖిలసూరినుతులకున్. 93

క. మాయాఽధిష్ఠానులకు న
మేయజగత్సృష్టిభరణమీలనులకు స
చ్ఛ్రేయస్సాధనమహిమప
టీయాంసుల [1]కాప్తసంఘటితముక్తులకున్. 94

1. ఆశ్రితభక్తులు.



క. లలితసదర్థపదక్రమ
విలసితసత్కావ్యరచనవినుతకవీశాఽ
వళిసన్నుతమాహాత్మ్యాఽ
కలనులకున్ భక్తబృందకారుణ్యులకున్. 95

క. కరి-రిపుసుతపోషకులకు
[1]నిరతామరపూజితాంఘ్రినీరేజులకున్,
విరచితజగదవనుల కిం
దిరావిరాజితుల కస్మదీయగురులకున్. 96

క. సగుణాగుణమూర్తులకున్
విగళితభక్తౌఘపాపవిసరులకు నచి
జ్జగదద్వయరూపులకున్
నగశిఖర-స్తంభవాసనవ్యరుచులకున్. 97

క. సజ్జనహృదయాబ్జాతల
సజ్జయపదపంకజాతసద్యఃపూతో
ద్యజ్జగదవనరిరంసా
సజ్జశ్రీవేంకటాద్రిశ-నృసింహులకున్. 98

వ. అభ్యుదయపరంపరాఽభివృద్ధిగా మాయొనర్పం బూనిన
'విక్రమాంకదేవచరిత'మహాప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టి దనిన. 99

క. శ్రీరమణ ! వేంకటేశా !
వీరనృసింహేశ ! వేదవేద్య ! సురేశా !
సూరివినుతపదపద్మా !
భూరిగుణా ! దేవదేవ ! బుధజనవంద్యా ! 100

1. తత్పర

## శ్రీకృష్ణఖడ్గస్తుతి

క. శ్రీపాంచజన్యబింబ
వ్యాపన ధారాంబుఫేన మందిన దనఁ బై
దీపించుదోఃప్రభాదం
దోపమకంసారిఖడ్గ మోముత మిమ్మున్. 101

## శ్రీముకుందస్తుతి

చ. సిరి కిర వై రహిం బరగుక్షీరధి యన్సితపద్మమందు ష
ట్పురణరుచిప్రసారమును సాంద్రగతిన్ నిజమేచకోత్పల
స్ఫురదురునీలదేహమునఁ జొప్పడఁ జేయుముకుందుఁ డెంతయున్
వరవిభవంబులన్ దనరుపన్ గలవాఁ డయి మీకు నిల్పుతన్. 102

## శ్రీహరియురోవర్ణనము

క. సిరిచానమేనిపూఁతన్
వరలుచు సౌభాగ్య మనెడిపసిఁడికి నొరగల్
సరణి యగులోకజనకుని
గరుడాంకునియుర మనయముఁ గాచుత జగముల్. 103

## గిరిజాస్తుతి

ఆ. తే. అన్యకుచమువార్త నడుగ నా వదనాగ్ర
మొందుతుంగతరము నొకకుచంబు
గలుగునటుల మగనికాయార్ధమున నిల్చు
గిరివరసుత మిమ్ము నరయుఁ గాత. 104

## నందకస్తవము

క. సంతుష్టరమాబింబా
క్రాంతాంతర్భాగ మయి మురహరున [1]కినజా
తాంతస్సలీలరాధా
కాంతాస్మృతిఁ గొలుపు[2]నందకం బిడు ముదమున్. 105

1. యమున, 2. విష్ణుఖడ్గము.



## పార్వతీస్తుతి

ఉ. చేరఁగ నిల్చి యున్నమలసీమలయేలికముద్దుపట్టి దు
ర్వారరుషాత్మ యై తగ [1]దరంబున సంజనుగూర్చి నే నమ
స్కార మొనర్తు నంబ! యని శంభుఁడు శాంభవికోప మాఁప వ్యా
హార మొనర్పఁ బెం పగుజొహారునుడుల్ జయ మొందు నెల్లెడన్. 106

## సరస్వతీస్తుతి

చ. గురు నటు గీష్పతిత్వము [2]విగూర్వణమున్ గనఁ జేసె నంచు లోఁ
బురికొనుసీర్ష్యతో గ్రహసమూహము సారచోనుఽలబ్ధికై
యరుదుగ నక్షసూత్రమునయందలిముత్యము లై భజించె నాన్
వఱలెదువాణి మీకుఁ బయిపై వెలయించుత సుప్రసాదముల్. 107

## వినాయకస్తుతి

శా. ఆశాస్యంబులయందు నెల్లయెడ నేయాతంకముల్ లేనియ
ట్లాశాసించుసమర్థతన్ దనరి మంత్రాన్వీత లౌనక్షతల్
గా శశ్వద్గతి శీకరంబు లెనయంగాఁ జేయు చున్నట్టిదం
తీశానాఽస్యనిహస్తలీల మిము నెంతేఁ బ్రీతులన్ జేయుతన్. 108

## వైదర్భీప్రశస్తి

ఉ. అంబుధరంబు లేనిశ్రవణామృతవృష్టి, సరస్వతీవిలా
సంబులు పుట్టుచోటు, పదసంపదకున్ సుభగత్వసిద్ధిఁ గూ
ర్పం బలుపూఁటకాఁపు, బుధరంజనదాయక మై విదర్భజా
తం బగుకైతరీతి కృతితల్లజులం దుదయంబు నందెడున్. 109

## సుకవిస్తుతి

క. కలపంచమరవసమచి
త్రలపనసందర్భవిలసితనిజముఖములన్,
నలువచెలి వీణ మీటెడు
లలి మెలఁగన్ వెలయుకుశలులకు జయ మగుతన్. 110

1. భయము, 2. గొప్పతనము (గుర్వీ-ఉద్యమనే ధాతువు).

క. అరసికొనుఁడి కవులారా!
వరసాహిత్యాబ్ధిమథన వఱలుశ్రుతిసుధన్
సురరిపులటు కావ్యార్థము
హరియించెడుచోరు లుందు రది గొన నెపుడున్. 111

క. కొననిం డెల్లర నిచ్చమె
యునిఁ దనరదు కొఱఁత సుంతయేన్ గవులకు; నేఁ
డును రత్నాకరమె కదా!
వనధి దివిజలుప్తరత్నవర్గం బయ్యున్. 112

క. వైచిత్ర్యరహస్యములన్
జూచుసహృదయాళి దీనిఁ జూచున్ శ్రద్ధన్
బ్రాచీనకవులవైద
ర్భీచంచత్కృతులు వేనవేలు వెలసినన్. 113

తే. గీ. సాహితీశ్రమవర్జితజనమునందుఁ
గవిగుణంబు పొరంగ భంగంబు నెనయుఁ;
దలిరుఁబోండ్లయనార్ద్రకుంతలము లెట్లుఁ
బట్టుఁ గృష్ణాగురుజధూపపరిమళంబు. 114

క. పలుకులెడ నేర్పుపేర్మిన్
దొలినేమము మించుటలు నుతుల్ మిగులఁ గనున్;
లలితోన్నతి బనిక వగులు
నెలఁతలచన్గవలు వందనీయము లగుఁ గా. 115

క. ఇలఁ బండితులను లాగం
గలిగియు వ్యుత్పత్తిజడులఁ గరఁగింపద; ము
క్తలఁ దొలిఁ గూర్చుశలాకిక
యులి నలిపెడుపనుల శక్తి నూనదు గాదే. 116



ఆ. వె. కవులకథల రసము గాంచెడునరసులు
వేఱుకథలయందుఁ బ్రీతిఁ గనరు;
[1]గ్రంథిపర్ణమందు రంజిలు 'కస్తూరి'
మృగములు తృణములను మెలఁగవు గద! 117

## కుకవి నింద

చ. జడజనమందుఁ దాము గనఁ జాలుప్రతిష్ఠఁ గృతాభిమాను లౌ
వెడఁగులు సత్కవీంద్రపదవృత్తుల నేపరిపాటివారు? చి
చ్చుడుపఁ గలట్టిగర్వమునఁ బొంగెడునీరము లేమి సేయఁగాఁ
గడఁగు మణీగణప్రభవకాంతులు దిక్కులఁ దిక్కటిల్లఁగన్. 118

తే. గీ. పూని యుల్లేఖలీల నేర్పున ఘటించు
పట్టు గల[2]వైకటికసమపండితులవి
చార[3]కషపట్టికల నిధుల్ సరణిఁ గనుత
నాదుచిత్రోక్తిరత్నముల్ ప్రోది యగుచు. 119

చ. కలుగదు దోస మేమియును గాంచఁగ దుర్జనులందు, సద్గుణం
బులఁ గని యోర్వలేమి యగుఁ బో తగ వారిస్వభావ మెప్డు; ని
స్తులఘనసారఖండములతో సరితె ల్పగుకండచక్కెరల్
వెలయును గాదె కొండఱకు ద్వేష్యము లై బలుచేఁదులట్టులన్. 120

## శారదాదేశమహిమ

క. అమలకవితలీలలు కుం
కుమకేసరవితతు లేకకుక్షిజము లగున్;
సుమహితము [4]శారదాదే
శము విడి వేఱెడఁ దదుల్లసన మే నెఱుఁగన్. 121

1. మాచిపత్రి. 2. రత్నపరీక్షకుడు. 3. ఒరపిడిరాయి. 4. శారదయా దేశము-కాశ్మీరదేశము.

## వక్రోక్తి

క. అల వక్రోక్తిరహస్యాఽ
కలన రసధ్వనిముఖాధ్వగాములు కావ్యం
బులు నాయవి శ్రద్ధఁ గనన్;
జిలుకలుగఁ బఠింత్రు గాక చిక్కనవారల్. 122

క. అనితరసామాన్యగుణ
త్వనిరూఢియ కవివరులకుఁ దనరుచుఁ గీ; ద
య్యనఘులఁ దద్గుణములఁ గనుఁ
గొన జల్పము విడరు సభలఁ గొఱ నేర్చుజనుల్. 123

క. అసమానోల్లేఖరచనఁ
బసఁ గనుకృతికనక మిద్ధి పండితచేతో
విసర[1]కషపరీక్షిత మయి
పొసఁగుం గాత జనకంఠభూషణ మగుచున్. 124

## కవీశ్వరాఽవశ్యకత

తే. గీ. చారుచారిత్రలీలావిచారశూన్యు
లైననృపులకుఁ గవిసంగ్రహం బదేల ?
యొదల నెప్పుడొ గురిజలతొడవు లూను
వనచరుల కేల ? యగసాలెవానిఁ జేర్ప. 125

చ. తమకెలనన్ గవీశ్వరవితానము నిల్పఁగ లేనిధారిణీ
రమణులకీర్తిసంతతులు రాజిలు నెట్టుల ? రాజు లెందఱో
క్షమపయి దీప్తితో వెలసి కాలము దీఱఁ జనంగ లేదె ! సం
భ్రమముననేని నట్టినరపాలురపేరు తెలుంగఁ డెవ్వఁడున్. 126

1. ఒరగల్లు



క. రావణుయశ మఱుటయు సీ
తావరుఁడు యశోఽర్థిఁ దగుట తగ నిది సర్వం
బావాల్మీకిప్రభావమె
కావునఁ గవులయెడ నలుగఁ గాదు నృపులకున్. 127

క. నానుడికారము నీరస
మైనను నృపచరితకథన మతిమాన్యం బౌ;
ద్యోనదిమృత్తిక శుష్కం
బైనను దలఁ దాల్ప రెవ్వ రతిశయభక్తిన్ ? 128

## కుకవి

చ. శ్రుతి కమృతంబు, సత్కవివచోరసమున్ ద్యజియించి దుష్ట లా
యతమతి వారిలోపములె యత్నము సేయుదు రేర్పరింపఁగా;
నతులితకేళికావనమునందుఁ బ్రవేశముఁ గాంచి రోయదే ?
వితతిరతిన్ గ్రమేళకము వీడక కంటకజాలమే మొదల్. 129

## స్వగ్రంథప్రశస్తి

క. విమలచళుక్యాధిపవం
శమున వెడల నిడితి మద్వచస్సూత్రము నం
దమలగుణమౌక్తికంబుల,
నమరుత నేకాఽవళి, తొడ వయి మీమెడలన్. 130

తే. గీ. సప్తలోకంబులందుఁ బ్రశస్తిఁ బడయు
భారతీలీలలకుఁ బట్టు బ్రహ్మ యగుట,
నట్టినలుమోమువేల్పుకావ్యములు నాల్గు.
వెలయు విఖ్యాతిఁ గని చతుర్వేదము లన. 131

## బ్రహ్మప్రసన్నత

తే. గీ. తనకుఁ బీతంబుగా నున్నతమ్మి యొకటి
తులఁ దొలఁగుభక్తితోఁ దన్ను గొలువ నలువ
సకల మైనట్టితత్తోయజాతకులము
నరయ సిరి కిరవుగఁ జేసె నని తలంతు. 132

## ఉషఃకాలము

ఆ. వె. బ్రహ్మఋషులకెల్ల బ్రహ్మమయము లగు
నజునికథలఁ బ్రొద్దు లరుగు చుండ
నంత నొక్కనాఁట నమరనదీతీర
మందుఁ గల్యసంధ్య యగుడు రవికి. 133

క. తనవనితకుఁ జాటూక్తుల
ననయముఁ బల్కుచును జక్ర మన్యోన్యవియో
జనయంత్రసూత్ర మనుభ్రమ
నన లాగెన్ దన్ముఖస్థితాబ్జబిసంబున్. 134

తే. గీ. అర్ఘ్య మిచ్చుట నాసక్తు లైనసిద్ధ
ముగ్ధ లూనినకుంకుమమునను బోలె
నబ్జినీజీవితం బగునర్కబింబ
మపుడు దాలిచె బింబఫలారుణిమము. 135

క. రే ముదియుడుఁ దల మిగులఁగ
గో షతి వంచెనొ యనంగ గొబ్బునఁ గన నొ
రేమగనియార్తిఁ గన నా
మోము స్మితోన్ముఖత నొప్పెఁ బో బిసినులకున్. 136



క. సకలవిజయశీలుండు చ
ఱకమున వేఱుగఁ బొదము నలువ కని వినుచున్
దికమకఁ గొని దుర్గము నె
క్కుకరణి రవి తూర్పుఁగొండఁ గొదుకుచు నెక్కెన్. 137

తే. గీ. చక్రవాకాంగములఁ బరస్పరముఁ జూడ
కుండుటకుఁ గూర్పుపూఁతగా నుండి యిపుడు
చందనద్యుతి మించినచంద్రిక యదె
యిందుశాణీఫలకమందు నిమిడిపోయె. 138

## ఇంద్రుఁడు బ్రహ్మకు లోకదురాచారమును దెలుపుట

తే. గీ. అపుడు సంధ్యాసమాధినిష్ఠాఽన్వితుఁ డగు
విధికి శక్రుండు కేల్మోడ్చి విన్నవించెఁ
దనదుశేఖరపారిజాతమునఁ బొరలు
నలులయులివున నినుమడు లైననుడుల. 139

క. సితగజమదసక్తమధు
వ్రతమాల సెలంగు నాకు, వందనమాలాఽఽ
కృతి; సామ్రాజ్యశ్రీజయ
తతతోరణనిభసితేభదంతయుగమునన్. 140

తే. గీ. లోచనాబ్జసహస్రవిలోలషట్ప
దాఽఽళినీలీకృత మగునాయాతపత్ర
మల రహించును రాజ్యేందిరాఽఽననమున
నేణనాభీ[1]లలామ కల్యాణగరిమ. 141

ఉ. నందనమందుఁ గల్పతరునవ్యమనోహరసీమలన్ రతిన్
జెందినశ్రాంతి వో నడఁపునీడలఁ గూడుచుఁ బాడు చుందు రే-
నందినశౌర్యకార్యకలనాఽఽత్తయశంబుల సత్ప్రబంధరీ
తిం దనరించి మోదమునఁ దేఱుచు పౌరమృగీవిలోచనల్. 142

---

1. నొసటిబొట్టు.

చ. పలుకులు పెక్కు లేల ? యిదె పాకనిషూదనుఁ డీతఁ డర్థిఁ దై
యలరు నిరంకుశోత్తమహిమాతిశయంబునకున్ నిజంబు; ని
స్తులభవదీయపాదతలధూళిలవంబుల నౌదలన్ గనం
గలిగినయెల్లవారి కిది గా మహిమంబు సితాంబుజాసనా ! 143

తే. గీ. జన్మములఁ బాల్నిలింపసంచయము గొనుట
దాల్చు చున్నది స్మర్తృవ్యతాక్రమం బ
టంచుఁ దలఁచెద నాథ ! నా కవని నిపుడు
విప్లవం బిది చారనివేదితంబు. 144

చ. సవిత నిజద్యుతిచ్ఛటల సాచి దిశాళిఁ దమోవిలుంఠనం
బవితథరీతిఁ జేసెడునయంబున నంబుజయోని ! మీర లీ
భువికి విధిక్రియాచరణముల్ దొలగించెడుధర్మదూరులన్
గవిసి తొలంచఁగా నొకనిఁ గల్పనసేయుఁ డవార్యవిక్రమున్. 145

తే. గీ. కరఁగి పురుహూతుఁ డిట్టులఁ గలియఁ బల్కు
పల్కులను బాగుగా విని బ్రహ్మ యపుడు
సూచె సంధ్యాంబుపూరితచుళుకమందుఁ
దెఱఁచి ధ్యానానువిద్ధ మౌదృక్ప్రయంబు. 146

ప్రార్థితవీరజననము

క. తనముంగై పైడెనఁ దగు
ఘననీలమణీసనాథకంకణములపె
ల్లున ధర్మదూరబంధం
బునకు సహోత్థాహిపాశములఁ బూనె నన్. 147

క. తనతర్జనిఁ జూపినచే
తను గార్యాకార్యములను దగఁ గనుగుతి ది
క్పనిరాతంకక్రియలను
గనుచు నిషేధం బొనర్పుకడఁకఁ గనె నన్. 148



క. తనకులజులభోగంబున
కనంత నతివిపులఁ జేయ నంగదసంక్రాం
తనిజవిమానవిధంబున
ఘనగిరులన్ బాహువుల నెగన్ బట్టె నన్. 149

క. తనతగ్గనిగరువపున
వ్వున దిట మగుమోవిచివురుఁ బూనుచు శీరా
ర్జునము లగుపగలకీర్తులఁ
గొని యపుడే యాని [1]పమ్ముకొని నిలిచె నన్. 150

క. తముఁ జెఱలో నునిచెడుపని
కమరారులు నీరు విడిచి రని ముదమున న
య్యమరస్త్రీ లాత్మదృశా
కుముదములన్ బూజ లిడఁగఁ గొమ రొందె నన్. 151

క. శరవారాభేద్యము, [2]క
ర్బురనిర్మాణము, స్వభావరూఢకవచమున్
ధరియించి జయశ్రీక
ర్బురపీఠనిభోన్నతాంసముల్ పొలు పొందన్. 152

క. కోరినది దాఁటినది చే
కూర వెలుఁగు దొలఁకుమోము క్రొమ రొప్పఁ జిరో
దారసముత్సుకతఁ దనను
సారసవిష్టరుఁ డజుండు స్వయముగఁ గనఁగన్. 153

క. పౌరుషకాంచనశాణి య
శోరాశి సితాబ్జ[3]శాదశోభియు నిజహ
స్తారూఢకృపాణోజ్జ్వల
ధార నతిప్రమదదృష్టి దైవారించెన్. 154

1. అతిశయించి. 2. బంగారము. 3. బురద.

క. కనకాచలోపలంబుల
మను వొందినయట్లు [1]మేల్మి మనుచశరీరం
బున నలువ చుళుకమునఁ ద్రిభు
వనరక్షాచణభటప్రవరుఁ డుదయించెన్. 155

మ. తనవేఁగన్నులు మోదబాష్పనిబిడత్వం బంది తూఁగాడఁగాఁ
దనచెంత న్నిలుచున్నయింద్రుఁ గని 'చిత్తస్థైర్యముల్ బూనుమా!'
యని యంపించి విరించనాఖ్యుఁ ద్రిదివౌకోఽమిత్రజాతిక్షయం
బున కవ్వీరుఁడు దీక్షఁ బూనె సుర లుప్పొంగన్ రిపుల్ గ్రుంగఁగన్.

చాళుక్యవంశపరంపర

తే. గీ. ధారుణీభృత్కులోపరిస్థాన మొంది
యంత రత్నాకరాఽఽత్తభోగార్హతఁ దగి
వెన్నుకా ల్గన్నమిన్నేటివెల్లువవలె
వరుస నవ్వీరువలన నన్వయము నెగడె. 157

క. వైరిభటానూనయశో
హారిగ 'హారీతకుండు,' నతఁ డాదిగ భూ
దారులలో '[2]మానవ్యుఁడు'
వైరులమానంబు డులుచువాఁ డై నెగడెన్, 158

ఉ. ముంగురు లెల్లఁ జెదరఁ బొల్పఱి దీనతఁ గ్రుంగి యుండ, గం
డాంగములన్ రచింపఁ బడినట్టికురంగమదంపుచర్చలున్
భంగము నొంద సొం పఱుసపత్నసతీజనతాఽఽననంబు లీ
వంగడపున్నృపాలురయవార్యపరాక్రమ ముగ్గడించెడున్. 159

1. బంగారము. 2. హారీతుని నామాంతరము.



ఉ. ఆకులమందు రాజనివహంబు గడించుకుకంటకోద్ధృతి
ప్రాకటకీర్తికిన్ భువనపాళి విలాసగృహాంగణంబుగాన్;
భీకరవైరికంఠగతపీఠతలాస్థివిలుంఠనప్రకుం
ఠాఽఽకృతిధార యౌనసికి నయ్యెను సానలుగాఁ గపాలముల్. 160

చ. పశుపతి ప్రీతుఁ డైన నది [1]పాటన సేయక శాతఖడ్గమున్
దశమశిరంబుపైన బెడిదంబుగ వేయఁ గడంగి యద్రిజో
పశమితుఁ డై జగత్త్రయముపట్టున నెక్కటివిక్రమాఽఽఢ్యుఁ డౌ
పిశితభుగాశినాయకుఁడు పెంపుఁ గనెన్ మును రావణుం డనన్. 161

ఉ. అంతటివాని రావణుని నంతకుచెంతకుఁ జేర్చి దిక్సమా
క్రాంతయశస్కుఁ డై నరఘురాముఁడు నిల్పినరాజధాని న
శ్రాంతసితోరుకీర్తి దనరన్ ఘన మైనపురం 'బయోధ్య' నీ
సంతతిక్షత్రియుల్ తమనిశాంతముగా నొనరించి రేపునన్. 162

ఉ. అందు విలాసదీక్ష నలరారుజిగీషువు లంతనంత గె
ల్పొంది సమస్తభూమిఁ బర మూనిరి; 'నాగరఖండ' చుంబిగాఁ;
గ్రందగుపూగవృక్షవిసరంబు ముదావహ మౌచు నొప్పుభూ
మిం దగుదక్షిణాఽఽశ నుపమింపఁగ రానిపరాక్రమంబునన్. 163

క. లీలన్ దద్వంశధరా
పాలురు విజయప్రశస్తి వ్రాసి రుదన్వ
త్కూలమున నిభరదంబులఁ
'జోళీ'సురతములసాక్షి సొం పగుచోటన్. 164

తే. గీ. ద్వీపనరపాలనివహంబు విక్రమమునఁ
బెఱుకునీరాజవరులు[2] 'విభీషణభువి'
'నచ్యుతస్థాపితం' బని యాక్రమింప
రైరి; కాదేని వారికి నసదె యదియు. 165

1. పాటించుట, 2.లంకపురి.

క. ఆరాజులవాజులు ఘన
సారరజశ్శ్వేతరుచి యెసఁగుదీవుల నం
చారవిలాసము లూని తు
షారాద్రిభ్రమ వడంకి చలిఁ గలఁతఁ గనున్. 166

## తైలపరాజు

క. వరుసనఁ దత్కులతిలకము
హరు వొందెఁ బ్రతాపి, 'తైల' పాఽఖ్యుఁ డతఁడు నం
గరమున నరివీరరసం
బరుశోణితపంకశేష మొనరించెఁ ద్రుటిన్. 167

## ప్రకారాంతరానువాదము

చ. క్రమమునఁ దత్కులాంబుతిలకం బనఁ 'దైలపుఁ' డన్నృపాలచం
ద్రముఁడు ప్రతాపి శాత్రవపరాక్రమదూరుఁ డుదారవీర్యుఁ డై
సమితి నరాతివిక్రమరసంబు నిమేషములోన రక్తపం
కమ మిగులంగఁ జేసె భువనత్రయదుర్జయబాహుదర్పుఁ డై. 168

తే. గీ. కుతలకంటకు లగు 'రాష్ట్రకూట' నృపుల
మూలముట్టుగఁ బొలియించుపూన్కిఁ గుశలుఁ
డయినచాళుక్యచంద్రునియంతికంబుఁ
జెందె సుఖముగ నృపతులసిరియు నంత. 169

క. టీరపుటుమ్మన్ జెమ్మల్
గూరుకరంబుఁ గనునతనిక్రూరాసి ఘనా
సీరప్రేరితపుష్పాఽ
సారపరాగముల నాటి నడలద యనులన్. 170



మ. నరనాథాంజననీలఖడ్గమున జన్మం బందియున్ నీలిమం
బరుకీర్తుల్ గనఁ బోమికిన్ గతము నే నూహించి గుర్తించితిన్;
బరనారీశరపాండుగండయుగళీపాళీవిలీనంబు లై
పరివర్తించి తదీయపాండిమమునన్ బాటించె శ్వేతత్వమున్. 171

తే. గీ. లలితకీర్తిమరాళహేలాపదంబు
నుత్ప్రభం బగుఖడ్గనీలోత్పలంబు
విభుఁడు వీరరమోత్తంసవిధికి నవఁగ
యుద్ధలీలాసరస్సులోనుండి లాగె. 172

తే. గీ. అని మొనన్ సాక్షిమాత్రసైన్యమును నిలిపి
దాసిఁ జేసినరిపులక్ష్మి తలఁగనటులఁ
బూఁటకాఁపుగ నారిపుభూపకీర్తిఁ
బిలిచె నెలకొల్ప నప్పృథివీవరుండు. 173

## సత్యాశ్రయుఁడు

సీ. ఎవనిఖడ్గము రిపునృపులకపాలముల్
భ్రుకుటిక్రుధాగతిఁ బొడి యొనర్చు;
నెవనిలాగినవిల్లు దవులుకొనల గుఱి
ననిముల్కుల ముద్దుఁ గొనినటుఁ దగు;
నెవనికోలలు కుభృద్బృందాంగములఁ దొల్చి
క్రౌంచభిద్భార్గవాస్త్రముల దూఱు;
నెవనిరణం బాఁగు నింత జందెపుభ్రాంతి
క్షత్త్రారిహారముల్ సూచనపుడ;
తే. గీ. యెవ్వనిశరంబు లని రేల నృపవరమౌళి
రత్నములఁ గూడి దివ్వెలరహి గడింప
నసితమంబుల రిపులపెల్లార్చు నతఁడు
వెలసె 'సత్యాశ్రయుండు' దోర్విలసనమున. 174

జయసింహుఁడు

ఉ. సంతతదంతియుద్ధముల సామజకుంభవిఖండనస్థల
ద్దంతురకాంతమౌక్తికవితానములన్ వలె నాత్మకీర్తు లు
ద్దాంతగతిన్ దిగంతములదాఁకఁ జళుక్యమృగేంద్రపీఠిపై
వింతగ నంత భూషణతఁ బేర్చెఁ దగన్ 'జయసింహ'దేవుఁడున్. 175

క. అరిరాజమహామహిషులు
ధరణీపాలప్రతాపతప్తలయి నిరం
తరమును దలఁతురు చందన
పరిచర్చితనిజవరాంకపరివర్తనముల్. 176

క. కలహప్రభాతముల భూ
తిలకప్రతాపార్యమప్రతిష్ఠ యదర వ
ర్తిల కున్నె నెట్టిభూమీ
తలపతితతిసూర్యకాంతతాప మెచటనేన్. 177

క. అన్యపతిజైత్రయాత్రల
సేనాభరమున వడంక క్షితితలము వ్రణం
బూనినవీపునఁ గార్యము
గానియటు లాదికూర్మకము గాసిఁ గనున్. 178

తే. గీ. నిజకిరీటస్థమాణిక్యనిబిడభాను
భంగసంఛన్ను లగుతేనివైరినృపుల
సంగరాంగణముల శివాసమితి గొనదు
చితి రగులునింగలం బని మతి గలంగ. 179

చ. అతఁడు దిశాఽధినాయకపురాఽళి జయించి, తదీయవస్తుసం
తతి విదళించి కేవలము దంతితతిన్ గ్రహియింపఁ దయ్యె; నా
తతజయసింధురప్రకటితం బగుసప్తపలాశబాంధవో
దితనవవాసనన్ బెదరి దిక్కులఁ జిక్కక పాఱిపోవుటన్. 180



చ. మహిపుఁ డపారవీరనియమంబునఁ బారగుఁ డై యటుల్ ధను
స్సహితత నిల్వ శాత్రవధరారమణాఽవలి సంగరంబులన్
దహతహతోఁ బరాఙ్ముఖతఁ దాల్చి పలాయిత మై చనంగ న
య్యహితయశోఽఙ్గనాఽఽవళి ప్రియంబున సమ్ముఖతాఽఽప్తినుండెడున్.

క. సురపురియశము నృపుఁడు సు
స్థిర మొనరించియును గర్వచిత్తుఁడు గాఁ డా
సురపతి స్వయముగ నిడఁగా
ధరియించియుఁ బారిజాతతతిచితమాలన్. 182

ఆహవమల్లుఁడు

తే. గీ. అతని 'కాహవమల్ల'భూపతి జనించి
యవనిఁ 'ద్రైలోక్యమ'ల్లాపరాఽఖ్య వెలసె
మహితధారాజలోత్థాంబుమానుషి యనఁ
దత్కృపాణంబు జయలక్ష్మి తలఁగి చనద. 183

ఉ. కేవలకల్పనాకథలు గేరెడుపట్టులఁ గాక సచ్చరి
త్రాఽవళిఁ గూర్పుపొత్తములయందు నతండు మహాకవీంద్రవా
చావిమలప్రయోగమున సాధుపవిత్రచరిత్రమార్గసం
భావితుఁ డై లిఖింపఁ బడెఁ 'బ్రౌఢిమ రెండవరాముఁ డౌ' ననన్. 184

క. కూపములఁ బ్రపాపాలిక
రూపున భూపులెద రిత్త రూపించుచుఁ ద
ద్భూపతివీరశ్రీ యా
శాపాళి యశస్సుధారసమునఁ బ్రియ మిడెన్. 185

క. వైరిప్రతాప మధికము
గా రాజుకృపాణ మాని కన్నీరు గదున్
జేరినచోళగందో
దారపటీరములఁ దాప మఱఁగాఁ ద్రాగున్. 186

తే. గీ. మందుతేజంబు తనచెంత నుండుకతన
దప్పి నూనినయదివోలెఁ దత్కృపాణ
మల 'ప్రమార'నృపాలయశోఽమ్బుధార
'ధార' యనురాజనగరరత్నమును మ్రింగె. 187

తే. గీ. నృపుకృపాణ మగాధపానీయమగ్న
భూరిభూభృత్కులం బయ్యెఁ బో విడువఁగఁ
జాలదుగ 'ధార' యనునాక్కప్రోలినైన
నప్పురిన'మాలవుని'భాగ్యక్షయమున. 188

తే. గీ. అతఁడు కాలాంబుదశ్యామలాసి సకల
రాజహంసలఁ దఱిమి తర్వాత నిలక
భోజరాడ్భుజపంజరమున రహించు
కీర్తిహంసినిఁగూడఁ దా ఖేదపఱచె. 189

తే. గీ. ప్రళయసమయాగ్నిసమమూర్తి పార్థివునకు
సంగరంబులఁ గరముఁ బొసంగె శాంతి
భోజభూమీతలాధీశముక్త మైన
'ధార' వడినంతమాత్రఁ జిత్రంబు గాఁగ. 190

తే. గీ. ఆతఁ దక్రాంతహోమాఽశ్రయాశధూమ
జాలనీలీకృతదిశాఽఽన్యమాలుఁ డగుచుఁ
దోడనే పూర్ణిమానిశాతుహినకిరణ
పాండుసత్కీర్తిసంతతిఁ [1]బఱచి కడుగు. 191

తే. గీ. సత్య మాజి జయామృతసాధనమున
క్షితిపతిశితాసి మిక్కిలి క్షీణ మయ్యెఁ
దద్గృహీతైకధారావిధానకలనఁ
గీర్తిధారాసహస్రావకీర్ణ మగుట. 192

1. పడఁజేసి.



చ. ఇటుల నతం డశేషధరణీశరణీకరణీయతాఽఽప్తి నం
ఘటితతదీశశీర్షమణికల్పితపాదుఁడు చక్రవర్తి యై,
పటిమ ననేకయజ్ఞపరిపాటి నెసంగుచు నింద్రు మించిన
ప్పటికి శతక్రతుం డతనిపట్టునఁ జూపఁ దొకింత శంకయేన్. 193

క. చింతారత్న మితని ముం
దెంతయును వరాక మనుచు నెంత్రు జనము భూ
కాంతుఁడు తపనీయతులా
భ్యంతరమునఁ దూఁచుటాయియట్లుగఁ జేయన్. 194

తే. గీ. దోమరూపంబుఁ దాల్పించి తూర్ద్ధభీతి
నెటనొ యొకమూల నొదిఁగి పెం పేదుకలినిఁ
గడలఁ దఱుముట కన యాగకలితధూమ
ముల నిరోధించె నాతఁడు భువనమెల్ల. 195

చ. బెదరినవాఁడువోలెఁ గలి పృథ్వీవరేణ్యునిపై నిమేషమేన్
గదియఁగ నీఁ డపాంగమును క్షాత్రపుటుమ్మ కడున్ నిజాంగమున్
బొదివి రహింపఁగా సహజభూషవిభాపరిపూర్తి నేత్రముల్
మెదలఁగ నీక మించి మిఱుమిట్టుల నాతఁడు గొల్పు చుండఁగన్. 196

క. అన్యాయ మొకటిప్రాగ్రా
జన్యులయెడఁ జేసె స్వకులజనవత్సలతా
మాన్యుం డయ్యు నిలాపతి,
స్వన్యాయచరిత్ర జనము వారల మఱవన్. 197

తే. గీ. అచటఁ [1]'పృథ్వీభుజంగ'నిరర్గళాఽహ
వావశీర్ణకర్ణ యగు 'డాహల' మహిరమ
యకట! కర్పూరతాటంకయశముతోడ
నిప్పుడున్గూడ సంగంబు నెనయఁ బోదు. 198

1. ఇది ఆహవమల్లుని బిరుదనామము.

## పాఠాంతరశ్లోకానువాదము

తే. గీ. అచటఁ 'బృథ్వీభుజంగ'నిరర్గళాఽహ
వావకీర్ణకర్ణ యగు 'డాహల' వసుమతి
దంతతాటంకతుల్యసద్యశము లకట!
యిప్పుడున్ బరిష్వంగంబు నెనయఁ బోదు. 199

తే. గీ. సమితి నృపతికృపాణ ముచ్ఛలితతేజ
మెనసి [1]ధారాజలంబున నసఁగ నిగిడె
దృప్తరిపుగణాఽవళిసంగ మెడపి పొంద
నసఁగ [2]'సభ్యుక్షణమ్ము'న నహితలక్ష్మి. 200

క. నిరతము సంతప్తం బగు
నరిరాజస్త్రీపయోధరాంతరమందున్
బరఁగినకుంకుమపంకము
పరాఙ్ముఖతఁ గనియె శోషభయమునసో నాన్. 201

క. తనుభావ మూనె వైరిను
తనువులహాసప్రదీప్తి, తాంబూలశ్రీ
నెనయునవసానసంస్మృతిఁ
గనుచు నసఁగ సహవసతినిఁ గ్రాలుకతమునన్. 202

క. వేలావనముల నరపతి
జ్వాల లెగయునస్త్రములఁ బ్రవర్తిలఁ జేయన్
గ్రాలెడుభీతి సముద్రము
'హాళిన్ భార్గవుఁడె వచ్చె ననుచుఁ దలంకెన్. 203

1. పట్టణమునకుఁగూడ శ్లేషార్థము. 2. పిడికిలితో నీటినిఁ జిలకరించుట.



చ. నృపతిభటాఽవళుల్ తనమణీగణసంగ్రహణం బొనర్చుచో
నపరిమితంబుగాఁ దటతలావనిఁ జిందుచుఁ గ్రం దొనర్చు శు
క్తిపటలిచేతఁ దాఁ గినుకఁ గీల్కొనె నాఁగఁ బయోధి యొద్దపై
నుపలతలంబునన్ దల ననూనతఁ గొట్టినయట్లుఁ గన్పడెన్. 204

చ. అతని సధిజ్యకార్ముకుని, సత్యవనీప్రభవాభిరాము, నూ
ర్జితరవితేజుఁ గాంచుచు వచించెనొ నా నిజపద్మరాగశో
ణితచటులారుణాంగముల నిండినశ్రీరఘురామబాణపా
టితకిణసంచయంబుఁ బ్రకటించెఁ బుటీకృతభంగపాళి యై. 205

చ. అతనిచమూసమూహము లుదగ్రగతిన్ దటికాఽటవీవిటం
కితములు గాఁగ 'విశ్వ మిటఁ గ్రిక్కిరియన్ గుమిగూడెనో' యనన్
మతిఁ గని వార్ధిభూతిగరిమల్ క్షయ మొందమి కర్థి స్వీయతో
యతతికి నున్నయుప్పు గత మంచును మెచ్చెను శరతన్ గదున్. 206

తే. గీ. అనఘవీరుం డతండు వారినిధితీర
మున జయస్తంభమును నాటె ముదము మీఱ
స్వైరవిహరణశీలముల్ జలమతంగ
జములు పొగులఁగఁ గట్టుకంబ మనుభీతి. 207

తే. గీ. తనతటి మెలంగునతనిశుద్ధాంతకాంత
లందుఁ దొరఁగెడులావణ్య మనుసరించి
సార మమరులు గొనఁగ నిస్సార మైన
జలధి పీయూషదర్శనసౌఖ్య మందె. 208

క. గెలుపుంబూన్కలయందున్
గెలుపుమరులు గలుగునతఁడు కెలనఁ బయనమున్
నిలుపుకడలిఁ గని రాముఁడు
గొలిపినసేతువును మఱలఁ గూర్పఁగఁ దలఁచెన్. 209

క. ద్రవిడభటుఁడు క్రొవ్వున నే
కవీరుఁడై పలచి యెదురుగా రాఁగ మహీ
ధవుఁ డతని [1]నభాజనుఁ జే
సె వీరరసమునకుఁ దొలులు సేసి శరతతిన్. 210

క. పటుకంపితాంగిఁ 'గాంచి'
న్ఘటించి భుజయుగబలంబునన్ లాగెను దా
నటఁ జోళరాజ్యరమ భూ
విటుఁడు యశఃపటము నూడ్చువిధి నేర్పరి యై. 211

ప్రకారాంతరానువాదము

క. భుజయుగబలమునఁ 'బృథ్వీ
భుజంగుఁ' డల కంపితాంగిఁ బొదువుచుఁ '[2]గాంచిన్;'
అజితుఁడు యశఃపటము నూ
డ్చుఁ జతురుఁడున్ '[3]జోళ'రాజ్యలక్ష్మిని లాగెన్. 212

తే. గీ. అతనిబెదరునఁ గడుఁ బలాయితుఁ డగునరి
'చోళ'ఫాలత్వచంబు నెచ్చుగను జీల్చె
నింకనైన నితం డెగ్గ లెనయునె యని
కంటకవనాంతములు రిపుల్ గాంచునా యన. 213

క. నరపాలశౌర్యవైశ్వా
నరమునఁ బూర్ణముగఁ బ్లోషణముఁ గనుచు రిపూ
త్కర మరయద మంత్రముఁ ద
ద్దురవస్థన్ బ్రతిఘటింపఁ దూఁగునొకటినేన్. 214

1. అనర్హుఁడు-పాత్రలేనివాఁడు అనిశ్లేష. 2. కాంచీపత్తనము-ఒడ్డాణము అనిశ్లేష. 3. చోళదేశము-రవిక అనిశ్లేష.



శా. క్ష్మానాథాగ్రణియత్రకౌశలము వక్కాణింప నేలా! మనో
భూనారాచములట్లు దద్భరతతుల్ పోఁ ద్రోయరా కూర్జిత
జ్యానిష్ఠ్యూతనితాంతనిష్ఠురరవప్రాప్తాగ్రవాదాఽయతిన్
భూనాథాఽవళిఁ దద్భుజంబె యనులన్ బొంకం బలన్ జేయఁగన్. 215

పై పద్యమునకు అచ్చతెనుఁగు అనువాదము

ఉ. పూవిలుకానియమ్ములనుబోలెఁ గడున్ బెడిదంబు లెల్లరున్
బోవిడఁ జాలనట్టి వగుముల్కులఁ దేరెడుతేనినేరుపున్
వా విడి పల్క నేల! కలనన్ దనసింగిణి వీడి క్రమ్మురన్
నో విడుదప్పు దూన్భుజమె నూల్కొని తేండ్లను దూలఁ జేయఁగన్. 216

మాలినీవృత్తము

సురవినుతపదాబ్జా! సూరిసంగీతనామా!
గిరిబిలవినివేశా! కేవలాద్వైతరూపా!
కరిరిపుసుతపాలా! క్ష్మాసుతాచిత్తలోలా!
విరచితబహురూపా! వేంకటేశా! నృసింహా! 217

ఇది శ్రీత్రిభువనమల్లదేవవిద్యాపతి-కాశ్మీరక-
భట్టబిల్హణ మహాకవివిరచితవిక్రమాంకదేవచరిత
మహాకావ్యంబునకు శ్రీవేంకటేశ్వర
శ్రీనరసింహదేవపాదపద్మాఽరాధన
సమాసాదితకవితావైశారద్యులు
'ఆంధ్రబిల్హణ'బిరుదాంచితులు
నగులక్ష్మణ-విశ్వనాథ
కవిసోదరాంధ్రీకృత
మహాప్రబంధంబునందుఁ
బ్రథమాశ్వాసము
సమాప్తము

# విక్రమాంకదేవ చరితము

## ద్వితీయాశ్వాసము

క. శ్రీరమణ ! వేంకటేశా !
వీరనృసింహేశ ! వేదవేద్య ! సురేశా !
సూరివినుతపదపద్మా !
భూరిగుణా ! దేవదేవ ! బుధజనవంద్యా ! 1

క. పురవర మొనర్చె నృపవరుఁ
డురుసౌధశ్రేణిదీపికోదితరుచి నం
బర మల కాటుకసరిగా
వలలఁగఁ[1] 'గల్యాణ' మనఁగఁ బటిమ నొకండున్. 2

ఉ. గంధపుఁబూఁత వెల్ల నగుకైరవనేత్రలచన్నుఁగొండలన్
జెంది నివర్తితంబు లయి శీతలతద్వదనానిలంబు ల
చ్చందనశైలవాయువులసావి గనం దగి భూజనంబులె
ల్లం దముఁ గోరఁగాఁ దగి విలాసముఁ గూర్చెడు నప్పురంబునన్. 3

క. భీతైణాక్షీగండ
వ్రాతరుచిన్ గాతరాంశుపరికలితుం డై
శీతాంశుఁడు సమ్మార్జన
ధూతరజఃకీర్ణముకురతుల్యతఁ గనియెన్. 4

క. రేలన్ లీలలఁ దూఁగెడు
ప్రోలిసతులదంతపత్రములఁ జేరి కనం
బోలనిచంద్రుఁడు వారిక
పోలంబులఁ గాంచిజలముపోలుపు ఘటించున్. 5

1. ఇప్పుడు గుల్బర్గాజిల్లాలో నీపురము కలదు.



క. ప్రతిబింబమార్గమునఁ బర
సుతనులయతనుప్రబోధసూచకముఖముల్
సితరుచి సేరియు మోసము
వెత మెఱుఁగదు కావు గలుగువిధమునఁ బోలెన్. 6

క. సురపతిమణిరసవిమలో
దరములు తోయాకరములు తద్ద హసించున్
శరదపగతాబ్దపంకము
[1]ఖరకరజామేచకంబుగా వినుచక్కన్. 7

క. కడుదళ మగుతోరణములు,
నిడు పగపటికంపువప్రనివహముఁ దగు న
య్యుడుపథకేళీముకురమున
బెడఁగునఁ గడుగఁ బడుదంతవితతిన్ గనె నాన్. 8

తే. గీ. రేలఁ గప్పఁగఁ బడె శశి ప్రోలిచెలుల
యాననముగమివెల్గుల నతనివనిత
వెండికపురంపుభరణి నా వెల్ల నైన
వనజరిపుఁ దెచ్చు టనుచు విభ్రమముఁ జెందు. 9

తే. గీ. పాల్కడలివోనివెల్గుల వాసిఁ గాంచు
నచటిపటికంపునేలలయచ్చరుచుల
యెదుటఁ గజ్జలనీల మౌ చదలు గనఁగ
నౌను దావాగ్నినిర్దగ్ధకాననమన. 10

చ. తనదరి నున్నభూరుహకదంబకముల్ ప్రతిబింబరీతిగాఁ
దనయెడఁ గానుపింప విబుధక్షితిజావళితోడ నొప్పురీ
తిని సురలుప్తసారవితతిన్ వనధిన్ గడు గేలిసేయుఁ బ
త్తనవిధస్థితంబు సుఖదంబు తటాకము సొంపుపెంపునన్. 11

1. యమున.

క. ఆలమునఁ బ్రతిక్షణమును
శోణితమన్యుఁ దగుతేఁడు కాచపురికి నే
లీలన్ [1]బోటిఁ దలిర్పఁగఁ
జాలద శతమన్యురక్ష సౌ రగుపురమున్. 12

క. చకితమృగాక్షులు గావున
వికలతఁ గనుఁ జొరఁగ మృగము పెన్నొత్తిదిభీ
తికలిమి లీలం దూఁగుమ
ణికుండలవిలాసిగండసీరేఖారిన్. 13

శా. ఆరాజన్యనిపట్టణంబున నభోవ్యాప్తంబు లౌదేవతా
గారాగ్రోజ్జ్వలహేమకుంభములు ముక్తాకాంతిజాలచ్ఛల
న్నీరంబుల్ గల వై సురాంగనలఁ దన్పింపంగ సొం పొందెడున్
జేరన్ నిర్మిత మై ఘటంబులఁ బ్రకాశించుంబ్రపాపంక్తి నాన్. 14

క. త్రైలోక్యవశ్యకృన్నా
రీలీలాయితముఁ గని పరిభవస్మృతి మీఱఁ
దాలుపుజో దల ముమ్మొన
వాలుమగనికై ధనుస్సుఁ బట్టెఁ మఱలఁ. 15

క. స్మరకీర్తిప్రతివస్తుతఁ
బెరసినదర్శనసమూహవిలసత్స్వనముల్
పురయువతీకంఠస్వన
పరంపరకుఁ దెలిపి నిచ్చప్రౌఢి వహించెఁ. 16

సీ. అచటియింతులయల్క నసుఁగులసొంపుఁ గాఁపు;
రోషశేషముఁ బికరుతియడంచు;
నచటియుమ్మలఁ జొచ్చి యబ్జుఁడు ఘనుఁ డయి
వనితాఽఽన్యగతి రాహువంచకుఁ డగు;

1. న్పర్శ



నచటిమేడలనెక్కియము లూనుముత్యాల
జిగివెల్లి మిన్నేటిబిగిని మీటు;
నట మరుండు హరునయనవహ్ని మఱవక
నతులహేలాఽమృతస్తనము లూను;

తే. గీ. స్మరునికార్ముకకర్మకౌశలముఁ గనుఁడు
నల్లకల్వలఁ బోలునానగరిలోల
లోచనాలోచనములు నారాచములుగఁ
గాంచి పాషాణహృదయముల్ గాఁడ నేయు. 17

చ. జలనిధిమేఖలాకలితసారమణుల్ విలసిల్లుభూమిచే
లలితవధూతటిల్లసితలాస్యసమంచితమేఘమాలచేఁ
బొలుపగు పూలమాలికలఁ బోలునదుల్ సొబఁగొందుమింటిచే
నలలిత మప్పురంబు గడుసౌరు ఘటించెను గంతుతల్పమై. 18

చ. కొలనియెడఁ గుణంబులనుగూర్చి నుతుల్ వొనరింపఁగా వలం
తులు గలరే! మెలంగు నటఁ దుష్టిని హంసలు వానలందునే
నలఘుతదీయవప్రసముదగ్రత దుర్హృదలంఘనీయ మై
నలలితకీర్తిఁ గాంచు రిపుసైనికు లెంతయు నోడి పాఱఁగాఁ. 19

తే. గీ. రాత్రులం దున్నతోన్నతరమ్యసౌధ
గాహనము సేయుశశికురంగకము మెదను
వంచి వనితాఽవతంసదూర్వలను గొనఁగఁ
గోరు; మేడలఁ బొగడంగ నౌర! తరమె. 20

చ. పురజనదృక్కురంగములఁ బూన్పెడుబంధము లౌను గాని వా
గురలు గనంగ రావు, విరికోలలతాలుపునాన లౌను న
క్కరములు లేవు, యౌవతసుకల్పితనృత్తము లింటనింటఁ గూ
ర్పురహి విచిత్ర మౌను బెఱసొంపులవర్ణన సేయ నేటికిఁ. 21

తే. గీ. మూడులోకములను దన కీడు గనక
మహితగుణముల మానసమార్గ మైనఁ
గడచునివ్వరి కెట్టులఁ బడయు దీటు ?
మానసైకసుగోచర మైనయలత. 22

ఉ. అప్రతిమానచాపవిభవాయితు భార్గవుఁ బోలుపార్థివుం
డప్రతివీరుఁ డై దిశల నాజి జయించి పురిన్ వసించి య
ర్థిప్రకరార్థకోటిఁ గడుఁ బ్రీతిగఁ బూరణ సేసెఁ గాదె; పా
త్రప్రతిపాదనంబు ధర ధన్యతఁ గూర్చు నపారలక్ష్మికిన్. 23

చ. ధరణి ననర్ఘవస్తుసముదాయములెల్లఁ దమంత వచ్చి యా
ధరణిపుపాదమూలమునఁ దద్వశతాస్థితి నొప్పు చుండినన్
వరసుతుమోముచందురుప్రభన్ గన లేనివిభుండు దోఁచె నాఁ
డరయఁ బ్రభాతనీలకుముదాయితదీనవిలోచనుండుగాన్. 24

ఉ. అత్తరి బాష్పము ల్గని క్రమాఽగతశోకము నాప లేక ద
గ్గుత్తుక డిందుమాటలను గూర్మిప్రియం దతిఁ జేరి పల్కె భూ
భృత్తపనుండు దంతములవెన్నెలకాంతులు నై జభారతిన్
ముత్తెపుహారలక్ష్మివిధిఁ బూని రుచిన్ ద్విగుణీకరింపఁగన్. 25

మ. అతివా ! యే మని చెప్పువాఁడ ఫలశూన్యం బైనగార్హస్థ్య మన్
క్షితిజ బిష్టు మదీయచిత్తముఁ గలంచెన్ శాంతి లేదయ్యె నా
ప్రతిబింబం బన నొప్పునాత్మజుని దౌర్భాగ్యంబునన్ గాన నౌ
కుతుకం బింతకుఁ గాంచనైతిఁ బ్రమదాంకూరాప్తిగా నీయెదన్. 26

ఉ. నా దగుశౌర్యసంపదకు నాగుణపాళికిఁ దుల్యుఁ డై కలా
శ్రీదయితుండు రాజు దసుఁ జేరకయున్నఁ జటక్యలక్ష్మి దా
నోదయితా ! సముద్రచలితోర్ముల నూఁగెడునోడకట్టుపైఁ
బా దగుచున్ వడంకుఁ గనుపక్షివిధంబును దోఁపఁ జేసెడిన్. 27



క. ప్రియునిప్రసాదముఁ బడసియుఁ
బ్రియభూషల హాయల నైనఁ బ్రియగేహినియే;
ప్రియసుతు నళీకహాసునిఁ
బ్రియాఽఙ్కపర్యంకమందుఁ బెంపక యున్నన్, 28

చ. తన దగునేగుణంబును వితర్క మొనర్చి యపత్యజాతమున్
గొనకొని పెంచుచుండు నిలఁ గ్రూరమృగంబును; గానఁ బంకజాఽ
నన; యిది వస్తుతత్త్వము; కనంగ నచింత్యము; నీదృశంబుగాఁ
దనరెడుచిత్తవృత్తి తలిదండ్రులచే సుతులందుఁ జూప నౌ. 29

క. తురగమఖరాజసూయా
ధ్వరనికరము లెన్ని యే నుభయలోకములం
దరుదుగఁ బిత్యాణ ముడిపెడి
వరసుతునకు సాటియే ! శుభము గృహి గనునే. 30

క. అగునే ధన్యుఁడు శౌర్యాఽ
దిగుణంబులు గల్గునరపతి భుజాబలకీ
ర్తి గడించుసుతునిచే ముం
న్నుగ నుతిఁ గన కున్న నిలఁ దనుజవంతులలో. 31

మ. అని యాతీరున రాజు వల్కఁ గడు శోకాఽయత్తచిత్తంబునన్
వినియెన్ శ్రోత్రపథప్రమాథికథ; శాంతిం బొంద కారాజకాం
త, నరేంద్రున్ గని యేమి వల్కకయ చింతన్ గుంది నిట్టూర్పులన్
దనరించెన్ దనఫాలభాగమున వ్యత్యస్తాలకంబుల్ దగన్. 32

ఉ. ధీరుఁ దధీర యైనవెలఁదిన్ దనయంకతలంబు నంతటన్
జేరిచి పెన్నయన్ గదురఁ జేసి సముజ్జ్వలదంతకాంతి యన్
వారిని వారిజాక్షిమదివంతలపేర్మినిఁ బాపురీతి వ్యా
హార మొనర్చె నై జవచనామృతవృష్టి ప్రియంబుఁ గొల్పఁగన్. 33

మ. వరగాత్రీ ! వదనంబు కోష్ణ మగునిశ్వాసంబునన్ ధూసరా
ధర మౌనట్టు లదేల చేసెదు విషాదం బింకఁ జాలింపుమా !
యరికట్టన్ సమకట్టితిన్ వెస నభీష్టావాప్తి విఘ్నంబులన్;
వరదుం డర్ధశశాంకమౌళి మనపాపంబెల్లఁ బోనాడెడిన్. 34

శా. సంతానంబు లభింప నాకు మిపులన్ సౌలభ్య మేపారెడిన్
గాంతా ! వేదములెల్ల నేర్చితిని శిక్షం గంటి శాస్త్రంబు ల
త్యంతశ్రద్ధ శ్రమించి పూర్వకథలన్ సాంతంబుగాఁ గ్రోలితిన్
సుం తైనన్ గురులాజ్ఞ మీఱక మనంబున్ వారిపై నిల్పితిన్. 35

క. కులగురు వై మనపాలన్
విలసిల్ల శశాంకమౌళి భీతిల నగునే !
యిల దుష్ప్రాపము లున్నే !
యలసతఁ గరగతపదార్థమందరు మునులున్. 36

ఆ. వె. కాన నెంతదనుక ఖండేందుశేఖరుం
డతులదయను జూపఁ డంతకాల
మింతి ! తపము నిశ్చయించితి సీతోర్ధ
దుర్జయేంద్రియములదుడుకు నడఁచి. 37

క. ఇంద్రియము లలయఁగా ని
స్తంద్రుఁడ నై తపముఁ గలుషశాంతి కొనర్తున్
జంద్రార్ధమకుటు, శంకరు
సాంద్రం బగుభక్తి వెసఁ బ్రసన్ను నలుపుదున్. 38

క. అన దేవేరియు నట్లే
యని సమ్మతిఁ దెలుప నంత నాతఁడు రాజ్యం
బు నమాత్యులవశ మొనరిఁచి
తనరెఁ దపోనియతి నర్థితప్రాప్తికినై. 39



క. సాఽదృతిఁ దెచ్చి సుమంబుల
భూదయితుఁడు కృత్తివాసుఁ బూజించుచుఁ దా
మేదినివాసమున రజో
మేదురుఁ డై తపము సలిపె మించి తపసులన్. 40

క. సుకుమారతై కధనుఁడు నృ
పకుంజరుఁడు మునులకేని భరియింపఁగ రా
నికడిఁది శ్రమ కోర్చి తప
స్యకుఁ బూనుచు నొప్పె నుడుగణాఽన్వితశశి యై. 41

క. బెడిదంపుఁ దపోవ్రతమునఁ
గడుఁ గృశియించిననృపాలుఁ గమలవదన వెం
బడిఁ గొలిచె శాంతితో నొర
పిడిఁ గనురవ వెన్నడించువెలివెల్గువలెన్. 42

సీ. తనపతి సేవించుత్రిణయనుమకుటగం
గాస్రవంతీతరంగముల శీత
హాతాంకురంబుల బడలిక దీఱిన
యదివోలె నృపకాంత యధికభక్తిఁ
బతిసేవ బాగుగాఁ బచరించు: స్వయముగా
నలికి ముగ్గిడు మందిరాజిరమునఁ;
దనమహోన్నతికిని దగునట్లు, తగునట్టు
లౌదార్యనిధిమది కానృపాలుఁ

తే. గీ. డింద్రియము లోర్చి బహుకాల మిందుశేఖ
రప్రసన్నత కుగ్ర మౌవ్రతముఁ బూని
యుండ నొకనాఁడు వినియెఁ బ్రత్యూషపూజ
సలుపువేళ నాకసమునఁ బొలుచువాణి. 43

క. చాళుక్యక్షితిపాలక!
పాలింపుము తపము నీకుఁ బ్రశాంతిని గనుమా!
త్రైలోక్యపాలకుఁడు నీ
పాలను గలఁ డయ్య! భక్తవాత్సల్యమునన్. 44

ఉ. ఓనరపాలశేఖర! శుభోదయ మందఁగలాఁడ వయ్య! యీ
నీనయనాభిరామ సతి నెయ్యము మీఱ సుతత్రయంబు నెం
తో నుతి కెక్కఁ గాంచును దదూర్జితకీర్తివికాసమౌక్తిక
శ్రీనిఁ జళుక్యవంశము శుచిత్వనిధానము గాఁగ నొప్పెడున్. 45

ఉ. ఆతనయత్రయంబునఁ గలాలయుఁ దూర్జితవిక్రముండు మాం
ధాతృదిలీపముఖ్యవసుధావరకీర్తు లతిక్రమించి త
న్మాతకు నీకు సంతసము మధ్యమపుత్రుఁడు గూర్చెడున్ జయ
శ్రీ తనయంతఁ దా వలచి చెచ్చెఱఁ జేరును వానిఁ బార్థివా! 46

తే. గీ. కరమసుతు లిర్వురును దమకర్మగతిని
బుట్టుదురు రాజ! మధ్యమపుత్రుఁ డరయ
మత్ప్రసాదంబునం బుట్టి మహితపటిమ
రాజ్య మాసాగరం బేలు రాముఁ బోలి. 47

మ. అని యీతీరున వ్యోమసాగరమునం దానంద మేపారఁగా
జనితం బైనసువాక్సుధన్ శ్రుతిపుటిన్ జాళుక్యభూమీశుఁ డం
తను సంతోషముమీఱఁ గ్రోలి పులకాంచత్సర్వదేహుండు నై
యనుభూతిన్ గనె గాత్ర మంతటను శైత్యవ్యాప్తిచేతన్ జలిన్. 48

క. కని సంతోషాలసలో
చన నన్యపురంధ్రిసుగుణసందోహము మిం
చినసతి నానందాశ్రుల
జనపాలుండు కడుసంతసంబునఁ దేల్చెన్. 49



క. వ్రతపారణవిధిఁ దీఱిచె
నతఁ డంతట ధనములన్ ద్విజావళిఁ దనిపెన్
దతసౌభాగ్యవిలాసాం
చితజాయం గూడి రాచసిరుల భజించెన్. 50

ఆ. వె. వేల్పుతేనిఁ బోలువిశ్వంభరాపతి
సుముఖియందు సుభగసుతుని శుభము
హూర్తమందుఁ గాంచి యూర్జితోత్సవమున
నిఖిలజగతి ధన్యునిగఁ దలంచె. 51

ఉ. అమమజేశ్వరాత్మజుఁ డనంతముగాఁగఁ జళుక్యరాజ్యల
క్ష్మీమహితావనీపతాలచెన్నగునేత్రచకోరపంక్తికిన్
సోమునిరీతి సంతసము సొప్పడఁ జేయుట నొందె 'సోముఁ' డన్
నామము సార్థ మంచుజననాయకముఖ్యులు వేడ్కమై నిరన్. 52

తే. గీ. కడమకొడుకులకన్నను నడిమివాఁడు
కడుసమర్థుఁ డటన్ననాకాశవాణి
సతముఁ దలఁచుచు నాతనిజన్మమునకు
నెలమి నీక్షించు చుండె నుర్వీశుఁ డంత. 53

తే. గీ స్ఫటికనిర్మలకాంతితో వఱలునట్టి
గర్భశయితార్భకునిదేహకాంతితోడ
వ్యాప్త మట్లుగ బిసదండపాండురంబు
వెలఁదిచెక్కిలిఁ గాంచె భూవిభుఁడు ప్రీతి. 54

క. బంగరుసోనఁ గురిసె రా
ట్పుంగవుఁ డలమ్రొక్కుఁబడి విబుధులకుఁ దీర్చెన్
గంగామకుటుదయం గను
నంగజుప్రేమమున వేడ్క లన్నియుఁ జేసెన్. 55

మ. క్షితిపాలాంగన దాల్చె దేహలత నక్షీణప్రభావంబుతో
నతిధావళ్యము గల్గి యంత నమృతవ్యాప్తిన్ దగన్ గాంచె నా
న్వితమున్ జొప్పడ నై జనిర్మలత క్షోణీనాథుపెన్దుఃఖ మన్
దతపంకంబుఁ దొలంచె మోద మిడి చిత్తంబున్ గడున్ దేలిచెన్. 56

తే. గీ. ఇందుబింబంబుఁ బిదిచి పాలిండ్ల సుధయె
స్తన్యముగ విడఁ బడె నాఁగఁ దరుణిచూచు
కయుగ ముత్పలనీల మై కాంతిఁ దనరె
నిందులాంఛననీలిమ నందె ననఁగ. 57

ఉ. కాంచనకుంభకాంతి గలకాంతచనుంగవ యెంతయుం బ్రకా
శించె సుధాప్రవాహమును క్షీరమిషంబునఁ గాంచెనో యనన్;
మించినయార్ద్రచందనము మే లగుశైత్యచికిత్స కూన్ప గా
లించఁగ నిద్ధచేలమువలెన్ గనుపట్టె విశుభ్రకాంతిమై. 58

క. క్షితిపతిసుతార్థ ముంచిన
సతికుచకుంభముల నొప్పుస్తన్యంబు విలా
సతరళముక్తారుచిమిష
గతి ధరియించెన్ సుమల్లికావాస మొగిన్. 59

ఆ. వె. విభునిపుత్రుఁ దనుభవించుమృగీనేత్ర
చూచుకములనలుపు సొంపు పొలుచు
మహిమ సంక్రమింప మహితరసాయనౌ
షధిదళద్వయంపుశ్యామ మనఁగ. 60

క. ఎదతెగనియిడుమలన్ గూ
ర్చెడులేమికి నెట్టు లోర్చునృపతనయుఁడు ని
ప్పుడు తల్లికడుపునుండియ
నడుమంత్రపులేమి మనమునన్ నిరసింపన్. 61



క. వలియుల్లాసనమున్నతిఁ
బొలియించెను గర్భ; మట్లు పొదమునకీర్తిన్
దొలఁగించెను దనయందున్
[1]వలియుల్లాసంబు నూని ప్రస్తుతిఁ గనఁగన్. 62

క. క్షితిభారము శాంతింప న
వతారమున్ గనెడుసుతుఁడు వసుధాపీడాఽఽ
యతి నోర్వమిఁ గనఁ జేసెను
క్షితిపతిసతిగర్భభారఖిన్నపదగతిన్. 63

క. క్వణదురుకాంచీవిలస
న్మణిబింబితసఖిజనంబు దగఁ దత్కాంతా
మణి భాసిలె నిలువేల్పుల
గణములు గలయంగఁ గొలుచుకైవడిఁ దోఁపన్. 64

క. అతివీరవిక్రముఁడు సుతుఁ
డతివయుదరమందుఁ గ్రాల నమలమణిభువిన్
బ్రతిబింబితోచ్చగృహములు
నతు లిఱుకులగిరు లనన్ ఘనము లై యొప్పెన్. 65

చ. నృపసతి మేఖలామణిమరీచులచే సొబఁ గొందె నంత ఘ
స్రపతినమోదరస్థతనుజన్మనితేజముచే ననన్ నిశా
ధిపతి నిశాముఖంబులఁ దదీయహృదిన్ బ్రతిబింబరీతిగా
నుపచరణంబు సేయునటు లొప్పెను గర్భిశుభాపధాన మై. 66

సీ. ఆశాగజేంద్రకుంభాయితభిత్తుల
నంఘ్రియుగన్యాస మభిలషించు;
ధారాసలిలపానతత్పర యై యసి
ధారలఁ జూపులఁ బాఱఁ జేయు;

1. వబలకు భేదములేదుగనుక నిట 'బలియుల్లాస' మని భావము.

సుపరిస్థవస్తునమూహంబున నుదుల
నైన రోషారుణిమాఽప్తిఁ జూచుఁ;
బాదయుగాబ్జసంవాహన మొనరింప
గరువంబున్ దిగంగనలఁ జేరు;

గీ. ముఖరితవిభూషలను బొమల్ ముడిచి కాంచు;
నిశ్చలాగ్రప్రదీపనిర్నిద్రకాంతిఁ
దనరుగృహముల నైన మత్సరమునఁ గను;
గర్భభారాలస యిలేశుకాంత యరతి. 67

ఉ. ఇట్టులు భూమిపాలుతరలేక్షణ యందము నై విచిత్ర మౌ
నట్టుల గర్భదోహదము లంది ప్రతాపనిధానుఁ డైనరా
పట్టినిఁ దోఁపఁ జేయుచు నృపాలశిఖామణి కంత సంతసం
బుట్టిపడన్ గనుంగవకు నుత్సవ మయ్యె సుధాఽఽక్తవర్తి యై. 68

తే. గీ. శాస్త్రరీతిని వరుసఁ బుంసవన మాది
సర్వకర్మలు నెఱపె రసావరుండు
నంతఁ గాంత విశేషచిహ్నములఁ దోఁచె
వసుమతీశున కాసన్నఫలము దెలియ. 69

తే. గీ. ముజ్జగములక్ష్మి విభ్రమమునఁ గనుగతి
ద్రావితేందుకరంబులఁ దదుపరీతి
మేదినీపతిమోదంబు మేర మీఱెఁ
గోర్కెతీవియ ఫలములఁ గూర్ప నుండ 70

ఉ. అవిభుకాంత సేరె భిషగాహితసర్వచికిత్సమున్ సుర
శావిధికల్పితాక్షతము సంతతదక్షకులాంగనాసమా
సేవిత మౌనరిష్టము విశిష్టవిధిజ్ఞహితాహమం దనం
తావరుఁ దన్పుచున్ సుశకునంబు లనంతము లుత్సవం బిడన్. 71



సీ. మిసిమిచాయలతోడ మించుప్రదీపము
లార్తిచే జపియించునట్లు దోఁప,
బాలకసహితమరాళపుత్రిక నైనఁ
బరిజనుల్ వేడ్క నుపాయ మడుఁగ,
గృహదేహళిన్ శస్త్రధృతమంత్రవేత్తల
క్షతలను జల్లి హుంకృతులు సలుప,
మునలిచేడెలు హితబోధ లల్లన సల్పఁ
గడుశోకమున శుకాంగనలు వినఁగ,

ఆ. వె. పూర్వమందు నెట్టిసార్వభౌముఁడు గాంచఁ
జాలనట్టియక్కజంపులగ్న
మందు నృపతికాంత యిందుశేఖరుకృప
సూతికాగృహమున సూనుఁ గనియె 72

క. భ్రమరస్వనకలితం బగు
సుమవర్షము గురిసె మ్రోగెఁ సురదుందుభు లు
త్తమగతిఁ దెలి వొందె దెసల్
కొమరునితో బయలువెడలు గుణములచే నన్. 73

క. కర మారాత్రికదీప
స్ఫురణన్ నూత్నప్రతాపశోభితుఁ డయ్యెన్
నరపతితనయుఁడు దినపతి
సురుచిప్రాక్సంధ్యచేత సొంపఁ గొందు క్రియన్. 74

చ. సవిధమునందు రత్నమయసద్మవినిర్మలభిత్తిసీమలన్
భువనవిశిష్టవిగ్రహము పొల్పు గనన్ దగి యొప్పె ధారిణీ
ధవసుతుఁ డాత్మసేవలఁ గృతజ్ఞతచే స్మరియించు నంచు లోఁ
దవిలినవేడ్క దిక్పతులు దా మొదిఁ నర్మిలిఁ దాల్చిరో యనన్. 75

చ. నరరమణావతంసునకు నందనుఁ డుద్భవ మొంద ముందుగా
సురనికరంబు దెల్పెఁ బరితోషితనాంద్యనువాదమై ఖరిన్
బరువడిఁ దత్సమంబు పరమం బగు మోదమునన్ వరాననల్
త్వరితవిలాసయానపరితఃస్ఖలితాత్మవచోవిజృంభణన్. 76

మ. హరు వొందెన్ నృపమందిరంబు సురదత్తానేకదివ్యాంబరా
భరణం బై పరిబద్ధగీతనినదభ్రాజిష్ణుగాథావిధా
స్ఫురదాతోద్యనమున్మిళన్నటన మై స్ఫూర్జచ్ఛుభోదర్కతూ
ర్యరవం బై పటువందికీర్తితపురారాజన్యచారిత్ర మై. 77

చ. క్షితిపతి యంతఁ బుత్రునకుఁ జేసెను జిత్తము రంజిలం బురో
హితుఁడు విధించుకార్యములనెల్ల విధానవిధుండు; తత్పుతున్
బ్రతినిమిషంబు తాఁకుచు నపారమహోత్సవ మందె; విశ్వసం
స్తుతగృహమేధిభావమున ముఖ్యఫలం బిది యై రహించుఁగా. 78

తే. గీ. బాల్యచేష్టావిశేషముల్ భావివిక్ర
మాద్భుతౌజస్సులను దెల్పునట్టు లలరఁ
దదనుగుణముగ నృపపుత్రుఁ డుదితగుణుఁడు
సరవి శ్రీవిక్రమాదిత్యసంజ్ఞ నందె. 79

క. అవదాతద్యుతియు యశో
ధవళిత దిఙ్ముఖుఁడు నైనతద్విక్రముచే
నృపవరునతి విక్రమోదయ
సువంద్యసామ్రాజ్యలక్ష్మి చొప్పునఁ జెలఁగెన్. 80

క. కరపల్లవమున బాలుఁడు
నర మమరిచి చన్ను గుడుచుచాయలఁ దెలిపెన్
వరభోగములందుఁ దన క
పరిహరణీయులు గుణ లనుభావము గరిమన్. 81



తే. గీ. తల్లియొడి నున్నహారాళిధవళరుచులు
సొచ్చి బాల్యార్చె నన నొప్పునతు నహేతు
కస్మితజ్యోత్స్న నృపవరదృక్చకోరవాళి
కలరె నిం దగుచున్ వైజయంతికరణి. 82

క. సుతుముష్టిఁ జొచ్చునరుణ
ద్యుతిమద్రత్నప్రదీపకోరితరోచి
ర్లత యొప్పె శత్రుశోణిత
తతసహజకృపాణలేఖఁ దాల్చెనొ నాఁగన్. 83

తే. గీ. అక్కుమారుఁడు గూర్చుండునట్టివారి
వీడి నిల్చినవారివిధముఁ జేరు;
నున్నతాత్ముండు మున్ జూప నున్నయట్టి
నీచవై ముఖ్యరీతి నందియము దీల. 84

చ. స్మితయుతహుంకృతిన్ సుతుఁడు చేటికిఁ జేసి క్షితీట్ఛ్రుతిద్వయం
బతులసుధాప్రపూరణల నార్చు; నృపాలునివేలుపట్టి యు
త్థితుఁ డయి సానుడుల్ నలుపుతీరు తదుర్వివరేణ్యదృక్ఛ్రుతి
ద్వితయమునం గదున్ బొదలు వింతగ సంవననౌషధంబుగన్. 85

చ. క్రమముగఁ జూళకర్మ జరుగన్ జనతాత్తవినోదవిభ్రమో
ద్గమతతిఁ గూర్చి నందనతఁ దన్నృపచంద్రసుతుండు పాంసువి
భ్రమపరిధూసరాంగుఁ డయి పార్థివునంకము నెక్కి వశ్యచూ
ర్ణముగఁ దనూగళద్రజముఁ గ్రాలఁగఁ జేసె క్షమేనుమేనునన్. 86

క. నృపతులప్రణతులఁ గెల్మొ
డుపుల నిరాదృతిఁ గనుల ముడుంచు నృపుఁడు త
ద్విపులై కకరసరోజా
తపరీతప్రణతిఁ గృతిగఁ దనుఁ దలఁచికొనున్. 87

క. ప్రతినిమిషంబును గుంతల
పతి యాత్మజుముద్దుఁ గొనఁ బ్రవాళోష్ఠప్రో
దిత మైనరాగమునవలె
నతనిమనము రాగపూర్ణ మై యిర వొందున్. 88

ఆ. వె. వదనచంద్రునందు వఱలఁ గోరుమృగంబు
వెలవఁ జేయ నిడెడువిధమొ నాఁగ
రాజసుతుఁడు గడు విరాజిలెఁ దనమెర
యందు నిద్దపులినఖాంకురమున. 89

క. రోవెలందులయందెలరొదకు దరియు
రాజహంసలఁ గేళి దూరముగఁ దోలి
భావిఁ దా నొక్కఁడే భూమిపాలుఁ డంచు
నతఁడు దెలిపెను రాజహంసాసహనత. 90

తే. గీ. ఇనుఁపబోనుల నిరవు గాంచినమృగేంద్ర
డింభములఁ గేళిపరతఁ బీడించు నతఁడు
భావిపరిపంథ్యనేకవప్రథననముప
యోగమునకయి తచ్చౌర్య మూనె ననఁగ. 91

క. ఉదయ మెనసి బాలేందుఁడు
పదనఖయుతి వృద్ధిఁ గనుచు వఱలెన్ దన్నున్
గదిసి సహఖేలనమునకు
గుడిగొని చలివెలుఁగుబాలకులు వేఁడి రనన్. 92

మ. లిపు లెల్లన్ గ్రమ మేర్పడన్ నిపుణత ల్మీఱన్ గడించెన్; స్వభా
వపవిత్రాత్ముల కెందు నొజ్జలు దలంపన్ హేతుమాత్రుల్ గదా!
కుపసూనుం దలవాటుమాత్రకయి ముల్కుల్ దిక్కులన్ రువ్వె గా
యపడన్ గల్గినభీతిఁ బోలె విరళం బై పార్థుకీర్తుల్ సనన్. 93



తే. గీ. పరమలావణ్యలుబ్ధభూపాలకన్య
కామధుప్రవీతతి తన్ముఖంబుఁ బడయఁ
గలుగుటకు మున్నె చుంబింపఁ గలిగె నౌర!
భారతి కవిత్వవక్తృత్వఫలముతోడ. 94

క. లావణ్యకలాతతిసం
భావితుఁ డై వఱలునట్టిబాలేందుఁడు ని
ద్రావిముఖతఁ గూర్చెను దొవ
తీవలకునుబోలె మదవతీజనమునకున్. 95

క. ధృతి నాతఁడు న్యక్కృతిఁ జనఁ
దతముగ్ధభ్రుకుటిపటలిఁ దగి మరుకేళిన్
గుతుకము గలనగరస్త్రీ
తతికనుఁగవదొవలు కిన్కఁ దాల్చె నతనిపై. 96

క. లావణ్యరమాధాముఁడు
క్ష్మావిభుసుతుఁ డెదుగ నెట్టికామినులకునేన్
దా వై యెసఁగవె నిద్రా
భావప్రచురతలు నేత్రపంక్తులయందున్. 97

చ. ఇతఁడు సమున్నతాఽత్ముఁడు సహించఁడ తేజ గలట్టివారియు
న్నతిఁ బసివాఁడు నై యవనినాథకుమారుఁడు; భాస్కరుండు త
త్స్థితి మతిఁ గుంది దీనుఁ డయి దేవుఁడు నయ్యు సమాశ్రయించి సం
తతముఁ జరించు నచ్యుతపదంబున దా శరణేచ్ఛచేఁ బలెన్. 98

క. తేజోధనోపరిస్థిత
రాజన్యకుమారమకుటరత్నము పైగాఁ
దే జొందుట క్షమఁ గోరెడు
నోజన్ మణిపాదపీఠి నొదిగి యెఱఁగెడున్. 99

క. కలనేఁ గీర్తిదరిద్రత
గలుగు ననుట లేనియతఁడు గౌరీశుదయన్
గలిగె జయసింహుఁ డన భూ
తలనాథునకున్ దృతీయతనుజాతుం డై. 100

క. సకలకలాకోవిదుఁ డై
యకలంకరణోత్సవముల నత్యుత్కంఠన్
బ్రకటించువిక్రమార్యము
నొకనాఁడు నృపుండు సూచి యూహించె నిటుల్. 101

క. అక్కజపుసాహసము గల
యిక్కొమరుం డేకవీరుఁ డిభరిపుపీఠం
బెక్కిన సింహివలె నాడిం
జిక్కినరాసిరి నెవండు సేకొన నిక్కన్. 102

తే. గీ. కాన నీసుతు యువరాజుగా నొనర్తు
నితఁడు సామ్రాజ్యభారంబు ధృతినిఁ దాల్ప
నిరుతటంబులప్రాపున నెసఁగునట్టి
ధునిగ నృపలక్ష్మి తుల్యతఁ గనునుగాత. 103

క. ఈరీతిన్ గృతనిశ్చయుఁ
డారాజునకుం బ్రణామ మర్పించి తగన్
గీరమణీనూపురశిం
జారవసోదరరుతిన్ నృపాత్మజుఁ డనియెన్. 104

క. తలఁ దాల్తు రాన నృపతులు;
కలదు సిరియుఁ ద్యాగభోగకలనకు వశ యై;
సులభమ సకలము మీదయ
నల యువరాజత్వ మేల నందఁగ నాకున్? 105



క. అన విని నృపుఁ డి ట్లను నో
తనయ! మదిష్టమున కేలఁ దాల్తువు ద వ్వౌ
మనమును నీ దగుపుట్టువు
నను నాపదుపాట్ల నాపినాకియె యెఱుఁగున్. 106

తే. గీ. యౌవరాజ్యంబుఁ గై సేసి యవనియ[1]వన
యామికత్వంబుఁ దాల్పఁగా నరయవేని
జ్యారవాపూరితదిశాస్య మైనమద్భు
జమున కేరీతిఁ గ్లాంతి విశ్రాంతి దనరు. 107

తే. గీ. కలఁతఁ గర్ణాటపతి యిటు పలుక విని కు
మారుఁ డాత్మజనకునకు మాఱు పలికె
భారతీలాలితదుకూలభాసమాన
దంతదీధితిలేఖఁ జిందంగఁ జేసి. 108

క. కవులయెదుట వాచాలత,
[2]కువహితుకడఁ గాంతిమద మగున్ నాయీపా
టవనాటన; మైనను నే
భవదుపకంఠమునఁ గొంత పలికెద భక్తిన్. 109

సీ. కడుఁ బక్షపాతంబు గలుగుట నాయందు
మీవిచారము సొంపు మీఱి వైచు;
నగ్రపుత్రుఁడు సోముఁ డటు లుండ యౌవరా
జ్యాధికారము నా కనర్హ మగును;
జాళుక్యవంశ మాచారవిపర్యయ
మునకుఁ బాల్పడిన నే మనఁగఁ వలయు;
ఘన[3]వైశసమె యహా! కలికుంజరము నిరం
కుశముగా నకట! తా గోచరించు;

1. రక్షణ 2. చంద్రుఁడు - కువ + హితుఁడు - 'కువ' 'కువలయ' రూపాంతరము. 'కువాలయం కువలయం కువాలం కువలం కువం' అని కోశము.
3. హాని.

తే. గీ. నగ్రజుఁడు మ్లానముఖుఁ డగునటు లొనర్చి
నృపరమన్ గొన సిద్ధ మై నిలుతునేనిఁ
బలుక వే తేల నన్యాయపరుఁడ నగుచుఁ
గలుగఁ జేసెదఁ గులకళంకంబు నేను. 110

తే. గీ. కాన నీలక్ష్మిఁ గొనఁగ నగ్రజుఁడె యోగ్యుఁ
డగు; విపర్యాసమలిన మైనట్టియిట్టి
నృపరమాఽఽలింగనముచేత నెలమిఁ గాంచ
నాకుఁ గార్యంబు గాదు భూనాథతిలక ! 111

తే. గీ. అనయ మీరాజ్యరమ మీర లరయు చుండ
నగ్రజుఁడు యౌవరాజ్యపదాంచితుఁడు గ
రమణ నాక్రాంతకకుబంతరతఁ జెలంగి
యుర్వరన్ గాలిబంట నై యెలమిఁ గొలుతు. 112

మ. మును శ్రీరామునితండ్రి శాస్త్రసరణిం బోఁబెట్టి రాజ్యాభిషి
క్తు నొనర్చెన్ భరతున్; సతీజితుఁ డనన్ దుష్కీర్తి దిక్సీమలన్
గన నౌ నేఁడును; యౌవరాజ్య మది మద్గ్రాహ్యంబు గామిన్ మదిన్
గనరో; నాపయిఁ బ్రేముడిన్ విడుఁడు; విఖ్యాతిన్ నిరోధించెదున్. 113

చ. అని తనయుండు వల్క వసుధాఽధిపుఁ డప్డు శ్రవఃపవిత్ర మై
తనరుతనూజువాక్కుల నితాంతచమత్కృతిఁ గాంచి మించె; నె
వ్వనిమది లక్ష్మి తాఁ గలఁకవాఱ నొనర్పదు పాంసులాఽగ్రయా
యిని యయి? దానిచంచలత నెంచి మనీషి గ్రహింపఁ బూనునే! 114

మ. తనయంకంబునఁ బ్రేమఁ బుత్రు నిడి తత్కంఠంబునన్ నైజదం
తనవోద్యద్రుచి మౌక్తికాఽవళిగ నందం బొప్ప వాక్రుచ్చె ని
ట్లని రోమాంచితదేహుఁ డై 'తనయ! [1]వంశాలంకృతిన్ బుత్రుఁగా
నిను నాకున్ దయసేసె నెమ్మిని భవానీజాని ప్రీతాఽత్ముఁ డై'. 115

1. వంశమునకు నలంకారము



క. శ్రవణామృతములు వచనము
లివి వేఱెవ్వానినోట నెలమి బయలగున్ ?
దివిఽజాలివిలేహ్యములు మ
ధువులు సురతరువునఁ గాక [1]తొరఁగునె పెఱచోన్. 116

తే. గీ. నృపకుమారుల కర్హ మై నెగడునట్టి
దగునె పాత్రంబు నయవిప్లవాఽత్మకులకు?
మత్తదంతిఘటాభారమహిత మగును
రాజ్యరమ; నీకు నిది తృణప్రాయ మయ్యె. 117

క. ఈసిరి లంకాంతికగత
మౌ సాగరమున జనించె నాసురివలె; ర
క్తాఽసవములఁ దనియున్; గను
నీసుభుజాదండబంధనియతి వినీతిన్. 118

క. నీనుడి విన నది యెఱుఁగుదు;
నేనును జలకకులమందె నెగడితిఁగా! యె
ట్లూనున్ స్వభావచంచల
దా నిలుకడ లక్ష్మి గుణకథారహితునెడన్. 119

మ. కలుగం బోలదు నాయెడన్ దొసఁగు నిక్కం బింతయేనిన్ సుమీ!
కలదే నేదియుఁ గౌతుకం బడుగుమా! కార్తాంతికవ్రాతమున్;
దలఁపం జూడవు దుర్గ్రహంబు లతఁడే తాల్పంగ సామ్రాజ్యమున్
గలుషం బెంతయుఁ దద్గ్రహంబులె కడంకన్ గైకొనెన్ దీనికై. 120

క. హరిణాంకమౌళి సామ్రా
జ్యరమావరు నిన్నె తాఁ బ్రసాదించెను బ
ల్వురు సుతులు లోకనుతు లై
పఱఁగినను దుదిసుతయుగమె ఫలమున్ గూర్చున్. 121

1. స్రవించును.

తే. గీ. కాన నాపల్కుఁ బాటింపఁ గనుము వత్స!
చిరసమున్నత యోఁ గాక వరచళుక్య
రాజ్యరమ; మచ్చరము వీడి రాజు లస్మ
దీయగుణపక్షపాతంబు నెంత్రు గాక. 122

చ. అని జనకుండు పల్కఁ గడు నాదృతిమై విని నవ్వు మోమునన్
దనర వచించెఁ బుత్రకుఁడు; నాదగుభాగ్యవిపర్యయంబుచే
తను దలపెట్టినార లిది; తండ్రి! దురాగ్రహ మింత చెల్లునే!
యనయము నాయశంబున కనంతకళంకము గల్గ దీనిచేన్. 123

తే. గీ. తద్గ్రహంబులు రాజ్యదూతలుగఁ గాని
చో, శివుండును గారుణ్యశూన్యుఁ డేని
వారియండను గొని నీవె వసుధ నేలు;
మాఁపు నన్ను యశోవిపర్యయమునుండి. 124

క. తల నానఁ దాల్చి కెలఁకుల
నిలువఁగ నే నితఁడు శక్తి నిగిడించును బో;
పిలిచినయెడ రక్షామణి
తులఁ బూనఁడె చిత్రకార్యదోహలుఁ దగుచున్. 125

క. ఈలాగు నుచితవచనము
లోలి నతఁడు వల్క తండ్రి నున్నతకుతుక
వ్యాలోలుఁ జేసి యన్నను
[1]శాలీనత యౌవరాజ్యశాలిన్ జేసెన్. 126

క. స్వయము తుహినాంశుమౌళి స
దయుఁ డై కార్యగతి నెంచి తా నానఁగూర్పన్
సుయశుఁడ నగునాయిష్టముఁ,
బ్రియ మని సుతుమార్గ మనుసరించె జనకుఁడున్. 127

1. మంచితనము.



చ. అల ప్రతిపత్తిపాత్రుఁడుగ నగ్రజుఁ డున్నను లక్ష్మి తమ్మునే
వలచును; నిమ్నపూరకస్రవంతి సరిత్పతిఁ జేరఁ గోరుఁగా;
నెలఁ దలఁ దాల్చుదేవునడి నిస్తులసద్గుణదర్శనంబునన్
నిలిచె నతండు తండ్రియెడ నేర్పరి నిల్పుఘనార్ఘరత్న మై. 128

తే. గీ. యౌవరాజ్యపదస్థుఁ డౌనగ్రజునకు,
రాజపదమందు నున్నధరావరునకు
హితుఁ డితం డయి యుర్వరకృతినిఁ దాల్చె
క్షోణి; శేషాహిధర మాదికూర్మ మట్లు. 129

ఆ. వె. ఆదృతాజ్ఞుఁ డైనయావిక్రమాంకునే
యిల రణోత్సవముల నెల్లఁ బనిచి
ధరణిజాని గ్రోలుఁ దదుపార్జితము లైన
సద్యశోఽవతంసజయసుధలను. 130

తే. గీ. తన్మతంగజకుంభవితాననిహిత
చీనపిష్టవిపాటల మైనజలధి
చోళసేనాక్షయోద్భూతశోణితాఽవ
గాఽఽవళిం బూర్తిఁ గాంచినయట్లు మించు. 131

క. [1]హరిసేనలతోఁ జాళు
క్యరాముఁడు తనను దఱియ భయానవలెన్ సా
గరము రదము లిగిలించెన్
దరి ముత్తెపుచిప్ప లగువిధానము పేర్మిన్. 132

చ. మలయనగాంతికంబుల క్షమాపతిపుత్రుఁ డనంతవాహినీ
కలితుఁడుగా మెలంగ గజకర్ణసముచ్చలితానిలాఽవళుల్
కలయఁగ నుర్విఁ బర్వి మధుకాలము గాక వియోగినీజనం
బుల కుపతాప మూనిచె నపూర్వవిధిన్ మలయాద్రిజంబు లై. 133

1. అశ్వసేనలు.

సీ. ఖడ్గధారాంబుసంగతరిపుకీర్తి దు
గ్ధము రాజహంసవిధానఁ గ్రోలెఁ;
గోదండపాండితీకుశలత ద్రావిడీ
ముఖముల వేఁడియూర్పుల వెలార్చెఁ;
బగ సూపి గిరిఝరాప్తతిఁ ద్రాపి స్తన్యవి
భ్రాంతిఁ జోకని భూమి వదలఁ జేసె;
శర బొందుమాలవు ధర నిల్పి కన్యకా
చ్ఛలమునఁ బలుతేండ్లకలుము లొందె;

తే. గీ. దుర్దమారినృపాలురదోర్బలంబు
సూపకయ గెల్చి నమ్రరాజులకుఁ గత్తి
నెత్తకయ సర్వకకుబంతనృపతివర్గ
సన్నుతుఁ డతండు త్రైలోక్యశౌరి యయ్యె. 134

క. వ్యాటీవతీర్ణవిష్ణుఁడు
భూజానిసుతుండు హారముక్తారుచి నా
భీజలజోద్గమవారణ
కై జాబిల్లికాంతిఁ బలుపు ననఁగా నొప్పెన్. 135

క. కవిరంజనమున భోజుం
డవిరతకరిదానదక్షుఁ డగుముంజుండున్
నవతే గుణిహితున కతని
కవిరశతపనీయవృష్టిహస్తాబ్దునకున్. 136

క. అరిలక్ష్మీపరిరంభణ
పరభుజయుగువానిఖడ్గపటుహతు లడఁచున్
స్ఫురదంగదమాణిక్యాం
కురఖరకంటకనిశాతగుణ మనయంబున్. 137



శా. భేదించెన్ శతధా యుదగ్రకులభూభృద్వర్యదండంబులన్
వా దాక్కింతయు లేక తేజమున విశ్వక్షోణి నేకాఽతప
త్రోదారంబుగ నేలులోభమున నయ్యోజస్వి; దేశంబునన్
భూదారాంతరు లాతపత్రవిభవంబుల్ లేక వర్తింపఁగన్. 138

మ. కలనన్ గౌరగజంబులన్ గొనుచు వీఁకన్ గామరూపాధిపా
మలతేజోవిభవంబులన్ దులుచునాశ్మాపాలుప్రాలేయని
ర్మలకీర్తిన్ గడుఁ బాడుచుండిరి సహర్షస్వాంత లై ప్రాగ్గిరిన్
నలినీమిత్రరథాఽరవాఽహృతనిశాంతస్వాపసిద్ధాంగనల్. 139

చ. కలను సముత్సుకుం డగుచుఁ గాంచఁగ నేగెను వజ్రి; కాని జ్యా
యులివున కోడి స్వీయహయ ముండఁగ శ్వేతగజంబు నెక్కి తా
లలితగతిన్ జనన్ వడిఁ బలాయిత మయ్యె గజంబు నింద్రుతో
నల రణదుష్టవారణమదాంబులకున్ వెగ టొందు చంతలోన్. 140

క. ఆరాజుసేన దేవా
గారధ్వజవస్త్రశేషఁగాఁ గూలిచెఁ గాం
చీరాజధాని; నపహృత
చీరపురస్త్రీల కిచ్చుచినుఁగు లనంగా. 141

శా. లంకానాథుతలల్ విదిల్చియు రుషాలౌల్యంబు శాంతింప కీ
వంకన్ గ్రమ్మఱ వచ్చె రాముఁ డని భీభ్రాంతిన్ వశం కొంది రా
లంకావాసులు వైరిరాడ్దశనలీలాయుద్ధగర్జద్ధను
ష్టంకారంబుల రాజు ద్రావిడులదేశం బల్లలాడింపఁగన్. 142

క. ఆరాకొమరుఁ డకైతవ
వీరుఁడు యువరాజు కార్యఽధినై యాశా
వారజయం బొనరించెను
మా రెనయనిశూరుఁ డైనమారునిభంగిన్. 143

క. కేరళవధూజనాలక
వీరుత్సవముగఁ బటీరపృథ్వీధ్రధరి
త్రీరుహములు భూపతిసుతు
వారణములచే సలీలభంజనఁ గనియెన్. 144

చ. అతనికరుల్ వొనర్ప మలయాగము [1]నాగముగాఁ బటీరమా
రుతముల కయ్యె బల్కల వెలుంగుదు నంతఁ బరోక్ష మాపిత్ర
ప్రతతికిఁ బోలెఁ బొ ల్పుబుధరారుహపాళికిఁ గూర్చెఁ బిండమున్
సతతవినిస్సృతార్ద్రసితచందనఫేనమిషాన నద్రియున్. 145

చ. అతనికరుల్ పటీరరసమందు మునింగి సరిత్పతిప్రవే
శితములు గా క్షణంబున నశించెడి వారిధియౌర్వతాప; మా
గతి బడబాగ్నితప్త మగుకంధికి వే శిశిరోపచారసం
గతిఁ బొనగూర్చెఁ జందనసనాథపటీరగిరీంద్రనిమ్నగల్. 146

మ. కన నయ్యెన్ నృపసేన సర్వసుదతీకాంతంబుచేఁ బ్రీతిఁ జం
దనసా[2]రంతురంగమప్రకరజన్మక్షోణి యాత్మాఽశిగా;
జనపాలాంగన లంత నూర్పుసురభిశ్వాసానిలంబుల్ గుహల్
నినిచెన్ జందనవాయుబీజములుగా నిల్పన్ బటీరాద్రియున్ 147

చ. కొనియె నతండు రత్నములఁ గుంజరముల్ పెకలించి దాచుచం
దనతరుసంపదాళికి ఘనం బగువిల్వగ వార్ధినుండిఁ; జం
దనగిరియున్ గరిప్రకరదారితచూర్ణితచందనార్ద్రితా
ర్జునశిలలన్ బలాఽహతుల రూ పతె నస్థలె నిల్పినట్లుగా. 148

సీ. తము ద్రొక్కి దరిఁ జుట్లు దగఁ గూర్కునీర్గారు
గొలుసులఁ బోల్పృదాకువులు వొలియఁ,
దమకాళ్ళఁ దవులుసంద్రపుముత్తెములు రిక్క
పొడి నొప్పువెలియేన్గుపొలుపుఁ గూర్పఁ;

1. వృక్షములు లేనిదిగా. 2. వాయువు (లేడి వాహనముగాఁ గలవాఁడు).



దమకాళ్ల ద్రొక్కి ముక్తాశుక్తు లగలుటల్
త్రాసితవార్ధిహృద్రణనఁ దెలుపఁ;
దమదంతములపైకిఁ దార్చినకదళిపా
ములు సరిత్పత్యంత్రములుగఁ దోఁపఁ

తే. గీ. ద్రావృషేణ్యాబ్దభంజనావనిధరాంధ
తమసనమనీలతమమూర్తు లమరున్నవరు
కొమరుదంతిఘటల్ విక్రమమునఁ గడలిఁ
జొచ్చి యవగాహనక్రీడ ముచ్చటించు. 149

సీ. శ్రీభుజంగునకు నిద్రాభంగ మిడుచమూ
కలకలమునఁ గిన్కవలెను గలఁగె;
ధ్వజినీస్ఖలితదుఃఖవశత మే స్వడఁ బాని
విష మీశ్వరుఁడు మ్రింగువిధికి వగచెఁ;
దురగ మొక్కొకటిగఁ దూఁగి రా [1]మందుర
యని వచ్చుదేవాశ్వ మనుచుఁ దెరలెఁ.
గేరళభూపాలకీలాలసంక్రమి
తాబ్ధి కగస్త్యభయంబు వాపె;

తే. గీ. నిట్లు గలఁగుచుఁ గ్రమ్మఱ నెలమిఁ గనుచుఁ
దుదకు సుదతీమనోజ్ఞనిస్తులరదచ్ఛ
దద్యుతుల మించి తనలోనఁ దనరుపవడ
ములు నృపతి కింపు గాఁగ నుప్పొంగె నుదధి. 150

సీ. ఎవనిచే సభయంబు నెనసి సింహాలుఁ దగ
స్త్యాఽశ్రమంబున నెల వందఁ గనియె;
నెవనివి ల్గాంగకుండవధూముఖేందుల
గళితకుండలమండలులుగఁ జేసె;

1. అశ్వశాల. 2. నెత్తురు.

నెవనియశఃకూర్చి దవిలి దిగ్భిత్తుల
ద్రవిడీకపోలపేలవత నెఱపె;
నేఁజయశీలుచే [1]నెత్తుకొమ్ములు దుల్లి
పగరప్రోల్తల దుల్లుపగిది నొప్పె;

తే. గీ. నతఁడుపొగడొందు వైరిధరాధినాథ
మకుటమణిగణసేవితామలపదాబ్జుఁ
డఖిలకకుబంతసంవ్యాప్తయశుఁడు ఘనుఁడు
విక్రమాదిత్యుఁ డరిలుంఠనక్రముండు. 151

సీ. అతనిప్రతాపంబు క్షితిపసతీతతి
కన్నీటఁ దడియుకోకలను దెలిపె;
నతనిభుజంబు చోళాంతఃపురీరక్ష
వాలదండయుతసింహాళి కొసఁగె;
నతనివలనఁ బలాయితుఁ డయి ద్రవిడుండు
[2]ధరదరి దుర్బలతనువు డాఁచె;
నతనిభీతినిఁ బారినట్టిచోళస్త్రీల
నొసటఁ గప్పుర మిష్టునుం బొసంగు;

తే. గీ. అతఁ డొనర్చె నిజప్రతాపాతిశయిత
రక్తుఁ డయి వేంగిభూపాలరాజముఖుల
స్మరప్రతాపంబునకు నవాస్పదలు గాఁగఁ
రేజు మించినవిక్రమాదిత్యశౌరి. 152

చ. ద్రవిడధరిత్రీనర్ఘ్యనసముదాయము గూలఁగఁ 'గాంచి' వానిబా
హువులఁ బ్రకంప మొంది యను వొందెను దోరణసూత్రశేష యై
యవలను జక్రకోటపతియంతిపురంబులఁ జిత్రశాలలన్
దవిలినదంతులే నృపవతంసునిచే విడు పొందెఁ బోరునన్. 153

1. ఉన్నతశృంగములు. 2. పర్వతగుహ



క. సకలదిశాజయయాత్రా
ప్రకటితవీర్యుండు మఱలి స్వపురాధ్వమునం
దాకచోట నిలువ నాక
స్మికముగ మతి నరతి నతనిఁ జెంద నతండున్. 154

సీ. తన దగువామనేత్రము స్ఫురింపఁగ శంకఁ
దూఱచుఁ 'దాతపాదుల కలరుత
శుభ' మని సాశ్రుఁ డై శూన్యచేతస్కుఁ డై
పల్కుచుఁ జింతించె; వనట నెందు
రాసుతునకుఁ గాన రానియొక్కనిచేత
శ్రుతిఁ బడె నొక్కయశుభపువార్త;
యంతరాత్మలకు శుభాశుభవస్తువుల్
ప్రతిబింబరీతిఁ బూర్వమునఁ దోఁచు;

తే. గీ. సకలశాస్త్రప్రవీణతాసారధీర
మాన్వితుం డయ్యు భూమిపాలాత్మజుండు
గనె నధీరత నంత నకారణముగ;
మనుజసామాన్యత యొకప్డు మలయు బుధుల. 155

క. ఆదుర్నిమిత్తశాంతికి
నై దానము లీఁ దలంచి యప్పుడు నిలిచెన్
భూదారకుమారుఁడు నై
న్యోదారుం డగుచుఁ గృష్ణయొడ్డునఁ గలఁకన్. 156

ఉ. అంత నతండు గాంచెఁ దనకై చనుదెంచెడువాని, మోమునన్
వంత దొలంకువానిఁ, దనపట్టణమందుననుండి పంపఁగాఁ
జెంతకుఁ జేరువానిఁ, గడుఁ జెడ్డను దెల్పఁ బరాఙ్ముఖత్వమున్
వింతఁగఁ దాల్చునాలుకను బె ల్లగునూర్పుల నాఁపువానినిన్. 157

చ. వెతలెడునూర్పువాయువులు వెల్వఁగఁ బైపయిఁ బుట్టు చుండఁగాఁ
గడునశుభంపుమాట పలుకన్ దనచెంగట నున్నవాని, బల్
తడఁబడుపల్కులన్ నృపవరతల్లజువార్తను దిక్ప్రయంబు త
న్నడుగునొ యంచుఁ బొక్కి కడునార్తుఁడుగాఁ గనుపట్టువానినిన్.

చ. కడునశుభంబుఁ దెచ్చుఘనకల్మషదూషితుఁ డైనవానిఁగా
నెడఁద గణించి యెల్లజను లెంతయు నింద యొనర్పఁ గల్గినన్
బెదక ధృతిన్ సమీపమునఁ జేతులు మోడిచి మ్రొక్కువానిఁ దా
నడిగె నృపాలనందనుఁడు హాయి గదా యని తంద్రితట్టునన్. 159

క. ఈవిధి వసుధాఽధిపసుతుఁ
డావచ్చినముఖ్యదూత నడుగ నతండున్
గ్రేవల నాసీనుం డై
వావిరి నాసాఽగ్రగలితబాష్పతఁ బలికెన్. 160

క. ఈదుర్వార్తాప్రళయాం
భోదము వ్యాపించు మిగుల భూమీశసుతా!
ధీరత విడనాడకుమా!
చేరుచుమా! ద్రఢిమఁ గరముఁ జిత్తమునందున్. 161

క. ఆపాండుపాండ్యముగ నీ
వాపై నాలోలచోళ మాసింహళమున్
రూపించిననీవిజయము
భూపాలకుమార! వినుచు భూరమణుండున్. 162

క. కనియె సుఖమయస్థితి నం
తన విధి యసమయమునందు ధరణీపతికిఁ గూ
ర్చెను దాహజ్వరముఁ గడున్;
గనిరే నిష్కంపసుఖవికాసము లెవరేన్ ? 163



క. చందనపుఁబూతఁ దాపము
డిందక నరపాలకుఁడు గడిందిగ నిను మే
నం దవిలించుక నీమే
నందలిసుధశైత్య మతిగ నాకాంక్షించెన్. 164

చ. క్రమముగఁ జూపులన్ సగము గాఁగ నిమీలన మేర్పరించెఁ దా
నమరవరేణ్యుదూతలను హస్తినిమీలికఁ బంపఁ గోరి; లోఁ
గమియఁ జ్వరప్రదాహమును గాంచి వినిర్గతి నొందుతద్యశో
రమణిని దంతచంద్రిక విరాజిలఁ జేయుచుఁ బల్కె మంత్రికిన్. 165

సీ. నృపవరేణ్యమకుటమాణిక్యపట్టికల నా
జ్ఞాలిపిమాలిక నాటినాఁడ;
శరచయచ్ఛిద్రితాఽశాభిత్తులను గీర్తి
రాయంచగూండ్ల నేర్పఱచినాఁడ;
సిరులముడుల్ విప్పి ధరణిదారిద్ర్యంబు
లేకుండ సంపదల్ నెఱపినాఁడ;
సాధుసల్లోకావసథసీమలను శ్రీకిఁ
గులవధూసామ్యముఁ గూర్చినాఁడఁ;

గీ. జాపపాండిత్యభవరమాసంయుతుండు
విక్రమాంకుండు కాకుత్స్థవీరబలుఁడు
దిక్సమాక్రాంతశౌర్యదేదీప్యమానుఁ
డయినసూనునిఁ గాంచి పెం పందినాఁడ. 166

చ. అతఁడె యశస్వి యీయువధరాఽధిపతిత్వమునన్ నిజాగ్రజున్
స్థితు నొనరించి యాతనినె చేసె మహీభరధుర్యుఁ గాఁగ; సం
తతముద మయ్యె శర్వపరతంత్రశిరోమణి యైననాకుఁ బ
ర్వతతనయాసనాథునగరంబుఁ జనంగ సముత్సహించెదన్. 167

క. నను నెఱిఁగికొందురు హతా
వనిపతు లున్మదకవాటపాలకగళహ
స్తనివారితసేవకు లై
కనఁ జాలనివానిఁ గాఁగ ఘనవిధికై నన్. 168

చ. తనరెఁ జళుక్యభూరమణతల్లజశుద్ధకులంబునందు నా
జననము కొద్దిగొప్పలుగ శాస్త్రరహస్యసదర్థసంగ్రహం
బెనసె శ్రవోఽనుసంగతి మదేభచలచ్ఛ్రవణాంతచంచలం
బనిహతజీవితంబుఁ గన నయ్యె శివున్ విడి నమ్మ నన్యమున్. 169

మ. శివసేవన్ భువనోపకారమునకై చెందంగ నౌ మేను; దా
ని విడంగాఁ దగుఁ దత్పరత్వమున; శాంతిన్ దుంగభద్రానదీ
[1]భువనంబందున మే న్విడన్ దలఁచితిన్ భూతేశచింతానితాం
తవశాంతఃకరణుండ నై యిటుపయిన్ దత్పాదసంప్రాప్తికై. 170

క. అవనీపతిపల్కుల కపు
డవధానముతోడ మంత్రు లంగీకృతిమై
నవు నని పల్కిరి; యుచితం
బవుచేఁతకు నెవరిమనసు లందవు ముదమున్? 171

చ. తదనుగ మేదినీపతి ముదంబునఁ గొన్నిప్రయాణముల్ తన
ర్చి దరిసి కాంచె వీచికలచేతులచేఁ దను నింద్రునింటిలో
విదురుచరీతిదానిఁ, దొలివేలుపుతే ర్విడునంచలట్లు నిం
గిదెసకుఁ దూఁగుఫేనమున నిండినపింఛము లూనుదానినిన్. 172

చ. కడుదవుఁ బైకి దూఁకి తిరుగం బడు చుండుపయఃకణంబులన్
గడఁగి తనున్ గనుంగొనుచు గౌరవ మీ నెదురంగ లేచి వ
చ్చెడుగ్రహభంగిఁ దాల్చి విలసించెడుదాని, శుభంబు లెచ్చుప్రొ
క్కిడియెడువార లొంది భజియించెడుదాని సుప్రవాహినిన్. 173

1. సిడ.



చ. జనకలుషాపహారిణిగ సంస్తుతి కెక్కినభస్తరంగిణీ
దనమహిమాప్తిఁ బోలి జనతానుతయామ్యదిగభ్రనిమ్నగా
ఖ్య నలరుతుంగభద్ర దిగి యందు మహీదయితుండు శానమున్
బొనరిచి యద్రిజారమణపూతపదాంబుజచింతనారతిన్. 174

క. ఎడతెగ కొసఁగెఁ బసిండుల
నెడఁద నభిన్నత్వ మమరఁ బృథ్వీపతి; పె
ల్లిదుమల నైనను బెడమొగ
మిడరుగదా! త్యాగనియతి కెందు మహాత్ముల్. 175

క. గళదఘ్నంబుగఁ దటినీ
జలప్రవేశం బొనర్చి క్ష్మాపతి కల్లో
లలలత్తూర్యరవంబులు
సెలఁగన్ శశిమకుటుపురముఁ జెందెఁ గుమారా! 176

క. అని దూత వలికి నిలువ న
వనివరతనయుండు కనుల బాష్పము లురలన్.
దనపార్శ్వస్థితు లసిపు
త్రినిఁ దొలఁగింపంగ గద్గదితగళరవుఁ డై. 177

క. స్వయమార్ద్రభావుఁ డయి తం
డ్రియెడన్ గడుస్నేహ మలవరించునతం డ
మ్మెయి నొడలు పుడమిపైఁ బడ
దయ గదురఁగఁ బొరలి కెరలి తడఁబడి యేడ్చెన్, 178

సీ. నిత్యదురాచారనియము యమున్ దండ్రి
గాంచుఁగా! రవిఁ గులకంటకునిఁగ;
నేఁడును వెత గాంచ నేరనిదినములఁ
దన్ను దుష్టునిగాఁగఁ దలఁచికొనియెఁ;

గాలకలాతతుల్ గ్రాలె నీగతి నంచుఁ
దీలనిబాష్పదుర్దినత వగచె;
రాసుతుం డిట్లు ధరాభారధుర్యుఁ డౌ
జనపతి యిలఁ బాసి చనినకతన

తే. గీ. నాదికూర్మ మ! నీకు సౌఖ్యంబు దొలఁగె;
శేష! రాయిడిఁ గను మస్థిశేషుఁడ వయి;
స్వైరకేళీవిహారముల్ చాలఁ సేసి
యెల్ల రిలఁ బూనుఁ డీరు దిగిభములార! 179

మ. కనకస్తంభవిలాసముల్ [1]దొఱఁకుభూకాంత[2]ప్రవేష్టంబు న
య్యనిమేషేనుభరంబుఁ బూనుటకుఁగా హా! బ్రహ్మ మాయించె; నో
జననాథాగ్రణులార! మీపురములన్ స్థైర్యంబుతో నుండుఁ 'డిం
క నెవం డింతటివాఁడు వీరుఁ దగు నెక్కన్ గద్దె' నం చెంచుచున్ 180

సీ. పృథ్వీశదోర్దండవిశ్లేష మొనరింపఁ
బాడియే నీకు నోపౌరుషంబ!
పరిరక్షకుఁడు లేమి వైధుర్యమున నీవు
దపియింపఁ దగును బ్రతాపమ! కడుఁ;
బతి వీడుసంతాప మితరత్ర దుస్సహం
బబ్జాటకరాటలయ వగుము పద్మ!
శేషశిరశ్చ్యుతి క్షితికి లె స్సగుఁ; గాని
మంటిగద్దకుఁ జెల్మి యుంట యెట్లు?

తే. గీ. మునుపు లేనట్టిదుర్మేధ నెనయువేధ
వేఱొకఁడు పుట్టె నంచు భావింతుఁ; గాక
యున్నఁ బూర్వప్రయత్ననిష్పన్నకార్య
నాశ మొనరింప యత్న మొనర్చు నెట్లు? 181

1. అతిశయించు. 2. బాహువు.



సీ. ఆశౌర్య మాధైర్య మాగభీరత్వంబు,
గలుగునే యీగుణకాండ మొకట;
నరిశరంబులు ముక్క లౌవజ్రకాయనం
పదలు నాదౌసఁగునఁ బాడువడియె;
విధి యెట్లు సేయుఁ దద్విధసర్గరత్నంబు?
నట్టిసూక్ష్మాంశంబు లలరు టెట్టు?
లెదురుగా నుబుకువాహినులు పె క్కండ నే
రనియద్ధిగా సత్వరాశి యగుచు

తే. గీ. దుర్గమత నొప్పునృపుఁ డిట్లు నిర్గమించె;
భవ్యుఁడును సౌకుమార్యైకభాజనుఁడును
దొలఁగి పోవ విషాదనిస్తులశతాగ్ని
యిద్ది నేఁ దప్పఁ బరుఁడు సహించు నెవఁడు? 182

క. ఈవిధమున మఱి వేర్గతి
భూవిభుతనయుండు మిగులఁ బొగులుచు నంతన్
బోవఁ దొడంగెను దెరువున
భావగతవివేకభావపరిదీపితుఁ డై. 183

క. కదచినతంద్రికి విధివిధ
మదరఁ బితృక్రియలఁ దీర్చి యగ్రజుఁ గనఁగా
నెద నుత్కంఠత పురికొ
ల్పుడు నతఁ డాపైనఁ గదలెఁ బ్రోలితెరువునన్. 184

క. కొలఁదిదినములనె దారినిఁ
దలకడచి నృపాలసుతుఁడు ధ్వని యడరనియ
ట్లలవరచి సేనఁ దాఁ ద
ద్బలయుతుఁ డై కలఁగి చొచ్చెఁ దననగరంబున్. 185

ఉ. హంసను బాయునబ్జిని నయంబును బాయున్నృపత్వమున్ బుధో
త్తంసునిఁ బాయుగోష్ఠి సితధామునిఁ బాయుత్రియామ దానపుం
శంసను బాయులక్ష్మి సరసం బగుకైతను బాయువాగ్మితా
శంసయుఁ బోలె తేఁ డెడయ సౌరతె నన్నగరంబు దుష్టమై. 186

తే. గీ. ఎదురుగా వచ్చి యగ్రజుఁ డెయిదికొనఁగ
నతనితోఁ జొచ్చె ఖిన్నుఁ డై క్షితిపతిగృహ;
మిరువురికవుంగిటను బి డిచి యిడినయట్లు
బాష్పధారలు తెగ కుండ వరదపాతె. 187

చ. దినములు గొన్ని యీనియతిఁ దీఱెను వారి కొకళ్ళొకళ్ళపైఁ
బెనఁగిననిక్కపుంబెలిమిఁ బెం పగుదుఃఖము వీడు చుండఁగా;
గొనముల గొప్ప యయ్యు జనకుండుగ నగ్రజు గౌరవించె; నా
ప్పనియటు లెప్పు డైన గుణవంతులవృత్తులు మాఱఁ బోవునే. 188

తే. గీ. దిగ్వితానంబుఁ గలఁచి తాఁ దెచ్చినట్టి
వస్తుసంతతి నర్పించె వరవినీతి
నగ్రజాతున; కల కీర్తి నలరువారు
లోభ మెనయరుగా తమలోన నెపుడు. 189

తే. గీ. అన్న సోమేశ్వరుం డటుఁ గొన్నినాళ్ళు
ననఁగఁ దమ్మునెడం బాపమును దలంచె;
నిలను భవితవ్యతాదేవి నెవఁడు దాఁటఁ
గలుగు ననుభవకారణములు దొలంగి. 190

క. మదకారణ మాయెనుగద!
మదిరగతిన్ రాజ్యలక్ష్మి మై మెలఁగుయశం
పుదుకూల మశేషంబుగఁ
జెదరినఁ దా నెఱుఁగఁ జనఁడ జ్యేష్ఠుం డపుడున్. 191



ఆ. తె. బధిరుఁ డైనయట్లు భవ్యతూర్యనినాద
ముల మహాత్ము లొసఁగుబోధ లెల్ల
నంత యైన వినఁగ సోమేశ్వరుఁడు మదిఁ
దలఁపఁ డయ్యె దుష్టదైవవశత. 192

క. ప్రకటితమదజ్వరుం డయి
సకలాంగములందు వడఁకు సారించుచు భూ
మికమనుఁడు [1]రాజయక్ష్మ
ప్రకారము సిరికి క్షయంబుఁ బాటిలఁ జేసెన్. 193

తే. గీ. [2]కుంతలోల్లాసములు కరకున్ జనంగ
ధరణి వైరాగ్య మెంతయుఁ దల ధరించి
యతఁడు ధవుఁడుగ ననువుల నలరు చుండఁ-
గానె తా నంత విధవగాఁ గనఁగ నయ్యె. 194

క. ఆరా జారోహించిన
వారణములు తమదుపృష్ఠభాగము చెడె నాన్
గూరిచె [3]నభ్యుక్షణమును
నారయఁ గరశీకరముల నాసక్తిమెయిన్. 195

తే. గీ. రౌతులసమేతముగ దివ్యరీతిఁ గాంచు
గతి రచించుచు మండలాఒకృతి భ్రమించుఁ,
దమయయోగ్యత సాధించుతమక మెనఁగ
నతనిపృతనాతురంగమవితతి నిరతి. 196

ఉ. ఆతఁడు [4]జాతుషంబుగ నరాధిపసంపద నెంచి జారు నన్
భీతిని క్షాత్రతేజమును వీడె న టంచు మదిన్ గణించెదన్;
భూతముఁ బోలి లక్ష్మి స్వయమున్ దను ముద్దిడుచున్ జవిన్ గనన్
జేతమునన్ దలంచును విశిష్టజనక్షతజంబుఁ దీల్చఁగన్. 197

---

1. క్షయరోగము. 2. 'విక్రమాంకుఁడు – కేశములు. అని శ్లేష.
3. శుద్ధికై పిడికిలితో నీరు ప్రోక్షించుట. 4. లక్కసంబంధమైనది.

ఉ. చాలఁగ రేఁగు చుండుఘనచామరదుర్దమమారుతాఽశ్రయాఽ
ళీలరజఃప్రపూర్తి నరవిన్ దెరువున్ గనఁ జాలఁ డయ్యె; ది
గ్జాలసమాక్రమద్ద్యుతివిశాలమణీగణుఁ డయ్యెఁ దాఁ దమో
జాలతిరోహితుం డగుచు సౌరతదైవహతుం డతం డటుల్. 198

సీ. పైయడ్డుచే నెల్లవారు లొంగుట నెంచె
నన నధోగతి మంచి దంచునెంచె;
నఖిలచ్ఛలాన్వేషణాఽసక్త మగుపిశా
చముగ నెఱుఁగఁడు కార్యము ముదమున;
రాజులోభముచే విరక్తిని జన మొందె
మహిపులయీవియే మచ్చుమందు;
నృపుఁడు కుమారునం దెంచె నక్రమభంగి
సిరిమరుల్ గలఖలుల్ సేయ రెద్ది ?

తే. గీ. వారణేంద్రంబు నెక్కి దర్పం బెలర్ప
నంకుశ మనర్గళత నతం డంతఁ ద్రిప్పు
నపయశోబీజములు నాట నాత్మఁ దలఁచి
యంబరస్థలిఁ ద్రవ్వువిధంబు దోఁప. 199

క. పలుపలుకు లేల పలుకఁగ
నెలచెలిమిన్ దగుచళుక్యనృపగోత్రమునం
దలవరిచినటు కళంకత
నలిపెన్ రాజ్యంబు నతఁడు సౌరఖునటులన్. 200

తే. గీ. అగ్రజుదురాగ్రహంబు వోనడఁచ జాలఁ
డయ్యెఁ దమ్ముండు; ధర నెద్ది యౌషధంబు ?
మంత్ర మెయ్యది గలదు ? సామ్రాజ్య మనెడి
[1]గాముబామున గో మఱుఖలనరులకు. 201

1. గ్రహము



తే. గీ. ఈవిపర్యస్తబుద్ధిచే నేమికార్య ?
మనుచుఁ దలపోసి కడు నిశ్చయాఽత్ముఁ డయ్యె;
వానియపకీర్తితోఁ బాలు వంచుకొనుట
కర్హత గడించు టొక్కటే యగును నాకు. 202

ఉ. కానిపథంబునన్ దిరుగఁగా నమకట్టెడుపెద్దవాని దూ
రానఁ ద్యజించుచున్ మనుట రమ్యము; మీఁదట దక్షిణాంబుధి
న్గానఁగఁ బోయెదన్; మునుపు నాకు నడంగిరి గాన బల్రిపుల్
వీనివిపర్యయంబులను విన్నను జాలరు బాధపెట్టఁగా. 203

చ. ఇటులఁ జళుక్యరాజసుతుఁ డెంచి శ్రవఃపుటభేదనక్రియా
పటుతరభేరికానికరభాంకృతు లార వినిర్గమించెఁ దాఁ
జటులరుషారతుం డయినసాహసలాంఛనుఁ డాశుగంబులన్
గుటిలనృపేభసంతతులఁ గూడనధైర్యము వమ్ముఁ జేయుచున్. 204

ఉ. ఆమని వీడుకాన విశిఖాఽసనమున్ విడుమౌర్వి ముత్తెముల్
నోమినశుక్తి మాధురి గనుంగొన రానికవిత్వరీతి యై
గోము దొఱంగె రాజ్యరమ గొబ్బున నాతఁ డొకంత వీడఁగా;
నేమనుజుండు దాఁ గడఁగు నిద్ధమహాఽఽత్ములశక్తిఁ జెప్పఁగన్.

క. ఇతఁడు కడున్ దుష్టాఽత్ముఁడు
క్షితికంటకశోధనుఁ డయి చెడుగుఁ దలంచున్
మతిఁ గని సోమశ్వరుచే
వెత శంకించి యనుజన్మ వెంటఁ గొని చనెన్. 206

మాలినీవృత్తము

సురవినుతపదాబ్జా ! సూరిసంగీతనామా !
గిరిబిలవినివేశా ! కేవలాద్వైతరూపా !
కరి-రిపుసుతపాలా ! క్ష్మాసుతాచిత్తలోలా !
విరచితబహురూపా ! వేంకటేశా ! నృసింహా ! 236

ఇది శ్రీత్రిభువనమల్లదేవవిద్యాపతి-కాశ్మీరక-
భట్టబిల్హణ మహాకవివిరచితవిక్రమాంకదేవచరిత
మహాకావ్యంబునకు శ్రీవేంకటేశ్వర
శ్రీనరసింహదేవపాదపద్మారాధన
సమాసాదితకవితావైశారద్యులు
'ఆంధ్రబిల్హణ'బిరుదాంచితులు
నగులక్ష్మణ-విశ్వనాథ
కవిసోదరాంధ్రీకృత
మహాప్రబంధంబునందుఁ
ద్వితీయాశ్వాసము
సమాప్తము

# విక్రమాంకదేవ చరితము

## తృతీయాశ్వాసము

క. శ్రీరమణ! వేంకటేశా!
వీరనృసింహేశ! వేదవేద్య! సురేశా!
సూరివినుతపదపద్మా!
భూరిగుణా! దేవదేవ! బుధజనవంద్యా! 1

క. అంతటఁ దూర్యరవంబుల
శాంతి వఱఁగ శింజితములు చా టయినటు భూ
కాంతుని విమలస్వాంతుని
వింతగ వెన్నంటినటుల వెలసె సిరి వడిన్. 2

వ. అంత సోమేశ్వరుఁడు.

ఆ. వె. శంకఁ గననియట్టియంకవర్తిని వీనిఁ
ద్రుంప నాఁపినాఁడ దుష్టబుద్ధి
ననుచుఁ బడకఁ బొరలి యదరినచందన
ములను గలిగి రేలఁ బొగిలె నతఁడు. 3

క. పటుతరసాధ్వసకర్దమ
పటలనిమగ్నావనీశభావ మల సము
త్కటచటులభరోద్ధరణో
ద్భటకరటిఘటోద్ధృతిప్రభావముఁ దెగడెన్. 4

క. మతిఁ గలఁగియు నంత నతం
డతిఘనబల మనిపె ననుజు నలమికొనంగన్;
క్షితి బద్ధాత్మలత్వగ్రు
కర్తకి ససాత్త్వికకృతుల్ ప్రకాశిల కున్నే? 5

శా. ఊహాఽతీతభుజప్రతాపవిభవోద్యోగుండు తమ్ముండు దు
[1]ర్గ్రాహాఽబద్ధనిజాగ్రజాతువలనన్ గ్రౌర్యంబు శంకించియున్,
సాహంకారతఁ దన్ను [2]వెన్నడుధ్వజి న్యాశిన్ విమర్దింపఁ బోఁ
డాహా! కష్టములందునేన్ బటులబాహాశాలి భేదిల్లనే! 6

ఉ. క్రూరముగా వధింపఁ బని గొన్నబలంబును దంతిపాదదు
ర్వారవిఘట్టనన్ నుఱిమి వైరినృపాంతకుఁ డొక్కముద్దగాఁ
గూరిచెఁ గాలవక్త్రమునఁ గోల్తల పెక్కు వచింప నేల వి
స్ఫారయశుం డతండు మహిపాలునియంగ మొకండె నిల్వఁగన్. 7

క. కమలావిలాసవసుధగ
నమరినతనబాహుపంజరాంతరమున రా
జమరాళివలెన్ గీరితి
రమియింపం జేసి హరికరణి రాజిల్లెన్. 8

క. తనయగ్రజుదుష్పథచిం
తనమున దుట్పంకకలుషితమనస్కుం డై
కనియెఁ బ్రసన్నతఁ దోడనె
[3]వనప్రసన్న యగుతుంగభద్రానదిచేన్. 9

తే. గీ. అతనిదంతీంద్రచయవిగాహములఁ జేసి
యత్తరంగిణి పతి నబ్ధి నంద దయ్యెఁ;
గాని దంతిమదాఽపగల్ గలిసెఁ బ్రేమ
నిమ్నగానాథునకుఁ గడు నెమ్మిఁ గూర్చి. 10

1. జ్ఞానము. 2. 'వెన్నాడు' శబ్దమునకిది రూపాంతరముగా స్వతంత్ర ప్రయోగము. ఇచట 'వెన్నడుదు సేనాశిన్' అని కూడ వ్రాయవచ్చును. కాని ఒక విచిత్రప్రయోగమును స్వతంత్రించి వాడినాము. 'వెన్నడు' అను నది వ్యవహారములో నున్నది. 3. నీరు.



చ. ప్రతిగజమున్ గనుంగొనుచు వారణ మొక్కఁడు తద్విమర్దనో
ద్ధతి విశదాఽపగాంబువుల నానదు; కోపుల కిట్టిశిల మౌ;
వెతఁ-గని షట్పదధ్వనిఁ [1]గృపీటముఁ గ్రోలక వాని ముంచి బా
ధితములఁ జేయు వేఱుకరి; ధిక్కృతముల్ గద! యర్థిమ్రోగుటల్. 11

తే. గీ. ప్రతిగజంబును విడిచె నిభం బొకండు
పార్శ్వగత మౌకరేణులోభమునఁ జేసి;
బాహువిక్రమచండిమ పఱఁగుచోట
నప్రతిహతుండు కంతుఁ డత్యద్భుతముగ. 12

క. కరు లాఁపంగా మార్గము
హరులు చిరము మునిఁగి యుండె నాపగవారిన్;
మఱి తటతరుకంటకముల
[2]మరగినమయములు గనంగ మానెను దటినిన్. 13

క. ద్విరదమదవారికలుషిత
సరిత్పతియు సతతమదవిసార్యభ్రకరిన్
స్మరియించె నహహ! [3]యభ్రము
వరునందలిమక్కు వెంతొ వారాంనిధికిన్. 14

క. స్నానాఽసక్తపరిజన
నానాసుందరులమధ్యమున్ జొచ్చియుఁ దా
దానోదగ్రేభము ని
ల్పానక చనె సుపరిసరునియురుపుణ్యముచేన్. 15

తే. గీ. అన్నదీనీరములఁ గొన్నియహము లుండి
వనిత లూనినకుంకుమువలన [4]ఘుసృణ
పంకిలముఁ జేసి జలము; నాపైన సమర
దర్పభుజుఁ డయి చోళుని దరిసెఁ గినిసి. 16

1. జలము. 2. అలవాటుపడిన ఒంటెలు. 3. ఐరావతము. 4. కుంకుమపువ్వు.

సీ. [1]క్రీడోపవనపక్షికృతరుతపిహితాఽత్మ
గళరవలై బయల్ గొలువఁ దగరు;
మేచకక్రముకాఽళిమాలికార్కజ్వాల
లగునెడలన్ బగ యడర నిలుచుఁ;
బవనోత్థకేతకపాళిధూళిశ్వేత
సీమల భస్మంపుస్థితినిఁ గాంచు;
నారికేళఫలసంఘట్టన గళదంబు
భంగాఽర్ద్ర మై స్మరబాణము లగు;

గీ. నెలఁత లెచ్చటఁ దమతమనేర్పుకలిమి,
దర్పకుం డెట దాహకదర్పయుక్తిఁ,
నెచటఁ గాంతలఁ గనుమడునెడ హరాగ్ని.
గాఢ లెచ్చటఁ బక్వరంభాఽళిఁ గవిసి. 17

చ. సవిధతథావిధోపవని సాక్షిగఁ జానలఁ జిత్రవిభ్రమ
ప్రవణతఁ దేలుచున్ గొలఁదివాసరముల్ నృపరాఽత్మజుం డటన్
దవిలి వసించి తాఁ దరలె దర్శితపూర్వపరాక్రమస్మృతుల్
[2]త్వరఁగ సైన్యతూర్యరుతిఁ దిన్నగ నమ్మలయేశుచెంతకున్. 18

క. ఇతనిం గని, జయకేశి
క్షితిపతికోరికకు మించుసిరు లొసఁగుచు స
న్మతిఁ గొంకణాంగనాముఖ
సితరుగ్వాసితప్రశస్తి స్థిరముగ నిలిపెన్. 19

ఆ. వే. త్యక్తచాపలుఁ దగు 'నాలుప' నృపు నవ
దాతవిక్రముం డితండు మనిచె;
నవినయాగ్రదూతి యప్రణతియె యట్టి
ఘనులమదులకినుక పెనుచుఁ గాని. 20

1. ఈ పద్యమునందలియెత్తుగీతమునాల్గుపాదములకు మొదటినాల్గుపాదములతోఁ గ్రమాన్వయము. 2. త్వరపడఁగ.



క. కేరళనారీగండా
గారముల శిలీముఖములు గడు వ్యాపించన్
జేరినయశ్రులు మును దాఁ
గూరిచినవిగానె సతులకుం జూపించెన్. 21

క. లోలాబ్ధినీలకుండల
చాలన్ గంపించె ద్రవిడసర్వంసహ యా
భీలత్వరఁ దనుఁ జేరున్నృ
పాలతనూభవునిఁ గాంచి ప్రబలుభయమునన్. 22

క. గొనయ మెనసినయతనివిలు
చెనకఁ దగని మగతనమునఁ జెన్నగునృపసూ
నునికొలువుఁ జేరె ద్రవిడా
వనివరునరుఁ డొకఁడు నీతిపథరతుఁ డంతన్. 23

క. ఇలఁ దల సోఁక నతఁడు కుం
తలపతితనయునకు మ్రొక్కి, దశనకిరణకో
మలకిసలన్యాసవచో
విలసనమున ద్రవిడదూత ప్రియముగఁ బలికెన్. 24

క. చాళుక్యేలావరవం
శాలంకారా! భవద్గుణాఽళి గణింపన్
జాలు నెవం? డెవని కగున్
జాలినచే దర్యమాంశుసంతతిఁ గూర్పన్? 25

క. నీకరవాలాంబువిమల
తాఽకృతి వర్ణింపఁ జాల; నది గనుకీర్తుల్
లోకైకశుక్తిపుటము
క్తాఽకలితము లగుచుఁ జంద్రికాఽకృతిఁ దాల్చున్. 26

క. అరిచికురంబులు నాఁచుగ
నరవే! యసివారియందు నుండఁగ నీచే
నిరవుఁ గనురాజహంసో
త్కరనిభయశ మచటఁ గడుఁ బ్రకాశింపంగన్. 27

సీ. త్వద్భుజంబునయందుఁ బ్రణయంబుఁ గనువింటి
నినద మాజుల నేరు విన సహింతు?
రంతఃపుర స్త్రీలయాక్రందనంబుల
వ్యక్త మౌ నది శత్రుభవనములను;
ద్వన్మౌర్వికానినాదముల దిక్కరు లైన
నిర్మదత్వమును బొందినకతమునఁ
గశ్మలాకులచేతఁ గదఁ గాంచినట్టుల
దిశలు ప్రసన్నతఁ దేజరిల్లు;

తే. గీ. నిన్ను బోల్జిగీషువువినా నేర్పు నెవఁడు?
క్షత్రకులజుం డిల నసాధ్యసాధనమునఁ
బ్రళయకాలంబు లేకుండ జలధి గూడ
శక్త మగు నెట్లు ముంచంగ జగము లెల్ల? 28

చ. అతులగుణాంఢ వీవు సిరి నర్పణ సేసితి వన్నకున్ దృణ
స్థితిఁ గని; వజ్రలేపమును జెందినరీతిని నీదుకీర్తి సు
స్థితి క్షితిఁ గాంచె; నీకు నిలఁ జేసెడి దే మగు దీన? సర్వభూ
పతివి; మృగేశతల్ హరికి వర్తిలవే యెట వాన మూనినన్. 29

తే. గీ. ఏభువి వసింతు వీవు మహాభటుండ!
పుణ్యఫలపాత్రతను గాంచుఁ బుడమి యద్ది;
కుటిలధారజిరమణసంకటముఁ దొలఁగి
నిన్నె సుగుణోజ్జ్వలుని వరునిగ గ్రహించు. 30



క. గళితత్రపు లై కందర
ములఁ ద్వద్భీతిన్ వసించుభూమిపతులనేన్
[1]గళితలమున నీచాపము
తలఁకించు గుహాంతరవోదితప్రతిరుతులన్. 31

తే. గీ. ఉత్ప్రతాపానలాస్యంబు నూని కలనఁ
ద్వత్కృపాణైంద్రజాలికతల్లజుండు
కృత్తమర్త్యోత్తమాంగు లౌరిపుల నెల్లఁ
దనరఁ జేయును దివ్యమస్తములపొందు. 32

తే. గీ. భారతాదులలో నేని భాగ్యభూమి
యయిననిను బోల్ప్రతాపి పేరయిన వినమ;
దర్శనంబున జయలక్ష్మిఁ దనరఁ జేతు
వన్యసంగమవిముఖిగా జన్యములను. 33

క. సూదంటురాలగమికిన్
భూదయితులమకుటరత్నములు తుల్యము లే
మో; దవుదవ్వులఁ బొదలెడు
నీదగుఖడ్గంబుఁ జేర్పు నికటస్థితికిన్. 34

తే. గీ. నీసముజ్జ్వలగుణముల [2]నెఱిఁ బ్రియమునఁ
గని మనవి సేయఁడే చోళజనవరుండు;
తృణసమంబుగ సిరిని నీ వెంచఁ గాంచి
శ్రీప్రదానము నుడువ లజ్జించె నతఁడు. 35

క. [3]శరధరగర్జితములవలె
పరపౌరుషములను వినియు బయలుపడద భూ
వరమతిరాజమరాళిక
నరవరు[4] మానసమునుండి నైజం బిది యౌ. 36

1. యుద్ధము. 2. పూర్తి. 3. మేఘము. 4. ఇది శ్లిష్టపదము.

చ. స్వకులకలాప మై సుగుణసంపద ముజ్జగమందు మించుచున్
సకలవిలాసినీనికరసన్నుతరూపవిలాస మొందుక
న్యకను ద్వదీయహస్తమునయం దిడి తా సకలావనీజన
ప్రకరనుతుల్ గనంగ నరపాలుఁడు వాంఛ యొనర్చు నెమ్మదిన్. 37

ఉ. ఆతనిచేత నాతఁడు నయంబునఁ బల్కినరమ్య మౌవచో
జాతముచేతఁ గుంతలరసారణుండు ప్రసన్నుఁ డయ్యెఁ; నీ
భూతలమందుఁ దీవ్రముగఁ బొంపిరిఁ గట్టురుషావిషత్వరో
త్పాతము మాన్ప నౌషధము తాదృశు లూనువినీతియే కదా! 38

ఆ. వె. ఎట్టిచంద్రముఖియొ యిది యంచుఁ దనమదిఁ
గుంతలుండు వింతఁ జింతఁ గొలిపెఁ;
గాములందు నెపము గాంచినమాత్రానఁ
గాముఁ డెపుడు సజ్యకార్ముకుఁ డగు. 39

తే. గీ. కుంతలీనేత్రపూర్ణచకోరమిత్రుఁ
డోష్ఠలుళితస్మితుం డయి యొప్పి దంత
దీధితుల హృత్ప్రసన్నతఁ దెలుపనటుల
నిటులఁ జోళేంద్రుదూతతో నెలమిఁ బలికె. 40

ఉ. ఈసుజనత్వ మే నెఱుఁగ కెంతయు నీసున విల్లు మ్రోగఁగాఁ
జేసినదాన నుద్భవిలుసిగ్గునఁ గొంత వచింతు: సజ్జనుల్
దోసములన్ ద్యజించి గుణతుష్టి వహింతురు; క్షారభావమున్
ద్రోసి పయోధినుండి మధుతోయమునే కొనుఁగా ఘనాఽవళుల్. 41

చ. ప్రియమొనరింప దిగ్జయపరీతమనస్కృత నాయెడన్ గదున్
నయమును జూపు నేఁడు; సుజనంబుచరిత్ర మెవండెఱుంగు? నా
శయమున వే ర్దలంప; గుణశాలి సుహృజ్జనమాన్యుఁ డిచ్చ నె
మ్మెయి నొనరింప నెంచు నది మేకొని చేయుత నాతఁ డాదృతిన్. 42



క. అమృతోపమ మమృతద్యుతి
విమలము నగుపల్కుఁ బల్కువిక్రమదిహ్నున్
సుముఖతఁ గని వీతభయో
న్నమితాఽస్యుఁడు దూతయును మనవి యొనరించెన్. 43

క. ఇతరం బెది యుచితం బగు?
నతులవదాన్యతకుఁ దగినయది సేసితి; ప్రా
ర్థితవస్తుసిద్ధి నర్థి
ప్రతికూలనృపుండు సనెనె! త్వత్కులమందున్. 44

క. మాన్యవరు నవంచకుఁగా
మానసమునఁ దెలిసి కడు నమలమతి వై తేన్
బూను మిటఁ దుంగభద్రా
నూనోపాంతాధ్వమున సమున్నతి వసతిన్. 45

చ. కొలఁదిప్రయాణముల్ గడపికొంచుఁ బ్రతాపిని నిమ్నఁ గాంచి ని
ర్మలహృదయుం డొనర్చుఁ జిరమైత్రిని మిత్రునితో విధుం డటుల్;
కలితశరాఽసనుండ వయి క్రాలెడునీయెడఁ బ్రీతి భీతిగా
మెలఁగియు మాన్నృపుండు నృపుమేల్మిమఱల్చు నినుం బ్రియాఽత్మగన్.

చ. పలికిన దంతయున్ నిజమ పార్థివుపల్కులు; మమ్ముఁబోంట్లు ల[1]
గ్గులు సెడఁ బల్కినన్ [2]బయ లగున్ మిముఁ బోంట్లకు నంచు దూత ప
ల్కులు పచరింప సారెకుఁ; టళుక్కుఁడు దానను జోళదెందమున్
దెలిసి మొదల్ తనున్ నిలువఁ దెల్పినయేటితటంబుఁ జేరఁ బోన్. 47

క. అంతన్ జోళవసుమతీ
కాంతుం డుత్సవము సలిపి కదలె ముదమునన్
గంతుపతాకయు హాసాఽ
క్రాంతాఽస్యయు నైనకన్యకను వెనుఁ గొనుచున్. 48

1. శుభములు. 2. వ్యక్తము.

క. అల కుంతలేంద్రుతో ని -
శ్చలసంధి వొసంగుటల్ ప్రజల్ విని భయరు
క్శాంతిఁ గని యాత్మగృహముల
సంతతముదములను విందు సలిపిరి మిగులన్. 49

చ. కకుబిభకర్ణనిర్దళనకారిభయానకదుందుభిధ్వని
ప్రకటన నభ్ర[1]మభ్రమువరధ్వనినిర్భర మైనటుల్ తగన్
సకలదిగంతభిత్తులను సామజఘట్టన సస్వనంబుగాఁ
బెకలినటుల్ స్ఫురించె శ్రుతిభీకరభేరిరవప్రతిధ్వనిన్. 50

క. మును భయమున మూర్ఛ మునిం
గినదిగ్గజపాళిఁ జల్లు నింపుగ శ్రుతితా
ళనభస్వచ్ఛీతల మగు
ఘనశీకరరాజి రాజగజరాజు లొగిన్. 51

చ. ధరణీరజంబు ద వ్వెగయఁ దాల్పక దిగ్భ్రమ మర్యముం డిన
ద్విరదపతాకికావసనవీజనవారిత మారజంబుగా
నరదమునందుఁ గూర్చికొను నస్తగిరిన్ సరిఁ జేయ నాఁగఁ ద
ద్ధరణీరజశ్ఛలంబునన దారి సదా చను చుండి మృత్తికన్. 52

ఉ. నందనకుంజపుంజితఘనప్రసవోజ్ఝితధూళివాసితా
నిందితపాంసుచౌర్యశయనీయత మోదిలు సౌరపాంసులా
బృందము; పాంసుదుష్టమధువీక్షణ నందనమున్ ద్యజించి మిం
టం దిరు గాడుభృంగముల నాకము మించెఁ దమోవృతంబటుల్. 53

చ. సొబఁ గొనరించె సేన నడచొప్పులకున్ జయవాజిరింఖికా
ప్రబలత ధూళిపాళి సరివారిన వై విషమస్థలంబులున్
గబగబఁ జిత్తమే దుముకఁ జాలనిపల్లము లల్ల దూఁకువా
జిబలముచేత భూమి వెలసెన్ శ్రమ గొన్నమరున్మృగంబుగన్. 54

1. ఐరావతము.



వ. ఇట్లు సేనాసంరంభబు విజృంభింప మఱి. 55

క. శరమౌర్వీవల్లీభా
స్వరవరసైన్యే[1]షుపీఠవాటుల నిలిపెన్
నరవరుఁ డట నట విజయేం
దిర కగుక్రీడావనస్థలుల్ నిల్పె ననన్. 56

క. దినములు కొన్నిటఁ బయనం
బొనరించి నదిన్ నృపాలుఁ డొందెఁ గృతిసమా
ప్తినిఁ గనక మనీషులు ని
ద్రను గనుతలఁ పింత యైనఁ దాల్పఁ జనుదురే! 57

తే. గీ. నిర్మలము లయి చల్ల నౌనిమ్నగాంబు
వుల మొదల్ సేరుపరివార మెలమిఁ గ్రోలెఁ
గొలఁది వెన్బడి వచ్చుజనులకుఁ బంక
శేషజలములె లభియించెఁ జెయ్దికొలఁది. 58

తే. గీ. దక్షిణాంభోధిదరినుండి తన్ను దరిసి
తననడుమ నిల్చుదంతిసంతతులచేతఁ
గొండెములు వార్ధిఁగూర్చి వాక్రుచ్చె ననఁగ
వార్ధివల్లభ యది ప్రతీపగతిఁ దాల్చె. 59

ఆ. వె. రాజ్ఞికాంత మంతరక్షపితక్షప
మైనజనముచేత నందినటుల
సింధుతీరవసతిఁ జెందినతద్బలం
బమిత మైనదైర్ఘ్య మందె నపుడు. 60

క. చోళవధూపాళీజల
కేళీపరికలిత[2]చంద్రకేవలసిత మై
హాళి నొనర్చె మదికి సది
ప్రాలేయాచలవిటంకభవజాహ్నవి యై. 61

1. ధనుస్సు. 2. కర్పూరము.

క. అల నదియామ్యతటంబున
నిలిచి బలముఁ గాంచి నృపుఁడు నిజభుజము స్ఫుర
త్కలహసహస్రప్రౌఢముఁ
గొలిచెన్ నుతియించె మఱియుఁ గొనెఁ జుంబనమున్. 62

ఉ. ద్రావిడభూవిభుండును ముదంబునఁ దత్కటకంబు మత్తదం
తావళముల్ గనుంగొని సుతాప్రదానముచేత నాత్మరా
జ్యావన [1]లగ్గుగాఁ దలఁచె; నాదట దూతల నంపికొంచు సం
భావనఁ బుష్యగీష్పతులమాడికిఁ గూడిరి వార లిర్వురున్. 63

క. ప్రియతముఁ డితండు సిరికిన్
స్వయముగ; మత్పూజ్యవశతఁ బడసితి నంచున్
నయనాంబు లురలఁ దలఁచె హృ
దయమునఁ గుంతలునిఁగూర్చి ద్రవిడపతి యిటుల్. 64

క. పాదములకు ముదమున నా
భూదయితుఁడు ప్రణతి సేయఁ బూనఁగ నిలిపెన్
గా దనుచు విక్రమాంకుఁడు
మేదురసంభ్రమవిశేష మృదువచనములన్. 65

చ. "వల దన నేల నే వయసుపట్టున గొప్ప నటంచుఁ; బాదముల్
తల ఘటియింప నుండఁ; దలఁ దాల్పఁదె నిర్మలరత్న మప్పుడే
[2]పొలువ వయోఽధికుం" డనుచుఁ బూని వచించెద్రావిడేంద్రుఁ గుం
తలపతి కౌఁగిటం బొదివెఁ దద్ద ముదంబున నోల లాడుచున్. 66

తే. గీ. అర్ధపీఠప్రణయపూర్ణ మైనకోర్కి
వఱలుచోళుండు కుంతలవరున కనియె
రదనచంద్రిక మేదినీరమణసభను
మకుటరత్నాఽ[3]తపంబును మచ్చరింప. 67

1. శుభము. 2. పుట్టఁగా. 3. ప్రకాశము.



ఉ. చల్లని వౌఁ ద్వదంగములు చందనపంకముకంటె మిక్కిలిన్;
వెల్లిగఁ జిమ్ముఁ గౌముదిఁ బ్రవేష్టము నీది యశస్వి; దేవ! మ
త్తిల్లుఖిలోర్విపాలురకుఁ దీవ్రపుఁదాపముఁ గూర్చునట్టి దై
చెల్లెడునీప్రతాపము వసించు నెటన్? జుళుకాన్వయోత్తమా! 68

చ. ధృతికి నిధాన మబ్బురపుఁగృత్యములిల్లు మితిన్ దొలంగును
న్నతకరుణారసంబున కుదాహరణావని నిన్ను నల్వ య
ప్రతిహతరీతి సృష్టి దనరన్ బొనరించె సమస్తముఖ్యభూ
పతితతినిర్మితిప్రచురభాగసముచ్చయమున్ ఘటించుచున్. 69

ఉ. కాంచనగాత్రి ధాత్రిఁ గలకన్నెలలోపల మిన్న; యున్నత
త్వాంచితసింహపీఠ మిది: యాత్మ మదీయము నన్యరీతి వ
ర్తించదు; సర్వ మీవిధము వృత్తిఁ గనెన్; గృతముల్ ఫలించె; న
ర్పించితిఁ గొమ్ము ప్రీతి; నలరింపు మదీయయశఃప్రతాకమున్. 70

మ. ధృతిమంతుం డగుద్రావిడుండు నిబిడప్రేమంబునన్ మాధురీ
యుతశబ్దంబుల నిట్టు లంతిపురిలో నుక్తుల్ పిసాళింప నా
యతచోళీకుటిలాలకప్రకరడోలాఽఽలోలితాఽలోకనాఽ
దృతలీలాపరుఁ డై ముదం బెనసెఁ బృథ్వీపాఽత్మజుం డెంతయున్.

క. గొనములప్రో వగురాకొమ
రునకున్ బెండ్లాడఁ గడుసిరులతోడన్ గూఁ
తు నొసంగి ముదలఁ గొని తాఁ
జనియెన్ చోళావనీశచంద్రుఁడు పురికిన్. 72

క. కుంతలపతితనయుండు న
నంతద్రవిణం బొసంగె నాద్రవిడునకున్;
సంతతకీర్తిరసికతాఽఽ
క్రాంతులు విత్తముఁ దృణంబుగా నెంత్రు మదిన్. 73

చ. ముదితమనస్కుఁ డై యుదితపూర్ణఫలుం డయి ద్రావిడుండు వోన్
బదపడి కుంతలుండు గుణపక్షసమాదరణైకచిత్తుఁ డై
కదిసె సముత్సుకత్వము నృకాంతరేణ్యునియందు సారెకున్;
మృదువులు గావె పుష్పములరీతి మనంబులు సజ్జనాఽళికిన్. 74

క. ద్రవిడునియద్భుతచర్యలఁ
దవిలి పులకపరికరంబు తనగండములం
దవిరళముగాఁగ నినిచెన్
నృవరసుతుఁడు సుగుణపక్షనిహితాఽత్ముం డై. 75

క. చనఁగ నివారింపఁగ నై
తి నతనిఁ గాంచంగ నౌనొ తిరుగ ననుచు స
జ్జనచూడామణి నృపసుతుఁ
దనయముఁ బరిచింతనారతాఽత్ముం డయ్యెన్. 76

క. త్రిభువనముల లభియింపని
విభవాఽస్పదగా నతఁడు ద్రవిడసుతఁ జేసెన్;
శుభహృత్ప్రసాద మాప్తుల
కభయమె కా కడరుఁ దత్సుఽతాదులఁ బ్రోవన్. 77

క. సమరరభసవిభ్రమకుతు
కమున సమాఖ్యాఽవతంసకస్థితిఁ గనుభూ
కమనసుతుఁడు వినె ద్రవిడుఁ డ
సమయమున సురాఽలయంబు ననుదుర్వార్తన్. 78

క. మృదుహృదయత సత్ప్రణయిత
సదమలగుణపరత మెలఁగుక్ష్మాపసుతుఁడు దా
మదిఁ గలఁగఁగ విలపించెను
జెదరఁగఁ గన్నీరు చంద్రసితగండములన్. 79



క. ద్రవిడధరావిప్లవమును
నృవరసుతుఁడు విని సఖేదహృదయతఁ గదలెన్
ద్రవిడపతితనయు సిరి కిం
పవునటు లభిషిక్తుఁ జేయ నాత్మఁ దలఁచుచున్. 80

ఆ. వె. కరటిశతవికీర్ణకర్ణతాలవ్యజ
నానిలములఁ జల్ల నైనవైరి
యశము లాను చంత నవనీవరుఁడు సేరె
గాంచిపురము నాదికాలపురము. 81

శా. కాంచీదామకలాఽరవంబు గుణయుక్తం బైనపూవింట జృం
భించం గల్గినడిండిమస్వనముగా వేల్లత్కటాక్షంబు ల
త్యంచన్మార్గణవృష్టిగా నెదుటఁ బౌరాబ్జాఽననాశ్రేణి గా
న్పించెన్ గుంతలనాథనందనునకుం బెన్మోరమున్ గూర్చుచున్. 82

చ. క్షితిపతిపుత్రుఁ జూచి యొకచేడియ నోటఁ గలట్టితమ్ములం
బతినయ మొప్పఁగా శుకము నందఁగఁ జేయుచుఁ గింశుకచ్ఛవిన్
స్మిత మొనరించునోష్ఠమునఁ జె న్నయి చుంబనచాతురీవిధిన్
గుతుకము మీఱ నాశుకముఁ గూరిచి పల్కె నరేంద్రుఁ డారయన్. 83

చ. పతనభయంబు వీడి యొకపద్మదళాక్షి నిశాంతశృంగమున్
ద్రుతగతి నెక్కె నెక్కుటకు దుస్తర మయ్యు నృపాలుఁ జూడఁగా;
నతనుఁడు పౌరుషింప జవరాండ్రు తృణంబుసమంబుగా మన
స్థితి మరణంబు నైన నిరసింతురు సాహసముల్ పొనర్చుచున్. 84

క. కలకల మకారణంబుగఁ
గలిగించి యొకర్తు తేనికన్గొన నొందెన్;
వెలఁదుల కుపాయదర్శన
ములఁ బొరము మనోజదృష్టి మూడవయది యై. 85

క. తనయెద విశదద్యుతి ని
ల్చినయినసూనుండు పరఁగఁ జేసినయటులన్
గని తనజారినహారము
వనజనయన పఱఁగ విడిచి పడిఁ జనెఁ దొలఁగన్. 86

క. మనసిజవతంసలీలా
జనకమృదులకిసలయానుసారినఖలిపిన్
గనఁ జేయుచు నురమున నొక
వనిత సురతపరత నోర్పువడి రచియించెన్. 87

క. శ్రవణపరిచ్యుత మై యం
సవసతిఁ గనువేలొక రత్నకకుండల మా
యువిదయెదనుండి వెడలెడు
పువువిల్తుని[1]చుట్టుకైదువుగఁ గనుపట్టెన్. 88

క. పరికలితచటుక్యావని
వరపుత్ర ప్రథమవారపరిదర్శనత
త్పర లగునగరమృగాక్షుల
కరుదుగఁ బఱఁగెన్ స్మరస్పృహాఽఽయతలీలల్. 89

క. కినుక నదర్పసధరరుచి
దనరుతరుణులందుఁ బటుమదనలీలలఁ గ్ర
న్ననఁ దెల్పెడుకిలికించిత
మును దనకన్గొనను నృపతిపుత్రుఁడు గనియెన్. 90

క. కనకనికేతనవేదీ
వినిహితపదపల్లవుండు పృథ్వీశసుతుం
డు నిలింపేలాధరతట
మునఁ బ్రణయముఁ గొల్పునర్యమున్ నిరసించెన్. 91

1. చక్రాఽఽయుధము.



చ. పరిసరసీమలన్ గొలఁదివాసరముల్ ఘనలీలలన్ జనన్
జరణనివిష్టదుష్టనృపసంచయుఁ డై కనెఁ దాను ద్రావిడే
శ్వరునిప్రతాపభీతి [1]దవు వారిధి వో నవివాహితేందిరా
తరుణిమొదల్గృహంబు వెలిఁ దారె ననాఁ దగు 'గాంగకుండమున్'.

చ. నిరుపమధర్మవప్రసరణిన్ దరిచుంబితతారకాఽఽధ్వ మై
పరఁగెడునప్పురిన్ గనకపర్వతమందు నమర్త్యపత్తనం
బరుదుగఁ జేరురీతి విబుధామలవైభవ ముల్లసిల్లఁగా
నరవరపుత్రుఁ డొందును ఘనప్రమదోర్మితరంగితాఽఽత్ముఁ డై. 93

మ. పరిపంథిధ్వజినీసమూహముల నుత్పాటించి చోళావనీ
పరసూనున్ [2]హరివిష్టరంబుపయి సంభావించి యచ్చోటఁ జో
ళరమణ్యాళివిలోకనస్ఫుటపుటీప్లావద్రుచిస్ఫీతుఁ డై
యిర వొందెన్ మురు వొంది కుంతలుఁడు నందే మాసమాత్రంబునన్.

క. అటుపై విషమాధ్వములం
దటవీధానుష్కతతుల నలయించి ధరా
విటుఁ డొందెఁ దుంగభద్రన్
స్ఫుటవీచీరచితవినతిసురుచిరముద్రన్. 95

క. తదనుగఁ గొలఁదిదినంబుల
తుదిగా 'రాజిగుఁడు' చేంగిదొర హరియించెన్
బొదువుప్రకృతిజనములపగఁ
జెదరిన చోళాఽఽత్మజాతుసిరిఁ ద్వరితముగన్. 96

క. ప్రకృతివిరోధు వమాన
ప్రకటను సోమునిఁ గతంబు వఱఁగించెను దీ
నికి వెనుగ రాజిగాఽఽఖ్యుఁడు
వికలత భయశంక కొంత వెనుఁ గొని కలఁచన్. 97

1. దూరము. 2. సింహాసనము.

క. శూరశతశాత[1]పుష్కర
ఘోరవిహారవ్రణాంఘ్రికుట్మలవోలెన్
దారింవదు సిరి పాద ము
దారులయందును; బ్రమత్తులం దెటు నిలుచున్ ? 98

క. సుకృతవిపర్యయమునఁ గుటి
లకుపాఱర కిట్టిబుద్ధి లభియించుఁడు నా
వ కదలియొడ్డున [2]గట్టున
వికలం బగురీతి నపుడె విఘటించు సిరుల్. 99

క. కలి యడ్డు లేక యున్నను
వెలయు దృఢవ్రతము శస్త్రవిబుధుల కెపుడున్;
గలన నవినయాధ్వగులను
బలవంతుల నైన మిగుల వంచింతు రిలన్. 100

క. ఇటుల హతబుద్ధు లగుభూ
విటులు సిరి సనంగ రథనవిధి నెఱుఁగక యు
త్కటబలగర్వితు లైపర
భటవిక్రమదీపిక [3]శలభము లగుదురుగా. 101

చ. సకలము శూన్య మం చెఱిఁగి స్వర్గముచింత శఠుండు నైనఁ దా
ల్పక నిజమందభావమున స్ఫాటికవర్తులవిగ్రహంబులన్
వికలమనీష లూనుదురు వేలుపుబుద్ధి య టంచు దగ్ధరా
జ్ఞికరము మిథ్యయే యనుఁ ద్రిణేత్రునిలింగము నైన నిందమై. 102

ఆ. వే. ఇట్టిరాజు లెపుడు నెలనాఁగగములందుఁ
దనరి, పౌరుషంబుఁ దక్కువారిఁ
బోలి, సారె భయముఁ బూనుచు నెల్లెడ
భయముఁ గలుగఁ జేయువా రగుదురు. 103

1. ఖడ్గధార. 2. పర్వతము. 3. మిడుతలు.



చ. క్షతజమునందుఁ దోఁగుఘనసంగరమార్గములందు నెప్పు డా
దృతమతి నాథుఁ డా నభిసరించు వరాక ధరాపలక్ష్మి; యా
తతకలుషంబుఁ గూర్చు వసుధాతలనాథమనంబులందు న
స్నతిఁ దనపాద మూనఁ గనిన న్గడుఁ జిత్రముఁ దోఁపఁ జేయుచున్.

ఉ. చేరినయంతనే యెఱుఁగు శిష్టు నశిష్టుని; శత్రు మిత్రుఁగాఁ
దారుచు; మిత్రు శత్రునిఁగ దవ్విదు; బుద్ధిఁ గలంచు తేండ్లకున్;
గూరుఁ గుటుంబ మందెవనికో విధివ్రాత నృపత్వ మందు లో
నారయ కన్వయంబునకు హానిఁ బొనర్తురు రాజ్యలుబ్ధకుల్. 105

క. ఉన్నతచిత్తుం డీతం
డన్నకుఁ గీ డేమి సెసె; నన్వయరిపుఁ డౌ
నిన్నీచరాజిగునితోఁ
బన్నెన్ సంధిన్ విపత్తుఁ బఱఁగించుటకై. 106

క. గళితనయుం డగురాజిగుఁ
బొలియింపన్ నృపతిసుతుఁడు పూని మునుఁ జనన్
బల మఖిలముఁ గొని సోముఁడు
కలితత్వరఁ దమ్మువెనుకగాఁ జనుదెంచెన్. 107

## గజసేనావర్ణనము

క. తమయుత్కటకటమదక
ర్దమమునఁ బొదమెదుబిసినులదళములసమ మై
భ్రమయించుభ్రమరనికరము
తమ కసితచ్ఛత్రమైత్రిఁ దగి వెన్నంటన్. 108

క. వడిఁ బలుసృణులన్ దఱుమఁగఁ
బడుతమచే ఘట్టనంబుఁ బడయుకులగిరుల్
విడుచున్ నెత్తురు తమపైఁ
బడుధాత్వాపగలమిషను బ్రస్థముఖములన్. 109

క. తమదంతద్వంద్వములనె
రమ నమరుపఁ దలఁచె ననఁగ రథనమునఁ దటా
కముల నానర్చెన్ గినుకన్
గమలస్మృతిశరణ మొందఁగా ననిశంబున్. 110

చ. శ్రుతిమధురధ్వనిస్ఫురణఁ జొప్పడఁ జేయుమధువ్రతాళికిన్
మతి నుపకార మెంచుచు క్షమాజవిధూతిపతత్ప్రసూనసం
తతిఁ దమదాననీరము నుదారపరీమళమేదురత్వసం
గతమును జేసె; నున్నతులు గా రెటు ప్రత్యుపకారతత్పరుల్ ? 111

చ. తమతనుభారగౌరవముఁ దాల్పక తొట్రిలుభూతధాత్రి ని
ల్పుమది మదంబునన్ గనులు మూయుచు శైలసమున్నతంబు లై
తమసవిలాసతన్ బయికిఁ దార్చినతుండములన్ బ్రవర్తిలున్;
దమవలనన్ విపత్తుఁ గనఁ దద్గతి మాన్పఁగఁ జూడరే ఘనుల్. 112

ఉ. ఈకరణిన్ రణార్ణవము నెంతయునేన్ లొదపెట్టఁ జాల్మదా
నేకపముల్ నగాకృతు లనేకము లై యధిరూఢయుద్ధవీ
రైకసమృద్ధితిన్ వడి వహించెఁ గడున్ ఘన మైనలక్ష్మి య
స్తోకగతిన్ సమిన్ముఖతఁ దూఁగుచళుక్యనృకాంతువాహినిన్. 113

తే. గీ. అసగళకలచయకంటకావకీర్ణ
మళనినిష్ఠురలోహబంధాన్వితంబు
నై నరణ[1]ఖురళీపాళి నాత్మగేహ
కుట్టిమమురీతి నృపురథకోటి దాఁటు. 114

## అశ్వసేనావర్ణనము

తే. గీ. వాలవీజనపుంజసంభవసమీర
మధ్యసంచారి యగుపవమానుఁ దహహ !
క్షితిపతితురంగవేగలంఘితతఁ గనక
పరిభవంబునకున్ బ్రీడఁ బడయఁ బోఁడు. 115

1. సాముచేయుచోటు.



క. మణిపల్యాణస్థితి దిన
మణి తనతేరునకుఁగా విమర్శింపఁగ [1]రో
హణమొనరిచినటు ఘోటక
గణ మర్యముబింబమునఁ బ్రకాశించెఁ గడున్. 116

చ. అనుమితధావనానుసరణారవ మార స్ఫురత్తురంబులన్
ఘనగతిఁ గ్రుమ్మరున్; 'పృథులఁగా నిల నీ వొనరింప వేల' యం
చని చతురాస్యు దూఱు నన నాన్నృపసత్తమునుత్తమాశ్వముల్
ఘననిజవేగసత్వములకల్మి కిలాస్థలి చాలఁ బోమికిన్. 117

క. ఎల్లెడ నెక్కినరౌతుల
సల్లలితసువర్ణవర్మచయములఁ బంక్తుల్
పెల్లుగఁ దీరి తదశ్వము
లుల్లసనం బూనకున్నె యురురణమునకున్. 118

క. అమలాసితవిలసిత మగు
క్షమావరువరూథినీనికరఖడ్గలతా
సముదయముల ద్యోగిరి యిం
ద్రమణిద్రుతిశతఝరప్రదారిగఁ దనరెన్. 119

క. కలితకలాపికలాపక
విలసన మూన్కుంతమాల వేతెదఁ ద్రుటిఁ దా
నిలువదు తదీయశాత్రవ
బలభటశీర్షస్థలములఁ బాయుచు బయలన్. 120

క. పలువురు పల్కుటవలననొ
కలితాద్భుతకార్యములనొ కలఁచరె మదులన్
గలహరసభీష్మభువనై
కలుంఠనక్రమవిలాసకధ్వజినిఁ గనన్. 121

1. ఎక్కుట.

తే. గీ. ద్రావిడానీకినులు సముదారభుజుని
విక్రమాంకునికెలనిపృథ్వీకినిఁ జేర
నవకృతినిఁ జల్పుకాలంబు ప్రాప్త మయ్యె
ననుచుఁ దమ్మునిఁ బొదివెఁ దదగ్రజుండు. 122

క. కన్నీరు గారుకన్నులఁ
జెన్ను దఱఁగి గ్రహముపీడఁ జెందినయటు లై
తన్ను బొదువ వచ్చినయా
యన్నను గని చింతఁ గూరి యనుజుఁడు దలఁచెన్. 123

తే. గీ. అవినయాంబుప్రపూర్తి సొం పారునట్టి
శాత్రవపుఁగాలువలచేత సాగుచు నవ
యశపుఫల మివ్వఁగా నహో! యవిధియుతుఁడు
విత్తెఁ గారె ఘనానర్థబీజ మితఁడు. 124

క. ఉరుదుర్ణయుఁడు మదగ్రజుఁ
డరిసంగతిఁ జెనక వచ్చె నౌర! ఘనసమి
చ్ఛిరమున శరములఁ బఱపక
యరయఁగ నే నితనిఁ దొలఁచ నయ్యెద నెటులన్? 125

చ. జనకసమాత్తవైభవము శత్రుగఁ జేసి మదగ్రజాతునం
దనుపున నొందఁ జేసితి; నహో! మది నొచ్చెడి నిప్డు ముప్పుచే;
వెనుఁ జను నాభుజంబు కులహంతృతనుండి; తొలంగి యేగినన్
గనుఁ బ్రమదంబు దుర్జనము కల్పన సేసి యకీర్తి నాయెడన్. 126

చ. అని యిటు నిష్కళంక మగువ్యాహృతిఁ గీర్తిధనుం డతండు మె
ల్లన విమలాత్మతన్ బలికె లగ్గుగ నన్ననుగూర్చి యెంతయేన్:
విని శపథంబులన్ సుడివి వీఱిఁడి యై యతఁడున్ దఱిన్ వధిం
పను గను చుండెః సీ! మలినమానసవృత్తి మనార్జవంబుగా!. 127



క. ఇది యేమి బాము? నన్నున్
గదియు యశోహాని; దీనిఁ గని యే మనునో
త్రిదివగతుఁడు మత్పిత యని
మది నిడి నిద్రింపఁ జంద్రమౌళి వచించెన్. 129

చ. ఘనసురకార్యనిర్వహణకారణజన్ముని గాఁగ వత్స! ని
న్నానరిఁచినాఁడ సద్గుణ ననూనధృతిన్ దగునీదుచిత్త మొ
ప్పనిభ్రమఁ గాంచ నేల? తలఁపన్ దిలమాత్రశుభంబు లేదు; దు
ర్జనుఁడు త్వదగ్రజుండు; మునుపుణ్యము డుల్చును వానిదుష్క్రియల్. 

క. కావున భువనమహోత్సవ
మావిధి విల్వంపు మరివధార్థ; మెఱుఁగవో!
నీ విటుల నవనిఁ బుట్టుట
కేవల మది ధర్మరిపులఁ గెడపుట కగుటన్. 130

క. గిరిజావరుఁ డటులఁ బలుక
నరవరపుత్రుండు కరము నమ్రత విని ని
ద్దుర విడి శివునుడిఁ దొలఁగన్
దర మగునే యనుచుఁ గలహతత్పరుఁ డయ్యెన్. 131

క. చెనకఁగ సన్నద్ధం బై
తనకై యిరుదెసలఁ దఱియుతద్బలయుగమున్
దనకదనభోగలోభో
జ్జనితానుకలోత్పులకభుజయుగముఁ గనియెన్. 132

యుద్ధము

క. కవ్వపుఁగొంతవిధంబునఁ
గ్రొవ్వినకరి నెక్కి యతఁ డకుంఠతఁ గలఁచెన్
రి వ్వనుపీరాజనకరుతిఁ
జివ్వనఁ బటుదోర్బలుఁ డరిసేనావార్ధిన్. 133

క. అహమహమికఁ గదుఁ బరుఁగిడు
నహితబలయుగంబు కదియ నధిపుబలంబుల్;
మహితనదీద్వయజలములు
రహి నభిముఖజలధి[1]పుష్కరము నొందుగతిన్. 134

ఉ. కూలెడునల్లటెక్కెమును గూడుముఖంబునఁ గేతుపక్షిరా
జోలి రచించె ముక్కుకొన నూనినపామున తథ్యతార్క్ష్యతన్;
వ్రాలుగజధ్వజస్థమృగవైరియు నైజమృగేంద్రలీలమైఁ
గ్రాలె వతంసమౌక్తికవికాసలసద్గజకుంభసంగతిన్. 135

చ. క్షతజతరంగిణిన్ ధ్వజఝషంబులు తూఁగుచు నెట్టులో యథః
పతనముఁ గాంచి వీచివలమానము లైన నకైతవాండజ
స్థితిఁ గనునామరాంగనలు; చెందిరి మోదము రక్తపంకసం
గతిఁ జన రానియుద్ధభువిఁ గన్గొని యూఁతలు లేనిపోకలన్. 136

తే. గీ. ప్రహతితతి మూర్ఛితుం డగురౌ తొకండు
నిజగజశ్రుతిపుటిగాలి నిగుడఁ దెలిసి
తన్నుఁ గొట్టినవాఁ డన్యదళితుఁ డగుడుఁ
దనపగన్ దీర్చుకొన లేమి ననుశయించె. 137

క. అరివీరవరాంగమణీ
పరిదళనజరజము కనులఁ బడఁగ నణఁచె నొ
క్కరుఁడు రుధిరాంజలులచే
[2]వరాంగరదదారితాఽత్మవక్షస్స్థలిలోన్. 138

చ. ఘనరణసంకటంబున నొకం డరిదారణలబ్ధశస్త్రముల్
గని మృతి లెక్కపెట్ట కరిఖడ్గము వేగమ సాగి లాగెఁ; బో
వ నసువు లుండ వైరితలఁ బాదము నిల్పి జనుఃఫలాఽప్తిగాఁ
గనియె నొకండు; కీర్తిరతి గాక మహాత్ములు మేను లెంతురే. 139

1. నీరు. 2. ఏనుఁగు.



క. ప్రతిశూరు శూన్యకంకటుఁ
బ్రతిఁ జనఁ గని యెదిరె నొకఁడు రహితకవచుఁ డై;
యతులామలజయమతి దు
ర్మతి కల్పావసర మైన రహి నొసఁగఁడుగా, 140

తే. గీ. రక్తపూర్ణకపాలవారంబునదుమఁ
గూలి నిజకర్ణతాలవాతూలకలన,
దంతి మిత్త్రికిఁ బానపాత్రప్రణయికి
సలిపె నన నొప్పె శిరోపచారసేవ. 141

తే. గీ. కత్తిఁ దెగి పుత్తెచిప్పపై నత్తమిల్లి
నట్టికరికర్ణపుట మొప్పె నాహవోర్వి
[1]నర్యమాఽత్మజలీలాసమాత్తపాన
భాజనాఽచ్ఛాదనవిలాసభంగి నెనసి. 142

చ. నియతజయంబు గానిచిరనిస్తులయుద్ధముఁ గాంచి శత్రుసం
చయము లయింప రాసుతుఁడు సామజముల్ బురికొల్పి నిక్కెపె
క్కియములద్రావిడధ్వజినిఁ గీటడఁచెన్; ద్రుటి నగ్రభూచమూ
చయ మలయించెఁ; దాఁ జనెదుచక్షులలో రిపుకీర్తు లానుచున్. 143

తే. గీ. అవనిపానేకపము తనయంఘ్రిహతుల
ఘనకపాలంబులను గూర్పఁగా దురాప
భాజనము లగుపైశాచికాజనములు
సుభటశోణితమధుపానవిభవ మందె. 144

తే. గీ. సురభిసరసిజకోశకేశరత యయిన
కలిమిచెలి శత్రులందుఁ గా ల్నిలిపె నిజము;
కాక యశోమాలికను బోలురాకుమారు
కత్తి పగఱను జుంబించఁ గడఁగు నెట్లు. 145

1. యముఁడు.

క. [1]ఖరకరజపానపాత్రకుఁ
బరు డయి బెదు రిదెడునేస్గుపుటియలయందున్
గరిరథపరంపర పడెన్
గరముగ ముల్లంగియూరుఁగాయ కనఁ గనన్. 146

మ. సమరాగ్రాంగణసీమయందు వసుధేశాఽత్మజాఽజ్ఞన్ సదా
యమితస్ఫూర్తి సటించె వీరరమ క్రూరాజిహ్మగాపాంగదృ
గ్రమణీయాఽవళిఁ బర్వఁ జేయుచు విపక్షక్ష్మాతలాధ్యక్షయు
గ్మముఁ దద్విక్రమదుర్దముం గొలువఁగాఁ గైదాయలన్ నిల్పుచున్.

చ. కులిశనిశాతశస్త్రములఁ గొట్టుదు వర్ధసపత్నకుంజరాఽ
వళి నధిరూఢులై నబలవద్భటు లుద్ధతి వీడి ముజ్జగం
బుల భయ మొందఁ జేయుభుజముల్ గలరాజతనూజుసమ్ముఖం
బలవడఁగాఁ బ్రణామనియమాఽయతిఁ దేలఁగఁ గూలి రెంతయున్.

క. నరపతితనయునిగజపతి
యరివీరముఖాబ్జదళన యమసమము సమి
త్సర మొనరిఁచెఁ ద్రుటిఁ [2]బద్మా
కరధృతవిభ్రమసితాబ్జఘనకోశముగన్. 149

క. ధృతభట[3]కరంక మంక
స్థితమాతంగాస్థిచక్రశిఖరి ఘనరణ
క్షితి శమనభుక్తశేషం
బతిమోద మిడెన్ శివాసహస్రార్ఘ్యం బై. 150

ఆ. వె. వేయు వల్కఁ నేల ? విక్రముం దరులపైఁ
గవిసి రాజయుగ్మకంబు నోర్చె.
ద్రవిడవరుఁడు వాతెఁ; దడయక సోముండు
గనియె వసతిఁ [4]గారమనికియందు. 151

1. యముఁడు. 2. లక్ష్మి. 3. తల. 4. చెలసాల.



క. ఇరువురునృపులప్రతాపేం
ధిర లతనిపదద్వయమునఁ ద్రెళ్ళె; నసాధ్యం
బరయ ధర నెద్ది త్రిభువన
వరభుజవీర్యబలవిభవపరికలితులకున్ ? 152

క. క్షితిపతియుగ్మరమాయుతి
నతఁడు విహితసమరదేవతాఽర్చావిధియై
ధృతవర్ముఁ డయి తటాంత
స్థితకటకన్ దుంగభద్రఁ జేరినయంతన్. 153

క. మఱల సిరి సోదరున కీ
నరయునృపాలాఽత్మభవుని నర్ధేందుధరుం
డురుకోపం బడరించుచు
స్ఫురదశరీరోక్తిఁ బఱపుచున్ వడి నాఁపెన్. 154

సీ. ఆస్యము లారాజహంసలమిషమున
సంకు లూదెడుభంగిఁ బంకజములు,
ప్రతిబింబితార్యమవ్యాజంబునను లగ్న
కాలము శోధించుఘటిగతి నది;
యతిశీతలతచేఁ గులాఽపగాజల మూను
భంగిఁ జూపించుప్రభంజనములు;
పవనసమాహృతాంభఃకణచ్ఛలమున
గంగాంబుకీర్ణ మాగతిఁ దగుదివి;

తే. గీ. అమితవైశద్యమునఁ గేతకాఽప్తమైన
స్మితము గై సేసినటుల జృంభించుదెసలు
సమ్మదవ్యాప్తిచే నుత్సవమ్ము మిగుల
వఱలుసకలజనమనముల్ పఱఁగుచుండ. 155

తే. గీ. గర్జితంబున వలెఁ గరుల్ ఘనగభీర
దుందుభిధ్వాన మెగయించుచంద మిడఁగఁ
గడల నెల్లను సాంద్రశంఖస్వనముల
సరిగ [1]హేషితములఁ గూర్పఁ దురగములును. 156

ఉ. అంత ననంతవల్గదమరాఽనకనిస్వన మీశలాభవి
క్రాంతవసుంధరాఽఽర్తియుఁ జిరప్రవిచారచళుక్యరాడ్రమా
క్లాంతినివారకంబు నయి క్రాలు[2]ధరాధరణాభిషేక మ
త్యంతముదంబునన్ గనియె నా నని విక్రమచిహ్నుఁ డాదటన్. 157

మ. ఘనసంపద్యుతుఁగాఁ దొనర్చె మిగులన్ గారుణ్య మొప్పారఁ ద
మ్మునిఁ బుణ్యాహమునన్ జళుక్యనృపసంభూతుండు; దాసీగతిన్
ఘనవిక్రాంతిధనక్రయంబున రమాకంజాక్షిఁ గైచాయలన్
గనుభూకాంతుల కాశ్రితావనవిధుల్ గష్టంబు లౌనే! భువిన్. 158

క. పృథివిపతి యెల్లఁ గొని రిపు
మథనుఁడు రణకౌతుకంబు మైకొన స్వమనో
రథపూరణమునకై ది
క్పథముల దిగ్దంతిశేషవర్త్మన నిలిపెన్. 159

క. ధూరమణవిరమణం బయి
[3]శారానిచుళాఽసితాఽత్మకార్ముఁడు తుదిన్
వారించి చోటటీరముఁ
జేరెన్ 'గల్యాణ' పురము క్షితిపతి పిదపన్. 160

వసంతము

క. కంతుశరసఖము వీరు
త్కాంతావిభ్రమనియామకము పికరుతివి
క్రాంతిస్థాయివిధాయక
మంతన్ శృంగారబంధు వామని వొలిచెన్. 161

1. సంకలింపులు. 2. రాజపట్టాభిషేకము. 3. చెఱసాల యనెడుగవుసెనలో నుంచఁబడిన ధనువు గలవాఁడు.



క. చెందినశిశిరభయంబునఁ
జందనగకందరములచాటుం గనె నాఁ
గం దుహినము సనఁగా రా
త్రిందివముగ బయలువెడలి తెమ్మెఱ లెసఁగెన్. 162

క. తముఁ దినుపాములకు నివా
సము లమరిఁచె ననుచుఁ గినుక సారించి పటీ
రమహీధ్రకుంజములు విడు
తమి నన నుత్తరముదిక్కు దారె ననిలముల్. 163

క. తనరథమును బూనుపురా
తనవాహనములను మార్చుతలఁపుననో నాన్
దినకరుఁడు తురగజననా
వని గలనుత్తరముదెసకు వడిఁ జనఁ బూనెన్. 164

క. చందనగిరివరకందర
మందిరములు గాంచు నశ్మమయబంధనమున్
గందపుఁదెమ్మెఱ విరహిజను
లం దలఁకించుఁ ; జెఱ వర్తిలన్ గనుఁ జిరమున్. 165

క. కేరళపవనున కామనిఁ
గూరిచి యవ్యాజభక్తి కొదుకక యగుఁగా;
దూరాధ్వము లంఘించి యు
దారంబుగఁ దదనుచరత నంతట మెలఁగున్. 166

క. చెలి! నీవరుషవచస్సుల
నల యామ్యదిశాఽనిలంబు నదలింపకు మ
త్యలఘురుషానిశ్వాసా
నిలపటలిని బలిసి [1]వడను నిజముగఁ బడయున్. 167

1. వేఁడిని.

క. యమదిఙ్మరుదేణము బా
ణమునఁ దునిమి గాలిచాలనం బణఁచఁగ గం
దముమల నిలుచుపుళిందున్
దమిఁ బ్రార్థింపంగ వలయుఁ దలఁగింప వెతన్. 168

క. దీనత యిది వృథ యగునో
పూనరు వైరము సమీరమున శబరులు కే
శీనిరతనిజవధూజన
మీనాంకగ్లాని నది శమింపఁగఁ జేయున్. 169

క. ఇతరర్తులఁ గనఁ బోనియ
మితగర్వముఁ గనుపటీర[1]మృగవాహనుసం
గతిఁ జైత్రుఁ డసహ్యుఁ డగు న
మృతరుచి వొడమన్ శర[2]త్తమీముఖములన్. 170

గీ. పాంథజనపాపమో [3]యామ్యవాయువునకు
బుద్ధిభేదంబుగా నిట్లుఁ బుట్టె నేమొ.
కదలఁ బోదు దిశామోహకారణమునఁ
జందనధరంబుఁ దాఁటి వేర్చాయ నెపుడు. 171

క. ఈరీతిఁ దిరుగుపరిమళ
భారపటీరానిలమునఁ బఱఁగెఁ జిరముగన్
గారా మఱువ్యాహారము
లౌరా! భూగృహవసతిప్రియస్పృహిణులకున్. 172

డోలాకేళి

క. స్మరసురవిమానసర్గము
సురభిసమస్తర్తువిభవసూచకము రసో
ర్వీరమణుప్రసాదమాలిక
కరిగమనాడోలికావికాసం బొప్పెన్. 173

1. వాయువు. 2. రాత్రి. 3. దక్షిణదిక్కు.



క. డోలాఽధిరూఢనారీ
లీలాయితపృథుకటిస్థలీభారసమా
లోలాఽలంబగుణత్రుటి
గ్రాలదు; కుసుమాస్త్రభాగ్యకారణమ యగున్. 174

క. డోలాక్రీడాందోళన
నాళీకాఽస్యలఁ గనన్ జనంబులు మూఁగన్
లీల మరుఁడు తనలక్ష్యవి
శాలత నమ్ములను వమ్ము సలుపక కురిసెన్. 175

క. ఊఁగుడువేడుక బల్దవు
నూఁగి మఱలుగరిత లంది రుప్పరవీదిన్
మూఁగినవేల్పువెలందుల
లోఁ గన నాసోయగంబులో సగపాలున్. 176

క. తరుణీశ్రోణీవిస్తా
రరుద్ధడోలావిలాసరమ్యఫలకమం
దరుదుగ విలు వంచినసుమ
శరునకు మివులం బ్రవేశసమయం బబ్బెన్. 177

క. డోలాలోలాంబుజనే
త్రాఽళీసౌందర్యకలన నభివర్ణింపన్
బోలున్ బూవిల్తుఁడు తగఁ
గ్రాలెనయేన్ గవిత యది వరమహిమచేతన్. 178

క. వెలఁదులయుయ్యేలలాటలు
గెలఁకుల మల్లికలు గలయఁ గెరలులవంగా
నిలములు ముఖ్యాంగరమా
కలన మిడెన్ భువనమోహకారిమరునకున్. 179

క. పదములను జాచి డోలలఁ
గుదురుగ నెక్కొని చివుర్లఁ గొనరెడుచెరఁగుల్
ప్రిదులుచెలులకోర్కెలకును
విదితముగానియెడఁ గాంచఁ బేర్చిరి యువకుల్. 180

క. సారెకు దూరం బెగయుచు
జారుచుఁ గ్రిందికి నితంబజాడ్యం బఱ. డో
లారతి శ్రాంతి జయించుచు
నారులు పురుషాయితంబున న్గని రెమ్మెల్. 181

క. అలివేణీస్తనసీమా
దళితుం డై శ్వాసమారుతములఁ బ్రతికి య
త్యలఘుక్లేశత మరుభృ
త్యులలో మలయానిలుఁడు సమున్నతిఁ గనియెన్. 182

క. శింజాననూపురాన్విత
కంజాక్షీపూర్ణడోలికలఁ దలఁతు నొన
ర్చెం జైత్రుఁ డనుచు నుద్వసఁ
గంజాశుగరాజధానిఁ గలితవసనఁగన్. 183

క. డోలావిలాసరత లగు
బాలలవదనాబ్జములను బరిచుంబించెన్
మేలిదుకూలము లాగెన్
బ్రాలెన్ గటిపైఁ బటీరవాయువు గరిమన్. 184

క. కాననచరపుంస్పికచయ
మూనెన్ గలపంచమముసమున్నతి లీలా
గానాఽసక్తవధూజన
తాఽనూనచ్ఛాత్రభావ మందుట కతమో. 185



క. వనదేవతాయుతంబుగ
ననయం బుద్యానవాటి నలరెడుపులుఁగుల్
వనజాక్షులతోఁ బాటుగఁ
గనె సంభ్రమరహితడోలికాకేళికలన్. 186

చ. కరసరసీరుహద్వితయగాఢగృహీతవిలోలడోలికా
భరణసమర్థరజ్జుచయవారిజదృగ్జనతానిరస్తవి
స్తరపరిధానబంధనవిధాననితంబతటీనిజోచ్ఛ్వస
న్మరుదురుమోహితుం డగుచు మ్రాన్పడియెన్ మరుఁ డంత వింతగన్.

క. విరహిణులకంఠములు త్వర
దరియుఁబ్రియులబాహుపాశతతిఁ బట్టువడన్
బరువడి వృథ యమపాశో
త్కరముఁ బిలుచుమధుఁడు లతలఁ గల్పించె స్మితిన్. 188

క. కిసలవ్యజననివారణ
మసమీరనికేతనోదరాఽవాస ము
ల్లసిలె విరహిణీమూర్ఛాఽ
పసరక్లేశాపనయనపథనూతన మై. 189

క. అతిముదమునఁ గోకిలకూ
జితానుకృతి శుకకులంబు సేయ, విరహిణుల్
వెతఁ గని యిలు [1]వెలలించిరి;
మతిమద్గుణ మదనుఁ బట్టి మార్పఁ గనుఁ గదా! 190

క. వెలి నలిరవముల వినుటన్
వలి యుడిగెనా నా నెఱింగి పంకోదరమున్
వెలలుచు నలినము పొలిచెన్
గలితాబ్దద్వితయకన్యకాముఖకాంతిన్. 191

---

1. 'వెడలించిరి' కిఁ బర్యాయమని.

క. అరవిరిమొల్లలమొగడల
సరిసొబఁ గగునవరదములసౌరున వఱలెన్
గర మటవీస్థలులయొడుల
మరగెడుబాలుండ నాఁగ మధుఁడు మురువునన్. 192

క. ఆనెన్ [1]వననలినాలయ,
మానితమలయానిలాతిమానసురభిశా
సూనశ్వాసము ముగ్ధము
సూనస్మితదంతురంబు సురభిముఖంబున్. 193

క. క్రమముగ వర్ణజ్ఞానో
ద్యమనియముఁడు, మధుఁడు వ్రాయునక్షరమాలా
క్రమ మన మహిఫలకంబున
భ్రమరీపదచిహ్నసుమపరాగం బడరెన్. 194

క. తరువుల నెక్కెను బుప్పొడి
బురుజులపైఁ బొరలెఁ దీవపూవులువఁ దా
నురవడి లాగెను వనిఁ గే
ళిరతి వసంతుండు సేయ లేఁ డెట్టిపనుల్ ? 195

క. ప్రాయం బూనె వసంతుఁ డ
మేయమదభ్రమరవందిమృదుగీతయశః
స్థేయుఁడు ముకుళస్తనవ
ల్లీయువతుల కిడఁ బ్రవాళలీలాఽధరమున్. 196

క. లీల మరురాజ్యభారముఁ
దాలుచుచైత్రుఁడు పికీరుతముభుజ మొకఁడై
క్రాలఁగ లవంగవనవా
తూలం బితరంబుగా నుతుండై వెలసెన్. 197

1. వనలక్ష్మి.



క. యమదిగనిలరాశీకృత
సుమరేణూత్కరము లెల్లఁ జొప్పు సెడని వై
సమదమధుద్విరదంబున
కమరించినపాంసుశయ్య లనఁగాఁ బఱఁగెన్. 198

క. రోలంబాఽరవనిబిడిత
పాళీవాసంతికానవప్రసవము చై
త్రాలంకారోదయవే
ళాలసమానశుభశంఖలలితం బయ్యెన్. 199

క. శీతర్తువు [1]కడ సన సూ
ర్యాఽతపతప్త మగుచందనాచల మొందెన్;
శీతవిధి వీజనోపమ
తాతతచందనకిసల[2]సదాగతివలనన్. 200

క. చేతస్వినీమనసునను[3]
భూతిన్ విడి పాఱుమానమున్ జీవముతోఁ
జాతురిమైఁ బట్ట ననాన్
వాతము మధుహితము దెసలఁ బట్టి భ్రమించెన్. 201

క. అవశవిరహిణీకంఠో
ద్భవలీలాపంచమమున భావజుకార్యం
బవితథగతి జరిగెన్ బు
ఖ్యావితతిఁ బికపంచమమున కమరె యశంబున్. 202

క. అందెకు నందెకుఁ గాల్పల
మొందించినకతనఁ [4]గాంచనోత్కర మొప్పెన్;
విందుగ మధుసామంతుఁడు
కందర్పేశునకుఁ బఱచు[5]కాంచన మనఁగన్. 203

1. దూరము. 2. వాయువు. 3. అనుభవము. 4. సంపెఁగలు. 5. బంగారము.

క. చరియించె నామ్రతరుమం
జరులన్; జుంబించె సకలనవ్యకలికలన్;
తరుణీగణమధ్యస్థుని
కరణి క్షణం బేని నిలువఁ గన దలి యిటులన్. 204

క. ఏకైకాఽఽశ్లేషణలఁ ద్రి
లోకైకగురుఁడు విలాసిలోకమునకుఁ; దాఁ
బై కిడి వనసర్వస్వా
శోకదళకరాల మధుఁడు సూడఁ దరిభటున్. 205

క. తన కగుగజగమనాపద
వనజతలక్షతిఁ గొలందివగ యని తలఁచెన్
గనుచు నశోకము వకుళము
గనులలనావదనసీధుకాంక్షను మిగులన్. 206

క. రటదళిపటలీకంకణ
పటుచూతనగాఽఽళిబాహుపంజరమున సం
ఘటితపికమృదునినదలం
పటుఁ డై హితుఁ గంతు మధుఁడు వడిఁ గౌఁగిలిడెన్. 207

క. వికచశ్రేణీస్థితచం
పకతతకేళివనమధ్యభాగము లొప్పెన్
నికటాఽఽయాతవిరహిణీ
ప్రకరకనకకాంచికావిభాసితములటుల్. 208

క. తమపల్కుతోఁ దలఁకులీ
లమెయి నెగయుకుండలంబులన్ విరహిణు లొ
ప్పమరిరి విసరినటుల్ పై[1]
కమునకు మర్మాఽఽర్తిఘూర్ణగళపాశములన్. 209

1. పికసమూహము.



క. మోదుగుపూములు సూపుచు
మోదమునన్ లేఁతలతచబుకును విసరుచున్
[1]బూదొనజోదాన విరహ
వేదనఁ జందనమరుత్తు పెనుపన్ దొడఁగెన్. 210

క. ధరణీరుహయోధులు సుమ
శరవర్షముఁ గురియు చుండఁ జైత్రాఽఽఖ్యమధు
ద్విరదాధిరూఢుఁ డయి స్మర
ధరణీపాలుండు మిగులఁ దాల్చె గరువమున్. 211

క. చిత్రీకృతకాననుఁ డగు
చైత్రుం డద్భుతసుమాస్త్రసంతతిఁ గూర్పన్;
[2]బత్రధిభరమున కోడి స[3]
పత్రాఽఽసనుఁ డయ్యు మరుఁ డపరముఖుఁ డయ్యెన్. 212

క. శృంగారిణీధవళితా
భంగప్రోచ్ఛలితదశనపంక్తిద్యుతి ధౌ
తాంగుఁడు శశి యైనటు మె
ల్లంగఁ దదంశులు ప్రసాదలాభముఁ గనియెన్. 213

క. మదనునకు మిత్రుఁడవు చై
త్ర! దళితతనుఁ డతఁడుగాఁ జెదరదు తనువు నీ
కిది యెట్టుల? తెలిసెన్ లోఁ
గుదురు విరహిణులఁ గలంచఁ గోరునెప మగున్. 214

క. విరహిక్షయదీక్షాఘన
దురితునిఁగా నిన్ను దలఁచి తొడరదు నిజ మీ
శ్వరునేత్రాగ్నియు నాయక
విరహితలయఖండపాపవృద్ధికతమునన్. 215

1. మన్మథుఁడు. 2. అంబులపొది. 3. ధానుష్కుఁడు.

క. హరసమరస్థితశంబర
హరుపార్శ్వము వీడి క్షాత్ర మఱి పాఱితి వొ;
స్మరునియనంగునిముందర
మఱల నిలిచి తిప్పు డెటుల మధుచండాలా! 216

క. లోకమువెలిగాఁ దిరిగెడుఁ
గోకిలములు నగము గాలుకొఱవినలుపు లొ
మైకలుములఁ గలుషస్థితి
నీ కౌతత్సంగ మిచట నెఱి ఫలియించెన్. 217

క. దోసము గలిగినను నినుం
బాసి మరుం డుండమికి సుమా! యిది కత మౌ;
నీసున విరహిణులఁ గలఁచు
దోసపుబరు వొరుఁడు పూన దొరకొనమిఁ గదా! 218

క. ఈరీతి వసంతాఽగమ
మారన్ మిఱినవిరాళి నతిపీడిత లౌ
వారిజనేత్రల కొదవెను
సారెకు నచ్చెరువుఁ గూర్పఁ జనుచేష్టితముల్. 219

క. యువజనగంభీరత చా
టువచోవిముఖత విభవపటుత్వ మితరకై
రవదృగ్గదచిహ్నము మా
నవిముఖులు దలంతు రది గుణ మని దొసఁగునన్. 220

చ. వెలఁదులమానపున్ముడుల విప్పఁగఁ జెప్పెను బుంస్కోకాఽళికిన్,
మలయసమీరముల్ విభుత మైకొనఁ దీర్చెను గేళికర్మలోఁ,
గలయ జగత్త్రయిన్ విరహకంటకకౌశలి యైనకంతుక్రే
వల వెలసెన్ మధుండు సచివస్థితి దుర్ఘటముల్ ఘటింపఁగన్. 221



చ. అలులకెసంగెఁ దేనె పువులందు విలాసముగా మునుంగఁ; గో
కిలములకంఠగోళములఁ గీల్కొనె స్థాయితఁ బంచమంబు; వ
ర్తిల్లెఁ ద్రిజగజ్జయద్భటతఁ దీరి మధుండు జగజ్జయైకదో
ర్బలపరిపాలనద్యుతికిఁ బ్రార్థన లేకయె కామరాజుకున్. 222

చ. అలులు జగద్వియోగిదళనాఽయతు నుజ్జ్వలబంధుఁ జైత్రు వం
దులు బిరుదాఽళిఁ బేర్కొనుచదు ర్ధగఁ బాడెను; గౌతుకంబునన్
వలపులతేఁడు మే లయినపౌష్పధనుస్సు ధరింప నిప్డు గో
కిలలలనారుతంబు సెలఁగెన్ ద్రిజగజ్జనమానమోష మై. 223

చ. పికరుతిరుష్ట యై చెఱకువిల్కొళ నేర్చు; దవాగ్నిఁ గోరు ఖే
దకలుష యై పటీరగిరిఁ దత్పవనంబున కోడి; దుర్మనో
వికలతచేతఁ గొంత పువువిల్తు వసంతుని వేర్పరింపఁ గో
రిక గల దౌను; నేమి యొనరింపదు నీవు లభింపకున్నచో? 224

మ. భ్రమరీవిభ్రమభోగయోగ్యమధువుల్ ప్రాపించె గుర్వెందలన్;
యమదిగ్వాయువు లింతయైన శ్రమ వాయన్ జూడ వొక్కప్పుడేన్;
సుమరేణూత్కరముల్ విలాసగిరు లై పొంపొందె భృంగాఽళికిన్:
సుమబాణాఽప్తవసంతునందు విరహాసుస్థాయి యౌ నెట్టులన్. 225

మ. పలుపూలన్ దరు లెల్లచోట్ల నెసఁగెన్ భ్రాజిష్ణు [1]భస్త్రాఽకృతిన్
వెలసెన్ లోకము ఖడ్గరుజ్మయముగా భృంగాఽవళుల్ ప్రోవు గన్,
బొలిచెన్ జైత్రుఁడు సాధుసజ్జుఁ డయి గెల్పుం గూర్చునారాచముల్
గలుగన్ జేయ జగత్త్రయీప్రహరణాఖర్వోత్సు[2]కోగ్రారికిన్. 226

చ. మలయమువెల్వలన్ మలయమారుత ముండమిఁ గోరెదున్; సఖీ
కలకల మున్ను దూరము పికంబులఁ దోలఁగఁ గేళికావనిన్:
గొలుచును దేఁటులన్ గలయఁ గ్రోలఁగఁ గేళివనాంతవాసనల్
పొలఁతి యొనర్ప దేది? యసువుల్ నిలుపన్ బెడబాటువేళలన్.

1. అంబులపొది. 2. మన్మథుఁడు.

ఉ. దోలల నూఁగుద్రావిడవధూటులశ్రోణులవేగ మీఁగుచున్;
లాలితసింహళీవదనలబ్ధకనద్ఘనసారవాసన
న్దేలుచుఁ; జందనాచలవినిర్గతవాతవితానముల్ విలా
సాలసలోకజాలసముదంచితసేవలఁ గాంచఁ గల్గెడున్. 228

శా. [1]ఉల్లోలించుచు నారికేళఫలకుక్ష్యుద్యన్నినాదాంబువుల్,
[2]బల్లార్పించి కవేరజాతటసురాభాండంబులన్ [3]దాటులన్,
జెల్లన్ నల్లననంట్లు దాఁక శిశిరస్థేయంబు లీతెమ్మెరల్
ప్రోల్లాసించెను ద్రావిడీసితకపోలోత్క్షిప్తవేగంబులై. 229

శా. రోలంబాఽళి నధిజ్యమన్మథధనుర్భంగంబు నొందన్ లతల్
త్రైలోక్యైకజయాస్త్రతన్ గనవ? కోదండంబునన్ బుష్పముల్;
దోలాందోలనకేళిలోలవనితాస్తోమప్రయుక్తాస్త్రుఁ డి
క్కాఽలానన్ జలలక్ష్యభేదనవిధిన్ గంతుండు గర్వించెడిన్. 230

శా. కేళీలల్ మదపుష్పలిట్సుమరసాఽకీర్ణంబు లయ్యెన్; విట
ప్యాళుల్ గూలుభయంబుఁ దెల్పెను లతాంతాత్యంతభారంబులన్;
దూలెన్ దైన్యముఁ జైత్రుఁడున్ [4]బదరసందోహావ్యయాధ్వంబునన్;
గ్రాలెన్ లక్ష్యములం దలక్ష్యములనున్ గాముండు విల్వంపఁగన్.

చ. నవయువకుండు చైత్రుఁడు ఘనం బగుచిత్రలిపిన్ గడింపఁగా
నవసుమవర్ష మేవని దనర్ప దజపాంగపువర్షమున్ బలెన్;
దవులుచు దోలలన్ జెలఁగుతన్వులబల్కటిగుబ్బ లూఁచులం
కవలనిగాలికిన్ వలను గా వెటు మానమహీజభంగముల్? 232

మ.స్ర. దనుజేంద్రోద్యానలీలాతరుతలగతసీతాపదాంకప్రయుక్తిన్
ఘనసారద్వీపభూభృద్గహనతలరజస్కంబులై కేరళస్త్రీ
జనకేళీవీటిచూర్ణస్ఖలితముఖహృతశ్రాంతిమై మోద మొందెన్
ననవిల్కారుండు గెల్పొందఁగ మెయికొనుచు న్దక్షిణాఽశానిలంబుల్.

---

1. కల్లోలించుచు. 2. బల్లు మని ధ్వనింపఁ జేసి. 3. తాటిచెట్లు. 4. అస్త్రము.



మ. ఎది చూతాంకురకందళీకబళనాహీనశ్రవఃపేయమై
కదియున్ గాయజజైత్రపత్త్రితం గన్నంతనే; పంచమం
బదె తాలుస్థలసంకటాటనముచే నామూల మున్మూలమై
నద[1]దన్యేధితకామినీగళబిలాంతస్సీమలన్ వీడెడున్. 234

క. విరహవిధురవామాజన
పరంపరాప్రహితచిత్తభవలేఖవచః
పరిమళములు సుమవేళా
వరవర్ణన లిడిరి పతికి వందు లిటు దగన్. 235

## తోటకవృత్తము

కరుణా వరుణాఽలయ! కామితదా!
గిరిగహ్వర సుందరగేహ! హరీ!
కరి-శత్రుసుతావన! క్రమముఖా!
[2]ధరశాయి! నృసింహ! సదావిమలా! 236

ఇది శ్రీత్రిభువనమల్లదేవవిద్యాపతి-కాశ్మీరక-
భట్టబిల్హణ మహాకవివిరచితవిక్రమాంకదేవచరిత
మహాకావ్యంబునకు శ్రీవేంకటేశ్వర
శ్రీనరసింహదేవపాదపద్మాఽరాధన
సమాసాదితకవితావైశారద్య
'ఆంధ్రబిల్హణ' బిరుదాంచిత
లక్ష్మణ-విశ్వనాథ
కవిసోదరాంధ్రీకృత
మహాప్రబంధంబునందుఁ
దృతీయాఽశ్వాసము
సమాప్తము

---

1. కోకిలము. 2. (తిరుమల) పర్వతమునందు వసించుదేవుఁడు.

# విక్రమాంకదేవ చరితము

## చతుర్థాశ్వాసము

క. కరివర-రిపుసుతపాలా!
ఉరుకలిదానవవిదారణోద్యత[1]వాలా
కరుణారసభర! వేంకట
గిరి-గిరిబిలవాస! హరి! నృకేసరి! దేవా! 1

క. ఈలలి నలినవిశిఖసఖు
కాలం బారంగ మిగులఁ గర్ణోత్సవ మై
చాలఁగ నబ్బుర మొదవెడు
జోలిన్ విక్రమనృపాలసోముఁడుఁ వినియెన్. 2

ఉ. [2]కంజసపత్నలేఖ కెన గాఁ దగునంగ[3]విభాతి, మారమృ
త్యుంజయమంత్ర మై, మనసిజోద్ధృతజైత్రపతాక నా జగ
త్పుంజదృగాళికార్మణతపొల్పుఁ గనన్ గరహాటభూమిభృ
త్కుంజరుకూర్మిపుత్రి పొలఁగున్ గనుఁ బేరునఁ 'జంద్రలేఖ' నాన్. 3

క. వరవర్ణిని యగువిద్యా
ధరకన్యక కామె కిందుధరునాన స్వయం
వరము జరుపఁ బడు; నా
క్కరునిన్ గూరిచి యెఱుంగఁ గా దెవ్వరనాన్. 4

క. అంగన దాలిచి మించన్
శృంగారముదైవతంబు చేతోభవహృ
ద్రంగము విభ్రమములకు న
భంగప్రాంగణము నైనవయసుదయంబున్. 5

1. ఖడ్గము. 2. చంద్రుఁడు. 3. కాంతి.



సీ. లావణ్యరత్నాకరావిర్భవన్మణి
శ్రేణిగాఁ దన్నఖశ్రేణి యలరు;
నసి గలతమముందఁ బసిఁడియందెలఁ గిన్కఁ
గనియె నా నెఱు పగుకాళ్ల దనరు;
వదనేందుచంద్రికావరణము లై పాద
సంగతాబ్జిని దాఁచుస్తనము లమరు;
మరుకేలుదోయిడంబముఁ దెల్పుపల్కనా
నెలతాజిగిని మించుమొల రహించు;

గీ. హస్తసర్వస్వహరణ నిభాళి కంటఁ
జనని[1]మాతంగతను గూర్చుసక్థులు దగుఁ;
గలికి కల లేఁతఁదనము వే తొలఁగి లలిగఁ
గ్రొత్తజిగిజవ్వనము గూడికొని రహింప. 6

గీ. లలనకాల్గోరురతనాల లక్కపూఁత
నెలకు గందంపుఁబూఁతచేఁ దెలుపు సేఁత;
జాగ్రదబ్జరమాహరచ్చరణములకుఁ
జిత్రమే! మత్తగజగతిస్తేయరీతి. 7

చ. మునుఁ గనఁ బోనిరాగమునఁ బొల్పుపదంబుల కొందెఁ బూర్వప
క్షనియతిఁ బల్లవోచ్చయము; కంజము లొందెను బ్రత్యుదాహృతిన్;
గనియెడి భేదమున్ బదయుగంబునడన్ భ్రమమాన[2]మానసం
బున నెల వైనహంసచయముల్ మనముల్ మిగులన్ గలంగఁగన్.

ఉ. నల్లనిజాలయందెలు ఘనంబుగ నూనతదంఘ్రు లంత శో
భిల్లె నితంబభారపరిపీడ బొమల్ ముడి వెట్టె నాఁగ; రా
జిల్లె బెడంగుగాఁ బసిఁడిఁ జేసినయందెలచాలు జంఘ ల
న్వల్లుల కూన్పుకుంకుమముపాదు లనా నలినాక్షిపట్టునన్. 9

1. చండాలత్వము, 2. మనస్సు-మానససరస్సు.

క. రంభోరూరుద్వయమున
రంభాస్తంభములు గనెఁ బరాభవము; నుపా
లంభన గా కటిమృదువులు
జృంభించునె [1]జడము లైనఁ బృథుజయభేరీ. 10

ఉ. త్రుంగితిఁ ద్రుంగితి నని యరుంతుద ఫూత్కరణం బొనర్చు న
య్యంగన ‘[2]కాంచి’ సారెఁ బెను పందుపిఱుందువెతన్ రుతించె నాన్;
జెంగటిచేడెపిండు తమచేతులు సాలమిఁ జాలఁ దూలుచున్
సంగతముం బొనర్చె నొకదాయగ మేఖలఁ దత్కటిస్థలిన్. 11

చ. [3]శుచికనకంపువేది, నవసూనశరాసనరంగపీఠమున్,
ప్రచురనవాంగ[4]సౌష్ఠవవిభా[5]ఘన మౌజఘనస్థలంబుఁ బా
నుచు మొలనూలుఁ గట్టఁ గడు నోపదుచున్ బరిచారికాజనం
బుచితము గా ద టంచు జఘనోద్ధతి నింద యొనర్తు రేఁపునన్. 12

ఉ. నాతి నితంబగౌరవమునన్ గడుఖేదము నొంది కేళికా
కౌతుకవేళలన్ విడుచుఁ గందుకమున్ గదలంగ లేక; వి
ఖ్యాతతదీయదుర్గజఘనాయతి విస్మృతి కాస్పదం బగున్;
శీతకరాస్య మారునకుఁ జెల్లు సుదూరపతత్పృషత్క మై. 13

సీ. రశనామణిప్రభాత్రస్తతిమిరలేఖ
వలె నల్లగా నాభిబిలము సొచ్చె;
మొల[6]విదూరంబునఁ బొలిచి చన్నుల నాను
రతనంపు[7]వాగలరమణ నొప్పెఁ;
గాయజకాంచన[8]కటకనిర్గత[9]యావ
ధారగా నాభిచెంతన యెసంగెఁ;
[10]గడెముఁ గూడినమరు[11]గౌరుసంకెలఁ బోలి
బొక్కిలిసుడినుండి మున్ను సాగె;

1. లం-డల కళేబరమాచేత 'జడము' అనియును నర్థము. 2. ఒడ్యాణము. 3. శృంగారము. 4 లావణ్యము. 5. సంఘాతము. 6. వైదూర్యమణులు పుట్టుచోటు. 7. శలాక, 8. కంకణము. 9. లక్క. 10. నిగడము. 11. ఏనుఁగు.



గీ. నాభిమండలమును జొచ్చి నవగభీర
తాప్తతాత్పర్యము వహించె ననఁగ నెనఁగె;
వల్లరీశ్రేణికాలీల నుల్లసిల్లెఁ
గలికిసొంబఁగారునూఁగారు విలసితముగ. 14

ఉ తుంగకుచద్వయంబు ననతూపులవింటను నూఁది కంతుఁ డె
క్కంగ ఘటిల్లుధన్వ[1]టనికల్పితముద్రగ నిల్చె; నబ్జజుం
డంగనసృష్టి సేయుతఱి నందపుసంపద యంత మొందఁ బూ
ర్తిం గనఁ జేయ లేక బిలరీతిగ నిల్పెను నాభి నాఁ దగెన్. 15

చ. అల మదనాజ్ఞలన్ వరుస యౌవనలక్ష్మి లిఖింపు చుండఁ బొ
క్కిలి యనుబుడ్డినుండి వెలికిన్ దొలఁ గొందుమషీద్రవంబుగా
మెలఁగుచు [2]నారు మీఱె నిశి మిక్కిలి లోఁ దగుపొక్కిలిన్ బరన్
గలిగెడుశంక మన్మథుఁడు కౌనునఁ దిన్నఁగ నిల్పుపాద మై. 16

క. [3]ఘననిభకుంతల దాల్చిన
ఘనమౌక్తికహార మొప్పుఁ గనె నాభ్యా[4]వ
ర్తనలావణ్యజలోద్ధృతి
కను వగుఘటియంత్రగుణమ యని యుపమింపన్. 17

చ. స్తనయుగభారమున్ గుఱిచి శంకితభంగవలగ్నసీమ గూ
ర్చినకనుబొమమోడ్పు[5]పరిరీతి యనన్ ద్రివళీక్రమం బగున్;
దనురహితత్వ మేర్పడుట దర్పకుతద్వనితావళీత్రయం
బనుతనదారిమెల్లగయునార్తి యగున్ రతిమాత్రవేద్యగా. 18

క. ఆరోహింపన్ జాలని
దై రహిఁ గనుకుచతటంబు నవలఁగ నిడుచున్
దే రఱుగ మారుఁ డూన్చిన
దారులదా యనఁగఁ ద్రివళిదామము వొలిచెన్. 19

1. ధనుస్సుకొన. 2. రోమరాజి. 3. మేఘము. 4. సుడి. 5. పంక్తి.

క. స్తనభరసమున్నతిక్రమ
మునఁ జైఁ పైఁ బొడుపు సూపుముక్తాఫలహా
రనిహితముద్రావళిగాఁ
గనకాంగివళిత్రయంబు కనకనలఁ దగెన్. 20

క. వనజనయనయనదుఁగౌనుఁ
గనుగొని లావణ్యపూర్ణఘనకుచములకున్
జనుధారి నలువ త్రివళిన్
జన రానివిధాన విషమసరణిన్ నిలిపెన్. 21

తే. గీ ఏయెడఁ గృశాంగి కార్ముకవృత్తికిఁ దగె
నయ్యెడనె నొచ్చెఁ దృఢముష్ట్యనంగుచేత
బరు విడుచనుల్, రణత్కాంచి పౌరుషింపఁ
గౌనుకార్శ్యం బెటు సహేతుకంబు గాదు! 22

చ అతివనిరంతస్తనయుగాంతరమందు [1]వినోదకుండలీ
కృతదృఢచాపదండుఁ డయి కీరతురంగుఁడు మించుఁ జిత్ర మౌ;
మనిఁ దలఁతున్ వధూటికుచమండలి దాఁ గఠినత్వ మూనఁగా
రతిపతికిన్ దదీయహృది రాజిలు నంచు నకష్టసాధ్య మై. 23

క. చిలుకస్థల మొరయఁ గుచ
స్తబకద్వయ మంగనాఽవతంసము నర్మ
ప్రబలోక్తులఁ గనఁ జాలదు
[2]నిబికీనహ్రీనతాఽస్యనీరజ మెపుడున్. 24

క. తనయౌవనలక్ష్మికి మును
మును వచ్చినమదనుఁ జుట్టమును నున్ముఖుఁగా
స్తనయుగ్మాంజలిబంధం
బున నానరుచుసరణిఁ దోఁపఁ బొలఁతి రహించెన్. 25

1. క్రీడ. 2. నిబిడము.



క. కలికిచనుంగవనిందకుఁ
గలరె సమాధానవిధి ? పెకలుఅవికలతన్
నలలితపిధానతాస్థితిఁ
గలిగింపన్ జాల కున్కి కారణ మగుడున్. 26

ఆ. వె. దంతికుంభము లగు దంభయుతంబులు;
కలశము లగు మందకౌశలములు;
చక్రవాకము లగు నరవి వరాకముల్;
లికుచకుచకుచంబులకును ముందు. 27

చ. వదనసుధాంశుచంద్రికల వర్ధిలువెల్లువఁ దేలియాడుచున్
గదియువలిన్ వడంకుగతిఁ గాంతచనుల్ దమలోన రాయుచున్,
మదనువ్రతంబు నిక్కముగ మౌళిమణిద్యుతికిన్ నిరంతరో
ద్వదనముగాఁగ నిల్పి గనుపట్టుఁ గొలందిఁ జరించునట్టులన్. 28

ఉ. సారసనేత్ర దుర్వహకుచద్వయమండలమున్ ధరింపఁ, బెం
పారె నఖర్వగర్వకుధరాగ్రతలస్థితి పుష్పధన్వికిన్;
దీరెను మిన్న లౌచనులనీడ తదీయముఖేంద్వగోచరో
దారవళిత్రయీతటసమాశ్రయలీన[1]తమిస్రలేఖ యై. 29

చ. సుదతిగళప్రదేశమున సూత్రిత మైనటు రేఖికాత్రికం
బుదయముఁ గాంచె [2]గ్రామమధురోర్జితత్రిస్వరసన్నిధాన మై;
మదనున కయ్యె లోకజయమంగళ[3]కంబుగ నగ్గళంబు పెం
పొదవుముఖాంశుసాగరసముద్భవ మై కడుసుందరంబుగన్. 30

ఉ. ఆపె విపంచిపంచమరవామలచాతురి స్వీయకర్ణసం
వ్యాపిసుధాప్రపూరకలనామితకాకలికాస్వనాళిచే;
నాపికవాణిపాణియుగ మందెను సౌమనసాశుగాసన[4]
వ్యాపృతిఁ గాంచుమేటిధనువందు నశోకకిసాలసామ్యమున్. 31

1. చీఁకటి. 2. షడ్జాదిస్వరములు. 3. శంఖము. 4. పుష్పచాపుఁడు.

క. నీవదనేందున కెదురుగ,
నోవనితా! నేను నిల్వ నోప ననునటుల్
[1]భావినిపాణియుగిన్ హే
లావనజం బూన్చెఁ బటువిలాసస్ఫురణన్. 32

తే. గీ. రతిపు[2]శౌండీర్య-గర్వనిర్వాహమునకుఁ
దగెడు[3]ప్రత్యాశగా బ్రహ్మ తన్విహస్త
తలమునందు లిఖించె నుదారదీర్ఘ
మగుచు నొప్పునాయూరేఖ నక్కజముగ. 33

తే. గీ. పపునునిగ్గుల నిగుడించుపక్ష్మలాక్షి
బాహులావణ్యమిళితభర్మవలయ
మల సఖీజన మాశ్లేషములను దమదు
మేనఁ గాఠిన్య మొరయ నద్దానిఁ గంద్రు 34

ఉ. కాంచనకంకణంబు సుమగాత్రిప్రకోష్ఠతలంబునందునన్
గాంచనకంజనాళ మనఁ గ్రైఁ గదియంబుగఁ నొప్పె సొంపుగాఁ
గాంచనకంకణావళిఁ బ్రకాశిలెఁ దద్భుజవల్లి తూణికా
[4]కాంచనక్రమమౌర్వి సుమకార్ముకుఁ డింపుగఁ జుట్టెనో యనన్. 35

చ. అలరు వెలందివ్రేళల హాయల్ వెలిఁ జిమ్మెడునుంగరాలప్రో,
వలరులవిల్తునంపగమి హత్తినసూక్ష్మశరవ్యముల్ వలెన్;
జిలుకలకొల్కికేలునఁ బసిండికడెంబులచాలు గ్రాలె నా
చిలుకవజీరుఁ డుల్ల మనుజింకను గట్టగ నిల్పుత్రాళ్ల నాన్. 36

ఉ. సారసమిత్రుఁ [5]దంశువున సారసతస్కర మౌటఁ గట్టె నా
సారసనేత్రహస్తము వొసంగె సహాటకకంకణస్థితిన్;
సారసనేత్ర మూపు లల చన్నులవ్రేఁగున దవ్వుఁ బర్వ వి
స్ఫారసపద్యుదారరుతి నల్పుకడెంబులఁ బోరనాఁ దగున్. 37

1. స్త్రీ. 2. అహంకారము. 3. ఆడియాస. 4. సంపెంగ. 5. ప్రొద్దు-కిరణము



చ. లలనభుజద్వయంబు సరళం బయి యుండిన మోదుతూండ్లశ్రీ
విలసన మాక్రమించు నెటు; విస్తృతచారుకుచద్వయంబుచేఁ
దలఁగఁ బరస్పరం బయినదర్శన మెట్లు మృణాళికాయశం
బులఁ బొలియించుకార్యమున మూఁడును మంతన మాభుజాలకున్.

సీ. తనయరుణత మోముఁదమ్మికి సిరిఁ గూర్చి
పరికెంపుదివ్వెలమురువు డుల్చి
తనసోదరత నెలఁ దనరుకౌస్తుభ మన
మోవిని మంకెనపొలుపుఁ దాల్చి
తనయునికి నాసాఽగ్రమున భర్మనాశికా
విచ్యుతమాణిక్యవిభవ మంది
తనమోము రేవెలుంగునకు ననిందిత
సంతతోదయసంధ్యదాయ మెలఁగి

తే. గీ. వధువు వాతెఱ లావణ్యవనధియందుఁ
బొలుపుఁ గనువిద్రుమం బనఁ గులుగు నెనసి
దొండపం డనఁ జిలుకలతుటుము బ్రమయ
రాచకొమరులలో రాగ మేఁచ నెసఁగు. 39

క. తనప్రాముఖ్యాల విడి నూ
తనశరముల నినుచునిచ్చ దర్పకుఁ డెలమిన్
దనదాన నధోముఖంబుగఁ
దనరించినయటుల [1]నాస తన్వికి నొప్పెన్. 40

చ. పొలఁతుకకన్నుఁ గల్వసిరి బ్రుచ్చిలె నా నది క్రొత్తయే? చెవిన్
బొలిచెడుకల్వ యేమినుడువుల్ వచరించు? నెఱుంగ; బోదజం
కలతవులంబు చూపునకుఁ గల్గక యుండిన నెట్లు దూఁగు వి
చ్చలవిడిగాఁ జెవిన్ బొదువుచక్కనిలేగఱికన్ జవిన్ గానన్. 41

1. ముక్కు.

క. శ్రుతిమార్గమునన్ దద్దృ
గ్ద్వితయంబు ప్రకామధవళదీప్తి నదరఁ ద
ద్వ్యతిరేకాఽకృతిగా నే
గతి నగుఁ గృష్ణానురాగకలనంబందున్. 42

క. శృంగారిగురుం డగున
య్యంగజుఁడుం గూడఁ గుతుకి యగుట వినుఁడు వా
లుంగంటిచెవులకున్ జను
తొంగలికన్నులకు శిష్యదోహలతఁ గనున్. 43

క. సౌందర్యపాత్ర మగువద
నేందువునన్ హరిణసంగ మెనయుభయమునన్
సుందరిశ్రుతి[1]పాశంబుల
యందుం [2]బాశములఁ గూర్చె ననఁగా నొప్పెన్. 44

చ. ఇంచుక నెమ్మోఁ జిమ్మ[3]బొమలిందువెలంది రహించె శైశవా
భ్యంచితకేళి లాఁపునవయౌవనమున్ బెదరించునట్టులన్;
జంచలనేత్రదృగ్యుగము సాగెకుకుండలరత్నకాంతిఁ దూ
లించనుబోలె శ్రోత్రయుగళీతల మెక్కుచు నిక్కు చుండెడిన్. 45

క. నాసా[4]వంశచ్యుతము
క్తాసదృశపటీరబిందుకలితనిటల మై
యాసకినాసావంశో
ద్భాసితహరితదళయుగనిభభ్రువులఁ దగెన్. 46

క. తనయుచెలిమి నెనఁగెడు[5]గుహ
ఘనహనబర్హి గిరిజగాఁ దలఁచి మదిన్
దనతలపై నెక్కొనా నాన్
దనయలకభరంబునన్ సుతను విర వొందెన్. 47

1. శ్రోత్రములు. 2. త్రాళ్ళను. 3. కనుబొమలు గలయంద మగుకాంత. 4. వెదురు. 5. కుమారస్వామి.



మ. తనుఁ దానే కయిసేయుఁ జెక్కిలి విదగ్ధత్వప్రగర్వంబునన్;
గనుఁ దాళీదళరక్తిఁ, బైఁడితొడవుల్ కైసేయుటల్ మానుచున్;
జనుఁ జెండాటను వీడి శారికలశిక్షన్ మోదముం గాంచఁగాన్;
దనుఁ దా నాతి యలంకరింపకయ సౌందర్యమ్మునన్ మించెడున్. 48

చ. సరసిజముల్ ద్విరేఫతతి [1]శస్త్రిగఁ గుక్షి ధరించు; నైకధా
తళుఁ గని మింటిముంగిటినిఁ దాఁటఁగ వచ్చును జందురుండు; బి
త్తరి భువనత్రయీరుచివితానము మోమున దొంగిలింప వం
దురుఁ గన కుందు నెద్ది ? స్వతనూసుషమాపునరాగమేచ్ఛచే. 49

శా. సాక్షాత్కంతుధనుస్సు భ్రూయుగమునన్ సౌత్రాత్రమున్ బూను, యో
గక్షేమంబుల నల్లకల్వలయెడన్ గన్దోయియున్; దోయజా
తాక్షీలోకజయత్వరాఽన్వితశరీరాంగాశ్రమోలన్ గడున్
లక్షించున్ మలినస్థితిన్ నఖిల[2]కల్యాణంబు మూలాఽకృతిన్. 50

చ. కనులకుఁ గర్ణయుగ్మమునఁ గల్గను మేరలపోరు నిచ్చలున్;
స్తనయుగరుద్ధహృత్స్థితి ఝషధ్వజుఁ దూను బలాత్కృతిన్; బలం
బునఁ బడ వైచుఁ గ్రందనముఁ బూన్మొలనూల్దవుగా నితంబ; మం
గడమెయి నిట్టులన్ జయము గాంచును జవ్వనపుంబ్రవేశముల్. 51

ఉ. ధోలఁ గదల్మొలన్ గనుచుఁ దొయ్యలి సిగ్గెనయున్; గపోతరా
వాఽళి స్మితాఽస్య యై దెసల నారయు నిక్కుచు; ముండ్లతాకిడిన్
గేళవనిన్ సహింప కటఁ గ్రీడ యొనర్పఁగఁ బోదు; మౌగ్ధ్యముల్
వ్రాలఁగఁ జేయుయౌవనము [3]వామయెడన్ గనుపట్టు [4]సజ్జ మై. 52

చ. నటనము నేర్పుసాకున ఘనస్తని గాత్రసమర్పణంబు నే
ర్పుట, గళకుంఠరీతి కడఁ గాంచుట లాలితపంచమధ్వని,
న్పటునుతి యేల ? సర్వలలనాజనమండన మయ్యెఁగా సఖీ
పటలగురుస్మరాల్పతరబాధనె భామిని నేర్చె ప్రౌఢతన్. 53

1. చురకత్తి. 2. బంగారము. 3 కామిని. 4. అలంకృతము.

చ. స్తనతట మున్నతంబు. నడుచక్కి కృశంబు, మొగంబు నిర్మలం
బును, బిఱుఁదుల్ వధూటిగురు[1]పుష్పపృషత్కమృగేంద్రపీఠి, యీ
యనువున నాల్గు నామెయెడ నబ్జజుఁ డూన్చి సుగద్యపద్యథం
గిని నుతిఁ బూన్చతుర్ముఖతఁ గీల్కొనెఁ దృప్తిన టంచు నెంచెదన్.

ఉ. ఈగతి వీనువిం దగు[2]ప్రవృత్తిని వించుఁ మదిఁ దదీయగా
థాగతకౌతుకంబు మఱి తాల్పుచభుక్యనిచెంత జ్యారవో
ద్యోగదలుండు శ్రోత్రమునమండి తొలంగఁగఁ గమ్మ యమ్మరుం
డాగజయానవృత్తమునె యాదటఁ దాఁ జిగురింప నెక్కొనెన్. 55

క. అమ్మలు పమ్మసుమేషుగు
ణమ్మరవ మ్మనెడుగర్జన మ్మదరఁగ వా
కొమ్మ నృపమానసమ్మునఁ
బిమ్మట రాయంచపెంటివిధమునఁ జొచ్చెన్. 56

క. బాలప్రవాళనిభరుచి
బాలాపాదంబు సోఁకఁ బాటిల్లె నిలా
పాలస్ఫటికాచ్ఛమనః
పాళిన్ రక్తిమ ముపాధిభవమో నాఁగన్. 57

క ఆమనికరువలి భీతిలి
సోమునికరదండములను సోలునితఁడు, గాఁ
డామన్మథభూమీనా
థామర్షభీభీషిఒఒశి నార్తుఁడు దేనన్ ? 58

క. రేలగుణంబులఁ బగలన్
దాలిచి దినసుతుల రేలఁ దవిలి నుడువుచున్
రేలుంబవళ్ళు రెండును
గ్రాలనియిలనే నృపుండు క్రమమునఁ గోరెన్. 59

1. మన్మథుఁడు. 2. వార్త.



శా. ముల్లోకంబుల మోహముల్ గొలుపఁగాఁ బూన్విద్యనాఁ బోలుత
ద్వల్లీగాత్రినమాశ్రితిన్ ఘనజయాఒస్త్రన్ గాంచి కంతుండు వే
వి ల్లెత్తెన్ విలుకాఁడులందు మునుగాఁ బెం పొందునారాజుఁ దా
దిల్లన్ జేయ నమేయలీల నిజపాండిత్యంబు స్తుత్యంబుగన్. 60

క. తనకాంతిచేత హిమధా
మునికాంతి నడంచుదివసముఖరమవలె గో
ము నిగుడ్చుగరితచే నాం
దెను బాండిమ మవనిపప్రదీపక మపుడున్. 61

క. శృంగార[1]మణిధివేలగ
నంగన తనయందు వసతి నందఁగఁ దద్హృ
ద్రంగము మణిగణమునవలె
సంగతనూత్నానురాగసాంద్రం బయ్యెన్. 62

క. ఉవిద నతభ్రువు సుభగగ
నవును; బ్రసాదంబు మరుఁడు నలరించు నటం
చవిరతచింతన్ [2]దూలఁకెను
భువనత్రయచింతఁ దూలఁచఁ బోలెదునృపుఁడున్. 63

చ. నృవరుఁడు నిశ్వసింపఁ, గృశియింప, నికంకుశభంగి నంగజుం
డవిరతజాగ్రదుగ్రవిశిఖాఒసనశింజిని యై క్రమంబుగాఁ
గవిసె జయాఒస్థ; ని ట్లతఁడు కంతునికిన్కకుఁ బాత్రుఁ డైన. సా
ధ్వివిధినిఁ దెల్పునట్లు రతి ద్రిప్పె ముఖంబుఁ ఖరాన్ముఖంబుగాన్.

క పున్నమచందురుమోమున
నన్నవ యన్నెలతేనియందు మెలఁగి వే
అన్నలవికాసదీక్షను
గ్రన్నన బిసినులనుబోలె గ్రహించె వధిన్. 65

1. రత్నాఒకరము (సముద్రము). 2. చలించెను.

క. వామానితంబబింబని
కామాఽయతికారణంబుగా నన భూమీ
కాముకుమనమున నుత్తమ
కామిని యెవతెయును జోటు గాంచక యుండెన్. 66

ఉ. అంతిపురంబుసుందరులయందలిద్వేషమునన్ నితాంతమే
కాంతనిషేవణంబును దదన్యు లెఱుంగమిఁ గోరియున్ ధరా
కాంతుఁడు నైజరీతిఁ గనెఁగా! కదు ¹దాండమితంబుగా; నుప
క్రాంతలతాంతకుంతవిశిఖక్రియ లేక్రియ దాఁప నయ్యెడున్? 67

చ. శ్రవణము జారుకర్ణికను భ్రాంతిఁ గనున్ ననవిల్తుకమ్మగా;
శ్రవణ మిదున్ స్వశీర్షసుమసారసమాగతషట్పదోదితాఽ
రవమునకున్; మినున్ వినుఁ; బ్రరక్తి విలాసపుభిత్తులన్ గనున్:
నృవరుఁడు వేఁడఁ డేమి తరుణీచరితశ్రవణాభిలాషి యై? 68

ఉ. ఏగతి నాతి యుండు నని హృత్థ్సలి నుత్సుకుఁ డైనతేనిచే
తోగతి బాణతూలికలఁ దొయ్యలిఁ గంతుఁడు వ్రాసి చూపె; రం
భాగరిమోరుకాంతి గలభామినిమోమును గాన్క వెట్టుచున్
సాఁగి దిగంగనల్ గొలువ సాగిరి ప్రౌఢవిలోకనున్ నృపున్. 69

క. పరివారము భీతినిఁ జి
త్తరువునవలె నుండె మౌనతత్పరుఁ డగుడున్
నరపతి; గృహకేళిశుకో
త్కరగళవివరముల నుడులుఁ గ్రమ్మక యుండెన్. 70

క. వారపురంధ్రులనడుమ న
వారితసరసోక్తినిపుణ వరదూతి నృపుం
డారసి కాంచీరుతిసన్
²గేరున్ ఘనదోషముఖరకీర్ణం బనుచున్. 71

1. ధ్వన్యనుకరణము. 2. తిరస్కరించును.



చ. హిమజల మెంతయున్ దలఁప నెంచనియట్టిది, చందనాంబుపూ
రముల కసాధ్య మైనయది, రత్యధిపురం డలపారసీకతై
లమనలమే కరంబు నచలాపతిఁగూర్చి శరంబులందుఁ బొం
దమరించి తారసించె ¹ననయంబుగఁ దద్విజయైకదీక్షుఁ డై. 72

క. క్రాంతుఁడు, నిద్రాఽలసనే
త్రాంతుఁడు శూన్యుఁ డగుతేనియందు శరంబుల్
కంతుఁడు పలుపుచు భంగం
బెంతయు క్షాత్రమునఁ దలఁపఁ డేకభటుం డై. 73

క. కుంతలకంతువలపుఁ గను
కాంత చెలులలోఁ బతాకగా నిర వొందెన్
గంతుఁడు ప్రతాపి యయ్యె ²న
నంతాపతియందె తాప మంతఁ గొలుపుచున్. 74

క. స్వశరీరలగ్నఁగఁ బురో
దిశఁ జిత్రితనట్లు, ³కండ్లతీరు తిరుగు చు
న్నశశిముఖిఁగ నామెనె కనె
నిశలన్ క్షణమాత్రలబ్ధనిద్రుం డగుచున్. 75

క. చందురునాతపమును విడి
చందనపాసి నటనుండి చంద్రిక మఱి వా
పిం దిరిగి యిటు భ్రమించుచు
డిందించె న్మరాఽర్తి రే ల్కడిందిగ నతఁడున్. 76

తే. గీ. అతనుచాతకకలితదివ్యాంబుధార
కర్ణపాళీసుధాస్ఫాటికప్రణాళి
యైన యేణేక్షణావార్త నాత్మఁ గొనుచుఁ
జేరెఁ జారుఁడు ధాత్రీశుచెంత కంత. 77

1. అత్యంతము. 2. భూపతి. 8. బందిచక్రములవిధము.

చ. ఘనముఖమం దెసంగెడుకథారసధారల నైజదంతనూ
తనరుచిభంగిఁ జిందుచు నితాంతముదంచితవక్త్రకాంతులన్
దనరిచి యానతాననవిధావిశదీకృతభక్తియుక్తిని
ల్చినతనుఁ జూచుతేనికి వచించెఁ జరుం డిటులన్ గ్రమంబునన్. 78

తే. గీ. మరునిశర మగుసుమనిర్మాణసరణి,
దృక్చకోరకవృత్తి యనిందుబింబు,
ముజ్జగమురంజన మొనర్పఁ బొడమురాగ
విద్య విద్యాధరప్రభుప్రియతనూజ. 79

చ. అకుటిల మార్గణోచ్చయమునందు వహించెడుపక్షపాతమో,
నకుతుకచిత్తుఁ డై నలువ [1]సంగడి సంఘటియింపఁ బూనులో,
నకి నిను విన్నమాత్ర నృపసత్తమ! యీభువనత్రయంబునన్
సకలము జీవలోకము మనంబున నెంచెను ద్వన్మయంబుగన్. 80

తే. గీ. తనిమమున మున్గినట్టియాతన్వి మేనుఁ
గరము శరముల ముంచినకారణమున
[2]నెఱి కొనన్ బోలుసూక్ష్మ మార్గములయందుఁ
గనియె శ్రేష్ఠప్రకర్షంబుఁ గాయజుండు. 81

చ. వలపులతేఁడు వింటియెడ వాంఛ దొరంగఁగ నారి నారిగా
నిలుపునటుల్ తనుత్వముఁ గనెన్ గనకాభతదంగయష్టి; న
వ్వెలఁదికిఁ జెప్పెఁ బోలు వెడవిల్తుఁడు సౌగతశాస్త్రమర్మ మ
క్కలికి నిన్నువినా వితథకాంక్ష నవజ్ఞ రచించు నాత్మకై. 82

ఉ. తంతుకృశాంగమున్ గలుగుతన్వికిఁ గార్మకర్మవార్త వో.
నెంతయు సన్నగిల్లి కుసుమేషునకున్ గుణ మైనఁ గాదు; తా
నెంతయుఁ ద్వద్వియోగమున నెద్దియుఁ దనుత్వము నింటికంబమున్
సుంతగఁ దాఁకి క్రమ్మఱు నుసుర్వడగాలిఁ జలించునో యనన్. 83

1. జత. 2. ప్రజ్ఞ.



క. సుతనుస్తనపీఠంబున
నతనుశిఖిద్రావితాత్మహారగ ముక్తా
తతిపిండ మరయ నయ్యెన్
బ్రతిబింబిత మయ్యె రాత్రిపతిబింబ మనన్. 84

క. సోరణమునుండి చిత్రా
గారం, బటనుండి కేళికావని, వలభిన్
జేరుచు నటపై నెటనేన్
గూరుపదు పదంబు మరునకున్ బెదరినటుల్. 85

మ. కలలోఁ [1]గాలగళుండు గూర్పఁ దెలిపెన్ గల్యాణి నీపాణి; న
క్కలవాణీజనకుం డొనర్పఁ డితరక్ష్మానాయకార్థిత్వమున్;
నిను బ్రశ్నింపఁ దభీష్టభంగ మగు నన్నీతిన్; నినున్ గోరుఁ; బో
కల నిన్బోల్ప్రియు నంది వంశము [2]నలంకారింత్రు.గా కన్నియల్

క. వరణావసరము దరిసెన్
నరపాల! ప్రసన్నతం బొనర్పు పయన మ
వ్వరవర్ణిని యెల్లన విడి
వరియించున్ విజయరమవిభాతి నిను మదిన్. 87

క భూరమణుఁడు విని మోదం
బార స్వయంవరసమాగతావనిపాళిన్,
[3]మారావనిభృన్నగరిన్
జేరెఁ దమి జవాశ్వబలవిశిష్టత నెఱయన్. 88

క. అంగముల నిముడనటె హృ
ద్రంగత్తోషంబునన్, సుతాజనకుఁడెదు
రోంకం గడఁగి యర్ఘ్య లిడె రా
ట్పుంగవున కతండు నర్ఘపుంజముతోడన్. 89

1. శివుఁడు. 2. అలంకరింతురు. 3. మన్మథరాజధాని.

క. పెన్నిధిఁ గన్నవిధిన్ గని
యె న్నెమ్మి నృపుండు కుంతలేశ్వరునిం దా
గన్నెలతండ్రుల కున్నె
సన్నుతజామాతఁ గనినసాటి పదంబుల్. 90

క. గౌరవముల నెరపి సమ ·
స్కారము గావించి, దారి క్ష్మాపతి సూపన్,
జేరెఁ జళుక్యుఁడు వరణ
ప్రేరితహృదయావనీశ వితతస్థలమున్. 91

క. దుందుభిరవముల, నానక
బృందనినాదముల, [1]మిగిలి పెం పగునుత్సా
నందోత్సవభువి కన్య ము
దాందోళితుఁ డై నృపాలుఁ డన్వేషించెన్. 92

శా. [2]భంగశ్రేణి మరాళమ ట్లతఁడు సోపానాళి లంఘించుచున్
భృంగజ్యాఽజ్ఞ సువర్ణపద్మరుచిమైఁ బెం పారుదాంపేయపీ
ఠిం గై సేయుచు శుభ్రదేహమున రాడ్బృందావృతుం డై తగెన్
రంగత్క్షీరధి హస్తిశాబనివహప్రావేష్టితేంద్రేభ మై. 93

క. కై లాసపితాఽలయ మది
యోలిన్ నృపసింహ మంత్రి సూఁదఁగ నృపతుల్
బాలఁ దలంచిరి పొందఁగఁ
జాలనిసింహిగఁ గురంగజాలము వోలెన్. 94

తే గీ. మణిమయవితానములఁ గుట్టిమములఁ బ్రతిఫ
లించునృపబింబములచే సలీలముగను
పౌరుఁ గాంచెన్స్వయంవరోత్సాహశాల
ముజ్జగముకాముకులు తనున్ బొందినటుల. 95

1. అతిశయించి, 2. తరంగములు.



క. మణిమయమంచముల విభూ
షణమణిగణమందుఁ జూడ సాగిరి మొగముల్
గణియించుకోర్కి ముఖల
క్షణప్రకర్షంబు నృపతిశతములు సభలోన్. 96

క. ముత్తెపుమేల్కట్టుల భూ
భృత్తులప్రతిబింబపంక్తి యెసఁగెను నేభా
గ్యోత్తరుపైననొ పూవుల
చిత్తడి నిడ నిగుడుసురలశ్రేణి యనంగన్. 97

క. హేలావేది పతింవర,
పోలున్ ముత్తెములదామముల, [1]నుడులు బహు
స్త్రీలోలుఁడు నెల యనుమొల,
థీలోలతఁ ద న్భజింపఁ బేర్చె ననంగా. 98

తే. గీ. అధికతరతేజమున సభయందు మిగుల
భాతిఁ గల్పించువసుమతీపాలు రంత
విక్రమాఽదిత్యసన్నిధి వేగుజాము
దివ్వెరీతిగ నిల్చిరి తేజమేద 99

చ. కనకశలాకికాసుభగగాత్రి యనేకనృకాంతభాగ్యకాం
చనపరిశీలనేచ్ఛ సుమచాపుఁడు పట్టినశాణపట్టి యై
కనఁ ద్రవఁ జూపునే ర్పెసఁగఁ గంధరఁ ద్రిప్పుఁ గౌలందిలీల యొ
ప్పినమొగ; మిందు మిన్దిరుగువీఁటిఁడి [2]దోషిని దూఱనో యనన్.

చ. సకలనృపప్రతారక[3]విసారపతాకునితర్జనంబుగా
నాకబొమ నెమ్మె కిమ్ము సగ మున్నమితంబును దాల్చి నాథుకు
త్తుక నిడఁ గై నిఁ దాల్చుసరిఁ దూఁగెడుసీర్ష్యను బోలెఁ బూను నా
స్యకమల మంగనామణి సహాఽశయవక్రవిలోకనంబుగన్. 101

1. నక్షత్రములు. 2. దోష = రాత్రి గలవాఁడు = దోషము గలవాఁడు అని శ్లేష. 3. మీనకేతనుఁడు (మన్మథుఁడు).

ఉ. కెంపులగోడలందుఁ దిలకింపఁగ నౌఁ బ్రతిమాచ్ఛలంబునన్
సొంపుగ దిక్కు లయ్యువిదసోయగముల్ రహిఁ దాల్చినట్లుగన్;
దెంపున నాత్మదారవిరతిన్ భజియించుచు మారుఁ డైన నా
చంపకపుష్పగంధి వరుసన్ గొలువంగఁ గ్రమించె నాఁ దగెన్. 102

క. నిగుడునిజాంగవిభాతిన్
నగలందలితాలను మలినం బొనరిఁచి బిం
బగతినయేన్ దవులనియటు
దెగడున్ సామాన్యవసుమతీపతివితతిన్. 103

క. చెలి, మూపున హారలతాం
చలస్థితచలద్విలోకనచ్ఛటఁ ద్రిజగ
ల్లలనలదర్ప మదల్చుచుఁ
బొలుపు మిగులుఁ గీర్తిచెక్కుమును బూనె నన్. 104

క. తనబడిన వచ్చుత్రిజగ
న్మనముల దాక్షిణ్యయుక్తి మన్నింప నన్
మనసిజమత్తగజగతిన్
వనిత కొలఁది జాగు చేసి పదముల నిలుపున్. 105

క. ఘనసారపత్రవీటి
న్దనరి కదలువామకరమునన్ దగి గండో
జ్జనితపులకాంకురశ్రీ
వనిత గనుచుఁ గొద్ది నవ్వి వఱలును నానన్. 106

క. వెలఁది పదం బిడెఁ గుట్టిమ
ములపై సంక్రాంతరాగభూకాంతమనం
బులను వలెన్ బ్రమదముచే
నలనతఁ గనురాజహంసియానము మిగులన్. 107



క. సుమనశ్శిలీముఖాఽఢ్యము
సుమశరభస్త్రి యనఁ బూనె సుందరి వేణిన్;
సుమనయిషుజ్యావలయో
పమితశ్రుతిచుంబినయనపత్రస్ఫురణన్. 108

తే. గీ. కళికఁ బోలుమదనకేతకశర మంతఁ
జలితచూర్ణాలకలతాఽఽళి స్పర్శ సేయుఁ;
దనదుకమటాము యనువింటఁ దనరునుదుటఁ
జెలి పటీరంపులేఖను జేర్చి మించు. 109

గీ. క్షీరవారాంనిధానవీచీపరంప
రానుగత యగుపద్మాఽలయాంగన యన
సితదుకూలోత్తరీయంబు చెన్నుఁ గూర్చ
నప్పతింవర పొడసూపె నంత సభను. 110

చ. నలువ పసిండికొండ[1]కరణంబులఁ గైకొని విస్తృతప్రభా
విలసన మూన్చి చేసెనొకొ పీనపయోధర; నట్లు గానిచో
నిలిపినతోడనే పదము నిస్తులరంగతలంబునందుఁ బొం
దలవడఁ జేయు నెట్లు సభయంతయు లోభపరీత మౌనటుల్ ? 111

క. బాలారత్నం బీష
న్మీలితదృశ యై విలాసనీరజము దిశా
పాలురహేతువున దిశా
శ్రీ లిడుదౌత్యంబు నవధరించునటుఁ గనెన్. 112

క. మిగులన్ లాగినధనువునఁ
దగుమరుచేఁ జేతమందుఁ దాడితుఁ డయి యా
ముగుద విలాసపతాకన్
దగఁ గని గుంతలుఁడు మదినిఁ దలపోసె నిటుల్. 113

1. ఇంద్రియములు.

క. ఘటయింప దెట్లు లోభము
[1]లలనారత్నం బమూల్యలావణ్యనము
త్కట యెవ్వని ? కది నమ్మక,
త్రుటినేన్ గూర్కుఁడు మరుండు రొదరుచుఁ [2]గాఁ పై. 114

క. ఇది యౌవన[3]జలనిధిసుధ,
యిది యంతఃకరణ[4]కార్మణేద్ధ[5]క్షోదం,
బిది హేలాతరుదోహద,
మిది యగు లావణ్యరత్నఘృణిపుంజంబున్. 115

తే. గీ. నిండునెలపొడుపున కిద్ది నిత్య[6]రాక
విభ్రమరసాఽశిపరిపాకపృథివి యిద్ది
మరుదారతపస్య కౌ నిద్ది మహిత మైన
త్రిభువనైకసామ్రాజ్యసుస్థిరఫలంబు. 116

క. వనితాపయోధరేందిర
ఘనస్వనమ్మనసిజాతగర్జాంచితదీ
పన వైదూర్యాంకురని
త్యనవోద్గమములకు దోహదం బై యొప్పెన్. * 117

క. కాంతిదరిద్రతఁ గను [7]న
క్షాంతుఁడు; [8]విరితావల కేమి తత్త్వము ? వాణీ
కాంతునియందపుసృష్టిని
గాంత హరించె నన నమ్మఁగాఁ దగు నెట్టుల్ ? 118

ఉ. సారె సఖీతతిన్ బలుకుచాడ్పునఁ జూపెనయించు నాపయిన్
నారి; ప్రసన్నతన్ గనె ననంగుఁడు; మత్సరయే నిజంబు; క్రీ
డారభసంబునన్ వలెఁ దటాలునఁ [9]దాఁచె నిజాఽళి; హారమున్
దారుచు; దూర ముంచు; నృపుఁ డన్వి గనన్ మరుఁ డేమి సేయఁడున్.

1. సుందరి. 2. పహరాజవాను. 3. సముద్రము. 4. వశీకరణము. 5. చూర్ణము. 6. పూర్ణిమ. *వైడూర్యములు పుట్టుటకు మేఘగర్జనము దోహదమగును అని ప్రసిద్ధి. 7. నక్షత్రేశుఁడు (చంద్రుఁడు). 8. వికచోల్పలములు. 9. తన్నెను.



ఉ. కుంతలనాథుఁ జూచి యళికుంతల కంతుశరాఽర్త యయ్యె; న
క్కాంతముఖేందుదర్శనము గాఁగ ఘనోల్లసితానురాగవా
ర్ధ్యంతరమగ్నులై యచట నారయ వచ్చినరాజు లెల్ల ర
త్యంతవిచిత్రతల్ గొలుపునట్టినడల్ గని రంద మేదఁగన్. 120

తే. గీ. సకలభూపాలభూషణచయముకన్న
నుత్తమం బగుతనహార మున్నతమ్ము
గా నుర మొనర్చి దూరముగా వెలార్చె
నొక్కవిశ్వంభరాజాని యుత్సుకతను. 121

తే. గీ. కాయదీప్తితిరోహితకాంతి నున్న
కనకసూత్రం బవజ్ఞమై గడగఁ దిగిచి
మౌక్తికవిభూషణం బిడె మహిపుఁ డొకరుఁ
డురమునఁ బతింవరన్ గాంచు నుత్సుకతయు. 122

తే. గీ. చెదరినట్టిచూడామణిసీమయందు
విభ్రమాంబుజ మొక్కపృథ్వీవరుండు
నిలుపుతలఁ పూన నొదల నిలిపికొనియెఁ
బౌరనారీమణుల్ దన్ను బరిహసింప. 123

తే. గీ. మంచసీమ సగర్వుఁడై మహిపుఁ డొక్కఁ
డగ్రపాదంబు సారించి యనవరతము
హ్రస్వనిస్త్రింశపుత్రికాభ్రమముఁ జూప
హస్తయుగ్మముఁ గడు నురయాడఁ జేసె. 124

తే. గీ. చెమట వొడమక యున్న నంగమునఁ గప్పు
రముదుమారము గలయించి, శ్రవణయుగ్మ
మందుఁ గలకుండలముల నమందగతిని
వితగఁ బరివర్తన మొనర్చె క్షితిపుఁ డొకఁడు. 125

తే. గీ. వీటికాపేటికావాహుఁ బిట్టుఁ గొట్టెఁ
గ్వణితకంకణయుతనిజకరముచేతఁ;
దమ్ములపుటాకుపై గోళ్ళఁ దగ లిఖించె
మారవంచితుఁ డగుమహీదారుఁ డొకఁడు. 126

తే. గీ. గోష్ఠిమిషమునఁ దనవాక్పటిష్ఠరీతి
నిట్టు లట్టులు వల్కుచు నితరవిభుఁడు
వీటిపేటికనుండి యర్పించె నచటఁ
గలపరుపురుజనములకుఁ గప్పురంబు. 127

తే. గీ. వస్త్రమును జొన్పి వసుమతీవరుఁ డొకండు
కనకపీఠంబు నెత్తుగాఁ దనరఁ జేసి
నూత్నతారుణ్యమును దెల్పుయత్నమున న
జాత[1]కూర్చముఖంముచే సాగె వితగ. 128

తే. గీ. పృథ్వీవరుఁ డొక్కరుఁడు వీటిపేటి మోయు
వానివీఁపునఁ దనదేహ మానిచియు ను
దంచితభ్రూలతాపతాకాఽఽననంబుఁ
గనఁగఁ జేసెఁ దనంత నకారణముగ. 129

తే. గీ. ఆవలించుట నున్నతహస్తయుగ్మ
ఘట్టితాంగుళులన్ జిటికలు ఘటించి
గద్దెపైఁ బడి దుర్వారకామభూత
మోహితుం డయ్యె నితరభూభుజుఁ డొకండు. 130

తే. గీ. కంఠమందలిపంచమకాకలి దగఁ
బొల్చుస్మితమును గనఁ జేసి భూపుఁ డొకఁడు;
గొన్నిపలుకులు గూరిచికొంచు నొకఁడు
గడఁక గాథాకవిత్వసంగ్రథనఁ జూపె. 131

1. మీసము.



క. వైతాళికాఽఽవళిగీ
తాఽఽతతతుములంబు నాఁపి యారాజతనూ
జాతకుఁ గలగళ చారిక
చాతురిఁ గ్రమముగను రాజచక్రముఁ దెలిపెన్. 132

చ. అర దెగువైరిమూర్ధతతి నాహత మై తనకత్తి మొక్క వోన్
గిరిశభుజాంగదాహిఫణకీర్ణమణీకషణంబుఁ గోరె; నీ
శ్వరుగిరి వామపాణి నెగఁ బట్టి, హిమాగముఁ బెల్లగింప ను
ద్ధురరణకండ్వదభ్రభుజదోహలుఁ డై కుడికేలు దారిచెన్. 133

తే. గీ. తన[1]శిలీముఖపంక్తికి దశముఖముఖ
జలజములను భోగాఽఽస్పదములను జేసి
నట్టిశ్రీరామునన్వయమందుఁ బుట్టె
వెలఁది! నృపుఁ; డీతఁ డగుత కన్యెందు నీకు. 134

క. కేకారవముఖరితనర
యూకాననసీమ వీని నొంది తిరుగుచున్
సాకేతపురిని నొనరుపు
మా! శ్లాఘ్యవిలాసజాలకాఽఽళీసేవన్. 135

క. నీచోపకృతిగ సుదతికి
నాచారికహితము వ్యర్థ మయ్యెన్; బ్రేమల్
క్వాచిత్కంబుగఁ దోఁచున్
బ్రాచీనభవాఽఽత్తకర్మపరిపాకమునన్. 136

క. మధులక్ష్మి మావి మెలఁగెడు
మధుపసతికిఁ గొండగోఁగుమాడ్కిఁ బెఱదొరన్
మధురాఽఽలాపకుఁ జూపుచు
మధుమధురకలోక్తిఁ జేటి మన్ననఁ దెలిపెన్. 137

1. బాణములు—తుమ్మెదలు.

క. ఈవిక్రలాంఛనుగుణ
రావం బాహవములన్ బఱఁగి సుషిరములన్
వావిరిఁ దచ్ఛౌండీర్యక
థాఽఽవళిఁ బాతాళజనుల కపుడే తెలుపున్. 138

చ. కదనకబంధనర్తయిత గర్వితభూపతిసేవితుండు చే
దిరాజ యితండు చూడు సుదతీ! మరుపెక్కుము నీదుచూడ్కి యం
చుదితరతిన్ వచింపఁ జరి యుగ్మలి వాల్చక కన్ను వానిపై
వదనమునుండి తమ్ములము వైచి డిగన్ నిరసించె న్యక్కృతిన్.

ఉ. భీతకురంగనేత్రఁ బరపృథ్వివరేణ్యునిసమ్ముఖంబుగాఁ
జాతురి మీఱఁగా నుడివెఁ జారిక దారిచి; కాన్యకుబ్జభూ
నేత యితండు దిగ్జయఘనీకృతభూమిరజంబులన్ సరి
న్నేతృచయంబులన్ స్థలగతిన్ బొనరించు నకుబ్జకీర్తి యై. 140

క. అని చారిక పలుక నతాం
నన యై స్తనపీఠి దృష్టి నాటుచు నయ్యం
గన దెల్పె స్థూలభావము
జనవరునవయవములందు సవ్యంగ్యముగాన్. 141

క. కలనూపురగతి లోభ
స్ఖలితధరావరమరాళచక్ర యగుచు ముం
గలఁ గొలఁదిగ జనువెలఁదికి
నెలన వ్వెలయంగ దూతి యి ట్లని నుడివెన్. 142

క. వ్రాఁడిమిఁ గ్రోడమునన్ వడిఁ
గాఁడినయెవ్వానిముల్కి గడిఁదిగ శంకల్
మూఁడుమ్మృడుం డక్కిటిమెయి
గూఁడు వెలిగ లాగె శబరకుహనాఽఽకృతిమైన్. 143



చ. శంక యొకింత లే కెవఁడు శంకరమల్లరణంబునన్ నిరా
తంకము లైనస్వేదజలధారల నిల్వఁగఁ జేయ నాకురం
గాంకవతంసుకక్షమునయందలిబూదిద లాగె; వాఁడె కీ
శాంకుఁడు; వీఁడు తత్కులజుఁ డంగన! యేకభటుం డుదగ్రుఁడున్.

క. కుతుకమునఁ గనుమ వీనిన్
సుతనువ! తేజస్వి యితఁడు సోం పగుచర్మ
ణ్వతితటమునఁ గలవిపిన
క్షితులన్ రమియింపఁ గోర్కి చిత్తమునఁ దగన్. 145

క. తలపైఁ బాదము నిడ నాన్
వలనుగ మున్ జనెదుక్రమము వాటిలఁ బరభూ
వలయతిలకుఁ గూరిచి కో
మలికన్ జారిక వచించె మంజులఫణితిన్. 146

క. హాళిన్ [1]గపిశీర్షకశ్రుం
గాఽఽళి కలిసి దివికి రథ్య యగుఁ; గాకున్నన్
గేళిగృహప్రాంగణము ను
రాఽఽలయ మెటు లగును జూడ నచటిజనులకున్. 147

క. అదియే 'కాళింజర'ధర,
ముదితశ్రీనీలగళనమున్నతలీలా
సదనము; తన్నేత యితఁడు
ముదిత! వశీకృతనృపుండు; పూన్పు కనుగొనన్. 148

క. [2]ముత్తెమున దారమట్టులఁ
జిత్తభవావిద్ధచిత్తసీమ మహీపుం
డత్తమి బిత్తరికిన్ జరి,
హత్తినకుతుకమునఁ దెలిపె నవనిపు నితరున్. 149

1. కోటకొమ్మ. 2. రంధ్రముచేయఁబడని ముత్యమని తాత్పర్యము.

ఉ. సంగరనిస్పృహ¹ప్రతిరసావరవాసములన్ బరాక్రమో
త్తుంగభుజుండు గాంచు నిజతూర్ణవిలాసచపేటభిన్నమా
తంగనివాసముల్ ²హరివిధంబున; గోపగిరిప్రభుండు వీఁ
డంగన! యీతఁ డీపుడమి స్వచ్ఛయశస్వియు నేకశూరుఁడున్.

చ. మగువ! త్వదీయదృక్కుముదమాల స్వయంవరపుష్పదామమున్
దగులుచుదూత గాత మని తన్వికిఁ జారిక వల్క వేర్కతం
బగుపడ కున్కి వీడఁ, దనయందెలప్రోఁత ఘటించిదూఁతె, వే
అగుధరజేంద్రుఁగూర్చి యసమాస్త్రశరంబులు తన్ను గోరఁగన్.

క. పుష్పాఽశుగవశరాద్వా
స్తోష్ఫుతులం దెవరినడుమ సుందరి సనెనో
పుష్పస్రగ్రజమున వలె
బాష్పములన్ వారికనులు ప్రమదమునఁ దగెన్. 152

చ. పౌరి రిపురాడ్వధూసితకపోలతలాలకవల్లరీతతిన్
బరపి నశైవలాశ్రువులభంగిఁ గుభృత్కటకోత్కరంబునన్
నెరపి ప్రతాపవహ్నిఁ దను నిల్చినశత్రుగృహాంగణంబులం
దిరవు గనన్ దృణంబులు, రహించు నపూర్వసమిద్ధతేజుఁ డై. 153

క. మాలవపతి యితఁ; డితనికిఁ
ప్రోలగు 'ధార' యిడు ముదముఁ బొలఁతి! విలాసాఽ
వాల యగునీకుఁ; గంతుఁడు
గ్రాలున్ మంత్రి యయి నీదుకడ వీనియెడన్. 154

క. ముక్కుకొన కణఁచుచూడ్కిన
యక్కన్నె నృపాలుఁ దెగడె నని కనినటు ముం
జక్కికిఁ గొలఁదిగఁ జని స్మృతి
నెక్కొన ³నగుముగుదకుఁ జరి నేర్పునఁ బలికెన్. 155

2. శత్రురాజులు. 2. సింహము. 3. నవ్వునట్టి.



చ. తురగఖురక్షతిన్ క్షితికిఁ దూఁగుతనుత్వముచేత విన్నయ
ట్లురగలతాంగు లెవ్వనియమానయశంబు ఫణీంద్రుగానమం
దిరములఁ బాడుచుంద్రు; భుజనిర్జితరాజ్ఞికరుండు వీఁడె గూ
ర్జరుఁడు; స్మరాస్త్రముల్ గురియుచక్షువుఁ గూర్పుమ! చాన! వీనిపై.

క. లీలానాళీకము మధు
పాఽళిపయిన్ విసరి బాల యతనిన్ దెగడెన్,
బాలకు ముందుగ, గర్వముఁ
దాలిచి కొంత సని చరియుఁ దాఁ బలికె నిటుల్. 157

క. మిగులన్ బొడు గగునొడలున
జిగిగందపుఁబూఁతఁ జెందుసితరుచి నితఁ డో
మగువ! పయోఽబ్ధిగమందర
నగమునిగన్ ¹వార్చుపాండ్యనాథుఁడు; కనుమా! 158

క. వీనిచెలిమి నీ కూన్పెన
యేనిన్ మారుఁడు పటీరవృక్షవిలాసో
ద్యానమునన్ జందనపవ
మానవితానంబు నిన్ను మరగి భజించున్. 159

క. అన విని గుణభాజనుఁ డై
నను భాగ్యవిహీనుపట్టునన్ సిరివలె నా
ననము మఱల్పఁగఁ జెలికిన్
దనను డికారంబు దోఁపఁ దాఁ జరి వలికెన్. 160

చ. మురువున వార్ధి మున్గి దరిఁబొంత వనిన్ జరియించుదిక్కరుల్
కరిణులఁ గూడుటన్ భవముఁ గాంచెనొ నాఁ దగుదంతు లేధరా
వరుజయయాత్రలందు మదవారిఝరీయుతి నెల్లదిక్తటాం
తరములఁ దిర్గ దిగ్గజవితానదిదృక్షవలెన్ ప్రసక్తమై. 161

1. ఆచమనము చేయు.

క. తనరత్నావళి నర్థులఁ
దనియింపన్ జూచునెవనిఁ దగ దనినటులన్
దన[1]మదజలగజడిండిమ
మున రత్నాకరము మంద్రపుశ్రుతిఁ గొలుపున్. 162

చ. తనపృతనల్ దనర్చెడునితాంతభరంబునఁ గ్రుంగుధాత్రిఁ బూ
ర్వనియతి నిల్ప నేపృథివిపాలుఁడు యామ్యదిశాఽర్ణవోచ్ఛల
ద్ఘనతరవీచికాతతికి [2]దామెనగాఁ గదియించె నైజగో
త్రనిభతనూల్లసత్తటగతద్విరదేంద్రఘటాచ్ఛలంబునన్. 163

తే. గీ. తమపదంబులు ద్రొక్కఁ దుత్తుమురు లైన
ముత్తెములపొడి నర్ణవాంబువులతోడఁ
ద్రాఁగి వమియించె నాఁగ నుద్ధతపృషత్క
డంబరంబున నెవనిగజంబు లొప్పు. 164

క. పూరితదిక్తటకరిణీ
వారముపై యువతు లెవనివాకిటఁ బో, నా
శారమణపురగవాక్షము
లారున్ జోత్స్నాసితంబు లై పగలైనన్. 165

క. చోళుఁ డితఁడు నినుదన్ ది
క్పాళి యశఃపుంజకలితపాళిన్ శుభశం
ఖాళినివలె విజయోత్సవ
వేళావైభవముభాతి బిసరుహవదనా! 166

క. తరుణీ! విలాసవిద్యా
ధరరాజమరాళ మితనిఁ దాల్పుము భుజపం
జరమున విమానజాల
స్ఫురణ; దృగుత్సవము 'కాంచి'పురి నీ కున్నన్. 167

1. మదించినసీటయేనుఁగులు. 2. పొడవైనలావుత్రాడు.



ఆ. వె. అనిన నతనిఁ గడచె నన్యత్ర పూన్కిని;
నిలిచెఁ గుంతలునకు నెలఁత యెదుట;
గొప్పవేలచేతఁ ద్రిప్పఁ గన్నను నది
వదలు నెటులఁ దనదుప్రాక్పథంబు. 168

తే. గీ. కాంతయత్యంతదీర్ఘదృగంతములను
గృష్యమాణుఁడు గాఁ గుంతలేశుఁ డంత
నచట [1]నిర్వాపితాశు లై రన్యు లెల్ల
మలినులటు దీపవర్తిధూమములచేత. 169

సీ. నృపుఁ డొక్కరుఁడు నేను ప్రియజాని నీచాన
యెడఁ బరాఙ్ముఖుఁడ నం చెచ్చరించె;
విభుఁ డొక్కరుఁడు వేడ్క విటపార్థివులఁ జూడ
నరుగుదెంచితి నిట కని వచించెఁ;
బృథ్విపుఁ డొక్కఁడు వృథ నన్నిటకుఁ దెచ్చె
వంచించి తని మంత్రివరుని దూఱె;
నితరనృపాఽన్యంబు లెనసె నతిన్ వజ్ర
హతము లైనట్టుల హరువు దొరఁగి:

తే. గీ. సర్వసర్వంసహాకాంతచక్రమందు
లోలలోచనదృష్టి చాళుక్యసింహ
పీఠమందను వెదకి సంప్రీతిఁ గాంచ
నంబువులఁ బాలు గొను రాజహంసివోలె. 170

క. మఱిఁ జారిక చెలికిన్ దన
నెఱపలుజిగివెల్లి, నితరనృపతులదృష్టిన్
నెఱసినచెలియకళంకము
నఱిముఱి క్షాళిత మొనర్ప ననఁ బలికె నిటుల్. 171

1. 'ఆర్పఁబడినఆశలు-ఆర్పఁబడినయగ్ని' అని శ్లేష-ఆశ అనగా అగ్నియని కూడ నర్థముగలదు.

క. కమలవదన! నీమోదికి
కమనీయార్థము గ్రహింపఁగా నెఱుఁగు; సమ
స్తమహీపుల నాచుగ విడి
భ్రమరివలెం దగిలె నితనివక్త్రాబ్జమునన్. 172

క. అనితరసామాన్యం బీ
ఘనరూ పెందేని ముందుఁ గాంచితె? చెలి! శ్రీ
కిని వాణికి నెల వగునీ
జనపతిసౌభాగ్యగుణముఁ జాలను బొగడన్. 173

చ. సతము మదేభసంగతి దిశాగజపాళి నవజ్ఞఁ జూచునీ
చతురజిగీషుసప్తులు దిశాతతి నిచ్చలుఁ ద్రిమ్మరున్ ద్రుటిన్;
క్షితి యొకచోనె వ్రేఁ గగుడు శేషశిరస్థలి నిల్వఁ బో వనా
నితఁడు సమస్తదిక్కులఁ స్వకీయచమూగజరాజిఁ బంచెడున్. 174

క. ఉరగపధృతమహిఫలక
స్థిరతకునై కాఁడఁ బడినధృఢకీలపరం
పర యన విజయస్తంభో
త్కర మెల్లెడ నీనృపుండు గాదె ననఁ దగెన్. 175

క. ప్రోతనృపశిఖారత్న
వ్రాతోభయపార్శ్వధరణిపాలకృపాణం
బాత్మటి నిలుచున్ బ్రమోదయి
యాతతశేషారిగళభరాస్థివిదళనన్. 176

క. విజయోత్సవంబువాకిట
సుజవమునన్ జోళపతియు సోముఁడు రాఁగన్,
భుజయుగమున నీభూభుజుఁ
డజయుం డిర్వురను వెడల నడఁచెఁ గడిమిమైన్. 177



తే. గీ. అబ్బురపుటీవి నొప్పునీయవనివరుని
యెదుటఁ బరమాణుసమమ్ము లౌత్రిదివతరువు
లెటుల సదృశంబు లగును నీపృథివివరున
కతులలోకత్రయీగౌరవాఽస్పదునకు. 178

క. ముంజుండే పోలనిచో
గుంజంతయునేని; భోజు[1]కొఱ యెంత? కవీ
ద్రంబను నొందుకవులపద
కంజములకుఁ బాదదాసిగా సిరి నిలుచున్. 179

క. ఈసాహసాంకుమది సవి
లాసభ్రూభాగయుగ్మలాస్యములు వధూ
టీసస్మితాస్యములు విడి
భాసించును వేఱుచోట్ల భయరహితముగన్. 180

క. ఇతని గళంబున నిల్పుమ!
యతివ! భుజాబంధదూత యౌమాల; రతీ
పతియిడుమలు ఫలమొందుతఁ
జతురాఽస్యున కగుతఁ గీర్తి సమయోగమునన్. 181

క. హ్రీనిరసన చరిపల్కుల
నైనటు నెపమునన యంత నబలామణి మో
దానన్ సంవరణస్రజ
మానృపవరవిక్రమాంకునకుతన్ గూర్చెన్. 182

క. మదషట్పదకృతఝాంకృతి
మదవతి పతియఱుత నిడినమాల రహించెన్
మదరాట్సౌభాగ్యజయాఽ
స్పదలీలాడిండిమంబుఁ జఱచె ననంగన్. 183

1. ప్రయోజనము.

క. భుజలేఖాద్వయి కుసుమ
వ్రజమున సౌభాగ్య మొందె; రాజుగళమునం
దు జిగి రహించినన్ వా
రిజాక్షినిఁ గవుంగిలింప నృపతి త్వరపడెన్. 184

చ. అలరుతఁ బుష్పకేతనశరాసవిశిష్టకళారహస్య; మ
న్నలువయు యుక్తకార్యఘటనావిధికై పొగ డొందుఁ గాత మం
చల పురయౌవతంబు ముద మందుచుఁ బల్కెను వారిఁ గాంచి; యీ
యిల సమవస్తుయోగమున నేరికిఁ బ్రీతి జనింప కుండెడిన్? 185

చ. మృదులమృదంగనిస్వనసమేతవివాహసమర్హమండపం
బుదితవిపాండుకీర్తియుతుఁ డుగ్మలితోడుత నెక్కె, రాగసం
పద లల సంక్రమించునరపాలురయెల్లరలక్ష్మిచేవలెన్
గదిసె నుదారకాంతి నధికంబుగఁ గుంతలసోముఁ డయ్యెడన్ 186

క. వరసాహసలాంఛననృప
కరపీడనకౌతుకంబు కడఁ జన నకలో
ర్వీరమణుల వీడెఁ గీర్తియుఁ
గరముఁ గృతార్థ యగునృపునికన్యకలోలెన్. 187

తే. గీ. దెసలకొసల వెలింగెడిదీపకాంతి
శాంతి నందఁగ సుభగతాక్షయముచేత,
నృపులు నలు వంది రపుడు తదీయధూమ
ధూసరితదేహు లై కాంతిఁ బాసె ననఁగ. 188

తే. గీ. సిగ్గుపడి రాజు లెంతటిచేటు కైన
సాహసించిరి; కాని శ్రీసాహసాంకు
తీక్ష్ణకంకపత్రమ్ములతీవ్రదీప్తి
వారి కెట్టులు సహ్య మౌఁ బ్రథనభూమి? 189



ఉ. భూపతిసంఘమెల్ల నృపపుత్రిక నందమి డెందమందు సం
తాపము నొంది మోముజిగి దప్పఁ దొలంగెను గోర్కె లూడఁగా;
భూపతి యొప్పె నూత్నవధువున్ గడుమోదముతోడఁ గూడి ల
క్ష్మీపతి దైత్యులన్ గెలిచి శ్రీసతిఁ గూడి రమించునట్లుగా. 190

తే. గీ. సవతియువిదలకెల్ల దుస్సహము గాఁగఁ
దనదుసుగుణగణంబునఁ దరుణి వరుస
నధిపుమానససామ్రాజ్య మధివసించి
స్వవశమున నేలె నతనిఁ బంచశరునాన. 191

ఉ. కుంతలనాథుడెందమునఁ గోమలివక్త్రశశాంకబింబ మ
త్యంతముదంబునన్ జొరఁగ నంత సపత్నిముఖాంబుజంబు లం
తంతఁ దొలంగి యావలకు నై నిలిచెన్, మనమందు నిల్వఁ దా
మెంతయు సంకుచింతు మని యెక్కుడుభీతి వహించెనో యనన్.

క. వివిధోపచారచణుఁ డగు
నృపవరునియెడ విడిచెఁ బడఁతి నిజనూత్నోఢా
ప్రవణత; నవోఢ చిరముగ
స్వవరుదరిఁ గనుట యతనియసామర్థ్య మగున్. 193

వసంతము

శా. మారాస్త్రాధికృతుండు, [1]పైకగళసంపద్దాత, చంద్రాంశువి
స్ఫారశ్వేతగుణాఽవహుండును, రసక్ష్మాపాలసామ్రాజ్యవి
స్తారామాత్యుఁడు, వృక్షచిత్రకరుఁ, డుద్యన్మానవృక్షచ్ఛిదో
దారానేకప మంతఁ జైత్రుఁ డిడె నూత్నప్రీతి భూభర్తకున్. 194

క. స్మరరాజు జగము గెలువఁగ
సరదారుఁగఁ జేసె నవ్వసంతుని; నతఁడున్
గరువలి నెగసినసంపెఁగ
ల రహించె సువర్ణవృష్టులం ద్యాగివలెన్. 195

1. కోకిలలసమూహము.

క. ప్రసవవిసర కేసరముల
దెసలెల్లన్ స్వర్ణకాంతి దీపింపఁ బసిం
డి[1]నవరణల్ గలనతుల క
భిసార [2]మహమందుఁగూడ వేడుకఁ గూర్చెన్. 196

క. ఖరదసరిదిక్కనిమధుప
వలదన్ బాదంబు సిక్కవడ షట్పది దా
వెర వెఱుఁగక పిలిచెన్ మధు
కరమున్ నిరతంపుదుఃఖకలితరవములన్. 197

తే. గీ. తేనె నిండినపూవును దేఁటి యొకటి
యాసచే రంధ్రమున్ మూసి యచట నిలువ
నన్యమధుపంబు లానెఁ దదన్య[3]సరణి;
నార్జనము సేయువారి కియ్యదియె [4]సరణి. 198

ఆ. వే. చందనాచలంబు చందనతరునంగి
భుజగగరళతాపమును వహించి
నటు దరీముఖముల నతిశయనిశ్వాస
పవనముల యథేచ్ఛఁ బఱఁగఁ జేసె. 199

సీ విరహిజనులు భూమివివరంబునన్ వసి
యుంపఁగఁ గోరుదు రెల్లవేళ;
మత్తపికీపంచమస్వరపీడితుల్
బాధిర్యయోగంబు [5]వలతు రెప్పు;
డాక్రందములఁ గోకిలాఽరావముల్ వెంచు
మతిలోప మక్కట మధుఁడు గూర్చు;
మరు[6]పరాస్త్రము లోర్చుమహితుఁ డామనిఁ బిక
పంచమనాదాస్త్రవశత నొగులు;

1. నగలు. 2. పగలు. 3. మార్గము. 4. విధము. 5. కోరుదురు.
6. ఇతరాఽయుధములు.



తే. గీ. నంత రాజేంద్రుఁ డామనియందముఁ గని
తనదుశ్రమమెల్ల సఫలతఁ గనె నటంచుఁ
దలఁచి యంగనపాణిపద్మంబుఁ గొనును
జిత్ర మైనట్టియుద్యానసీమఁ జేరె. 200

క. కుంతలపతి యుద్యానం
బెంతయు సంతసము మీఱ నీక్షించి తమిన్
గాంతామణితోఁ బల్కెను
గంతుధనుర్జ్యారవామకారిరవమునన్. 201

తే. గీ ఇంతి! నీకనువిందు వసంతుఁ డూన్చె
మరుఁడు రతిజన్మభూమి, యామనిసుశోభఁ
ద్వత్తనూలక్ష్మి నత్యంతదర్ప మదరి
చీరికిం గొనఁడుగద! కించిత్తుగూడ. 202

తే. గీ. [1]చిత్రసేన నామని సమీక్షింపఁ గోరి
యువిద! మదనరా జధిష్ఠించునుపవనంబు
త్వద్విలాసావలోకనధన్య మగుత;
వనముచే నీవు నీచేత వనము మెఱయు. 203

మ. కో. [2]కామవిభ్రమరాట్పురీ! సముఖంబునన్ నిను జూచి [3]వే
యామధుం దల స్వాగతిన్ మధుపామృతాఽరవ సంతతిన్
బ్రేమ మీఱఁగఁ బూర్వభాషణవిశ్రుతిం బచరించెడిన్;
గామినీ! కయిసేయుమా! సుమకమ్రశోభవనస్థలిన్. 204

పృథ్వి. లతాలలన లిచ్చమై లలితలాస్యముల్ సేయఁగా
సుతన్వి! కర మర్థి నీ విటకుఁ జూడ నేతేరఁగాఁ
బతత్కుసుమజాలసంపదల వన్యరంగస్థలిన్
సతోషకుసుమాంజలుల్ సలుపుచాయ చూపట్టెడిన్. 205

1. విచిత్ర మైనసేన గలది. 2. మన్మథరాజధాని. 3. వేగముగా.

క. నీకాలిదెబ్బఁ గాదె! య
శోకము ధన్య మయి తరుల శోభిలు; నవలా
లే[1]కృతుల దాసులుగ మదిఁ
గైకొని క్రీడింత్రు వారిఁ గను మరుఁ డెలమిన్. 206

క. ఈవకుళవృక్ష మెంతయు
సేవన్ గలిగించు నాకు వృక్షాళిః; వసం
తావసరంబున నైనను
బూ విరియఁగఁ గోరు నీదుపుక్కిటినీటన్. 207

క. ఒక్కెడ శివుకోపముచే
నక్కంతుఁడు దగ్ధుఁ డైన నంత వసంతుం
డొక్కుమ్మడి నీవలెనే
లెక్కకు మిక్కిలిగ మరుల లీల సృజించున్. 208

ఉ. నీతనువల్లిపుష్పములనిండువిలాసమునన్ మరుండు నో
కాతరనేత్రి! లాగఁ బడఁగాఁ దనదృష్టి భ్రమించి యామనిన్
నూతనశస్త్రసంపద లనూనముగా వికసింప, వానిఁ దాఁ
బ్రీతిఁ బ్రయోగమున్ సలుప వేడుక గల్గియు నె క్కడందుగా. 209

తే. గీ. చైత్రుఁ దర్పించు[2]గుణమున మైత్రిఁ గాంచి
మానవంతులమానంబు మాన్పఁ గలుగు
ప్రసవమందును మరునిచాపంబునందుఁ
జేరుచుండు [3]శిలీముఖశ్రేణి గడఁక. 210

క. చెలి! పుంస్కోకిలములు నీ
కిల ఛాత్రములటు వసంతఋతుకలితము నీ
విలసద్గానకలాకౌ
శలమున్ బంచమరుతిన్ బ్రసారము సేయున్. 211

1. ధన్యులన్. 2. ఇది అల్లెత్రాటికిఁగూడ శ్లేష. 3. తుమ్మెదలు-బాణములు.



క. మధురమకును నీకును నా
[1]మధుపగుణుం డగును దుల్యమాన్యుఁడు; కానీ,
మధురమయెదుట ననంగుని
బుధవినుత! యొనర్తు వీవు పూర్ణాంగునిఁగా. 212

దోలాకేళి

శా. అంతన్ గుంతలచక్రవర్తి సరసాత్యంతప్రియవ్యాహృతిన్
గాంతాశ్రోత్రవిభూషణంబు పునరుక్తం బౌనటుల్ సేసి తా
సంతోషంబున దోలికావిహరణాసక్తుండు కాంతామణిన్
జెంతన్ లోలవిలాసదోలిపయిఁ జేర్చెన్ శ్రాంతి శాంతింపఁగా. 213

క. దోలాలోలాలక, [2]ము
ల్లీలాభ్రూవల్లి, భ్రాంతదృక్కంజము న
వ్యాలావక్త్రము శరదం
కాళిఁ [3]దొలఁచి తేనిహృది ననంగుఁడు నిలిపెన్. 214

క. పంచమరుతగీతంబు స
మంచితభ్రూవల్లిదృష్టి, యందెలరవముల్,
మించునృపాంగనయాత్రయు
పంచశరున కయ్యె శస్త్రపంక్తి త్రిజగతిన్, 215

ఆ. వె. వెలఁదిపిఱుఁదుబ్రేఁగుపేర్మి నుయ్యెల సాగి
తారతరముగా రుతంబు సలుప
జ్యానినాద మెఱుఁగ నట్టిపంచశరుండు
కుంతలక్షితీశు వంతపఱచె. 216

ఆ. వె. ప్రియవిలాసదోలఁ [4]బృథ్వీభుజంగుండు
తోడుతోడ నూఁచఁ దొడరు చుండ
సకలవనితలందు సౌభాగ్య[5]గుణకోటి
చెందె భంగ మంతఁ జిత్రముగను. 217

1. మన్మథుఁడు. 2. మోదవిలాసము. 3. తొలఁగించి. 4. ఇది రాజు బిరుదనామము. 5. గుణము-త్రాడు.

క. ఆలోలాక్షీదోలాఽఽ
లోలాఽననమార్గసభ్యలోలుపభూమీ
పాలవిలోచనములకున్
గ్రాలె గతాఽగతము లంత [1]గవ్యూతిగతిన్. 218

## పుష్పాపచయము

తే. గీ. అంత నుయ్యేల దిగి ప్రియునంకమందు
క్షణము విశ్రాంతిఁ గొని శ్రాంతి శాంతి నందఁ
జైత్రశోభాఽపహృతాఽత్మ యై సారసాక్షి
కదలెఁ బుష్పాపచయకాంక్ష గ్రందుకొనఁగ. 219

క. కుంతలపతిబొమ్మసైగల
నంతఃపురకాంతలెల్ల రతిముదమున [2]వ
ల్ల్యంతాపచితికి నడచిరి;
కాంతుప్రసాదంబు సీమ కౌతకమునకున్. 220

క. లెక్కకు మీఱువిరులఁ దగి
యెక్కంతున కితఁ డొసంగు నైదె శరము లం
చిక్కృపణత్వ మెఱిఁగి యన
నక్కాంతలు గొనిరి మధునియఖిలస్వంబున్. 221

చ. అల తలఁ గల్గుపూల్ గొన నృపాంగన యెక్కఁగఁ దుంటి వ్రేఁగునన్
బొలియుదు నన్నభీతి ననఁ బో కదలెన్ వకుళంబు; [3]పమ్మి వం
చులతయుఁ బుప్పొడిన్ గలికిచూడ్కుల నింపఁగ [4]సందు నంది వే
ర్కలికి కవుంగిలించె నృపుఁ; గల్గనె భంగము భాగ్య మబ్బుచోన్.

క. కుసుమములు గోయునాకరా
జసతి నశోకంబు కిసలశయమునఁ గొట్టెన్;
గుసుమాఽయుధుఁ డది ద్రెంపఁగ
నసివల్లిన్ లాగె ననఁగ నళితతి రేఁగెన్. 223

1. రెండుకోసులు. 2. పుష్పాపచయము. 3. విజృంభించి. 4. అవకాశము.



ఆ. వె. దయితుఁ డొక్కదయితఁ దరువు నెక్కింపంగఁ
గటిభరంబునన్ బ్రగల్భ గాక
బోదెనుండి వృక్షమూలము విపరీత
భంగిఁ జేరె భిన్నపదయుగమున. 224

క. అక్కాంతలుకాంతలు చె
ట్లెక్కి [1]విధూననము సేయ వృక్షములు దగెన్
బిక్కటిలు [2]తుంట్లవ్రేఁగున
స్రుక్కుదు మని లఘుతకొఱకు సుమముల విడె నాన్. 225

ఆ. వె. విరులను గొని చెలులు పృథివీతలముఁ జేరఁ
గోరిధరణిజాతజాలమెల్ల
బరువుచేత భంగపడ లే దనెడుగర్వ
మునను బోలె శీర్షములు నిగిడించె. 226

ఆ. వె. చెలులచెమటఁ, గుసుమములరజోభరమున
[3]నడుసు గల్గ నెల్లయెడల, మరుఁడు
గాంచె వాన మపుడు కఠినోన్నతము లైన
మదవతీజనకుచమండలముల. 227

సీ. వ్రతతీపరిచ్యుతవల్ల్యంతరజములఁ
జెలులనాభులు నిండి స్థలులు గాఁగ
మానినీమధ్యముల్ మరునిలీలాగతి
ప్రాంగణతాభంగి పరిఢవిల్లె;
నారామ లారామసారవత్కుసుమముల్
తీసికొనన్ బ్రవర్తిల్లుచుండ
మధుజీవషట్పదమానినీవ్యూహముల్
కోలాహలముఁ జాలఁ గొలుపు చుండె;

1. కంపనము. 2. పిఱుఁదులు. 3. బురద.

తే. గీ. అంతనొకకామిని సపత్నియక్షియుగళి
నినిచి పుప్పొడి నాటలనెపముచేతఁ
దాఁ బ్రియునిచుంబనంబుపాత్రత్వ మందె;
సతులవైదగ్ధ్యరీతి కసాధ్య మున్నె! 228

క. మానిని నృపపతి యొక్కతె
సూనోచ్చయవాంఛ విడిచి చూచుచు నుండెన్
నానానారీభుజమూ
లానూననఖక్షతాళి నాసక్తమెయిన్. 229

క. తరుశాఖ వంచి నృపుఁ డొక
తరుణి నదటఁ జేర్చినంతఁ దత్కటిసీమా
భరమున నాశాఖ యచటి
పెఱయువిదలయెదలనరిగ భిన్నం బయ్యెన్. 230

తే. గీ. నృపుఁ డొకసతికి నవతంస మిడఁగ నామె
తృణమునకునేన్ గొనదు పరస్త్రీల నెవరిఁ;
బతిప్రసాదంబు సతులసౌభాగ్యమదము
నవతరిలఁ జేయుమదిరాసహస్రముగద! 231

క. కుసుమపరాగం బెల్లెడఁ
బ్రసరించి సమస్తనేత్రబంధముఁ గొలుపన్
గుసుమశరుఁడు చెలులతనుల
నసమామోఘాస్త్రుఁ డయ్యె నాశ్చర్యముగన్. 232

క. [1]ఈరముననుండి కపి యొక
నారిచెఱంగుఁ గ్రుధ నీడ్చినన్ ధూర్తమెయిఁ
బారి యది నాథుకౌఁగిటఁ
జేరెన్ బెఱచెలులు గిన్కఁ జెందర దానన్. 233

1. పొదరిల్లు.



మ. కటిభారాధికగౌరవంబున లతన్ గామార్త భంజించి
విటుపైఁ బడ్డ సహింప కన్యవనితల్ పెన్బాధలన్ జెంది; రం
తట వేఱొక్కతెకొప్పునందు ధరణీనాథుండు సంపెంగలన్
దిట మౌ ప్రేమ నలంకరింప నితరల్ నెక్కొల్పి రాత్మన్ రుషన్.

మ. సుమరేణూత్కర[1]వర్ణికాళి నృపుమించుంబోండ్లు బాహాపరా
క్రమరంగంబున నర్తకీత్వమున కక్కాముండు గై సేసిన
ట్లమరన్ గల్గిరి; సూనబాణములఁ బుష్పాసారముల్ గూర్చెఁ గౌ
సుమబాణుం డన నొప్పి రెంతయు సుమస్తోమాధికాలంకృతిన్.

క. భూరమణునాంధ్రవెన్నడి
వే రొద లిడు చేగు చొప్పె భృంగపటలి శృం
గారిణులగురుఁడు మరునుమ
వార మపహరించుదొసఁగు వాక్రుచ్చె ననన్. 236

క. సుమరజములఁ గలియుచు స్వే
దము జాల్గొనుచెలులపసిఁడితళుక్కులతనువుల్
సుమశరుసూక్ష్మమునన్ గొం
చెముగ ద్రవీభూతము లగుచెలువునఁ బొలిచెన్. 237

చ. ఇటు నటు వ్రాలుతేఁటి నొకయింతి కరాబ్జమునన్ విదుర్చి చం
తటఁ బొగడెన్ శిశుత్వమునఁ దా నల నేర్చినకందుకక్రమం;
బటులనె క్షిప్త మై యది ముఖాబ్జమునుండి కరంబు, మోముపై
నటుపయిఁ ద్రోయఁ జేరె; నల స్వార్థపరుల్ త్రప నెందుఁ గాంతురే!

తే. గీ. ఆయరాళనయనలు రాయంచగముల
వాదములఁ బిల్వఁ బడి రన న్గౌతుకమున
నీడ్వఁ బడి రన నలసట నెడపఁ జనిరి
కేళిసరసీతటము జలకేళి సలుప. 239

1. రంగులు.

క. స్తననిర్మిత మగుభారము
నను నొగిలితివేని నడుమునన్ గలచులకం
దన మెటు దెలియవో నాఁ గా
మినీపదము లందెలరొద మేదిని కనియెన్. 240

క. వెలఁదు లురోజాత్యున్నతి
నిలఁ గన కుండిన, మరాళబృందము పున్నెం
బులకలిమి నందెలరుతిన్
[1]వెలుఁ దెలిసి చెలులపాదవిన్యాసములన్. 241

క. వనమున రవితాపముచేఁ
గనలుసతీపదములన్ జఘనతలములు వీ
జనమును మొద లిడె స్వీయవ
సనాంచలములన్ శ్రమంబు జార్చుటకో నాన్. 242

శా. బాలాలోలవతంసపల్లవము లుద్భాసించె గండస్థలీ
వ్యాలోలద్వ్యజనానుకారు లయి స్వేదాంభస్స్రుతిన్ మాన్పుచున్;
బాలిండ్లన్ వదనాబ్జసంగతము లై వర్తిల్లి నీహారమున్
బోలన్ జాలెడునూర్పులన్ శ్రమజలంబుల్ వాపు నా నొప్పెడున్.

క. అక్కుంతలుకాంతలనడఁ
[2]దెక్కులిఁ గొని యంచపిండు దివ మెగసెను బెం
పెక్కనభయముననో యన
నక్కమలజువాహనంపునంచలఁ గదియన్. 244

## జ ల క్రీ డ

క. వరసారసనయనలతోఁ
గరేణుకాసహితమత్తకరటివడువునన్
నరపతి హేలాంచితపద
చరుఁ డయి సరసిజవతంససరసిన్ జొచ్చెన్. 245

1. వెరలు. 2. దొంగతనము.



క. తరుణీముఖరుచితస్కర
సరోజసౌహృదఫలంబుఁ జవిఁ గొనెఁ గొలఁకుల్
ధరణీపతితరుణులు త
త్సరఉత్పలనేత్రములను సరవిన్ బెలుకన్. 246

తే. గీ. రాజతరుణులబింబోష్ఠరాగకలన
[1]నుత్పలంబులు రక్తపద్మోత్కర మనఁ,
గాటుకన్ బద్మములు నల్లకల్వ లనఁగ
దగి విపర్యయ మిటు లొప్పెఁ దమ్మికొలని. 247

క. హేలా[2]ప్రవిదారణమున
బాలాజన మంబుజముల భంజించెను; బ
ద్మాఽలయ మున్నే భూమీ
పాలున్ జిర మిరవుఁ గాంచెఁ బ్రజ్ఞావతి యై. 248

చ. సరసి పురంధ్రిపాదముల క్షాళన సేసి తరంగపాణులన్
గరము సముచ్ఛలజ్జలకణంబుల మ్రొక్కుఁ దదంఘ్రివారి నా
వలి; జితాంబుజాతపదపల్లవ[3]నైజరుచిన్ బరీక్ష నా
[4]నెరపఁ దదీయపాదముల నిండినలత్తుక నూడ్చె వీచులన్. 249

మ. అళిసంరబ్ధనృపాంగనామణులపాదాలక్తకం బూడె న
జ్జలజాఽవాసముఁ జేరుమున్నె శ్రమసంజాతాంబులన్; దోడుతోన్
మలఁచెన్ గాంతలమేనికుంకుమములన్ గాసార మబ్జప్రభల్
దొలఁగం జేయుతుషారశైలమున నొందున్ జన్మ మం చీర్ష్య నాన్.

తే. గీ. ఇట్లు నీరాడురాజపూర్ణేందుముఖుల
లోన నొక్కతె కాల్ జారి లోన మునుఁగ
నతఁడు సంభ్రమమున లాగె; నంత నవతు
లాసుదతిఁ గాంచినంతట నీసుఁ గనిరి. 251

1. నల్లకలువ. 2. యుద్ధము. 3. స్వాభావికము. 4. నెలవేర్పుటకు.

ఉ. ఆయువతీజనాననము లబ్జరమన్ గొని యబ్జరస్యతన్
దీయఁగఁ బాంథకోటివలెఁ దేజముఁ బుప్పొడిఁ దప్పి భృంగముల్
పాయక చేరె; భాసితనృపాలసతీసముఖాన భృంగపా
నీయగృహాయితాబ్జముల నీరజలక్ష్మి [1]ప్రపేశ యై తగున్. 252

క. ఉపలఘనము లక్కాంతల
విపులనితంబంబు లటఁ బ్రవేశింపఁ గొలం
కు పొలిచె నుత్తుంగతరం
గపటలి త్రుచిరసమునఁ గడు హెచ్చె ననన్. 253

తే. గీ. అచటఁ [2]జాళుక్యవిద్యాధరాబ్జముఖుల
వదనచంద్రపరంపరల్ వఱలు చుంట
వనజములు ముకుళించు నన్భయమున నన
నటులు సౌరవు వికసితాబ్జములనునేని. 254

క. నృపతిసతీనైసర్గిక
వపుశ్ఛవిఁ దిరస్కృత యయి పద్మాలయ శ్వా
సపవనమున ననఁ గమలము
లపరాగము రేఁగె నట విలాసము గాఁగన్. 255

క. జితకుంభికుంభతరుణీ
తతకుచయుగమున నృపుండు దాఁ గరయంత్రో
దితజలధారన్ రువ్వఁగ
నతనువిముక్తాతినిశిత [3]మలుఁ గన నొప్పెన్. 256

క. పురమిదొర విడుచుధారలు
మెడ వంచినపడఁతిచెవిని మించు[4]రవమొనన్
వడిఁ దాఁక, నీరు తుము రై
యడరెన్ ముత్తెము లనంగ నచ్చటనె కనన్. 257

1. ప్రపా + ఈశ = చలివెందల యధికారిణి. 2. ఇదియొకరాజు బిరుదనామము.
3. బాణము. 4. వజ్రము.



తే. గీ. రాజకరయంత్రజలధార రాజవదన
కుచకలశపీఠిఁ బొర్లాడికొనుచుఁ బఱఁగె;
నంతఁ బ్రతివల్లభలయుల్లమందుఁ గోప
వల్లరులఁ బల్లవము లుల్లసిల్లె వింత, 258

ఆ. వె. ఇట్టు లుత్సవముల నీశుఁ డనుభవించి
విడిచె సలిలకేళి వెగటుఁ గాంచి;
జగతిఁ [1]గెలన మెటు నిసర్గరమ్యం బైన
నగునుగాదెఁ ! విరస మతిగ నలుప. 259

తే. గీ. కాటుకలు లేక నల్లనికన్ను లమరి
కుంకుమన్ బూయక పసిండికొమరు మిగిలి,
యలరు స్నానావసానమునందు రాజ
మానవతుల కకృత్రిమమండనంబు. 260

చ. స్తనముల లిప్త మైనహరిచందన మక్కాలనెల్లఁ బాఱఁ, గా
మినులవియోగ మొంది యన మేనఁ ధరించెను దెల్పు నొప్పుఁ; బ
ద్మనయన లంతఁ బట్టములు మార్చ, నగల్ ధరియింప, వమ్మ గా
దని మది నెంచి కార్ముక మనంగుఁడు క్రమ్మఱ లాగె రాజుపై.

మ. వెలసెన్ గాంతలకుంతలవ్రతతు లబ్బిందుప్రసూనంబు లై
పొలిచెన్ మజ్జనశీతలస్తనతటుల్ పుష్పాస్త్రధారాగృహం
బులు నై; యైన నృపప్రియాజన[2]సహోద్భూతాంగసౌందర్య[3]సం
కలనాఖండనమండనక్షితిఁ దనుల్ గాంచెన్ విచిత్రద్యుతిన్. 262

కవిరాజవిరాజితము

ఖరకలిదానవవీరహరా ! పరికల్పితలోకశుభా ! యభవా !
గిరిబిలవాస ! విచిత్రతనూ ! పరికీర్తకభక్తగుణవ్రజయా !
కరి-రిపుసూనుకృతావన ! సర్వజగత్పరిపాలన ! సర్వమయా !
హరి-నరకేసరిరూప ! జగన్నివహప్రభవాఖిలరక్షలయా ! 263

1. కార్యముఁ(ఇది కన్నడపదము తెలుఁగులోవాడఁ బడి యున్నది, 2. సహజ.
3. పొందుట.

ఇది శ్రీత్రిభువనమల్లదేవవిద్యాపతి-కాశ్మీరక
భట్టబిల్హణ మహాకవివిరచితవిక్రమాంకదేవచరిత
మహాకావ్యంబునకు శ్రీవేంకటేశ్వర
శ్రీనరసింహదేవపాదపద్మారాధన
సమాసాదితకవితావైశారద్య
'ఆంధ్రబిల్హణ' బిరుదాంచిత
లక్ష్మణ-విశ్వనాథ
కవిసోదరాంధ్రీకృత
మహాప్రబంధంబునందుఁ
జతుర్థాశ్వాసము
సమాప్తము

---

# విక్రమాంకదేవ చరితము

## పంచమాశ్వాసము

క. శ్రీరమణ! వేంకటేశా!
వీరనృసింహేశ! వేదవేద్య! సురేశా!
సూరిస్తుతపదపద్మా!
భూరిగుణా! దేవదేవ! బుధజనవంద్యా! 1

### సాయంకాలము

ఆ. వె. క్రుంకు దైన [1]మిగులుకుంకుమారుణకాంతిఁ
దనరున్నృపవరుసతులఁ దాఁకుట ననఁ
బాటలత్వ మంతఁ బైకొనఁ గాంచిన
రశ్మిపటలి దివసరాజు గ్రాంచె. 2

తే. గీ. కంజినీపరిచితము లోకంటకముల
చేతనుంబోలె మిత్రుండు శీర్ణపాదుఁ
డగుచు సాగరతటమున కరుగుట కయి
పశ్చిమక్ష్మాధరస్కంధభాగ మెక్కె. 3

తే. గీ. స్నిగ్ధ మంబరతలమునాశ్లేష మంది
యపరజలధి మునుఁగురవియంశుచయము
పొట్టు దుల్చిన[2]చిఱుసెనగపొడినిఁ బోలి
పాటలం బయి యపుడు గన్పట్టనయ్యె. 4

---

1. అతిశయించు. 2. మసూరధాన్యము — ఉత్తరభారతదేశములో తఱచు వాడబడు ఎఱ్ఱ కందిధాన్యము.

క. [1]సన్నరుచి రవి సరిత్పతిఁ
గ్రన్ననఁ బడె రత్నకాంతిఁ బ్రార్థింప ననా;
సున్నతపదపతితులకు స
మున్నతసత్వంబు సున్న యురుమహిములకేన్. 5

ఉ. చంచుపుటీగృహీతబిసనంతతిఁ గోరు వియోగభీతి బం
ధించను గోకిఁ గంఠము గదించెదుత్రాడుగఁ జేయఁ; బెక్కు గ్రం
దించుఁ; ద్యజించుఁ జంచుగతనీరజకాండముఁ; బేన్ బుఠించుఁ; గా
వించదు కోక మేమి? చెలి వీడువిషాఽహతి త న్గలంచఁగన్. 6

క. ఉన్నత[2]కుజాగ్రముల, భూ
భృన్నికరశిరంబులను, [3]నివేశశిఖల, వి
చ్ఛిన్న మయి చగ్ధకాలవి
ధి న్నశినప్రియునికాంతి తెరలెఁ బలుగతిన్. 7

క; దీనన [4]సప్తినిఁ గనె దివి
జేనుఁడు; తన కిచ్చు నెప్పుడే ననునాసన్
బూనుగతి వార్ధిఁ జొచ్చె ది
నేనుఁడు [5]వీతులను మార్చునిచ్చమెయి నవాన్. 8

క. చరమదిగంగనమో మం
బరమణి ఘనరాగ మదరఁ బరిచుంబింపన్
సరసిజిని యేమిసేయును
వరాకి; తనతమ్మికన్ను వడి ముకుళించెన్. 9

క. వారువముల [6]కుప్పరమున
వారనివేగమున దూఁకులబడలిక నడఁచన్
[7]వారుణి నానంగ నన రవి
వారుణిజన్మమున నొప్పువారిధిఁ జేరెన్. 10

1. నశించిన. 2. వృక్షములు. 3. గృహములు. 4. అశ్వము. 5. అశ్వములు. 6. ఆకాశము. 7. మద్యము.



క. బింబారుణ[1]మిత్రప్రతి
బింబం బంబునిధిఁ జెంది [2]ద్విరసనవరశ
య్యం బవశించిన [3]తపనీ
యాంబరుకౌస్తుభవిలాస మంది యొసంగెన్. 11

తే. గీ. వారివారణసాధ్వసకారణమున
వార్ధిఁ జొర కుందున ప్తిదృక్పథము మఱుఁగు
పటపనో నాఁగ [4]నాళీకబంధుఁ డపుడ
వడి జగద్వ్యాపినిజధామపటము లాగె. 12

తే. గీ. త్రిభువనాంగణదీప మద్దినకరుండు
పవనమునఁ బోలె బ్రహ్మచేఁ బ్రశమ మొందఁ
బ్రబలముగఁ బర్వు[5]ధూమ్యాపరంపర యన
నీలతిమిర[6]వితానంబు నిక్కె జగతి. 13

క. రతనాలవరుస బింబ
ప్రతిబింబత దీపశంకఁ బడసె ననఁగ ఖ
చ్యుతుఁ డై [7]పతంగుఁ డంతన్
ద్రుతగతిఁ దాఁ దైలపాత్రతుల్యాబ్ధిఁ బడెన్. 14

క. ఇనవాహన[8]రింఖాక్షత
వననిధితీరగతశుక్తిభవమౌక్తికరీ
తిని వలె గగనము తారల
[9]కనకనలన్ దిలకితంబుగా దం బారెన్. 15

## అంధకారము

తే. గీ. పద్మవివరకుటీరకబంధభీతి
విద్రుతమధువ్రతాసితవిస్తృతాంధ
తమసరాశి నిరోధించె నమరమార్గ
మందు దృష్టిప్రసరణ మనంకుశముగ. 16

1. సూర్యుఁడు. 2. సర్పము. 3. విష్ణువు. 4. సూర్యుఁడు. 5. పొగల గుంపు. 6. మేలుకట్టు. 7. సూర్యుఁడు. 8. గిట్టలు. 9. ప్రకాశము.

క. నీలమణికీలితగాఁ
గాలాంజనపుంజభిన్నగా నెల్లెడలన్.
[1]కీలాలరాశిఘనక
ల్లోలప్లావితగ నిరుల లోకరమ దగెన్. 17

క. అలకసటాచ్ఛలరీతిని
[2]నలికములను విప్రకీర్ణ మయి [3]లటభలకుం
తలబంధవిభవమునఁ దమ
మలరెన్ దళముగను బింద మై యంతంతన్. 18

చ. సకలపిధానశక్తి గలసంతమసంబు కనుల్ ముదించి త
త్ప్రకటపటుత్వభంగమును స్పర్శ[4]హృషీక మొనర్చెఁ; హావడిన్
బ్రకటన సేయుతత్తిమిరవారము లెవ్వనిచూడ్కి నొంపఁ బో
వకట! ప్రియాభిసారవివశాంగభవార్తలదృష్టి తప్పఁగన్. 19

క. దుమ్ములతల్పమ్ముల సుర
తమ్ములతవు లందుతన్వితతికి సకలలో
కమ్ముకను లాఁపుతిమిరచ
య మ్మెం దెం దెనయఁ బోదు యవనికలవిధిన్. 20

క. చరమగిరిచఱియ నఱకెడు
సురవడి రవిరుచులు చిద్రుప లొందినయటు లై
పఱఁగెను దీవ్యద్దీపక
కిరణములు తమిస్రదంతికిన్ [5]సృణిసరణిన్. 21

అభిసారికలు

క. తరుణులు గనిరి నిరంకుశ
సరణిఁ గ్రమాభిసరణముల స్వప్రియులను పూ
త్కారణముల దివ్వె లార్చుచు
[6]సరణిన్; స్మరుచాపలంబు జయమున్ గనెడిన్! 22

1. జలరాశి (సముద్రము). 2. నొసళ్లు. 3. సర్వాంగసుందరులగు స్త్రీలు.
4. ఇంద్రియము. 5. అంకుశము. 6. మార్గము.



క. ఖరసహిత యగుచు రజకిగ
శరీర మనువుపఱచి యొకచాన జనులక
న్నొఱఁగించి సంచరించెను;
స్మరుఁ డెవ్వని నేమి సేయ సాగింపఁ డిలన్. 23

తే. గీ. తనస్థలంబున సఖిని నెక్కొనఁగఁ జేసి
కరమునన్ దివ్వె ధరియించి కాంతురతి[1]ని
శాంతమున్ జేరె నొక్కనిశాకరాస్య;
యలరువిల్తునియుపదేశ మద్భుతంబు. 24

గీ. పాకపాండుర [2]శరకాండభాసుర మగు
వదనము వహించి పల్కెఁ బూర్వకకుబబల,
యాత్మగర్భంబునందుఁ బెంపారు చున్న
రోహిణీకాంతుపరిణామరూఢి నపుడు. 25

వెన్నెల

క. సురపతిగేహచకోరీ
పరిపీతత్యక్త మైనపటుకేతకపు
ష్పరజఃపాండురచంద్రిక
తిరిగె నపుడు పూర్వశైలతీరాటవిలో. 26

ఉ. తూరుపుఁగొండకొమ్ముల విధుం డల దోఁపగఁ జారుచందనో
దారవిలేపనభ్రుకుటిఁ దాల్చినటుల్ తగెఁ బ్రాగ్దిశాస్య; మ
త్తూరుపుఁగొండనెత్తమునఁ దోఁచెను గెందిమిరంబులందుఁ గే
శరతి ధాతుధూళిపరిలిప్తతనుం డన బాలచంద్రుఁడున్. 27

చ. రవి యరుణాంశుఁ డై చనఁ ద్వరన్ బిసినిన్ నెల మోసపుచ్చఁ ద
చ్ఛవి సవరించినట్టు లయి చాలఁడ మోన మొనర్ప దాని; స్వ
చ్ఛవిఁ దిమిరంబు భీత మయి సాంద్రధరాటవిఁ జొచ్చెఁ; నంజన
చ్ఛవిమలినంబు లయ్యె మృగశాబదృశామనముల్ విచిత్ర మై. 28

1. గృహము. 2. రెల్లుగడ్డి.

తే. గీ. అనమపర్వతకుంజభూప్రాంతములను
గుమిగఁ గూడినధ్వాంతచక్రముఁ గ్రమించి
పూర్ణచంద్రమయూఖముల్ పొలుపు మీఱె
దుర్గశేషము రచియింపఁ దొడఁగె ననఁగ. 29

తే. గీ. అసితతాళఫలశ్రేణికాఽన్విత మగు
పూర్వపర్వతవనభూమి పొలుపుఁ గాంచె
నిమ్నతిమిరశిరఃక్రమాన్విత యగుచుఁ
గుముదినీబాంధవకరోపగూఢ యట్లు. 30

చ. పగ లుపవాసముల్ సలిపి పారణకుఁ మొద లైనచంద్రికా
ఖగవధువుల్ నిగుడ్పుదృగఖర్వరుచాఽఽవళిచేతఁ బోలె నా
ప్పగ నరుణంబు లౌకుముదమోదకురుక్పటలంబు లుర్విపై
జిగిఁ గనె రత్నకంబళముచేఁ బరితఃపరివిస్తృతం బటుల్. 31

తే. గీ. మానినీబాష్పనిర్భరాంబకకదంబ
కముల ఖాళితుఁ డైనటుల్ కమలవైరి
యుదయరాగం బశేషంబు వదలివైచి
తూర్పుచెలి తీర్చుతిలకబిందువుగ నిలిచె. 32

క. జగములకుఁ బ్రియముఁ గూర్చెడు
నిగనిగలఁ బ్రుఖ్ఖ ననఁగ నీరజరిపుఁ డా
తొగమగువ మేలుకొలిపెఁ
దగఁ దనపాదముల నర్మతత్పరుఁ డగుచుఁ. 33

తే. గీ. వెండియద్దంబునిద్దంబు వెలితి సేయఁ
జాలి [1]యచలాద్రిశృంగవిస్ఫార మైన
యంబురుహవైరిబింబమం దలరు[2]చిన్నె
యంబరప్రతిబింబవిడంబి యయ్యె. 34

1. పర్వతము. 2. చిహ్నము.



తే. గీ. స్ఫటికశైలవిటంకసంచయము కరఁగి
నిండుగాఁ బాఱుసెలయేటినిచయమునను
బోలె, శశిరుచిపూర్ణ యై భువనలక్ష్మి
మానినీమానపంకంబు మాన్పి వైచె. 35

తే. గీ. పిండదుగ్ధసమం బగువిధునిధామ
మమితముగ మాంసలత్వంబు నావహిలఁగ
నమృతదీధితి తన్మిశ్రజార్ధ మప్పు
డబ్ధినీరు పైకిని లాగె ననఁగ నొప్పె. 36

తే. గీ. సకలదిక్తటపాటనశంకఁ గూరు
నిండుకిరణసుధాపూర మెనసె నపుడు
మంథభూధర[1]విశరారు మహితదేహ
కలితదుగ్ధపయోరాశి విలసనంబు. 37

క. కేకతరసనమము ప్రకృతి
శీతలముఁ భువనమెల్లఁ జెలగుహిమాంశు
[2]ద్యోతము వేనిమెయికి వి
ఖ్యాతపటీరంబు గాదు ? కాంతి-గుణములఁ. 38

క. ఎందేఁ జల్లుఁడు [3]ఘటికలఁ
జందనసితచంద్రికారసభరం బనుచుఁ
[4]బ్రమంది సఖీపదములనై
నం దయితలు లేనిస్త్రీజనంబు వచించెఁ. 39

క. తనమాన మడఁచి వడి మా
నిని యొక్కతె వెడలి ప్రియునినెలవునకై మఁ
జనుదెంచుగాలిగూడను
దనలాఘవమునకు నడ్డదలగాఁ దలఁచెఁ. 40

1. శిథిలమైన. 2. ప్రకాశము. 3, చిన్నకుండలు. 4. పోలి.

## మధుపానగోష్ఠి

క. ఈరీతి స్మరాఽప్తుం డగు
¹తారాపరివృఢుఁడు జరఠతను మించ నలం
కారంబులు దాల్చినతన
నారులఁ బానమున కూర్చె నరవరుఁ డెలమిన్. 41

తే. గీ. కుసుమశరునద్భుతాఽశుగఖురళి యగుచు
విభ్రమద్వీపబంధనపృథివి యగుచుఁ
గుంతలనృకాంతశుద్ధాంతకోమలీద్ధ
పానకేళీరభస మప్డు పరిఢవిల్లె. 42

వ. అంత నయ్యాసవపానోత్సవం బాలవాలవలయవిలసితసరసరాగల
తాఽనుకరణసువర్ణభాజనరమణీయారుణమధుధారాశ్రేణియు, శ్రేణీ
భూతక్షితిపతినితంబినీపరిచుంబనకేళీరభసత్రాసకంపాయమానమణిచష
కనివిష్టవిషమేషుప్రేరకసీధురసంబును, సీధురససౌహృదాఽవహ
విహాయో ఽ వలగ్నా ఽ శీగురుస్మరసంవననచూర్ణాయమానమానవనా
థైణీలోచనాతనుగళద్ఘనసారపరాగంబును, ఘనసారపరాగవిశదాఽ
సవపూరిత²పారీనివిష్టప్రతిబింబవిధాస్ఫుటికోపలపిధానాయమానయా
మినీకమనకమనీయంబును, గమనీయాఽసవసువర్ణపాత్రోత్థధూప
ధూమాయితనవప్రసవసౌరభసమాయాతమధువ్రతపంక్తియుఁ, బంక్తీ
కృతప్రమదాపాటలాధరదళప్రణామానుసరణ పాణితలఘటితఘటికాస
మ్ముఖాఽనీతమదిరంబును, మదిరాదృశాఽఽస్యప్రవేశసమయదశ
నాంశుసంగానంగకీర్తికందళదాసవపేశలంబును, పేశలతరపాటలా
ధరాప్రవాళకపోలతలస్థలదలిగుణమార్గణీకృతవిభ్రమప్రశస్తియు, విశ
న్మదనమదిరంబును, విశన్మదిరమదిరాఽక్షీవదనంబును, విశన్మదిరాక్షీ
వదనధరావరాంతరంగంబును, విశద్ధరావరాంతరంగరాగవారాశియు
నై విజృంభించుసమయంబున నంబుజారిఁగూర్చి నారీజనంబు:— 43

1. చంద్రుఁడు. 2. గిన్నె.



ఉ. వ్రాలెదవేలరా ! తుహినభానుఁడ ! నామధుభాండమందు; భూ
పాలునిఁ గుంతలాన్వయదివాకరుఁ గానఁగ లేవొ; యాతఁ డు
ద్వేలపరాక్రముం డగుఁ; ద్వదీయకళత్రము రోహిణీసతిన్
ఫాలతలంబునం దలకపల్లవముల్ గన కుండఁ జేసెడున్. 44

క. కైరవిణీఁ గాను; నీవిటు
లోరీ ! మధుపాత్రయెదుట నుండెద వేలా !
నీరమణీకంటికాటుకఁ
గూరుకళంకంబు సిగ్గుఁ గొలుపదె ! నీకున్. 45

క. మధుపాత్ర నున్ననిన్నున్
మధుయుతముగఁ గ్రోలి దాన మానవతీవే
వధుకారకుఁ గులకంటకు
వధియించెద నిపుడె పాంథబాధక ! చంద్రా ! 46

క. నామధుపాత్రముఁ దాఁకిన
బాములు రెం డలము నిన్ క్షపాకర ! యాభూ
కాముకుఁడు సైఁపఁ డిటు; నటు
నీమీఁదన్ గినుక రోహిణియు నిగిడించున్. 47

ఉ. తానవ మూనె దీవు శశి ! తంతునమంబుగ నిక్క మందఁగా
రానియొయారిఁ గోరి కనరా ! పరమార్థము క్షారవారిధిన్
నీనభమందునుండి పడునిక్కపుహేతువు చాపలం బగున్
గాని మ ఱొండు గాదు ¹మహికాద్యుతి వై తగునీదుబాధకున్. 48

ఉ యౌవతలంపటుండవు చలాఽక్ష్ముఁడ వౌ దని ²దారతారకల్
నీ విటు పానపాత్రముల నిల్వ నినున్ విడ కుండుఁ జాయలన్;
నీ విను దూఁకి యామినుల ³నీరవరాఽశను జెందుటన్ దురా
శాఽఽవిలు నిన్నుఁ జేయుఁ గకుబంగన యందునిజంబు నెంచెదన్.

1. మంచు. 2. భార్య లైననక్షత్రములు. 3. వరుణునిదిక్కు.

క. నామనమునఁ గలనిర్మల
కాముకవరుఁ గలఁచె దేల! ఘనమన్మణిపా
రీమదిర వీడు మెఱుఁగవె
వీమేనన్ గలుగుకందు నీరజవైరీ! 50

క. అనిలమునఁ దరళభావం
బెనసియుఁ దీపములఁ బోలి యెగుడుదిగుడులన్
బొనరతు వెద్దియొ కనుకో
ర్కి నదియుఁ బ్రాపించువేళ గీల్కొనె నీకున్. 51

క. నిను బహువల్లభు నిచ్చలుఁ
గను వంచిత యై వరాకి క్షప; నిలుచు నభం
బున విప్పినతారల నీ
యనయచరిత మరయ నెల్లయందున నదిగో! 52

క. దృక్కున భావం బరుణిమ
చెక్కుల విభ్రమముకతము చెన్నగుబొమమో
డ్పెక్కరణిన్ [1]వరలాలనఁ
దక్కుచెలులమాన మెచ్చఁ దనరె మదంబున్. 53

క. అతిశయలీలాఽర్ధనిమీ
లితనేత్రయుతాబలాఽఽవళీమంజులజ
ల్పితముల నీగతి విని భూ
పతి యెంతయు సమ్మదంబు వడసెన్ దనలో. 54

సురతము

ఆ. వె. పానకేళివిభవపరిపాటి నందించి
మత్తపక్ష్మలాక్షి మహిషిఁ 'జంద'
లాఽఽఖ్యదేవిఁ గాంచి యపుడు గుంతలనేత
తల్పగృహముఁ జేరెఁ దత్సతిఁ గొని. 55

1. ప్రియసాంత్వనము.



క. ఎది మదనున కాయువు నిడు;
నెది ఫల మిడఁ జేయు యౌవనేలాజము: నె
య్యది యగు రాగాబ్ధికి సుధ;
యది యచటన్ నలిపె భూతలాధిపుఁ డపుడున్. 56

క. ఇరువురిముఖవిభ్రమవి
స్ఫురణంబిటి నెఱుఁగఁ జనదువో! ప్రీతి సదృ
క్సరణిన్ బొడమెను వారికి
స్మర[1]శరవిష్టరతులాప్రమాణ మయినటుల్. 57

క. ఇతరేతరదృగ్లీలా
నితాంతకౌతుకరసాఽప్తి నిద్రాకుతుకాఽ
యతినైనన్ ద్రుటినేన్ ము
ద్రితలోచనపుటులు గారు వృద్ధిఁ గనురతిన్. 58

క. గురుతర మై [2]చిత్రలలిత
వరనిధి యై పఱఁగుకేళివసతిఁ బ్రణయమున్
సరి యగుటలు తెలియ నవాన్
మరుఁ డిడె మానంబు వారిమనముల సారెన్. 59

వైతాళికులు

మ. సరసం బై కడుభిన్న మై తనరుషడ్జధ్వానగంభీరవా
క్పరిపుష్టాద్భుతభంగి యై యమృతసంభావ్యంబు నై మించు వా
క్సరణిం గూరిచి యంతఁ గల్య మగుడున్ గల్యాణగానంబులన్
సురతాగారముచేరువన్ సలిపి రస్తోకంబుగా [3]మాగధుల్. 60

ఉ. రాతిరి దీతె దేవ! నిదురన్ విడు; మంబరభూరుహంబునన్
జీతరుచిన్ గనం బడియెఁ బెం పఱి రిక్కలపూలప్రోపు ల
చ్ఛాతశరాఽప్తమిత్రుఁ డగుసోముఁడు పంచషమాత్రలంతలోఁ
బాతముఁ గాంచు నయ్యపరవారిధిసైకతరాజహంస మై. 61

1. ధనుస్సు. 2. అద్భుతవిలాసము. 3. వైతాళికస్త్రీలు.

మ. లలితం బయ్యె విలాసకీరరుతి లీలాభిన్నషడ్జాఽయతిన్
గళితం బయ్యెను దంతపుంబరణిఁ బోల్ కంజారియందుండి వె
న్నెల దేవీ! మిహిరుండు దూర్పుదెసకున్ దీర్పున్ విభూషాస్థితిన్,
జలజాతచ్ఛదవిభ్రమాంచలలసచ్చక్షుర్ద్వయిన్ విప్పుమా! 62

మ. లలనామీనలలామలేఖలిఖనాలబ్ధానువాల్లభ్యముల్
జలజాతాంబకలంఘితజ్వలనవిస్ఫారాస్త్రమార్గాఽయతిన్
వెలయం గల్గినదీపకాంకురము లెంతేఁ గాంతిహీనంబులై
తెలవారెన్ దుముగ్రమ్ము[1]షణ్ముఖహయశ్రీచూళికన్ బోల్ ధవిన్. 63

శా. ఎవ్వాఁ డంగజరాజపాంథవనితాబృందారిసేనాఽగ్రగుం
డెవ్వాఁ డెల్లెడఁ జిమ్ము వెల్గు భువనాహీనాఽర్తిశాంత్యర్థమై
య[2]వ్వార్జాతసపత్నుఁ [3]డుజ్జ్వలరసప్రాలంబకుం డొందెడున్
మవ్వం బేదఁగఁ బృష్ఠరేణుసితకూష్మాండప్రకారాఽకృతిన్. 64

తే. గీ. ఖండుఁ డయి యెన్నియేన్ రే లెవండు దాల్చు
నంగజపరశుసదృశకృశాంగభంగి
యామినీభామముఖపటీరాంకబిందు
[4]వింక నిందుఁడు కనువిందు గ్రుంకు చుండె. 65

మ. కల[5]నానన్ బరివారవారిజదృశాకాండంబు హెచ్చింప మి
క్కిలిగా వంచినమోములన్ దగుకురంగీలోచనల్ ఖండితల్
కలఁతన్ గాంచిరి నున్ననౌతొడవులన్ ఖండించుటన్ జంతమై
తుల లేనట్టికపోలపాళిఁ గడు దృక్తోయంబు తూర్ణంబుగన్. 66

ఉ. మారుఁడు రాగికంఠముల మర్మభిదాపరిపాటిఁ గూర్పులీ
లారసదర్పపాశపటలంబులు, మానగజాంకుశంబులున్,
సారసనాళతంతుసదృశంబులు నంబుజవైరిపాదముల్
ధారణినాథ! కోకసురతంబుల సాక్షులుగాఁ జెలంగెడున్. 67

1. కోడిపెట్ట. 2. చంద్రుఁడు. 3. శృంగారరసంజీవనుఁడు. 4. ఇగురఁగా.
5. సిగ్గు.



తే. గీ. నిరుపమార్థంబు స్ఫురియించుఁ; బరిణతోక్తి
పరిచయం బొందు నకవివాక్సరణినేని;
సుకవి! సారస్వతపువేళ యొకఁ డగు నిది;
క్షణమ కావ్యావహితచిత్తసరణిఁ గనుమ! 68

మ. పటుగండస్థలదానదుర్దినపయఃపంకంబులన్ సంపదల్
మటుమాయంబుగ ముగ్గి ధాత్రీధవధామప్రాంగణక్షోణిఁ బి
మ్మటఁ గన్పట్టనియట్లఁ జేయఁ దగునీమాతంగముల్ శృంఖలా
రటనాంఘ్రిక్రమ మొప్పఁ బాంసుతతపర్యంకస్థలిన్ లేచెడున్. 69

మ. మరుతూపుంగమి సోఁకునాథులనతుల్ మాయింప రా కుండి, చం
దురువెల్గుల్ చెదరింప రాక బిరుసై తోరంబుగాఁ గుక్కుటో
త్కరతాలుస్థలసంకటప్లుతనినాదక్షుద్ధమై వీడెఁ దా
మరసాఽస్యాఽవళిమానపుంముడులసంపర్కంబు భూమీశ్వరా!

ఉ. కైరవభైరవుండు ఖరకాండుఁడు ప్రాక్క్షితిభృద్విలాసవి
స్ఫారుఁడు మానిచెన్ దిమిరభారముఁ; గైరవబాంధవుండునున్
గూరినసాధ్వసంబునఁ జకోరిక లాని మిగుల్చుమంచునన్
గూరె నకాలమందున నకుంఠితతండులచూర్ణపాండుతన్. 71

మ. స్మరునానన్ విలు చున్నవారలకు నుత్సాహంబుఁ గల్పించి దు
స్తరభీతిన్ సుదతీమనంబులను విస్తారించి లేఁబ్రాయపున్
నరులందున్ నడకల్ గనుంగొనఁగఁ గందర్పుండు గా వుంచె నాఁ
దిరిగెన్ సారససౌరభగ్రహణవృత్తిన్ గల్యవాతూలముల్. 72

చ. ఇరుకడ లెక్కి పాఱుచరలేటివలెన్ వినువీధిఁ గ్రమ్మి చె
చ్చెరఁ దుహినాద్రితాపరుపుసీమలఁ జందనపంకభంగియై
పెరుగుచు నిప్డు గూర్కుఁ గను వెన్నెల [1]యాంధ్రులకండ్ల నిల్చుదే
వరకు జగత్త్రయీకమనవశ్యకరౌషధియోగచూర్ణమై 73

1. ఆంధ్రస్త్రీలు.

తే. గీ. [1]ఖండితాగండములఁ దమకాంతి నుంచి
నట్లు దీపంబు పాండిమ మందికొనియె;
[2]విప్రలబ్ధాఙ్గనలన్ దేమ విడిచి [3]స్వకము,
దాఁచినట్టులఁ జంద్రకాంతంబు లెండె. 74

చ. [4]తెరలి [5]నిషాదభీత మగుదేవవరేణ్యగజంబునుండియున్
బఱఁగియు గుంపుగా [6]నరుణబాధితవన్యగజాళి ద్యోస్థలిన్
[7]దరము రుతించు వన్య[8]హయదస్యువులన్ జన మానబాధలన్
దరణిహయాలు తూర్పుగిరిఁ దత్తఱపాటునఁ దూలి వీడెడున్. 75

చ. దరులగిరుల్ తమిస్రములఁ దారిచి మోస మొనర్చె నాన్ దివా
కరుపదముల్ శిరంబులను గైకొనె నంతట వాని కెట్టులో
శరణ మొసంగుహేతువున [9]సావి నవాంబుజబాంధవుండు ద
చ్ఛిరములనే కరంబులను జేర్చి చెలంగెడు బాఃప్రపూర్ణుఁ డై. 76

చ. మరునికటారులైదును హిమద్యుతిశాణశితంబు లయ్యెఁ జై
చ్చెరఁ గడు మోదుఁ గాంచు వడిఁ జేర్చిన నేనయహీనలందు; నా
గరితలు నెత్తులం బొడువుకై రవపల్లవముల్ పడంగ ని
ల్తురు విధిగాఁ బ్రియాంఘ్రులకు లొంగి కవుంగిటఁ గోర్కి మీఱఁగన్.

చ. [10]నిరతి గతాగతంబులను నిచ్చలు భానుజగానకున్ గడున్
బఱఁగినసూరుతేరు విడువార్వము లన్ భ్రమఁ బాయఁ జేయునీ
తురగబలంబు మేల్కొనును దూఁగి రమాశుభదుంధుభిధ్వని
స్ఫురణముచేతఁ [11]గల్యపరిశోభిత[12]హేషితరీతి [13]మందురన్. 78

1. నాయకుఁడు రాత్రి వేఱొకస్త్రీకడ గడపి యాగుర్తులతో రాఁగాఁ జూచి కోపించునాయిక. 2. సంకేతస్థానమునఁ బ్రియునిఁ గనక మోసపోయి వ్యాకుల యగునాయిక. 3. తనది. 4. తొలఁగి. 5. మావటివాఁడు. 6. సూర్యసారథి. 7. కొంచెము. 8. మహిషము (అశ్వశత్రువు) 9. అని. 10. తత్పరత. 11. ప్రభాతము. 12. సకిలింపు. 13. అశ్వశాల.



చ. అసురవినాశహేతు వగునన్వయమందు జనించుటన్ [1]బిస
ప్రసవభవుండు బంధ మగువాఁడు, పయోధికిఁ [2]దాపి-సూర్యజా
ప్రసవముచేత మామ యగువాఁడు, సమస్తజగద్విటంకదీ
పనముఁడు తత్క్షణప్రభవబాలదృగర్హత [3]హంసుఁ డొప్పెడున్. 79

తే. గీ. కినుకమెయి లేచి పోవ నుంకించి కదలి
ప్రాక్స్ఫుట[4]త్తామ్రచూడరుతంబు దోఁపఁ
దుమ్ము మొరలగునెపములఁ ద్రుటి వచించి
మఱల వరకేళిశయ్యలఁ దొరఁగి రాంద్రు. 80

చ. గౌరీవల్లభఫాలదృగ్జ్వలనదగ్ధ[5]స్వాంతభూచందనో
దారస్ఫారరసావదాతరుచిమ[6]ద్ధారాగృహత్వాఽఽయతిన్
దీరం గల్గినచంద్రుఁ డస్తగిరి దీప్తిం బాయ [7]క్షౌద్రాన్విత
స్ఫారానూనపిశంగమాహిష[8]దధిచ్ఛత్రచ్ఛవిన్ గన్పడున్. 81

క. క్షితిపులు జవదాఁటనియా
నతిఁ దగి మరునాస శిరమునం దాల్చుమహీ
పతి మాగధీనుతిన్ విని
సతి[9]యుపధానంబు దనభుజంబుఁ దొలంచెన్. 82

### రాజు కల్యాణపుర ప్రవేశము

ఈ పద్యమునుండి 137 వ పద్యమువఱకు అచ్చుతెలుఁగు.

క. పలుపగల నిమునమట్టుల
వలరాజున [10]కిందువేడ్కపనులఁ గడపి కుం
తలుఁ దల వేసవి గాఁ దన
పొలఁతుకతో నెలమిఁ దనదు ప్రోలిన్ గడఁకన్. 83

క. దరియఁగ నయ్యేలిక ప్రో
ల్సొరఁ బడుటను వినినయపుడ చొప్పడె వేడ్కల్
తరతరమ పొదల నోమెడు
గరితలకున్ జిలుకరౌతు గఱపెడుచెయ్వుల్. 84

1. బ్రహ్మ. 2. తాపీ-యమునానదులు. 3. సూర్యుఁడు. 4. కోడి. 5. మన్మథుఁడు, 6. జలగృహము. 7. తేనె. 8. పెరుగుమీఁగడ. 9. తలగడ. 10. ఇంపు.

## పౌరస్త్రీల మన్మథచేష్టలు

వ. అంత నయ్యేలిక ప్రోలన్ మేలిరాదారిన్ దీరినపౌరునఁ జను చుండఁ బ్రోయాంద్రలో:—

దారిని జారినమగఱాలినునువాలుకొన గ్రుచ్చికొనినడాకాలుఁ బై కెత్తి యయ్యేలికఁ గొలువ ననా నొంటికాల్నోము గోమునన్ బూనునొక చెలువయుఁ, జెలు వలరుచెవితొవదుమ్మునన్ గ్రమ్మునీరున నొక కన్నును జెలునగవు దొలఁకాడుకడమదియుఁ గలిగి మెలి గొన్న తలంపుల వెలిఁ బెట్టుదిట్టతనంబున మరునాటకత్తియ నాఁ దగునొక కలికియుఁ, గలికితనంబునన్ గిటికీసందులలోనుండి తేనిఁ గని వలతేనికి గుఱి యగుచు వానికి విల్లునఁ గలవలంతితనంబు వెల్లడించు నొకప్రోడయుఁ, బ్రోడతనంబున నించువిల్కానిగుఱించి "మీాతేఁడు వాఁడిమగలన్ దలకట్టు, కట్టెదుటఁ గన్పట్టుఁ, బోటరి పైన దీటుఁ గొని మగంటిమి నిగిడింపుము, ముగుదలకు బెదరుఁ గూర్తు" వను పరుసంబులఁ గసరునొకజాణయు, జాణతనంబుతగవునకుఁ బిలువ మగువల కంపినకమ్మగాఁ జెవి వీడి నిట్టూర్పుగాడ్పునన్ దవ్వులన్ జనుకమ్మన్ గని యెమ్మెఁ జిమ్మునొకసింగారియు, సింగారించిన పెన్గొరునెక్కినయేకిమీానిఁ గని యతనికి సరిఁ బఱఁగునురవడి మత్తుఁ గనుమరుగొరు నెక్కినటులఁ దలంచు నొకమించుఁబోఁడియు, మించుఁబోఁడిమి గలిగి యొడ్యాణంబున రాజించు గుజ్జుగజ్జియల మ్రోఁగించియుఁ గ్రైతొడవుల మివుల నులివుఁ గొలిపియు తేనిఁ దన్నుం గానఁ జేసిన దై తననేరుపునకు గరువపడి మెడ నిగిడించు వేబొకయొయ్యారియు, నొయ్యారితనంబున రాకొమరు నరయు నురవడి వేడుకరాయంచలు వెనుఁ జన వడిన్ జనుచుఁ దగవు కా దనుబెదరున వలె తేనిఁ గని తనయంచనడ వీడునొకయింతియు, నింతింతియ కానిసోయగంపుఁదరఁగల మిగులఁ దొలఁకాడుచు



హొయలు వెలయించుతనకనుబొమతీవియఁ దవులుకొని నిలుచువల పులతేనిఁ గ్రేగంటిచదరంబున నాడించునొకమిటారియు, మఱియును:–

సీ. [1]కుంకుముకెంజాయఁ గొనరుమైపసఁ దగి
యెమ్మెమైఁ గ్రైదీవ నెత్తె నొకతె,
తన్ను బాటింపనిమన్ననిఁ గని వడి
రహి మీాఱఁ దనమెడ వ్రాల్చెనొకతె,
మొలపైన డాకేలు పూనిచి తనవంగు
కేలుడాలున నిల్చి వ్రాలె నొకతె,
యెఱుపుతాసోరణం బెనసి నిద్దపునెల
వెలుఁగువెల్లనిమెయి నిలిచె నొకతె,

తే. గీ. వలవఱద ముగ్గి కేల్మూఁత వలచినటుల;
విల్లు గొన నెదఁ గలమరున్ వేఁడినటులఁ;
దివిరి దొర నొంప మరునివిల్ దీర్చినటులఁ;
బాలవలెఁ దాను మరునగ్గి వ్రేలినటుల. 86

చ. తనిసినటుల్ తలంచికొనుఁ ద న్నొకయన్నులమిన్న, తేనిగొ
గ్గునఁ గలవల్వచేఁ బొలుచుక్రొవ్వలితెమ్మెరఁ జెమ్మటల్ సనన్;
ననవిలుకానివిం దయిననాతికి మో మయి తేఁడు పల్కుచోఁ
గినుక నొకర్తు త్రిప్పు నఱ్రేఁగనుచూడ్కి బిరాన నోర్వమిన్. 87

ఉ. సామినిఁ జేర్చుమేలునకుఁ జాన యొకర్తుక దారిఁ గొల్చెఁ దాఁ
దామరతేకుబంతి ననఁ దద్దయు లత్తుకయంట్లు రాలఁగన్;
లేమ యొకర్తు తన్ దొర ల[illegible]న్ గన వ్రాల్చె మెడన్; మరుల్ నిలం
బోమినిఁ బూవువిల్తుఁ దనుబోయఁడు గూల్చెడులేడిపోఁడిమిన్. 88

1. ఈపైనాల్గు సీసపాదములు. ఎత్తుగీతినాల్గుపాదములతోఁ గ్రమాన్వయము గలవి.

చ. నఱ[1]జడ నొందఁ గిన్కమెయి నల్వ పిఱుందును గట్టినంచు వే
పఱఁతి యొకర్తు నూల్విడిచి పైచి పడిన్ మునుఁ బోఁ దొలంగెఁ; బ్రే
ముడిఁ గని యావులించి జడ మూఁపున వ్రాల నొకర్తు తా మఱున్
గడు బెదరించునట్లు దగఁ గాంచుచు దాయఁడు కూర్మిఁ జూపమిన్.

గీ. తనకు విందుగ వచ్చుకుంతలున కెలమి
మన్నన లొనర్ప నిలుచునమ్మరునిచేతఁ
[2]బూన్పఁ బడినట్టు లొకపూవుఁబోఁడి గూర్చె
నెమ్మిఁ గ్రేఁగంటిచూడ్కుల నిడుపుదండ. 90

వ. ఈవరుసఁ బ్రోయాంద్రు పుడమియొడయనిఁ గనుచుఁ గొందఱు
పెఱల వెనుఁ ద్రోసి మునుఁ జనుసురవడి నీసుమెయి నొకతెంగూర్చి
వేఱొకతె తమలోన:— 91

క. సరములు తెగినను దిగ విడి
పఱుఁ గిడెదవు, చెఱఁగువల్వ పడిన నిలువ వీ
వరయుమ! నిజ మగుఁ; బాతెదు
తొరఁగినక్రేఁగొకఁ [3]దెగడి తొయ్యలి! తోడ్తోన్. 92

క. తొడుగులు తొడుగకయే యిటు
దుడదుడ దొర కెదుటఁ జనుట దొసఁ గెసఁగదు; నీ
యెదరెడు చనువ్రేగుమెయిన్
గడువెఱ నిదు; దొడనఱికఁ గడగా నిడుటల్. 93

క. నడయెగుడుదిగుడు గాకయ
పడునెపమున మోము వంతపా లగు టేలా!
వడి గెలుతురు తమవిద్దెలఁ
బడుచుల యిట ముగుద! మరునిపడఁతినయేనిన్. 94

1. అలసత్వము. 2. నియుక్త. 3. ఉపేక్షించి.



క. సందియము లేదు, నిను మఱుఁ
డొందెన్, గెందమ్మికంటిరో! వెదలితి వౌఁ
దొందరనరఁ; గొరడాడె
ల్పం దిని బెద రొందునాఁడు[1]భాభా వోలెన్. 95

క. నిలుతువు మెయి గదలఁగఁ జా
పుల కడ్డై మాకు ముందుఁ బొలఁతి! యదిగో! పెన్
జలమున నె త్తాసోరణ
ముల నిలిచెదువేలు చెలులఁ బొగులుదు వెట్టుల్? 96

క. వెలయించుచు నెలకూనలు,
కొలఁదియయిన. [2]తాఁగ! పోకరు గానె; దెవరిమెయిన్
గెలుపు మరున కిడుముల్కాని
కల నరు లై కలయ వెఱయ వలనెలగుఱుతుల్? 97

క. నేరుపుగరువం బనయముఁ
గూరు నిమన్; గొంత తేనిఁ గొలువుమ! పొలఁతీ!
[3]పేరులఁ దగుపేరుం బం
గారాకున మరున కిదుమ! కానుకగాఁగన్. 98

క ఎమ్మె లనువిండ్లు ముందుగఁ
బమ్మినసంబరముతోడ బల్బొమలాడం
గ మ్మెయిమెయిఁ బల్కెదుప్రో
ల్గొమ్మలనుదువులను తేఁడు గూర్మిన్ వినియెన్. 99

క. వెనుకన్ గినుకన్ జెవి [4]కిం
దనినుడిఁ దను నాఁపునత్తఁ దాఁ గని సైరిం
పను గాక యోర్తు తలఁచెన్
మును బున్నెము సేయఁ బడుపుఁబొలఁతిగ నగుటల్. 100

1. గుజ్జము. 2. జారిణి. 3. నామాంకిత మగుహారము. 4. ఇంపు గాని.

క. మొలబరువున నగు[1]గరువం
బలమినయటు లోత్తు గదలనట్టియడుగులన్
లలి నగరునఁ జనునాఁడే
స్గలను వలెన్ మన్నుతేనికొమ్మలఁ దెగడెన్. 101

క. మరుబారికి గుఱి యగుబి
త్తరులన్ దొర నరయఁ గోరుదాని కొకతెకున్
బఱఁగెన్ గన్రాపోకలఁ
బరు గామడగాఁగఁ జెవితావకుఁ గనుఁగొనకున్. 102

క. ప్రోయాంధ్రచూడ్కి వలచాల్
రాయంచగ తేఁడు దాఁటి రానగరులముం
జాయలఁ గొలకుల నంచలు
వాయనితనరాచవీటిపట్టున్ జొచ్చెన్. 103

గ్రీష్మము

క. కలయెల్లర కెలమియుఁ [2]గను
కలినెమ్మియుఁ గూర్చి ముదముగా నక్కజపుం
దలిరుంబ్రాయపుటుమ్మను
గలమేలిక [3]వడకుఁ దగినకలిమి గడించెన్. 104

క. సోయగముమ్రానిమొగ్గల
చాయఁ దనరు[4]నాణినగల సామి యొనంగెన్
బాయక ముజ్జగములకున్
దోయికి [5]నామెతల తుమురుతో వెల్లువ యై. 105

మ. వెలిముత్తెంబులచాలు బోల్చెమటసొర్వెల్లిన్ మెయిన్ జెంది తేఁ
డలరెన్ దీటుగఁ '[6]రామపర్ణి' యనువాఁగం దిమ్మగన్ సంద్ర మై;
వెలిగందంబున వెల్ల నొచనులతీవెంబోండ్లకాఁగిండ్లలో
గెలిచెన్ వేసవియుమ్మగాక [7]మరుసేగిన్ గూడ్కొన్ వేఁడియున్.

1. గౌరవము. 2. చూపు. 3. గ్రీష్మతాపము. 4. ముత్యములు. 5. అమృత శీకరములు. 6. విరహబాధ.



క. గందపుఁబూఁతమెయిన్ జ
ల్లందన మూనుమెయితో నెలంతలయెదలన్
బొం దయి యొదయఁడు [1]కెందొగ
విందల్లనివేఁడివేఁకిఁ బెనిచె వెఱఁగుగన్. 107

క. గందపుఁబూతన్ దెలుపుం
బొందుపుడమితేనిమేనిపొంత లెసఁగెఁ జ
క్కందనపుఁగడలిదరి మి
న్నందఁగ నుప్పొంగి వాని నలమెనొ నాఁగన్. 108

క. ఏలిక మూపుల రెంటన్
దాలిచె గందంపురేకదంటను [2]గెలుపున్
వేలుపుబోనముఁ గ్రోలెడు
రాలచ్చికి వెండిగిండ్లు రహి నిడినయటుల్. 109

ఉ. ఏలికమూపు లొప్పె నెనయించినగందపుఁజుక్క లొంది సాఁ
బాలుగ నేలఁ జేసి తమపై నిలుపన్ [3]వలితెల్లఱామలల్
దాలుచుకొమ్ములట్లు, గయిదండఁ గలంగుదురంబుసంద్రపున్
వేలుపుబువ్వయుండజత బీరముఁ దెల్పగఁ తేఁడు దాల్పె నాన్. 110

క. మొగమందున నిలిచినమది
మగువ గొలువ నిలుపుమంచుమలయల్లునిరూ
పగు నన నొసటన్ దీర్చిన
జిగిగందపురేక ధారకుఁ జెన్నున్ గూర్చెన్. 111

క. జగ మలముప్రొద్దువడ వోన్
దొగవిందువెలుంగుఁ గవియు[4]తోయమునఁ దగెన్
జిగిగందపుఁబూఁతన్ వలి
[5]రగులుఁమలకుఁ బోలిక యగురాకొమరునాడల్. 112

1. మన్మథదాహజ్వరము. 2. విజయామృతము. 3. మంచు గలస్ఫటికాంద్రి. 4. విధము. 5. అతిశయించు.

క. సోయగపుఁగదలియల నాఁ
డీయనివిత్తుఁ దను[1]మింటిత్రిమ్మరియడిదం
బో యన నిగఁ గనువేసవి
నాయేలిక తాన మైనయాలికిఁ దీర్చెన్. 113

ప్రకారాంతరానువాదము

క. మీన్దాల్పుమింటిత్రిమ్మరి
యందినవాల్రేకఁ బోలె నందపుఁగదలిన్
జెందెడుతరఁగలుగా దొర
పొందించెన్ దురముఁ జెలికి మున్గుపు గాఁగన్. 114

క. మొగముతొగవిందునందున్
నిగిడెడుసిరియందెరొదకు నెమ్మిని దిగువ
ల్కగరితయంచ యనా నెర
నిగఁ గనె గందంపుఁజుక్క [2]నేనికిఁ దొర వై. 115

క. [3]చలిమిరిక్తై కై వేయం
చులవా ల్పోల్తామరాకు సొప్పడ వేర్వైఁ
గలవేడుకవెలితామర
చెలఁగె దొరకు సిరిమగనికిఁ [4]జిందమువోలెన్. 116

క. ఏలికయెద గందముచేఁ
దాలుచురేక దగె వాయిఁ దగఁ జన్నుపలుకుం
గోల[5]రవా లగుచెలిపు
ల్గోలిన్ దను ముక్కునుండి నూడుచుతూఁ దై. 117

సీ. విరివిగఁ బఱఁగుతుంపురుల పెన్పరులతో
మంచుసోనను గురిపించునటుల,
నంతటఁ బటికంబు లమరిననేలచే
వలిని తారుష్ణ్యగాఁ బడసినటులఁ,

1. విద్యారథుని (దివాకరుఁడు) కత్తి. 2. తేనిక. 3. చలువ. 4. శంఖము.
5. వాహనము.



బెనుచలిన్ ముడుఁగువేవెల్గువెల్గులచేత
ము న్నెన్నఁడును ముట్టఁ బోనియటుల,
నెండ నేనియు నల్వ యువము నూర్పఁగఁ గావఁ
బూనుచుపెన్గోట లైనయటుల,
తే. గీ. విచ్చుమొగలులరేకులఁ బేర్చి గంట
ములగములు పైకిఁ బొడుచుక మూఁగినటుల,
మబ్బులను బోలునరఁటాకుదిబ్బ లలమి
చుట్టఁగను దమ్ముఁ దొవసూడు సూడనటుల. 118

క. సోరణములసందులలో
బారులుగా నచ్చ మౌచు బయలువడెడు నీ
ర్ధారలనెపమున వేసవి
బీర ముడుప ములుకులవరి వ్వేపలపు ననాన్. 119

క. వెలయుచు బడ లఱ మరునకు
విలు నెక్కడ నాన పెట్టుపె[1]న్దారలయి
మ్ములఁ గొమ్మలతో నదిప్రౌ
ఢ్దుల నానదిజగమునేలుదొర లలి నిలిచెన్. 120

ఉ. గందపుఁబూఁత వెల్లనినిగన్ వలికొండవలిన్ జెలంగి చ
క్కందనమిక్క లౌచెలులగబ్బిచనుంగవ లంద గాఁగ రా
చందురుఁ దొప్పె ముజ్జగము సాఁగిల నొప్పు[2]తలంపుచూలితే
నిం దులకించునట్లు వద నీల్గఁగఁ జేయఁగఁ జాల నైనటుల్. 121

క. వెలఁదుల గంద మలందని
వలిమేన్, [3]గలిగొట్టుఁదీవవలనన్ దొగ రౌ
వలికరువలి, [4]నగుమల్లియ
వెలసె నపుడు గావ మరునిబీరము నచటన్. 122

1. ధారాగృహములు. 2. మన్మథుఁడు. 3. పాటలలత. 4. నవ్వు(వికసించు).

చ. ముగుదలతళ్కునీర్వలన మోనము నొందుచుఁ [1]గుంటఁ బాలు నాఁ
దగుతెలినీటిలోఁ బడుచుఁ దారవు నీరును బాలు వాపఁగా
నగునెఱ కంచ లన్నులకు నంత నడల్ గరయించి యందెలం
దగుమలి వొందె నా నిలిచెఁ దమ్ములఁ దుమ్మెద లంటి మ్రోయఁగన్.

చ. ఎలమినిఁ దాన మాడుదొరయింతులమోములరిక్కతేండ్లతోఁ
జలమును వీడఁ జూచె ననుచాయను దమ్ములు వారికాళ్ళపైఁ
గలసిరి నుంచు నెందు; నెటఁ గల్కులతుంటుల రేఁగి నిక్కుపె
న్నలలయుయేల [2]బెగ్గురులు హాయిగఁ గూయుచు నూఁగుచుండెడున్.

చల్లుపోరు

క. ఏలిక యాలలి నిడుపుగఁ
గ్రాలుచుఁ బొగ డొందుతోఁలఁ గల[3]వేడ్కకెళా
కూళులఁ దనగోలలతో
మేలంబునఁ [4]జల్లుపోరు మిగులన్ సలిపెన్. 125

సీ. [5]అలయుచెలులగొట్టములదార లనుమరు
కోల లొందెదునల్లడా లనంగ,
దొరమేనిజిగినీటఁ బఱఁగెడుమరుమీనుఁ
బదయ గాలపుదార మిదుట యనఁగ,
గరితలగమి కాన్కగా మరుదొరకయి
యందుఁ బడన్ జిమ్మునంచ యనఁగఁ,
గైఁగ్రోవిదారలఁ గడుఁ గల్కు లగలింప
[6]న మ్మెత్తుమరుగుఱి యయ్యె ననఁగ,

తే. గీ. తేనిక్తైఁ దామరాకు పేర్మిని గడించెఁ;
దర్ద నిడుపుగఁ జెలి చిమ్ముదార దసరె;
తేఁడు దారలతీవలగూఁడునఁ దగె;
నెక్కటిమగండు తేఁ దుక్కు దక్కి నిలిచె. 126

1. కొలఁకునందు. 2. సారసపక్షులు. 3. విలాస క్రీడాసరస్సుల. 4. జలక్రీడ.
5. ఈసీసములోఁ దొలి నాల్గుపాదములకుఁ గ్రమముగా నెత్తుగీతమునాల్గు పాదములతో నన్వయము. 6. బాణము.



చ. కలుకులచన్నులన్ బొలుచుగందపుఁబూఁతలు తేండ్లమిన్న వి
చ్చలవిడి రువ్వుదారల నెసంగెడునీరున జారు చుండఁగాఁ
దొలఁగెడునో యటంచు నల [1]తుమ్మెదయల్లెగలట్టిమేటి దా
వలపు నొనర్చె వారియెదఁ బాయనిచిక్కనిరంగుబొమ్మగన్. 127

క. చక్కనిచూపులపైదలి
చెక్కిలిఁ గైఁగ్రోవిదారఁ జిమ్ముదొర దగెన్
నిక్కు[2]తొనవీవనేస్తుని
యక్కునఁ దనవెల్గుగడను నన్పెడు[3]ప్రొద్దై. 128

క. దొర చిమ్మ గొంతు గుఱిగాఁ
బఱతెంచెడునీటిదారఁ బడఁతి యొకతె దా
నరయుచు వంగుచుఁ బొరలుచు
మురువుగ మరుకత్తిదారఁ బోలెన్ దాఁటెన్. 129

చ. వెలఁదులచన్నులన్ దొరఁగు[4]వీఁజియ న ల్పగుసోనసీ రనన్
దలఁకుచుఁ దిర్గునంచగమి నవ్వ గమించఁగ. జారుకుంకుమున్
గలిసి తొగర్గడించె మరుగౌ రెలమిన్ మునుఁగంగ నౌదలన్
దొలఁగెడు[5]చెంద్ర మొందుసవి దోఁపఁగ బావులనీరు లత్తుఱన్. 130

క. అలలఁ జెలఁగి వేడుకముం
గిఱులన్ గలకొలఁకులందు నిగిడె [6]సిరముదు
మ్మల మలయల్లునలుకచి
చ్చు లలఱన్ ముస్గువెడవింటిజోదుబసుమ మై. 131

క. క్రమ్మిననల్ల[7]యగల్ఘోగ
[8]నెమ్ము దొరఁగుచెలులచంటినెలవులయందే
కమ్మనివిల్డాలుపు దా
నెమ్ము మిగులఁ గనియె నిద్ధి [9]నెఱి నక్కజ మౌ. 132

1. మన్మథుఁడు. 2. చంద్రుఁడు. 3. సూర్యుఁడు. 4. కస్తూరి. 5. సిందూరము. 6. చలువఁదనమునకు స్థాన మగుకర్పూరము. 7. అగరువు. 8. తడి. 9. పూర్తిగా.

క. ఆమని కెలనఁ గ్రాలమి
నామనిచెలికాఁడు దొనల నమ్ములు లేమిన్
[1]జామలవిరిమల్లియలన్
గో మరుక్రొమ్ముదుల [2]దిటము గొనకొని నిలిచెన్. 133

క. తరఁగలవరుసలఁ గాటుక
దొఱఁగినదొరచెలులకనుల[3]దొర లై వఱలెన్
విరివిగ [4]నూతెదుఱాఁతన్
బొరలుపఁ [5]బులు వాయుమరునిముల్కిగములకున్. 134

క. [6]వేడుకఁ గ్రుంకుటఁ గుంకుము
లూడినయాంధ్రమెయి గోటియొత్తులు దాల్చెన్
వీడక సౌరుకదలిదరిఁ
గూడినపవడంపుఁగెంజిగురులనిగనిగన్. 135

ఉ. ఆపయి నాలిచెక్కు నొదయందు కదున్ మెయి గగ్గురింపఁగా
రూపులు కస్తురిన్ మురువు రూపడఁ దీర్చుచు నుండ, వేర్పెలుల్
మో పగునీసుఁ జేసి తెలుపున్ గనుచెక్కులఁ బర్వ కంటినీ
రాఁపనటుల్ దొలంచి బిరు సౌకదకన్నుల రువ్వి రద్దొరన్. 136

క. గొం తించుక యెత్తినయొక
యింతికి దా నంతఁ దురుము నిడఁగన్ గనుచున్
[7]వంతవడ వాడుచెక్కుల
వింతగ నిడుకేళ్ల ప్రేదుల [8]వెక్కిరి పెఱలున్. 137

క. ఆమని సన బీరం బఱి
పూముల్కులమేటి కిట్టిపోకల బిగి గాన్
జామల వలిఁ జిమ్మదనుల
సామ్మి గదిసి వదగరువము సదలిఁచె మిగులన్. 138

1. కాంతలు. 2. ధైర్యము. 3. సమానము. 4. నికషోపలము. 5. మొలిక. 6. విలాసస్నానమునందు 7. చింతాతాపము. 8. బాధపడిరి.



## నిదాఘాంతము

క. తనబీరముఁ బరమోన్నతిఁ
దనరించియు దావభస్మతతిఁ దనయశమున్
గనఁ జేసియు వేసవి యం
తన డించెన్ బౌరుషంబు ధన్య మయినటుల్. 139

క. దినములఁ గొన్నిటఁ దీంద్రముఁ
దనరిఁచి బీరంబు విడెను [1]దప మంతటఁ బెం
పున కిరవులుగా నెచ్చట
ననఘము మను చుండుదురు పరాపకృతిపరుల్ ? 140

## ప్రకారాంతరానువాదము

క. కొలఁదిదినంబులు తీక్ష్ణతఁ
జెలఁగించి ప్రతాపహానిఁ జెందె నిదాఘం
బల పరబాధైకపరుల్
మెలఁగుదురే చిరముఁ బెంపు మేకొని యెందేన్ ? 141

క. [2]కారగ్గి గాల్పువనములఁ
గూరినభస్మముల [3]మలలు కొమ రొప్పె నొదిన్
జేరినబాలతరులు సన
వారనివైరాగ్యమునఁ దపస్వితఁ గనె నాన్. 142

క. వదచేతవాడువాఁకల
నదిమియెదన్ విదిచి యుంపునన్ గూయుచు జా
రెదురాయంచలబంతులు
బెదఁగు లెసఁగుమేఖలలుగ వెలసె నదులకున్. 143

1. వేసవికాలము. 2. దావాగ్ని. 3. పర్వతములు.

చ. సకలజగంబులన్ గలరసంబుల మిక్కిలి క్రోలి, పీనతా
ప్రకటభరాతిరేకమున భాసిలుభాస్కరుభార మూనఁ జా
లక కడు మెల్లనౌనడుగులన్ జనువాజులయందుఁ బోలె నిం
తకు మఱి యింతకున్ బ్రబలుదైర్ఘ్యముఁ గాంచుచు నుండె [1]ఘస్రముల్

చ. ఇతరసరిత్ప్రతానములు హెచ్చుఁ గృశించిన వై మునున్ జనన్
యతనము సేయుచున్ జరఠ మైనను జాపనిచోఁ దుషారప
ర్వతతటభూతరంగిణులపట్టునమాత్రమె నిల్చె నిమ్నగా
పతి కుపగూహనోత్సవము వారక వేసవి నవ్వి పాఱఁగన్. 145

చ. శిశిరశిలోచ్చయద్రవవిశిష్టజలోద్వహయక్షదిఙ్నదుల్
శిశిరతఁ గూర్చునట్టుల నశేషసరిద్వరహార్దికిన్ దగెన్;
[2]గుళ మటఁ దామరాకుగమి గూలి సపంకము గాన్, బరాఽపగల్
కృశత ననబ్ధిసంగ లయి యెద్దొ వియోగదశన్ జిరంబుగన్. 146

చ. [3]చలినెల వేలుదాన తనచన్నులదాయ వెలార్పఁ గుంద లన్
[4]లలిఁ గనుచున్ మొగంబులఁ దొలంకినమూఁకుడునీ రెఱుంగ; ర
చ్చెలినునుమోవి నానుతమిఁ జెందినవారు తదర్పితప్రపా
జలము సహింప కాని రనిశంబు సపాటలగంధ మైనను. 147

క. జ్వలదారణ్యానలదం
ధులు మారుతములు నిదాఘతూర్ణశ్వాసా
నిలము లనాన్ సోష్మము లై
తలఁగెను బాటలరదచ్ఛదముల నొరయుచున్. 148

చ. విరియుతపర్తువందు దినవేళ సరోజపటీరపంకముల్
వఱలు ప్రియాంకపాళుల విలాసులు [5]గగ్గురులన్ సుఖింతు; రొం
డొరులు పెనంగి కూర్కుఁ గను చంద్రు ప్రదోషమునంద తత్పర
స్పరరయనిశ్వసత్పవనపాళిఁ గపోలపుఁజెమ్మ వమ్ము గాన్. 149

1. దినములు. 2. జలమా. 3. చలిపందిరి (దప్పికినీరు పోయుచోటు - చలివెందర). 4. విధము, 5 పులకలు.



క. వనజరహితాఽననముఁ జం
దనరహితవిలాసవృద్ధిఁ దవిలినలలనల్
గనఁ జేసిరి మెల్లఁగఁ దప
మెనయుప్రతాపప్రహాని యెదుగుచు నుంటన్. 150

క. మిళితార్కమండలం బగు
జలధరఖండంబుఁ గాంచె జనవరుఁ డపు డె
వ్వలనుండియొ సకుండల
జలధరవేణీశిరంబు సగ మెగసినటుల్. 151

చ. సురలు నిదాఘతాపమున శూన్యజలం బగుగంగయందుఁ [1]బు
ష్కర మరయంగఁ గోరి నది[2]కర్దమమున్ గడు రేఁపి రన్గతిన్
వఱలుఘనార్భకంబుఁ గని పల్కెఁ గుతూహలలోలనేత్రకున్
దరుణికి నంకతల్పమునఁ దావుగ నిల్పి ధరావరుం డిటుల్. 152

## వర్షర్తువు

తే. గీ. మహితతారాఽధ్వవిపినతమాలమాల,
క్షోణిధరమూర్ధసురుచిరకుంతలాఽళి,
చంచలాదీపికాంజనచయనిభంబు
నవ్యజీమూతపటలి, చాన ! కను మదిగొ. 153

తే. గీ చంచలాదీపికోత్థకజ్జలముఁ గూర్చ
వర్ష యుత్కంఠఁ బట్టుకర్పర మనంగ
ఘననిరోధంబునన్ జండకాండుమండ
లంబు గన్పట్టు న ల్పంది యంబుజాక్షి !. 154

క. భ్రమరాసితఖచరీవి
భ్రమకృష్ణాగురుజధూపపటలిఁ గలిసె నాన్
రమణీ ! సద్యఃప్రచురత
రమణన్ వహియించు జలధరం బదె కనుమా ! 155

1. జలము. 2. బురద.

క. పలువన్నెలు గలరతనపు
విలు నెటు నిర్మించె మొగులు; వే సాగరపుం
బలువన్నెలరతనంబుల
మొలక లలముజలము [1]రేఁపెఁబో నిక్కముగన్. 156

క. [2]వనదోన్ముఖ[3]శిఖిముఖములఁ
దినఁ గొనఁ బడుఫణులఫణల దీపించుమణీ
ఘనదంశులు [4]వాంతములు గఁ
దనరు[5]నిలింపేనుధనువు తథ్యమ మింటన్. 157

ఉ. ధారణిభృన్నితంబములఁ దారుచు, శ్యామదుకూల[6]విభ్రమిన్
దీరుచుఁ, [7]బక్కణాధ్వములఁ ద్రెళ్ళుచు భల్లుకభంగు లై, తటి
న్నారులలాస్యభంగులను దన్వి! [8]గళజ్జలకాండవప్రముల్
గా రహి గ్రీష్మతాపతప్తస్థలసీమల మబ్బు లుబ్బెడున్. 158

క. మొగుళు లను[9]సానకండ్ల నమ్ములు మరుండు
వాఁడి సేయఁగ నాడాలవలన రవులు
నింగలపుమిణ్గురులభంగి నెనసి మించు
మించుఁదీవియఁ గాంచుమ! మించుఁబోఁడి! 159

క. అంబునిధానాంతఃస్థన
గఁబులకుశలంబువార్తఁ గాంచి దరిసె నాఁ
గం బర్హితాండవారం
భం [10]బరురుతిఁ గొలిపెఁ [11]జఖుల వారిధరంబుల్. 160

1. పైకిఁ దీసికొనెను. 2. మేఘము. 3. నెమిలి. 4. క్రక్కఁబడినవి. 5. ఇంద్రధనుస్సు. 6. విలాసము. 7. అటవికులపల్లె. 8. ఒడియునీరు గలతెరలట్టలు. 9. నికషోపలములు. 10. ఉప్పర్యని. 11. పర్వతపానువులు.



క. నీకురులవలననోటమి
పైకొన జీవితముఁ దెగడు బర్హులు; గానన్
జాకారివింటి కెదురుగ
బాకులునగుకోర్కిఁ బోలెఁ బైదలి! నిలుచున్. 161

ఉ. వానలలో జిగీషువులె ప్రక్కనఁ బెట్టఁగఁ గార్ముకంబు లె
చ్చో నిగిడించు నేర్పు బలసూదను[1]ధర్మువు చిత్రభంగిగాఁ;
గానఁ దొలంగ రాని దయి యామనినేస్తునిచాప మొక్కఁడే
చానరో! నే నెఱుంగుదును పైఁపనియ ట్లిపు డేపు సూపెడున్. 162

చ. సకలధరాంతరస్థితరసంబును లాగి కరాళిఁ నీతఁ డాఁ
గక వడ కూన్పుఁ బాటవ మఖండముగా ననుచున్ [2]ధ్విషాంపతిన్
బ్రకటితచండతన్ బయికిఁ బర్వతటిత్కరముల్ దగంగఁ ద
గ్గక కదు దూఱునట్లు గనఁగా నగుఁగా ఘన మంబుజాననా!. 163

తే. గీ [3]తపనుహృత్తిగ్మరుచికాంతి తమ్మిసూఁడు
మండలముఁ జొరఁ బడ దాని మాయఁ జేయ
నని యెఱుంగుదు నదె మదిరాక్షి! కనుమ!
వారిదంబు నిరోధించు వారిజారి. 164

తే. గీ. మూడులోకంబులన్ గడు[4]మూరుకొనిన
గ్రీష్మమును గిన్కమెయి ముద్దరీతి మ్రింగి,
ప్రోల నిలఁ జేసినతదస్థిమాల యనఁగ
నదె బలాకాళిఁ జెలి! వలాహకము వఱలు. 165

క. తరుణి! జగత్త్రయదుర్లభ
వరగతులన్ నీదుచెంతఁ బడసియు శిక్షన్,
సురహంసగురుతలోభము
వఱలుట నన మానసంబుఁ బడ సెడు నంచల్. 166

1. ధనుస్సు. 2. సూర్యని. 3. గ్రీష్మబంధువు. 4. ఆఘ్రాణించిన.

క. సురధనువు దరియునంచలు
[1]శరదపతద్బిందువుల విసార్యంగుళిక
స్ఫురదిష్వాసనముఖమునఁ
బఱఁగెడు[2]గోళీ లటంచుఁ బాయు మొయిళులన్. 167

ఉ. కేకులముక్కులన్ [3]మఱుఁగుఁ గీల్కొని, కోమలకూజితాంకుర
ప్రాకటభంగి వెల్వడుచుఁ, బాంథవధూటులకొర్దివేఁడి[4]యూ
ర్పోకల గాసిఁ గాంచి, [5]కణముల్ ధరణిం బడు; నిర్మలన్ గరున్
వాకొన రానినీతిఁ గని వారిధరప్రకరచ్యుతంబు లై. 168

క. అలవాటు లేమిఁ దమము
క్కులకొనలన్ జిఱునెమిళ్ళు గొనఁ గన కీర్ష్యన్
గొలిపినయటుల నవాబ్దం
బులకణములు పుడమిఁ బడుచుఁ బొరలున్ దరుణీ! 169

క. ధరణీధరకటకములఁ బులు
వఱగించుచు వీర[6]మురజ ఝాంకృతులు దగన్
శరదాఽగమంబు వెదకెడు;
నురుచపలాదీపకేతనోన్నతిఁ దపమున్. 170

ఉ. అల్లదె! నల్లలేగతిక వ్యాప్తము లై, [7]యమరేంద్రగోపముల్
మల్లడి గొన్నలుల్ గలుగుక్ష్మాధరసీమలయందు వేల్పురా
విల్లు వియచ్చ్యుతిన్ గని భువిన్ బడెనో యనుభ్రాంతిచే వలెన్
దల్లడ మంది మ్రొగ్గు జలదంబు భ్రమచ్చపలాదృశాఽఽయతిన్.

తే. గీ. చద లనెడునీలనీరజపదమునుండి
వ్రేలునాళంబులకు సరిపోలుజిగులఁ
బొలిచి వలతేనికోలలప్రోవు లనఁగఁ
బడెడు ధారాపరంపరల్ [8]వార్దము విడి. 172

1. జలదము. 2. గుండ్లు. 3. చాటు. 4. ఊర్పు+పోక = నిశ్వాసము. 5. బిందువులు. 6. మృదంగము. 7. ఆర్ద్రపురుగులు. 8. మేఘము.



తే. గీ. మారనారాచముల [1]నయస్కారుసరణిఁ
బదనుఁ గదియించు ముగుద! తోయదసమయము
శ్యామలాంగారరుగ్జలదాంతరమునఁ
దనరు[2]శంపాఽఽశ్రయాశంబుఁ గనుమ! నిజము. 173

క. వేసవిచెలి నీప్రియరవి,
నీసైదో దివురఁ జేసె నిఖిలజల మటం
చీసుమెయి మొయిలు ధారా
[3]ప్రాసంబులఁ గొట్టు బిసిని వడి ధేర్మనుచున్. 174

తే. గీ. [4]అల్పనదిసంగమోత్సుకు నాపగాఽధి
పతిని సంప్రతి గనుచు నధ్వముఁ గ్రమించి
స్ఫీతము లగునదాంతరనివహములను
దమకుఁ దామె మహానదుల్ త్వరగఁ బడెడు. 175

క. ఇందీవరనిభనిర్మల
[5]కందస్రజ మంబుభరముకతమున వ్యోమం
బందుండి వ్రాలి యెల్లెడఁ
జెందుబురద సరసి సానుసీమల నిలుచున్. 176

క. స్తనదద్ధములవలన నం
బునిధిచరిత మెదియొ వినుచుఁ బొడముకినుక వా
హినులు [6]కలుషతఁ గదలి నొర
యను గోలాహలము లెసఁగునూర్మలతోడన్. 177

క. [7]సరిదినసమాగమత్వరఁ
బఱఁగిడునంభోధిసతులు పర్వతనదు లం
తరమున నాఁపఁగ జగడం
బురవమునఁ జేయునటుల నొప్పు లతాంగీ!. 178

1. కమ్మరివాఁడు. 2. మెఱుపుఅనెడునగ్ని. 3. ఈటెలు. 4. ఈ పద్యమున 'నదీ–నద' శబ్దములు 'స్త్రీ-పుం' లింగములు. వీనిచేత స్త్రీ-పురుషస్ఫురణ కలుగును. 5. మేఘమాల. 6. పాపము-కలఁకఁబారుట. 7. సరిత్పతి (సముద్రుఁడు).

క. కను మంగన! ఘనములు దా
మెనయించిననీట నవని యెంతగ ఛేది
లైనా యని కనుగతిఁ [1]గొడుపుల
యనుసృతి ఛితి [2]నుచ్చు [3]నమ్మయము లగుధారల్. 179

క. అందంద [4]నమదవీచిక
లం దరిఁ [5]బృషతాఽళిముక్తలం జల్లి సము
ద్రేందుముఖీవంచన నాఁ
గం దిరుగు సముద్రవేషకలన నదంబుల్. 180

క. రేల నభిసారికలు [6]జం
బాలితమార్గముల జారఁ బదములు నిలఁగా
నాలంబన మాశించిరి
మేలిమికట్ల యనుశంక మించుందీవన్. 181

క. ప్రతిబింబరీతి సంబుధ
మతిజలవృద్ధి యతి యర్థి యయి నీలీలా
శతపత్రాఽకరమునఁ దాఁ
దతవీచీదండతాడిత మగునటు దగున్. 182

ప్రకారాంతరానువాదము

క. తననీ రలఁగా నర్థిత
ఘన మదె ప్రతిబింబరీతిగా నీలీలా
వనజాఽకరమునఁ దగుఁ ద
ద్ఘనవీచీదండతాడితం బౌనటులన్. 183

క. జలదము జలధిజలంబును
[7]గలపైనన్ గొనియె నిజము; కానన్ గోలా
హల మొనరిఁచి గ్రహియించును
జలధివధువు తజ్జలంబు జలజాతముఖీ! 184

1. నన్నునికొయ్యలు. 2. దూసికొనిపోవును- 3. జలమయములు, 4. నగర్వమగు 5. నీటచుక్కలు. 6. బురద గలత్రోవలు. 7. వర్ధి:- గడువు అని రెండర్థములు.



క. జలధి, జలంబుల జలదం
బుల కొసఁగె నిజంబు [1]వృద్ధిఁ బొంద; నుదన్వ
ల్లలనలు గొంద్రు తదంబువు
లల శిఖరి[2]ప్రస్థశతసహస్రవిమర్శన్. 185

తే. గీ. సాంద్రపురసోపబృంహణసరణిఁ గూర్చి
యేఱులన్ దార్చి నాయొద లెనయఁ జేయు
నిది యటంచును రిత్త దన్ గదియుమొగులు
నింతి! పోషించు నిజము, ధునీశుఁ డలరి. 186

తే. గీ. మెఱుపువడ నీలఘన మదె మిగులఁ గరఁగి
కాంత! యిలకుఁ [3]గపాఁరంగముగ నయ్యె
దానఁ దనరు ధరిత్రి యుద్గతవినీల
ఘనకుంతల యై జరన్ బాసినటుల. 187

క. ఏయదనున నిర్ఝరిణీ
నాయకున కకీర్తి యటుల నాటెనొ యెఱుఁగన్,
దోయధిసతుల కగస్త్యుం
డీయదనున నెదుటఁ బడిన నెఱఁగుదు రతనిన్. 188

క. ఖతలస్థిత్విడ్వీరు
త్కృతదోహదకర్దమద్యుతిన్ దగుకంద
ప్రతతి, వియచ్చ్యుతకల్మష
గతవారికి [4]గాలనాంశుకం బనఁ దనరున్. 189

1. వర్ధి-అభివృద్ధి (శ్లేష). 2. కొండచఱియ-కొలతరూము (శ్లేష). 3. తల యందలి నీలిరంగు. (నీలిరంగు వేసినట్లు నల్లగతికయను కేశములుగల భూమి వర్షాకాలములో ముసలితనము పోయి యువతి యై నీలకుంతలవలెఁ గనఁ బడును. 4. ఒడియఁ బోయుబట్ట.

క. నీలాబ్దపంక్తి, సహజవి
నీలాశ్వము లెట్లు దారి నిగుడు నని భయాఽ
లోలత [1]వాగెల బిగియన్
దాలుచు నిజ మిపుడు తన్వి! [2]తార్క్ష్యాగ్రజుఁడున్. 190

తే. గీ. జలదమా! ప్రియురాలిఁ జంచలను నీవు
గనక తనరించునీముహుఃక్రందనంబు
కనికరం బైనఁ గలిగింపఁ గాన దొర!
[3]యధ్వగులఁగూర్చి యిద్ది మహోఽద్భుతంబు. 191

తే. గీ. నిజము, నిచ్చలు నీయెడి నెఱిఁ బ్రియంబుఁ
గనుమెఱుఁ గెఱుంగ దన్యులకష్టదశలఁ;
గానిచో విరహిణులను గలఁచు చున్న
నేల వారింప కుందు ని న్నెలుఁగు నెత్తి? 192

తే. గీ. ఎట్టులో మాప్రియుండు మమ్మేనయు నైన
నిజము నమ్మము తిరిగి ని న్నెమ్మనమున
వనదమా! మాటికిని విష్ణుపదము ముట్టఁ
బాఱుచు స్వకార్యపరతను వదల వెపుడు. 193

మ. వెలినల్పే యన రాదు; పాంథవనితాపీడాఽఘమం దైదుతూ
పులవిల్కానికి మంత్రి వౌటఁ గడు నల్పుం జెందు నీడెందమున్;
మెలఁగన్ జేయుదు కౌతుకం బొకటి సుమ్మీ! పాంథనిర్మూలనన్
దొలిము ల్లొనెల మ్రింగు దధ్వగలయందుం బ్రేమ లే కుండియున్.

చ. పలుకఁగ నేల? యధ్వగలభాగ్యవిపర్యయవృద్ధిచే జలం
బుల మకరాఽకరంబునన పొందియు నీల్గక నీదురాక యౌ;
నల గిరిశృంగసంగతవిషాపహరౌషధి గన్నులంబొ నీ
వలరుతు వద్దు నర్యమరథాశ్వ[4]గుణాహులు మ్రింగఁ బోవమిన్.

1. గుఱ్ఱపు కళ్ళెములు. 2. గరుఁడునియగ్రజుఁడు (అరుణుఁడు, అనూరుఁడు) సూర్యసారథి. 3. విరహులు. 4. పగ్గములుగా నున్నసర్పములు.



ఉ. వారిదమా! నిజంబ, యొకవార్త సరిత్పతినుండి నీవు [1]పా
కారిమదావళంబునకు నందఁగఁ జేయుచు దానఁ జుట్ట మై
మీఁతెద; వట్లు గానియెడ మింట భ్రమించుచు నుండఁ జెందఁగాఁ
దారక యున్నె నిన్ను సురతల్లజమత్తగజంబు బ్రేల్మిదిన్. 196

క. మృషలు వచింపఁగ నేలా?
[2]తుషధూమవిధూసరంబ! తోయదమా! [3]వే
విషమమరణములఁ దొలఁగి ప
రుషింతు [4]వధ్వగలపాపరూఢోపకృతిన్. 197

క. మరుబారి కగ్గలంబగు
విరహిస్త్రీవార ముఖమువిషదముఁ గనుచున్
దరుణీ! యను నిటుల నిరం
తరకంఠాఽగతదృగస్రుతంద్రత నుడులన్. 198

క. ఘనమా! [5]క్షణరుచి క్షణమే
కను నిను; గాదేని సతముఁ గన కుండుత; నీ
ధ్వనిడిండిమంబు వెలిగాఁ
గను నెటులఁ బ్రవాసినీనికాయము పతులన్. 199

చ. కలుగదు షోడశాంశమును [6]గంధమ! నీకళలోఁ, బ్రసిద్ధియే
కలదుసుమాస్త్రుచుట్ట మని; కాక వసంతున కున్నె పేర్మి; యొ
దలఁ గుసుమాస్త్రుశాసనముఁ దాల్పకయున్న సహించునే యిలన్
మలినత నూనునీవదనమండలమున్ గనదభ్రరాజమా! 200

క. వరు నందినయేవిరహిణి
జరుపదు నీసేవ? మీఁదు, జలధరమా! త
ద్వరుఁడును; బేర్మి వచింపఁగఁ
దరమా! యగు మాళుకవివి తద్విధి నుడువన్. 201

1. ఇంద్రునిగజము (ఐరావతము) 2. పొట్టు కాలుచుండఁగా వెడలుపొగ. 3. వేయి. 4. విరహిణులను బాధించునీపాపము, మృత్యువును నీవుజయించుటకు ఉపకారి యైనది. 5. మెఱుపు. 6. మేఘము.

క. విరహులఁ గూర్చుట నీకున్
సరి యితరుఁడు లేఁడు దౌత్యసరణులఁ; బరులన్
దరిసి వచింపనిసాధ్వుల
[1]కురవుగ ధ్రువ మీవు దాల్తు వోయి! క్షణరుచిన్. 202

క. వేణీవలయము లూడఁగఁ
బ్రాణేశాంకప్రవేశవాసశిశిరతన్
రాణించుచెలులు నీసుమ
బాణామాత్యత్వపటిమ వాకొంద్రు గదా! 203

ప్రకారాంతరానువాదము

క. జడచుట్టులు సడల మగల
యొడిపట్టుల నిలిచి శైత్య మొందు వెలందుల్
నుడువుదురు నీదుమరునే
ల్పడి కగులీలాప్రధానిపటిమను; గనుమా! 204

క. మారాఽతురతరుణుల కధి
సారమునన్ [2]దుర్దినంబు సలుపుదు, స్మరకే
ళీరచిత[3]కాండపట వై
తీరుదువు పరోపకారధీరాగ్రణి వై. 205

ఆ. వే. [4]కల్యవర్గమందు ఘనమ! యగ్రణి వీవు;
కౌముదియును నీదుకాంతిఁ [5]బనదు;
దానితెలుపుఁ దాల్పఁగా నేల? కస్తూరిఁ
దొలఁగి సుందరంబె! [6]మలయజంబు. 206

ఉ. చందనగంధవాహములసంగతిఁ గోకిలపంచమధ్వనిన్
జందురుతోడనన్ [7]దొడరి చైత్రుఁడు సల్పఁగఁ గల్గు నేమి? నే
యందును లేఁడు ని న్నెనయునంగభటుం డొకఁ డేని [8]జైత్రుఁ డౌ
[9]క్రొందలిరాకువాలు గలప్రోఁడకుఁ; బల్కఁగ నేల వేయిగన్. 207

1. అర్హముగ. 2. మబ్బుగప్పినదినము. 3. తెర. 4. ప్రాతఃకాలము.
5. పొందదు. 6. చందనము. 7. కలిసి. 8. జయశీలుఁడు. 9. మన్మథుఁడు.



క. ఘనమా! నీదర్శన మై
నను బ్రియుఁ గననట్టియంగనలు విధిహత లై
కనరు గణన; భిత్తి వినా
పొనరుపఁ జిత్రంబు వసుధఁ బొనఁగు నెవనికిన్? 208

చ. పతు లటు చేరఁగా విమలభావమునన్ దగి [1]చాటుకారితా
మితదరహాసధాత[2]పరిమేదుర[3]పాటల[4]దంతపత్రసం
గతి సుదతుల్ భజించెదరు నవ్యవిలాసనిమీలితేక్షణ
ప్రతతి దగన్ బయోధరపరంపర నైజకృతార్థతాఽఽయతిన్. 209

సరిదుపాలంభము

తే. గీ. అబ్ధిసంగమపీయూష మరయఁ బోక
గ్రీష్మదినముల మిగులఁ జిక్కియును గష్ట
మెఱుఁగనటు లేం! సఖి! నాకు హేతు వగుదు?
[5]ప్రాణనాథోపగూహనభంజనమున. 210

చ. దిట మతి, రూపమున్ దొలఁగి, దృష్టి కగోచర మై, క్షణంబునన్
బటిమ వహించుచున్ [6]జదలిపైన నొసల్ విలసింపఁ బొంగె దీ;
వటులయినన్ విలాసగతి నావలిగట్టును జేర దాఁటి వే
విటపటలిప్రగాఢసుఖవృద్ధినిఁ గందురు [7]పాంసులాంగనల్. 211

చ. కలశముపైన నెక్కి తరఁగల్ త్వరఁ దట్టఁగ నడ్డు వీడి పాం
సులలు పరల్, తరించి నిను, జొచ్చెద రావలిగట్టు; నట్టి[8]పుం
శ్చలుల[9]లలిన్ బొనర్చుటకుఁ జాలను నేను; నితంబడంబరం
బల పొలియించు భారసముదగ్రత నెక్కినవావ నేనియున్. 212

1. ప్రియవచనములు పల్కుట. 2. కోమలమైన. 3. తెలుపు ఎక్కువ గలిసిన ఎఱుపురంగు. 4. పెదవి. 5. ఈశబ్దము పుం-స్త్రీలింగములఁ బ్రయుక్తము. 6. ఆకాశముపైన. 7-8. బంకుటాండ్రు. 9. విధము.

తే. గీ. అలలకోలాహలాఽరవ మలవఱచుచు
విననియ ట్లేల సాగెదు వితగ నీవు;
శ్రీవధోపార్జితాఘసుస్నిగ్ధ వగుదు;
జలధి యేవిధి నెనయు నీసంగమంబు. 213

క. పులినద్వయానుగం బగు
నలయుమ్యేల నిల్పి చేర్చు మవలిదరి నన్నున్;
[1]ట్రాలిసెడిలో నిశ, కృపఁ గను;
మల కీర్తింత్రు నిను బాంసులాంగనలు లలిన్. 214

ఉ. వేమఱుఁ గృష్ణపక్షతమివేళల వె న్జన, కంజఁ ద్వచ్ఛిర
స్పీమను నిల్పి, పారమును జేరుచు నుంటి; ని టేల గర్వని
స్సీమత; కంటికావరముఁ జెందెదు: నీకు ఘనాత్యయంబు నీ
[2]నేమమునన్ గనన్ గలుగు; నీ కిటువంటినడల్ వొసంగునే. 215

చ. లలితనిజోర్మివస్త్రకిసలస్ఖలనంబు గఁ [3]దుంటి జారనీ
[4]ర్వలిపముతోఁ బయోధికయి పాతె దయారె! స్వయంబు మూధ వై
వల దని చెప్పి యన్యలకుఁ బండిత వయ్యెద; వచ్చఁ బోదు త
త్కూలసరిదాస్యచుంబి యగుతోయనిధానముదాస్య మేనియున్.

తే. గీ. కన్నియగ నుండియును నొంటిఁ గనను గూర్కు;
జారు వీడి యెదురన్ జూడఁ జాల నైతి;
నిటుల [5]గోత్రాస్థితిన్ జనియెదు[6]వరాకిఁ
గృప నన్నున్ గాంచి నా కుపకృతి నొనర్చు. 217

తే. గీ. మారశృంగారసాగరాఽసారతటిని!
యేతరంగిణిఁగూర్చి మారాఽతుర లగు
చపల లాత్మీయకాంతాభిసారపరత
రేల నీరీతి వాకొన రేల! కనలి. 218

1. నశించులోపల. 2. మేర. 3. పిఱుఁదు. 4. వస్త్రము. 5. కులమునందు గౌరవములేమి. 6. దీనురాలను.



చ. తరుణు లుదారమేఘజలధారల ధౌతదుకూల లౌచు న
త్తరుణమునంద కంతు[1]కరదత్తకరద్వయసంగతిన్, గణిం
పరు మది నేమియున్ బురదచక్కియలన్, స్వవరాంకపాళికా
సరభసవిస్ఫురత్పులకసంపదుదారనిజాంగసంగతిన్. 219

మ. ఎది [2]సౌదామనితాండవంబునకు నెంతేనిన్ మృదంగాఽరవా
భ్యుదయం బై తగు; శక్రచాపమున కుద్ద్యోతించుటంకార మె
య్యది; మత్తేంద్రగజేంద్రకంఠలుఠితావ్యగ్రోగ్రగర్జాఘనం
బదె [3]యభ్రంబు వియోగినీవ్యథకునై యభ్రస్థలిన్ గ్రుమ్మరున్.

శా. మించుందమ్ములత్రుంపు లుండుబురదల్, మిన్ ధూమిలేఁబచ్చికల్,
న్యంచద్ధారలవల్లు లన్కూలమశాల్యంకూరకేదారముల్,
ప్రాంచచ్ఛైవలశరస్తరంగిణులశైవాలంబు. లర్కేందుబిం
బాంచ[4]త్కారలు ప్రీతి నీ కిదుత! కాంతా! నవ్యజీమూతముల్.

ఉ. ఎల్లనెమళ్ళగొంతుల రహించెదుకూఁతల కుచ్చ మూన్పనై,
పె ల్లగుధార లన్లతలఁ బేర్చిననల్లనిపల్లవౌఘ మై,
త్రుళ్ళువిదూరజామలసురోచులయద్దవుగొప్పె నౌచు వ
ర్తిల్లును నల్లమబ్బు, రతిఁ ద్రెళ్ళినచోళలకుంతల[6]స్పృశన్. 222

తే. గీ. సకలలోకరమాపతి సతికి నిట్లు
ప్రకృతిసరసవచోవిజృంభణము మెఱయఁ
దల లతాంతాస్త్రునానల నిలిపికొనుచు
జలదశోభను వర్ణించె క్ష్మావరుండు. 223

చ. [7]దానఁగులఁ గొట్టుగట్టునయిదో దగువేల్పులమిన్న! రక్కసుల్
వెనఁ గొలువంగ నిక్కుచుఁ గవించుచుఁ బట్టినిఁ బట్టి గిట్టఁగా
విసవిస నిక్కులన్ గుడిపి [8]వేటిఁడి యై కడుఁ గొట్టఁ జేయుర
క్కసియెకిమొని గోళ్ళ నటకన్ గను[9]మానిసిసింగ! దేవరా! 224

1. కరములం దుంచఁ బడిన. 2. మెఱుపు. 3. మేఘము. 4. చెలసాలరా. 5. కప్పులు. 6. స్పర్శము. 7. శ్రీవేంకటేశ్వరస్వామి. 8. అవివేకి. 9. నరసింహస్వామి.

ఇది శ్రీత్రిభువనమల్లదేవవిద్యాపతి-కాశ్మీరక
భట్టబిల్హణ మహాకవివిరచితవిక్రమాంకదేవచరిత
మహాకావ్యంబునకు శ్రీవేంకటేశ్వర
శ్రీనరసింహదేవపాదపద్మాఽరాధన
సమాసాదితకవితావైశారద్య
'ఆంధ్రబిల్హణ'బిరుదాంచిత
లక్ష్మణ-విశ్వనాథ
కవిసోదరాంధ్రీకృత
మహాప్రబంధంబునందుఁ
బంచమాశ్వాసము
సమాప్తము

—o—

# విక్రమాంకదేవచరితము

## షష్ఠాశ్వాసము

క. శ్రీరమణ! వేంకటేశా!
వీరనృసింహేశ! వేదవేద్య! సురేశా!
సూరివినుతపదపద్మా!
భూరిగుణా! దేవదేవ! బుధజనవంద్యా! 1

తే. గీ. [1]పలితకుంతలములు నాఁగ వఱలుపాండు
రాంబుదంబులచే నంబుదాఽగమంబు
ముదిమిఁ గన విక్రమాంకునిఁ గదిసి యొంటి
నున్నెడల నాప్తుఁ డొకఁ డిట్లు విన్నవించె. 2

క. దొరలు స్వకార్యము వదలుచుఁ
బరితోషము స్వేచ్ఛయంద పడయుదురు; ధరా
వర! నాపల్కెడునది ని
ష్ఠురమే యైనను క్షమింపఁ జూడుము కృపమై. 3

క. పెడదారిని మంత్రస్థితి
యడరినచో నది విషంబ యయి చెడు సేయున్;
గడువాత్సల్యము సోదరు
నెడఁ గలుగుచు నీతిమార్గ మేల వదలఁగన్. 4

తే. గీ. తమ్మునభ్యుదయంబుఁ జిత్తమునఁ దలఁచి
సంగరంబున నోడించి చేంగి (వేంగి) నాథు
వాని[2]వనవాసమును దమ్మువశముఁ జేసి
పంపితి; వతండు నీతికి బాహ్యుఁ డయ్యె. 5

1. నరసిన. 2. ఒకరాజ్యఖండము.

ఆ. వె. న్యాయపథము వీడి యమితధనముఁ గూర్చి
శంక లేక యతఁడు క్ష్మాతలంబు
నెల్ల [1]నుద్విహారమృగముగ నెనయించె
సకలలోకపీడ సలుపఁ దొడరి. 6

సీ. తమకరవేష్టితదంతపృష్ఠము లాత్మ
విభుజయాఽర్జితరమాపీఠములుగఁ,
దమకర్ణశీతగంధవహోచ్ఛలద్దాన
జలములు స్వావవిష్ఠలనములుగఁ,
దమదానకర్దమకమలగర్భప్రతి
బింబితరవి రమాబిసరుహముగఁ,
దమదంతములు గిరితటశిలాఘట్టన
నరివీరజయతైక్ష్ణ్య మందునవిగఁ,

తే. గీ. నదరుమత్తేభముల నసంఖ్యాకములను
గడఁదివాత్సల్యమునఁ దమ్ముఁ బడయఁ జేసి;
తది గణింపక తద్బలోద్ధతియ యూని
యతఁడు తలఁచెను బాపకార్యం బొనర్ప. 7

క. బరువడిఁ దాఁ గొనె నక్రమ
సరణుల వశ్యముగ సకలశబరచయము [2]శా
ర్వరతిమిర మసురులన్వలె;
దురితాఽత్ములతోన కలియుదురు దురితాఽత్మల్, 8

ఉ. ద్రావిడభూపుప్రాపు [3]నుపదానశతంబులఁ గాంచి నీదుసై
న్యాఽవళి భేదముల్ గొలుప యత్నముఁ దమ్ముఁడు సేయఁ బూను; నీ
కీవిధి వింతఁ గొల్పుకథ లెన్ని వచించిన నేమి; తత్త్వమున్
నే వినిపింతుఁ; గృష్ణతటి ని న్నెదురున్ గతిచిద్దినంబులన్. 9

1. లేచ్ఛవిహరించకుండునట్లు (సాధుజనాశ్రయము కాకుండ అని ధ్వని).
2. రాత్రులయందలిచీఁకట్లు. 3. కానుకలు.



క. అని చతురమిత్రుఁ డాడిన
విని శారదశశియశుండు వేగిరపడ కే
మనఁ డయ్యె భూధవుఁడు; భూ
మిని ధీరులు వేగపాటు మేకొన రెపుడున్. 10

తే. గీ. 'చపల సిరి యగు; దాన వంచనఁ గనంగ
నేల! విపరీతబుద్ధి నీ కేల! వలదు
వత్స!' యని మాటికిఁ దలంచె స్వాంతమందుఁ
బ్రకృతివిమలాంతరంగుఁ డాపార్థివుండు. 11

క. సహసాధర్మహతున్ దు
స్సహశితశల్యసరణి స్వాంతమునం దేన్
వహియించితి నగ్రజు; [1]నను
జహతుం దొనరించుహాని సైరింతు నెటుల్? 12

మ. తపియించెన్ జిర మి ట్లిలాపతి యనంతం బైనచింతన్ దురం
తపరీతాపపరీతుఁ డై; 'విధివశధ్వస్తాఽత్మవిజ్ఞానకుల్
కృపకుం బాత్రులె కాని క్రోధకలుషాఽక్షేపార్హులే?' యంచుఁ జా
రపరామర్శిత[2]వృత్తుఁ డై పలికెఁ గర్తవ్యంబుఁ జింతించుచున్. 13

క. కలహకుతూహలమున సిరి
[3]కలహమునిన్ మించి తిరుగఁ గనవో! యనుజా!
కలితదురధ్వధ్వజ యగుఁ;
దలఁచితి వెట్లీయకార్యతాత్పర్యంబున్? 14

ఉ. ఎన్నియొ భూషణంబులు మఱెన్నియొ మత్తగజేంద్రయూథముల్,
విన్నను వొప్పు నిచ్చితిని బృథ్వీధవాఽహ్వయ మొందు దక్కన్; నే
మున్నది లోటు? దుర్ణయము నూనఁగ నేల! మహాఽర్తి మాన్ప నే
తెన్ను గనన్; జలుక్యకులదేవత! తమ్మువినీతి మాన్పుమా! 15

1. దుష్టుఁ డగుతమ్ముఁడు. 2. సమాచారము గలవాఁ డై 3. నారదముని.

క. అనుజున కీదృశనీతుల
ననిపియు నక్రమమునుండి యతని మఱల్పన్
గనఁ జాలఁ డయ్యె నరపతి;
గనునే భంగంబు విధివికారం బెపుడున్. 16

శరదృతువు

శా. అంతన్ దోఁచెను యామినీరమణసద్యశ్శ్రీప్రసాదక్రియాఽ
త్యంతప్రాభవశారదాఽగమము నీలాంభోదసంతానసం
క్రాంతశ్యామలిమక్షమావలయదుగ్ధక్షాళనప్రక్రమో
ద్దాంతస్వైరవిహారధీర మగుచున్ దర్పించి యింతింతగన్. 17

మ. పథికస్త్రీతపవైద్యుతాగ్ని శమియింపన్ మానినీబాష్పసం
గ్రథనీలాంబుదధూమసంతతియు విశ్రాంతిం గనెన్; శాంతత
త్పృథువైశ్వానరభస్మరేణుభరముల్ పేర్చన్ సితం బయ్యె నాన్
ప్రథితాభ్రంబునఁ బాండురాభ్రములు వైరశ్యస్థితిన్ దోఁచెడిన్. 18

క. [1]హరినీలరసముఁ గుంచెల
నెరపినటుల నలుపు దట్టి నింగిబయలు [2]కం
ధరజలసిక్తం బై కడు
వఱలున్ శాద్వలిత మైనవడువు రహింపన్. 19

క. 'గురుఖేదకారణ మవాం
తరతటినీసంగమంబు తలఁగె జలధి' కం
చురుముదమును గనెనో నాన్
సరవి మహానిమ్నగలు ప్రసన్నము లయ్యెన్. 20

క. జలదము తటిదుష్ణంబున
జలజహితున్ గలఁచె నాఁగ [3]శరద నతండున్
జ్వలదంశుప్రసరణములఁ
గలఁచు ననఁగ వడఁ గదించి ఖరకరతఁ దగున్, 21

1. ఇంద్రనీలమణిద్రవము. 2. జలధరము. 3. శరదృతువునందు.



తే. గీ. శాలిగోప్త్రులు పండినచేలనడుమ
నుండి పాటలకరముల నూన్చి నూత్న
పద్మగతకీరముల నదల్పంగ లేర
కరము లబ్జము లని యవి కదలఁ బోమి. 22

శా. శంపాదీపసముత్థకజ్జలరజస్సాంద్రాఽచితం బైనటుల్
[1]శంపావత్పథ[2]కర్పరంబు నిగిడెన్ శ్యామంబుగా మించుచున్;
[3]శంపావంత ముదన్వదంబుయుతిఁ గొన్నమ్ముక్తలన్ రాల్చె నాన్
సొం పై కన్పడెఁ దెల్లకల్వలరుచిన్ స్రుక్కించురిక్కల్ నిశన్.

ఉ. శారదలక్ష్మి తత్క్షణలసన్నవకైరవలోచనాఽఢ్య యై
[4]కైరవబంధుమండలముఖంబు వినీలపయోదమాలికాఽఽ
కారనిచోళమాల దొలఁగన్ గడు వెల్లనికాంతితోడ నా
ప్పారుచు నున్నవిభ్రమవియన్ముకురంబునఁ గాంచె నాఁ దగెన్. 24

క. ఎండ గలఁచెఁ బగళుల; రే
యెండ జనంబునకు రేల నెలమిఁ గదించెన్;
బండసుధాంశులు నిజగుణ
పాండితి వెలయించి రిట్లు స్పర్ధమెయి ననాన్. 25

తే. గీ. ప్రబల మగుచందనపుఁబూఁతవలనఁగూడఁ
గనరు సంతృప్తి నీశరత్కాలమందు
బడలు దొలఁచెడునెలవెల్గునెడల సంజ
నిజగృహాంగణముల హాయి నెఱయుజనులు. 26

క. నేత్రములకు విందు లగుచు,
క్షేత్రముల సితేక్షులతలు చెలఁగెఁ గుముదినీ
మిత్రామృతభరమును విడి
ధాత్రికి దిగుస్ఫటికదండధవళాంశు లనన్. 27

1. నభోమార్గము. 2. కాప్పెర. 3. మేఘము. 4. చంద్రుడు అనెడుముఖము.

క. సురపతివిలు గని నెమ్మలు
[1]దరవశమునఁ గూయు నిజము; తద్విధి గాదే
నరుదుగ నది [2]మఱుఁగుడు సం
బరమున వదనములు వ్రాల్చి మౌనముఁ గనునే. 28

ఉ. క్షోదితమౌక్తికవ్రజరజోభరపాండురచంద్రికల్ దివిన్
బ్రోదిగఁ బర్వ యొప్పెఁ బలముక్తతిబంధవిముక్తచంద్రమున్
సాఽదృతి చూచుకోర్కినిఁ బయోంబుధి పొంగుచు వచ్చె నాఁగఁ; బు
త్రాఽదులబంధముక్తి నరయన్ జనకుల్ ననురెంత కుందురే! 29

క. చిరముగ జలముల మునుఁగుట
సరసిజినుల జడిమ గలుగ జలజహితుఁడు దాఁ
ద్వర నది గెడపఁ గడఁగె ననఁ
గరములవడ నపుడు వఱపెఁ గడురభసమునన్. 30

ప్రకారాంతరానువాదము

క. చిరనీరమజ్జనంబున
సరసిజినీపాళి నెనఁగు[3]జాడ్య ముడుప నాన్
సరసిజినీమిత్రుఁడు దాఁ
బఱఁగించెన్ మిగుల నాతపంబు సరసులన్. 31

చ. అవమతి సేసి [4]మానసము హంసలు క్రౌంచనగంబుఁ దూఱి భా
ర్గవదృఢలక్ష్యభేదవివరంబున వెల్వడెఁ దద్యశం బనన్;
ధవులు కలంగ సారె, నుపనాథసమాగమహృష్టపాంసులల్
స[5]ఘుసృణాఽర్ఘ్యశారదదినవ్రజ మెంచిరి సౌఖ్యదంబుగన్. 32

చంద్రదూషణము

క. ఘనహిమకరశైత్యంబును
గనునీ వల మేనమృగముఁ గలిగి శిఖరిభి
ద్ధనువుగుఱి వయ్యుఁ బాలవు.
ఘనతటిదుష్ణంబునకును గరఁగవు చంద్రా! 33

1. భయము. 2. చాటు కాఁగానే. 3. చలువ. 4. మానససరస్సు.
5. కుంకుమపూవు.



క. [1]ఘనపంకపతనపంకిల
తను గౌకౌముది కెవఁడు [2]దొలఁచెఁ? దగఁ గతిను దెవం
డెనయఁడు భయము? వియోగాం
గనలన్ బాధించుపాతకంబున్ గనియున్. 34

క. మదమేల! సతము సుఖములు
పొదలునె! సంపదలు సహజముగ భంగురముల్;
కదియుచు నేఁ డెల్లి విధుం
తుదుఁ డామలకమ్ముగా నినున్ గబళించున్. 35

క. అనయము హృదయము మలినము;
కనదు ప్రసన్నతను నిమిషకాలం బేన్; గా
వున ఖల! నీ వఖిలజగ
జ్జనతాపికి హితుఁడ వైతి స్మరనరపతికిన్. 36

క. ఈరీతిగ మారశరాఽ
సారోద్దీపితవియోగసారసనయనల్
నీరేజారిన్ దూఱిరి
స్ఫారజ్యోత్స్నాస్నపితభువనతతివలయున్. 37

క. స్మరకరదీపిక లనఁ దగు
శరదిందుకరంబు లెల్లజగతి నిగిడినన్
నరపతి గనఁడు ప్రసన్నతఁ
జిర [3]మవరజదుశ్చరిత్రచింతాపరుఁ డై. 38

చ. అతనియకీర్తివార్త హృదయంబు మలీమస మై చనం బ్రసా
దితకుముదాఽప్త [4]శారదయుఁ దెల్వని గూర్పద; యట్టు లయ్యు రా
జతనియెడన్ గృపావశత నర్మిలి రాజ్యము నీఁ గనెన్ బ్రసా
దితహృదయుల్ యశోఽర్థులు మదిన్ శ్రమియింతురె! శ్రీలనిచ్చుచోన్.

1. మేఘ మనుపంకమునఁ బడుటచేఁ బంకముఁ గలిగి యుండుటను. 2. కడి
గెను. 3. తమ్ముఁడు. 4. శరదృతువు. ('ప్రజ్ఞాదిభ్యశ్చ' అను సూత్రము
చేత స్వార్థమునందు అణ్ప్రత్యయము—తద్ధితము).

ఉ. 'అంపితి సాంత్వనోక్తులఁ గులాంతకుఁ డై కుపథానువర్తి యై
యింపుగ నొక్కఁ డైనఁ గొనఁ డెట్టుల వీనికఠోరవృత్తి మా
న్పింపుదు' నం చఖర్వకృప వేమఱుఁ జింతిలుచున్నఁ జుట్టి నా
ప్పింప నతండు కృష్ణదరిఁ బేర్చె భుజాయుగవీర్యదృప్తుఁ డై. 40

తే. గీ. నరవరు విడిచి యనుజుసేనాముఖంబు
నాశ్రయించిరి బహుమండలాధిపతులు;
మతివిపర్యయ మొఁ గద మానవులకుఁ
దలఁచుఁ బరిభవకాలంబు దరిసి యుండ. 41

## యుద్ధగజాశ్వసైన్యము

చ. కటతటలోలిదానఝురగంధగజేంద్రఘటల్ సమిత్స్ఫుర
చ్చటులహరుల్ గలట్టినిజసైన్యముఁ గన్గొని 'యగ్రజన్ముతోఁ
బటుతర మైనపోరు సలుపంగను జాలుదు' నంచు నెంచె ను
త్కటవిజయోత్సుకుం డగుచుఁ దమ్ముఁడు రాజ్యసమార్జనేచ్ఛమై. 42

క. సేనాపరికరపీడన్
[1]దానవముల్ గృష్ణవేణి దాల్చెన్ గడు న
ద్దానన్ నీరధిఁ జేరన్
గానక కోపమునఁ బోలెఁ గలుషతఁ జూపెన్. 43

క. ఒక్కెడ దాహము, లుంతన
మొక్కెడ, మఱి బంధనంబు నొక్కయెడన్ దా
నుక్కఁ సెడి [2]జన్నిచిన్నెగ
నక్కుటిలుఁడు చెడుగుపనుల నలయించెఁ బ్రజన్. 44

ఆ. వే. [3]సత్త్వరాసు లయినజలరాసు లేనియు
స్పర్ధ సేయ రానిసత్త్వరాశి
యయిననృవరుఁ డనుజునయపరంపరఁ
గాంచి చిరముగా క్షమించె మిగుల. 45

1. కృశత్వము, 2. సన్నిపాత రోగచిహ్నము. 3. జంతువులు.



క. ఇల నెది యకృత్య మయి తా
నలరదు నశ్రీకటాక్షుఁ డగుజడమతికిన్?
బలికెను దమ్ముఁడు దుర్వా
క్కుల నగ్రజునగ్రమందుఁ గొంకక మిగులన్. 46

ఉ. తమ్మునిదుర్నయాళి వసుధావరుఁ డోర్చెఁ జిరమ్ము; వార్నిధా
నమ్ములుగూడ స్పర్ధను గనం జన వట్టిబలాతిరేకులన్;
సమ్ముఖమం దతండు కువచస్సులఁ గొంకక యన్న నాడు; భా
గ్యమ్ము ద్రొలంగ నిమ్మెయి జడాత్ములు సేయనిచేఁత లుండునే!

క. పలుకంగ నేల! కడు భూ
తిలకుఁడు త్వర మించి తమ్మునికైఁ జనునం
తలు బలిసెఁ దమ్మునకుఁ జా
పల; మిల నయదూరుఁ డిటుల వందురుఁ గాదే! 48

మ. హరిదంతద్విపకర్ణశంఖకుహరవ్యాపిప్రతిధ్వానపూ
ర్ణరవం బై నరనాథదుందుభి శుభప్రారంభ మై యొప్పెఁ; బై
నరిదిన్ దత్పటహోరవంబు మును దీర్ఘాలంబిదిగ్దంతిశ్రే
ఖరశుండాపరిపూర్తి నోటు వడెఁ దత్కర్ణాళి భేదింపఁగన్. 49

క. నరవరుద్విరదంబులసమ
ధరమున లోఁతుగను భూమిభాగము క్రుంగన్
చిరముగ జలధరరవమే
దురదుందుభిరవము మింటఁ దోఁచె నిజముగన్. 50

క. ఆనృపతిబలక్షుణ్ణం
బై నెఱి రేణు[1]తలినంబు నయ్యె గజఘటా
దానార్ద్ర మగుచు [2]గురుతను
బూనెన్ గడు భూమి శేషభోగిఫణములన్. 51

క. జలధులు స్థలీకృతములు గఁ
గలిగెన్ ద్వర మనకుఁ గౌతుకము, నింప నవన్
జల, మల రాజాశ్వంబులు
గొలిపెన్ రేణువు దిగంతగోచరతఁ దగన్. 52

1. తలిక. 2. బరువు.

తే. గీ. రాజమార్తాండుమత్తవారణగణంబు
వీఁపునఁ గప్పుధూళిచే వెలయుచుండె
నవని నొక్కెడ దిగ వీడి యపుడ లేచి
వచ్చుదిగ్దంతినికరంబువడువు దోఁప. 53

క. రవితురగస్పర్ధనొ నా
నవనీశ్వరువాజిరాజి యంటదు పురమిన్;
మివుల శ్రమ మయ్యెఁ [1]జక్షు
శ్రవఃపతికిఁ గరులు నిలుచుచక్కియ మోయన్. 54

క నరపతిమదకరికరశీ
కరభరమున నింగి గొంచఁగా నయ్యె రజః
పరిరుద్ధపథుని సూర్యుని
యరదమునఁ బొడి యగునుడుగణాళి నిగిడె నాన్. 55

క. ఉన్నతకరులకుఁ జేరువ
నున్నజగచ్ఛత్రు వొప్పె నున్మదగజసం
ఘోన్నతభయమున దనహరు
లెన్నఁడుఁ గనకుండఁ జేయ నెసఁగెనొ నాఁగన్. 56

ఉ. వారణయూథపృష్ఠముల వర్తిలుహాటకరత్న[2]శారు లొ
ప్పారె దివిన్ రజం బలమ నానత మైనవిమానపంక్తు నాన్;
ధారణిఁ జేరుధూళి దగె దంతికటస్థల[3]చీనపిష్టమున్
దారిగ, సూర్యవాజులు మతంగజభీతి ననూరుఁ ద్రోసె నాన్. 57

క. కినుక నృపుఁడు కలఁగియు సాం
త్వనమునకు మనంబునందుఁ ద్వరితుం డయ్యెన్;
బొనరనివని సిరికై చే
య నెసఁగెదరు [4]వంశపాంసనాదిపులె [5]పరుల్. 58

1. సర్పరాజు. (ఆదిశేషుఁడు) 2. యుద్ధగజములయంబారి. 3. ఏనుఁగులకుంభస్థలములపై నుంచెడు సిందూరము (సీసపు-లేక-తగరపుపొడి). 4. వంశదూషకరాజులు. 5. ఇతరులు (ఈరాజు కాఁడని భావము).



క. నదిదరి దరియఁగ నట నటఁ
గద[1]నాఽయతవైరిభటనికాయము దారిన్
గదియుచుఁ గుంతలనాథున
కుదయం బయి పెంపుఁ గొంచ నొనరిఁచిరి క్రుధన్. 59

శా. శ్రీరాజన్యుఁడు శోణితాఽక్తతటినీక్రీడాఽభికాంక్షిద్విపం
బారోహించి గభీరతన్ బ్రతిపథవ్యావర్తితాంభోభర
స్ఫారభ్రామ్యదశేషవీరవరమస్త్రవ్యూహసంకీర్ణ మౌ
తీరం బొప్పఁగఁ జేసి, కృష్ణతటినీదేశంబుఁ జేరన్ జనెన్. 60

చ. అవనివిభుం డుపాయపరుఁ డత్తటినీతటమందె నిల్చి సా
మవిధినె తమ్మునిన్ గుటిలమార్గవిదూరు నొనర్పఁ బూనెఁ గా
ని విని గ్రహింపఁ డాతఁ డవనీతుఁడు సాంత్వన మొక్కఁ డేని; భా
గ్యవిభవ మూడుచోఁ గడు నిరంకుశ మౌఁ గద బుద్ధి పాపికిన్. 61

## యుద్ధయాత్ర

ఉ. బాహుపరాక్రమద్విరదభైరవడిండిమరావ మాహవో
త్సాహ[2]భుజంగభుక్సలిలదం బల కుంతలభూమిపాలసై
న్యాఽహతరౌద్రదుందుభిజయోద్యతనాద మశేషరోదసీ
గాహన మై చెలంగె రిపుకాండము లుక్కఱి దిక్కులం జనన్. 62

క. వీరసతులు విజయోత్కఁతఁ
దీరిరి [3]చదుకంబునందు దిటవుగ గుమి యై,
యారీతి నున్నవారిన్
వీరులు నృపమార్గమెదుట వేడుకఁ జూడన్. 63

తే. గీ. [4]ప్రబలసుభటవిదూరభూభాగమెల్ల
జన్యదుందుభిమేఘగర్జనముచేత
నయ్యె నిచుళాంతరవినిర్గతాసివల్లి
నవమణిగణాంకురోత్పాదనం బనంగ. 64

1. సిద్ధమైన. 2. నెమిలి. 3. చతుష్పథము. 4. విదూరభూమియందు మేఘగర్జనముచేత వైదూర్యమణులు పుట్టు నని కవిసమయము.

తే. గీ. కలహసంభ్రమలోలభంగు లగుచెలుల
కబరులందును గౌక్షేయకములయందుఁ
బడియె నద్భుతరాగనిర్భరము సంగ
రోద్భటభటావళీనయనోచ్చయంబు. 65

తే. గీ. ఉక్కు మిగిలినసుభటాళి యెక్కు [1]సౌరి
పంజరంబుల నుండ ద్వీపంబు లొప్పె
వెలుపల మణీ[2]పరిష్కృతుల్ పేర్చినట్టి
[3]యవసథంబుల నందమైనట్టి వనఁగ. 66

క. తరుణీహస్తార్పిత[4]నా
గరఖండోద్భూతవీటికను గొఱుకుచు వి
స్ఫురదుత్సాహమున భటుఁడు
కరికరటదళనము తృణమ[5]కా భావించెన్. 67

క. పరరాజన్యశిరశ్శే
ఖరరత్నాంకూరకంటకస్థలిఁ దిరుగన్
గరము సమర్థము లయ్యెన్
దురంగములు [6]లోహబంధదుర్దమఖురతన్. 68

మ. రభసాయోధనసక్తమత్తకరిసంరంభోర్మికాస్ఫారమున్
నభఆభోగతరంగచంక్రమణరంగద్వాహసాహస్రమున్
స్వభుజాటోపసముత్సుకోద్భటబహుస్ఫాయద్భటోత్సేధ మ
ద్విభుయుద్ధోద్ధతసైన్య మొప్పె క్షుభితాబ్ధిం బోలి దుర్దాంత మై. 69

క. గజములు నృపమందిరమున
నిజకరశీకరము లంపి నిబిడముగాఁ ద
ద్విజయోత్సుకనృపహృద్గత
విజిగీషాప్రసవమాల వెలయఁగఁ దడిపెన్. 70

1. అంటారి. 2. భూషణములు. 3. ఇండ్లు. 4. నాగరఖండదేశోత్పన్న కర్పూరతాంబూలము. 5. అని. 6. అశ్వముంపాదములకుఁ గొట్టఁబడు నినుపనాడ్లు.



సీ. జయరమాపరిరంభశంసిభుజంబునఁ
గమలమాలగ స్వదృక్సరణి నిగుడ,
వలపున భటలక్ష్మిఁ బులకకంటకములఁ
గనక నాఁ బొదివి తాఁ గౌఁగిలింప,
రిపురాజపంకజగ్లపనహిమం బనఁ
[1]జంద్రహాసము నిజాస్యమునఁ దోఁప,
హరి యరివధదీక్ష ననుజమధ్యగుఁ డనాఁ
దనరూపు కటకరత్నయుగిఁ దోఁపఁ,

తే. గీ. జుట్టు పటికంపుగిరికంచెపట్టుఁ బోలు
గంధపుంబూఁత వెలిమేను విందుఁ గొలుప,
ముత్తెములసేన శశిఁ బోలుభూవిభుండు
[2]చదుకమిలు వీడి మత్తగజంబుసరణి. 71

క. వెడలి [3]ప్రతిగ్రాహితబలి
నాదయం డిభపృష్ఠ మెక్కె నూర్జితజవ మే
ర్పడ మంగళతూర్యధ్వను
లడర నుదయశిఖర మెక్కునర్యముఁడు వలెన్. 72

సీ. స్వోపరిస్థితనృపప్రాపితశ్రీదృశా
యుతి [4]హరిగతగజోన్నతి హసించె;
నిజకరాస్ఫాలన[5]నేదిష్ఠఘనరణ
శిథిలనృపస్థితి స్థిరముపఱచె;
నాత్మమదాంబుపూర్ణాంఘ్రిముద్ర [6]నృపుని
సిరివడ విడ నిర్ధ నరసిఁ బోలె;
దమ[7]దానపానమత్తసుమలిఙ్ణినదముల్
రిపుభేరిరుతి నాఁపురీతిఁ దనరె;

1. చంద్రుఁడు – కర్పూరము. 2. చతుష్పథమున నున్నయిల్లు. 3. కైకొనఁ జేయఁబడిన పూజలు గలది. 4. ఇంద్రుఁడు. 5. సమీపమునం దున్న. 6. రాజలక్ష్మి తాపము పోవుటకు. 7. మదజలము.

తే. గీ. నట్టిభద్రేభమందు వీరావతార
మూర్తి యుత్సాహమానసస్ఫూర్తిఁ దనరి
జగతి నద్భుతసమధికసాహసుండు
పుడమిపతి యంత నవ్వుచు వెడలె వేగ. 73

మ. విజయశ్రీపరిరంభణోత్సుకతఁ దా వేడ్కన్ సమిద్రంగమున్
భజియించెన్ బ్రియసుందరీకలితవేశ్మంబున్ బలెన్; మీఁదటన్
సజవప్రాభవతీవ్రవిక్రమత నుత్సాహించి యెంతేఁ బథం
బజితుం డై క్రమియించి డిండిమరవోదారారిసేనన్ గనెన్. 74

## గ జ సే న

సీ. రదనాంశుకౌముది, మదజశైవలభృంగ
గణతిమిరచ్ఛటల్ గడవు ననఁగ;
మదనిద్రఁ గన్మోడ్చి మదజపంకస్థల
ర్భృతి నా మెలమెల్ల వెడలు ననఁగఁ;
గాసారజలకేళిఁ గైకొని జలజాళి
మించులక్ష్మిని ధరియించు ననఁగ;
[1]వప్రకేళీశిరఃపతితఝురవ్రణ
వారి [2]దుర్దిన [3]మదప్రదము లన;

తే. గీ. నొప్పుమత్తేభములు శశాంకోపమంబు
లైనప్రతిభూషశంఖముల్ పూని యుండ
రాజహంసాళిసేవావిరాజి యైన
[4]దానతటినీతటం బనఁ దద్ద నొప్పె. 75

శా. పాదం బొక్కటి యెత్తి, యేభుజబలప్రాజ్యారిపోన్మస్తమం
దూఁదంగాఁ దగు నంచు నెంచె ననఁగా నొప్పెన్ ద్రిపాదస్థితిన్
వేదండంబులు, దానలుబ్ధసుమలిఙ్మస్వానవిస్ఫూర్తి, ల
క్ష్మీ[5]దౌవారికయామికంబు లనఁగా మించెన్ సహస్రంబు లై. 76

1. ఏనుఁగులు దంతములతో గిరిసానువులను గోరాడెడియాట. 2. మేఘచ్ఛన్నదినము. 3. మదజలము. 4. మదజలనదీతీరము. 5. విజయశ్రీద్వారమునఁ బహరా కాచునవి.



## అశ్వసేన

సీ. అబ్ధిరుద్ధావని యడ్డు జవం బని
కోపానఁ గళ్ళెముల్ గొఱకు ననఁగ;
మే మూఁతఁ గొనఁ జూచి [1]మిత్రాశ్వముల్ నవ్వ
ననునీర్ష్య నా వీడు నవని ననఁగ;
వైదూర్యవియదటద్భానుసప్తులఁ గని
మిన్ప్రాంతిఁ బచ్చిక మెలఁగు ననఁగ;
ఫేనలీల ముఖాన వెలసి పాల్కడలి [2]స్వ
తనుజాశ్వ మని ముద్దు గొను ననంగఁ;

తే. గీ. దగుచు ఖురచయఘట్టిత[3]దస్యుకుట్టి
మస్ఫుటద్వహ్నికణముల [4]ప్రమందు చుండు
చటులపదముల నెటను నశ్వములసేన
యధ్వమున ఘర్షణము వీడి యరుగ నొప్పె. 77

క. చేరువ ఘనాడంబరమున
శారదనుర్భ్రమను గొలుపుచటులహయంబుల్
తోరపుఁబిడుగు వడుభయముఁ
గూరుచు జగములకు నాఁగఁ గులుకుచు నొప్పెన్. 78

## సుభటసేన

తే. గీ. నృపభటుల్ దమశిరములు హృదయరత్న
భూషణప్రతిబింబితస్ఫూర్తి మెఱయఁ
గరము మరణంబునందు [6]నిగ్రహను లగుచుఁ
దల లెద ధరించి రనఁ దోఁచె ధైర్య మొప్ప. 79

సీ. సహజోష్మశుష్కజర్జరచందనము హృది
సేనావధజశల్యసితరజ మనఁ,
బ్రబలదోర్యుగతీర్ణపటురణార్ణవ మయి
పృథుఫేనసమయశశ్శ్వేత మనఁగ,

1. సూర్యునిగుఱ్ఱములు. 2. తనకొడుకగునుచ్చైశ్శ్రవము. 3. శత్రువుం. 4. నొచ్చు. 5. విజృంభణము. 6. క్లేశము లేనివారు.

సమదారిమర్దనశస్త్రవ్రణస్వాంగ
రంధ్రముల్ సేరె వీరరస మనఁగ,
తత[1]తమిస్రాళి నాఁ [2]దావాగ్నిదంభఘ
ర్మాహముల్ నా [3]నజయ్యం బనంగ,
తే. గీ. నొప్పి యతిగతకకుబంత[4]రుద్భటంబు
నధికభైరవ మౌసుభటాళిఁ గాంచి
సంభ్రమంబున భయ మందె సర్వసేన
కుంతలనృకాంతుఁ దలరారెఁ గోర్కి మీఱ. 80

## యుద్ధము

క. వీరరసాంబుధి సుభటులు
శూరులు విజయామృతంబుఁ [5]జూరఁ గొనుటకై
ప్రారంభించిరి తెగి [6]ప్రవి
దారణ మిరుగడలఁ బ్రళయదారుణభంగిన్. 81
ఉ. రెండుబలంబులున్ సమరవృక్షము నెక్కి స్వబాహువీర్య మన్
దండము నూని దోలన మొనర్పఁగఁ దత్తరుసంగతంబు లౌ
పండులు తండతండములు వ్రాలె ననం దగె వీరకోటిదో
ర్దండగతాసికృత్తములు ధాత్రికి వ్రాలుశిరోనికాయముల్. 82
క. పగతుఁ బరిమార్చి [7]వల్గితుఁ
డగువీరునియెదను స్వాత్మలందు సమముగా
విగళితరిపుఖడ్గము ర
క్తగుణచ్ఛట సొచ్చె వేల్పుగణము వొగడఁగన్. 83
తే. గీ. శస్త్రపాతిత మైనట్టిశత్రుశిరము
కడు వశము దప్పి యసియాడఁగాఁ [8]బృషత్క
విద్ధ మగుతచ్ఛిరంబున విజయసుధను
గాంచువేడుక సుభటుండు గాంచె ముదము. 84

1. చీఁకట్లసమూహము. 2. దావాగ్నివిజృంభణము గలగ్రీష్మదినములు.
3. ఓడింపశక్యము గానిది. 4. అధికము. 5. పూర్తిగా గ్రహించుటకై.
6. యుద్ధము. 7. పొఱుచున్నవాఁడు. 8. బాణము.



క. మణిమయముకుటముల [1]శకున
గణములు ఘట్టనము సల్ప క్షతచంచువు లై
ప్రణయము సహర్షముగఁ గొన
వణు వైనను నిక్క మైన యామిషమందున్. 85
ఉ. నెత్తురువెల్లి లోఁ దగుచు నిల్చి భటాధ్వము నడ్డగింపఁగా
నత్తఱి నొండొరుల్ గనియు నాహవముం జలుపంగఁ జాల రై;
రుత్తమశీలగానమున, నొప్పుస్మితాక్షుల, వైర మూహకున్
హత్తదు; వీరఖడ్గములయందె [2]కఠినిమ గాన నయ్యెడిన్. 86
సీ. మానులు తమతలల్ మహిఁ ద్రొల్ల నరిసేన
మెట్టు నన్[3]రీఢనే మిడుకు చుంద్రు;
ఛిన్నభటశిరంబు చేర్చుఁ గౌతుకమును
శత్రుసారితదృష్టి జరుగ కునికి;
నసిఘట్టజాగ్నికణాళి పిశాచికాళ
వళి కామిషము వండ నెలమిఁ గూర్చె;
హృదయస్థశరమూర్ఛ నిభకుంభశయులకు
శ్రుతితాళపవనాల శోష దీఱెఁ;
తే. గీ. గరటికరటగళితమౌక్తికచ్ఛలమున
మహితతారాధ్వనిభఖడ్గమండలతతి
యొప్పె [4]వినిమీలితర్క్ష మై యుదయ మెనయు
విజయతిగ్మాంశుఁ దోఁపించు వింత ననఁగ. 87
మ. భటవక్షఃస్థలభేదలంపటనమర్థద్రేభ మొప్పెన్ సమి
త్తటదీవ్యజ్జయలక్ష్మిఁ బైఁ గొనఁగ యత్నం బూనునో నాఁగ; నం
తటఁ జాళుక్యబలంబు సర్వమును ద్విడ్దంతావళీనీకసీ
చటులప్రోద్ధతధావనక్షుభిత మై సాగెన్ సమస్తాశలన్. 88

1. పక్షిగణములు. 2. పరుషత్వము. 3. అవమానము. 4. ముడుఁగుపడిన
నక్షత్రములు గల దై.

మ. ఒకదృప్తేభము గాని యొక్కతురగంబో కాని కాల్బంట్లలో
నొకఁ డైనన్ బ్రతిపక్షవీరలయవాతోద్ధూతు లై సంచరిం
పక యున్నం గని చెక్కులం బులకలం బాటించి చాళుక్యనం
దనుఁ డంతన్ వెడలెన్ మదోద్ధతకరీంద్రం బెక్కి దుర్దాంతుఁ డై.

తే. గీ. [1]జన్యలీలాబ్జసరసి బిసం బనంగఁ
దగునహితకీర్తికందళిన్ దద్దఁ జీల్చి
చతఁడు కరిమేఘఘటలెల్ల నవనిఁ గూల్చి
చద్భుతంబుగ రాజహంసాఖ్యఁ దనరె. 90

క. క్షతకుంభికుంభముక్తా
తతి మొగ్గలఁ బోలి రాలఁ దగె భూపతి స్వా
హితవీరయశస్సుమతరు
వతనుస్వభుజములఁ గంప మందించె ననన్. 91

చ. రిపుగజకుంభిపాళిఁ బ్రహరించుచు [2]నిర్గహనుండు రాజు దా
నపుడు స్మితాస్యుఁ డయ్యెనుబ్రియాస్త్రనమండలి లోఁ దలంచుచున్;
ద్విపకటపాతితద్విషదుదీర్ణశరంబుఁ దొలంచె నేస్గుపీఁ
పుపయినిఁ గాలఁ దట్టి; సురపుష్పచయంబుల నిండె నంతటన్. 92

ఉ. కుంభిపతాకదండమునకున్ గదియన్ బ్రతివీరకోటి దో
ర్జృంభణ మొప్పఁ బంపినవృద్ధశరాళిఁ జూచి కుంభినీ
జంభభిదుండు [3]విభ్రమసుసంభృతుఁ డై పరితోష మందెఁ దా
దంభము మీఱ నెంచి జయదప్రియకీలకమాలికాళిఁగా. 93

మ. ప్రతిపక్షక్షయదీక్షితుం డయినక్ష్మాపాలాగ్రగణ్యుండు హ
స్తతతిన్ వేయిటిఁ దాల్చిన ట్లసిలతన్ జ్యాముక్తనారాచసం
తతిచేఁ దోమరభిండివాలముఖనానాహేతిజాతంబుచే
నతిశీఘ్రం బగుదంతిధావనముచే నాభీలుఁ డయ్యెన్ [4]యుధిన్. 94

1. ఈపద్యమున నుపమానోపమేయముల యభేదరూపకము శ్లిష్ట మగు 'రాజహంస'శబ్దముచేఁ జెప్పఁ బడినది. సమానధర్మబోధకము లగువిశేషణములు మూఁడింటికిని సాదృశ్యరూపకము. 2. క్లేశము లేనివాఁడు. 3. విలాస 4. ఇది 'భువి-దివి-హృది' యను శబ్దములవలె స్వతంత్రప్రయోగము.



శా. అశ్వానీకిని భూమిపాలుఁడు హఠాదాయత్తాత్ముఁ డై త్రుంప స
ప్తాశ్వాశ్వంబులు నూది [1]దామములు ద్రోయం బూనె భీతిన్ వడిన్;
శశ్వల్లూనగళారిహస్తిపక[2]సంజాతోత్తమాంగంబులన్
విశ్వోర్విన్ నినిచెన్ యశంబు దివి నింపెన్ యోగపద్యంబుగన్.

ఆ. వె. కొండచయములనైనఁ బిండి సేయుశరాళి
గాసి నెనసి పగఱకరటిదళము
పఱుగు లిడెను దెసల శరణ మందఁగ దిగ్గ
జేంద్రసమితి నాఁగ నెద లురలఁగ. 96

క. రిపుబాణావళిఘట్టిత
నృపకంకటజాతవహ్నిరేణు లెగయఁ దా
నపరిమితసమరజలనిధి,
విపరీతౌర్వానలములఁ బేర్చె ననఁ దగెన్. 97

వ. అంతఁ బ్రధనపృథివిఁ బృథివీంద్రుండు పృథులజయం బంది విజయేందిరావిరహదోదూయమానమానసు లైనవైరులకుఁ గరటికరటముక్తాపరాగపాండురత్వంబునఁ దపస్విత నొందించె నన నొప్పి, ద్విరదపదదళితద్విషదనీకినీకపాలకర్పరంబుల బ్రహ్మాండభాండపూరణ[3]క్షమకీర్తి యనఁ జరించుచుఁ, [4]దూపుసోనలఁ జిల్కునట్టిలుమేటిఁ బగఱ[5]చదుకంబున నొకం డైనఁ గడిందిమగంటిమి మార్కొని[6]క్రోల్తలల మాఱాడ కుండె. నివ్వడువున గడియలో మార్తురనుక్కడంచిననడిమిజగమేలికయొదలున [7]శిలీముఖపాతంబు వేల్పులపూసోనలతోన కలిగె. నిట్లు [8]సమనీకముఖంబున ననేకానీకినీజనానూనక్షయం బపహాయుం డై సాహసాంకసర్వంసహానాయకుం డానర్చి యెవ్వానికి వర్ణనాస్పదంబు గా కుండె? 98

1. వర్గములు. 2, సమూహము. 3. సమర్థ మగు. 4. బాణవర్షములు, 5. శత్రుసేనావారము. 6. యుద్ధసన్నాహములలో. 7. తుమ్మెదలు - బాణములు. 8. యుద్ధము.

శా. జన్యక్షోణిఁ గబంధతాండవములన్ జాలన్ భయం బంది రా
జన్యోద్దాంతభుజంబు నందె విజయోచ్చ్రీ యనన్ మించె; శ
త్రున్యస్తాఽత్మతనుత్రబాణములు సంరోధింప దోర్వ్యాప్తి, రా
జన్యం డూడ్చెఁ గరాంబుజాతమున భ్రాజల్లీల స్మేరాఽస్యుఁ డై.

శా. శ్రీచాళుక్యకులాంబురాశివిధుఁ దుష్టీషంబుపై శత్రునా
రాచవ్రాతము లంత భార మొనఁగూడం జేర, నాయోధనో
[1]త్కోచద్రంగతలేందిరాంగనకు మ్రొక్కుల్ గూర్పనై పైపయిన్
దోఁచన్ మీఁటెడుశీర్షమున్ క్షణము వంచున్ భక్తి నా నొప్పెడిన్.

ఉ. మార్తురరక్తబిందుతతి మానుగ హత్తుబిజాల నొప్పుభూ
భర్త దగెన్ వినాశితవిపక్షకిరీటవిముక్తరత్న[2]వి
స్ఫూర్తి యనన్; దదీయశరముల్ బెడిదంబుగఁ గాఁడ రంగమం
దార్తులు ధావితేభకరటాఽవళినుండియు డొల్లరై రిలన్. 101

తే. గీ. మూర్ఛమిషమునఁ గన్నులు మూయు దేల
నాథ కపటంబు విడుమ! భూనాథుసేన
పరిభవం బందుతరుణంబు దరియ నుండ
నీ కుపేక్షింపఁ దగ దనె నెలఁత ప్రియుని. 102

తే. గీ. పురుషదౌర్లభ్యమున దేవభూమి వీడి
దేవపాంసుల లిటకు నేతెంతు రనుచుఁ
గాముకా! నన్ దిరస్కృతిన్ గనకు మోయి!
యనుచు నొకకాంత పలికెఁ దా ననుఁగుకాని. 103

తే. గీ. శ్వాసమారుత మాఁపునీసరణి దెలిసె
సుభట! సురవారసుందరీచుంబనమునఁ
గ్రొత్తనెత్తావి మోమున నత్తమిల్లె
ననుచుఁ [3]బలవించె నొకయింతి తనదుప్రియుని. 104

1. అరుణవాళక. 2. విస్ఫూర్తి గలవాఁడు. 3. ప్రలాపించెను.



క. నిలువక చపలలు సంపద
లల స్వామిగృహంబునుండి యభిసారిక లై
చలియించె నహ! యదైర్యం
బలమె నిను నాదుభాగ్య మబుకతమునన్. 105

క. సురతరుణీగృహమును నా
దురదృష్టవశానఁ జొరఁగ దొరకొని తేనిన్
బరదుర్లభ మిట రాజా
దరము మఱవఁ దగునె నీకు [1]దర్పకవికృతిన్. 106

క. ఇటు వీరభటవధూటీ
చటులాఽక్రందనసహస్రశత[2]దుర్దిన మం
తట రణభూమిఁ గనుచు భూ
విటుఁ డరులన్ [3]వెన్నుటను విడి క్రమ్మఱిలెన్. 107

[4]అలఁతిఁ జళుక్యుఁ డాహవపయఃపతిపారము నెయ్ది పేర్మి, న
వ్వల విలు డించి తాను విని వ్యాకులశత్రుపలాయనంబు లోఁ
గలఁగెను 'గీర్తి యున్ వదలెఁ గాఁ గృపణున్ మహి వీని' నంచుఁ; బం
చలముల దుష్టులందును [5]నిసర్గమహాఽత్ములు పూనుకోపముల్. 108

క. నరపతి సొచ్చె లలితగత
కరేణుకాన్యస్తక్రమకాంచనపీఠ
స్థిరుఁడు [6]జయధ్వజపురిఁ; గొని
హరి-కరి-శుద్ధాంతసహిత మరిసిరినెల్లన్. 109

ఉ. ఉక్కుభటుల్ వనాంతరమునుండి ఖులాహితుఁ బట్టి తేఁగ న
య్యక్కృప బాష్పగద్గదవచోఽనుగుఁ డౌచుఁ జళుక్యవంశమం
దెక్కటివీరుఁ డందె గృహశృంగవిలంబిత[7]హారదీధితుల్
చొక్కపుఁగీర్తులన్ దెలుప సొం పగుపట్టణమున్ బ్రియంబునన్.

1. మన్మథ. 2. మబ్బుగప్పినదినము. 3. వెంబడించుట. 4. తేలికగా.
5. స్వభావముచేత గొప్పవారు. 6. విజయపతాకము గలరాజధానిని.
7. ముత్తెములసరములు (నిర్విశేషణ మగు 'హార' పదమునకు ముక్తాహార మని యర్థము. ఇతరత్ర 'రత్నహారము' మణిహారము' అని యుండును).

## హేమంతము

ఉ. కుంకుమగోము కాఁపుదల, [1]కొంచలకున్ స్మరదేశికుండు మిన్
ఫొంకముద్రుచ్చు, పూవువిలుధూపతిఁ జేరువజీరుగా, శర
త్సంకలితాఽతపాఽర్తముఖ[2]శార్వరివల్లభవల్లభంబు, పెన్
బింకముతోడుతన్ దుహినవేళ లలిన్ బొడసూపె నంతటన్. 111

క. శరదృతువితీర్ణసౌభా
గ్యరమాప్రత్యూహదక్ష మగు హేమంతం
బు [3]రసారమణవరాఽస్యా
వరవదననిషేవణప్రవర్తనఁ గఱచెన్. 112

సీ. ఇనునితేజము మాంద్య మెనసిన దివసవి
స్తారకర్షణసముత్సవము నొందెఁ;
జెలులకుఁ [4]బొలయల్క, [5]నెలమిని [6]నెఱిఁ గూర్చి
[7]యాయామవతు లయి యందె వినుతి;
సతతం బనంగసంగతగాత్రముల స్త్రీల
కాశ్లేషకౌతూహలాఽప్తిఁ గూర్చెఁ;
ప్రౌఢిమ సంకోచపాత్రత్వ మెనయించి
దివసాఽళి నొనరించె స్త్రీజితముగఁ;

తే. గీ. గాలవశమున శారదకాలమహిమ
దొలఁగ వలఁగొను[8]హైమనర్తువునయందు
నరుల మించెడుయోషిజ్జనంబుపగిది.
దినవితతి హేల లడఁచి యామినులు ప్రబలె. 113

క. [9]అలకాఽలికచామృగమద
కలితకపోలస్థలాలకములకు దోలా
విలసన మూన్చుచు వీచెన్
లలితగతిన్ రాజతాచలశ్వసనంబుల్. 114

1. క్రౌంచపక్షులకు. 2. చంద్రునకుఁ బ్రియము. 3. రాజస్త్రీలు. 4. ప్రణయకోపమునందు. 5. ప్రసన్నతయందు. 6. పరిపూర్ణత. 7. దైర్ఘ్యము గలవై. 8. హేమంతఋతువు. 9. అలకాపురస్త్రీలు.



మ. స్మరదర్పోష్మనివాసభూము లనుచున్ శంకించె నాఁగన్ దమిన్
[1]దొరయం బోక హిమంబు ముజ్జగములందున్ వ్యాపనం బూన న
బ్బుర మౌనుమ్మకు నిమ్ము లౌకామలచన్ద్రాంతల్ విజృంభించె న
ద్ధుర కేంద్రీకృతచూతసాయకమహోదుర్దాంతదుర్గస్థితిన్. 115

క. వారనితరళద్యుతులన్
దారాఽధ్వక్షేత్రమందు నవ్యాంకూర
స్ఫారహిమానీబీజక
వారరుచిన్ బ్రబలె రిక్కబలగము లంతన్. 116

క. హిమమహీధరమారుతమునఁ
దమ మోములు పగులుపాటుఁ దాల్చు ననుచుఁ గుం
కుమపూఁత[2]నిచోళంబుల
సుమకోమలు లుంచి రాస్యసోమశ్రేణిన్. 117

క. క్షేత్రములు [3]పుండ్రపాకప
విత్రము లగుఁ; గరుడువాలు పెరుగు వఱఁగెదున్;
గాత్రములు ఘుసృణచర్చా
పాత్రము లగు [4]హైమనప్రభావ మయారే! 118

ఉ. నారిపుఁ డైనసూర్యునకు నవ్యముదాస్పద మిద్ది యంచు దు
ర్వారరుషన్ వలెన్ వలి కరంబు సరోరుహిణిన్ దహించె నా
సూరుఁడు సూచుచుండఁగనె; చోద్యమ! తేజము గల్గువారలేన్
దారుదు రేమి సేయ విధి దప్పినకాలము మ్రోల నిల్చినన్. 119

క. మారునిఁ బరిపోషించుతు
షారాఽగమ మపుడు స్పర్శసౌభాగ్యం బిం
పారఁగ సామాన్యస్త్రీ
వారావయవములఁ గూడఁ బాటిలఁ జేసెన్. 120

1. అంటంకుండ. 2. గవుసెనలు. 3. నలుపు గలిసినయెఱ్ఱచెఱుకు. 4. హిమసంబంధమైన.

## వేఁట

తే. గీ. ఆవిహారార్హ దినముల నృపుఁడు చళుక
వంశభవచక్రవర్తి [1]ద్విపఘ్నగామి
నిజభుజార్జితవిభవనిర్జిద్రుఁ డగుచు
వెలలె మృగయావినోదంబు సలుపఁ గడఁగి. 121

సీ. [2]ఘనవినీలతనుత్రగాత్రుఁ డై ధృతనీల
కువలకంకటు మనోభవునిఁ బోలె;
[3]శ్యామవర్మోపరిహారాన విను దిగు
[4]నక్షోడుయుతవియదటుని మించె;
హారలంబితయోషిదగ్రదేవీస్థితిఁ
బరిజనయుతలక్ష్మివక్షుఁ డయ్యెఁ;
స్ఫటికోజ్జ్వలోరఃప్రసరహారగతముక్త
లను యశోద్రుమకుట్మలత వహించె

తే. గీ. లక్ష్మికులగేహనీలోత్పలములషండ
మునను రాజమరాళంబు వోలుచుకరణి
నిజవినీలాతపత్రంపునిగల నృపుఁడు
భువననేత్రాభిరామవిస్ఫూర్తిఁ దనరె. 122

తే. గీ. సకలకకుబంతరాళప్రసాధనంబు
సలుపుదోర్యుగకీర్తులసరణి దోఁప
నిరుకెలంకుల ఫేనపాండురము లైన
[5]చామరలజంట భూమీశచంద్రుఁ దొప్పె. 123

సీ. [6]కినుకమైఁ దపనవాహనశిరస్తాడనో
ద్యమమున నుత్సుకతను వెలార్పు,
వేవెలుంగువినీల[7]వీతిసంతానంబు
ఘర్మదగ్ధంబులుగా హసించుఁ,

1. సింహగమనుఁడు. 2. మేఘమువలె నల్లనయినకవచము. 3. నీలకవచముపైని ముత్యాలదండతో. 4. మేఘనక్షత్రసహిత విద్యాధరుని. 5. చామరములు—ముచ్ఛమలేకుండఁ గూడప్రయోగముగలదు. 6. ఈపద్యములోఁ దొలి 4 పాదములకు ఎత్తుగీతము 4 పాదములతోఁ గ్రమాన్వయము. 7. అశ్వములు.



దనలోనఁ బవమానమును గణించక దాని
కతిపంగుభావంబు నంటఁ గట్టుఁ,
దనమేను ఖురఖండితనృపాంగణమణీర
జఃపూరితముగ నిచ్చను దలంచు,

తే. గీ. గగనసీమాన్తరింఖికాస్కందితముల;
ఫేనసమపాండునిజదేహవిలసనమున;
స్వీయతేజఃప్రహృష్టహృద్వేగవిధిని;
రవికరోదితపల్యాణరత్నదీప్తి. 124

వ. ఇట్లు విజృంభించుమృగయాసమయసమనురూపాలంకృతతురంగంబుఁ
గుంతలభూకాంతుం డారోహించి [1]వయాళికై వెడలునప్పుడు:- 125

క. చిత్తరువులు గై సేసిన
[2]తత్తడిగమిజీనులందుఁ దవులుజనులచూ
పత్తత్తడు లరుగన్ వె
న్నత్తి, [3]బడన్ గన్నయటుల నరయదు తొలఁగన్. 126

తే. గీ. రమణ భ్రమియించుమన్మథరాజధాని,
లలితపల్లవతతికి విలాసవనము,
రసనియంతకుఁ బరమగౌరవపదంబు
అంతిపుర మన్నృపాలువె న్నంటి చనియె. 127

తే. గీ. అతనివారాంగనలు తురంగాళిపైన
బొమలవిండ్లను గ్రేఁగంటిములుక్కలూని
దిగ్జయోద్యతమదనపృథ్వీవరేణ్యు
ప్రబలసేనావితాన మై ప్రథఁ దలిర్పె. 128

1. విహారము. 2. అశ్వసమూహము. 3. బరలిక.

క. మృగయాసరసీహంసలు
మృగశాబకశమనదూత [1]లిసుజాగిలముల్
దగి పలువన్నెల, హింసా
దృగంతదృష్టు లన ముందుదెసఁ జనఁ బూనెన్. 129

మ. త్రిజగల్లంఘనజాంఘికోత్సుకతఁ బూ[2]న్తేజీహయం బెక్కి భూ
భుజుఁ డెంతేఁ దెరు వుత్తరించి త్రుటిలో ముంజాయగాఁ గన్గొనె,
న్సజవోల్లంఘనసక్తమత్తమృగసంతానాఽకులారణ్య మ
క్కజమున్ దెల్పుచు నాత్మనేత్రపుటముల్ కర్ణాంతముల్ సోఁకఁగన్.

క. అబలాపరిజనయుతి [3]భూ
పబలారి ప్రవేశమొందెఁ బాండుయశుం డా
నిబిడాసితనిచుళదళ
ప్రబలతరచ్ఛన్నరవికరము లగుమలలన్. 131

క. గిరులసరికరులతుల గల
[4]కిరులతుటుము నిగిడె నెదుట క్షితిపతికిఁ [5]గిరీ
పరిచుంబితముస్తాశుభ
పరిమళయుతవదనసై జబాలకయుత మై. 132

చ. మును జని కొన్నియంబ లటు [6]పొంపిరిగర్వముఁ బూని మాటికిన్
వెను జనుదెంచువాని సరవిన్ గనుచున్ జను చున్న[7]యేకలం
బు నిభసమానపీనతనువున్ గలదాని [8]నొకండుఁ గక్షమం
దు నిశితసాయకం బొకటి [9]దూఁటి ధరన్ బడఁ గూల్చె నుగ్రతన్.

1. రాజువేఁటకుక్కలు. 2. ఉమత్త జాతిగుఱ్ఱము. 3. రాజేంద్రుఁడు. 4. వరాహసంఘము. 5. ఆఁడువరాహము. 6. సాంద్రమగు. 7. వరాహము. 8. 'ఒకండు' అనునమహద్వాచకమునకు ద్వితీయాంతము. 9. పొడిచి.



ఉ. కొన్ని. [1]లకోరు లంగములఁ గ్రుచ్చినయట్టులె కూలె నేలపైఁ;
గొన్ని, సశల్యకాయముల గొబ్బున దవ్వుల దాఁటి పోయెఁ; బై
నున్నవరాహముల్ దిరిగె నుగ్రనిశాతశరప్రపాతభీ
తి [2]న్నైబయారముల్ గలక్షితిధ్రమహావిషమస్థలంబులన్. 134

క. [3]తొలియద్భుతకథ కెంతయు
సలిపె విపర్యయము తేనిశర; మిలఁ బధునే
కలము నధీరము, వికలతఁ
గలదాని వహించె నవని కడుఁ జిత్రముగన్. 135

క. లీలమెయి నేలయేలిక
గీలించినవాలుకోల క్షితిరుహమున వే
కీలుకొను[4]దంష్ట్రి దాలిచె
నాలానాఽబద్ధముగ్ధహస్తివిభవమున్. 136

చ. సకనకశృంఖలం బయినశ్వాన మొకండు వినిర్గమించి యాఁ
గక వన మాక్రమించుకిరికాండముపైఁ గ్రుధ దూఁక, వృషకం
టకముల సంకెలల్ దవిలిన్ వశమేదుచు మాటిమాటికిన్
వికలమతిన్ మొఱుంగుఁ బరివేదితకంఠబిలోద్గతధ్వనిన్. 137

చ. హరిణి యొకండు భూరమఱునాశుగహేతువునన్ నిరుద్ధ మౌ.
హరిణముఁ గాంచి తా మఱలి యడ్డుగ నిల్చెను; బ్రాయికంబు, దు
స్తర మగుఁ బో తనూవిరహతాపముకంటె సమస్తదేహసం
జ్వరకర మైనన్నాథునెడఁబా టొదవించెడితావ మెంతయున్. 138

1. క్రూరబాణములు. 2. విశాలము లగుపొదరిండ్లు. 3. పూర్వ మాదివరాహము భూమిని ధరించగా, నిపుడు భూమియే వరాహమును ధరించె నని విపర్యయము. 4. పంది.

తే. గీ. సప్తఋషిమండలముఁ జేరి క్రాంతి లేని
యాశ్రమైణతఁ గనుకోర్కి నన మృగములు
నింగి కెగయుచు నుండ, క్షోణీధవుండు
విల్లు వలయాకృతిగ లాగి పేర్చి నిలువ. 139

శా. ఆతం డూన్చుపృషత్క[1]ధోరణుల నవ్యాబ్దాంబుధారాక్రమ
స్ఫూర్తిన్ గూర్చి నిసర్గనీరనిరతిన్ బర్హిప్రపంచంబు ని
ర్భీతిన్ నిల్పి శరాళి మైఁ దవులఁ బాఱెన్; తేఁడు నిఃకేకజీ
మూతర్తుప్రథ నిల్పెఁ బాంథవనితామోదప్రదాజ్ఞాప్రథన్. 140

క. శ్రీరాముఁ డల దశానన
దూరుఁడుగాఁ, గుంతలుండుఁ దూర్ణాటవిసం
చారమ్మునఁ [2]బంచానన
మారకుఁ డై కొఱఁతఁ గాంచె మారామునకున్. 141

క. దానముబ్కుల లాగియుఁ జూ
ల్గనుమృగు లటఁ జేరినను నృకాంతుఁడు దునుమన్
జనఁడు, కడు పెనసి యలనతఁ
డనరుచుతనచెలులవిలసితము స్మృతిఁ దవులన్. 142

చ. పలుకులు పెక్కు లేల! వని భంజితసింహము భిన్నరంకువున్
దళితవరాహవారమును దా నొనరించి నృపాలకుండు న
క్కొలఁకులనే నిజాంగనలకేళివిలాసము లింపు నింపఁగాఁ
జలిసమయంపుసౌఖ్యముల సమ్మద మొందుచు నందె నత్తఱిన్. 143

1. పంక్తులు. 2. సింహము.



శిశిరము

ఉ. కుంకుముపూవుపూఁత నగుకాంచెమువేఁడిమి గల్గునంగముల్
బింకపుయౌవనోష్మమున వీఁగెడుచన్నులవుల్ నెలంతలం
దంకిలి యేల! కామిజనయామికుఁ డై రహిఁ గాంచి మించుమీ
నాంకున కొప్పె శైశిరనిశావళి జీవితదాయకాయతిన్. 144

ఉ. అల్ల విశుభ్ర[1]రాంకవములందు, విలాసపటీరకాష్ఠసం
ఫుల్ల[2]కృపీటయోనిపరిపుష్ట[3]హసంతికలందు, నంతఁ గ్రొ
న్నల్లియగర్వఁ గాల్చఁగ ఘనం బగుధూమశిఖావళిన్ ద్రవ
త్రిల్లె స్మరప్రతాపము గరిష్ఠజగత్త్రయకామిజైత్ర మై. 145

ఉ. నిప్పులతిప్ప[4]హాసములు నిండిన[5]గేములలోనిపొంతలన్,
విప్పు గలట్టు[6]తూలపటవేష్టనపాళిని, నుమ్మ కిమ్మలై
యొప్పులకుప్ప లౌ ప్రియలయున్నతసత్కుచమండలంబులన్,
జొప్పఁ దొలంగి యాఱెఁ జలిఁ జొన్పుతుషారవిజృంభణోద్ధతుల్.

మ. తనుసుస్థత్వముఁ గూర్పువేఁట[7]యలవున్, దద్దన్ మరుల్ విర్వఁగాఁ
బొనరింపం దగు[8]శ్యామలున్, జెలులయింపున్ గూర్చుకౌఁగిండ్లు, రం
జన మూన్చున్ జననాథుఁడున్ 'శిశిరమే సర్వర్తుసంఘంబునన్
మునుగా సంస్తనీయ' మంచు నెఱిఁగెన్ మోదంబు సంధిల్లఁగా. 147

ఉ. గౌరివిలాసధూపముపొగల్ దగులన్ నలు పెక్కి, శర్వహా
రోరగముల్ గళక్షతిభయోన్నతి మ్రింగక యున్న వై, యతి
క్రూరహరాద్రివాయువు లకుంఠత [9]శారదగేహపున్బృహ
ద్ద్వారమునుండి మోదముగఁ బాఱుచుఁ గాంచె నృపాలుసంస్తుతిన్.

1. సేలువలు. 2. అగ్ని. 3. కుంపట్లు. 4. సెగలు. 5. ఇండ్లు. 6. రజాయి. 7. పరిశ్రమము. 8. రాత్రులు. 9. కాశ్మీరము.

చ. కొలఁది [1]'వితస్త' మంచులను గొంచుఁ, 'బయోష్ణి' గలంచి, 'చంద్రభా
గ'లహరులందుఁ దేలి, శుచిఁ గాంచి [2]'యహస్కర' జోర్మిమైత్రి, ని
స్తుల మగు [3]'సిద్ధసింధు' తటిఁ [4]దూఁచుచు వేగమ దేవదారులన్
బొలిచె హిమాద్రివాయువులు భూపతికిన్ బ్రమదప్రదంబులై. 149

శా. ఈరీతిన్ ససతీజనుం డయి యతం డిష్టక్రియాసక్తి పెం
పారన్ శైశిరకాలకేళిఁ దగుసౌఖ్యప్రాప్తి నోలాడి ప్రో
ల్సేరెన్ విభ్రమమందిరప్రమదముల్ సెందన్; క్షణం బేని లీ
లారాహిత్యము తాదృశప్రభులకున్ లక్షించునే యెందునేన్. 150

## విక్రమాంకుని రాజ్యపాలనము

చ. పురమిపయిన్ నెగుల్ దిగులుపో ల్పఁ జేసి సహర్షచిత్తుఁ డై
యొదయఁ దతండు యాచకుల కూనిచె బంగరువాన; లోకు లొం
దెడునిడుమల్ దొలంచఁగ మదిన్ బురికొల్పనివారికల్మి లె
ప్పుడు మెఱుఁగుంజిగుర్లసరిఁ బోలి తిరంబులు గాక యాఁగెడున్.

క. [5]పుడిసిలి నెసఁగినకులమునఁ
బొడమినబల్ దొరల నితఁడు ప్రోడ యగుచుఁ, దా
నడఁచెన్ బ్రజలం దొదవెడు
బెడిదపు[6]మనుజరుజ గాక [7]విధికృతరుజయున్ 152

క. మము [8]నీటన్ నించుసము
ద్రము లానృపవశ్యము లనుతలఁపున నన న
ద్దములు క్షమావరు సేవా
సమనుస్మృతిన్ సముపయుక్తజలములఁ గురియున్. 153

1. ఝీలంనది. 2. సూర్యపుత్రి (యమున). 3. గంగానది. 4. తూఁగఁ చేయుచు. 5. చుళుకమునఁ బుట్టిన 6. ఆధి భౌతికరోగము. 7. అధిదైవిక రోగము, 8. జలములో.



సీ. అదను గాకయ మిత్తి పొదవఁ బో దెటనేనిఁ,
గఱ వరయఁగ రాదుగా యెపైన,
మానుసులఁ గడు [1]విన్మానికం బలయింపఁ,
దలఁతనే తొలఁచ గా ద్పలరి వీచుఁ,
బండ్లు చెట్లను గడుబరువున భంజించి
భయమునవలెఁ గాంచుఁ [2]బాండురతను,
మావులఁ గాపులు మాని తల్పులు మూఁతఁ
గదియింపకయ జనుల్ గంద్రు కూర్కు,

గీ. జాలమార్గంబులను జొచ్చు శశికరములె
కాని, కన్నములందుఁ దస్కరులు సొరరు,
దొనఁగు లరయఁగఁ బో కిట్లు దొర స్వకీయ
రాజ్య మొనరించె నిక్ష్వాకురాజ్యమనరి. 154

చ. కకుబిభకంఠగర్జితము గాంచఁగ రానటు తూర్య-దుందభి
ప్రకరవిరావముల్ దెసలఁ బర్వెను; నిచ్చలు వీటవీట నాఁ
గక బలు[3]పండువుల్ దనరఁగా [4]సురమార్గము మించెఁ దర్ధ్వజాం
శుకపిహితాహిమాంశు వయి క్షోణివరేణ్యునిపాలనంబునన్. 155

క. పోరు విడి యెలమిఁ గాంచక,
మీఱుమగతనంబు గలుగుమేటిదొర పొక
ర్మీఱుదొరల వంచినతన
సారభుజాయుగళి కితరశరణముఁ దొలఁచెన్. 156

1. నభోమణి (సూర్యుఁడు). 2. తెలుపు మించినపచ్చఁదనము = వెలవెలఁబాఱుట. అని శ్లేష. 3. ఉత్సవములు. 4. ఆకాశము.

క. తనయాకృతికిన్ సరి యగు
తనయాఽవళిఁ గులయశోనిధానులఁ గనియెన్;
దనయభిమతతరువు తనం
తన యగు ఫలవంత మనసమధర్మాఽత్ములకున్. 157

క. హేమోన్నతవాతాయన
భూమిస్థితిఁ గూర్తు రెలమి భూపతిపుత్రుల్;
దా మెక్కువ్యోమయానం
బౌమతి నెల వైన[1]ఖేచరార్భకులవలెన్. 158

ఉ. ప్రాణసమాన మేను వసుధాఽధిపవరేణ్యుల; కీతఁ డెంచు ఘూ
సాణువుగా నటంచుఁ దనయంగద నర్థులకున్ వచించువి
న్నాణము దోఁప వారిశ్రవణంబులయందు నివాస మూనఁ [2]గ
ల్యాణము నై జగౌరవము హానిఁ గనన్ నృపుత్యాగపద్ధతిన్. 159

తే. గీ. క్ష్మావరస్వర్ణచారుభూషాప్రభాఽఽళి
బెరసి పింగళకాంతిచే వెలుఁగునర్థి
కులము [3]వేలుచు నున్నట్లు తలఁచి వదలె
నర్థిదుర్గతి, [4]ప్లోషభయాన ననఁగ. 160

చ. 'తలఁ గలవేల్పువానము లథఃస్థలిఁ గూలెదుభీతిఁ, ద్రుంపఁగాఁ
దలకొనఁ' డంచుఁ ద్యాగి యగుతత్పతినుండి భయంబు వీడియున్;
"దొలఁగుము తేఁడు వచ్చె నిదె! త్రుంగుదు" వంచు వచించునట్లు ద
వ్వులఁ జనునర్థికోటికి నృపుం డిడుపైఁడిఁ గలంగె మేరువున్. 161

1. విద్యాధరబాలకులు. 2. బంగారము. 3. కాలు చున్నట్లు. 4. కాలుట.



## దేవాలయము

క. నరవరుఁ డూన్చిన[1]కమలా
వరునినితాంతోన్నతోదవసితం బొప్పెన్,
గరముఁ బ్రబలుకలిఁ దొలఁచఁగ
ధరణీజతరంబు వెడలుధర్మకర మనన్. 162

క. తారామార్గ మొరయుతద
గారముఁ దొలఁగి చనురవికిఁ గలిగెను శ్రీదై
త్యారిన్ దూఁకమి, సప్తులు
గూరమి బన్నంబు సిద్ధగుణయుగళముగన్. 163

చ. [2]దనుజనితొ మ్మగల్పు [3]హరితన్ గనె నీతఁ డటంచుఁ దద్రమే
శునిఁ గని భీతిఁ బోలెఁ బొదనూప దటన్ గలికాలదంతి; [4]త
ద్ఘనతరనాభిపంకజముఁ గాంచదు తుమ్మెదరి మ్మహర్నిశం
బనఘవినీలధూపపటలాఽకృతి [5]నవ్వి వినిర్గమించుటన్. 164

శా. ఆదేశాలయశృంగభాగముల సొంపారున్ స్ఫురన్మౌక్తిక
ప్రాదుర్భూతరుచాఽఽవళిన్ గనకకుంభంబుల్ నభస్సంబు లై
యాదిత్యాశ్వచయంబు [6]దూపఁ గొని తోయభ్రాంతిమై [7]వానిపై
నూఁదన్ మోముల, [8]వానిఫేనముల సంయుక్తంబు లై మించె నాన్.

చ. అచటిపురంధ్రినృత్యములయందు మణీమయ[9]సాలభంజికల్
ప్రచురతరాఽఽత్మకాంతిపరిపాటి [10]వమించుచు మోదబాష్పతా
రచనము లుల్లసిల్లు[11]నభిరామదృశాస్ఫురణంబు లూనె నా
రుచిరము లై సజీవములరూఢి సదా సిరు లీనుచుండెడిన్. 166

1. విష్ణుదేవాలయము. 2. హిరణ్యకశిపుఁడు. 3. సింహత్వము. 4. ఆ విష్ణువు యొక్క. 5. ఆతుమ్మెదలు. 6. దప్పి. 7. ఆ కనకకుంభములపై. 8. ఆయశ్వముఖములయొక్క. 9. బొమ్మలు. 10. క్రక్కుచు (ప్రసరింపఁ జేయుచు). 11. అందము లైనచూపులు.

తే. గీ. అచటిమేల్పాంగణముల నాట్యంపుఁజెలులు
ప్రతిఫలనమిష [1]నుల్లోచరత్నములను
నంబరచరాంగనాస్థాన మందుకతన
నంబరాటనోద్యతలు నా నలరు చంద్రు 167

## తటాకము

ఉ. కారణమానుషం డగునృకాంతుఁడు రుద్ధదిశాముఖంబు గా
సార మొనర్చె దేవళముసమ్ముఖభాగమునందు; నల్గడం
జేరి యతుల్య మై చెలఁగి, శ్రీరహి మించుసరస్సు కెట్టు లు
త్సారితలక్ష్మి యైనపయసాంనిధి యీ దగు నీయిలాతలిన్? 168

తే. గీ. అచ్యుతాంఘ్రిసరోజపరిచ్యుతిఁ గని
[2]సురనికేతనగర్భంబుఁ జొచ్చి వెడలి
వచ్చుసురనిమ్నగా[3]శేషవారి నొప్పు
ననఁగ న త్తటాకము వొల్చు నచ్ఛవారి. 169

తే. గీ. దాత యగునీనృపాలుని దరిసెనేని
నెప్పుడేన్ దానలోభాన [4]నిల్వలారి,
యతనిదర్పంబు భంజింతు ననినయటులఁ
జెరు వుటము, దరిఁ బగిలెడుతరఁగలరుతి. 170

తే. గీ. క్షారవారాశిసంగమకాంక్ష మించఁ,
గానినియమంబు నీ కేల గంగ! పూన?
ననినటుల్ హర్షగాద్గద్యమునఁ దటాక
మూర్మికరముల దాని మిన్నొడిసి లాగు. 171

1, మేలుకట్టు(చాందినీ). 2. దేవాలయము. 3. మిగులుజలము. 4. అగస్త్యుఁడు.



చ. మును జనకాఽత్మజావరుఁడు పూన్చినసేతుబంధనంబునన్
వనినిధి గాంచె భంగ; 'మల వార్ధికిఁ దా నుదయించుటన్ వచిం
చినఁ గడుఁ జుల్కనౌ' ననుచు [1]జిష్ణునిదంతి యనిందితాఽత్మ యై
తనరెడునీతటాకమునఁ దా నుదయించుటఁ దెల్పు [2]నింతికిన్. 172

క. జలదము శీకాసారాం
బులఁ గ్రోలుచు శుక్తులందు ముక్తాశ్రీలన్
గొలుపఁగఁ బురాణముక్తల
కలరవు లలనాకుచస్థలాఽరోహణముల్. 173

ఉ. ఎన్నిక మీఱునేఱు లెనయించినమోములు గ్రోలి నిల్చుచున్
బన్నముఁ గూరు[3]భంగయుతవారిధినుండి తొలంగె నాఁగ న
త్యున్నతి నందకొండల సముద్భవ మందునదుల్ నిదాఘ మే
గ న్నగరీతటాకపరికల్పితయౌవన మాక్రమించెడున్. 174.

## పురవర్ణనము

క. సుర-వాణీవరలో[4]కో
త్తరభాగము లంది యెలమిఁ దాఁ గూర్చె ననాఁ
బురమున్ [5]బ్రహ్మపురాఽవృత
మురుసక్తిన్ నిల్చె నాతఁ డొగి నచ్చోటన్. 175

చ. మొదటిగవాక్షమున్ వదలి ముద్దియమోము ద్వితీయ మంటి పెం
పొదవుట రేలఁ బ్రోలున సమున్నతసౌధవిటంకలంఘనం
బొదవుటయందు శంక విడి యుద్ధవిధిన్ నడుమన్ బ్రవేశ మై
[6]చదురున దాఁటి పోవు ననఁ జంద్రునిఁగూర్చి తలంప నయ్యెడిన్.

1. ఐరావతము. 2. తనభార్య యగునభ్రమువునకు. 3. భంగపాటు - అలలు (శ్లేష). 4. ఉత్తమ. 5. బ్రాహ్మణాగ్రహారములచేఁ జుట్టఁ బడినది. 6. చాతుర్యము.

మ. అట సోపానములన్ నితంబినులు దా మారోహణం బూనుచోఁ
గటిభారంబునఁ దూఁగఁ బోదు రని నిక్కన్ భీతి భిత్త్యోఘముల్
దిట వూన్పంగఁ దలంచె నాఁగఁ గృపఁ జెందించున్ నిజా[1]ష్టాపదో
త్కటరుగ్దండములన్ దదీయకరసంతానంబులం దూఁతగన్. 177

తే. గీ. అచటియగ్రగవాక్షతుంగాఽలయముల
తుంగిమంబు గడించెఁ బెన్దూషణంబు
నచటిచిత్రస్థితద్విరదాళిఁ గిన్క
శక్రదంతి, ప్రధావనశంకితము, గ. 178

ఉ. ఆపురిపైఁ దిరం బగునిరంతరతుంగసమంచితావనీ
స్థాపితకుట్టిమస్థలుల [2]సారసబాంధవసైంధవాళి తా
రావథమందు నూఁత గన రానిగతిన్, దముఁ బొందుశ్రాంతులన్
బాపికొనున్ స్వకీయపదపాళిఁ గదింపుచు నింతనంతటన్. 179

మ. ప్రతిబింబాధ్వములన్ ద్రియామముల నాప్రాలేయభానుండు భూ
పతిప్రోల్వెంది యటన్ బురంధ్రిజనతాప్రాంచత్పురోలాయిత
శ్రుతిభూషాఽఽదృతరత్నకుండలరుచాక్షద్ధాఽత్మ్కఁ డై యంతఁ ద
త్సితనాళీకదృశాకపోలసుషమాక్షీరంబులన్ మున్గెడున్. 180

క. హరి [3]గురువు తల్లి యిందిర
యిరువుర కిది యిర వటంచు నెఱుఁగుటనువలెన్
మరున కనేకాన్యాయ్యాఽ
కరునకు నెపుడేని వద్దు కలుగదు నగరిన్. 181

1. బంగారము. 2. సూర్యాశ్వములు. 3. తండ్రి.



వదాన్యత

మ. ప్రతిపర్వంబున నాప్రతానిధి భూపాలాంబుజాతారి యు
న్నతచిత్తంబున నల్ప షోడశమహాదానంబులన్ దానని
స్సృతవాఃపంకిలతత్పురీనికటధాత్రిన్ గూలుభీతిన్ బలా
యితుఁ డౌఁ దత్పురిఁ బాయుచున్ గలి స్వకీయేచ్ఛావిహారాఽదృతిన్.

క. తుంగస్వర్ణోత్కరములఁ
[1]దుంగసరిగఁ జూచుదానధుర్యుఁ డయినరా
ట్పుంగవుపటీరపాండుయ
శోంగము లోభమున కంత నాస్పద మయ్యెన్. 183

చ. తలఁగక స్వర్ణదానములఁ దత్పరుఁ డౌనరపాలునుండి భీ
తిలి తపనీయభూధరము [2]తెల్పును దాల్పఁ దలంచె నాఁగ [3]ను
త్పలములనేస్తిమండలముఁ [4]బారదపిండ మటంచుఁ దాఁకు ని
చ్చలు దనతుంగశృంగములఁ జాఁచి సితత్వపరీప్సచేవలెన్. 184

క. కనకతులాఽఽరోహణమును
జనపతి ద్విజకల్పశాఖి శత్రుంజయుఁ డై
పొనరుప; [5]నగస్తి రాఁగలఁ
దని యున్నమనంబు వింధ్య మభిలాషించెన్. 185

క. కడుఁ గడుఁ బసిండి సీతం
దిడఁగ నడలి పైఁడికొండ [7]ఋక్షాధ్వశ్రీ
దొడరినటులఁ దనపసిఁడినిఁ
గడునల్పున్ దాల్చినట్లుగాఁ గనఁ జేసెన్. 186

1. తుంగగడ్డి. 2. శ్వేతత్వము. 3. చంద్రమండలము. 4. పాదరసము.
5. అగస్త్యముని. 6. పైకిలేచుట. 7. ఆకాశకాంతి.

తే. గీ. దానలీలారతుండు ప్రతాపశాలి
ధారణీనాన్వయముల రిక్తములఁ జేసి,
యర్థిజనగేహముల నింపె హాటకముల
దిఙ్ముఖంబుల సద్యశస్స్ఫీతుల నినిచె. 187

తే. గీ. చక్రవర్తిశిరస్స్థితి సౌరు గాంచి
విశ్వచక్రర్ధినియమప్రవీణుఁ డగును
దారశీలుఁడు ప్రతికూలతను గడించె
నిలను లేమినిఁ గల్పించునలువవలన. 188

యుద్ధము

ఆ. వె. అరుల కలవుచేఁ [1]గదర్థితుండు చిరంబు
బాహు[2]ఖర్జు వెడుగుపార్థివుండు
చోళగర్వ మెఱిఁగి [3]వాలగుననిఁ గోర్కి
పురికొనంగఁ 'గాంచి' పురము దరిసె. 189

చ. సిరి కుదయింపగా నయిన[4]సింధుజలోన్మథనంబు, పోరులన్
బురికొనఁ జేసి సంతసముఁ బూ[5]న్మని కీక్షణపారణంబు, ని
ర్జర[6]ధనమానినీజనముచాయఁ గ్రయాణపణ, మిట్లు మించుసం
గరముఁ గ్రమంబునన్ సలుపఁగా సమకట్టిరి చోళ-కుంతలుల్. 190

తే. గీ. ఉచ్ఛలద్వీరరసజృంభితోర్మినిర్మ
లములు సుభటాసియష్టు లుల్లసిలెఁ గోశ
బిలవినిర్గతిఁ గని [7]నాకుబిలము వెడలు
కాలపాశా[8]నిలాశనకాండము లన. 191

1. విసుగు చెందినవాఁడు. 2. దురద. 3. గొప్పయుద్ధమునందు. 4. సముద్రము.
5. నారదుఁడు. 6. వేశ్యలు. 7. వల్మీకము. 8. సర్పసమూహములు.



ఆ. వె. జయరమాప్రభూతసౌభాగ్యవశమున
బలయుగంబుభటులు చలము మీఱఁ
బరుఁగు లిడుచు నొగులువడిరి వడిన్ మున్ను
సాగి పోవుబాణచయముచేత. 192

తే. గీ. తనయురమ్మున నిఱికినదంతిరదముఁ
గత్తిచేఁ ద్రుంచి దవ్వుగాఁ గరినిఁ బఱపె;
బిలమునన్ బ్రాణముల్ బయల్ వెడలకుండఁ
[1]గీలకంబుఁ బ్రతిక్రియాకృతిగఁ ద్రోయ. 193

తే. గీ. అర్ధచంద్రశరంబున నర్ధకృత్త
మూర్ధ మసియాడుచున్ భటుమూపునందుఁ
జేర డాకేల నది వట్టి పాఱువీరుఁ
డెల్లజనులపొగడ్తకు నిక్క యయ్యె. 194

తే. గీ. కంకటయుతుం డొకండు వక్షమున విలుగు
శరము లెగయించువహ్నిచే నెఱుఁగఁ బోఁడు
[2]పరుఁడు మోమునఁ దూర్చుకృపాణధారఁ,
బాగ యనెడుభ్రాంతి నది మఱిఁ బొదివికొనఁగ. 195

తే. గీ. అరికరిరదాంకుర[3]ప్రోత మైనమోము
పులకనికరాంచితం బయి పొలుపు మిగులఁ,
గనఁగ నయ్యె సలీల నొక్కఁడు మృణాల
దండమునఁ గీర్తిసుధ నాను చందునటుల. 196

1. మురిక. 2. శత్రువు. 3. గ్రుచ్చుకొనఁ బడిన.

తే. గీ. మఱిమఱి నరాతిశరముల [1]నిఱుకులెల్ల
నఱుకు లైననిజాస్థిపంజరముఁ దాల్చె
వెరవుగా సూర్యమండలోదరమునందు
సుఖముగాఁ దూఱుటకుఁ బోలె సుభటుఁ డొకఁడు. 197

తే. గీ. ఎడనెడన్ రక్తపంకమం దడరునుష్ణ
కరునిప్రతిబింబమాలిక కరముఁ దాల్చె
రక్త మానెడుకోర్కెఁ జేరంగ వచ్చు
[2]యామినీచారిణీపారికాళిపోల్కి. 198

తే. గీ. తనుఁ బొదివినట్టి ముల్కులఘనభరమున
నెదిరి నదటున నేయంగఁ [3]జదురుఁ గనని
తనభుజంబును గాంచెఁ బెన్గినుకతోడ
మిగుల [4]వైలక్ష్యవంతుఁ డౌమగఁ డొకండు. 199

తే. గీ. తనదుకర-కర్ణఖండనమున వమాన
మునకుఁ దగువిధి భటునిచేఁ బొంది, లజ్జ
మిగులఁ దాల్చినయటు నగ్గినిగఁ జెలంగు
క్షతజనది మున్గె నొకమహాసామజంబు. 200

తే. గీ. రెండురదములు చీలఁగా రెండుగాఁగ
దంతములు నాల్గు దాల్చువిధంబు దోఁప
దంతి యొక్కటి వేల్పు[6]చౌదంతిపోలుపు
వడసె [7]భటపేటకము దేవభావ మొంద. 201

1. మర్మములు. 2. రాక్షసస్త్రీలగిన్నెలవరుసలు. 3. నేర్పు. 4. విస్మయము. 5. పౌరుషవంతుఁడు. 6. ఐరావతము (నాలుగు దంతములు గలది). 7. భట సమూహము.



ఉ. [1]వాలగుసామురేవెలుఁగువాలులఁ [2]దున్మయి దవ్వ దూఁకి దోః
పాళికి, నాపయిన్ బృథివి వ్రాలెడుదంతిరదాంకురావళుల్
వేలుపుఁబూలసోన యని వింతఁగఁ జూచుభటాళియందుఁ ద్రో
ల్మాలిక దోఁప వారితలలన్ గుఱిఁ దప్పక కొట్టు బిట్టుగన్. 202

తే. గీ. నవశిరీషసుమమృదుబాహువుల నిప్పు
డుంచకుము సంవరణమాల నుంచుచోట
నలరులకు విల్వ యెచ్చునీయదనునందు
ద్యుస్రజములు ఉద్ధత మేన ! యూన్చునీవు. 203

తే. గీ. వరులకఱ వేమి యిట లేదు పరవధూటి
కొనినవరు వరవర్ణిని ! కోరు దేల ?
వరపరీక్షావిషయమున వనిత నీదు
[3]చదురు కొఱఁతగఁ గంద్రు నిర్జరసుదతులు. 204

తే. గీ. మూర్ఛమైఁ గన్నులను మూయ ముదగ వీరి
వ్యోమయానంబునందు నీ వుంచికొంటి;
తేఱి [4]కృతఫాలముగ యుద్ధదేశమందు
నుత్సుకత మీఱ మఱి పడు చంద్రు కనుమ ! 205

ఉ. మేర దొరంగునీభటుఁడు మేకొనెఁ జేష్టితముల్; విమానపున్
స్తోరణగండ్లనుండి పెఱసుందరి తన్ గనినంతమాత్రనే
యారమణీలలామమునకై త్వర సేసెడు చూడు వీఁడు తా
నోరమణీ ! నినున్ మొదల నొందినవిందయి యుండియున్ సుమా !

1. వాఁడి యగునర్ధచంద్రబాణములు. 2. ముక్కలై. 3. చాతుర్యము. 4. నొసలు చిట్లింపుగా.

తే. గీ. తొలుత నితనికి మాల యేవెలఁది యిడెనొ
తెలియ దిరువురు మీరు వాదించు చుండ,
నితఁడు సౌభాగ్యనిధి రణవ్రతపరుండు
స్వయము వరియించుఁ గాక నిశ్చయవిధంబు. 207

చ. సొబఁగుమదంబునన్ మరులు సొన్పి మెలుంగున నున్నదీనిచేఁ
బ్రబలపుమోస మొంది వలరాజువెతన్ గనుఁ గాననట్టివీఁ
డబల! త్వరన్ బరాన్ముఖత నందుపిశాచి భ్రమించి చేరి వే
[1]దబమువిధం బెఱింగి వడి డాయక పాయు [2]వెడంగుకై వడిన్. 208

తే. గీ. పరుల కుపకార మొనరించునరణులందు
నారదునకన్న లేఁడు విశారదుండు
త్రుటిని ఘనకదనంబులఁ దొడరఁ జేసి
కాముకాభావతను మాన్పుఁ గనఁగ మనకు. 209

చ. కదఁగి సహర్షలై భటులకంఠములన్ గ్రహియించి కౌతుకం
బడఁగఁ గడుంగడున్ [3]బరుగు నందుసురక్రయనాయికాఽఽవళుల్
వెడవిలుకాని మేల్కొలిపి పేర్చుకథాకలనంబు, డంబుగా
నడరెను గర్ణవీథి నమృతామలపేశల మౌచు నయ్యెడన్. 210

తే. గీ. ఇంతలోఁ గుంతలుండు [4]జేదంతి నెక్కి
జ్యానినదనిష్ఠురముగ శిఞ్జాశరవ్య
నరణిఁ బరబలభటసముత్కరముఖముల
విశిఖపంక్తుల నినిచె దోర్విక్రమమున. 211

1. వంచన. 2. అవివేకి. 3. పరుగెత్తుదేవవేశ్యలు. 4. జయగజము.



ఉ. ఏనుఁగు నెక్కినక్కరుల నేనుఁగులంద, తురంగవాహనా
నూనభటాఽఽళి నశ్వముల నుండియట్టులనే, పదాతిసం
తానములన్ ధరాస్థలిన, నామసమంకిత[1]పత్రసంతతిన్
స్థానమునంద కీలిత మొనర్చెఁ జళుక్యుఁడు, చోళసైన్యమున్. 212

ఉ. వేలు వరింప నేల పృథివీపతి యెచ్చట మచ్చరించినన్
[2]దీఱుఁ దెలంగుగా వసుమతీతిలకంబులకున్ ద్వయంబె, 'పెన్
[3]గాఱియఁ [4]గారఁ గాంచుట వికావికలై దవువాఱుటల్', ద్వరన్
బాతె ననిన్ ద్యజించి గరువం బఱి చోళుఁడు ప్రాణభీతిమై. 213

ఉ. ఆపయి [5]నజ్యచాపుఁ డయి యప్పతి చోళరమన్ గ్రహించి, కాం
చీపురమందు సత్కవులశిష్టవినోదములందుఁ దేలి తా,
[6]రా పగుదంతివాహినిభరంబు దిగంతర మావరింపఁగా
[7]మో పగునెమ్మెమైఁ దనదుప్రోలినిఁ జేరె సముత్సహించుచున్. 214

నర్కుటము

గిరి-బిలవాస! శ్రీహరి! నృకేసరి! సర్వజగ
ద్భరణ-జను-ర్లయా! యమరవారకృతావన! సా
గరతనయాఽఽలయా! యసురగర్వవిభంజన! శ్రీ
కరవృషశైలవాస! నృమృగప్రభు! విశ్వవిభూ! 215

1. బాణసమూహము. 2. అవకాశపడును. 3. వేదనచేత. 4. బెఱసాల.
5. అల్లెత్రాడు దించినధనుస్సు గలవాఁడై. 6 సాంద్రమైన. 7. అధికమైన.

ఇది శ్రీత్రిభువనమల్లదేవవిద్యాపతి-కాశ్మీరక
భట్టశ్రీబిల్హణ మహాకవివిరచితవిక్రమాంకదేవచరిత
మహాకావ్యంబునకు శ్రీవేంకటేశ్వర
శ్రీనరసింహదేవపాదపద్మారాధన
నమాసాదితగీర్వాణాంధ్రకవితావైశారద్య
'ఆంధ్రబిల్హణ'బిరుదాంచిత
లక్ష్మణ-విశ్వనాథ
కవిసోదరాంధ్రీకృత
మహాప్రబంధంబునందుఁ
షష్ఠాశ్వాసము
సమాప్తము

—o—

# విక్రమాంకదేవచరితము

## సప్తమాశ్వాసము

క. శ్రీశైలశిఖరభూషా!
దాశార్హా! కనకకశిపుదారణ! భక్తా
భ్యాశనిహితహృదయాబ్జా!
శ్రీశ! శ్రుతిజ్ఞేయ! వేంకటేశ! నృసింహా! 1

### కాశ్మీరము

ఉ. గౌరి వరించుశర్వునకుఁ గైకొని సాక్షిత స్వైరధావన
స్ఫారకలీల మాఁపుచు, నిసర్గముగాఁ గుటిలంబు లౌ[1]విత
స్తారభసోర్మి లంకుశతఁ దాల్పఁగ హస్తిపకత్వరూఢిఁ, గా
శ్మీరములన్ బురీవరము చెన్నుగనున్ [2]'ప్రవ'రాహ్వయంబునన్.

ఉ. ఆపురి[3]యాటతోఁటల సమస్తజగన్నుతమాధురీసము
ద్దీపిత[4]గోస్తనీరసముఁ దిగ్మకరుండు కరాళిఁ గ్రోలి సం
తాపము శాంతిఁ గాంచె ననఁ దార్చుమణీకిరణాంకురప్రతా
నోపమకోమలాంశువుల నుగ్రనిదాఘదినంబులందునేన్. 3

మ. హరశైలంబును [5]దోస్తులన్ నిలిపి నవ్వన్ వెన్నెలన్ దిక్తటా
వరణవ్యాప్త మొనర్చురావణుఁడు శాపత్రస్తుఁ డై సత్వర
స్ఫురణన్ పుష్పకయుక్తి దవ్వ ననుఁ దత్పుర్య[7]గ్రవర్ణప్రతా
పరమాకర్ణనుఁ డై తదీయగృహముల్ వర్జించుచున్ బైపయిన్. 4.

---

1. ఝీలంనది. 2. ఇప్పటి శ్రీనగర్. 3. ఉద్యానవనములు. 4. ద్రాక్ష. 5. బాహువులనెడు త్రాసు. 7. బ్రాహ్మణులు.

ఉ. ఆపురమందు నిచ్చ భువనాంతరవీథిదుర్లభపండితుల్ వియ
ద్వ్యాపిమణీమయాలయ[1]సదాగతివర్త్మల వ్యాఖ్య లూనుచో
రా పగుగగ్గురుల్ వొడమ రాల్పరె ! [2]పూజడి దేవతల్, త్రపా
స్థాపన దానిచే గురువు దాల్పు న టన్పెదు రొంద కున్నెడన్. 5

ఉ. ఆపురి స్ఫాటికాచ్ఛ[3]యశయావళి శాశన మొందురీతి [4]గౌ
రీపితృపర్వతంబు తనశృంగము లూర్ధ్వముగా నిగుడ్చు; [5]స్వ
ర్ద్వీపినిపోటిఁ గ[6]న్మధుమతీ[7]నదిసైకతహంసి యై [6]కలా
గోపనభార మూనుఁ బలుకుంజెలి యన్నగరిన్ స్వయంబుగన్. 6

శా. సారానేకవిచిత్రసద్గుణకథాసంకీర్ణకర్ణామృతో
దారం బై కుతుకాంకరంబయినత[7]త్సారస్వతక్షోణిఁ గై
వారం బేల యటన్ వధూజనజనుర్భాషాంశయతిన్ బొల్చి పెం
పారున్ బ్రాకృతసంస్కృతోక్తి ప్రతిగేహంబందు స్తుత్యంబుగన్. 7

చ. తలఁతుఁ బురిన్ గవీశ్వరవితానవచస్సులు మంథభూమిభృ
త్ప్రలుఠితదుగ్ధవారిధిసుధాఝురిగాఁ దగి శీకరంబులన్
బొలఁతులయందుఁ బ్రేముడులఁ బూరితి సేసి [8]సుధామయూఖని
ర్మలరుచు లై నయిక్షువుల ద్రాక్షల నిల్కడఁ గాంచి మించెడున్. 8

చ. కలియుగదుష్టదృష్టి సోరఁ గానని[9]బ్రహ్మనిధాన మౌట, వి
ద్యలవిభవంబుఁ బ్రత్యయనిధానపురంబున నిచ్చ నిల్పి ప
ల్కులచెలి చింత మాని జనులున్ జన రానిత్రినేత్రపర్వత
స్థలిఁ దపముల్ వొనర్పుటకుఁ [10]దారు ధ్రువంబుగ నెల్లవేళలన్. 9

1. వాతాయనముల౦. 2. పుష్పవర్షము. 3. యశఃపంక్తి. 4. హిమాలయము. 5. గంగానదితోస్పర్ధ. 6. కళలను పోషించుభారము. 7. సాహితీ-సరస్వతికి నెలవు. (కాశ్మీరము). 8. చంద్రుఁడు. 9. బ్రాహ్మణులనివాసము (అగ్రహారము). 10. పోవును.



చ. ఇరుదరులన్ జెలంగుగృహబృందములందలిసోరణంబులన్
[1]దర మిడి యాడునాల్మగలతాఁకులఁ ద్రెళ్లినదండలూని [2]శం
కరభవ యొకులాంశవఁగ [3]దనర్చుఁ బుణ్యాంకమునందుఁ దారకా
పరికలితాభ్రసంగి యగుస్వర్ధునికిన్ సరి యైనపెంపునన్. 10

ఉ. స్నానవినోదసక్తలలనాస్తనలిప్తమనోజ్ఞ[4]ధీరమున్
దాను దొలంచి యంకమునఁ దాల్చుచుఁ గాంతుని సీర్ష్యఁ గిన్కనాఁ
జానలషట్పదాసితకచప్రచయంబుల నూర్మిహస్తసం
తానములన్ వితస్త సతతంబు నిగుడ్చుచు లాగు నప్పురిన్. 11

శా. శ్రీభట్టారకమందిరోపనగరీసీమంతినీవిభ్రమ
శ్రీభాస్వన్నయనాంతకాంతి [5]తెగువన్ జె న్నొంద్రుతిందీవర
శ్రీభంగీ[6]నికృతిం బొనర్చుచును భంజింపం బడుం దన్మధు
శ్రీభాగ్యంభరజృంభితారఘటికోత్సేకంబునన్ దత్పురిన్. 12

చ. చెదరక వాలుభ్రూలతలచె న్నగునున్నని మొగ్గలన్ వలెన్
జదు రగుకామినీదృశలు సహ్యము లౌ నెటు ? లాత్మకాంతిసం
పద హరిణీదృశాంశకులతఁ బాటిలఁ జేయుతదంకసుస్థితిన్
మదనుఁడె చాపలంబుఁ బలుమాఱు భజింపుచు నుండ నయ్యెడన్.

ఉ. ఆనగరిన్ భ్రమన్మధుకరాసితకేశిమహీరుహోల్లస
త్కాననదంతురత్వమును గాంచి వచింపఁగ నేల ! శూలికో
పానలవిస్ఫులింగకినలాంశవశిసు[7]ప్తలతాంతసాయకో
త్థానము సల్పు నందుఁ బ్రమదాజన మాత్మకటాక్షవీక్షణన్. 14

1. మానము విడిచి. 2. వితస్తానది. 3. ఒప్పును. 4. కుంకుమపువ్వు. 5. సాహసముచేత. 6. త్రోపుడుఁ (మఱుఁగుపఱుచుట). 7. మన్మథుఁడు.

చ. తనయొడినుండి రావణుఁడు దర్ప మెలర్పఁ బెకల్చి పాఱఁ జి
మ్మినతెలిఱాలు గాంచఁగఁ [1]గ్రమించుమదిన్ గల దయ్యు స్ఫాటికా
వనిధర మప్పురిన్ గలుగుస్ఫాటికమందిరదత్వరాఽళి సూ
డెనయదు పార్వతీశవృషభేశ ఖురాంకము లందుఁ గానమిన్. 15

ఉ. 'అనయము రాజరాజపురి యక్షగతం బగు; నిష్కళంకగాఁ
దనరద లంక; మేరువసుధాధర మెక్కినవేల్పుప్రోలునన్
దనరు సలోప మై;' యని నితాంతము గర్వముతోడఁ [2]బోటి దాఁ
గననియటుల్ [3]స్మరాద్రిమిషగాఁ దల నెత్తుగ వీడు దాల్చెడిన్. 16

ఉ. మీఱు నిసర్గసౌభగము మేకొని కావ్యము కుంకుమంబు [4]భా
యోరుగుణంబునన్ జగతి నుండి ప్రియం బయి దుర్లభంబు నై
మీఱుచు లోకసార మయి మించెడుప్రోలున నొప్పు చుండుఁ గా
శ్మీరము [5]లాదిశేషుఁడు విశిష్టతఁ బ్రోచుట కాస్పదంబు లై. 17

ఉ. హేలమెయిన్ రసం బొలుకునిం పగుకన్యామలన్ రచించుదృ
గ్జాలము లంగజాంగనకు సాధనకై శతకల్పకాలముల్
చాలవు; కాంతులన్ మరులు సల్పి రణద్రశనాప్రసాధనన్
గ్రాలి చరింత్రు త్రోవల నఖర్వముదంబున [6]శ్యామ లప్పురిన్. 18

చ. సుకృతయుతిన్ సురోపవనశోభల మించిన వయ్యు నద్భుత
ప్రకటన విస్మృతిన్ గొలుప రానివి యై తగుఁగా వనాంతము
[7]ల్పకలతఁ జందనాఽర్ద్ర[8]మురళప్రియయౌవతగండపాండుతా
వికసితగోస్తనీస్తబకవేల్లిత[9]వీరుదగారముల్ పురిన్. 19

1. పోవుటకునిచ్చు. 2. స్పర్థ. 3. ప్రద్యుమ్నపర్వతము. 4. కాంతి (ఉజ్జ్వల పదబంధ) గుణము గలకావ్యము - (మంచివర్ణము) గుణము గల కుంకుమపువ్వు అని శ్లేష. 5. 'జగత్తుసారమంతయు నిట నుండుటచే నాదిశేషుఁడు దీనినే రక్షణమునకుఁ గేంద్రముఁ జేసికొనెను'. అని భావము. 6. యౌవనమధ్యమున నున్నస్త్రీలు. 7. కళలతోఁ గూడిన దగుటచేత. 8. కాశ్మీరములో నొక భాగముపేరు. 9. లతాగృహములు.



చ. తమలహరీభుజాలతలఁ దామ పెనంగుచు బంధబంధుర
క్రమత క్షతాఘభవ్య[1]జలగాయుగసంగమయుక్తిఁ బ్రోలుచె
ల్వమరు, నఘఘ్నముల్ [2]'హలధ'రాఽఖ్యుఁ డొనర్చినయగ్రహారముల్
సమధికశైలదుర్గములసావి నొడిన్ దగ ధర్మరక్షకై. 20

చ. మదనకథాప్రభిన్నయువమండలి మెం డగుప్రేమజాలమం
దదటునఁ గూల్చుకోఁ జననియంగన, యంగజకార్ముకక్రియాఽఽ
స్పద యగునంగనన్ గననివాపియు, సౌ రగుకేళివాపియుం
బొదవనికేళికావనము నొక్కెడనేనియు నొప్ప దప్పురిన్. 21

ఉ. అపురిభూషలందుఁ దను వందినయాజగదేకబాంధవ
వ్యాపి[3]కలామఠానుపమ[4]వైభవ మంచితకీర్తిఁ గాంచుఁ; బూఁ
దూపులజోదుపై నలుకతో వెనుకం జనుత్ర్యక్షునేని ని
ల్పోపక నారు లూనునినదోజ్జ్వలమేఖల లడ్డు సేసెదున్. 22

మ. [5]కృతచర్యాగురుతాఽర్ద్రీభూత మయి యుద్రిక్తాద్భుతశ్రీపటి
ష్ఠత [6]వైతస్తకృపీటసంగమము నిచ్చల్ నైజకల్లోలసం
తతి దేహిప్రకరంబుఁ దేల్చి యమృతాంధఃస్త్రీచ్ఛటాదోలికా
యితలీలాగమనాంకపాతముగఁ దా నిం పొంది పీటన్ దగున్. 23

శా. యోగాఽసక్తజనాంగముల్ పులకసంయుక్తాలు గా నర్తనో
ద్యోగంబం దల రాముయూపున వెలందుల్ సేయఁ జె న్నొందునా
ట్యాగారంబు విభాసిలన్ [7]'గుణని'కాఽఽఖ్యన్ 'క్షేమగౌరీశ' దే
వాగారంబు రచించు ద్యోతిలక మై యయ్యేటితీరంబునన్. 24

1. నదీద్వయము. 2. కాశ్మీరరాజు. 3. విద్యామఠము. 4. స్ఫూర్తి. 5. కృత యుగము. 6. వితస్తానదీజలము. 7. దీనికి 'సంగమక్షేత్రమఠ' మని పేరు.

తే. గీ. అలరు [1]'సంగ్రామ' మఠపు[2]సీమంతభూమి
మండపము, [3]'చంద్రసీమ' కన్పండు వగుచు
ఈశసితకాంతి హారత నిదు[4]'ననంతుఁ'
డిడిన[5]నల్లిండ్లను 'వితస్త' నెనసి నగరి. 25

తే. గీ. శాస్త్రగోష్ఠీవరిష్ఠగర్జద్గవాక్ష
ము లగు 'కాష్ఠీలు'నిండ్లు [6]కన్మురువుఁ గూర్చుఁ
బ్రహుతహుతవహధూమధూమ్రశిరములను
విప్రు లెనయింతు రట నిచ్చ భీతిఁ గలికి. 26

చ. ఘనత 'ననంత'రాజసతి గట్టిన[7]శర్వగృహంబు చేరువ
న్దన దగుతుంగిమన్ ద్రిభువనంబు మనం బలరించు [8]'గంజ'[9]వా
స్తును గన నచ్చటన్ [10]గలరుతుల్ పొలుపొందుకపోతరావముల్
విని విని పౌరకన్యలు ప్రవీణతఁ గాంచఁగఁ గంఠకాకలిన్. 27

తే. గీ. క్షేత్రముల నున్కియును, వల్కసేవనంబు,
నచట యౌవతధర్మాంగకాంతరంగ
భావముఁ గడించుకుంకుముఁ బడయుట, పురి
గాంచునట్టితపోజైత్రగరిమ గాదె! 28

తే. గీ. [11]ప్రవరపతి మున్ను సాంగుఁడై దివికిఁ జనిన
రంధ్ర మిప్డును నిలువ, స్వర్ద్వారమటుల
నలరు[12]ప్రవరేశ్వరాలయం బద్భుతముగ
స్వర్గపురిఁ జేర్చునాస నెవ్వారి కిడదు ? 29

1. ఆపేరు గలరాజు. 2. నరిమిప్రదేశము. 3. ఆపేరు గలమంటపము. 4. ఆపేరు గలరాజు. 5. అగ్రహారములు. 6. నేత్రోత్సవము. 7. శివాలయము. 8. ధనాగారము. 9. ఇల్లు. 10. అవ్యక్తమధురధ్వనులు. 11. ఒక కాశ్మీరరాజు. 12. ఈపేరు గలశివాలయము.



తే. గీ. అట [1]'మసృణకరణాసంగ' దాంగహార
మభినయించెడుచెలువనాట్యములఁ జూచి
రంభ స్తంభంబుఁ గనె; వీడె [2]రమణఁ జిత్ర
లేఖ రేఖ; నూర్వశి గర్వలీల వదలె. 30

ఉ. ప్రోల విలాసినీజనవిభూషిత[3]నైకధరావసుంధరా
పాలకసౌధతుంగిమము వర్ణన సేయఁగ నేల! యచ్చటన్
గేలిసమీరజాలకవికీలితపాదయుగుండు పూవువా
ల్దాలుపుదిట్ట పౌరవనితామనముల్ గుఱివెట్టఁ గల్గఁగన్. 31

మ. నును పొకుంకుముపూఁత నుష్ణ మగుమీనుంగంట్లచన్నెంపులన్
ఘనముల్ [4]రాంకవపట్టికల్ మృగమదోద్గారంబులున్, శైశిరం
బున, వైతస్తజలాంతరాళమునఁ బొల్పుం గాంచు[5]నౌపృష్ఠమ
జ్జనగేహంబులు మిక్కుటంబు లగుస్వసౌఖ్యంబులన్ గూర్చెడిన్.

ఉ. మోరల మంచుతున్కలను మూడ్చినవారిఘటోత్కరంబు, [6]కా
శ్మీరవరాననాకదళిశీతలకోమలగాత్రరేఖ, లో
ప్పారుతుషారగండశిల లందినభూములు నేని సర్వసా
ధారణమై చెలంగు భయదం బగుగ్రీష్మము నాఁప నప్పురిన్. 33

తే. గీ. త్యాగ-సత్యాదిగుణగణధాముఁ డయిన
నరవరుఁ 'డనంతదేవుఁ' డానగరి వఱలి
యరికరిపయోదగర్జితాప్రాప్యమంద
లాగ్రధారాంబువులఁ గీర్తిహంసి నునిచె. 34

1. ఈపేరు గలనాట్యమునందలియవయవములకదలిక. 2. ఒప్పుగా. 3. పెక్కు-అంతస్థులయెత్తుగలరాజసౌధములు. 4. సేలువలు. 5. పడవలపైని స్నాన గృహములు. (Boat House bath rooms). 6. కాశ్మీరస్త్రీలు.

శా. [1]క్రీడాకృత్త'దరద'ప్రదర్పనిజనిస్త్రింశంబుచే శోకముం
గూడం జేసి 'శక'ప్రభుప్రియలకున్, [2]గోచక్రజైత్రుండు త
[3]ద్రాడింద్రుండు కృపాణముం గడుగు [4]స్వర్గంగాంబులం దెంతయున్
[5]గూడం గూడనివారిచే దొసఁగు మేకొన్నట్లు శంకించుచున్. 35

మ. అలకాగోపురపాళిఁ గీర్తితిలకం బంటింపఁగా నేగి, భూ
తలనాథాగ్రణి కాంచి భార్గవపృషత్కచ్ఛిద్ర మాక్రాంచగు
బ్బలిమేనన్, నిగిడించెఁ గేళిలవవిస్ఫారాఽత్మదృగ్జాలముల్
బలితంపుంభుజయష్టిఁ, బందరవచాపంబందు నెంతే రుషన్. 36

చ. తనతటి సిద్ధులెల్లపుడు దావుగ నిల్వఁగ, సప్తతాపసు
ల్తనవరదన్ సదల్పెదుఁటిలల్ పొరలన్, రజతాద్రి నిల్చు శ్రీ
త్రిణయనురాణితానమునఁ దీరిన[7]మానసవీచులన్ ధరే
శునిసతు లాడలన్ గొనిరి శోభనలోలుపమానసార్ద్రలై. 37

చ. హరగిరిఁ గ్రీడమైఁ బెలుకినట్టిదశాఽస్యకరద్రుమాటవిన్
దురుమఁడ యర్ధచంద్రములఁ ద్రొల్లి రఘూద్వహుఁ, డంతఁ దత్ఫల్
దొరసెఁ గళం కటం చతఁడు తుష్టిఁ గనండు పురాధరిత్రిరా
ట్చరితములం దుదగ్రభటచంద్రుఁడు సారవిదుం డసూయమై. 38

శా. 'త్రైగ'ర్తేలల, 'భర్తులేశ' వసతిన్, 'దార్వాభిసారంబు'నన్,
బ్రాగుర్వీశకథానిధాన మగు 'చంపా'సీమలో మించుఁ, గ్రీ
డాగోత్రీకృతశీతభూమిధరరాడ్రాజాఽజ్ఞ విన్నంత నా
వేగాన్వితులఁ జేయుచున్ మిగుల దోర్విక్రాంతిసంయుక్తులన్. 39

1. అవలీలగా విదళిత మైన'దరద'రాజులమహాదర్పము గలతనకత్తిచేత. 2. భూమండలమునందు జయశీలుఁడు. 3. రాజేంద్రుఁడు. 4. గంగాతీరముదాఁక దాడి చేసె ననిభావము. 5. అస్పృశ్యులు. 6. క్రౌంచపర్వతము. 7. మానససరస్సు.



శా. వైతస్త్యాంబుభరంబె మేల్పరిఖగాఁ బాటింప నుత్తుంగదు
ర్గాతిస్ఫారమఠం బొకండు నడుమన్ హర్మ్యాంత నిర్మించి రా
ట్ప్రీతాంశుండు నభఃప్రచుంబి[1]'విజయక్షేత్రాగ్రహారంబు'లన్
[2]బ్రాఁతిన్ గూరిచె సాలలీలఁ గలిభీ వాయంగ ధర్మ్మనకున్. 40

ఉ. ఏసతిసాటి లేనిస్థితి నెచ్చుగ వమ్ము నొనర్చు నాఁగ ల
క్ష్మీసతి విష్ణువక్షమును జేరె మెఱుంగువలెన్ నవాంబుదం,
బా'సుభ'టాఽఽఖ్య, యాదిసతి యై యశ మొందె యశస్వి యైనయా
శ్రీసచివుం డనంతు, శశిఁ జేరెడువెన్నెలవోలెఁ జేరుచున్. 41

మ. దయ దాక్షిణ్యమునన్ క్షమాగుణమునన్ దార్ఢ్యాణ యొభూమిభృ
ద్దయితారత్నముత్యాగనిష్ఠకుఁ దుదన్ దర్కింప శక్యంబె! భూ
దయితానేకశిఖామణీకషణ మౌతద్భర్తృఖడ్గంబు త
ద్దయితాపాదతలస్థదాసిగ సమస్తం బౌసిరిం జేయఁగన్. 42

మ. అనయంబున్ గుటిలాక్షరప్రతతి వ్రాయన్ బూనుకాయస్థులన్,
ఘనచాటూక్తుల దక్ష లౌఫిటుల, [3]దృగ్వర్త్మన్ స్తుతుల్ సేయుగా
యనులన్ వీడి నృపాలులక్ష్మి, గురువిప్రామర్త్యవేశ్మల్ నృపాం
గనతో నొందె స్వ[4]చాపలాఽగమును బోకార్పన్ నిలన్ గోరె నాన్. 43

మ. బిసినీపత్రసుహృద్ద్యుతిన్ బొరలెఁ బ్రశ్వేతచ్ఛవిన్ గీర్తి, [5]సా
రససంవాసిని వాస మూనెఁ జ్యుతధారానీరఖడ్గంబునన్;
మిసిమిన్ వశ్యుఁడు గా సతీమణికిఁ గాశ్మీరాధిపుం, డొందె వే
ప్రసభాంతఃక్లమవృద్ధి [6]నన్యజగతీపాలేంద్రశుద్ధాంతముల్. 44

1. అగ్రహారములపేరు. 2. ప్రేమచేత. 3. ప్రత్యక్షంబున. 4. చాపల్యమనెడుదోషము. 5. లక్ష్మీదేవి. 6. అన్యనరపతులయంతఃపురకాంతలు.

ఉ. మానుగఁ గీర్తిచంద్రిక క్షమాస్థలిఁ గప్పునృపాలునా 'లధి
ష్ఠానము'నన్ నిజాఽఖ్యఁ దగుచారుమఠం బొనరించె సత్కలా
జ్ఞానగరిష్ఠదేశికజనంబుల కాస్పద మైనయందుఁ దా
పూనదె! కన్నుపండువుగ [1]నుల్లలితస్థితి నెట్టికల్మియేన్. 45

ఉ. పండితభోగయోగ్యముల [2]భాండగృహంబుల నిల్పి, బ్రాహ్మణుల్
తండము లై స్వతంత్రముగ దాత్రిఁ గొనంగ వచించి, [3]యామవే
దండసవానదిగ్వలయదంతురదంతులు మేదినీస్థలిం
బండువు సేయుసద్యశముమాత్రమె తత్పతి కా పొనర్చెడిన్. 46

ఉ. మానిని గూర్చె సూనశరమర్దనుఁడున్ [4]త్రిజగద్గురుండు నౌ
వానికి నైజశృంగపరిభగ్నభమార్గసుధామమున్ విత
స్తానదిచెంతఁ; గంతుఁ డటఁ దాండవినీనటనాసముత్థకాం
చీనినదాపిధానగుణశింజ శివక్రుధభీతి వీడెడున్. 47

చ. పతిహితతద్ధరేంద్రసతిభ్రాతగ క్షాత్రమహుండు పేరునన్
'క్షితిపతి' భోజరాణ్మహిమఁ జెల్లెను [5]'లోహర' కింద్రుఁ డౌచు; భా
రతి తదురఃస్థితేందిరశిరంబున మెట్టుచుఁ దన్ముఖంబునం
దతికె, విలాసభంగి నిడునట్ట[6]లలామముమించుఁ గాంచుచున్. 48

చ. పరిణతియద్భుతంబుఁ గనుపార్థివుత్యాగము [7]కాంతకీర్తి యై
వఱలఁ గొలంత వల్కెడు నెవండు? స్వకర్కశతర్కపద్ధతిన్
నరపతిచేతఁ గీ డెడలుజ్ఞానిగృహంబుల నిల్పుఁ గాంచునిం
దిర నిదురింపఁ దిప్పును దదీయవధూజనభూషణధ్వనిన్. 49

1. కదలికగల. 2. ధనాగారములు. 3. పహరాయేనుఁగులు. 4. పరమేశ్వరునకు. 5. 'లోహర' దేశమునకు రాజు. 6. తిలకము. 7. మనోహరయశము గలది.



తే. గీ. రమణ [1]'బాహుస్థ'లాబ్జినీ[2]రాజహంస
వార్త మతనిబాహువు మ్రింగె వడిని [3]'రాజ
పురి'ప్రతాపంబుఁ జెక్కిళ్లఁ బొరలునశ్రు
ఝరుల నన్నులచన్నులు బురదవఱచి. 50

ఉ. దానలతుంటిసౌరున రసజ్ఞత పీఠి యవజ్ఞచే, సభా
స్థాన మలంకరించు నిరుదండలఁ బండితమండలంబునన్
మానధనుండు హేమమణిమండితకుండలనిందఁ జేసి సం
ధానము సేయు వైష్ణవకథాశ్రవణంబె శ్రవఃప్రభూషగా. 51

చ. సుకృతఫలం బనఁ బొడమె సూనుఁడుగాఁ 'గలశుండు' తన్నృపా
లకుసతియందు; [4]దైవతకులప్రభుదంతికరాతిశాయిదోః
ప్రకటనుఁ డాతఁ డొప్పె, ననిఁ బాయుచుఁ బర్విడుతేండ్లసంపదల్
సకలము లొందె దంతిమదసాంద్రమషీతతపంకఖడ్గమున్. 52

చ. శితకరవాలశైవల[5]విశేషితసాంద్రవినీలరోచు లా
నతిశయదర్పశాత్రవధరాఽధిపతిధ్వజినీశిరంబులన్
జ్యుతములఁ జేసి ధర్మవనజోపమతన్ముఖదర్శనంబునన్
గృతమతి యొచుఁ జేరె సిరి కీర్తివిభూషణ యై నృపాంఘ్రులన్.

మ. జయయాత్రాచణుఁ డౌచుఁ గాంచి స్ఫటికాచ్ఛచ్ఛాయ[6]'మచ్ఛోదమున్'
స్మయ[7]దింద్రాయుధరింఖికాంకతతసీమాచారి యై ధారణీ
దయితేంద్రుండు మితోక్తియుక్తముగఁ ద[8]త్కాదంబరీ[9]సక్తులన్
నయ మొప్పన్ [10]నియమించెఁ జిత్రముగఁ [11]జంద్రాపీడుస్తోత్రంబులన్.

1. పట్టణముపేరు. 2. 'రాజశ్రేష్ఠులు-రాజహంసలు' అని శ్లేష. 3. పట్టణముపేరు. 4. ఐరావతము. 5. చింతరూపము గల. 6. సరస్సుపేరు. 7. అశ్వముపేరు. 8. 'కాదంబరి'యను నాయికపరిజనమును. 9. వరిలనమును. 10. పనిచెను. 11. నాయకునిపేరు. (ఈపేర్లు 'కాదంబరీ' కావ్యమునందలివి).

ఉ. ఆపయి నుత్తరంబుఁ జనునాతనిచే నుతి నందెఁ బేర్మి, గౌ
రీపతిగోఖురక్షరితరేఖలఁ జెన్నగురాజతాద్రి, లం
కాపతిదోస్తటిస్థలన గాసిలి శైలతటస్థలంబులం
దూపిరిఁ ద్రిప్ప రిప్పుడును నుక్కలి కొందఱు శర్వపార్షదుల్. 55

చ. అలకను జాతరూపకపిశాంగులఁ గొందఱ యక్షకన్యలన్
వలచి పరిగ్రహించి యటుపై నుదగాశను మానసంబు పెం
పులఁ గని వచ్చుచున్ గిరిశమూర్ధసరత్సరనిమ్నగాంబులన్
[1]మలయఁగఁ జేసె మానససమాహృతపద్మము లాతఁ డిమ్ములన్.

చ. చతురకృతాస్త్రతన్, సకలశాస్త్రత నాతఁడు గాంచుశంసకున్
క్షితిఁ జెలు లిర్వు రొప్పుదురు శ్రీసతి, భారతి; వారిలో రమా
సతి [2]వనదాళపత్ర యయి సల్పును గొల్వు భుజంబునన్, సర
స్వతి భజియించు వక్త్రశశిఁ జారుయశోధవళాతపత్ర యై. 57

మ. మరుదుద్దాంతగతిస్ఫురత్తురగసంవ్రాతంబుచే 'వాలుకా
విరశాబ్ధిన్' వడి దాఁటి 'శ్రీధర', 'జయాపీడ' ప్రభావుండు భూ
వరుఁ దుర్వేకభటుండు గెల్చియును గర్వం బంచు నెంచండు హ్రీ
స్థిరుఁ డై శ్రీరఘురామునం, దతఁడు మున్ జెండాడుటన్ 'దాటకన్'. 58

ఉ. కాలునినాల్కనాఁ దగునృకాంతకృపాణము లోఁ దలంచ, [3]మై
కో లగుభీతిపేర్మి మరుకూర్మలపెంపులు దూలుధారణీ
పాలురు, [4]శాదనీలమహిభాగములం, దబలా[5]శిరోజపా
శాళినిఁ, బ్రావృషేణ్యజలదావళి హర్షము డించి రార్తు లై. 59

---

1. వ్యాపింపఁగ. 2. 'జలదమువంటినల్లనిగొడుగు గలది' యని భావము.
3. నమ్మతి. 4. పచ్చిక. 5. కొప్పులు.



మ. తనకున్ దేవియు 'హర్షదేవ '[1]ప్రసు వౌతన్వంగిపాలింతుసీ
మను సేవానత[2]యక్షరాడ్వితరణం భాసిల్లు[3]'నేకావళిన్'
గని తేఁ డాతని కద్భుతోపకృతిఁ దాఁ గావింపఁగా నెంచి, రా
మునిమిల్లుల్ మును [4]బుష్పకంబుఁ గొనఁగాఁ బొందెన్ మనఃఖేదమున్.

చ. మును దనయొదలల్ దునుమ మొక్కలుకత్తినిఁ [5]గస్తిఁ గాంచి తా
మును గొని రువ్వశర్యగిరిఁ బొల్పగుసానగఁ గోరినట్టియా
మినిచరనేత నైన నని మించి జయించినరాముఁ డేనిఁ [7]బో
ల్కినిఁ ద్రిజగత్ప్రసిద్ధగుణలీలు నృపాలునకున్ [8]సముద్రుఁ డౌ. 61

శా. ఆరాన్మంథరభూధరభ్రమణభిద్వ్యార్ధిరుణ్మార్తి నా
దూరవ్యాపినిజోర్మిలన్ ధరణిభృన్మాలచ్ఛిదాశక్తి నై
వారం గల్గిన'చంద్రభాగఁ' బృతనాధ్వస్తాంబుతన్ నిల్పి ·కా
శ్మీరేలాకుముదిన్యతిగ్మరుచి తాఁ జేసెన్ స్థలం బై తగన్. 62

చ. తన[9]ఘనశేషభంగరుచిఁ దంద్రితురంగము లంటి కాపుఁ గ
న్నను సకలోర్వి గెల్చునరనాయకుసైన్యము [10]లబ్ధిసీసుహృ
త్తనయను ధారణీలులితదంతురవిభ్రమకుంతలాసితా
భను [11]భయదాంతకస్వసను బాన మొనర్చె నశేషతోయఁగాన్. 63

చ. గిరిసహచారికీర్తుల నిగిడ్చి వసుంధర నించి, సర్వగ
హ్వరిని జయించునాయవనిపాలుఁడు సేరె [12]నరాళుగాహతుల్
వఱపిన[13]నల్లవెల్లిఁ గురువల్లభుకిరిటి[14]కమ్మ [15]కర్ణజ
ర్జరితవిధిన్ దొలంగి తరసా [16]మును కొంది రహించు[17]క్షేత్రమున్.

---

1. తల్లి. 2. కుబేరుఁడు. 3. ఒకవరుస గలముత్యాలహారము. 4. కుబేరుని
విమానము. 5. దుఃఖముచేత. 6. రావణుఁడు. 7. పోలిక. 8. ముద్రి
తుఁడు (ముకుళితుఁడు). 9. గొప్పగా శోషించినయలంకాంతిచేత.
10. యమున. 11. భయంకరుఁ డగుయమునిచెల్లెలిని. 12. అర్జునుఁడు.
13. నెత్తురు. 14. దంతపత్రము. 15. చెవి-కర్ణుఁడు. 16. మునుఁగుట.
17. కురుక్షేత్రము.

శా. హర్షం బూన్పుచు 'హర్షదేవుఁడు' సుతుం డై తేనికిన్ బుట్టె 'శ్రీ
హ'ర్షాతీతకవిత్వవృద్ధి జనులన్ హర్షాఽత్ములన్ జేసి రా
ట్ఛీర్షోద్యన్మణిభేదకుంఠితనిజాసిన్ [1]బైఁడికైతోడ్వునన్
హర్షించెన్ [2]బద నూన్పుచున్ మిగుల శాస్త్రాస్త్రప్రభావంబులన్. 65

ఉ. వానియపూర్వశబ్దపరిపాకము వాక్చతురత్వచర్యలన్,
మౌనము వాదిసంతతికి మైకొనఁ జేయుచు నెల్లబాసలన్
జా నగువానికైత భువనత్రయి సన్నుతి కెక్కెఁ; ద న్నిలన్
బానము సేయఁ గర్కశపువాలుక యౌ నల తీయశర్కరల్. 66

ఉ. కోరినవస్తు వొంద గడికొన్నప్రమోదముచేత మించుభూ
దారునిచేఁ దిరస్కృతినిఁ దాలిచి మూర్ఛఁ [3]గ్లమించి సోలుచు
న్నారులు బాష్పపంకమునఁ దామ [4]లుఠించిరి; గండపాండుతన్
వేఱు నుతింప నేల! కడు వెల్లడి గాన్ శ్రుతిదంతపత్రముల్. 67

మ. 'క్షితిప'త్యాఖ్యనరేంద్రకీర్తినిధి నిస్సీమస్ఫురద్దుర్గసం
యుతి నుత్కర్షతఁ గాంచి హర్షనసుజుం 'డుత్కర్షదేవుండు' పౌ
రతతుల్ ముఖ్యులకల్ గనన్, మహికి దుర్వారక్రుధమ్లేచ్ఛసం
తతిసప్తిప్రజరింఖిశాఖదితముద్రల్ మాన్పి యొప్పెన్ గడున్. 68

ఉ. మానవనేతకున్ 'విజయమల్లుఁడు' నా నొకఁ డాత్మజుండు వే
త్తై నయనాభిరామవిమలాఽకృతిగా నెగడెన్ బ్రతాపి యై,
స్వాఽననమందుఁ జెంది కమలాఽననురాణి రదప్రదీప్తి[5]నం
దానితసూనమాల యుపదానముగాఁ దన కొప్పుచుండఁగన్. 69

1. బంగరుకంకణము. 2. వాఁడి చేయుచు. 3. శ్రమించి. 4. పొరలిరి.
5. కూర్పఁబడిన.



చ. పరిణతలేఖసృష్టియలవాటున నొప్పెడుసృష్టికర్త క
చ్చెరు వగులేఖ మైపొడఁగు చెల్వు నిరన్ [1]లటభాంగనాదృశా
హరుఁడు గ, జ్యానినాదపరుఁ డై యల మన్మథుఁ డెల్లవేళ జా
గరమున నిల్చి సజ్జుడుగఁ గౌసుమచాపశరాభిరాముఁ డై. 70

బిల్హణకవి చరితము

చ. 'ప్రవరపురంబు'నుండి [2]త్రిగవ ర్వెడగా విలసిల్లు, ద్యోస్థలి
న్దవిలెడుమేడలన్[3]'జయవనం', బట నిర్మలవారులన్ బృదా
కుపులకు నేత తక్షకుని'కుండము' వొల్చెడు, ధర్మకర్తన
ప్రవణత మీఱునుగ్రకలివక్త్రముఁ ద్రుంచుసుదర్శనంబుగన్. 71

శా. ఆలానంబులఁ బోలుయూపశతముల్ హ ర్వొంద, బంధంబు ల
స్సీలోలత్వమునన్ గలిద్విపము త న్జెందంగ రా కుండ, నా
భీలం బై, తదుపాంతసీమ, సుగుణాన్వితత్వసంప్రాప్తకీ
ర్త్యాళిన్ గ్రామ మొకండు 'ఖోనముఖ'విఖ్యాతిన్ రహిన్ గాంచెడిన్.

ప్రకారాంతరానువాదము

శా. [4]ఆలానంబులఁ బోలు[5]యూపశతముల్ హ ర్వొంద, బంధంబు ల
స్సీలోలత్వమునన్ గలిద్విపము త న్జెందంగ రా కుండ, నా
భీలం బై, పురిఁ జేరి 'ఖోనముఖ' మన్ బే ర్గన్నగ్రామంబు, ధా
రాశాఽత్మీయసమగ్రసద్గుణగణప్రాశస్త్యకీర్తిన్ దగున్. 73

ఉ. చిత్రకథాఽఽద్యభూమియును, [6]శ్రీగిరిశశ్వశురాద్రిమధ్యమ
క్షేత్రము నై నతత్స్థలి వచింపఁగ నేల! తదంతరాన నే
కత్ర, నిసర్గశోభనతఁ గల్గఁగఁ జేసెడుకుంకుమంబు, న
న్యత్రగ, [7]సారవేషసిత మై కడు [8]ద్రాక సమృద్ధిఁ బుట్టఁగన్. 74

1. సర్వాంగసౌందర్యవతి. 2. మూడు పరుగులు (సార్ధగవ్యూతి). 3. ఆపేరు
గలస్థానము. 4. గజబంధనస్తంభము. 5. యజ్ఞశాలలోనిపశుబంధనస్తంభ
ములు (గుంజలు). 6. హిమాలయము. 7. నరయూథపము. 8. ద్రాక్ష.

శా. ప్రారంభంబున సత్కళాభిరతి 'గోపాదిత్యుఁ' డన్‌రాజు కా
శ్మీరాస్థానికి మధ్యదేశమునఁ బేర్మిన్ గన్నభవ్యాత్ములన్
వే రావించెఁ; దదాదిఁ 'గౌశిక'కులుల్ విద్వద్వతంసుల్ ద్విజుల్
సారబ్రహ్మరతాత్ము లుండు రట వంశప్రాభవోపేతు లై. 75

ఉ. వారిమఖాగ్నిధూమ్యలు దివంబున నిండి '[1]శతాధ్వర' ప్రియో
దారయశంబుఁ గూర్పుఁ గనినంత, శతాధ్వరుఁ డేరిమాట నే
న్దారుపఁ బోఁడు గోత్రపుటి; నాకముచింతఁ గనండు; ఛాయ దై
వారక చిత్రసంగతునిభంగి విచేష్టితునట్లుఁ బొల్పుచున్. 76

చ. తనసతతాగ్నిసేవనవిధానమునన్ జనియించుస్వేదజీ
[2]వనమున ముజ్జగానఁ గలిదన్నముఁ బాప సమర్థుఁ డై జగ
ద్వినుతపవిత్రవృత్తమునఁ దేజిలుతత్కులజాతులందు న
త్యనఘుఁడు దాల్చె 'ముక్తికల' శాఖ్యుఁడు స్వాన్వయశేఖరత్వమున్.

చ. నలుమొగముల్ నివాసముగ నల్వ యొనర్చిననాల్గువేదముల్
[3]పొలు పగునీసునన్ జగడముల్ గన నున్నఁ దదీయశాంతికై
కలిపి నిజాంబుజాసన [4]మొకంటనె నిల్పె నతండు [5]వల్లభా
వళి నెనయించులీలవలెఁ బండితవర్యులు మేలు మే లనన్. 78

చ. [6]శ్రుతనిపుణుండు 'రాజకలశుండు' పరాక్రమవైభవుండు దా
తృత గలవాఁడు దద్బుధవరిష్ఠసుతుం డయి పెంపుఁ గాంచె; నం
ధతమసభంగి నేఁడును [7]యథాగతి శీతకుభృత్పరంపరా
స్థితగుహ లెంతయున్ బయటఁ జిమ్ముఁ దదధ్వరధూమపుంజముల్.

1. ఇంద్రుఁడు. 2. బలము. 3. స్థిరము. 4. అమహత్తగు 'నొకఁడు'కు నొవవిభక్తికరూపము. 5. దీనిచేతవతనిదక్షిణాయకత్వము ధ్వనితము. 6. శాస్త్రములయందుఁ బారంగతుఁడు. 7. గమనము వీడక.



చ. సకలజనానుభోజ్యముగ సాగినడాకలు నిండుతోఁటలున్,
సకల[1]కలాప్రదేశములు, స్వచ్ఛజలంబులకూపముల్, ప్రపల్,
సుకృతనికేతనం బతఁడు చోటునఁ జోటున దేశభూషగా
[2]సుకృతిగృహాంగరక్షఁ గలిసూడు సనన్ ఘటియించు నిచ్చలున్.

మ. కొమరుం డై జనియించె 'జ్యేష్ఠకల'శాఖ్యుం డయ్యరుఖ్యాతి కు
త్తమసారస్వతవేది, వేదనిధి, [3]యుచ్ఛ్రాయక్షముం, డద్భుత
స్వమనీషామహిమాప్తి వ్యాఖ్యను మహాభాష్యానకున్ లోకవం
ద్యముగాఁ గూరిచె; నొప్పె ముంగిటను శిష్యవ్రాతముల్ భాసిలన్.

చ. అతిథులసేవ [4]నిష్టములయందునఁ [5]బూర్తములందు సేవకా
త్యతులితసాంత్వనన్ గహనమా! యితరార్థసమర్థణంబులన్,
హితకృతు [6]లైహికంబుల ననేక[7]పరంబులు నల్పఁ జాలును
న్నతిఁ దగు 'నాగదేవిఁ' దనఁనాతిఁగఁ గొన్బుధమౌళి కెంతయున్.

## బిల్హణజననము

చ. కనకరుచుల్ [8]ప్రతీకములఁ గాంచెనొ నాఁ దగు[9]మేల్మిరోచులన్
[10]గనుమరు లూన్చు 'బిల్హణుఁడు' గల్గె జగన్నుతి మించ వానికిన్;
వనజజురాణి బిల్హణునివక్త్రమునన్ నిలు పొందె [11]గీస్త్రయీ
ధ్వని, తన[12]శింజఁ గప్పఁ, దగుతావుగ[13]మౌంజినిఁ దాల్చునాఁడుగన్.

శా. సాంగామ్నాయము, శబ్దశాస్త్రమున [14]శేషాహీశ్వరవ్యాఖ్య, శ్రో
త్రాంగానందము సాహితీగరిమ తత్ప్రాణంబు లై మించ నెం
చంగా శక్తుఁ డెవం డిలన్? వినుఁడు తత్సారంబు స్వచ్ఛస్వధీ 84
రంగద్దర్పణమందు నందముగ సంక్రాంతస్థితిన్ నిల్చెడున్.

1. విద్యావ్యాఖ్యానస్థానములు. 2. ధర్మము. 3. అధికక్షమాసారుఁడు. 4. ఇష్టకర్మలు:-'అగ్నిహోత్రము. తపస్సు. సత్యము, వేదాధ్యయనము, ఆతిథ్యము. వైశ్వదేవము' 5. పూర్తకర్మలు:-'వాపీ-కూపత-టాకాదులను. దేవాలయములను, ఆరామములను నిర్మించుట, అన్నదానము చేయుట. 6. లౌకికసుఖములు. 7. పారలౌకికసుఖములు. 8. అవయవములన్. 9. బంగరుకాంతులన్. 10. నేత్రమోహము. 11. వాడివేదధ్వని. 12. మంజీరనాదము. 13. ఉపనయనమునందు వటువుమొలకు గట్టు బదుముంజదర్భమొలత్రాడు. 14. పతంజలిభాష్యము.

శా. శ్రీవాణీపదపాంసుకార్మణతపేర్మిఁగ దర్విపశ్చిమ్మళి
శ్రీవీణారతి గుంపు గట్టెను [1]గలాశ్రీరాజి; తత్కీర్తివా
మా[2]విభ్రాంతిఁ దొలంచుకంచుకులుగా [3]మా నొందె దిక్పాళిఁ ద
త్ప్రావీణ్యోద్ధురసర్గబంధతతి సార్థం బౌచు వ్యాపించుచున్. 85

చ. అతఁడు గడించుపాండితికి నొదలఁ గైకొనె 'విష్టరామ' నం
జ్ఞత నుతిఁ గన్నయన్న నరనాథవితానసభావతంస మై;
సతము నిజాస్యమందు నుడిచానఁ గవీశ్వరమాతఁ గావ్యజా
మృతరస మానుమానవులు మించుప్రపాలలనన్ బలెన్ గనన్. 86

ఉ. నందితకీర్తి [4]యాతనికి నవ్యకలాకుశలుండు తమ్ముఁ 'డా
నందుఁ' డసూయమై మదమునన్ దను దాఁకుకువాదిమత్సరం
బుం దునుమన్ గుఠారముగఁ బొల్చెఁ: సరస్వతి శీతశైలమం
దొందుచు నిష్ఠురత్వము సమున్నతిఁ దన్మృదుజిహ్వ నిల్వఁగన్. 87

శా. చెందెన్ నిర్మలశాస్త్రతత్త్వమును గాశ్మీరంబులందుండి; పై
నందెన్ నిక్కము మంచుకొండఁ గలశైత్యం బెంతయున్; [5]మున్మగా
[6]క్రమందన్ జేయు నెటుల్ తదన్యగతి, సామర్థ్యాత్ముఁ డై యెల్లెడన్
నిందావాదులమోములన్ నిల హిమానీప్లుష్టపద్మాకృతిన్? 88

శా. దోలాకేళిలులత్కటీభరమునం దూగాడు చున్నట్టిరా
ధాలీలావళిచేతఁ ద్రుంగి తరు లిందాఁకేని [7]నూర్పోని[8]గో
పాలేశాజిర మొప్పుబృందవనిక్రేవన్ [9]దీర్చెఁ బె క్కైకన[10]ఘ
స్రాళిన్ దా మధురన్ వివాదరతి [11]ధీరాళిన్ ద్రుటిన్ గెల్చుచున్.

1. విద్యావధూపంక్తి. 2. చంచలత. 3. మనోజ్ఞత. 4. బిల్హణునకు. 5. పదునగా. 6. నొచ్చుట. 7. ఊపిరి వెడలని. 8. కృష్ణుఁడు. 9. తర పెను. 10. దినాళి. 11. పండితాళి.



ఉ. నిస్సమశాస్త్రవాదముల నేర్పునఁ బల్కుచు దిక్కుదిక్కులన్
నిస్సమతద్యశంబులను నిల్పెడుశిష్యుల కంతరాయ మై
దుస్సహదిగ్గజేంద్రమదతోయసమాస్వదనప్రమత్తరం
హ[1]స్సమలిప్రగాలపనజారవడంబర మొక్కటే తగున్. 90

ఉ. పామరుఁడేనిఁ, బండితుఁడు, బాలుఁడు, వృద్ధుఁడు, స్త్రీ, నరుండునే
నీమహితాత్మకావ్యము మెయిన్ బులకల్ మొలవన్ బఠింపఁడేన్,
గ్రామము గాదు; దేశమును గా; దది రాజ్ఞనగరంబు గాదు; కే
శిమహి గాదు; కానయును లేదు; సరస్వతి లేదు ధారుణిన్ . 91

మ. తనయుత్తుంగమణీమయాలయము లందం బైనసోపానలీ
ల నిగుడ్చన్ జదలన్ బొదల్పురలప్రో ల్దా వౌసిరిన్ డించి మిం
చినపూర్వర్యముఁ 'గాన్యకుబ్జము'ను, నిస్సీమంబుగా మ్రోగుగం
గను దర్శించుచుఁ జొచ్చి తద్యశము స్వాజ్ఞావర్తిగాఁ బూనిచెన్.

చ. కలి నుడిగించుధర్మధృతఖడ్గము దా [2]వినువాఁకకోశమం
దుల [3]రవిజాతవేణివిధిఁ దూటి రహించఁగఁ, దీర్ఘరాజ మై
యలరు 'ప్రయాగ'మందు జగదద్భుతసద్గుణసంపదాఢ్యుఁ డై
సలుపుచు దానముల్ నిలిచె సన్నుతుఁ డచ్చటఁ బెక్కువారముల్.

చ. కలయ నిలన్ భ్రమించుకలికాలపుభీతినిఁ దన్ను జేరి చిం
తిలుచును ధర్మ మొందినపథిశ్రమమున్ దనశీకరంబులన్
దొలఁచుచుఁ '[4]గాశికన్' వెలయు[5]ద్యోపథనిమ్నగఁ గ్రుంకి దుర్విధి
స్థలితకుభూపులన్ గన నెసంగుకళంక మతండు [6]దూలిఁచెన్. 94

1. భృంగశ్రేణిగీతధ్వని. 2. గంగానది. 3 యమునావేణిభంగిని. 4. కాశీపురమునందు. 5. గంగానది. 6. తొలఁగించెను.

చ. అల [1]'కాళింజరభూధ'రేశునకుఁ [2]గాలాఖుండు [3]'డాహాల'భూ
వలయేశుండు నిజాశ్వరింఖలరుతిన్ వ్రక్కల్ గఁ [4]'దుక్కార' భూ
తలి రాట్పూన్యముఁ జేయు'కర్ణ'[5]పతి తక్కవ్యగ్రణీప్రజ్ఞచేఁ
బొలిచెన్ గర్ణసుధారసాస్వదనసమ్మూర్ఛన్మనఃకంజుఁ డై. 95

చ. మును స్ఫటికాద్రిచేఁ దనివిఁ బొందక డాపలికేల దాని నుం
డను నిడి, మంచుకొండను నిడం దృటి దక్షిణహస్తమునన్ నిగి
ద్చినదశవక్త్రుఁ ద్రుంచురఘుశేఖరురాణ్ణగరం 'బయోధ్య' నీ
ఘనకవి స్వీయసూక్తిరసగాహనఁ జేసెను శైత్య మందఁగన్. 96

మ. ఘనుఁ డో'డాహల'భూపుసౌధమునఁ దా 'గంగాధరున్' గెల్చి, గె
ల్వ నెదుర్కొన్నిపు[6]ధీరులన్ గెలుచువిద్వచ్చంద్రుగాథాఖలి, ప్రా
చ్యనగప్రాంతచర[7]త్సురేభమదతోయభ్రాంతభృగారవం
బును నిర్జించి సురేంద్రుకర్ణపుటినేన్ బొర్లాడు నం చెంచెరన్. 97

ఉ. కారు సమంబు భోజునకుఁ [8]గానరపాలురు; నీవు నుంటి వే
లా! రహి రాక యీనృపలలాముని కొల్వున; 'కేను దుర్విధి
ప్రేరిత' నంచు, ద్వా[9]ర్దమరకృచ్ఛిఖరోద్దయనప్రవర్తితో
దారకపోతరావమిష యై తగె దీనత [10]'ధార' వల్కెనన్. 98

చ. అనయ మపూతులే యగుచు, నాదటఁ [11]గచ్ఛముడిన్ గదింపఁగాఁ
జనక, నుడుల్ వెలార్చునెడఁ జాల జుగుప్సను గూర్చు'గూర్జ'రా
వనిజనసంగ మధ్యమున వర్తిల నందినవంత 'సోమనా
థు' [12]నథవుఁ గాంచి య[13]క్క వివిధుం డల తాఁ దొలఁగించె నెంతయున్.

1. ఒకదేశముపేరు. 2. యమతుల్యుఁడు. 3-4. దేశములపేర్లు. 5. రాజు. 6. పండితులన్. 7. ఐరావతము. 8. నీచనృపతులు. 9. ఉపద్రవము చేయు. 10. భోజునిరాజధాని. 11, కక్ష్యబంధము. 12. ఈశ్వరుని. 13. కవిచంద్రుడు.



ఉ. ఘోర[1]హతిచ్ఛలంబున [2]భృగుప్రభవుం డల రువ్వ[3]నర్గళం
బౌరహి, [4]వార్ధి స్వేచ్ఛగ విహార మొనర్చుట నాఁపుపూగగో
త్రారుహనీలవేల వసుధాతలనాథకళావలోకనో
దారకుతూహలాయతి బుధాగ్రణి తా విహరించె నెంతయున్. 100

శా. పారావారశిరస్థలిన్ నిలిపి [6]ఖల్వాటత్వమున్, మీఁదు, లం
కారాజాపహృతాత్మజానుగత యై క్రవ్యాదనేదిష్ఠసీ
తారామాస్థితి వించు భీతిఁ గనునా[7]ధాత్రీసదృక్సేతువం
దారాజన్యుఁడు మెట్ట కున్నను దదీయఖ్యాతి దాఁటెన్ జుమీ. 101

ఉ. [8]అంతలు నింత లౌనృపులయందుఁ బరాఙ్ముఖుఁడున్. సుధీనిశా
కాంతుఁడు [9]యామ్యదిక్కునకుఁ గౌతుకి యై చని యిట్టు లెంచె; 'నీ
ప్రాంతపుఁగాంతలందఱికుచాయతియున్నతి నేమి సెప్ప, నా
కంతుఁడె ముజ్జగంబుఁ గొనుగండఁడు ధాత్రత వానిఁ గొల్వఁగన్.'

శా. చోళాఖిల'చళుక్య'భూమిపతిచే సూరీంద్రుఁ డొందన్ మహా
నీలచ్ఛత్ర-మదేభరాడ్ధ్వజముతో [10]న్విద్యాపతిత్వంబు, నా
పై లాలించె దృఢోపగూహనకళావాల్లభ్యవేల్లద్భుజా
హేలాశింజితహస్తభూష యయి యెంతే వాని రాలచ్చియున్. 103

మ. మదపానంబునఁ దుమ్మెదల్ నిదుర [11]మైమై మైకొనన్, గగ్గురుల్
గదురన్ దిక్కరులేని వేనియళ మాకర్ణించు, నాతండు దా
[12]నదియుంచెన్ గమనీయకావ్య మిది కరాటేంద్రుప్రీత్యర్థ; మి
య్యది యొందున్ జగతిన్ బుధప్రకర ంతాలంక్రియాసుస్థితిన్.

1. ఆయుధ (పరశు) వ్యాజముచేత. 2. పరశురాముఁడు. 3. గదియమాను. 4. పూర్వము పరశురాముఁడు తనపరశువుచేతఁ బశ్చిమసముద్రమును జీల్చినపుడు భేదిల్లిన సముద్రము. 5. పోఁకచెట్లు. 6. బట్టతల గలిగి యుండుట. 7. భూమి-దాది (పెంపుడుతల్లి). 8. సామాన్యరాజులు. 9. దక్షిణదిక్కు. 10. విద్యాధికారిపదవి. (ప్రధానపండితపదవి). 11. అనాయాసముగా. 12. కూర్చెను.

ఉ. కూరెను లక్ష్మి నల్గడలఁ; గూర్చితి సజ్జనభోగ్యసంపదల్;
[1]ధీరుల నోర్చి [2]గెల్పుసిరిఁ [3]దేటితి నెల్లెడ వాదులందునన్;
సారముఁ [4]దేల్చ దక్ష మయి సన్నుతిఁ గాంచెదుప్రజ్ఞ మీఱుకా
శ్మీరబుధాఽళిగోష్ఠి త్వరఁ జెందుత నన్నిటమీఁద [5]నాదటన్, 105

శా. చెందం గంటి నృపప్రసాద[6]కణికన్; శ్రీలేశమున్ గంటిఁ; గా
సం తౌవిద్యను నేర్పితిన్; గుణగణం బాధార మై కొందఱ
న్నిందం జేసితి; నిట్లు జ్ఞాన మతి యెన్నో నేరముల్ సేసితి;
న్డెందం బిప్పుడు తేఁటతెల్విఁ గనె; వాంఛింతున్ [7]వియద్వాహినిన్.

చ. [8]పరిణతి, శాంతచిత్తమును బార్వతివల్లభునందు నిల్పి, య
ద్ధురమరుదుద్ధతోర్మితతి [9]దూఁగుదుకూలముగాఁగ నొప్పు[10]నా
మరతటినీతటాంకమున మా నగుయోగసుషుప్తి, రక్తిఁ, బు
త్తురు కడవాసరంబులను, దూలఁగఁ బాపము పుణ్యమానవుల్. 107

శా. [11]స్వైరాఽభంగురభాగ్యమేఘ[12]చపలల్ సంపత్తులన్ నిల్ప నె
వ్వారున్ జాల; రసుప్రయాణపటహధ్వానంబు శాంతింపఁ బో;
దీరల్! కీర్తిశరీరముల్ కృతిసుధావృష్టిన్ నిలన్ జేయుత
[13]ద్ధీరాగ్రేసరులన్ మదం బుడిగి యెంతేఁ గొల్వుఁడీ! భూభుజుల్!.

మ. నృపులారా! కవులందుఁ బ్రేమ విడకుం; డెంతే సితఖ్యాతి మీ
కెపుడున్ వెల్గును దత్ప్రసాదముననే; హృష్టాఽత్ము లై రామున
చ్చపుఁజారిత్రముఁ గూర్పరే! కుపితు లై సర్వప్రపంచంబు గె
ల్చు[14]పులస్త్యాఽత్మజు హాస్యమార్గమునఁ బెల్లున్ గుందఁగాఁ జేయరే!.

1. వందితులను. 2. జయశ్రీ. 3. ప్రసన్నుఁడ నైతిని. 4. నిష్కర్షించుటకు. 5. ప్రేమముతో. 6. లేశము. 7. గంగానదిని. 8. వార్ధకమునందు. 9. చలించు. 10. గంగానది. 11. స్వేచ్ఛగాఁ బూర్తి నశ్వరములైన. 12. తటిత్తులు. 13. విద్వత్కవీంద్రులను. 14. పులస్త్యునికొడుకు (రావణుఁడు).



మ. తనస్వచ్ఛంద[1]కిరాతచర్యఁ గని విత్రస్తాఽత్మ యైనట్లుగాఁ
దనమౌళిస్థమృగాంకరేఖ, మృగమున్ దప్పించి దవ్వంచ, సొం
పునఁ గన్దేవుఁ డుమాధవుండు [2]నిగమంబుల్ దొల్తఁ బుట్టించువాఁ
డొనరించున్ సుకవిప్రబంధసరణిన్, వ్యుత్పత్తి మీ కొందఁగన్.

తరల. సకలవిష్టపపాల! వేంకటశైలశృంగవిభూషణా!
వికలదైత్యప[3]కశ్యపాఽత్మజపీన[4]వత్సవిదారణా!
అకలుషాఽశ్రితభక్తచిత్తవిహార! సంసృతివారణా!
[5]సుకల! వేంకటశా! నృకేసరి! స్తోతృపాపవిశోషణా!. 111

భరతవాక్యము

క. అలరుత! జగములు శుభముల;
వెలయుత! వ్యుత్పత్తి భువిఁ గవిప్రవరులకున్;
దొలఁగుత! సంసృతిబంధం;
బిల వైదికధర్మధీ, సమేధిత మగుతన్! 112

మ. కవు లౌ'లక్ష్మణ-విశ్వనాథ'బుధు లీకావ్యంబు విద్వత్కవీ
శవినోదార్థము, 'మానవల్లి'కులవిశ్వఖ్యాతుఁ డౌ'రామకృ
ష్ణ'విపశ్చిద్వరునాజ్ఞచేఁ దెలుఁగునన్ గావించినా; రిద్ది యాం
ధ్రవిపశ్చిత్కవికంఠహార మగుతన్ [6]దారాఽర్కచంద్రస్థితిన్. 113

తే. గీ. మహిత'వనపర్తిఁ' [7]'బాలమూ'ర్మండలమున
[8]నాంధ్రిఁ 'గప్పగంతుల'-'కౌశి'కాన్వయంబు,
'మాదిరాజు'-'కౌండిన్య'వంశంబు వెలయు
శ్రీశ'వేంకటేశ్వర-నృసింహేశ'కృపను. 114

1. అర్జునునిఁ బరీక్షించుటకుఁ బరమేశ్వరుఁడు ఆటవికకిరాతవేషము ధరించిన వృత్తిచర్య. 2. వేదములు. 3. కశ్యపునికొడుకు (హిరణ్యకశిపుఁడు). 4. వక్షము. 5. (యజ్ఞఫల) దాతయు, (యజ్ఞ) భోక్తయు నగువాఁడు. 6. నక్షత్రములు-సూర్యుడు-చంద్రుఁడు నున్నంతమేరకు. 7. మహబూబ్ నగర్ జిల్లా. 8. ఆంధ్రభూమియందు.

ఉ. కూరెను లక్ష్మి నల్గడలఁ; గూర్చితి సజ్జనభోగ్యసంపదల్;
[1]ధీరుల నోర్చి [2]గెల్పుసిరిఁ [3]దేలితి నెల్లర వాదులందునన్;
సారముఁ [4]దేల్ప దక్ష మయి సన్నుతిఁ గాంచెదుప్రజ్ఞ మీఱుకా
శ్మీరబుధాళిగోష్ఠి త్వరఁ జెందుత నన్నిటమీఁద [5]నాదటన్, 105

శా. చెందం గంటి నృపప్రసాద[6]కణికన్; శ్రీలేశమున్ గంటిఁ; గా
సం తౌవిద్యను నేర్చితిన్; గుణగణం బాధార మై కొందఱ
న్నిందం జేసితి; నిట్లు జ్ఞాన మతి యెన్నే నేరముల్ సేసితి;
న్నెందం బిప్పుడు తేఁటతెల్విఁ గనె; వాంఛింతున్ [7]వియద్వాహినిన్.

చ. [8]పరిణతి, శాంతచిత్తమును బార్వతివల్లభునందు నిల్పి, యు
ద్ధురమరుదుద్ధతోర్మితతి [9]దూఁగుదుకూలముగాఁగ నొప్పు[10]నా
మరతటినీతటాంకమున మా నగుయోగసుషుప్తి, రక్తిఁ, బు
త్తురు కడవాసరంబులను, దూలఁగఁ బాపము పుణ్యమానవుల్. 107

శా. [11]స్వైరాఽభంగురభాగ్యమేఘ[12]చపలల్ సంపత్తులన్ నిల్ప నె
వ్వారున్ జాల: రసప్రయాణపటహధ్వానంబు శాంతింపఁ బో;
దీరల్ ! కీర్తిశరీరముల్ కృతిసుధావృష్టిన్ నిలన్ జేయుత
[13]ధీరాగ్రేసరులన్ మదం బుడిగి యెంతేఁ గొల్వుఁడీ ! భూభుజుల్!.

మ. నృపులారా ! కవులందుఁ బ్రేమ విడకుం; డెంతే సితఖ్యాతి మీ
కెపుడున్ వెల్గును దత్ప్రసాదముననే; హృష్టాఽత్ము లై రాముని
చ్చపుఁజారిత్రముఁ గూర్పరే ! కుపితు లై సర్వప్రపంచంబు గె
ల్చు[14]పులస్త్యాఽత్మజు హాస్యమార్గమునఁ బెల్లున్ గుందఁగాఁ జేయరే!.

1. వందితులను. 2. జయశ్రీ. 3. ప్రసన్నత నైతిని. 4. నిష్కర్షించుటకు. 5. ప్రేమముతో. 6. లేశము. 7. గంగానదిని. 8. వార్ధకమునందు. 9. చలించు. 10. గంగానది. 11. స్వేచ్ఛగాఁ బూర్తి నశ్వరములైన. 12. తటిత్తులు. 13. విద్వత్కవీంద్రులను. 14. పులస్త్యునికొడుకు (రావణుఁడు).



మ. తనస్వచ్ఛంద[1]కిరాతచర్యఁ గని విత్రస్తాఽత్మ యైనట్లుగాఁ
దనమౌళిస్థమృగాంకరేఖ, మృగమున్ దప్పించి ద ప్పుంచ, సొం
పునఁ గన్దేవుఁ డుమాధవుండు [2]నిగమంబుల్ రోల్తఁ బుట్టించువాఁ
డానరించున్ సుకవిప్రబంధసరణిన్, వ్యుత్పత్తి మీ కొందఁగన్.

తరల. సకలవిష్టపపాల ! వేంకటశైలశృంగవిభూషణా !
వికలదైత్యప[3]కశ్యపాఽత్మజపీన[4]వత్సవిదారణా !
అకలుషాఽశ్రితభక్తచిత్తవిహార ! సంసృతివారణా !
[5]సుకల! వేంకటశా ! నృకేసరి ! స్తోతృపాపవిశోషణా !. 111

భరతవాక్యము

క. అలరుత ! జగములు శుభముల;
వెలయుత ! వ్యుత్పత్తి భువిఁ గవిప్రవరులకున్:
దొలఁగుత ! సంసృతిబంధం;
బిల వైదికధర్మధీ, సమేధిత మగుతన్ ! 112

మ. కవు లౌ 'లక్ష్మణ-విశ్వనాథ'బుధు లీకావ్యంబు విద్వత్కవీ
శవినోదార్థము, 'మానవల్లి'కులవిశ్వఖ్యాతుఁ డౌ 'రామకృ
ష్ణ'విపశ్చిద్వరునాజ్ఞచేఁ దెలుఁగునన్ గావించినా; రిద్ది యాం
ధ్రవిపశ్చిత్కవికంఠహార మగుతన్ [6]దారాఽర్కచంద్రస్థితిన్. 113

తే. గీ. మహిత 'వనపర్తి'[7]'బాలమూ'ర్మండలమున
[8]నాంధ్రిఁ 'గప్పగంతుల'-'కౌశి'కాన్వయంబు,
'మాదిరాజు'-'కౌండిన్య'వంశంబు వెలయు
శ్రీశ 'వేంకటేశ్వర-నృసింహేశ'కృపను. 114

1. అర్జునునిఁ బరీక్షించుటకుఁ బరమేశ్వరుఁడు ఆటవికకిరాతవేషము ధరించిన వృత్తిచర్య. 2. వేదములు. 3. కశ్యపునికొడుకు (హిరణ్యకశిపుఁడు). 4. వక్షము. 5. (యజ్ఞఫల) దాతయు, (యజ్ఞ) భోక్తయు నగువాఁడు. 6. నక్షత్రములు-సూర్యుడు-చంద్రుఁడు నున్నంతమేరకు. 7. మహబూబ్ నగర్ జిల్లా. 8. ఆంధ్రభూమియందు.

# విక్రమాంక దేవ చరితము

## ప్రథమాశ్వాసము

### ఇష్టదేవతా స్తుతి

శా. శ్రీమద్వేంకటశైలశృంగవిలసచ్చింతామణిన్ గౌస్తుభ
శ్రీమత్పీతవిరాజమానవిభవశ్రీభూమివక్షస్స్థలున్
శ్రీమత్పద్మసరోవరాబ్జవసతిశ్రీదీప్తపద్మావతీ
శ్రీమాహాత్మ్యవికాసుఁ గొల్చెదము వాక్శ్రీసిద్ధికై యాత్మలోన్. 1

మ. కలిబన్నంబుఁ దొలంచఁగా మనమునన్ గాంక్షించి నిచ్చల్ ధరా
తలవైకుంఠము వేంకటాద్రిపయి భక్తవ్రాతముల్ గొల్వఁగా
నెల వైయుండి యభీష్టముల్ గరుణతో నిండారఁ బారించువే
ల్పులమిన్నన్ భజియింతు మంచితవచస్స్ఫూర్తిన్ బ్రసాదింపఁగన్. 2

సీ. సురభిళఘనసారశోభితోర్ధ్వశ్వేత
తిలకంబుచే సత్త్వతేజ మలర;
బహువిధమణిమయస్వర్ణభూషణములఁ
దేజరిల్లెడురజస్తేజ మమరఁ;
గస్తూరికాకర్దమస్తుత్యచిత్రక
తేజంబునన్ దమస్తేజ మొదవఁ;
త్రిగుణాత్మమాయాపరిత్యక్తసచ్చిదా
నందాఽత్మతత్త్వ మానంద మొలయ;

తే. గీ. నంజనాద్రి-వృషాద్రి-నారాయణాద్రి
ముఖ్యసప్తాద్రిశిఖరవిభూషుఁ డగుచు
వెలసి యున్నమాదేవుఁడు వేంకటేశుఁ
డీకృతిన్ బ్రోచుఁగాత సమేధితముగ. 3

శా. ఆనందాబ్ధినిఁ దేల్చునీశ్వరుఁడు కన్నారంగఁ దన్గన్నభ
క్తానీకంబుల, లోకలోచనుఁడు, నిత్యానందసందోహసం
ధానశ్రీమయభవ్యమూర్తి, మునిధ్యానైకగమ్యుండు కా
వ్యానన్ నిల్చుచు వేంకటేశ్వరుఁడు విఘ్నౌఘంబు ని[1]ఘ్నించుతన్. 4

కం. శ్రీవేంకటగిరివాసుఁడు
సేవాఽఽహితభక్తకోటిచింతారత్నం
బీ "విక్రమాంకచరితం"
బేవిఘ్నము లేక పూర్తి నెయిదఁగఁ బ్రోచున్. 5

కం. భక్తాఽవళిమందారుఁడు
ముక్తిప్రదుఁ డఖిలవేదమూర్ధన్యుఁడు శ్రీ
రక్తుఁడు వేంకటభూధర
సక్తుఁడు మాస్వామి ప్రోచు సత మీరచనన్. 6

ఉ. శ్రీసతి తన్ను మేలమునఁ జేరి యి దేల యుర్విన్ సురారులన్
వేసము మాఱి మోసమున బీర మడంతువు? క్షాత్ర మౌనె? నీ
వేసవి శౌరి వౌదు? వన దృప్తరిపుక్షతి కిద్ది ధర్మ మా
నోసుమగాత్రి! యంచు ముద మూన్చుముకుందుఁడు ప్రోచు నీకృతిన్. 7

ఉ. శ్రీదయితుండు నిచ్చలు వసించుట నెల్లెడఁ దెల్లఁ జేసి క్ర
వ్యాదపునాస్తికత్వ మడు గంటఁ బరాత్పరువాస్తవంబుఁ బ్ర
హ్లాదునిబాధలన్ దొలఁచ నైనతఱిన్ దిర మొందఁ దాల్చు స్తం
భోదితమర్త్యసింహతను పూన్చుత నీకృతి కవ్యయస్థితిన్. 8

ఉ. ఆకృతులందు గర్భభవ మై నరవర్తన డాయులోపముల్
లేక స్వయంబుగా నిల నిలింపరిపుక్షతికై జనించి, తాఁ
బ్రాకృతలీలఁ జూపి, యనపాయతఁ గూర్చునృసింహమూర్తి మా
వాకులయందు నిల్చి యనవద్యకవిత్వమహత్త్వ మిచ్చుతన్. 9

1. ఇది 'హననము చేయుఁగాక' అను నర్థమునందు స్వతంత్రప్రయోగము.



చం. జపతపముల్ క్రతుక్రియలు సర్వము నిన్ గనఁ జేయఁ బోవు; ని
ష్కపుదృఢభక్తిమైఁ గొలువఁ గల్గెడుభక్తజనంబు లిచ్చఁ గో
ర్వపువున గోచరించి యల భక్తవశిత్వము వెల్లడింతు; వ
శ్రపసుతభక్తి మెచ్చవె; ప్రసన్నతఁ గూర్చుమ! మర్త్యసింహమా! 10

చం. తనయన్నన్ గిటి యై వధించె నసుక్రోధం బేచఁగా రోసి యెం
దును దాఁ గాంచనితంత్రికిన్ హరిపదస్తోత్రంబుచే నెల్లయం
దును శ్రీనేత వసించు నన్సుతుని 'నిందున్ జూపు' మం చక్రపుం
[1]దనుకోపుం డయి స్తంభతాడనముఁ జేయన్ బుట్టురూ పోముతన్. 11

చం. పొలఁతి మొగంబులన్ నలువ పూన్పఁగ విజ్ఞులఁ బొందు: వెన్నుఁడున్
జెలి నురమందు నిల్పఁ బరసీమలఁ జేరుఁ; దథావిధంబు నీ
వల కని పోలు మేసగమునందుఁ దవిల్చితి; జాణ వంచు నే
ర్పలవడఁ బల్కుగౌరి స్మితుఁ డై కనుశంకరుఁ డోము నీకృతిన్. 12

చం. ఇలఁ బడుగంగ నౌదల వహించితి క్రొవ్వల పాటఁ బెక్కుపో
కల నిను మీఱి జాలి వలకైపున వారిధిఁ గూడు చుండినన్
దొలఁచవు; పల్లవాధ్వ మిది తొయ్యలి కౌవగనేన్ గణింప నం
చలుక వచించుగౌరిఁ బ్రణయంబునఁ దేర్చుశివుండు మే లిడున్. 13

చం. స్థితి హరికిన్ బ్రశస్తి నిదె; భేదము నా కిదె దూఱు; నచ్యుత
స్థితిఁ గన దూఱు వోవు నను చిత్తమునన్ దలఁ దాల్చి గంగఁ గూ
ర్చితివి సపత్నిపోరు; నహిఁ జేర్చి బెదు ర్గనఁ జేసి తంతె, త
త్స్థితిఁ గన వంచుఁ బల్కునుమఁ దేర్చుహరుండు కృతిన్ గనుంగొనున్.

సీ. పల్లజడలనిన్ను వరియించు నేచెలి?
తపమున జడ లీవు దాల్ప లేదె!
గట్టుపట్టగునిన్ను గైపట్టు నేచెలి?
గట్టుపట్టున నీవు పుట్ట లేదె!

1. అనుగలకోపుఁడు.

కరిచర్మవసను నిన్ గదియు నెకోమలి ?
గతి-కుచస్థితి నీకు గజత లేదె !
కన్నవారలె లేనినిన్ను గోరు నెవతె ?
నీ తల్లి కోరెఁ గా నీ జనకునిఁ;

తే. గీ. దొలఁగఁ జేసితి రూపరిఁ దుంటవిల్తు;
మెలఁగఁ జేసితి చూపున మేలుకొలిపి;
యనుచుఁ దమలోని లోప-సామ్యములు వలికి-
కొనెదు తొలిజంట కావ్యంబుఁ గనుఁ జిరంబు. 15

సీ. గ్రహియించితిని గోరి కదలిఁ బొడమిననిన్;
వరియించితినె స్వయంవరవిధమున ?
గాంధర్వవిధిఁ గొంటిఁగా యనఁ జెల్లదే !
యిరువురిప్రేమ లెయ్యెడలఁ గూడెఁ ?
గదలిఁ బుట్టిననీకు క్షత్రియవిధి యేల ?
కదలిపదఁతి నీకుఁ గలిగెఁ గాదె !
యురమున నిమఁ బ్రేమ నిరవుకొల్పితిఁ గాదె !
సామేన సతి నిల్పుశర్వుఁ గనవె ?

తే. గీ. చంచలానన్నిభాంగసౌష్ఠవ మ దెంత ?
మొగులుకప్పునఁ జొప్పడుమురిప మెంత ?
యనుచుఁ గేళిపరత మేల మాడుకొనెదు
శ్రీహరిద్వంద్వ మెపుడు రక్షించుఁ గృతిని. 16

సీ. అతివ ! యెంతటిపుణ్యవతివి శౌరి మగండు;
శౌరి తూ పయినయీశ్వరుఁడ శౌరి;
మత్తదైత్యారి యో మానిని ! నీ భర్త;
అతిహరిదైత్యసంహరుఁడ హరుఁడు;



సురలకు సుధఁ బంచి స్తుతిఁ గాంచె నీహరి;
విష మాని సురపతిఁ [1] బేర్చె హరుఁడు;
భువి లీలఁ బ్రకటించె మూ ర్తు లూని ముకుందుఁ;
డఖిలంబు హరుఁడ మూర్త్యష్టకమునఁ;

తే. గీ. గననియున్నతి లక్ష్మి ! వాకొనుట తగవె !
తచ్చు నెచ్చనఁగా గౌరి ! ధర్మ మగునె !
యనుచుఁ దుద కేకనామవర్తనత నమత
నెలమిఁ గనెదు వృషాకపాయి కృతి నరయు. 17

## సరస్వతీస్తుతి

ఉ. పట్టపుదేవి యై నలువవక్త్రములన్ నటియించి, తన్వి లే
నట్టులఁ బుట్టపట్టిముఖమందున, దీవినిఁ బుట్టువానివా
మట్టునఁ దూఁగి, పిమ్మట సమస్తకవీంద్రరసనాగ్రపాళిఁ గ
న్పట్టి ప్రశస్తిఁ గూర్చునుడినాతి నటించుత మాదునాలుకన్. 18

మ. చతురాస్యాఽస్యచతుష్టయంబున సదా సాన్నిధ్యమున్ బొంది; గీ
ష్పతిముఖ్యాఖిలవిద్వదాస్యనటనప్రావీణ్యమున్ జూపి, యు
న్నతము క్తాఽఽసనసన్నిష్ణ యయి, వీణాపాణి యౌ శ్రీసర
స్వతి మావాక్కుల సర్వదా నిలిచి కావ్యం బోము నెవ్వేళలన్. 19

మ. గురునొద్దన్ గళ లభ్యసించి కవితన్ గోర్వారికే నంద రా
కురుభక్తిన్ త్వదుపాస్తి సేయ వశ మై యుత్సాహమున్ గూర్తు; వ
క్షరముల్ నేర్వనివాని కేనిఁ గవితాసారస్వతప్రక్రియల్
వరఁగెం బో తనకైత నిన్ గొలుచుటన్ భాషాసతీ ! మా[2]ద్రియై. 20

శా. గీర్వాణాంధ్రములన్ బఠింప మురుశక్తిన్; శాస్త్రవిజ్ఞానమా
నేర్వన్ లేదు; ప్రబంధపక్కి ననుసంధింప న్గనన్ జాలమే;
మర్వాచీనపురాణసంగతకృతివ్యాసంగమా సున్న; నీ
నిర్వక్రాశ్రయ మూని పూనితిమి వాణీ ! యీకృతిన్ గూర్పఁగన్. 21

1. అతిశయింపఁజేసె, 2. సామ్యమము.

సీ. అజచతుర్ముఖముల నాడుచు నామ్నాయ
పరిణతిఁ బరఁగించు పాటవంబు,
వల్మీకజ-వ్యాసవరకవితాలతఁ
బ్రబలించి ఫల మూన్చుప్రౌఢిమంబుఁ,
కాళిదాసాదిసకలసంస్కృతప్రబం
ధకవుల నేలుని స్తంద్రకరుణ,
నన్నయాద్యాంధ్రనానాకవీశానుల
నిలఁ గీర్తిఁ గనఁ జేయునే ర్తెఱయును,
తే. గీ. గరుణఁ గ్రోడీకరించి విస్తరిలఁ జేసి
మమ్ముఁ గించిజ్జ్ఞులన్ సర్వమాన్యులుగను
నిలిపి మాపూనుకృతిని నిర్నిద్రరీతి
నిలువు మాదండ నండ యై పలుకుతల్లి! 22

## వినాయక స్తుతి

మ. హరి యైనన్ హరుఁ డైన వారిజభవుం డైనన్ బులోమాత్మజా
వరుఁ డైనన్ బనిఁ బూని తొల్త నినుఁ గొల్వన్ గొప్పయే మాదృశుల్;
వరభక్తిన్ నిను గొల్వ కుందురె! శుభప్రారంభవేళన్ ద్విపే
శ్వరవక్త్రా! చన బన్నముల్ విమలవాచాశుద్ధి మా కూన్చుమా! 23
ఉ. బ్రహ్మకు బ్రహ్మచర్యమున భారతిబంధుత లోటు నాటె; నా
జిహ్మగశాయికిన్ వటుత చెన్నతె వంచన వంచ నబ్బలిన్:
జిహ్మగభూషణుండు పొలిచెన్ గుహనావటుకాఖ్యఁ గందునన్;
జిహ్మత లేక నీవటుత చెల్లు గణేశ్వర! సాటి లేకిలన్. 24
ఆ.వె. ఏకదంతరుచి ననేకవిఘ్నంబులఁ
గడఁగఁ ద్రోచి సర్వకార్యసిద్ధి
ముజ్జగంబులకును మొదలఁ జేసెడివినా
యకుఁడు కృతినిఁ బ్రోచు నాదరమున. 25



## పూర్వకవిస్తుతి

మ. నిగమాద్యాద్యకృతిప్రబద్ధ మయి క్షోణిన్ లేనిఛందఃప్రభా
వగరిష్ఠం బగుకైత రామచరితప్రాశస్త్యగానామృతా
నుగతిన్ నైజమహత్త్వ మీజగతిఁ దెన్నుల్ గాంచఁగా జేయువి
శ్వగకీర్తిస్థిరు నాకుజున్ గొలుతు మిచ్ఛన్ ధీరమాసిద్ధికై. 26
మ. రసనావ్యాప్తపురాణముల్ సరసధారాగ్రంథసంతానముల్
రస నానాఘలతాలవిత్రములు నిర్వాణప్రదంబుల్ సుధీ-
రసనానర్తన సల్పుభారతకథాగ్రంథంబు నాచంద్రసా
రసనాథంబుగ నిల్పెఁ; గొల్చెదము పారాశర్య వాక్సిద్ధికై. 27
ఉ. ఆర్షకృతిస్థవస్తువుల నంది, యనింద్యమహత్త్వ మూన్చి; యు
త్కర్షత వర్ణనల్ రసవికాసములున్ సదలంక్రియల్ సుధీ
హర్షము లధ్వదర్శనము లై తగి నాటకకావ్యఫక్కి దు
ర్ధర్షతఁ గూర్చుసంస్కృతబుధప్రకరంబు నుతింతు మాత్మలోన్. 28
ఉ. సన్నుతసంస్కృతోక్తినిఁ బ్రచారముఁ గాంచినభారతంబు మే
ల్తిన్నని తెన్గుబాసపయిఁ దెన్గుజనుల్ చవిఁ గాంచి యందు మై
కొన్నవినీతిఁ బావనతఁ గూర్చి తెనుంగుకవిత్వమున్ మొదల్
తెన్నుగ నిల్పునన్నయను దిక్కనఁ గొల్చెద మెల్లప్రెగ్గడన్. 29
మ. నయ మొప్పంగ మిగుల్పురాణములు మున్ జన్నన్నయాదుల్ మొద
ల్కయి సేయంగలమార్గ మూని ధరణిన్ గల్యాణముల్ గూర్చి దు
ర్జయ సంసారసముద్రతారకము లై రాజిల్లఁగా నిల్పుధీ
మయ శ్రీనాథునిఁ బోతనాదులను నాత్మన్ గొల్తు మశ్రాంతమున్. 30
శా. విశ్వశ్రేయము కావ్య మన్నది జగద్వేద్యంబు; యాభంగి న
వ్విశ్వస్తుత్యులు కాళిదాసముఖు లుర్విన్ దెర్వుగా నిల్పఁగా
శశ్వద్రీతిఁ బ్రబంధముల్ తెలుఁగునన్ స్థాపించుసూరీంద్రులన్.
విశ్వాసంబునఁ బెద్దనాదుల మొద ల్పేర్కొందు మీ సత్కృతిన్. 31

శా. పాశ్చాత్యోక్తియె పారశాలలఁ గఱుఁ బ్రాముఖ్యముఁ జెందఁగా
దుశ్చింత్యస్థితి సంస్కృతాంధ్రములు పొందుఁ డింద కాసక్తి వై
పశ్చాత్యాఽథ్యము గాన్ బరీక్షల సభన్ బ్రాగ్గ్రంథటీకాఽదులన్
నైశ్చల్యంబుగఁ దీర్చునట్టిబుధులన్ ధ్యానింతు మిచ్చన్ సదా. 32

## అసదాక్షేపము

సీ. సంస్కృతపదసమాసఘటితకవితపైఁ
బామరాగమ్యతఁ బలుకువారిఁ,
తెలుఁగుపల్కులముద్దు లొలుకుకైతనుగూర్చి
పండితశ్లాఘ్యతఁ బలుపువారి,
మిశ్రభాషగ నాంధ్ర మాశ్రయించినకైత
వరిపెర్వకూ ర్పని వాడువారి,
నైఘంటికము లయినను దా మెఱుంగక
మూలపదము లని మ్రోగువారి,

తే. గీ. నర్థిఁ బ్రార్థింతు మీసుఁ బోనాడి నెమ్మిఁ
బాషికోక్తిని విడి చిత్తసాక్షికముగ
నొప్పుతప్పుల గుఱితించి మెప్పుఁ దీర్చి
శ్రేయ మొందఁగ బారతీసేవనమున. 33

సీ. బదులుపల్కుల భావభంగంబు శంకించి
వడిప్రాసముల దిగ విడుచువారు,
వర్ణభేదమున నన్వయభేద మగు నని,
సంధ్యనుస్వారముల్ సడలువారు,
వస్తు వవస్తు వై పరఁగు నం చుత్ప్రేక్ష
బాఽద్యలంకృతులఁ బోనాడువారు,
రసగుంఫనమున నీరస మగు ననుచు శృం
గారాఽదిరసముల దూఱువారు,



తే. గీ. ప్రౌఢకవితను మో టని భావకవిత
మిట్టి మిన్ బ్రాఁకి తెరువేది మిడుకువారు
తమదునేరమియే కారణముగ: మేము
పూర్వఫక్కిఁ గృతిన్ గూర్ప మొదలిడితిమి. 34

చ. కవితకు మూల మౌఁ బ్రకృతి; కల్పన యప్ప్రకృతిన్ శ్రయించుఁ; బ్రా
క్కవులు నిసర్గమున్ గడకఁ గైకొని కావ్యములందుఁ గూర్పఁ గ్రొ
క్కవితఁ దదీయకల్పనవికారము నూన్చినఁ జౌర్య మౌ నెటుల్ ?
ప్రవిమలచాతురీమహితభావలసత్కృతిఁ గూర్పఁ గానమిన్. 35

చ. కొలఁదిగ వాచకా ల్పదివి కొద్దిగ గొప్పలుగాఁ బరీక్షకై
నిలిపినకావ్యభాగములనే యెటులో కడఁగాఁ గనుంగొనన్
గలిగి తరించి తద్విరుదకాండములన్ గడియించినంతనే
కలితసువాగలంకరణక్రమరసజ్ఞుఁడుగాఁ జెలంగునే ? 36

ఉ. కన్నులముందు భావములు గ్రాలక తద్రచనాప్రభావసం
పన్నత కైనవాక్పటలి పైపయిఁ దా నయి కాన రాక, మీఁ
ద న్నుతరీతి నెత్తుఁబడి దట్టక గంటముఁ జేతఁ బూనినన్
మిన్నులు సూచుచే యగు నమీ! తుది ముట్టునె కైత లెంతయున్. 37

ఉ. మూలపదంబు లంచుఁ దమబుద్ధికిఁ దట్టినిమాత్రఁ బల్కుచున్
జాలిగ లక్ష్యముల్ దెలియఁ జాలక లక్షణ మాశ్రయించి కా
వ్యాఽఽపరిచితిన్ గనక యద్దులు పల్కి నిజాజ్ఞతల్ బయ
ల్పాలుగఁ జేయుచే యగు; సెబా సని యందురె సత్కవీశ్వరుల్. 38

## కుకవినింద

ఉ. చెట్టునమండి క్రిందుగ వసించినసజ్జనుపైననేనిఁ దా
రెట్టను వీడుచే నహజరీతి గణించెదునేకదృష్టి యై
దిట్టతనంబుఁ గైతఁ గలతీయఁదనం బరయంగ లేక పై
పట్టున నిల్చి రట్టులను వాగెడుకాకవి యేల పుట్టెనో ! 39

మ. నృపమార్గంబున శీవిఁ బోవఁ గని యెంతేఁ గుక్క లార్వన్ మద
ద్వీప మింతైనఁ గలంగునే! తనదుగాంభీర్యంబుఁ దగ్గించునే!
సపదిస్ఫారకవిత్వధోరణి గతిస్ఫాయత్కవీభంబు ర
థ్యపయిన్ ఘీంకృతి సల్పుచో నిలుచు నేలా కాకవిశ్వానముల్. 40

మ. భవసంబంధతమోవిలుంఠనచణావ్యాజప్రభాయుక్సుధీ
రవి భాషాకిరణప్రసారణములన్ రంజింప లోకంబుఁ, ద
చ్ఛవి సైరింపక గొంది దాఁగికొని దోషావేళ మున్ నిక్కు కా
కవిఘూకంబులు నిర్జనైకవసతిన్ గా కన్యమున్ గాంచునే? 41

## మా ప్రతిజ్ఞ

కం. తలతలగా మునుపటికై
తలవలె వ్రాయంగ లేక తద్రీతులు వోఁ
బలికెడువారికళాఽఽప్తికిఁ
దులగాఁ గొలగా రచింపఁ దొడరితిమి కృతిన్. 42

## గురుస్తుతి

సీ. ప్రవిమలౌపనిషదాద్వైతభాస్కరుఁ డాద్య
శంకరభగవదాచార్యవరుఁడు,
భగవద్రమణుఁడు జీవన్ముక్తమౌనీంద్రుఁ,
డన్యు లద్వైతపీఠాధిపతులు,
'శారదా' 'కామకోటీ' రమ్యపీఠాధి
నేత లద్వైతాధినేతృవరులు,
నన్యులు సంస్కృతాంధ్రాఽది విద్యలయందుఁ
ప్రనిశితశేముషీప్రథితగురులు



తే. గీ. ఎల్లరను భక్తితో స్మరియించి వారి
పాదయుగళాంబుజములకుఁ బ్రణతి సేతు
మస్మదీయకావ్యంబు నిరంతరాయ
ముగ సదా నెలకొనుటకై జగతిలోన. 43

మ. అతులప్రజ్ఞుఁడు 'మానవల్లి' కులదుగ్ధాంభోధిచంద్రుం డనా
రతసాహిత్యతపస్సమాహితుఁడు గీర్వాణాంధ్రసౌహిత్యసం
హితుఁ డస్మద్గురుఁ డాంధ్రసాహితిని మా కీకావ్యమున్ వ్రాయ నా
నతి యిచ్చెన్, బుధ 'రామకృష్ణకవికి' న్సాష్టాంగనత్యంజలుల్. 44

## లక్ష్మణశాస్త్రి వంశావళి

సీ. వేదవేదాంగాఽదివివిధశాస్త్రముల ని
ష్ణాతులు భువి వెలనాటివారు,
శ్రౌతధర్మాఽగమస్మార్తవిధానవి
జ్ఞానులు ధర వెలనాటివారు,
రాజకీయాధికారప్రాజ్యసంస్తుత్య
నయపారగులు వెలనాటివారు,
ప్రాచ్య-ప్రాశ్చాత్యశాస్త్రప్రఖ్యవిద్వదు
న్నతిసమున్నతులు వెలనాటివారు,

తే. గీ. అట్టివెలనాటి విప్రశాఖాంగ మైన
"కప్పగంతుల" తెగలోనఁ గౌశికాన్వ
వాయవిబుధులు 'వనపర్తి' పత్తనమున
వెలయువా రాంధ్రమున విశ్రుతులుగఁ జెలఁగి. 45

ఉ. ఏముని యింద్రనిర్జరదిగీశుల నన్యుల నన్యలోకముల్
[1] తామస మింత లేక విభుతన్ సృజియింపఁ గడంగె; ఘోర మౌ
నేమముఁ బూని బ్రాహ్మణమునిత్వముఁ గాంచెను; నట్టి సన్ముని
గ్రామణి మత్కులాగ్రజుఁడు గాధిజుఁ డొప్పు నగాధసత్త్వుఁ డై. 46

1. ఆలస్యము.

ఉ. ఆకులమందుఁ బుట్టిరి మహామహితాఽత్ములు, పౌండరీకయ
జ్ఞాఽకలనప్రదీనిధులు శాస్త్రసదర్థనిధుల్ సమస్తవి
ద్యాఽకృతు లాగమోక్తసవనాఽదివిధానవిచక్షణుల్ పవి
త్రీకృతవిగ్రహాఽత్ము లతిథీకృతనిర్జరు లబ్జజప్రభుల్. 47

సీ. వారిలో వెలసె 'సుబ్బాభట్టుఁ,' డతఁడు 'కృ
ష్ణంభట్టుఁ గనియె విజ్ఞానఖనిని,
బడసె నతండు 'సుబ్రహ్మణ్య' నామకు,
నాతని పుత్రత్రయంబునందు
నగ్రపుత్రుఁడు 'లక్ష్మ' యాభిధుం, డాతఁడు
వడసె సూనుని 'శ్రీనివాస' విబుధు,
నల 'రామనాథ-కృష్ణార్య-లక్ష్మణశాస్త్రు'
లాత్మజు లాతని కైరి మువ్వు

తే. గీ. రల కనీయుఁడ నే 'లక్ష్మ' ణాభిధుండ
నాంధ్రగీర్వాణసాహితీవ్యాకృతులను,
నుభయభాషాకవిత్వసముజ్జ్వలతను
బార మెయిదితి గురులయ్యపారకరుణ. 48

మ. వరుసన్ మత్ప్రపితామహార్హ్యణుల 'సుబ్రహ్మణ్య - సుబ్బాంబలన్'
మఱి మాతామహ 'లక్ష్మమాంబ - బుధలక్ష్మ' య్యాఖ్యులన్ బూజ్యులన్
వర 'శ్రీవత్స' సగోత్రులన్ దలఁచెదన్ థ 'వ్యాత్మకహా' ర్యాసులన్
'పెరవ' ల్లన్వయులన్ శ్రుతిస్మృతిహితప్రేష్ఠాధ్వరప్రజ్ఞులన్. 49

క. సతి 'నరసమ' 'లక్ష్మయ' మ
త్పితామహుల 'శ్రీనివాసు' స్థిరమతిఁ 'బద్మా
వతి' మత్పితరులఁ దలఁచెదఁ
గృతిమొదలన్ 'రామనాథ - కృ' ష్ణాగ్రజులన్. 50



క. 'వామననాయకుఁడు' సుత
ప్రేమన్ బోషించి నన్ను, విద్యాబుద్ధుల్
నేమముతో నేర్పెను; నే
నామహితునిఁ గృతినిఁ దలఁతు నతిభక్తిమెయిన్. 51

గీ. అన్నపూర్ణకు నుద్దియౌ "నన్నపూర్ణ"
ధర్మపత్నికిఁ గల్గెఁ బుత్రత్రయంబు,
నందుఁ బాశ్చాత్యవైద్యవిద్యాచణుండు
జ్యాయుఁడు "ప్రభాకరుఁడు" శారదాఽహితుండు. 52

గీ. "కమల" రెండవసంతతి యమరభాష
నరసి నేర్చినవిదుషి, విద్యావినోద,
చతుర, చతురాఽత్మజామణిసహిత యగుచుఁ
బతి 'రఘుపతి' మనం బారఁ బ్రబలి మెలఁగు. 53

గీ. మత్కనిష్ఠాఽత్మజుఁడు ధాత్రమాన్యుఁ డైన
"కృష్ణమూ" ర్త్య భిధానుండు, క్రీడలందుఁ
విద్యలందు సాంకేతికవిద్యలందుఁ
'జతురవిద్యార్థి' యనుపేర సాగు చుండు. 54

లక్ష్మణశాస్త్రి గురుస్తుతి

చ. తిరుపతి వేంకటేశ్వరుల దివ్యపదంబున శ్రీచిదంబరే
శ్వరుపురి సాహితిన్ మఱియు వ్యాకరణంబుఁ బఠించి యంతఁ ద
త్పరతఁ బఠించితిన్ బరమతత్త్వము వేదశిరఃప్రపంచ మే
నరయఁగ మద్రపత్తనమునందున సద్గురుసేవ సేయుచున్. 55

సీ. 'కృష్ణమాచార్యుఁడు నిష్ణాతుఁ డఖిలశా
స్త్రములందుఁ 'బరిశి' వంశసితరోచి,
'సేతుమాధవుఁడు' ప్రఖ్యాత 'మహామహో
పాధ్యాయుఁ' డహిపతిఫణితిచణుఁడు,

'కృష్ణశాస్త్రి' విశిష్టకీర్తి 'మహామహో
పాధ్యాయుఁడు' 'కరుంగు' శాలిజనుఁడు;
కృతి 'రామచంద్ర దీక్షిత' 'వేంకటేశ్వర
దీక్షితు' లద్వైతశిక్ష గురులు,

తే. గీ. నరయఁ 'జక్కాల నరసింహ'- 'గిరిధరార్య'
ముఖ్యసురభారతీగురుముఖ్యు; లెల్ల
రను హృదిన్ సంస్మరించి ప్రశ్రయముతోడ
నతిశతంబు సమర్పింతుఁ గృతిమొదలన. 56

తే. గీ. పారశీక - మహారాష్ట్ర - భవ్యతమిళ-
కన్న - డాంగ్ల - హిందీభాష లున్నతముగ
నేర్చి రచనలు సేయఁగా నేర్పినాఁడ
నస్మదాచార్యపాదపద్మాఽశిషముల. 57

ఉ. ము న్నల 'హైద్రబాదు' న సమున్నతి నున్న 'వివేకవర్ధనిన్'
బన్నుగ నంత మాదు 'వనపర్తిని' నున్నతపాఠశాల యం
దున్నతి నాంధ్రబోధన నియుక్తుఁడ నై యట రాట్సభాబుధ
ప్రోన్నతిఁ గాంచి యన్నిట మహోజ్జ్వలకీర్తి గడించి మించితిన్. 58

క. వనపర్తిని 'రామేశ్వర'
జనపతి యాస్థానకవిగ సన్మానించెన్
నను; గడఁకను విద్యాలయ
మున సభయందును యశంబు మునుకొని కంటిన్. 59

క. నాయున్నతి చూపోప క
సూయాపరు లంత నృపతిశ్రుతిఁ గొండెములన్
వాయోదక నుడివినఁ దా
నేయోచన సేయకుండ హీనతఁ గనఁగా. 60



ఉ. నే నట నుండఁ జాలక యనింద్యుఁడ నౌట మనోఽభిమానమున్
బూనుచు వీడి మాపురిఁ, బ్రభుత్వపురోన్నతపాఠశాలలో
మానుగ నాంధ్రపండితసమర్హణఁ గాంచితి హైద్రబాదులోఁ
బ్రాణముకన్న మానమె వరం బగుఁగా మహి మానికోటికిన్. 61

ఉ. ఆరహి నాంధ్రపండితుఁడ నై యట నుండఁ బ్రభుత్వపున్ 'సమా
చారవిభాగ' మందు బుధసన్నుత 'విద్యలశాఖ' లో మనం
బార సమున్నతాధికృతి నంది తెనుంగును సంస్కృతంబునున్
వే ఱగుభాషలన్ గొలిచి విశ్రుతిఁ గాంచుచు నుంటి వేడ్కమై. 62

క. పన్నుగ నస్మద్విద్యను
విన్నాణము దెలిసి నన్ను బ్రియ 'రామేశుం'
దున్నతసంస్కృతగీర్వి
ద్వన్నుతపదమందు నిలిపెఁ; దలఁచెద నతనిన్. 63

మ. అల వారాణసి సంస్కృతీయఘనవిద్యావిశ్వవిద్యాలయ
స్థ లస 'చ్ఛిష్టసదస్యతన్' వివిధవిద్యాసంస్థలన్ సభ్యతా
విలసత్ఖ్యాతి గడించి యాంధ్ర-సురగీర్విఖ్యాతకావ్యక్రియా
కలనాఽత్తస్థిరకీర్తి లక్ష్మణుఁడ నేఁ గాంతున్ మృడానీకృపన్. 64

విశ్వనాథరావు వంశాఽవళి

సీ. వంశపరంపరావర్ధితలౌకిక
వ్యవహారవిజ్ఞతఁ బఱగువారు,
సమయోచితక్రియాసాధనోపాయమ
నీషావిశేషాఽప్తి నెగడువారు,
దీనావనాఽసక్తదృఢకృపాపారీణ
తాఽలంకృతమనస్కు లైనవారు,
ప్రాణభయాఽగతప్రాణిలోకాభయ
దాతృత్వశస్యు లై తనరువారు,

తే. గీ. దేవ-భూదేవపూజాఽఽప్తదివ్యదీప్తి
జన్మపావనచర్యాప్రసన్నభువన
శంశనీయులు నిస్సమసారమతులు,
విదితగతి నొప్పువార లార్వేలవారు. 65

సీ. సతతరజస్తమోయుతభూపతిప్రజా
వైరావనోదనప్రతిభ గల్గి,
లేఖనీనిస్త్రింశలీలాకవిత్వసం
గ్రామసమానవిక్రమము గల్గి,
యర్థార్థివస్తుదానాఽస్థానసంగత
కార్యాఽత్తనైశ్చల్యగరిమ గల్గి,
మంత్రతంత్రజ్ఞతామహిమప్రకంపితా
రాతిరాడ్బలపరాక్రమము గల్గి,

తే. గీ. స్వామిహితకార్యనిర్వాహచణవిచక్ష
ణాతిశయభక్తిసంభావితాంతరంగ
రంగదుత్సాహసాహసప్రభుత గల్గి
వెలయువారలు పృథివి నార్వేలవారు. 66

మ. పరశాఖాభవు లౌనియోగిజనముల్ ప్రాబల్య మొప్పార భూ
వరులన్ జేరి యమాత్యముఖ్యపదవీభ్రాజిష్ణు లై వచ్చినన్
స్ఫురదాత్మప్రభు లై యమాత్యముఖు లై సొం పొంది రార్వేలవా
ర రహిన్ బ్రెగ్గడ-మం-త్ర్యమాత్య-సచివప్రాజ్యాఽఖ్యలన్ మేటు లై. 67

ఉ. ధన్యత మీఱునీతెగ నుదారమనీషిత 'మాదిరాజు' 'కౌం
డిన్య' సగోత్రుఁ డప్పటికడిందిసుధీజనులందు మేటి యై
మాన్యతఁ గాంచెఁ; దత్కులజమండలి దెల్గుధరిత్రి ధీరమూ
ర్ధన్యత విచ్చె నం దొకపరంపర వచ్చి స్వమందిరంబుగన్. 68



ఉ. ధన్యత మీఱునీతెగ నుదారమనీషిత "మాదిరాజు" 'కౌం-
డిన్య'సగోత్రుఁ డప్పటికడిందిసుధీజనులందు మేటి యై
మాన్యతఁ గాంచెఁ దత్కులజమండలిఁ; దెల్గుధరిత్రి ధీరమూ
ర్ధన్యత విచ్చె నం దొకపరంపర వచ్చి స్వమందిరంబుగన్. 68

చ. మును జనమేజముం డలిగి పూన్చినపన్నగయాగకారణం
బునఁ దనుఁ బొందుకిల్బిషము వోవఁగఁ 'గాశి' మొదల్గ సేతువం
ద నిలుపుదేవళంబుల నుదార మొకం డగుకేశవాఽలయం
బున నుతిఁ గాంచుమేటిపురమున్ 'మిడుతూరు' నొనర్చి యచ్చటన్. 69

చ. వరకవితావిలాసయుతి భాసిలుచున్ వ్యవహారపద్ధతిన్
బురుడు గనంగ లేక యసముల్ మహితాఽత్ములు విశ్వసంస్తుతి
స్ఫురణ వహించి యాకులముప్రోడలు కీర్తిమయాఽత్ము లైరి యీ
వరుసను 'వేంక'యాఽహ్వయుఁడు వాసిఁ గనెన్ సతి 'సుబ్బమాంబ'నాన్.

క. అతఁ డాసుబ్బమసతియం
దతిచతురుల సుతులఁ గనియె నార్వుర సుత నొ
క్కతె; వారలలో నగ్రజుఁ
డతులగుణుం డలరె 'దత్త'యాఽఖ్యుఁడు కవి యై. 71

క. అతనికి వెనుకగఁ 'గన్నయ'
సుత 'కొండమ' 'లక్ష్మనాథ-సుబ్బయ'లు క్రమ
స్థితి 'రామరాజు' బుధవం
దితుఁ డగు 'విధుశేఖరుండు' నెగడిరి సుతు లై. 72

ఉ. ఆసుతషట్కమందు సుగుణాఽఢ్యుఁడు ధీరుఁడు రామరాజు వి
ద్యాసముపాఽర్జనంబునకు నై తనసోదరి కొండమాంబయా
వాసము 'తక్కశీలఁ' జని, వాసినిఁ గాంచెడు 'సంజి' వాఽహ్వయున్
ధీసముపేతు బావ సముదీర్ణవినీతినిఁ జేరి శిష్యుఁ డై. 73

క. నేరిచె నాకవితల్లజు
చేరువ గణితాగమంబు శిష్టపురాణ
ప్రారజ్యద్వక్తృతయున్
సారాంధ్రగ్రంథవిమలసాహిత్యంబున్. 74

తే. గీ. దిట్టతనమునఁ జేరువ ఘట్టకుట్టిఁ
జేరి యచ్చోటను గచేరివారికెలనఁ
గఱచె మరఠీలిపిన్ వ్రాయఁగాఁ బఠింప
వరుసఁ గచ్చేరిపనులఁ దీర్పంగ నంద 75

సీ. "పెనుబాల"వంశజోర్వీపాలపాలిత
'వనపర్తి' సంస్థానపశ్చిమాన,
జనఘనకిల్బిషశమనసామర్థ్య 'కృ
ష్ణా' ఽఽపగోదక్తటాభ్యాశసీమ,
వర్ణాఽశ్రమాఽచారపరచతుర్వర్ణప్ర
జాఽఽవళీసాధితైకాఽలయంబు,
గ్రామప్రజాసుఖప్రాపణప్రవణతా
భ్రాజిష్ణుకేశవప్రాంగణంబు,

తే. గీ. నైన 'శాఖాపురంబు'న నమలభక్తి
శ్రీనృసింహాంఘ్రికమలసంసేవనమునఁ
జెలఁగు చున్న'నియోగి'వంశీయుఁ డసమ
ధీయుతుం డగు'శేషయ' తేజు మీఱి. 76

క. కనె 'సంజెమాంబ'యందున్
దనుజాషట్కంబు వరుసఁ; దనుజు లొదవమిన్
దనమూఁడవసుత 'సింగమ'
కనుగుణు వరుఁ గూర్చి తనగృహంబున నిలుపన్. 77



చ. తలఁచి, తలంపు 'తక్కశిల' ధామముగాఁ గల'సంజీవయ్యకున్'
దెలుప నతండు ప్రేమ మఱఁదిన్ సవిధస్థుని 'రామరాయనిన్'
బిలిచి సమస్తమున్ దెలిపి వేడుక నంపె హితోక్తిఁ బల్కుచున్;
దలఁపు ఫలించినట్టుల ముదంబున శేషయ తెచ్చి యామెయిన్. 78

క. తనకూఁతుతోడఁ బెండిలిఁ
దనరిచి తనయింట నిలిపెఁ; దదుపరి నతఁడున్
వినయమున నత్తమామలఁ
దనసతితోఁ గొల్చుచున్ ముదంబున నుండెన్. 79

క. తనమామవెంటఁ గరణపుఁ
బనికై 'వనపర్తి' నిచ్చ వచ్చుచు నుండెన్
గని రాణి కుశలి యౌనా
తని నుద్యోగంబునందుఁ దగ నెక్కొలిపెన్. 80

మ. పయివా రాతని మే లనంగఁ బనులన్ బాటించి యారాజ్ఞి యా
పయి 'రామేశ'నృపాలుమన్ననలకున్ బాత్రుండునై మించుచున్
మెయిమై హెచ్చుపదంబులన్ నిలుచుచున్ మేధావిశేషాఽప్తి ము
న్నయి యానాఁటి'నియోగి'వర్గమున నుద్యత్కీర్తిమై వర్తిలెన్. 81

క. 'నరసింగమ్మ' యపత్యం
బరయమి నురుచింత నొగులునల్లనకు ననం
తరతనయ 'లక్ష్మ'మాంబను
బరిణయవిధిఁ గూర్చె మామ పరమప్రీతిన్. 82

సీ. వెలఁదితోఁ గాశికావిశ్వేశు సేవించు
ఫల మనాఁ దొలిచూలు గలిగె సుతుఁడు,
వరదుఁ డౌనిలువేల్పు నరసింహు సేవించు
ఫల మనా మఱుచూలు గలిగె సుతుఁడు,

వైకుంఠగతుఁ డగు శ్వశురుని సేవించు
ఫల మనాఁ గతచూలు గలిగె సుతుఁడు,
తత్తదాశీఃప్రసాధన ముగ్గడింప నాఁ
దలిదండ్రు లలరి పేరుల నిడంగ
ఆ.వె. 'విశ్వనాథరావు' 'వేంకటనరసింహ
రావు' 'శేషయ'యను రమణఁ గాంచి
ఉల్లసనము మిగులఁ దల్లిదండ్రులయిండ్ల
కూన్పువార లగుచు [1]నొఱపుఁ గనిరి. 83

వ. ఆ సమయంబున :-

సీ. 'వనపర్తి'పురిఁ దమబందుగులకొమాళ్ళఁ
బిలిపించి యాంగ్లాదివిద్య వారి
కభ్యసింపఁగఁ జేయునాశయమునఁ బాఠ
శాల వినిర్మించి చదువు జరుప,
శ్రీ'మానవల్లి'వంశీయుఁ డౌ'రామకృ
ష్ణకవి' మొదలుగా చతురగురుల
'రామేశరాయ'ధరాపాలకుఁడు నిల్పి
పాఠముల్ జరుగఁగా వాసిఁ గాంచె.
వీధిబడిలోన మామూలువిద్య నేర్చి
యుండుమము సోదరుల భూధవుండు పిలువఁ
బంచి తిలకించి ప్రియబుద్ధిఁ బండితులకు
నప్పనముఁ జేసె నాంగ్లాదు లభ్యసింప. 84

మ. మము నీరీతి లలిన్ గళల్ గఱచునన్మాన్యుల్గఁ గావించి ప్రే
మముతోఁ జెంగట విశ్వనాథుని ననున్ మన్నించి'రామేశ్వరుం'
డమలస్వాంతముతోఁ బను ల్గొనుచు నత్యంతంబుగా మెచ్చుచున్
క్షమ నేలెన్ దనజీవితం బలరుదాఁకన్ శక్తిమైఁ; బిమ్మటన్. 85

1. సౌందర్యము



క. తేనితనూభవు లిర్వురు
మైనరులుగ నుండుకతన మహిమోన్నతుఁ డౌ
శ్రీ'నైజా'మాజ్ఞను సం
స్థానము 'సర్కా'ధీనసరణికి వచ్చెన్. 86

వ. తదనంతరంబ, దివంగతుం డగు'రామేశ్వ'రావనీంద్రుతనూజులం బ్రథముం డగు 'కృష్ణదేవరాయఁ' డెదిగి కుశలమతి యగుట సర్కారువారతనికి సంస్థానపాలనవిషయములఁ గొంతవఱ కరయ సెల వొసంగిరి. అరాకొమరుఁ దనుభవశాలి గానందున నితరులప్రవేశము గలిగె. ఈ సంధికాలమున స్వకార్యధురంధరులు మున్మున్ను కాఁగా రాజకార్యవార్తావరణ మననుకూల మగుట విశ్వనాథరా వుద్యోగావరణమునుండి తొలఁగి, తన పెదతమ్ముండును లౌకికకార్యప్రవేశసముత్సుకుండును నగు వేంకటనరసింహరాయని దనపదవి న్నిలువఁ జేసి, 87

క. తనరెండవతమ్ముఁడు స
జ్జనుతుఁ డగుశేషగిరిని స్వకుల 'నియోగం
బున' నిలిపి యతఁడు చెంగటఁ
బని వినఁగా నింటిపనులు పరువడిఁ గనుచున్. 88

వ. విశ్వనాథరాయం డగుసే నాంగ్ల-యవన-పారశీకభాషల నభ్యసించియు, గీర్వాణాంధ్రంబులఁ దగుపటిమంబుఁ బాటింపఁ జాలక యాకొలంతల దీర్పం దలపెట్టి మత్తనూజాత లగు'లక్ష్మమాంబ - శారదాంబ'లకు నాంధ్రగీర్వాణంబులందుఁ గావ్యనాటకాలంకారసాహిత్యం బభ్యసింపఁ జేయునుద్యమంబున నభ్యాసలయందు నాకు విన్నాణం బినుమడించె. అప్పుడు లక్ష్మణశాస్త్రియు నేనును వంశాగతకవితామార్గంబుఁ బ్రవేశించి, 89

ఉ. భారతిసేవ సేయుటకుఁ బాటు వడం దలపెట్టి యొంటిగా
దారులఁ బట్టి పోవుచుఁ బథంబుల సంగమదేశమందు వ్యా
పారులు గూడి యేకముగ వర్తకముం జయశీల మౌనటుల్
దీరుచుమార్కిఁ గూడి, విశదీకృతసౌహృద మేర్పడంగ దు

ర్వారవిధాశ్లథీకృతసుబంధురపూర్వకవిత్వధోరణిన్
సారరసాఽద్యలంకరణసంగతిగా నొనరింపఁ గోర్కి దై
వారఁగ "విక్రమాంకుకథఁ" బ్రౌఢత "లక్ష్మణ-విశ్వనాథు"లన్
ధీరుల మేము గూర్చితిమి, తెన్గున; నాటికఁ "గర్ణసుందరిన్". 90

## మాతాపితరవందనము

క. మును నాయిలువేల్పులఁ ద
త్సనామపితరులనుఁ 'గుశిక' సద్గోత్రజుఁడన్
మనమునఁ గవి"లక్ష్మణుఁడన్
బ్రణతించెద "శ్రీనివాస-పద్మావతులన్". 91

తే. గీ. చెలఁగి గృహదేవతం బైన శ్రీనృసింహుఁ
గొలిచి తల్లిని "లక్ష్మమ్మ" గురుని "రామ
రాయుఁ" 'గౌండిన్య' గోత్రు సంభ్రమము మీఱఁ
దొలుత నీకృతి విశ్వనాథుఁడను దలఁతు. 92

## షష్ఠ్యంతములు

క. సకలజగద్రక్షకులకు
శకలితసమదాసురేంద్రసందోహులకున్
వికలన్వభక్తపాలన
సుకలాకోవిదుల కఖిలసూరినుతులకున్. 93

క. మాయాఽధిష్ఠానులకు న
మేయజగత్సృష్టిభరణమీలనులకు స
చ్ఛ్రేయస్సాధనమహిమప
టీయాంసుల [1]కాప్తసంఘటితముక్తులకున్. 94

1. ఆశ్రితభక్తులు.



క. లలితసదర్థపదక్రమ
విలసితసత్కావ్యరచనవినుతకవీశాఽ
వళిసన్నుతమాహాత్మ్యాఽ
కలనులకున్ భక్తబృందకారుణ్యులకున్. 95

క. కరి-రిపుసుతపోషకులకు
[1]నిరతామరపూజితాంఘ్రినీరేజులకున్,
విరచితజగదవనుల కిం
దిరావిరాజితుల కస్మదీయగురులకున్. 96

క. సగుణాగుణమూర్తులకున్
విగళితభక్తౌఘపాపవిసరులకు సచి
జ్జగదద్వయరూపులకున్
నగశిఖర-స్తంభవాసనవ్యరుచులకున్. 97

క. సజ్జనహృదయాబ్జాతల
సజ్జయపదపంకజాతసద్యఃపూతో
ద్యజ్జగదవనరిరంసా
సజ్జశ్రీవేంకటాద్రిశ-నృసింహులకున్. 98

వ. అభ్యుదయపరంపరాఽభివృద్ధిగా మాయొనర్పం బూనిన
'విక్రమాంకదేవచరిత'మహాప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టి దనిన. 99

క. శ్రీరమణ! వేంకటేశా!
వీరనృసింహేశ! వేదవేద్య! సురేశా!
సూరివినుతపదపద్మా!
భూరిగుణా! దేవదేవ! బుధజనవంద్యా! 100

1. తత్పర

## శ్రీకృష్ణఖడ్గస్తుతి

క. శ్రీపాంచజన్యబింబ
వ్యాపన ధారాంబుఫేన మందిన దనఁ బై
దీపించుదోఃప్రభాదం
దోపమకంసారిఖడ్గ మోముత మిమ్మున్. 101

## శ్రీముకుందస్తుతి

చ. సిరి కిర వై రహిం బరగుక్షీరధి యన్సితపద్మమందు ష
ట్చరణరుచిప్రసారమును సాంద్రగతిన్ నిజమేచకోత్పల
స్ఫురదురునీలదేహమునఁ జొప్పడఁ జేయుముకుందుఁ డెంతయున్
వరవిభవంబులన్ దనరుపన్ గలవాఁ డయి మీకు నిల్చుతన్. 102

## శ్రీహరియురోవర్ణనము

క. సిరిచానమేనిపూఁతన్
వరలుచు సౌభాగ్య మనెడిపసిఁడికి నొరగల్
సరణి యగులోకజనకుని
గరుడాంకునియుర మనయముఁ గాచుత జగముల్. 103

## గిరిజాస్తుతి

ఆ. తే. అన్యకుచమువార్త నడుగ నా వదనాగ్ర
మొందుతుంగతరము నొకకుచంబు
గలుగునటుల మగనికాయార్ధమున నిల్చు
గిరివరసుత మిమ్ము నరయుఁ గాత. 104

## నందకస్తవము

క. సంతుష్టరమాబింబాఽ
క్రాంతాంతర్భాగ మయి మురహరున [1]కినజా
తాంతస్సలీలరాధా
కాంతాస్మృతిఁ గొలువు[2]నందకం బిడు ముదమున్. 105

1. యమున, 2. విష్ణుఖడ్గము.



## పార్వతీస్తుతి

ఉ. చేరఁగ నిల్చి యన్నమలసీమలయేలికముద్దుపట్టి దు
ర్వారరుఒషాత్మ యై తగ [1]దరంబున సంబనుగూర్చి నే నమ
స్కార మొనర్తు నంబ! యని శంభుఁడు శాంభవికోప మాఁప వ్యా
హార మొనర్పఁ బెం పగుజొహారునుడుల్ జయ మొందు నెల్లెడన్. 106

## సరస్వతీస్తుతి

చ. గురు నటు గీష్పతిత్వము [2]విగూర్వణమున్ గనఁ జేసె నంచు లోఁ
బురికొనుసీర్ష్యతో గ్రహసమూహము సారచోనుఒలబ్ధికై
యరుదుగ నక్షసూత్రమునయందలిముత్యము లై భజించె నా
వఱలెడువాణి మీకుఁ బయిపై వెలయించుత సుప్రసాదముల్. 107

## వినాయకస్తుతి

శా. ఆశాస్యంబులయందు నెల్లయెడ నేయాతంకముల్ లేనియ
ట్లాశాసించుసమర్థతన్ దనరి మంత్రాన్వీత లౌనక్షతల్
గా శశ్వద్గతి శీకరంబు లెనయంగాఁ జేయు చున్నట్టిదం
తీశానాఒస్యనిహస్తలీల మిము నెంతేఁ బ్రీతులన్ జేయుతన్. 108

## వైదర్భీప్రశస్తి

ఉ. అంబుధరంబు లేనిశ్రవణామృతవృష్టి, సరస్వతీవిలా
సంబులు పుట్టుచోటు, పదసంపదకున్ సుభగత్వసిద్ధిఁ గూ
ర్పం బలుపూఁటకాఁపు, బుధరంజనదాయక మై విదర్భజా
తం బగుకైతరీతి కృతితల్లజులం దుదయంబు నందెడున్. 109

## సుకవిస్తుతి

క. కలపంచమరవసమచి
త్రలపనసందర్భవిలసితనిజముఖములన్,
నలువచెలి వీణ మీఱెడు
లలి మెలఁగన్ వెలయుకుశలులకు జయ మగుతన్. 110

1. భయము, 2. గొప్పతనము (గుర్వీ-ఉద్యమనే ధాతువు).

క. అరసికొనుఁడి కవులారా!
వరసాహిత్యాబ్ధిమథన వఱలుశ్రుతిసుధన్
సురరిపులటు కావ్యార్థము
హరియించెడుచోరు లుందు రది గొన నెపుడున్. 111

క. కొననిం డెల్లర నిచ్చమె
యినిఁ దనరదు కొఱఁత సుంతయేన్ గవులకు; నేఁ
డును రత్నాకరమె కదా!
వనధి దివిజలుప్తరత్నవర్గం బయ్యెన్. 112

క. వైచిత్ర్యరహస్యములన్
జూచుసహృదయాఽళి దీనిఁ జూచున్ శ్రద్ధన్
బ్రాచీనకవులవైద
ర్భీచంచత్కృతులు వేనవేలు వెలసినన్. 113

తే. గీ. సాహితీశ్రమవర్జితజనమునందుఁ
గవిగుణంబు సొరంగ భంగంబు నెనయుఁ;
దలిరుఁబోండ్లయనార్ద్రకుంతలము లెట్లుఁ
బట్టుఁ గృష్ణాగురుజధూపపరిమళంబు. 114

క. పలుకులెద నేర్పుపేర్మిన్
దొలినేమము మించుటలు నుతుల్ మిగులఁ గనున్;
లలితోన్నతి లవిక వగులు
నెలఁతలచన్గవలు వందనీయము లగుఁ గా. 115

క. ఇలఁ బండితులను లాగం
గలిగియు వ్యుత్పత్తిజడులఁ గరఁగింపద; ము
క్తలఁ దొలిఁ గూర్పుశలాకిక
యులి నలిపెడుపనుల శక్తి నూనదు గాదే. 116



ఆ. వె. కవులకథల రసము గాంచెడుసరసులు
వేఱుకథలయందుఁ బ్రీతిఁ గనరు;
[1]గ్రంథిపర్ణమందు రంజిలు 'కస్తూరి'
మృగములు తృణములను మెలఁగవు గద! 117

కుకవి నింద

చ. జడజనమందుఁ దాము గనఁ జాలుప్రతిష్ఠఁ గృతాభిమాను లౌ
వెడఁగులు సత్కవీంద్రపదవృత్తుల నేపరిపాటివారు? చి
చ్చుడుపఁ గలట్టిగర్వమునఁ బొంగెడునీరము లేమి సేయఁగాఁ
గడఁగు మణీగణప్రభవకాంతులు దిక్కులఁ దిక్కటిల్లఁగన్. 118

తే. గీ. పూని యుల్లేఖలీల నేర్పున ఘటించు
పట్టు గల[2]వైకటికసమపండితులవి
చార[3]కషపట్టికల నిధుల్ సరణిఁ గనుత
నారుచిత్రోక్తిరత్నముల్ ప్రోది యగుచు. 119

చ. కలుగదు దోస మేమియును గాంచఁగ దుర్జనులందు, సద్గుణం
బులఁ గని యోర్వలేమి యగుఁ బో తగ వారిస్వభావ మెప్డు; ని
స్తులఘనసారఖండములతో సరితె ల్పగుకండచక్కెరల్
వెలయును గాదె కొందఱకు ద్వేష్యము లై బలుచేఁదులట్టులన్. 120

శారదాదేశమహిమ

క. అమలకవితలీలలు కుం
కుమకేసరవితతు లేకకుక్షిజము లగున్;
సుమహితము [4]శారదాదే
శము విడి వేఱెడఁ దదుల్లసన మే నెఱుఁగన్. 121

1. మాలిపత్రి. 2. రత్నపరీక్షకులు. 3. ఒరపిడిరాయి. 4. శారదయా దేశము-కాశ్మీరదేశము.

## వక్రోక్తి

క. అల వక్రోక్తిరహస్యాఽ
కలన రసధ్వనిముఖార్థ్యగాములు కావ్యం
బులు నాయవి శ్రద్ధఁ గనన్;
-జిలుకలుగఁ బఠింత్రు గాక చిక్కనవారల్. 122

క. అనితరసామాన్యగుణ
త్వనిరూఢియ కవివరులకుఁ దనరుచుఁ గీ; ద
య్యనఘులఁ దద్గుణములఁ గనుఁ
గొన జల్పము విదరు సభలఁ గొఱ నేర్పుజనుల్. 123

క. అసమానోల్లేఖరచనఁ
బసఁ గనుకృతికనక మిద్ది పండితచేతో
విసర[1]కషపరీక్షిత మయి
పొసఁగుం గాత జనకంఠభూషణ మగుచున్. 124

## కవీశ్వరాఽవశ్యకత

తే. గీ. చారుచారిత్రలీలావిచారశూన్య
లైననృపులకుఁ గవిసంగ్రహం బదేల ?
యొదల నెప్పుడో గురిజలతొడవు లూను
వనచరుల కేల ? యగసాలెవానిఁ జేర్ప. 125

చ. తమకెలనన్ గవీశ్వరవితానము నిల్పఁగ లేనిధారిణీ
రమణులకీర్తిసంతతులు రాజిలు నెట్టుల ? రాజు లెందఱో
క్షమపయి దీప్తితో వెలసి కాలము దీఱఁ జనంగ లేదె ! సం
భ్రమముననేని నట్టినరపాలురపేరు దెలుంగఁ డెవ్వఁడున్. 126

1. ఒరగల్లు



క. రావణుయశ మఱుటయు సీ
తావరుఁడు యశోఽర్థుఁ డగుట తగ నిది సర్వం
బావాల్మీకిప్రభావమె
కావునఁ గవులయెడ నలుగఁ గాదు నృపులకున్. 127

క. నానుడికారము నీరస
మైనను నృపచరితకథన మతిమాన్యం బౌ;
ద్యోనదిమృత్తిక శుష్కం
బైనను దలఁ దాల్ప రెవ్వ రతిశయభక్తిన్ ? 128

## కుకవి

చ. శ్రుతి కమృతంబు, సత్కవివచోరసమున్ ద్యజియించి దుష్టు లా
యతమతి వారిలోపములె యత్నము సేయుదు రేర్పరింపఁగా;
నతులితకేళికావనమునందుఁ బ్రవేశముఁ గాంచి రోయదే ?
వితతిరతిన్ గ్రమేళకము వీడక కంటకజాలమే మొదల్. 129

## స్వగ్రంథప్రశస్తి

క. విమలచళుక్యాధిపవం
శమున వెడల నిడితి మద్వచస్సూత్రము నం
దమలగుణమౌక్తికంబుల,
నమరుత నేకాఽవళి, తొడ వయి మీమెడలన్. 130

తే. గీ. సప్తలోకంబులందుఁ బ్రశస్తిఁ బడయు
భారతీలీలలకుఁ బట్టు బ్రహ్మ యగుట,
నట్టినలుమోమువేల్పుకావ్యములు నాల్గు.
వెలయు విఖ్యాతిఁ గని చతుర్వేదము లన. 131

## బ్రహ్మప్రసన్నత

తే. గీ. తనకుఁ బీఠంబుగా నున్నతమ్మి యొకటి
తులఁ దొలఁగుభక్తితోఁ దన్నుఁ గొలువ నలువ
సకల మైనట్టితత్తోయజాతకులము
నరయ సిరి కిరవుగఁ జేసె నని తలంతు. 132

## ఉషఃకాలము

ఆ. వె. బ్రహ్మఋషులకెల్ల బ్రహ్మమయము లగు
నజునికథలఁ బ్రొద్దు లరుగు చుండ
నంత నొక్కనాఁట నమరనదీతీర
మందుఁ గల్యసంధ్య యగుడు రవికి. 133

క. తనవనితకుఁ జాటూక్తుల
ననయముఁ బల్కుచును జక్ర మన్యోన్యవియో
జనయంత్రసూత్ర మనుభ్రమ
నన లాగెన్ దన్ముఖస్థితాబ్జబిసంబున్. 134

తే. గీ. అర్ఘ్య మిచ్చుట నాసక్తులై నసిద్ధ
ముగ్ధ లూనినకుంకుమమునను బోలె
నబ్జినీజీవితం బగునర్కబింబ
మపుడు దాలిచె బింబఫలారుణిమము. 135

క. రే ముదియుడుఁ దల మిగులఁగ
గో పతి వంచెనొ యనంగ గొబ్బునఁ గన నొ
రేమగనియార్తిఁ గన నాన్
మోము స్మితోన్ముఖత నొప్పెఁ బో బిసినులకున్. 136



క. సకలవిజయశీలుండు చ
టకమున వేలుగఁ బొడము నలువ కని వినుచున్
దికమకఁ గొని దుర్గము నె
క్కు కరణి రవి తూర్పుఁగొండఁ గొదుకుచు నెక్కెన్. 137

తే. గీ. చక్రవాకాంగములఁ బరస్పరముఁ జూడ
కుండుటకుఁ గూర్చుపూఁతగా నుండి యిపుడు
చందనద్యుతి మించినచంద్రిక యదె
యిందుశాణీఫలకమందు నిమిడిపోయె. 138

## ఇంద్రుఁడు బ్రహ్మకు లోకదురాచారమును దెలుపుట

తే. గీ. అపుడు సంధ్యాసమాధినిష్ఠాన్వితుఁ డగు
విధికి శక్రుండు కేల్మోడ్చి విన్నవించెఁ
దనదుశేఖరపారిజాతమునఁ బొరలు
నలులయులివున నినుమడు లైనసుడుల. 139

క. సితగజమదసక్తమధు
వ్రతమాల పెలంగు నాకు, వందనమాలా
కృతి; సామ్రాజ్యశ్రీజయ
తతతోరణనిభసితేభదంతయుగమునన్. 140

తే. గీ. లోచనాబ్జసహస్రవిలోలషట్ప
దాళినీలీకృత మగునాయాతపత్ర
మల రహించును రాజ్యేందిరాననమున
వేణినాభీ[1]లలామ కల్యాణగరిమ. 141

ఉ. నందనమందుఁ గల్పతరునవ్యమనోహరసీమలన్ రతిన్
జెందినశ్రాంతి వో నడఁపునీడలఁ గూడుచుఁ బాడు చుందు రే-
నందినశౌర్యకార్యకలనాత్తయశంబుల సత్ప్రబంధరీ
తిం దనరించి మోదమునఁ దేలుచు సౌరమృగీవిలోచనల్. 142

1. నాసటిబొట్టు.

చ. పలుకులు పెక్కు లేల ? యిదె పాకనిషూదనుఁ డీతఁ డర్థుఁ డై
యలరు నిరంకుశాఽత్తమహిమాతిశయంబునకున్ నిజంబు; ని
స్తులభవదీయపాదతలధూళిలవంబుల నొదలన్ గనం
గలిగినయెల్లవారి కిది గా మహిమంబు సితాంబుజాఽసనా ! 143

తే. గీ. జన్మములఁ బొల్చిలింపసంచయము గొనుట
దాల్చు చున్నది స్మర్తృవ్యతిక్రమం బ
టంచుఁ దలఁచెద నాథ ! నా కవని నిపుడు
విప్లవం బిది చారనివేదితంబు. 144

చ. సవిత నిజద్యుతిచ్ఛటల సాచి దిశాఽఽళిఁ దమోవిలుంఠనం
బవితథరీతిఁ జేసెడునయంబున నంబుజయోని ! మీర లీ
భువికి విధిక్రియాఽఽచరణముల్ దొలగించెడుధర్మదూరులన్
గవిసి తొలంచఁగా నొకనిఁ గల్పనసేయుఁ డవార్యవిక్రమున్. 145

తే. గీ. కదఁగి పురుహూతుఁ డిట్టులఁ గలియఁ బల్కు
పల్కులను బాగుగా విని బ్రహ్మ యపుడు
చూచె సంధ్యాంబుపూరితచులుకమందుఁ
దెలిఁచి ధ్యానానువిద్ధ మౌదృక్ప్రయంబు. 146

## ప్రార్థితవీరజననము

క. తనముంగై పైదెసఁ దగు
ఘననీలమణీసనాథకంకణములపె
ల్లున ధర్మదూరబంధం
బునకు సహోత్థాహిపాశములఁ బూనె ననన్. 147

క. తనతర్జనిఁ జూపినచే
తను గార్యాకార్యములను దగఁ గనుగుతి ది
క్పనిరాతంకక్రియలను
గనుచు నిషేధం బొనర్చుకడఁకఁ గనె ననన్. 148



క. తనకులజులభోగంబున
కనంత నతివిపులఁ జేయ నంగదసంక్రాం
తనిజవిమానవిధంబున
ఘనగిరులన్ బాహువుల నెగన్ బట్టె ననన్. 149

క. తనతగ్గనిగరువపున
వ్వున దిట మగుమోవిచివురుఁ బూనుచుఁ శీరా
ర్జునము లగుపగలకీర్తులఁ
గొని యపుడే యాని [1]పమ్ముకొని నిలిచె ననన్. 150

క. తముఁ జెలలో నునిచెడుపని
కమరారులు నీరు విడిచి రని ముదమున న
య్యమరస్త్రీ లాత్మదృశా
కుముదములన్ బూజ లిడఁగఁ గొమ రొందె ననన్. 151

క. శరవారాభేద్యము, [2]క
ర్బురనిర్మాణము, స్వభావరూఢకవచమున్
ధరియించి జయశ్రీక
ర్బురపీఠనిభోన్నతాంసముల్ పొలు పొందన్. 152

క. కోరినది దాఁటినది చే
కూర వెలుఁగు దొలఁకుమోము క్రొమ రొప్పఁ జిరో
దారసముత్సుకతఁ దనను
సారసవిష్టరుఁ డజుండు స్వయముగఁ గనఁగన్. 153

క. పౌరుషకాంచనశాణీ య
శోరాశి సితాబ్జ[3]శాదశోభియు నిజహ
స్తాఽరూఢకృపాణోజ్జ్వల
ధార నతిప్రమదదృష్టి దైవారించెన్. 154

1. అతిశయించి. 2. బంగారము. 3. బురద.

క. కనకాచలోపలంబుల
మను వొందినయట్లు [1]మేల్మి మనుజశరీరం
బున నలువ చుళుకమునఁ ద్రిభు
వనరక్షాచణభటప్రవరుఁ డుదయించెన్. 155

మ. తనవేఁగన్నులు మోదబాష్పనిబిడత్వం బంది తూఁగాడఁగాఁ
దనచెంత న్నిలుచున్నయింద్రుఁ గని 'చిత్తస్థైర్యమున్ బూనుమా !'
యని యంపించి విరించనాజ్ఞఁ ద్రిదివౌకోఽమిత్రజాతిక్షయం
బున కవ్వీరుఁడు దీక్షఁ బూనె సుర లుప్పొంగన్ రిపుల్ గ్రుంగఁగన్.

చాళుక్యవంశపరంపర

తే. గీ. ధారిణీభృత్కులోపరిస్థాన మొంది
యంత రత్నాకరాఽత్తభోగార్హతఁ దగి
వెన్నుకా ల్గన్నమిన్నేటివెల్లువవలె
వరుస నవ్వీరువలన నన్వయము నెగడె. 157

క. వైరిభటానూనయశో
హారిగ 'హారీతకుండు,' నతఁ డాదిగ భూ
దారులలో '[2]మానవ్యుఁడు'
వైరులమానంబు దులుచువాఁ డై నెగడెన్, 158

ఉ. ముంగురు లెల్లరన్ జెదరఁ బొల్పఱి దీనతఁ గ్రుంగి యుండ, గం
డాంగములన్ రచింపఁ బడినట్టికురంగమదంపుచర్చలున్
భంగము నొంద సొం పలుసపత్నసతీజనతాఽఽననంబు లీ
వంగడపున్నృపాలురయవార్యపరాక్రమ ముగ్గడించెదన్. 159

1. బంగారము. 2. హారీతుని నామాంతరము.



ఉ. ఆకులమందు రాజనివహంబు గడించుకుకంటకోద్ధృతి
ప్రాకటకీర్తికిన్ భువనపాళి విలాసగృహాంగణంబుగాన్;
భీకరవైరికంఠగతపీఠతలాస్థివిలుంఠనప్రకుం
ఠాఽఽకృతిధార యొనసికి నయ్యెను సానలుగాఁ గపాలముల్. 160

చ. పశుపతి ప్రీతుఁ డైన నది [1]పాటన సేయక శాతఖడ్గమున్
దశమశిరంబుపైన బెడిదంబుగ వేయఁ గడంగి యద్రిజో
పశమితుఁ డై జగత్త్రయముపట్టున నెక్కటివిక్రమాఽఽఢ్యుఁ డౌ
పిశితభుగాళినాయకుఁడు పెంపుఁ గనెన్ మును రావణుం డనన్. 161

ఉ. అంతటివాని రావణుని నంతకుచెంతకుఁ జేర్చి దిక్సమా
క్రాంతయశస్కుఁ డైన రఘురాముఁడు నిల్చినరాజధాని న
క్రాంతసితోరుకీర్తి దనరన్ ఘన మైనపురం 'బయోధ్య' నీ
సంతతిక్షత్రియుల్ తమనిశాంతముగా నొనరించి రేపునన్. 162

ఉ. అందు విలాసదీక్ష నలరారుజిగీషువు లంతనంత గె
ల్పొంది సమస్తభూమిఁ బర మూనిరి; 'నాగరఖండ' చుంబిగాఁ;
గ్రందగుపూగవృక్షవిసరంబు ముదావహ మౌచు నొప్పుభూ
మిం దగుదక్షిణాఽఽశ నుపమింపఁగ రానిపరాక్రమంబునన్. 163

క. లీలన్ దద్వంశధరా
పాలురు విజయప్రశస్తి వ్రాసి రుదన్వ
త్కూలమున నిభరదంబులఁ
'జోళీ'సురతములసాక్షి సొం పగుచోటన్. 164

తే. గీ. ద్వీపనరపాలనివహంబు విక్రమమునఁ
బెఱుకునీరాజవరులు [2]'విభీషణపురి'
'నచ్యుతస్థాపితం' బని యాక్రమింప
రైరి; కాదేని వారికి నసదె యదియు. 165

1. పాటించుట, 2. లంకపురి.

క. ఆరాజులవాజులు ఘన
సారరజశ్శ్వేతరుచి యెసఁగుదీవుల నం
చారవిలాసము లూని తు
షారాద్రిభ్రమ వడంకి చలిఁ గలఁతఁ గనున్. 166

## తైలపరాజు

క. వరుసనఁ దత్కులతిలకము
హరు వొందెఁ బ్రతాపి, 'తైల' పాఽఖ్యుఁ డతఁడు సం
గరమున నరివీరరసం
బరుశోణితపంకశేష మొనరించెఁ ద్రుటిన్. 167

## ప్రకారాంతరానువాదము

చ. క్రమమునఁ దత్కులాంబుతిలకం బనఁ 'దైలపుఁ' డన్నృపాలచం
ద్రముఁడు ప్రతాపి శాత్రవపరాక్రమదూరుఁ డుదారవీర్యుఁ డై
సమితి నరాతివిక్రమరసంబు నిమేషములోన రక్తపం
కమ మిగులంగఁ జేసె భువనత్రయదుర్జయబాహుదర్పుఁ డై. 168

తే. గీ. కుతలకంటకు లగు 'రాష్ట్రకూట' నృపుల
మూలముట్టుగఁ బొలియించుపూన్కిఁ గుళలుఁ
డయినచాళుక్యచంద్రునియంతికంబుఁ
జెందె సుఖముగ నృపతులసిరియు నంత. 169

క. బీరపుటుమ్మన్ జెమ్మట్
గూరుకరంబుఁ గనునతనిక్రూరాసి ఘనా
సీరప్రేరితపుష్పా
సారపరాగముల నాఁటి నడలద యనులన్. 170



మ. నరనాథాంజననీలఖడ్గమున జన్మం బందియున్ నీలిమం
బరుకీర్తుల్ గనఁ బోమికిన్ గతము నే నూహించి గుర్తించితిన్;
బరనారీశరపాండుగండయుగళీపాళీవిలీనంబు లై
పరివర్తించి తదీయపాండిమమునన్ బాటించె శ్వేతత్వమున్. 171

తే. గీ. లలితకీర్తిమరాళహేలాపదంబు
నుత్పథం బగుఖడ్గనీలోత్పలంబు
విభుఁడు వీరరమోత్తంసవిధికి నసఁగ
యుద్ధలీలాసరస్సులోనుండి లాగె. 172

తే. గీ. అని మొనన్ సాక్షిమాత్ర సైన్యమును నిలిపి
దాసిఁ జేసినరిపులక్ష్మి తలఁగనటులఁ
బాఁటకాఁపుగ నారిపుభూపకీర్తిఁ
బిలిచె నెలకొల్ప నప్పృథివీవరుండు. 173

## సత్యాశ్రయుఁడు

సీ. ఎవనిఖడ్గము రిపునృపులకపాలముల్
భ్రుకుటిక్రుధాగతిఁ బొడి యొనర్పు;
నెవనిలాగినవిల్లు దవులుకొనల గుఱి
సననిముల్కుల ముద్దుఁ గొనినటుఁ దగు;
నెవనికోలలు కుభృద్బృందాంగములఁ దొల్చి
క్రౌంచభిద్భార్గవాస్త్రముల దూఱు;
నెవనిరణం బాఁగు నింత జందెపుభ్రాంతి
ఖడ్గారిహారముల్ సూచునపుడ;

తే. గీ. యెవ్వనిశరంబు లని రేల నృపవరమౌళి
రత్నములఁ గూడి దివ్వెలరహిఁ గడింప
నసితమంబుల రిపులపె ల్లార్పు నతఁడు
వెలసె 'సత్యాశ్రయుండు' దోర్విలసనమున. 174

## జయసింహుఁడు

ఉ. సంతతదంతియుద్ధముల సామజకుంభవిఖండనస్థల
ద్దంతురకాంతమౌక్తికవితానములున్ వలె నాత్మకీర్తు లు
ద్దాంతగతిన్ దిగంతములదాఁకఁ జలుక్యమృగేంద్రపీఠిపై
వింతగ నంత భూషణతఁ బేర్చెఁ దగన్ 'జయసింహ'దేవుఁడున్. 175

క. అరిరాజమహామహిషులు
ధరణీపాలప్రతాపతప్తు లయి నిరం
తరమును దలఁతురు చందన
పరిచర్చితనిజవరాంకపరివర్తనముల్. 176

క. కలహప్రభాతముల భూ
తిలకప్రతాపార్యమప్రతిష్ఠ యదర వ
ర్తిల కున్నె నెట్టిభూమీ
తలపతితతిసూర్యకాంతతాప మెచటనేన్. 177

క. అన్నృపతిజైత్రయాత్రల
సేనాభరమున వడంక క్షితితలము ప్రణం
బూనినవీపునఁ గార్యము
గానినియటు లాదికూర్మకము గాసిఁ గనున్. 178

తే. గీ. నిజకిరీటస్థమాణిక్యనిబిడభాను
భంగసంభన్ను లగుతేనివైరినృపుల
సంగరాంగణముల శివాసమితి గొనదు
చితి రగులునింగలం బని మతి గలంగ. 179

చ. అతఁడు దిశాఽధినాయకపురాఽళి జయించి, తదీయవస్తుసం
తతి విదళించి కేవలము దంతితతిన్ గ్రహియింపఁ దయ్యెఁ; నా
తతజయసింధురప్రకటితం బగుసప్తపలాశబాంధవో
దితనవవాసనన్ బెదరి దిక్కులఁ జిక్కక పాఱిపోవుటన్. 180



చ. మహిపుఁ డపారవీరనియమంబునఁ బోరగుఁ డై యటుల్ ధను
న్సహితత నిల్వ శాత్రవధరారమణాఽవలి సంగరంబులన్
దహతహతోఁ బరాఙ్ముఖతఁ దాల్చి పలాయిత మై చనంగ న
య్యహితయశోఽఙ్గనాఽఽవళి ప్రియంబున సమ్ముఖతాఽఽప్తినుండెడున్.

క. సురపురియశము నృపుఁడు సు
స్థిర మొనరించియును గర్వచిత్తుఁడు గాఁ డా
సురపతి స్వయముగ నిడఁగా
ధరియించియుఁ బారిజాతతతిచితమాలన్. 182

## ఆహవమల్లుఁడు

తే. గీ. అతని 'కాహవమల్ల'భూపతి జనించి
యవనిఁ 'త్రైలోక్యమ'ల్లాపరాఽఖ్య వెలసె
మహితధారాజలోత్థాంబుమానుషి యనఁ
దత్కృపాణంబు జయలక్ష్మి తలఁగి చనద. 183

ఉ. కేవలకల్పనాకథలు గేరెడుపట్టులఁ గాక సచ్చరి
త్రాఽవళిఁ గూర్పుపాత్రములయందు నతండు మహాకవీంద్రవా
చావిమలప్రయోగమున సాధుపవిత్రచరిత్రమార్గసం
భావితుఁ డై లిఖింపఁ బడెఁ 'బ్రౌఢిమ రెండవరాముఁ డౌ' ననన్. 184

క. కూపములఁ బ్రపాపాలిక
రూపున భూపులెద రిత్త రూపించుఘఁ ద
ద్భూపతివీరశ్రీ యా
శాపాళి యశస్సుధారసమునఁ బ్రియ మిడెన్. 185

క. వైరిప్రతాప మధికము
గా రాజకృపాణ మాని కన్నీరు గదున్
జేరినచోళగండో
దారపటీరములఁ దాప మఱఁగాఁ ద్రాగున్. 186

తే. గీ. మందుతేజంబు తనచెంత నుండుకతన
దప్పి నూనినయదివోలెఁ దత్కృపాణ
మల 'ప్రమార'నృపాలయశోఽమ్బుధార
'ధార' యనురాజనగరరత్నమును మ్రింగె. 187

తే. గీ. నృపుకృపాణ మగాధపానీయమగ్న
భూరిభూభృత్కులం బయ్యెఁ బో విడువగఁ
జాలదుగ 'ధార' యనునాకృప్రోలినైన
నప్పురీన'మాలవుని'భాగ్యక్షయమున. 188

తే. గీ. అతఁడు కాలాంబుదశ్యామలాసి సకల
రాజహంసలఁ దఱిమి తర్వాత నిలక
భోజరాడ్భుజపంజరమున రహించు
కీర్తిహంసినిఁగూడఁ దా ఖేదపఱచె. 189

తే. గీ. ప్రళయసమయాగ్నిసమమూర్తి పార్థివునకు
సంగరంబులఁ గరముఁ బొసంగె శాంతి
భోజభూమీతలాధీశముక్తమైన
'ధార' వడినంతమాత్రఁ జిత్రంబు గాఁగ. 190

తే. గీ. ఆతఁ డక్రాంతహోమాఽశ్రయాశధూమ
జాలనీలీకృతదిశాఽఽన్యమాలుఁ డగుచుఁ
దోడనే పూర్ణిమానిశాతుహినకిరణ
పాండుసత్కీర్తిసంతతిఁ [1]బఱచి కడుగు. 191

తే. గీ. సత్య మాజి జయామృతసాధనమున
క్షితిపతిశితాసి మిక్కిలి క్షీణ మయ్యెఁ
దద్గృహీతైకధారావిధానకలనఁ
గీర్తిధారాసహస్రావకీర్ణ మగుట. 192

1. పరఁజేసి.



చ. ఇటుల సతం డశేషధరణీశరణీకరణీయతాఽఽప్తి సం
ఘటితతదీశశీర్షమణికల్పితపాదుఁడు చక్రవర్తియై,
పటిమ ననేకయజ్ఞపరిపాటి నెసంగుచు నింద్రు మించిన
ప్పటికి శతక్రతుం డతనిపట్టునఁ జూపఁ డొకింత శంకయేన్. 193

క. చింతారత్న మితని ముం
దెంతయును వరాక మనుచు నెంత్రు జనము భూ
కాంతుఁడు తపనీయతులా
భ్యంతరమునఁ దూఁచుటాయియట్లుగఁ జేయన్. 194

తే. గీ. రోమరూపంబుఁ దాల్పించి తూర్ణభీతి
నెటనొ యొకమూల నొదిఁగి పెం పేదుకలినిఁ
గడలఁ దఱుముట కన యాగకలితధూమ
ముల నిరోధించె నాతఁడు భువనమెల్ల. 195

చ. బెదరినవాఁడువోలెఁ గలి పృథ్వీవరేణ్యునిపై నిమేషమేన్
గదియఁగ నీఁ డపాంగమును క్షాత్రపుటుమ్మ కడున్ నిజాంగమున్
బొదివి రహింపఁగా సహజపూషవిభాపరిపూర్తి నేత్రముల్
మెదలఁగ నీక మించి మిఱుమిట్టుల నాతఁడు గొల్పు చుండఁగన్. 196

క. అన్యాయ మొకటిప్రాగ్రా
జన్యులయెడఁ జేసె స్వకులజనవత్సలతా
మాన్యుం డయ్యు నిలాపతి,
స్వన్యాయచరిత్ర జనము వారల మఱవన్. 197

తే. గీ. అచటఁ [1]'పృథ్వీభుజంగ'నిరర్గళాఽహ
వావశీర్ణకర్ణ యగు 'డాహల' మహీరమ
యకట! కర్పూరతాటంకయశముతోడ
నిప్పుడున్ గూడ సంగంబు నెనయఁ బోదు. 198

1. ఇది ఆహవమల్లుని బిరుదనామము.

## పాంతాంతరశ్లోకానువాదము

తే. గీ. అచటఁ 'బృథ్వీభుజంగ'నిరర్గళాఽహ
వావశీర్ణకర్ణ యగు 'డాహల' వసుమతి
దంతతాటంకతుల్యసద్యశము లకట!
యిప్పుడున్ బరిష్వంగంబు నెనయఁ బోదు. 199

తే. గీ. సమితి నృపతికృపాణ ముచ్ఛలితతేజ
మెనసి [1]ధారాజలంబున నసఁగ నిగిడె
దృప్తరిపుగజాఽవళిసంగ మెడపి పొంద
నసఁగ [2]'నభ్యుక్షణమ్ము'న సహితలక్ష్మి. 200

క. నిరతము సంతప్తం బగు
నరిరాజస్త్రీపయోధరాంతరమందున్
బరఁగినకుంకుమపంకము
పరాఙ్ముఖతఁ గనియె శోషభయమునసో నాన్. 201

క. తనుభావ మూనె వైరిసు
తనువులహాసప్రదీప్తి, తాంబూలశ్రీ
నెనయునవసానసంస్మృతిఁ
గనుచు నసఁగ సహవసతినిఁ గ్రాలుకతమునన్. 202

క. వేలావనముల నరపతి
జ్వాల లెగయునస్త్రములఁ బ్రవర్తిలఁ జేయన్
గ్రాలెడుభీతి సముద్రము
'హాళిన్ భార్గవుఁడె వచ్చె ననుచుఁ దలంకెన్. 203

1. పట్టణమునకుఁగూడ శ్లేషార్థము. 2. పరికిలితో నీటినిఁ జిలకరించుట.



చ. నృపతిభటాఽవళుల్ తనమణీగణసంగ్రహణం బొనర్పుచో
నపరిమితంబుగాఁ దటతలావనిఁ జిందుచుఁ గ్రం దొనర్పు శు
క్తిపటలిచేతఁ దాఁ గినుకఁ గీల్కొనె నాఁగఁ బయోధి యొడ్డుపై
నుపలతలంబునన్ దల నసూనతఁ గొట్టినయట్లుఁ గన్పడెన్. 204

చ. అతని సధిజ్యకార్ముకుని, సత్యవనీప్రభవాభిరాము, నూ
ర్జితరవితేజుఁ గాంచుచు వచించెనొ నా నిజపద్మరాగశో
భితచటులారుణాంగముల నిండినశ్రీరఘురామబాణపా
టితకిణసంచయంబుఁ బ్రకటించెఁ బుటీకృతభంగపాళి యై. 205

చ. అతనిచమూసమూహము లుదగ్రగతిన్ దటికాఽటవీవిటం
కితములు గాఁగ 'విశ్వ మిటఁ గ్రిక్కిరియన్ గుమిగూడెనో' యనన్
మతిఁ గని పార్థివభూతిగరిమల్ క్షయ మొందమి కర్థి స్వీయతో
యతతికి నున్నయుప్పు గత మంచును మెచ్చెను శారతన్ గడున్. 206

తే. గీ. అనఘవీరుం డతండు వారినిధితీర
మున జయస్తంభమును నాటె ముదము మీఱ
స్వైరవిహరణశీలముల్ జలమతంగ
జములు పొగులఁగఁ గట్టుకంబ మనుభీతి. 207

తే. గీ. తనతటి మెలంగునతనిశుద్ధాంతకాంత
లందుఁ దొరఁగెడులావణ్య మనుసరించి
సార మమరులు గొనఁగ నిస్సార మైన
జలధి పీయూషదర్శనసౌఖ్య మందె. 208

క. గెలుపుంబూన్కలయందున్
గెలుపుమరులు గలుగునతఁడు కెలనఁ బయస్సున్
నిలుపుకడలిఁ గని రాముఁడు
గొలిపినసేతువును మఱలఁ గూర్పఁగఁ దలఁచెన్. 209

క. ద్రవిడభటుఁడు క్రొవ్వున నే
కవీరుఁడై పఱచి యెదురుగా రాఁగ మహీ
ధవుఁ డతని [1]నభాజనుఁ జే
సె వీరరసమునకుఁ దొలులు సేసి శరతతిన్. 210

క. పటుకంపితాంగిఁ 'గాంచి'
న్ఘటించి భుజయుగబలంబునన్ లాగెను దా
నటఁ జోళరాజ్యరమ భూ
విటుఁడు యశఃపటము నూడ్చువిధి నేర్పరి యై. 211

## ప్రకారాంతరానువాదము

క. భుజయుగబలమునఁ 'బృథ్వీ
భుజంగుఁ' డల కంపితాంగిఁ బొదువుచుఁ '[2]గాంచిన్;'
అజితుఁడు యశఃపటము నూ
డ్చుఁ జతురుఁడున్ '[3]జోళ'రాజ్యలక్ష్మిని లాగెన్. 212

తే. గీ. అతనిబెదరునఁ గడుఁ బలాయితుఁ డగునరి
'చోళ'ఫాలత్వచంబు నెచ్చుగను జీల్చె
నింకనైన నితం డెగ్గ లెనయునె యని
కంటకవనాంతములు రిపుల్ గాంచునా యన. 213

క. నరపాలశౌర్యవైశ్వా
నరమునఁ బూర్ణముగఁ బ్లోషణముఁ గనుచు రిపూ
త్కర మరయద మంత్రముఁ ద
ద్దురవస్థన్ బ్రతిఘటింపఁ దూఁగునొకటినేన్. 214

1. అనర్హుఁడు-పాత్రలేనివాఁడు అనిశ్లేష. 2. కాంచీపత్తనము-ఒడ్డాణము అనిశ్లేష. 3. చోళదేశము-రవిక అనిశ్లేష.



శా. క్ష్మానాథాగ్రణియత్నకౌశలము వక్కాణింప నేలా ! మనో
భూనారాచములట్లు దద్భరతతుల్ బోఁ ద్రోయరా కూర్జిత
జ్యానిష్ఠ్యూతనితాంతనిష్ఠురరవప్రాప్తాగ్రవాదాఽయతిన్
భూనాథాఽవళిఁ దద్భుజంబె యనులన్ బొంకం బలన్ జేయఁగన్. 215

పై పద్యమునకు అచ్చతెనుఁగు అనువాదము

ఉ. పూవిలుకానియమ్ములనుబోలెఁ గడున్ బెడిదంబు లెల్లరున్
బోవిడఁ జాలనట్టి వగుముల్కులఁ దేరెడుతేనినేరుపున్
వా విడి పల్క నేల ! కలన్ దనసింగిణి వీడి క్రమ్ముచున్
నో విడుచప్పు డూన్చుజమె నూల్కొని తేండ్లను దూలఁ జేయఁగన్. 216

## మాలినీవృత్తము

సురవినుతపదాబ్జా ! సూరిసంగీతనామా !
గిరిబిలవినివేశా ! కేవలాద్వైతరూపా !
కరిరిపుసుతపాలా ! క్ష్మాసుతాచిత్తలోలా !
విరచితబహురూపా ! వేంకటేశా ! నృసింహా ! 217

ఇది శ్రీత్రిభువనమల్లదేవవిద్యాపతి-కాశ్మీరక-
భట్టబిల్హణ మహాకవివిరచితవిక్రమాంకదేవచరిత
మహాకావ్యంబునకు శ్రీవేంకటేశ్వర
శ్రీనరసింహదేవపాదపద్మాఽరాధన
సమాసాదితకవితావైశారద్యులు
'ఆంధ్రబిల్హణ'బిరుదాంచితులు
నగులక్ష్మణ-విశ్వనాథ
కవిసోదరాంధ్రీకృత
మహాప్రబంధంబునందుఁ
బ్రథమాశ్వాసము
సమాప్తము

# విక్రమాంకదేవచరితము

## ద్వితీయాశ్వాసము

క. శ్రీరమణ! వేంకటేశా!
వీరనృసింహేశ! వేదవేద్య! సురేశా!
సూరివినుతపదపద్మా!
భూరిగుణా! దేవదేవ! బుధజనవంద్యా! 1

క. పురవర మొనర్చె నృపవరుఁ
డురుసౌధశ్రేణిదీపికోదితరుచి నం
బర మల కాటుకసరిగా
వలలఁగఁ[1] 'గల్యాణ' మనఁగఁ బటిమ నొకండున్. 2

ఉ. గంధపుఁబూఁత వెల్ల నగుకైరవనేత్రలచన్నుగొండలన్
జెంది నివర్తితంబు లయి శీతలతద్వదనానిలంబు ల
చ్చందనశైలవాయువులసావి గనం దగి భూజనంబులె
ల్లం దముఁ గోరఁగాఁ దగి విలాసముఁ గూర్చెడు నప్పురంబునన్. 3

క. భీతైణాక్షీగండ
ప్రాతరుచిన్ గాతరాంశుపరికలితుం డై
శీతాంశుఁడు సమ్మార్జన
ధూతరజఃకీర్ణముకురతుల్యతఁ గనియెన్. 4

క. రేలన్ లీలలఁ దూఁగెడు
ప్రోలిసతులదంతపత్రములఁ జేరి కనం
బోలనిచంద్రుఁడు వారిక
పోలంబులఁ గొంటిజలముపొలుపు ఘటించున్. 5

1. ఇప్పుడు గుల్బర్గాజిల్లాలో నీపురము కలదు.



క. ప్రతిబింబమార్గమునఁ బర
సుతనులయతనుప్రబోధసూచకముఖముల్
సితరుచి సేరియు మోసము
విత మెఱుఁగదు కావు గలుగువిధమునఁ బోలెన్. 6

క. సురపతిమణిరసవిమలో
దరములు తోయాకరములు తద్ద హసించున్
శరదపగతాబ్దపంకము
[1]ఖరకరజామేచకంబుగా వినుదక్కెన్. 7

క. కదుదళ మగుతోరణములు,
నిడు పగుపటికంపువప్రనివహముఁ దగు న
య్యుడువథకేళిముకురమున
బెడఁగునఁ గడుగఁ బడుదంతవితతిన్ గనె నా. 8

తే. గీ. రేలఁ గప్పఁగఁ బడె శశి ప్రోలిచెలుల
యాననముగమివెల్గుల నతనివనిత
వెండికపురంపుబరణి నా వెల్ల నైన
వనజరిపుఁ డెచ్చ టనుచు విభ్రమముఁ జెందు. 9

తే. గీ. పాల్కడలివోనివెల్గుల వాసిఁ గాంచు
నచటిపటికంపునేలలయచ్చరుచుల
యెదుటఁ గజ్జలనీల మౌచదలు గనఁగ
నౌను దావాగ్నినిర్దగ్ధకాననమన. 10

చ. తనదరి నున్నభూరుహకదంబకముల్ ప్రతిబింబరీతిగాఁ
దనయెడఁ గానుపింప విబుధక్షితిజావళితోడ నొప్పురీ
తిని సురలుప్తసారవితతిన్ వనధిన్ గడు గేలిసేయుఁ బ
త్తనవిధస్థితంబు సుఖదంబు తటాకము సొంపుపెంపునన్. 11

1. యమున.

క. ఆలమునఁ బ్రతిక్షణమును
క్షాళితమన్యుఁ డగుతేఁడు కాచపురికి నే
లీలన్ [1]బోటిఁ దలిర్పఁగఁ
జాలద శతమన్యురక్షసౌ రగుపురమున్. 12

క. చకితమృగాక్షులు గావున
వికలతఁ గనుఁ జొరఁగ మృగము పెన్నొత్తిరిభీ
తికలిమి లీలం దూఁగుమ
ణికుండలవిలాసిగండసీరేజారిన్. 13

శా. ఆరాజన్యునిపట్టణంబున నభోవ్యాప్తంబు లౌదేవతా
గారాగ్రోజ్జ్వలహేమకుంభములు ముక్తాకాంతిజాలచ్ఛల
న్నీరంబుల్ గలవై సురాంగనలఁ దన్పింపంగ సొం పొందెడున్
జేరన్ నిర్మితమై ఘటంబులఁ బ్రకాశించుంబ్రపాపంక్తి నాన్. 14

క. త్రైలోక్యవశ్యకృన్నా
రీలీలాయితముఁ గని పరిభవస్మృతి మీఱౝ
దాలుపుజో దల ముమ్మెన
వాలుమగనికై ధనుస్సుఁ బట్టెౝ మఱలౝ. 15

క. స్మరకీర్తిప్రతివస్తుతఁ
బెరసినబర్హిణసమూహవిలసత్స్వనముల్
పురయువతీకంఠస్వన
పరంపరకుఁ దెఱపి నిచ్చప్రౌఢి వహించెౝ. 16

సీ. అచటియింతులయల్క ననఁగులసొంపుఁ గాఁపు;
రోషశేషముఁ ధికరుతియడంచు;
నచటియుమ్మలఁ జొచ్చి యబ్జుఁడు ఘనుఁ డయి
వనితాఽన్యగతి రాహువంచకుఁ డగు;

1. స్పర్ధ



నచటిమేడలనెక్కియమ లూనుముత్యాల
జిగివెల్లి మిన్నేటిబిగిని మీటు;
నట మరుండు హరునయనవహ్ని మఱవక
నతులహేలాఽమృతస్తనము లూను;

తే. గీ. స్మరునికార్ముకకర్మకౌశలముఁ గనుఁడు
నల్లకల్వలఁ బోలునానగరిలోల
లోచనాలోచనములు నారాచములుగఁ
గాంచి పాషాణహృదయముల్ గాఁడ నేయు. 17

చ. జలనిధిమేఖలాకలితసారమణుల్ విలసిల్లుభూమిచే
లలితవధూతటిల్లసితలాస్యసమంచితమేఘమాలచేఁ
బొలుపగు పూలమాలికలఁ బోలనుడుల్ సొబఁగొందుమింటిచే
నలలిత మప్పురంబు గడుసౌరు ఘటించెను గంతుతల్పమై. 18

చ. కొలనియెడౝ గుణంబులనుగూర్చి నుతుల్ వొనరింపఁగా వలం
తులు గలరే! మెలంగు నటఁ దుష్టిని హంసలు వానలందునే
నలఘుతదీయవప్రసముదగ్రత దుర్హృదలంఘనీయ మై
నలలితకీర్తిఁ గాంచు రిపుసైనికు లెంతయు నోడి పాఱఁగాౝ. 19

తే. గీ. రాత్రులం దున్నతోన్నతరమ్యసౌధ
గాహనము సేయఃశశికురంగకము మెదను
వంచి వనితాఽవతంసదూర్వలను గొనఁగఁ
గోరు; మేడలఁ బొగడంగ నౌర! తరమె. 20

చ. పురజనదృక్కురంగములఁ బూన్చెడుబంధము లౌను గాని వా
గురలు గనంగ రావు, విరికోలలతాలుపునాన లౌను న
క్కురములు లేవు, యౌవతసుకల్పితనృత్తము లింటనింటఁ గూ
ర్పురహి విచిత్ర మౌను బెఱసొంపులవర్ణన సేయ నేటికిౝ. 21

తే. గీ. మూఁడులోకములను దన కీడు గనక
మహితగుణముల మానసమార్గ మైనఁ
గడచునిప్పురి కెట్టులఁ బడయు దీటు ?
మానసైకసుగోచర మైనయలక.  22

ఉ. అప్రతిమానచాపవిభవాయితు భార్గవుఁ బోలుపార్థివుం
డప్రతివీరుఁ డై దిశల నాజి జయించి పురిన్ వసించి య
ర్థిప్రకరార్థకోటిఁ గడుఁ బ్రీతిగఁ బూరణ సేసెఁ గాదె; పా
త్రప్రతిపాదనంబు ధర ధన్యతఁ గూర్పు నపారలక్ష్మికిన్.  23

చ. ధరణి ననర్ఘవస్తుసముదాయములెల్లఁ దమంత వచ్చి యా
ధరణిపుపాదమూలమునఁ దద్వశతాస్థితి నొప్పు చుండినన్
వరసుతుమోముచందురుప్రభన్ గన లేనివిభుండు రోఁచె నాఁ
దరయఁ బ్రభాతనీలకుముదాయితదీనవిలోచనుండుగాన్.  24

ఉ. అత్తరి బాష్పము ల్గని క్రమాఽగతశోకము వాఁప లేక డ
గ్గుత్తుక డిందుమాటలను గూర్మిప్రియం దతిఁ జేరి పల్కె భూ
భృత్తపనుండు దంతములవెన్నెలకాంతులు నైజభారతిన్
ముత్తెపుహారలక్ష్మివిధిఁ బూని రుచిన్ ద్విగుణీకరింపఁగన్.  25

మ. అతివా ! యే మని చెప్పువాఁడ ఫలశూన్యం బైనగార్హస్థ్య మన్
క్షితిజ బిప్తు మదీయచిత్తముఁ గలంచెన్ శాంతి లేదయ్యె నా
ప్రతిబింబం బన నొప్పునాత్మజుని దౌర్భాగ్యంబునన్ గాన నా
కుతుకం బింతకుఁ గాంచనైతిఁ బ్రమదాంకూరాప్తిగా నీయెడన్.  26

ఉ. నా దగుశౌర్యసంపదకు నాగుణపాళికిఁ దుల్యుఁ డై కళా
శ్రీదయితుండు రాజు దనుఁ జేరకయున్నఁ జటుక్యలక్ష్మి దా
నోదయితా ! సముద్రచలితోర్మ్మల నూఁగెడునోడకట్లపైఁ
బా దగుచున్ వడంకుఁ గనుపక్షివిధంబును దోఁపఁ జేసెడిన్.  27



క. ప్రియునిప్రసాదముఁ బడసియుఁ
బ్రియభూషల హాయల నైనఁ బ్రియగేహినియే;
ప్రియసుతు నళీకహాసునిఁ
బ్రియాఽఙ్కపర్యంకమందుఁ బెంపక యున్నన్,  28

చ. తన దగునేగుణంబును వితర్క మొనర్చి యపత్యజాతమున్
గొనకొని పెంచుచుండు నిలఁ గ్రూరమృగంబును; గానఁ బంకజాఽ
నన; యిది వస్తుతత్త్వము; కనంగ నచింత్యము; నీదృశంబుగాఁ
దనరెడుచిత్తవృత్తి తలిదండ్రులచే సుతులందుఁ జూప నౌ.  29

క. తురగమఖరాజసూయా
ధ్వరనికరము లెన్నియే నుభయలోకములం
దరుదుగఁ బిత్రాణ ముడిపెడి
వరసుతునకు సాటియే ! శుభము గృహి గనునే.  30

క. అగునే ధన్యుఁడు శౌర్యాఽ
దిగుణంబులు గల్గునరపతి భుజాబలకీ
ర్తి గడించుసుతునిచే ముం
న్నగ నుతిఁ గన కున్న నిలఁ దనుజవంతులలో.  31

మ. అని యాతీరున రాజు వల్కఁ గడు శోకాఽయత్తచిత్తంబునన్
వినియెన్ శ్రోత్రపథప్రమాథికథ; శాంతిం బొంద కారాజకాం
త, నరేంద్రున్ గని యేమి వల్కకయ చింతన్ గుంది నిట్టూర్పులన్
దనరించెన్ దనఫాలభాగమున వ్యత్యస్తాలకంబుల్ దగన్.  32

ఉ. ధీరుఁ డధీర యైనవెలఁదిన్ దనయంకతలంబు నంతటన్
జేరిచి పెన్దయన్ గదురఁ జేసి సముజ్జ్వలదంతకాంతి యన్
వారిని వారిజాక్షిమదివంతలపేర్మినిఁ బాపురీతి వ్యా
హార మొనర్చె నైజవచనామృతవృష్టి ప్రియంబుఁ గొల్పఁగన్.  33

మ. వరగాత్రీ! వదనంబు కోష్ణ మగునిశ్వాసంబునన్ ధూసరా
ధర మౌనట్టు లదేల చేసెదు విషాదం బింకఁ జాలింపుమా!
యరికట్టన్ సమకట్టితిన్ వెస నభీష్టావాప్తి విఘ్నంబులన్;
వరదుం డర్ధశశాంకమౌళి మనపాపంబెల్లఁ బోనాడెడిన్. 34

శా. సంతానంబు లభింప నాకు మిపులన్ సౌలభ్య మేపారెడిన్
గాంతా! వేదములెల్ల నేర్చితిని శిక్షం గంటి శాస్త్రంబు ల
త్యంతశ్రద్ధ శ్రమించి పూర్వకథలన్ సాంతంబుగాఁ గ్రోలితిన్
సుం తైనన్ గురులాజ్ఞ మీఱక మనంబున్ వారిపై నిల్పితిన్. 35

క. కులగురు వై మనపాలన్
విలసిల్ల శశాంకమౌళి భీతిల నగునే!
యిల దుష్ప్రాపము లున్నే!
యలసతఁ గరగతపదార్థ మందరు మునులున్. 36

ఆ వె. కాన నెంతదనుక ఖండేందుశేఖరుం
డతులదయను జూపఁ డంతకాల
మింతి! తపము నిశ్చయించితి నీతోడ
దుర్జయేంద్రియములదుడుకు నడఁచి. 37

క. ఇంద్రియము లలయఁగా ని
స్తంద్రుఁడ నై తపముఁ గలుషశాంతి కొనర్తున్
చంద్రార్ధమకుటు, శంకరు
సాంద్రం బగుభక్తి వెసఁ బ్రసన్ను సలుపుదున్. 38

క. అన దేవేరియు నట్లే
యని సమ్మతిఁ దెలుప నంత నాతఁడు రాజ్యం
బు నమాత్యులవశ మొనరిఁచి
తనరెఁ దపోనియతి నర్థితప్రాప్తికినై. 39



క. సాఽదృతిఁ దెచ్చి సుమంబుల
భూదయితుఁడు కృత్తివాసుఁ బూజించుచుఁ దా
మేదినివాసమున రజో
మేదురుఁ డై తపము సలిపె మించి తపసులన్. 40

క. సుకుమారతై కధనుఁడు నృ
పకుంజరుఁడు మునులకేని భరియింపఁగ రా
నికడిఁదిశ్రమ కోర్చి తప
స్యకుఁ బూనుచు నొప్పె నుదుగదాఽవ్రతశాలి యై. 41

క. బెడిదంపుఁదపోవ్రతమునఁ
గడుఁ గృశియించిననృపాలుఁ గమలవదన వెం
బడిఁ గొలిచె శాంతితో నొర
పిడిఁ గనురవ వెన్నడించువెలివెల్గువలెన్. 42

సీ. తనపతి సేవించుత్రిణయనుమకుటగం
గాస్రవంతీతరంగముల శీత
హాతాంకురంబుల బడలిక దీఱిన
యదివోలె నృపకాంత యధికభక్తిఁ
బతిసేవ బాగుగాఁ బచరించు; స్వయముగా
నలికి మ్రుగ్గిడు మందిరాజిరమునఁ;
దనమహోన్నతికిని దగునట్లు, తగునట్టు
లౌదార్యనిధి మది కానృపాలుఁ

తే. గీ. డింద్రియము లోర్చి బహుకాల మిందుశేఖ
రప్రసన్నత కుగ్ర మౌనవ్రతముఁ బూని
యుండ నొకనాఁడు వినియెఁ బ్రత్యూషపూజ
సలుపువేళ నాకసమునఁ బొలుచువాణి. 43

క. చాళుక్యక్షితిపాలక!
పాలింపుము తపము నీకుఁ బ్రశాంతిని గనుమా!
త్రైలోక్యపాలకుఁడు నీ
పాలను గలఁ డయ్య! భక్తవాత్సల్యమునన్. 44

ఉ. ఓనరపాలశేఖర! శుభోదయ మందఁగలాఁడ వయ్య! యీ
నీనయనాభిరామ సతి నెయ్యము మీఱ సుతత్రయంబు నెం
తో నుతి కెక్కఁ గాంచును దదూర్జితకీర్తివికాసమౌక్తిక
శ్రీనిఁ జళుక్యవంశము శుచిత్వనిధానము గాఁగ నొప్పెడున్. 45

ఉ. ఆతనయత్రయంబునఁ గలాఉఉలయుఁ దూర్జితవిక్రముండు మాం
ధాత్రదిలీపముఖ్యవసుధావరకీర్తు లతిక్రమించి త
న్మాతకు నీకు సంతసము మధ్యమపుత్త్రుఁడు గూర్చెడున్ జయ
శ్రీ తనయంతఁ దా వలచి చెచ్చెఱఁ జేరును వానిఁ బార్థివా! 46

తే. గీ. కడమసుతు లిర్వురను దమకర్మగతిని
బుట్టుదురు రాజ! మధ్యమపుత్త్రుఁ డరయ
మత్ప్రసాదంబునం బుట్టి మహితపటిమ
రాజ్య మాసాగరం బేలు రాముఁ బోలి. 47

మ. అని యీతీరున వ్యోమసాగరమునం దానంద మేపారఁగా
జనితం బైనసువాక్సుధన్ శ్రుతిపుటిన్ జాళుక్యభూమీశుఁ డం
తను సంతోషముమీఱఁ గ్రోలి పులకాంచత్సర్వదేహుండు నై
యనుభూతిన్ గనె గాత్ర మంతటను శైత్యవ్యాప్తిచేతన్ దలిన్. 48

క. కని సంతోషాలసలో
చన నవ్యపురంధ్రిసుగుణసందోహము మిం
చినసతి నానందాశ్రుల
జనపాలుండు కడుసంతసంబునఁ దేల్చెన్. 49



క. వ్రతపారణవిధిఁ దీర్చె
నతఁ డంతట ధనములన్ ద్విజావళిఁ దనిపెన్
దతసౌభాగ్యవిలాసాం
చితజాయం గూడి రాచసిరుల భజించెన్. 50

ఆ. వె. వేల్పుతేనిఁ బోలువిశ్వంభరాపతి
సుముఖియందు సుభగసుతుని శుభము
హూర్తమందుఁ గాంచి యూర్జితోత్సవమున
నిఖిలజగతి ధన్యునిగఁ దలంచె. 51

ఉ. ఆమదజేశ్వరాత్మజుఁ డనంతముగాఁగఁ జళుక్యరాజ్యల
క్ష్మీమహితావనీపతాలచెన్నగునేత్రచకోరపంక్తికిన్
సోమునిరీతి సంతసము సొప్పడ జేయుట నొందె 'సోముఁ' డన్
నామము సార్థ మంచుజననాయకముఖ్యులు వేడ్కమై నిరన్. 52

తే. గీ. కడమకొడుకులకన్నను నడిమివాఁడు
కడుసమర్థుఁ డటన్ననాకాశవాణి
సతముఁ దలఁచుచు నాతనిజన్మమునకు
నెలమి నీక్షించుచుండె నుర్వీశుఁ డంత. 53

తే. గీ స్ఫటికనిర్మలకాంతితో వఱలుసట్టి
గర్భశయితార్భకునిదేహకాంతితోడ
వ్యాప్త మట్లుగ బిసదండపాండురంబు
వెలఁదిచెక్కిలిఁ గాంచె భూవిభుఁడు ప్రీతి. 54

క. బంగరుసోనఁ గురిసె రా
ట్పుంగవుఁ డలమ్రొక్కుఁబడి విబుధులకుఁ దీర్చెన్
గంగామకుటుదయం గను
నంగజప్రేమమున వేడ్క లన్నియుఁ జేసెన్. 55

మ. క్షితిపాలాంగన దాల్చె దేహలత నక్షీణప్రభావంబుతో
నతిధావళ్యము గల్గి యంత నమృతవ్యాప్తిన్ దగన్ గాంచె నా
న్వితమున్ జొప్పడ నై జనిర్మలత క్షోణీనాథుపెన్ దుఃఖ మన్
దతపంకంబుఁ దొలంచె మోద మిడి చిత్తంబున్ గడున్ దేటిచెన్. 56

తే. గీ. ఇందుబింబంబుఁ బిదిచి పాలిండ్ల సుధయె
స్తన్యముగ విడఁ బడె నాఁగఁ దరుణిచూచు
కయుగ ముత్పలనీల మై కాంతిఁ దనరె
నిందులాంఛననీలిమ నందె ననఁగ. 57

ఉ. కాంచనకుంభకాంతి గలకాంతచనుంగవ యెంతయుం బ్రకా
శించె సుధాప్రవాహమును క్షీరమిషంబునఁ గాంచెనో యనన్;
మించినయార్ద్రచందనము మే లగుశైత్యచికిత్స కూర్చ గా
లించఁగ నిద్ధచేలమువలెన్ గనుపట్టె విశుభ్రకాంతిమై. 58

క. క్షితిపతిసుతార్థ ముంచిన
సతికుచకుంభముల నొప్పుస్తన్యంబు విలా
సతరళముక్తారుచిమిష
గతి ధరియించెన్ సుమల్లికావాస మొగిన్. 59

ఆ. వె. విభునిపుత్రుఁ దనుభవించుమృగీనేత్ర
చూచుకములనలుపు సొంపు పొలుచు
మహిమ సంక్రమింప మహితరసాయనౌ
షధిదళద్వయంపుశ్యామ మనఁగ. 60

క. ఎడతెగనియిడుమలన్ గూ
ర్చెడులేమికి నెట్టు లోర్చునృపతనయుఁడు ని
ప్పుడు తల్లికడుపునుండియ
నడుమంత్రపులేమి మనమునన్ నిరసింపన్. 61



క. వలియుల్లాసనమున్నతిఁ
బొలియించెను గర్భ; మట్లు పొదమునకీర్తిన్
దొలఁగించెను దనయందున్
[1]వలియుల్లాసంబు నూని ప్రస్తుతిఁ గనఁగన్. 62

క. క్షితిభారము శాంతింప న
వతారమున్ గనెడుసుతుఁడు వసుధాపీడాఽఽ
యతి నోర్వమిఁ గనఁ జేసెను
క్షితిపతిసతిగర్భభారఖిన్నపదగతిన్. 63

క. క్వణదురుకాంచీవిలస
న్మణిబింబితసఖిజనంబు దగఁ దత్కాంతా
మణి భాసిలె నిలువేల్పుల
గణములు గలయంగఁ గొలుచుకైవడిఁ దోఁపన్. 64

క. అతివీరవిక్రముఁడు సుతుఁ
డతివయుదరమందుఁ గ్రాల నమలమణిభువిన్
బ్రతిబింబితోచ్చగృహములు
నతులితకులగిరు లనన్ ఘనము లై యొప్పెన్. 65

చ. నృపసతి మేఖలామణిమరీచులచే సొబఁ గొందె నంత ఘ
న్రపతినమోదరస్థతనుజన్మునితేజముచే ననన్ నిశా
ధిపతి నిశాముఖంబులఁ దదీయహృదిన్ బ్రతిబింబరీతిగా
నుపచరణంబు సేయునటు లొప్పెను గర్భశిశూపధాన మై. 66

సీ. ఆశాగజేంద్రకుంభాయితబిత్తుల
నంఘ్రియుగన్యాస మభిలషించు;
ధారాసలిలపానతత్పర యై యసి
ధారలఁ జూపులఁ బాఱఁ జేయు;

1. వబలకు భేదములేదుగనుక నిట 'బలియుల్లాస' మని భావము.

సుపరిస్థవస్తుసమూహంబున నుదుల
నైన రోషారుణిమాఽప్తిఁ జూచుఁ;
బాదయుగార్ద్రసంవాహన మొనరింప
గరువంబునన్ దిగంగనలఁ జీరు;

గీ ముఖరితవిభూషలను బొమల్ ముడిచి కాంచు;
నిశ్చలాగ్రప్రదీపనిర్నిద్రకాంతిఁ
దనరుగృహముల నైన మత్సరమునఁ గను;
గర్భభారాలస యిలేశుకాంత యరతి. 67

ఉ. ఇట్టులు భూమిపాలుతరలేక్షణ యందము నై విచిత్ర మౌ
నట్టుల గర్భదోహదము లంది ప్రతాపనిధానుఁ డైనరా
పట్టినిఁ దోఁపఁ జేయుచు నృపాలశిఖామణి కంత సంతసం
బుట్టిపఠన్ గనుంగవకు నుత్సవ మయ్యె సుధాఽఽక్తవర్తి యై. 68

తే. గీ. శాస్త్రరీతిని వరుసఁ బుంసవన మాది
సర్వకర్మలు నెఱపె రసావరుండు
నంతఁ గాంత విశేషచిహ్నములఁ దోఁచె
వసుమతీశున కాసన్నఫలము దెలియ. 69

తే. గీ. ముజ్జగములక్ష్మి విభ్రమమునఁ గనుగతి
ద్రావితేందుకరంబులఁ దదుపరీతి
మేదినీపతిమోదంబు మేర మీఱెఁ
గోర్కెతీవియ ఫలములఁ గూర్ప నుండ 70

ఉ. ఆవిభుకాంత సేరె భిషగాహితసర్వచికిత్సమున్ సుర
శావిధికల్పితాక్షతము సంతతదక్షకులాంగనాసమా
సేవిత మౌనరిష్టము విశిష్టవిధిజ్ఞహితాహమం దనం
తావరుఁ దన్పుచున్ సుశకునంబు లనంతము లుత్సవం బిడన్. 71



సీ. మిసిమిచాయలతోడ మించుప్రదీపము
లార్తిచే జపియించునట్లు దోఁప,
బాలకసహితమరాళపుత్రిక నైనఁ
బరిజనుల్ వేడ్క నుపాయ మడుఁగ,
గృహదేహళిన్ శస్త్రధృతమంత్రవేత్తల
క్షతలను జల్లి హుంకృతులు సలుప,
ముసలిచేడెలు హితబోధ లల్లన సల్పఁ
గడుశోకమున శుకాంగనలు వినఁగ,

ఆ. వె పూర్వమందు నెట్టిసార్వభౌముఁడు గాంచఁ
జాలనట్టియక్కజంపులగ్న
మందు నృపతికాంత యిందుశేఖరుకృప
సూతికాగృహమున సూనుఁ గనియె 72

క. భ్రమరస్వనకలితం బగు
సుమవర్షము గురిసె మ్రోగెఁ సురదుందుభు లు
త్తమగతిఁ దెలి వొందె దెసల్
కొమరునితో బయలువెడలు గుణములచే నాన్. 73

క. కర మారాత్రికదీప
స్ఫురణన్ నూత్నప్రతాపశోభితుఁ డయ్యెన్
నరపతితనయుఁడు దినపతి
సురుచిప్రాక్సంధ్యచేత సొంపుఁ గొందు క్రియన్. 74

చ. సవిధమునందు రత్నమయసద్మవినిర్మలభిత్తిసీమలన్
భువనవిశిష్టవిగ్రహము పొల్పు గనన్ దగి యొప్పె ధారిణీ
ధవసుతుఁ డాత్మసేవలఁ గృతజ్ఞతచే స్మరియించు నంచు లోఁ
దవిలినవేడ్క దిక్పతులు దా మొది నర్మిలిఁ దాల్చిరో యనన్. 75

చ. నరరమణావతంసునకు నందనుఁ డుద్భవ మౌట ముందుగా
సురనికరంబు దెల్పెఁ బరిశోభితనాంద్యనువాదపై ఖరిన్
బరువడిఁ దత్సమంబు పరమం బగుమోదమునన్ వరాఽనల్
త్వరితవిలాసయానపరితఃస్ఖలితాఽత్మవచోవిజృంభణన్. 76

మ. హరు వొందెన్ నృపమందిరంబు సురదత్తానేకదివ్యాంబరాఽ
భరణం బై పరిబద్ధగీతనినదభ్రాజిష్ణుగాథావిధా
స్ఫురదాతోద్యనమున్మిళన్నటన మై స్ఫూర్జచ్ఛుభోదర్కతూ
ర్యరవం బై పటువందికీర్తితపురారాజన్యచారిత్ర మై. 77

చ. క్షితిపతి యంతఁ బుత్రునకుఁ జేసెను జిత్తము రంజిలం బురో
హితుఁడు విధించుకార్యములనెల్ల విధానవిధుండు; తత్పుతున్
ప్రతినిమిషంబు తాఁకుచు నపారమహోత్సవ మందె; విశ్వసం
స్తుతగృహమేధిభావమున ముఖ్యఫలం బిది యై రహించుఁగా. 78

తే. గీ. బాల్యచేష్టావిశేషముల్ భావివిక్ర
మాద్భుతౌజస్సులను దెల్పునట్టు లలరఁ
దదనుగుణముగ నృపపుత్రుఁ డుదితగుణుఁడు
సరవి శ్రీవిక్రమాదిత్యసంజ్ఞ నందె. 79

క. అవదాతద్యుతియు యశో
ధవళిత దిఙ్ముఖుఁడు నైనతద్విక్రముచే
నృపవరునతి విక్రమోదయ
సువంద్యసామ్రాజ్యలక్ష్మిచొప్పునఁ జెలఁగెన్. 80

క. కరపల్లవమున బాలుఁడు
సర మమరిచి చన్ను గుడుచుచాయలఁ దెలిపెన్
వరభోగములందుఁ దన క
పరిహారణీయులు గుణ లనుభావము గరిమన్. 81



తే. గీ. తల్లియొడి నున్నహారాఽళిధవళరుచులు
సొచ్చి జాల్వారె నన నొప్పునుతు నహేతు
కస్మితజ్యోత్స్న నృపవరదృక్కైరవాళి
కలరె విం దగుచున్ వైజయంతికరణి. 82

క. సుతుముష్టిఁ జొచ్చునరుణ
ద్యుతిమద్రత్నప్రదీపకోరితరోచి
ర్గత యొప్పె శత్రుశోణిత
తతసహజకృపాణలేఖఁ దాల్చెనొ నాఁగన్. 83

తే. గీ. అక్కుమారుఁడు గూర్చుండునట్టివారి
వీడి నిల్చినవారివిధముఁ జేరు;
నున్నఽతాత్ముండు మున్ జూప నున్నయట్టి
నీచవై ముఖ్యరీతి నందియము దీఱ. 84

చ. స్మితయుతహుంకృతిన్ సుతుఁడు చేటికిఁ జేసి క్షితీట్పృతిద్వయం
బతులసుధాప్రపూరణల నార్చు; నృపాలునివేలుపట్టి యు
త్థితుఁ డయి సానుడుల్ నలుపుతీరు తదుర్వివరేణ్యదృక్ఛ్రుతి
ద్వితయమునం గడున్ బొదలు వింతగ సంవననౌషధంబుగన్. 85

చ. క్రమముగఁ జూళకర్మ జరుగన్ జనతాఽత్తవినోదవిభ్రమో
ద్గమతతిఁ గూర్చి నందనతఁ దన్నృపచంద్రసుతుండు పాంసువి
భ్రమపరిధూసరాంగుఁ డయి పార్థివునంకము నెక్కి వశ్యచూ
ర్ణముగఁ దనూగళద్రజముఁ గ్రాలఁగఁ జేసె క్షమేనుమేనునన్. 86

క. నృపతులప్రణతులఁ గెల్మో
డుపుల నిరాదృతిఁ గనులు ముడుంచు నృపుఁడు త
ద్విపులై కకరసరోజా
తపరీతప్రణతిఁ గృతిగఁ దనుఁ దలఁచికొనున్. 87

క. ప్రతినిమిషంబును గుంతల
పతి యాత్మజుముద్దుఁ గొనఁ బ్రవాళోష్ఠప్రో
దిత మైనరాగమునవలె
నతనిమనము రాగపూర్ణ మై యిర వొందున్. 88

ఆ. వె. వదనచంద్రునందు వఱలఁ గోరుమృగంబు
వెలవఁ జేయ నిడెడువిధమొ నాఁగ
రాజసుతుఁడు గడు విరాజిలెఁ దనమెర
యందు నిద్దపులినఖాంకురమున. 89

క. రోవెలందులయందెలరొదకు దరియు
రాజహంసలఁ గేళి దూరముగఁ దోలి
భావిఁ దా నొక్కఁడే భూమిపాలుఁ డంచు
నతఁడు దెలిపెను రాజహంసాసహనత. 90

తే. గీ. ఇనుఁపబోనుల నిరవు గాంచినమృగేంద్ర
డింభములఁ గేళిపరతఁ బీడించు నతఁడు
భావిపరిపంథ్యనేకపప్రథనసముప
యోగమునకయి తచ్ఛౌర్య మూనె ననఁగ. 91

క. ఉదయ మెనసి బాలేందుఁడు
పదనఖయుతి వృద్ధిఁ గనుచు వఱలెన్ దన్నున్
గదిసి సహఖేలనమునకు
గుదిగొని చలివెలుఁగుబాలకులు వేఁడి రనన్. 92

మ. లిపు లెల్లన్ గ్రమ మేర్పడన్ నిపుణత ల్మీఱన్ గడించెన్; స్వభా
వపవిత్రాత్ముల కెందు నొజ్జలు దలంపన్ హేతుమాత్రుల్ గదా!
కుపసూనుం దలవాటుమాత్రకయి ముల్కుల్ దిక్కులన్ రువ్వె గా
యపడన్ గల్గినభీతిఁ బోలె విరళం బై పార్థుకీర్తుల్ ననన్. 93



తే. గీ. పరమలావణ్యలుబ్ధభూపాలకన్య
కామధువ్రతీతతి తన్ముఖంబుఁ బడయఁ
గలుగుటకు మున్నె చుంబింపఁ గలిగె నౌర!
భారతి కవిత్వవక్తృత్వఫలముతోడ. 94

క. లావణ్యకలాతతిసం
భావితుఁ డై వఱలునట్టిబాలేందుఁడు ని
ద్రావిముఖతఁ గూర్చెను దొవ
తీవలకునుబోలె మదవతీజనమునకున్. 95

క. ధృతి నాతఁడు న్యక్కృతిఁ జనఁ
దతముగ్ధభ్రుకుటిపటలిఁ దగి మరుకేళిన్
గుతుకము గలనగరస్త్రీ
తతికనుఁగవదొవలు కిన్కఁ దాల్చు నతనిపై. 96

క. లావణ్యరమాధాముఁడు
క్ష్మావిభుసుతుఁ డెదుగ నెట్టికామినులకునేన్
దా వై యెనఁగవె నిద్రా
భావప్రచురతలు నేత్రపంక్తులయందున్. 97

చ. ఇతఁడు సమున్నతాఽత్ముఁడు సహించఁడు తేజు గలట్టివారియు
న్నతిఁ బసివాఁడు నై యవనినాథకుమారుఁడు; భాస్కరుండు త
త్ప్రతి మతిఁ గుంది దీనుఁ డయి దేవుఁడు నయ్యు సమాశ్రయించి సం
తతముఁ జరించు నచ్యుతపదంబున దా శరణేచ్ఛచేఁ బలెన్. 98

క. తేజోధనోపరిస్థిత
రాజన్యకుమారమకుటరత్నము పైగాఁ
దే జొందుట క్షమఁ గోరెడు
నోజన్ మణిపాదపీఠి నొదిగి యెఱఁగెడున్. 99

క. కలనేఁ గీర్తి దరిద్రత
గలుగు ననుట లేనియతఁడు గౌరీశుదయన్
గలిగె జయసింహుఁ డన భూ
తలనాథునకున్ దృతీయతనుజాతుం డై. 100

క. సకలకలాకోవిదుఁ డై
యకలంకరణోత్సవముల నత్యుత్కంఠన్
బ్రకటించువిక్రమార్యము
నొకనాఁడు నృపుండు సూచి యూహించె నిటుల్. 101

క. అక్కజపుసాహసము గల
యిక్కుమరుం డేకవీరుఁ డిభరిపుపీఠం
బెక్కిన సింహివలె నాడిం
జిక్కినరాసిరి నెవండు సేకొన నిక్కన్. 102

తే. గీ. కాన నీసుతు యువరాజుగా నొనర్తు
నితఁడు సామ్రాజ్యభారంబు ధృతినిఁ దాల్ప
నిరుతటంబులప్రాపున నెసఁగునట్టి
ధునిగ నృపలక్ష్మి తుల్యతఁ గనునుగాత. 103

క. ఈరీతిన్ గృతనిశ్చయుఁ
డౌరాజునకుం బ్రణామ మర్పించి తగన్
గీరమణీనూపురశిం
జారవసోదరరుతిన్ నృపాత్మజుఁ డనియెన్. 104

క. తలఁ దాల్తు రాన నృపతులు;
కలదు సిరియుఁ ద్యాగభోగకలనకు వశ యై;
సులభమ సకలము మీదయ
నల యువరాజత్వ మేల నందఁగ నాకున్? 105



క. అన విని నృపుఁ డి ట్లను నో
తనయ! మదిష్టమున కేలఁ దాల్తువు ద వ్వా
మనమును నీ దగుపుట్టువు
నను నాపదుపాట్ల నాపినాకియె యెఱుఁగున్. 106

తే. గీ. యౌవరాజ్యంబుఁ గై సేసి యవనియ[1]వన
యామికత్వంబుఁ దాల్పఁగా నరయవేని
జ్యారవాఽపూరితదిశాఽఽస్య మైనమద్భు
జమున కేరీతిఁ గ్లాంతి విశ్రాంతి దనరు. 107

తే. గీ. కలఁతఁ గర్ణాటపతి యిటు పలుక విని కు
మారుఁ డాత్మజనకునకు మాఱు పలికె
భారతీలాలితదుకూలభాసమాన
దంతదీధితిలేఖఁ జిందంగఁ జేసి. 108

క. కవులయెదుట వాచాలత,
[2]కువహితుకడఁ గాంతిమద మగున్ నాయీపా
టవనాటన; మైనను నే
భవదుపకంఠమునఁ గొంత పలికెద భక్తిన్. 109

సీ. కడుఁ బక్షపాతంబు గలుగుట నాయందు
మీవిచారము సొంపు మీటి వై చు;
నగ్రపుత్రుఁడు సోముఁ డటు లుండ యౌవరా
జ్యాధికారము నా కనర్హ మగును;
జాళుక్యవంశ మాచారవిపర్యయ
మునకుఁ బాల్పడిన నే మనఁగఁ వలయు;
ఘన[3]వైశసమె యహా! కలికుంజరము నిరం
కుశముగా సకట! తా గోచరించు;

---

1. రక్షణ 2. చంద్రుఁడు - కువ+హితుఁడు - 'కువ' 'కువలయ' రూపాంతరము. 'కువాలయం కువలయం కువాలం కుపలం కువం' అని కోశము.
3. హాని.

తే. గీ. నగ్రజుఁడు మ్లానముఖుఁ డగునటు లొనర్చి
నృపరమన్ గొన సిద్ధ మై నిలుతునేనిఁ
బలుక వే లేల నన్యాయపరుఁడ నగుచుఁ
గలుగఁ జేసెదఁ గులకళంకంబు నేను. 110

తే. గీ. కాన నీలక్ష్మిఁ గొనఁగ నగ్రజుఁడె యోగ్యుఁ
డగు; విపర్యాసమలిన మైనట్టియిట్టి
నృపరమాఽఽలింగనముచేత నెలమిఁ గాంచ
నాకుఁ గార్యంబు గాదు భూనాథతిలక! 111

తే. గీ. అనయ మీరాజ్యరమ మీర లరయు చుండ
నగ్రజుఁడు యౌవరాజ్యపదాంచితుఁడు గ
రమణ నాక్రాంతకకుబంతరతఁ జెలంగి
యుర్వరన్ గాలిబంట నై యెలమిఁ గొలుతు. 112

మ. మును శ్రీరామునితండ్రి శాస్త్రసరణిం బోఁబెట్టి రాజ్యాభిషి
క్తు నొనర్పన్ భరతున్; సతీజితుఁ డనన్ దుష్కీర్తి దిక్సీమలన్
గన నౌ నేఁడును; యౌవరాజ్య మది మద్గ్రాహ్యంబు గామిన్ మదిన్
గనరో; నాపయిఁ బ్రేముడిన్ విడుఁడు; విఖ్యాతిన్ నిరోధించెదన్. 113

చ. అని తనయుండు వల్క వసుధాఽధిపుఁ డప్డు శ్రవఃపవిత్ర మై
తనరుతనూజువాక్కుల నితాంతచమత్కృతిఁ గాంచి మించె; నె
వ్వనిమది లక్ష్మి తాఁ గలఁకవాఱ నొనర్పదు పాంసులాఽగ్రయా
యుని యయి? దానిచంచలత నెంచి మనీషి గ్రహింపఁ బూనునే! 114

మ. తనయంకంబునఁ బ్రేమఁ బుత్రు నిడి తత్కంఠంబునన్ నైజదం
తనవోద్యద్రుచి మౌక్తికాఽవళిగ నందం బొప్ప వ్రాకుచ్చె ని
ట్లని రోమాంచితదేహుఁ డై 'తనయ! [1]వంశాలంకృతిన్ బుత్రుఁగా
నిను నాకున్ దయసేసె నెమ్మిని భవానీజాని ప్రీతాఽత్ముఁ డై'. 115

1. వంశమునకు నలంకారము



క. శ్రవణామృతములు వచనము;
లివి వేఱెవ్వానినోట నెలమి బయలగున్?
దివిఽజాలివిలేహ్యములు మ
ధువులు సురతరువునఁ గాక [1]తొరఁగునె పెఱచోన్. 116

తే. గీ. నృపకుమారుల కర్హ మై నెగడునట్టి
దగునె పాత్రంబు నయవిప్లవాఽత్మకులకు?
మత్తదంతిఘటాభారమహిత మగును
రాజ్యరమ; నీకు నిది తృణప్రాయ మయ్యె. 117

క. ఈసిరి లంకాంతికగత
మౌ సాగరమున జనించె నాసురివలె; ర
క్తాఽసవములఁ దనియున్; గను
నీసుభుజాదండబంధనియతి వినీతిన్. 118

క. నీనుడి విన నది యెఱుఁగుదు;
నేను చళుకకులమందె నెగడితిఁగా! యె
ట్లూనున్ స్వభావచంచల
దా నిలుకడ లక్ష్మి గుణకథారహితునెడన్. 119

మ. కలుగం బోలదు నాయెడన్ దొసఁగు నిక్కం బింతయేనిన్ సుమీ!
కలదే నేదియుఁ గౌతుకం బడుగుమా! కార్తాంతికవ్రాతమున్;
దలఁపం జూడవు దుర్గ్రహంబు లతఁడే తాల్పంగ సామ్రాజ్యమున్
గలుషం బెంతయుఁ దద్గ్రహంబులె కడంకన్ గైకొనెన్ దీనికై. 120

క. హరిణాంకమౌళి సామ్రా
జ్యరమావరు నిన్నె తాఁ బ్రసాదించెను బ
ల్వురు సుతులు లోకనుతు లై
పఱఁగినను దుదిసుతయుగమె ఫలమున్ గూర్చున్. 121

1. స్రవించును.

తే. గీ. కాన నాపల్కుఁ బాటింపఁ గనుము వత్స!
చిరసమున్నత యౌఁ గాక వరచళుక్య
రాజ్యరమ; మచ్చరము వీడి రాజు లస్మ
దీయగుణపక్షపాతంబు నెంత్రు గాక. 122

చ. అని జనకుండు పల్కఁ గడు నాదృతిమై విని నవ్వు మోమునన్
దనర వచించెఁ బుత్రకుఁడు; నాదగుభాగ్యవిపర్యయంబుచే
తను దలపెట్టినార లిది; తండ్రి! దురాగ్రహ మింత చెల్లునే!
యనయము నాయశంబున కనంతకళంకము గల్గు దీనిచేన్. 123

తే. గీ. తద్గ్రహంబులు రాజ్యదూతలుగఁ గాని
చో, శివుండును గారుణ్యశూన్యుఁ డేని
వారియండను గొని నీవె వసుధ నేలు;
మాఁపు నన్ను యశోవిపర్యయమునుండి. 124

క. తల నానఁ దాల్చి కెలఁకుల
నిలువఁగ నే నితఁడు శక్తి నిగిడించును బో;
పిలిచినయెడ రక్షామణి
తులఁ బూనఁడె చిత్రకార్యరోహలుఁ దగుచున్. 125

క. ఈలాగు నుచితవచనము
లోలి నతఁడు పల్కి తండ్రి నున్నతకుతుక
వ్యాలోలుఁ జేసి యన్నను
[1]శాలీనత యౌవరాజ్యశాలిన్ జేసెన్. 126

క. స్వయము తుహినాంశుమౌళి స
దయుఁ డై కార్యగతి నెంచి తా నానఁగూర్చున్
సుయశుఁడ నగునాయిష్టముఁ,
బ్రియ మని సుతుమార్గ మనుసరించె జనకుఁడున్. 127

1. మంచితనము.



చ. అల ప్రతిపత్తిపాత్రుఁడుగ నగ్రజుఁ డున్నను లక్ష్మి తమ్మునే
వలచును; నిమ్నపూరకస్రవంతి సరిత్పతిఁ జేరఁ గోరుఁగా;
నెలఁ దలఁ దాల్చుదేవునడి నిస్తులసద్గుణదర్శనంబునన్
నిలిచె నతండు తండ్రియెడ నేర్పరి నిల్చుఘనార్ఘరత్నమై. 128

తే. గీ. యౌవరాజ్యపదస్థుఁ డౌనగ్రజునకు,
రాజపదమందు నున్నధరావరునకు
హితుఁ డితం డయి యుర్వరకృతినిఁ దాల్చె
క్షోణి; శేషాహిధర మాదికూర్మ మట్లు. 129

ఆ. వె. ఆదృతాఽజ్ఞుఁ డైనయావిక్రమాంకునే
యిల రణోత్సవముల నెల్లఁ బనిచి
ధరణిజాని గ్రోలుఁ దదుపార్జితము లైన
నద్యశోఽవతంసజయసుధలను. 130

తే. గీ. తన్మతంగజకుంభవితాననిహిత
చీనపిష్టవిపాటల మైనజలధి
చోళసేనాక్షయోద్భూతశోణితాఽవ
గాఽఽవళిం బూర్తిఁ గాంచినయట్లు మించు. 131

క. [1]హరిసేనలతోఁ జాళు
క్యరాముఁడు తనను దఱియ భయానవలెన్ సా
గరము రదము లిగిలించెన్
దరి ముత్తెపుచిప్ప లగువిధానము పేర్మిన్. 132

చ. మలయనగాంతికంబుల క్షమాపతిపుత్రుఁ డనంతవాహినీ
కలితుఁడుగా మెలంగ గజకర్ణసముచ్చలితానిలాఽవళుల్
కలయఁగ నుర్విఁ బర్వి మధుకాలము గాక వియోగినీజనం
బుల కుపతాప మూనిచె నపూర్వవిధిన్ మలయాద్రిజంబు లై. 133

1. అశ్వసేనలు.

సీ. ఖడ్గధారాంబుసంగతరిపుకీర్తి దు
గ్ధము రాజహంసవిధానఁ గ్రోలెఁ;
గోదండపాండితీకుశలత ద్రావిడీ
ముఖముల వేఁడియూర్పుల వెలార్చెఁ;
బగ సూపి గిరిదురాప్తతిఁ ద్రాపి స్తన్యవి
భ్రాంతిఁ జోళుని భూమి వదలఁ జేసె;
శర బొందుమాలవు ధర నిల్పి కన్యకా
చ్ఛలమునఁ బలుతేండ్లకలుము లొందె;

తే. గీ. దుర్దమారినృపాలురదోర్బలంబు
సూపకయ గెల్చి నమ్రరాజులకుఁ గత్తి
నెత్తకయ సర్వకకుబంతనృపతివర్గ
సన్నుతుఁ డతండు త్రైలోక్యశౌరి యయ్యె. 134

క. వ్యాజావతీర్ణవిష్ణుఁడు
భూజానిసుతుండు హారముక్తారుచి నా
భీజలజోద్గమవారణ
కై జాబిల్లికాంతిఁ బలుపు నవఁగా నొప్పెన్. 135

క. కవిరంజనమున భోజుం,
డవిరతకరిదానదక్షుఁ డగుముంజుండున్
నవతే గుణిహితున కతని
కవిరశతపనీయవృష్టిహస్తాబ్ధునకున్. 136

క. అరిలక్ష్మీపరిరంభణ
పరభుజయుగువానిఖడ్గపటుహతు లడఁచున్
స్ఫురదంగదమాణిక్యం
కురఖరకంటకనిశాతగుణ మనయంబున్. 137



శా. భేదించెన్ శతధా యుదగ్రకులభూభృద్వర్యదండంబులన్
వా దాక్కింతయు లేక తేజమున విశ్వక్షోణి నేకాఽతప
త్రోదారంబుగ నేలులోభమున నయ్యోజస్వి; దేశంబునన్
భూదారాంతరు లాతపత్రవిభవంబుల్ లేక వర్తింపఁగన్. 138

మ. కలనన్ గౌరగజంబులన్ గొనుచు వీఁకన్ గామరూపాధిపా
మలతేజోవిభవంబులన్ డులుచునాక్ష్మాపాలుప్రాలేయని
ర్మలకీర్తిన్ గడుఁ బాడుచుండిరి సహర్షస్వాంత లై ప్రాగ్గిరిన్
నలినీమిత్రరథాఽరవాఽహృతనిశాంతస్వాపసిద్ధాంగనల్. 139

చ. కలను సముత్సుకుం డగుచుఁ గాంచఁగ నేగెను వజ్రి; కాని జ్యా
యులిపున కోడి స్వీయహయ ముండఁగ శ్వేతగజంబు నెక్కి తా
లలితగతిన్ జనన్ వడిఁ బలాయిత మయ్యె గజంబు నింద్రుతో
నల రణదుష్టవారణమదాంబులకున్ వెగ టొందు చంతలోన్. 140

క. ఆరాజుసేన దేవా
గారధ్వజవస్త్రశేషఁగాఁ గూలిచెఁ గాం
చీరాజధాని; నపహృత
చీరపురస్త్రీల కిచ్చుచినుఁగు లనంగా. 141

శా. లంకానాథుతలల్ విదిల్చియు రుషాలౌల్యంబు శాంతింప కీ
వంకన్ గ్రమ్మఱ వచ్చె రాముఁ డని భీభ్రాంతిన్ వశం కొంది రా
లంకావాసులు వైరిరాడ్దళనలీలాయుద్ధగర్జద్ధను
ష్టంకారంబుల రాజు ద్రావిడులదేశం బల్లాడించఁగన్. 142

క. ఆరాకొమరుఁ డకైతవ
వీరుఁడు యువరాజు కార్యవిధినై యాశా
వారజయం బొనరించెను
మా రెనయనిశూరుఁ డైనమారునిభంగిన్. 143

క. కేరళవధూజనాలక
వీరుత్సవముగఁ బటీరపృథ్వీధ్రధరి
త్రీరుహములు భూపతిసుత
వారణములచే సలీలభంజనఁ గనియెన్. 144

చ. అతనికరుల్ వొనర్చ మలయాగము [1]నాగముగాఁ బటీరమా
రుతముల కయ్యె బల్కల వెఱుంగుదు నంతఁ బరోక్ష మాపితృ
ప్రతతికిఁ బోలెఁ బొ ల్పలుధరారుహపాళికిఁ గూర్చెఁ బిండముల్
సతతవినిస్సృతాఽర్ద్రసితచందనఫేనమిషాన నద్రియున్. 145

చ. అతనికరుల్ పటీరరసమందు మునింగి సరిత్పతిప్రవే
శితములు గా క్షణంబున నశించెడి వారిధియౌర్వతాప; మా
గతి బడబాగ్నితప్త మగుకంధికి వే శిశిరోపచారసం
గతిఁ బొనగూర్చెఁ జందనసనాథపటీరగిరీంద్రనిమ్నగల్. 146

మ. కన నయ్యెన్ నృపసేన సర్వసుదతీకాంతంబుచేఁ బ్రీతిఁ జం
దనసా[2]రంతురంగమప్రకరజన్మక్షోణి యాత్మాఽశిగా;
జనపాలాంగన లంత నూర్పుసురభిశ్వాసానిలంబుల్ గుహల్
నినిచెన్ జందనవాయుబీజములుగా నిల్పన్ బటీరాద్రియున్ 147

చ. కొనియె నతండు రత్నములఁ గుంజరముల్ పెకలించి దాచుచం
దనతరుసంపదాళికి ఘనం బగువిల్వగ వార్ధినుండిఁ; జం
దనగిరియున్ గరిప్రకరదారితచూర్ణితచందనాఽర్ద్రితా
ర్జునశిలలన్ బలాఽహతుల రూ పతె నస్థులె నిల్చినట్లుగా. 148

సీ. తము ద్రొక్క దరిఁ జుట్లు దగఁ గూర్కుసీర్గారు
గొలుసులఁ బోల్పృదాకువులు వొలియఁ,
దమకాళ్ళఁ దవులుసంద్రపుముత్తెములు రిక్క
ఘోడి నొప్పువెలియేన్గుపొలుపుఁ గూర్పఁ;

1. వృక్షములు లేనిదిగా. 2. వాయువు (లేడి వాహనముగాఁ గలవాఁడు).



దమకాళ్ల ద్రొక్క ముక్తాశుక్తు లగలుటల్
త్రాసితవార్ధిహృద్రణనఁ దెలుపఁ;
దమదంతములపైకిఁ దార్చినకదలిపా
ములు సరిత్పత్యంత్రములుగఁ దోఁపఁ

తే. గీ. ద్రావృషేణ్యబ్దభంజనావనిధరాంధ
తమసనమనీలతమమూర్తు లమరున్పవరు
కొమరుదంతిఘటల్ విక్రమమునఁ గడలిఁ
జొచ్చి యవగాహనక్రీడ ముచ్చటించు. 149

సీ. శ్రీభుజంగునకు నిద్రాభంగ మిడుచమూ
కలకలమునఁ గిన్కవలెను గలఁగె;
ధ్వజినీస్ఖలితదుఃఖవశత మే న్వడఁ బాని
విష మీశ్వరుఁడు మ్రింగువిధికి వగచెఁ;
దురగ మొక్కొకటిగఁ దూఁగి రా [1]మందుర
యని వచ్చుదేవాశ్వ మనుచుఁ దెరలెఁ.
గేరళభూపాలకీలాలసంక్రమి
తాబ్ధి కగస్త్యభయంబు వాపె;

తే. గీ. నిట్లు గలఁగుచుఁ గ్రమ్మఱ నెలమిఁ గనుచుఁ
దుదకు సుదతీమనోజ్ఞనిస్తులరదచ్ఛ
దద్యుతుల మించి తనలోనఁ దనరుపవడ
ములు నృపతి కింపు గాఁగ నుప్పొంగె నుదధి. 150

సీ. ఎవనిచే నభయంబు నెనసి సింహాలుఁ దగ
స్త్యాఽశ్రమంబున నెల వందఁ గనియె;
నెవనివి ల్గాంగకుండవధూముఖేందుల
గళితకుండలమండలులుగఁ జేసె;

1. అశ్వశాల. 2. నెత్తురు.

నెవనియశఃకూర్చి దవిలి దిగ్భిత్తుల
ద్రవిడీకపోలపేలవత నెఱపె;
నేజయశీలుచే [1]నెత్తుకొమ్ములు దుల్లి
పగరప్రోల్తల దుల్లుపగిది నొప్పె;
తే. గీ. నతఁడుపొగడొందు వైరిధరాధినాథ
మకుటమణిగణసేవితామలపదాబ్జుఁ
డఖిలకకుబంతసంవ్యాప్తయశుఁడు ఘనుఁడు
విక్రమాదిత్యుఁ డరిలుంఠనక్రముండు. 151

సీ. అతనిప్రతాపంబు క్షితిపసతీతతి
కన్నీటఁ దడియుకోకలను దెలిపె;
నతనిభుజంబు చోళాంతఃపురీరక్ష
వాలదండయుతసింహాళి కొసఁగె;
నతనివలనఁ బలాయితుఁ డయి ద్రవిడుండు
[2]దరదరి దుర్బలతనువు డాఁచె;
నతనిభీతినిఁ బారినట్టిచోళస్త్రీల
నొసటఁ గప్పుర మిప్డునుం బొసంగు;
తే. గీ. అతఁ డొనర్చె నిజప్రతాపాతిశయిత
రక్తుఁ డయి వేంగిభూపాలరాజముఖుల
స్మరుప్రతాపంబునకు ననాస్పదలు గాఁగఁ
రేజు మించినవిక్రమాదిత్యశౌరి. 152

చ. ద్రవిడధరిత్ర్యనర్ఘ్యసముదాయము గూలఁగఁ 'గాంచి' వానిబా
హువులఁ బ్రకంప మొంది యను వొందెను దోరణసూత్రశేష యై
యవలను జక్రకోటపతియంతిపురంబులఁ జిత్రశాలలన్
దవిలినదంతులే నృపవతంసునిచే విడు పొందెఁ బోరునన్. 153

1. ఉన్నతశృంగములు. 2. పర్వతగుహ



క. సకలదిశాజయయాత్రా
ప్రకటితవీర్యుండు మఱలి స్వపురాధ్వమునం
దొకచోట నిలువ నాక
స్మికముగ మతి నరతి నతనిఁ జెంద నతండున్. 154

సీ. తన దగువామనేత్రము స్ఫురింపఁగ శంకఁ
దూఱుచుఁ 'దాతపాదుల కలరుత
శుభ' మని సాశ్రుఁ డై శూన్యచేతస్కుఁ డై
పల్కుచుఁ జింతించె; వనట నెందు
రాసుతునకుఁ గాన రానియొక్కనిచేత
శ్రుతిఁ బడె నొక్కయశుభపువార్త;
యంతరాత్మలకు శుభాశుభవస్తువుల్
ప్రతిబింబరీతిఁ బూర్వమునఁ దోఁచు;

తే. గీ. సకలశాస్త్రప్రవీణతాసారధీర
మాన్వితుం డయ్యు భూమిపాలాత్మజుండు
గనె నధీరత నంత నకారణముగ;
మనుజసామాన్యత యొకప్డు మలయు బుధుల. 155

క. ఆదుర్నిమిత్తశాంతికి
నై దానము లీఁ దలంచి యప్పుడు నిలిచెన్
భూదారకుమారుఁడు నై
న్యోదారుం డగుచుఁ గృష్ణయొడ్డునఁ గలఁకన్. 156

ఉ. అంత నతండు గాంచెఁ దనకై చనుదెంచెడువాని, మోమునన్
వంత దొలంకువానిఁ, దనపట్టణమందుననుండి పంపఁగాఁ
జెంతకుఁ జేరువానిఁ, గడుఁ జెడ్డను దెల్పఁ బరాఙ్ముఖత్వమున్
వింతఁగఁ దాల్చునాలుకను బెల్లగునూర్పుల నాఁపువానినిన్. 157

చ. వెతలెడునూర్పువాయువులు వెచ్చఁగఁ బైపయిఁ బుట్టు చుండఁగాఁ
గడునశుభంపుమాట పలుకన్ దనచెంగట నున్నవాని, బల్
తడఁబడుపల్కులన్ నృపవరతల్లజువార్తను దిక్పయంబు త
న్నడుగునా యంచుఁ బొక్కి కడునార్తుఁడుగాఁ గనుపట్టువానినిన్.

చ. కడునశుభంబుఁ దెచ్చుఘనకల్మషదూషితుఁ డైనవానిఁగా
నెడఁద గణించి యెల్లజను లెంతయు నింద యొనర్పఁ గల్గినన్
జెడక ధృతిన్ సమీపమునఁ జేతులు మోడిచి మ్రొక్కువానిఁ దా
నడిగె నృపాలనందనుఁడు హాయి గదా యని తంత్రితట్టునన్. 159

క. ఈవిధి వసుధాఽధిపసుతుఁ
డావచ్చినముఖ్యదూత నడుగ నతండున్
గ్రేవల నాసీనుం డై
వావిరి నాసాఽగ్రలులితబాష్పుతఁ బలికెన్. 160

క. ఈదుర్వార్తాప్రళయాం
భోదము వ్యాపించు మిగుల భూమీశసుతా!
ధీరత విడనాడకుమా!
చేరుచుమా! ద్రఢిమఁ గరముఁ జిత్తమునందున్. 161

క. ఆపాండుపాండ్యముగ నీ
వాపై నాలోలచోళ మాసింహళమున్
రూపించిననీవిజయము
భూపాలకుమార! వినుచు భూరమణుండున్. 162

క. కనియె సుఖమయస్థితి నం
తన విధి యసమయమునందు ధరణీపతికిఁ గూ
ర్చెను దాహజ్వరముఁ గడున్;
గనిరే నిష్కంపసుఖవికాసము లెవరేన్ ? 163



క. చందనపుఁబూతఁ దాపము
డిందక నరపాలకుఁడు గడిందిగ నిను మే
నం దవిలించుక నీమే
నందలిసుధశైత్య మతిగ నాకాంక్షించెన్. 164

చ. క్రమముగఁ జూపులన్ సగము గాఁగ నిమీలన మేర్పరించెఁ దా
నమరవరేణ్యదూతలను హస్తినిమీలికఁ బంపఁ గోరి; లోఁ
గమియః జ్వరప్రదాహమును గాంచి వినిర్గతి నొందుతద్యశో
రమణిని దంతచంద్రిక విరాజిలఁ జేయుచుః బల్కె మంత్రికిన్. 165

సీ. నృపవరేణ్యమకుటమాణిక్యపట్టికల నా
జ్ఞాలిపిమాలిక నాటినాఁడ;
శరచయచ్ఛిద్రితాఽశాభిత్తులను గీర్తి
రాయంచగూండ్ల నేర్పఱచినాఁడ;
సిరులముదుల్ విప్పి ధరణీదారిద్ర్యంబు
లేకుండ సంపదల్ నెఱపినాఁడ;
సాధుసల్లోకావసథసీమలను శ్రీకిఁ
గులవధూసామ్యముఁ గూర్చినాఁడఁ;

గీ. జాపపాండిత్యభవరమాసంయుతుండు
విక్రమాంకుండు కాకుత్స్థవీరబలుఁడు
దిక్సమాక్రాంతశౌర్యదేదీప్యమానుఁ
డయినసూనునిఁ గాంచి పెం పందినాఁడ. 166

చ. అతఁడె యశస్వి యీయువధరాఽధిపతిత్వమునన్ నిజాగ్రజున్
స్థితు నొనరించి యాతనినె చేసె మహీభరధుర్యుఁ గాఁగ; సం
తతముద మయ్యె శర్వపరతంత్రశిరోమణి యైననాకుఁ బ
ర్వతతనయాసనాథునగరంబుఁ జనంగ సముత్సహించెదన్. 167

క. నను నెఱిఁగికొందురు హతా
వనిపతు లున్మదకవాటపాలకగళహ
స్తనివారితసేవకు లై
కనఁ జాలనివానిఁ గాఁగ ఘనవిధికై నన్. 168

చ. తనరెఁ జళుక్యభూరమణతల్లజశుద్ధకులంబునందు నా
జననము కొద్దిగొప్పలుగ శాస్త్రరహస్యసదర్థసంగ్రహం
బెనసెఁ శ్రవోఽనుసంగతి మదేభచలచ్ఛ్రవణాంతచంచలం
బనిహతజీవితంబుఁ గన నయ్యె శివున్ విడి నమ్మ నన్యమున్. 169

మ. శివసేవన్ భువనోపకారమునకై చెందంగ నా మేను; దా
ని విడంగాఁ దగుఁ దత్పరత్వమున; శాంతిన్ దుంగభద్రానదీ
[1]భువనంబందున మే న్విడన్ దలఁచితిన్ భూతేశచింతానితాం
తవశాంతఃకరణుండ నై యిటుపయిన్ దత్పాదసంప్రాప్తికై. 170

క. అవనీపతిపల్కుల కపు
డవధానముతోడ మంత్రు లంగీకృతిమై
నవు నని పల్కిరి; యుచితం
బవుచేఁతకు నెవరిమనసు లందవు ముదమున్? 171

చ. తదనుగ మేదినీపతి ముదంబునఁ గొన్నిప్రయాణముల్ తన
ర్చి దరిసి కాంచె వీచికలచేతులచేఁ దను నింద్రునింటిలో
విదురుచరీతిదానిఁ, దొలివేలుపుతే ర్విడునంచలట్లు నిం
గిదెసకుఁ దూఁగుఫేనమున నిండినపింఛము లూనుదానినిన్. 172

చ. కదుదవుఁ బైకి దూఁకి తిరుగం బడు చుండుపయఃకణంబులన్
గడఁగి తనున్ గనుంగొనుచు గౌరవ మీ నెదురంగ లేచి వ
చ్చెడుగ్రహభంగిఁ దాల్చి విలసించెడుదాని, శుభంబు లెచ్చ మ్రొ
క్కెడియెడువార లొంది భజియించెడుదాని సుప్రవాహినిన్. 173

1. సిరు.



చ. జనకలుషాపహారిణిగ సంస్తుతి కెక్కునభస్తరంగిణిన్
దనమహిమాఽప్తిఁ బోలి జనతానుతయామ్యదిగభ్రనిమ్నగాఽఽ
ఖ్య నలరుతుంగభద్ర దిగి యందు మహీదయితుండు శానమున్
బొనరిచి యద్రిజారమణపూతపదాంబుజచింతనారతిన్, 174

క. ఎడతెగ కొనఁగెఁ బసిండుల
నెడఁద నభిన్నత్వ మమరఁ బృథ్వీపతి; పె
ల్లిదుమల నైనను బెడమొగ
మిడరుగదా! త్యాగనియతి కెందు మహాఽఽత్ముల్. 175

క. గళదఘ్నంబుగఁ దటినీ
జలప్రవేశం బొనర్చి క్ష్మాపతి కల్లో
లలలత్తూర్యరవంబులు
సెలఁగన్ శశిమకుటుపురముఁ జెందెఁ గుమారా! 176

క. అని దూత వలికి నిలువ న
వనివరతనయుండు కనుల బాష్పము లురలన్.
దనపార్శ్వస్థితు లసిపు
త్రినిఁ దొలఁగింపంగ గద్గదితగళరవుఁ డై. 177

క. స్వయమార్ద్రభావుఁ డయి తం
డ్రియెడన్ గడుస్నేహ మలవరించునతం డ
మ్మెయి నొడలు పుడమిపైఁ బడ
దయ గదురఁగఁ బొరలి కెరలి తడఁబడి యేడ్చెన్, 178

సీ. నిత్యదురాచారనియము యమున్ దండ్రి
గాంచుఁగా! రవిఁ గులకంటకునిఁగ;
నేఁడును వెత గాంచ నేరనిదినములఁ
దన్ను దుష్టునిగాఁగఁ దలఁచికొనియెఁ;

గాలకలాతతుల్ గ్రాలె నీగతి నంచుఁ
దీఱనిబాష్పదుర్దినత వగచె;
రాసుతుం డిట్లు ధరాభారధుర్యుఁ డౌ
జనపతి యిలఁ బాసి చనినకతన

తే. గీ. నాదికూర్మ మ! నీకు సౌఖ్యంబు దొలఁగె;
శేష! రాయిడిఁ గను మస్థిశేషుఁడ వయి;
స్వైరకేళీవిహారముల్ చాలఁ సేసి
యెల్ల రిలఁ బూనుఁ డీరు దిగిభములార! 179

మ. కనకస్తంభవిలాసముల్ [1]దొఱఁకుభూకాంత[2]ప్రవేష్టంబు న
య్యనిమేషేనుభరంబుఁ బూనుటకుఁగా హా! బ్రహ్మ మాయించె; నో
జననాథాగ్రణులార! మీపురములన్ స్థైర్యంబుతో నుండుఁ 'డిం
క నెవం డింతటివాఁడు వీరుఁ డగు నెక్కన్ గద్దె' నం చెంచుచున్ 180

సీ. పృథ్వీశదోర్దండవిశ్లేష మొనరింపఁ
బాడియే నీకు నోపౌరుషంబ!
పరిరక్షకుఁడు లేమి వైధుర్యమున నీవు
దపియింపఁ దగును బ్రతాపమ! కడుఁ;
బతి వీడుసంతాప మితరత్ర దుస్సహం
బబ్జాఽకరాఽలయ వగుము పద్మ!
శేషశిరశ్చ్యుతి క్షితికి లె స్సగుఁ; గాని
మంటిగడ్డకుఁ జెల్మి యుంట యెట్లు?

తే. గీ. మునుపు లేనట్టిదుర్మేధ నెనయువేధ
వేఱొకఁడు పుట్టె నంచు భావింతుఁ; గాక
యున్నఁ బూర్వప్రయత్ననిష్పన్నకార్య
నాశ మొనరింప యత్న మొనర్చు నెట్లు? 181

1. అతిశయించు. 2. బాహువు.



సీ. ఆశౌర్య మాధైర్య మాగభీరత్వంబు,
గలుగునే యీగుణకాండ మొకట;
నరిశరంబులు ముక్క లౌవజ్రకాయసం
పదలు నాదొసఁగునఁ బాడువడియె;
విధి యెట్లు సేయుఁ దద్విధసర్గరత్నంబు?
నట్టిసూక్ష్మాంశంబు లలరు టెట్టు?
లెదురుగా నుఱుకువాహినులు పెక్కండ నే
రనియద్ధిగా సత్వరాశి యగుచు

తే. గీ. దుర్గమత నాప్వనృపుఁ డిట్లు నిర్గమించె;
భవ్యుఁడును సౌకుమార్యైకభాజనుఁడును
దొలఁగి పోవ విషాదనిస్తులశతాగ్ని
యిద్ది నేఁ దప్పఁ బరుఁడు సహించు నెవఁడు? 182

క. ఈవిధమున మఱి వేర్గతి
భూవిభుతనయుండు మిగులఁ బొగులుచు నంతన్
బోవఁ దొడంగెను దెరువున
భావగతవివేకభావపరిదీపితుఁ డై. 183

క. కరచినతంత్రికి విధివిధ
మడరఁ బితృక్రియలఁ దీర్చి యగ్రజుఁ గనఁగా
నెడ నుత్కంఠత పురికొ
ల్పుడు నతఁ డాహైనఁ గదలెఁ బ్రోలితెరువునన్. 184

క. కొలఁదిదినములనె దారినిఁ
దలకడచి నృపాలసుతుఁడు ధ్వని యడరనియ
ట్లలవరచి సేనఁ దాఁ ద
ద్బలయుతుఁ డై కలఁగి చొచ్చెఁ దననగరంబున్. 185

ఉ. హంసను బాయునబ్జిని నయంబును బాయునృపత్వము౯ బుధో
త్తంసునిఁ బాయుగోష్ఠి సితధామునిఁ బాయుత్రియామ దానపుం
శంసను బాయులక్ష్మి సరసం బగుకైతను బాయువాగ్మితా
శంసయుఁ బోలె తేఁ డెడయ సౌ రతె నన్నగరంబు దుష్టమై. 186

తే. గీ. ఎదురుగా వచ్చి యగ్రజుఁ డెయిదికొనఁగ
నతనితోఁ జొచ్చె భిన్నుఁడై క్షితిపతిగృహ;
మిరువురికవుంగిటను బి డిచి యిడినయట్లు
బాష్పధారలు తెగ కుండ వరదపాతె. 187

చ. దినములు గొన్ని యీనియతిఁ దీఱెను వారి కొకళ్ళొకళ్ళపైఁ
బెనఁగిననిక్కపుంబెలిమిఁ బెం పగుదుఃఖము వీడు చుండఁగా;
గొనముల గొప్ప యయ్యు జనకుండుగ నగ్రజు గౌరవించె; నా
ప్పనియటు లెప్పుడైన గుణవంతులవృత్తులు మాఱఁ బోవునే. 188

తే. గీ. దిగ్వితానంబుఁ గలఁచి తాఁ దెచ్చినట్టి
వస్తుసంతతి నర్పించె వరవినీతి
నగ్రజాతున; కల కీర్తి నలరువారు
లోభ మెనయరుగా తమలోన నెపుడు. 189

తే. గీ. అన్న సోమేశ్వరుం డటుఁ గొన్నినాళ్ళు
ననఁగఁ దమ్మునెడం బాపమును దలంచె;
నిలను భవితవ్యతాదేవి నెవఁడు దాఁటఁ
గలుగు ననుభవకారణములు దొలంగి. 190

క. మదకారణ మాయెనుగద!
మదిరగతి౯ రాజ్యలక్ష్మి మై మెలఁగుయశం
పుదుకూల మశేషంబుగఁ
జెదరినఁ దా నెఱుఁగఁ జనఁడ జ్యేష్ఠుం డపుడు౯. 191



ఆ. వె. బధిరుఁడైనయట్లు భవ్యతూర్యనినాద
ముల మహాత్ము లొసఁగుబోధ లెల్ల
నుంత యైన వినఁగ సోమేశ్వరుఁడు మదిఁ
దలఁపఁ డయ్యె దుష్టదైవవశత. 192

క. ప్రకటితమదజ్వరుం డయి
సకలాంగములందు వడఁకు సారించుచు భూ
మికమనుఁడు [1]రాజయక్ష్మ
ప్రకారము సిరికి క్షయంబుఁ బాటిలఁ జేసె౯. 193

తే. గీ. [2]కుంతలోల్లాసములు కడకు౯ జనంగ
ధరణి వైరాగ్య మెంతయుఁ దల ధరించి
యతఁడు ధవుఁడుగ ననువుల నలరు చుండఁ-
గానె తా నంత విధవగాఁ గనఁగ నయ్యె. 194

క. ఆరా జారోహించిన
వారణములు తమదుపృష్ఠభాగము చెడె నాన్
గూరిచె [3]నభ్యుక్షణమును
నారయఁ గరశీకరముల నాసక్తి మెయి౯. 195

తే. గీ. రౌతులసమేతముగ దివ్యరీతిఁ గాంచు
గతి రచించుచు మండలాఒకృతి భ్రమించుఁ,
దమయయోగ్యత సాధించుతమక మెనఁగ
నతనిపృతనాతురంగమవితతి నిరతి. 196

ఉ. ఆతఁడు [4]జాతుషంబుగ నరాధిపసంపద నెంచి జారు న౯
భీతిని క్షాత్రతేజమును వీడె న టంచు మది౯ గణించెద౯;
భూతముఁ బోలి లక్ష్మి స్వయము౯ దను ముద్దిడుచు౯ జవి౯ గన౯
జేతమున౯ దలంచును విశిష్టజనక్షతటంబుఁ దీల్చఁగ౯. 197

1. క్షయరోగము. 2. 'విక్రమాంకుఁడు – కేశములు. అని శ్లేష.
3. శుద్ధికై పిడికిలితో నీరు ప్రోక్షించుట. 4. లక్కసంబంధమైనది.

ఉ. చాలఁగ రేఁగు చుండుఘనచామరదుర్ధమమారుతాఽశ్రయాఽ
ధీలరజఃప్రపూర్తి నరవిన్ దెరువున్ గనఁ జాలఁ డయ్యెఁ; ది
గ్జాలసమాక్రమద్ద్యుతివిశాలమణీగణుఁ డయ్యెఁ దాఁ దమో
జాలతిరోహితుం డగుచు సౌరతదైవహతుం డతం డటుల్. 198

సీ. పైయడ్డుచే నెల్లవారు లొంగుట నెంచె
నన నధోగతి మంచి దంచునెంచె;
నఖిలచ్ఛలాన్వేషణాఽసక్త మగుపిశా
చముగ నెఱుఁగఁడు కార్యము ముదమున;
రాజులోభముచే విరక్తిని జన మొందె
మహిపులయీవియే మచ్చుమందు;
నృపుఁడు కుమారునం దెంచె నక్రమభంగి
సిరిమరుల్ గలఖలుల్ సేయ రెద్ది ?

తే. గీ. వారణేంద్రంబు నెక్కి దర్పం బెలర్ప
నంకుశ మనర్గళత నతం డంతఁ ద్రిప్పు
నపయశోబీజములు నాట నాత్మఁ దలఁచి
యంబరస్థలిఁ ద్రవ్వువిధంబు దోఁప. 199

క. పలుపలుకు లేల పలుకఁగ
నెలచెలిమిన్ దగుచుళుక్యనృపగోత్రమునం
దలవరిచినటు కళంకత
నలిపెన్ రాజ్యంబు నతఁడు సౌరఋనటులన్. 200

తే. గీ. అగ్రజుదురాగ్రహంబు వోనడఁచ జాలఁ
డయ్యెఁ దమ్ముండు; ధర నెద్ది యౌషధంబు ?
మంత్ర మెయ్యది గలదు ? సామ్రాజ్య మనెడి
[1]గాముబామున గో మఱుఖలనరులకు. 201

1. గ్రహము



తే. గీ. ఈవిపర్యస్తబుద్ధిచే నేమికార్య ?
మనుచుఁ దలపోసి కడు నిశ్చయాఽత్ముఁ డయ్యెఁ;
వానియపకీర్తితోఁ బాలు వంచుకొనుట
కర్హత గడించు టొక్కటే యగును నాకు. 202

ఉ. కానిపథంబునన్ దిరుగఁగా నమకట్టెడుపెద్దవాని దూ
రానఁ ద్యజించుచున్ మనుట రమ్యము; మీఁదట దక్షిణాంబుధి
స్థానఁగఁ బోయెదన్; మునుపు నాకు నడంగిరి గాన బల్రిపుల్
వీనివిపర్యయంబులను విన్నను జాలరు బాధపెట్టఁగా. 203

చ. ఇటులఁ జళుక్యరాజసుతుఁ డెంచి శ్రవఃపుటభేదనక్రియా
పటుతరభేరికానికరభాంకృతు లార వినిర్గమించెఁ దాఁ
జటులరుషారతుం డయినసాహసలాంఛనుఁ డాశుగంబులన్
గుటిలనృపేభసంతతులఁ గూడనధైర్యము వమ్ముఁ జేయుచున్. 204

ఉ. ఆమని వీడుకొన విశిఖాఽసనమున్ విడుమౌర్వి ముత్తెముల్
నోమినశక్తి మాధురి గనుంగొన రానికవిత్వరీతి యై
గోము దొలంగె రాజ్యరమ గొబ్బున నాతఁ డొకండ వీడఁగా;
నేమనుజుండు దాఁ గడఁగు నిద్ధమహాఽత్మలశక్తిఁ జెప్పఁగన్.

క. ఇతఁడు కడున్ దుష్టాఽత్ముఁడు
క్షితికంటకశోధనుఁ డయి చెడుగుఁ దలంచున్
మతిఁ గని సోమశ్వరుచే
వెత శంకించి యనుజన్మ వెంటఁ గొని చనెన్. 206

మాలినీవృత్తము

సురవినుతపదాబ్జా ! సూరిసంగీతనామా !
గిరిబిలవినివేశా ! కేవలాద్వైతరూపా !
కరి-రిపుసుతపాలా ! క్ష్మాసుతాచిత్తలోలా !
విరచితబహురూపా ! వేంకటేశా ! నృసింహా ! 236

ఇది శ్రీత్రిభువనమల్లదేవవిద్యాపతి-కాశ్మీరక-
భట్టబిల్హణ మహాకవివిరచితవిక్రమాంకదేవచరిత
మహాకావ్యంబునకు శ్రీవేంకటేశ్వర
శ్రీనరసింహదేవపాదపద్మారాధన
సమాసాదితకవితావైశారద్యులు
'ఆంధ్రబిల్హణ' బిరుదాంచితులు
నగులక్ష్మణ-విశ్వనాథ
కవిసోదరాంధ్రీకృత
మహాప్రబంధంబునందుఁ
ద్వితీయాశ్వాసము
సమాప్తము

# విక్రమాంకదేవ చరితము

## తృతీయాశ్వాసము

క. శ్రీరమణ! వేంకటేశా!
వీరనృసింహేశ! వేదవేద్య! సురేశా!
సూరివినుతపదపద్మా!
భూరిగుణా! దేవదేవ! బుధజనవంద్యా! 1

క. అంతటఁ దూర్యరవంబుల
శాంతి వఱఁగ శింజితములు చాటయినటు భూ
కాంతుని విమలస్వాంతుని
వింతగ వెన్నంటినటుల వెలసె సిరి వడిన్. 2

వ. అంత సోమేశ్వరుఁడు.

ఆ. వె. శంకఁ గననియట్టియంకవర్తిని వీనిఁ
ద్రుంప నాఁపినాఁడ దుష్టబుద్ధి
ననుచుఁ బడకఁ బొరలి యదరినచందన
ములను గలిగి రేలఁ బొగిలె నతఁడు. 3

క. పటుతరసాధ్వసకర్దమ
పటలనిమగ్నావనీశభావ మల సము
త్కటచటులభరోద్ధరణో
ద్భటకరటిఘటోద్ధృతిప్రభావముఁ దెగడెన్. 4

క. మతిఁ గలఁగియు నంత నతం
డతిఘనబల మనిపె ననుజు నలమికొనంగన్;
క్షితి బద్ధాత్మలత్వగ్రు
క్తతికి నసాత్త్వికకృతుల్ ప్రకాశిల కున్నే? 5

శా. ఉహాఽతీతభుజప్రతాపవిభవోద్యోగుండు తమ్ముండు దు
[1]ర్గ్రాహాఽబద్ధనిజాగ్రజాతువలనన్ గ్రౌర్యంబు శంకించియున్,
సాహంకారతఁ దన్ను [2]వెన్నడుధ్వజి న్యాళిన్ విమర్దింపఁ బోఁ
డాహా! కష్టములందునేన్ బటులబాహాశాలి భేదిల్లునే! 6

ఉ. క్రూరముగా వధింపఁ బని గొన్నబలంబును దంతిపాదదు
ర్వారవిఘట్టనన్ నుఱిమి వైరినృపాంతకుఁ డొక్కముద్దగాఁ
గూరిచెఁ గాలవక్త్రమునఁ గోల్తల పెక్కు వచింప నేల వి
స్ఫారయశుం డతండు మహిపాలునియంగ మొకండె నిల్వఁగన్. 7

క. కమలావిలాసవసుధగ
నమరినతనబాహుపంజరాంతరమున రా
జమరాళివలెన్ గీరితి
రమియింపం జేసి హరికరణి రాజిల్లెన్. 8

క. తనయగ్రజుదుష్పథచిం
తనమున రుట్పంకకలుషితమనస్కుం డై
కనియెఁ బ్రసన్నతఁ దోడనె
[3]వనప్రసన్న యగుతుంగభద్రానదిచేన్. 9

తే. గీ. అతనిదంతీంద్రచయవిగాహములఁ జేసి
యత్తరంగిణి పతి నర్థి నంద దయ్యెఁ;
గాని దంతిమదాఽపగల్ గలిసెఁ బ్రేమ
నిమ్నగానాథునకుఁ గడు నెమ్మిఁ గూర్చి. 10

1. జ్ఞానము. 2. 'వెన్నాడు' శబ్దమునకిది రూపాంతరముగా స్వతంత్ర ప్రయోగము. ఇచట 'వెన్నడుదు సేనాళిన్' అని కూడ వ్రాయవచ్చును. కాని ఒక విచిత్రప్రయోగమును స్వతంత్రించి వాడినాము. 'వెన్నడు' అను నది వ్యవహారములో నున్నది. 3. నీరు.



చ. ప్రతిగజమున్ గనుంగొనుచు వారణ మొక్కఁడు తద్విమర్దనో
ద్ధతి విశదాఽపగాంబువుల నానదు; కోపుల కిట్టిశీల మౌ;
వెతఁగని షట్పదధ్వనిఁ [1]గృపీటముఁ గ్రోలక వాని ముంచి బా
ధితములఁ జేయు వేఱుకరి; ధిక్కృతముల్ గద ఇయర్థిమోగుటల్. 11

తే. గీ. ప్రతిగజంబును విడిచె నిభం బొకండు
పార్శ్వగత మౌకరేణులోభమునఁ జేసి;
బాహువిక్రమచండిమ పఱఁగుచోట
నప్రతిహతుండు కంతుఁ డత్యద్భుతముగ. 12

క. కరు లాఁపంగా మార్గము
హరులు చిరము మునిఁగి యుండె నాపగవారిన్;
మఱి తటతరుకంటకముల
[2]మరగినమయములు గనంగ మానెను దటినిన్. 13

క. ద్విరదమదవారికలుషిత
సరిత్పతియు సతతమదవిసార్యభ్రకరిన్
స్మరియించె నహహ! [3]యభ్రము
వరునందలిమక్కు వెంతొ వారాంనిధికిన్. 14

క. స్నానాఽసక్తపరీజన
నానాసుందరులమధ్యమున్ జొచ్చియుఁ దా
దానోదగ్రేభము ని
ల్పానక చనె నుపరిసరునియురుపుణ్యముచేన్. 15

తే. గీ. అన్నదీనీరములఁ గొన్నియహము లుండి
వనిత లూనినకుంకుమువలన [4]ఘుసృణ
పంకిలముఁ జేసి జలము; నాపైన సమర
దర్పభుజుఁ డయి చోళుని దరిసెఁ గినిసి. 16

1. జలము. 2. అలవాటుపడిన ఒంటెలు. 3. ఐరావతము. 4. కుంకుమపువ్వు.

సీ. [1]క్రీడోపవనపక్షికృతరుతపిహితాఽత్మ
గళరవలై బయల్ గొలుపఁ దగరు;
మేచకక్రముకాఽళిమీలితార్కజ్వాల
లగునెడలన్ బగ యడర నిలుచుఁ;
బవనోత్థకేతకపాళిధూళిశ్వేత
సీమల భస్మంపుస్థితినిఁ గాంచు;
నారికేళఫలసంఘట్టన గళదంబు
భంగాఽర్ద్ర మై స్మరబాణము లగు;

గీ. నెలఁత లెచ్చుటఁ దమతమనేర్పుకలిమి,
దర్పకుం డెట దాహకదర్పయుక్తిఁ,
నెచటఁ గాంతలఁ గనుమడునెడ హరాగ్ని.
గాఱు లెచ్చటఁ బక్వరంభాఽళిఁ గవిసి. 17

చ. సవిధతథావిధోపవని సాక్షిగఁ జానలఁ జిత్రవిభ్రమ
ప్రవణతఁ దేలుచున్ గొలఁదివాసరముల్ నృపరాఽత్మజుం డటన్
దవిలి వసించి తాఁ దరలె దర్శితపూర్వపరాక్రమస్మృతుల్
[2]త్వరఁగ సైన్యతూర్యరుతిఁ దిన్నగ నమ్మలయేశుచెంతకున్. 18

క. ఇతనిం గని, జయకేళీ
క్షితిపతికోరికకు మించుసిరు లొసఁగుచు స
న్మతిఁ గొంకణాంగనాముఖ
సితరుగ్వాసితప్రశస్తి స్థిరముగ నిలిపెన్. 19

ఆ. వే. త్యక్తచాపలుఁ డగు 'నాలుప' నృపు నవ
దాతవిక్రముం డితండు మనిచె;
నవినయాగ్రదూతి యప్రణతియె యట్టి
ఘనులమదులకినుక పెనుచుఁ గాని. 20

1. ఈ పద్యమునందలియెత్తుగీతమునాల్గుపాదములకు మొదటినాల్గుపాదములతోఁ క్రమాన్వయము. 2. త్వరపడఁగ.



క. కేరళనారీగండా
గారముల శిలీముఖములు గడు వ్యాపించన్
జేరినయశ్రులు మును దాఁ
గూరిచినవిగానె సతులకుం జూపించెన్. 21

క. లోలాబ్ధినీలకుండల
చాలన్ గంపించె ద్రవిడసర్వంసహ యా
భీలత్వరఁ దనుఁ జేరునృ
పాలతనూభవునిఁ గాంచి ప్రబలుభయమునన్. 22

క. గొనయ మెనసినయతనివిలు
చెనకఁ దగని మగతనమునఁ జెన్నగునృపసూ
నునికొలువుఁ జేరె ద్రవిడా
వనివరునరుఁ డొకఁడు నీతిపథరతుఁ డంతన్. 23

క. ఇలఁ దల సోఁక నతఁడు కుం
తలపతితనయునకు మ్రొక్కి, దశనకిరణకో
మలకినలన్యాసవచో
విలసనమున ద్రవిడదూత ప్రియముగఁ బలికెన్. 24

క. చాళుక్యేలావరవం
శాలంకారా ! భవద్గుణాఽళి గణింపన్
జాలు నెవం ? డెవని కగున్
జాలిననేర్పర్యమాంశుసంతతిఁ గూర్పన్ ? 25

క. నీకరవాలాంబువిమల
తాఽకృతి వర్ణింపఁ జాల; నది గనుకీర్తుల్
లోకైకశుక్తిపుటము
క్తాఽకలితము లగుచుఁ జంద్రికాఽకృతిఁ దాల్చున్. 26

క. అరిచికురంబులు నాఁచుగ
నరవే! యసివారియందు నుండఁగ నీచే
నిరవుఁ గనురాజహంసో
త్కరనిభయశ మచటఁ గడుఁ బ్రకాశింపంగన్. 27

సీ. త్వద్భుజంబునయందుఁ బ్రణయంబుఁ గనువింటి
నినద మాజుల నేరు విన సహింతు?
రంతఃపురస్త్రీలయాక్రందనంబుల
వ్యక్త మౌ నది శత్రుభవనములను;
ద్వన్మౌర్వికానినాదముల దిక్కరు లైన
నిర్మదత్వమును బొందినకతమునఁ
గశ్మలాళులచేతఁ గడఁ గాంచినట్టుల
దిశలు ప్రసన్నతఁ దేజరిల్లు;

తే. గీ. నిన్ను బోల్జిగీషువువినా నేర్పు నెవఁడు?
క్షత్రకులజుం డిల నసాధ్యసాధనమునఁ
బ్రళయకాలంబు లేకుండ జలధి గూడ
శక్త మగు నెట్లు ముంచంగ జగము లెల్ల? 28

చ. అతులగుణుండ వీవు సిరి సర్పణ సేసితి వన్నకున్ దృణ
స్థితిఁ గని; వజ్రలేపమును జెందినరీతిని నీదుకీర్తి సు
స్థితి క్షితిఁ గాంచె; నీకు నిలఁ జేసెడి దే మగు దీన? సర్వభూ
పతివి; మృగేశతల్ హరికి వర్తిలవే యెట వాన మూనినన్. 29

తే. గీ. ఏభువి వసింతు వీవు మహాభటుండ!
పుణ్యఫలపాత్రతను గాంచుఁ బుడమి యద్ది;
కుటిలధారజిరమణసంకటముఁ దొలఁగి
నిన్నె సుగుణోజ్జ్వలుని వరునిగ గ్రహించు. 30



క. గళితత్రపు లై కందర
ములఁ ద్వద్భీతిన్ వసించుభూమిపతులనేన్
[1]గళితలమున నీచాపము
తలఁకించు గుణాఽరవోదితప్రతిరుతులన్. 31

తే. గీ. ఉత్ప్రతాపానలాఽస్యంబు నూని కలనఁ
ద్వత్కృపాణైంద్రజాలికతల్లజుండు
కృత్తమర్త్యోత్తమాంగు లౌరిపుల నెల్లఁ
దనరఁ జేయును దివ్యమస్తములపొందు. 32

తే. గీ. భారతాఽదులలో నేని భాగ్యభూమి
యయిననిను బోల్ప్రతాపిపేరయిన వినమ;
దర్శనంబున జయలక్ష్మిఁ దనరఁ జేతు
వన్యసంగమవిముఖిగా జన్యములను. 33

క. సూదంటుఱాలగమికిన్
భూదయితులమకుటరత్నములు తుల్యము లే
మో; దవుదవ్వులఁ బొదలెడు
నీదగుఖడ్గంబుఁ జేర్చు నికటస్థితికిన్. 34

తే. గీ. నీసముజ్జ్వలగుణముల [2]నెఱిఁప్రియమునఁ
గని మనవి సేయఁడే చోళజనవరుండు;
తృణసమంబుగ సిరిని నీ వెంచఁ గాంచి
శ్రీప్రదానము నుడువ లజ్జించె నతఁడు. 35

క. [3]శరధరగర్జితములవలె
పరపౌరుషములను వినియు బయలుపడద భూ
వరనుతిరాజమరాళిక
నరవరు[4] మానసమునుండి నైజం బిది యౌ. 36

1. యుద్ధము. 2. పూర్తి. 3. మేఘము. 4. ఇది శ్లిష్టపదము.

చ. స్వకులకలాప మై సుగుణసంపద ముజ్జగమందు మించుచున్
సకలవిలాసినీనికరసన్నుతరూపవిలాస మొందుక
న్యకను ద్వదీయహస్తమునయం దిడి తా సకలావనీజన
ప్రకరనుతుల్ గనంగ నరపాలుఁడు వాంఛ యొనర్చు నెమ్మదిన్. 37

ఉ. ఆతనిచేత నాతఁడు నయంబునఁ బల్కినరమ్య మౌవచో
జాతముచేతఁ గుంతలరసారమణుండు ప్రసన్నుఁ డయ్యెఁ; నీ
భూతలమందుఁ దీవ్రముగఁ బొంపిరిఁ గట్టురుషావిషత్వరో
త్పాతము మాన్ప నౌషధము తాదృశు లూనువినీతియే కదా! 38

ఆ. వె. ఎట్టిచంద్రముఖియొ యిది యంచుఁ దనమదిఁ
గుంతలుండు వింతఁ జింతఁ గొలిపెఁ;
గాములందు నెపము గాంచినమాత్రానఁ
గాముఁ డెపుడు సజ్యకార్ముకుఁ డగు. 39

తే. గీ. కుంతలీనేత్రపూర్ణచకోరమిత్రుఁ
డోష్ఠలుళితస్మితుం డయి యొప్పి దంత
దీధితుల హృత్ప్రసన్నతఁ దెలుపునటుల
నిటులఁ జోళేంద్రుదూతతో నెలమిఁ బలికె. 40

ఉ. ఈసుజనత్వ మే నెఱుఁగ కెంతయు నీసున విల్లు మ్రోగఁగాఁ
జేసినదాన నుద్భవిలుసిగ్గునఁ గొంత వచింతు: సజ్జనుల్
దోసములన్ ద్యజించి గుణతుష్టి వహింతురు; క్షారభావమున్
ద్రోసి పయోధినుండి మధుతోయమునే కొనుఁగా ఘనాఽవళుల్. 41

చ. ప్రియమొనరింప దిగ్జయపరీతమనస్కుత నాయెడన్ గడున్
నయమును జూపు నేఁడు; సుజనంబుచరిత్ర మెవండెఱుంగు? నా
శయమున వే ర్దలంప; గుణశాలి సుహృజ్జనమాన్యుఁ డిచ్చ నె
మ్మెయి నొనరింప నెంచు నది మేకొని చేయుత నాతఁ డాదృతిన్. 42



క. అమృతోపమ మమృతద్యుతి
విమలము నగుపల్కుఁ బల్కువిక్రమదిహ్నున్
సుముఖతఁ గని వీతభయో
న్నమితాఽస్యుఁడు దూతయును మనవి యొనరించెన్. 43

క. ఇతరం బెది యుచితం బగు?
నతులవదాన్యతకుఁ దగినయది సేసితి; ప్రా
ర్థితవస్తుసిద్ధి నర్థి
ప్రతికూలనృపుండు సనెనె! త్వత్కులమందున్. 44

క. మాన్యవరు నవంచకుఁగా
మానసమునఁ దెలిసి కడు నమలమతి వై తేన్
బూను మిటఁ దుంగభద్రాఽ
నూనోపాంతాధ్వమున సమున్నతి వసతిన్. 45

చ. కొలఁదిప్రయాణముల్ గడపికొంచుఁ బ్రతాపిని నిమ్నఁ గాంచి ని
ర్మలహృదయుం డొనర్చుఁ జిరమైత్రిని మిత్రునితో విధుం డటుల్;
కలితశరాఽసనుండ వయి క్రాలెడుసీయెడఁ బ్రీతి భీతిగా
మెలఁగియు మాన్యుఁడు నృపుమేల్మిమఱల్చు నినుం బ్రియాఽత్మగన్.

చ. పలికిన దంతయున్ నిజము పార్థివుపల్కులు; మమ్ముఁబోంట్లు ల[1]
గ్గులు సెడఁ బల్కినన్ [2]బయ లగున్ మిముఁ బోంట్లకు నంచు దూత ప
ల్కులు పచరింప సారెకుఁ; జళుక్యుఁడు దానును జోళదేందమున్
దెలిసి మొదల్ తనున్ నిలువఁ దెల్పినయేటితటంబుఁ జేరఁ బోన్. 47

క. అంతన్ జోళవసుమతీ
కాంతుం డుత్సవము సలిపి కదలె ముదమునన్
గంతుపతాకయు హాసాఽ
క్రాంతాఽస్యయు నైనకన్యకను వెనుఁ గొనుచున్. 48

1. శుభములు. 2. వ్యక్తము.

క. అల కుంతలేంద్రుతో ని-
శ్చలసంధి వొసంగుటల్ ప్రజల్ విని భయరు
క్భ్రాంతిఁ గని యాత్మగృహముల
సంతతముదములను విందు సలిపిరి మిగులన్. 49

చ. కకుబిభకర్ణనిర్దళనకారిభయానకదుందుభిధ్వని
ప్రకటన సభ్ర [1]మభ్రమువరధ్వనినిర్భర మైనటుల్ తగన్
సకలదిగంతభిత్తులను సామజఘట్టన సస్వనంబుగాఁ
బెకలినటుల్ స్ఫురించె శ్రుతిభీకరభేరిరవప్రతిధ్వనిన్. 50

క. మును భయమున మూర్ఛ మునిం
గినదిగ్గజపాళిఁ జల్లు నింపుగ శ్రుతితా
ళనభస్వచ్ఛీతల మగు
ఘనశీకరరాజి రాజగజరాజు లొగిన్. 51

చ. ధరణీరజంబు ద వ్వెగయఁ దాల్పక దిగ్భ్రమ మర్యముం డిన
ద్విరదపతాకికావననవీజనవారిత మారజంబుగా
నరదమునందుఁ గూర్చికొను నస్తగిరిన్ సరిఁ జేయ నాఁగఁ ద
ద్ధరణీరజశ్చలంబునన దారి సదా చను చుండి మృత్తికన్. 52

ఉ. నందనకుంజపుంజితఘనప్రసవోజ్ఝితధూళివాసితా
నిందితపాంసుచౌర్యశయనీయత మోదిలు సౌరపాంసులా
బృందము; పాంసుదుష్టమధువీక్షణ నందనమున్ ద్యజించి మిం
టం దిరు గాడుభృంగముల నాకము మించెఁ దమోవృతంబటుల్. 53

చ. సొదఁ గొనరించె సేన నడచొప్పులకున్ జయవాజిరింఖికా
ప్రబలత ధూళిపాళి సరివారిన వై విషమస్థలంబులున్
గబగబఁ జిత్తమే దుముకఁ జాలనిపల్లము లల్ల దూఁకువా
జిబలముచేత భూమి వెలసెన్ భ్రమ గొన్నమరున్మృగంబుగన్. 54

1. ఐరావతము.



వ. ఇట్లు సేనాసంరంభము విజృంభింప మఱి. 55

క. శరమౌర్వీవల్లీభా
స్వరవరసైన్యే[1]షుపీఠవాటుల నిలిపెన్
నరవరుఁ డట నట విజయేం
దిర కగుక్రీడావనస్థలుల్ నిల్పె ననన్. 56

క. దినములు కొన్నిటఁ బయనం
బొనరించి నదిన్ నృపాలుఁ డొందెఁ గృతిసమా
ప్తినిఁ గనక మనీషులు ని
ద్రను గనుతలఁ పింత యైనఁ దాల్పఁ జనుదురే! 57

తే. గీ. నిర్మలము లయి చల్ల నౌనిమ్నగాంబు
వుల మొదల్ సేరుపరివార మెలమిఁ గ్రోలెఁ
గొలఁది వెన్కడి వచ్చుజనులకుఁ బంక
శేషజలములె లభియించెఁ జెయ్దికొలఁది. 58

తే. గీ. దక్షిణాంభోధిదరినుండి తన్ను దరిసి
తననడుమ నిల్చుదంతిసంతతులచేతఁ
గొండెములు వార్ధిఁగూర్చి వాక్రుచ్చె ననఁగ
వార్ధివల్లభ యది ప్రతీపగతిఁ దాల్చె. 59

ఆ. వె. రాజ్ఞీకాంత మంతరక్షపితక్షప
మైనజనముచేత నందినటుల
సింధుతీరవసతిఁ జెందినతద్బలం
బమిత మైనధైర్య మందె నపుడు. 60

క. చోళవధూపాళీజల
కేళీపరికలిత[2]చంద్రకేవలసిత మై
హాళి నొనర్చె మదికి సది
ప్రాలేయాచలవిటంకభవజాహ్నవి యై. 61

1. ధనుస్సు. 2. కర్పూరము.

క. అల నదియామ్యతటంబున
నిలిచి బలముఁ గాంచి నృపుఁడు నిజభుజము స్ఫుర
త్కలహసహస్రప్రౌఢముఁ
గొలిచెన్ నుతియించె మఱియుఁ గొనెఁ జుంబనమున్. 62

ఉ. ద్రావిడభూవిభుండును ముదంబునఁ దత్కటకంబు మత్తదం
తావళముల్ గనుంగొని సుతాప్రవిధానముచేత నాత్మరా
జ్యావన [1]లగ్గుగాఁ దలఁచె; నాదట దూతల నంపికొంచు సం
భావనఁ బుష్యగీష్పతులమాడికిఁ గూడిరి వార లిర్వురున్. 63

క. ప్రియతముఁ డితండు సిరికిన్
స్వయముగ; మత్పుణ్యవశతఁ బడసితి నంచున్
నయనాంబు లురలఁ దలఁచె హృ
దయమునఁ గుంతలునిఁగూర్చి ద్రవిడపతి యిటుల్. 64

క. పాదములకు ముదమున నా
భూదయితుఁడు ప్రణతి సేయఁ బూనఁగ నిలిపెన్
గా దనుచు విక్రమాంకుఁడు
మేదురసంభ్రమవిశేష మృదువచనములన్. 65

చ. "వల దన నేల నే వయసుపట్టున గొప్ప నటంచుఁ; బాదముల్
తల ఘటియింప నుండఁ; దలఁ దాల్పఁడె నిర్మలరత్న మప్పుడే
[2]పొలువ వయోఽధికుం" డనుచుఁ బూని వచించెడుద్రావిడేంద్రుఁ గుం
తలపతి కౌఁగిటం బొదివెఁ దద్ద ముదంబున నోల లాడుచున్. 66

తే. గీ. అర్ధపీఠప్రణయపూర్ణ మైనకోర్కి
వఱలుచోళుండు కుంతలవరున కనియె
రదనచంద్రిక మేదినీరమణసభను
మకుటరత్నాఽ[3]తపంబును మచ్చరింప. 67

1. శుభము. 2. పుట్టఁగా. 3. ప్రకాశము.



ఉ. చల్లని పోఁ ద్వదంగములు చందనపంకముకంటె మిక్కిలిన్;
వెల్లిగఁ జిమ్ముఁ గౌముదిఁ ద్రివేష్టము నీది యశస్వి; దేవ! మ
త్తిల్లుఖిలోర్విపాలురకుఁ దీవ్రపుఁదాపముఁ గూర్చునట్టి దై
చెల్లెడునీప్రతాపము వసించు నెటన్? జుళుకాన్వయోత్తమా! 68

చ. ధృతికి నిధాన మబ్బురపుఁగృత్యములిల్లు మితిన్ దొలంగును
న్నతకరుణారసంబున కుదాహరణావని నిన్ను నల్వ య
ప్రతిహతరీతి సృష్టి దనరన్ బొనరించె సమస్తముఖ్యభూ
పతితతినిర్మితిప్రచురభాగసముచ్చయమున్ ఘటించుచున్. 69

ఉ. కాంచనగాత్రి ధాత్రిఁ గలకన్నెలలోపల మిన్న; యున్నత
త్వాంచితసింహపీఠ మిది: యాత్మ మదీయము నన్యరీతి వ
ర్తించదు; సర్వ మీవిధము వృత్తిఁ గనెన్; గృతముల్ ఫలించె; న
ర్పించితిఁ గొమ్ము ప్రీతి; నలరింపు మదీయయశఃప్రతాకమున్. 70

మ. ధృతిమంతుం డగుద్రావిడుండు నిబిడప్రేమంబునన్ మాధురీ
యుతశబ్దంబుల నిట్టు లంతిపురిలో సుక్తుల్ పిసాళింప నా
యతచోళీకుటిలాలకప్రకరడోలాఽఽలోలితాఽలోకనాఽ
దృతలీలాపరుఁ డై ముదం బెనసెఁ బృథ్వీపాఽత్మజుం డెంతయున్.

క. గొనములప్రో వగురాకొమ
రునకున్ బెండ్లాడఁ గడుసిరులతోడన్ గూఁ
తు నొసంగి ముదలఁ గొని తాఁ
జనియెన్ చోళావనీశచంద్రుఁడు పురికిన్. 72

క. కుంతలపతితనయుండు న
నంతద్రవిణం బొసంగె నాద్రవిడునకున్;
సంతతకీర్తిరసికతాఽఽ
క్రాంతులు విత్తముఁ దృణంబుగా నెంత్రు మదిన్. 73

చ. ముదితమనస్కుఁ డై యుదితపూర్ణఫలుం డయి ద్రావిడుండు వోన్
బదపడి కుంతలుండు గుణపక్షసమాదరణైకచిత్తుఁ డై
కదిసె సముత్సుకత్వము నృకాంతరేఖ్యునియందు సారెకున్;
మృదువులు గావె పుష్పములరీతి మనంబులు సజ్జనాఽళికిన్. 74

క. ద్రవిడునియద్భుతచర్యలఁ
దవిలి పులకపరికరంబు తనగండములం
దవిరళముగాఁగ నినిచెన్
నృపవరసుతుఁడు సుగుణపక్షనిహితాఽత్ముం డై. 75

క. చనఁగ నివారింపఁగ నై
తి నతనిఁ గాంచంగ నౌనా తిరుగ ననుచు స
జ్జనచూడామణి నృపసుతుఁ
డనయముఁ బరిచింతనారతాఽత్ముం డయ్యెన్. 76

క. త్రిభువనముల లభియింపని
విభవాఽస్పదగా నతఁడు ద్రవిడసుతఁ జేసెన్;
శుభహృత్ప్రసాద మాప్తుల
కభయమె కా కడరుఁ దత్సుఽతాదులఁ బ్రోవన్. 77

క. సమరరభసవిభ్రమకుతు
కమున సమాఖ్యాఽవతంసకస్థితిఁ గనుభూ
కమనసుతుఁడు విని ద్రవిడుఁ డ
సమయమున సురాఽలయంబు ననుదుర్వార్తన్. 78

క. మృదుహృదయత సత్ప్రణయిత
సదమలగుణపరత మెలఁగుక్ష్మాపసుతుఁడు దా
మదిఁ గలఁగఁగ విలపించెను
జెదరఁగఁ గన్నీరు చంద్రసితగండములన్. 79



క. ద్రవిడధరావిప్లవమును
నృపవరసుతుఁడు విని సఖేదహృదయతఁ గదలెన్
ద్రవిడపతితనయ సిరి కిం
పవునటు లభిషిక్తుఁ జేయ నాత్మఁ దలఁచుచున్. 80

ఆ. వె. కరటిశతవికీర్ణకర్ణతాలవ్యజ
నానిలములఁ జల్ల నైనవైరి
యశము లాను చంత నవనీవరుఁడు సేరె
గాంచిపురము నాదికాలపురము. 81

శా. కాంచీదామకలాఽరవంబు గుణయుక్తం బైనపూవింట జృం
భించం గల్గినడిండిమస్వనముగా వేల్లత్కటాక్షంబు ల
త్యంచన్మార్గణవృష్టిగా నెదుటఁ బౌరాబ్జాఽననాశ్రేణి గా
న్పించెన్ గుంతలనాథనందనునకుం బెన్మోరమున్ గూర్చుచున్. 82

చ. క్షితిపతిపుత్రుఁ జూచి యొకచేడియ నోటఁ గలట్టితమ్ములం
బతినయ మొప్పఁగా శుకము నందఁగఁ జేయుచుఁ గింశుకచ్ఛవిన్
స్మిత మొనరించునోష్ఠమునఁ జె న్నయి చుంబనచాతురీవిధిన్
గుతుకము మీఱ నాశుకముఁ గూరిచి పల్కె నరేంద్రుఁ డారయన్. 83

చ. పతనభయంబు వీడి యొకపద్మదళాక్షి నిశాంతశృంగమున్
ద్రుతగతి నెక్కె నెక్కుటకు దుస్తర మయ్యు నృపాలుఁ జూడఁగా;
నతనుఁడు పౌరుషింప జవరాండ్రు తృణంబుసమంబుగా మన
స్స్థితి మరణంబు నైన నిరసింతురు సాహసముల్ పొనర్చుచున్. 84

క. కలకల మకారణంబుగఁ
గలిగించి యొకర్తు తేనికన్గొన నొందెన్;
వెలఁదుల కుపాయదర్శన
ములఁ బొరము మనోజదృష్టి మూడవయది యై. 85

క. తనమెద విశదద్యుతి ని
ల్చినయినసూనుండు పరఁగఁ జేసినయటులన్
గని తనజారినహారము
వనజనయన పరఁగ విడిచి పడిఁ జనెఁ దొలఁగన్. 86

క. మనసిజవతంసలీలా
జనకమృదులకిసలయానుసారినఖలిపిన్
గనఁ జేయుచు నురమున నొక
వనిత సురతపరత నోర్పువడి రచియించెన్. 87

క. శ్రవణపరిచ్యుత మై యం
సవసతిఁ గనువేటొక ర్తునకికుండల మా
యువిదమెడనుండి వెడలెడు
పువువిల్తుని¹చుట్టుకైదువుగఁ గనుపట్టెన్. 88

క. పరికలితచటుక్యావని
వరపుత్రప్రథమవారపరిదర్శనత
త్పర లగునగరమృగాక్షుల
కరుదుగఁ బఱఁగెన్ స్మరస్పృహాఽయతలీలల్. 89

క. కినుక నదర్పసధరరుచి
దనరుతరుణులందుఁ బటుమదనలీలలఁ గ్ర
న్ననఁ దెల్పెడుకిలికించిత
మును దనకన్గొనను నృపతిపుత్రుఁడు గనియెన్. 90

క. కనకనికేతనవేదీ
వినిహితపదపల్లవుండు పృథ్వీశసుతుం
డు నిలింపేలాధరతట
మునఁ బ్రణయముఁ గొల్పునర్యమున్ నిరసించెన్. 91

1. చక్రాఽయుధము.



చ. పరిసరసీమలన్ గొలఁదివాసరముల్ ఘనలీలలన్ జనన్
జరణనివిష్టదుష్టనృపసంచయుఁ డై కనెఁ దాను ద్రావిడే
శ్వరునిప్రతాపభీతి ¹దవు వారిధి వో నవివాహితేందిరా
తరుణిమొదల్గృహంబు వెలిఁ దారె ననాఁ దగు 'గాంగకుండమున్'.

చ. నిరుపమధర్మవప్రసరణిన్ దరిచుంబితతారకాఽధ్వ మై
పరఁగెడునప్పురిన్ గనకపర్వతమందు నమర్త్యపత్తనం
బరుదుగఁ జేరురీతి విబుధామలవైభవ ముల్లసిల్లఁగా
నరవరపుత్రుఁ డొందును ఘనప్రమదోర్మితరంగితాఽత్ముఁ డై. 93

మ. పరిషంథిధ్వజినీసమూహముల నుత్పాటించి చోళావనీ
వరసూనున్ ²హరివిష్టరంబుపయి సంభావించి యచ్చోటఁ జో
ళరమణ్యాళివిలోకనస్ఫుటపుటీప్లావద్రుచిస్ఫీతుఁ డై
యిర వొందెన్ మురు వొంది కుంతలుఁడు నందే మాసమాత్రంబునన్.

క. అటుపై విషమాధ్వములం
దటవీధానుష్కతతుల నలయించి ధరా
విటుఁ డొందెఁ దుంగభద్రన్
స్ఫుటవీచీరచితవినతిసురుచిరముద్రన్. 95

క. తదనుగఁ గొలఁదిదినంబుల
తుదిగా 'రాజిగుఁడు' చేంగిదొర హరియించెన్
బొదువుప్రకృతిజనములపగఁ
జెదరిన చోళాఽత్మజాతుసిరిఁ ద్వరితముగన్. 96

క. ప్రకృతివిరోధు వమాన
ప్రకటను సోమునిఁ గతంబు వఱఁగించెను దీ
నికి వెనుగ రాజిగాఽఖ్యుఁడు
వికలత భయశంక కొంత వెనుఁ గొని కలఁచన్. 97

1. దూరము. 2. సింహాఽసనము.

క. శూరశతశాత[1]పుష్కర
ఘోరవిహారవ్రణాంఘ్రికుట్మలవోలెన్
దారించదు సిరి పాదము
దారులయందును; బ్రమత్తులం దెటు నిలుచున్? 98

క. సుకృతవిపర్యయమునఁ గుటి
లకుపాలుర కిట్టిబుద్ధి లభియించుఁడు నా
వ కదలియొడ్డున [2]గట్టున
వికలం బగురీతి నపుడె విఘటించు సిరుల్. 99

క. కలి యడ్డు లేక యున్నను
వెలయు దృఢవ్రతము శస్త్రవిబుధుల కెపుడున్;
గలన నవినయాధ్వగులను
బలవంతుల నైన మిగుల వంచింతు రిలన్. 100

క. ఇటుల హతబుద్ధు లగుచూ
విటులు సిరి సనంగ రథనవిధి నెఱుఁగక యు
త్కటబలగర్వితు లైపర
భటవిక్రమదీపిక [3]శలభము లగుదురుగా. 101

చ. సకలము శూన్య మం చెఱిఁగి స్వర్గముచింత తిఱంబు నైనఁ దా
ల్పక నిజమందభావమున స్ఫాటికవర్తులవిగ్రహంబులన్
వికలమనీష లూనుదురు వేలుపుబుద్ధి య టంచు దగ్ధరా
జ్ఞికరము మిథ్యయే యనుఁ ద్రిణేత్రునిలింగము నైన నిందమై. 102

ఆ. వే. ఇట్టిరాజు లెపుడు నెలనాఁగగములందుఁ
దనరి, పౌరుషంబుఁ దక్కువారిఁ
బోలి, సారె భయముఁ బూనుచు నెల్లెడ
భయముఁ గలుగఁ జేయువా రగుదురు. 103

1. ఖడ్గధార. 2. పర్వతము. 3. మిడుతలు.



చ. క్షతజమునందుఁ దోఁగుఘనసంగరమార్గములందు నెప్పు డా
దృతమతి నాథుఁ డా నభిసరించు వరాక ధరాపలక్ష్మి; యా
తతకలుషంబుఁ గూర్చు వసుధాతలనాథమనంబులందు న
స్నతిఁ దనపాద మూనఁ గనిన్ గదుఁ జిత్రముఁ దోఁపఁ జేయుచున్.

ఉ. చేరినయంతనే యెఱుఁగు శిష్టు నశిష్టుని; శత్రు మిత్రుఁగాఁ
దారుచు; మిత్రు శత్రునిఁగ ద వ్విధు; బుద్ధిఁ గలంచు తేండ్లకున్;
గూరుఁ గుటుంబ మందెవనికో విధివ్రాత నృపత్వ మందు లో
నారయ కన్వయంబునకు హానిఁ బొనర్తురు రాజ్యలుబ్ధకుల్. 105

క. ఉన్నతచిత్తుం డీతం
డన్నకుఁ గీ డేమి సెసె; నన్వయరిపుఁ డౌ
నిన్నీచరాజిగునితోఁ
బన్నెన్ సంధిన్ విపత్తుఁ బఱఁగించుటకై. 106

క. గళితనయుం డగురాజిగుఁ
బొలియింపన్ నృపతిసుతుఁడు పూని మునుఁ జనన్
బల మఖిలముఁ గొని సోముఁడు
కలితత్వరఁ దమ్మువెనుకగాఁ జనుదెంచెన్. 107

గజసేనావర్ణనము

క. తమయుత్కటకటమదక
ర్దమమునఁ బొడమెడుబిసినులదళములసమ మై
భ్రమయించుభ్రమరనికరము
తమ కసితచ్ఛత్రమైత్రిఁ దగి వెన్నంటన్. 108

క. వడిఁ బలుసృణులన్ దఱుమఁగఁ
బడుతమచే ఘట్టనంబుఁ బడయుకులగిరుల్
విడుచున్ నెత్తురు తమపైఁ
బడుధాత్వాపగలమిషను బ్రస్థముఖములన్. 109

క. తమదంతద్వంద్వములనె
రమ నమరుపఁ దలఁచె ననఁగ రభసమునఁ దటా
కముల నానర్చెన్ గినుకన్
గమలస్మృతిశరణ మొందఁగా ననిశంబున్. 110

చ. శ్రుతిమధురధ్వనిస్ఫురణఁ జొప్పడఁ జేయుమధువ్రతాళికిన్
మతి నుపకార మెంచుచు క్షమాజవిధూతిపతత్ప్రసూనసం
తతిఁ దమదాననీరము నుదారపరీమళమేదురత్వసం
గతమును జేసె; నున్నతులు గా రెటు ప్రత్యుపకారతత్పరుల్ ? 111

చ. తమతనుభారగౌరవముఁ దాల్పక తొట్రిలుభూతధాత్రి ని
ల్పుమది మదంబునన్ గనులు మూయుచు శైలసమున్నతంబు లై
తమసవిలాసతన్ బయికిఁ దార్చినతుండములన్ బ్రవర్తిలున్;
దమవలనన్ విపత్తుఁ గనఁ దద్గతి మాన్పఁగఁ జూడరే ఘనుల్. 112

ఉ. ఈకరణిన్ రణార్ణవము నెంతయునేన్ లొడపెట్టఁ జాల్మదా
నేకపముల్ నగాకృతు లనేకము లై యధిరూఢయుద్ధవీ
రైకసముద్ధతిన్ వడి వహించెఁ గడున్ ఘన మైనలక్ష్మి య
స్తోకగతిన్ సమిన్ముఖతఁ దూఁగుచళుక్యనృకాంతువాహినిన్. 113

తే. గీ. అసగశకలచయకంటకావకీర్ణ
మశనినిష్ఠురలోహబంధాన్వితంబు
నైనరణ[1]ఖురశిపాళి నాత్మగేహ
కుట్టిమమురీతి నృపురథకోటి దాఁటు. 114

## అశ్వసేనావర్ణనము

తే. గీ. వాలవీజనపుంజసంభవసమీర
మధ్యసంచారి యగుపవమానుఁ డహహ !
క్షితిపతితురంగవేగలంఘితతఁ గనక
పరిభవంబునకున్ బ్రీడఁ బడయఁ బోఁడు. 115

1. సాముచేయుచోటు.



క. మణిపల్యాణస్థితి దిన
మణి తనతేరునకుఁగా విమర్శింపఁగ [1]రో
హణమొనరిచినటు ఘోటిక
గణ మర్యముబింబమునఁ బ్రకాశించెఁ గడున్. 116

చ. అనుమితధావనానుసరణారవ మార స్ఫురత్తురంబులన్
ఘనగతిఁ గ్రుమ్మరున్; 'పృథులఁగా నిల నీ వొనరింప వేల' యం
చని చతురాస్య దూఱు నన నాన్నృపసత్తమునుత్తమాశ్వముల్
ఘననిజవేగసత్వములకల్మి కిలాస్థలి చాలఁ బోమికిన్. 117

క. ఎల్లెడ నెక్కినరౌతుల
సల్లలితసువర్ణవర్మచయములఁ బంక్తుల్
పెల్లుగఁ దీరి తదశ్వము
లుల్లసనం బూనకున్నె యురురణమునకున్. 118

క. అమలాసితవిలసిత మగు
క్షమావరువరూథినీనికరఖడ్గలతా
సముదయముల ద్యోగిరి యిం
ద్రమణిద్రుతిశతఝరప్రధారిగఁ దనరెన్. 119

క. కలితకలాపికలాపక
విలసన మూన్కంతమాల వేశెదఁ ద్రుటిఁ దా
నిలువదు తదీయశాత్రవ
బలభటశీర్షస్థలములఁ బాయుచు బయలన్. 120

క. పలువురు పల్కుటవలననొ
కలితాద్భుతకార్యములనొ కలఁచరె మదులన్
గలహారసభీష్మభవనై
కలుంతనక్రమవిలాసకధ్వజినిఁ గనన్. 121

1. ఎక్కుట.

తే. గీ. ద్రావిడానీకినులు సముదారభుజుని
విక్రమాంకునికెలనిపృథ్వీకినిఁ జేర
నవకృతినిఁ జల్పుకాలంబు ప్రాప్త మయ్యె
ననుచుఁ దమ్మునిఁ బొదివెఁ దదగ్రజుండు. 122

క. కన్నీరు గారుకన్నులఁ
జెన్ను దఱఁగి గ్రహముపీడఁ జెందినయటు లై
తన్ను బొదువ వచ్చినయా
యన్నను గని చింతఁ గూరి యనుజుఁడు దలఁచెన్. 123

తే. గీ. అవినయాంబుప్రపూర్తి సొం పారునట్టి
శాత్రవపుఁగాలువలచేత సాగుచు నవ
యశపుఫల మివ్వఁగా నహా! యవిధియుతుఁడు
విత్తెఁ గారె ఘనానర్థబీజ మితఁడు. 124

క. ఉరుదుర్ణయుఁడు మదగ్రజుఁ
డరిసంగతిఁ జెనక వచ్చె నౌర! ఘనసమి
చ్ఛిరమున శరములఁ బఱపక
యరయఁగ నే నితనిఁ దొలఁచ నయ్యెడ నెటులన్? 125

చ. జనకసమాత్తవైభవము శత్రుగఁ జేసి మదగ్రజాతునం
దనుపున నొందఁ జేసితి; నహా! మది నొచ్చెడి నిప్డు ముప్పుచే;
వెనుఁ జను నాభుజంబు కులహంతృతనుండి; తొలంగి యేగినన్
గనుఁ బ్రమదంబు దుర్జనము కల్పన సేసి యకీర్తి నాయెడన్. 126

చ. అని యిటు నిష్కళంక మగువ్యాహృతిఁ గీర్తిధనుం డతండు మె
ల్లన విమలాఽత్మతన్ బలికె లగ్గుగ నన్ననుగూర్చి యెంతయేన్:
విని శపథంబులన్ సుడివి వీఁకఁడి యై యతఁడున్ దఱిన్ వధిం
పను గను చుండె: సీ! మలినమానసవృత్త మనార్జవంబుగా!. 127



క. ఇది యేమి బాము? నన్నున్
గదియు యశోహాని; దీనిఁ గని యే మనునో
త్రిదివగతుఁడు మత్పిత యని
మది నిడి నిద్రింపఁ జంద్రమౌళి వచించెన్. 129

చ. ఘనసురకార్యనిర్వహణకారణజన్ముని గాఁగ వత్స! ని
న్నొనరిఁచినాఁడ సద్గుణు ననూనధృతిన్ దగునీదుచిత్త మొ
ప్పనిభ్రమఁ గాంచ నేల? తలఁపన్ దిలమాత్రశుభంబు లేదు; దు
ర్జనుఁడు త్వదగ్రజుండు; మునుపుణ్యము దుల్చును వానిదుష్క్రియల్.

క. కావున భువనమహోత్సవ
మావిధి విల్వంపు మరివధార్థ; మెఱుఁగవో!
నీ విటుల నవనిఁ బుట్టుట
కేవల మది ధర్మరిపులఁ గెడపుట కగుటన్. 130

క. గిరిజావరుఁ డటులఁ బలుక
నరవరపుత్రుండు కరము నమ్రత విని ని
ద్దుర విడి శివునుడిఁ దొలఁగన్
దర మగునే యనుచుఁ గలహతత్పరుఁ డయ్యెన్. 131

క. చెనకఁగ నన్నద్ధం బై
తనకై యిరుదెసలఁ దఱియుతద్బలయుగమున్
దనకదనభోగలోభో
జ్జనితానుకలోత్పులకభుజయుగముఁ గనియెన్. 132

## యుద్ధము

క. కవ్వపుఁగొంతవిధంబునఁ
గ్రొవ్వినకరి నెక్కి యతఁ డకుంఠతఁ గలఁచెన్
రి వ్వనువీరాఽనకరుతిఁ
జివ్వనఁ బటుదోర్బలుఁ డరిసేనావార్ధిన్. 133

క. అహమహమికఁ గడుఁ దఱఁగిడు
నహితబలయుగంబు కదియ నధిపుబలంబుల్;
మహితనదీద్వయజలములు
రహి నళిముఖజలధి[1]పుష్కరము నొందుగతిన్. 134

ఉ. కూలెడునల్లటెక్కెమును గూరుముఖంబునఁ గేతుపక్షిరా
జోలి రచించె ముక్కుకొన నూనినపామున తథ్యతార్క్ష్యతన్;
వ్రాలుగజధ్వజస్థమృగవైరియు నైజమృగేంద్రలీలమైఁ
గ్రాలె వతంసమౌక్తికవికాసలసద్గజకుంభసంగతిన్. 135

చ. క్షతజతరంగిణిన్ ధ్వజఝుషంబులు తూఁగుచు నెట్టులో యధః
పతనముఁ గాంచి వీచివలమానము లైన నకైతవాండజ
స్థితిఁ గనునామరాంగనలు; చెందిరి మోదము రక్తపంకసం
గతిఁ జన రానియుద్ధభువిఁ గన్గొని యూఁతలు లేనిపోకలన్. 136

తే. గీ. ప్రహతితతి మూర్ఛితుం డగురౌతొకండు
నిజగజశ్రుతిపుటిగాలి నిగుడఁ దెలిసి
తన్నుఁ గొట్టినవాఁ డన్యదళితుఁ డగుడుఁ
దనపగన్ దీర్పుకొన లేమి నసుశమించె. 137

క. అరివీరవరాంగమణీ
పరిదళనజరజము కనులఁ బడఁగ నణఁచె నొ
క్కరుఁడు రుధిరాంజలులచే
[2]వరాంగరదదారితాఽత్మవక్షస్స్థలిలోన్. 138

చ. ఘనరణసంకటంబున నొకం డరిదారణలబ్ధశస్త్రముల్
గని మృతి లెక్కపెట్ట కరిఖడ్గము వేగమ సాగి లాగెఁ; బో
వ నసువు లుండ వైరితలఁ బాదము నిల్పి జనుఃఫలాఽప్తిగాఁ
గనియె నొకండు; కీర్తిరతి గాక మహాత్ములు మేను లెంతురే. 139

1. నీరు. 2. ఏనుఁగు.



క. ప్రతిశూరు శూన్యకంకటుఁ
బ్రతిఁ జనఁ గని యెదిరె నొకఁడు రహితకవచుఁ డై;
యతులామలజయమతి ధు
ర్మతి కల్పావసర మైన రహి నొసఁగఁడుగా, 140

తే. గీ. రక్తపూర్ణకపాలవారంబునదుమఁ
గూలి నిజకర్ణతాలవాతూలకలన,
దంతి మిత్త్రికిఁ బానపాత్రప్రణయికి
సలిపె నన నొప్పె శిరోపచారసేవ. 141

తే. గీ. కత్తిఁ దెగి పుఱ్ఱెచిప్పపై నత్తమిల్లి
నట్టికరికర్ణపుట మొప్పె సాహవోర్వి
[1]నర్యమాఽత్మజలీలాసమాత్తపాన
భాజనాఽద్భుతనవిలాసభంగి నెనసి. 142

చ. నియతజయంబు గానిచిరనిస్తులయుద్ధముఁ గాంచి శత్రుసం
చయము లయింప రాసుతుఁడు సామజమున్ బురికొల్పి నిక్కటె
క్కియములద్రావిడధ్వజినిఁ గీటడఁచెన్; ద్రుటి నగ్రభూచమూ
చయ మలయించెఁ; దాఁ జనెదుచక్షులలో రిపుకీర్తు లానుచున్. 143

తే. గీ. అవనిపానేకపము తనయంఘ్రిహతుల
ఘనకపాలంబులను గూర్పఁగా దురాప
భాజనము లగుపైశాచికాజనములు
సుభటశోణితమధుపానవిభవ మందె. 144

తే. గీ. సురభిసరసిజకోశకేశరత యయిన
కలిమిచెలి శత్రులందుఁ గా ల్నిలిపె నిజము;
కాక యశిమాలికను బోలురాకుమారు
కత్తి పగఱను జంబించఁ గడఁగు నెట్లు. 145

1. యముఁడు.

క. [1]ఖరకరజపానపాత్రకుఁ
బరు డయి బెడు రిదెడునేస్గుపుటియలయందున్
గరిరధపరంపర వడెన్
గరముగ ముల్లంగియూరుఁగాయ కనఁ గనన్. 146

మ. సమరాగ్రాంగణసీమయందు వసుధేశానాఽత్మజాఽజ్ఞన్ సదా
యమితస్ఫూర్తి నటించె వీరరమ క్రూరాజిహ్మగాపాంగదృ
గ్గమణీయాఽవళిఁ బర్వఁ జేయుచు విపక్షక్ష్మాతలాధ్యక్షయు
గ్మముఁ దద్విక్రమదుర్దముం గొలువఁగాఁ గైదాయలన్ నిల్పుచున్.

చ. కులిశనిశాతశస్త్రములఁ గొట్టుదు వర్ధసపత్నకుంజరాఽ
వళి నధిరూఢు లైనబలవద్భటు లుద్ధతి వీడి ముజ్జగం
బుల భయ మొందఁ జేయుభుజముల్ గలరాజతనూజునమ్ముఖం
బలవడఁగాఁ బ్రణామనియమాఽయతిఁ దేలఁగఁ గూలి రెంతయున్.

క. నరపతితనయునిగజపతి
యరివీరముఖాబ్జదళన యమసమము సమి
త్సర మొనరిఁచెఁ ద్రుటిఁ [2]బద్మా
కరధృతవిభ్రమసితాబ్జఘనకోశముగన్. 149

క. ధృతధట[3]కరంక మంక
స్థితమాతంగాస్థిచక్రశిఖరి ఘనరణ
క్షితి శమనభుక్తశేషం
బతిమోద మిడెన్ శివాసహస్రార్థం బై. 150

ఆ వె. వేలు వల్కనేల ? విక్రముం దరులపైఁ
గవిసి రాజయుగ్మకంబు నోర్చె.
ద్రవిడవరుఁడు వాతెఁ; దడయక సోముండు
గనియె వసతిఁ [4]గారమనికియందు. 151

1. యముఁడు. 2. లక్ష్మి. 3. తల. 4. చెలసాల.



క. ఇరువురునృపులప్రతాపేం
ధిర లతనిపదద్వయమునఁ ద్రెళ్ళె; నసాధ్యం
బరయ ధర నెద్ది త్రిభువన
వరభుజవీర్యబలవిభవపరికలితులకున్ ? 152

క. క్షితిపతియుగ్మరమాయుతి
నతఁడు విహితసమరదేవతాఽర్చావిధి యై
ధుతవర్మఁ డయి తటాంత
స్థితకటకన్ దుంగభద్రఁ జేరినయంతన్. 153

క. మఱల సిరి సోదరున కీ
నరయునృపాలాఽత్మభవుని నర్ధేందుధరుం
డురుకోపం బడరించుచు
స్ఫురదశరీరోక్తిఁ బఱపుచున్ వడి నాఁపెన్. 154

సీ. ఆస్యము లాన్రాజహంసలమిషమున
సంకు లూదెడుభంగిఁ బంకజములు,
ప్రతిబింబితార్యమవ్యాజంబునను లగ్న
కాలము శోధించుఘటిగతి నది;
యతిశీతలతచేఁ గులాఽపగాజల మూను
భంగిఁ జూపించుప్రభంజనములు;
పవనసమాహృతాంభఃకణచ్ఛలమున
గంగాంబుకీర్ణ మౌగతిఁ దగుదివి;

తే. గీ. అమితవైశద్యమునఁ గేతకాఽప్త మైన
స్మితము గైసేసినటుల జృంభించుదెసలు
సమ్మదవ్యాప్తిచే నుత్సవమ్ము మిగుల
వఱలుసకలజనమనముల్ వఱఁగుచుండ. 155

తే. గీ. గర్జితంబున వలెఁ గరుల్ ఘనగభీర
దుందుభిధ్వాన మెగయించుచంద మిడఁగఁ
గడల నెల్లను సాంద్రశంఖస్వనముల
సరిగ [1]హేషితములఁ గూర్పఁ దురగములును. 156

ఉ. అంత ననంతవల్గదమరాఽనకనిస్వన మాశలాభవి
క్రాంతవసుంధరాఽఽర్తియుఁ జిరప్రవిచారచళుక్యరాడ్రమా
క్లాంతినివారకంబు నయి క్రాలు[2]ధరాధరణాభిషేక మ
త్యంతముదంబునన్ గనియె నౌ నని విక్రమచిహ్నుఁ డాదటన్. 157

మ. ఘనసంపద్యుతుఁగాఁ దొనర్చె మిగులన్ గారుణ్య మొప్పారఁ ద
మ్మునిఁ బుణ్యాహమునన్ జళుక్యనృపసంభూతుండు; దాసీగతిన్
ఘనవిక్రాంతిధనక్రయంబున రమాకంజాక్షిఁ గైచాయలన్
గనుభూకాంతుల కాశ్రితావనవిధుల్ గష్టంబు లౌనే! భువిన్. 158

క. పృథివిపతి యెల్లఁ గొని రిపు
మథనుఁడు రణకౌతుకంబు మైకొన స్వమనో
రథపూరణమునకై ది
క్పథముల దిగ్దంతిశేషవర్త్మన నిలిపెన్. 159

క. భూరమణవిరమణం బయి
[3]శారానిచుళాఽసితాఽత్మకార్ముఁడు తుదిన్
వారించి చోళవీరముఁ
జేరెన్ 'గల్యాణ' పురము క్షితిపతి పిదపన్. 160

వసంతము

క. కంతుశరసఖము వీరు
త్కాంతావిభ్రమనియామకము పికరుతివి
క్రాంతిస్థాయివిధాయక
మంతన్ శృంగారబంధు వామని వొలిచెన్. 161

1. సంకలింపులు. 2. రాజపట్టాభిషేకము. 3. చెఱసాల యనెడుగవుసెనలో నుంచఁబడిన ధనువు గలవాఁడు.



క. చెందినశిశిరభయంబునఁ
జందనగకందరములచాటుం గనె నాఁ
గం దుహినము సనఁగా రా
త్రిందివముగ బయలువెడలి తెమ్మెర లెసఁగెన్. 162

క. తముఁ దినుపాములకు నివా
సము లమరిచె ననుచుఁ గినుక సారించి పటీ
రమహీధ్రకుంజములు విడు
తమి నన నుత్తరముదిక్కు దారె ననిలముల్. 163

క. తనరథమును బూనుపురా
తనవాహనములను మార్చుతలఁపుననో నాన్
దినకరుఁడు తురగజననా
వని గలనుత్తరముదెసకు వడిఁ జనఁ బూనెన్. 164

క. చందనగిరివరకందర
మందిరములు గాంచు నశ్మమయబంధనమున్
గందపుఁదెమ్మెల విరహిణు
లం దలఁకించుఁ; జెఱ వర్తిలన్ గనుఁ జిరమున్. 165

క. కేరళపవనున కామనిఁ
గూరిచి యవ్యాజభక్తి కొదుకక యగుఁగా;
దూరాధ్వము లంఘించి యు
దారంబుగఁ దదనుచరత నంతట మెలఁగున్. 166

క. చెలి! నీవరుషవచస్సుల
నల యామ్యదిశాఽనిలంబు నదలింపకు మ
త్యలఘురుషానిశ్వాసా
నిలపటలిని బలిసి [1]వడను నిజముగఁ బడయున్. 167

1. వేఁడిని.

క. యమదిఙ్మరుదేణము బా
ణమునఁ దునిమి గాలిచాలనం బణఁచఁగ గం
దముమల నిలుచుపుళిందున్
దమిఁ బ్రార్థింపంగ వలయుఁ దలఁగింప వెతన్. 168

క. దీనత యిది వృథ యగునో
పూనరు వైరము సమీరమున శబరులు కే
శీనిరతనిజవధూజన
మీనాంకగ్లాని నది శమింపఁగఁ జేయున్. 169

క. ఇతరర్తులఁ గనఁ బోనియ
మితగర్వముఁ గనుపటీర[1]మృగవాహనుసం
గతిఁ జైత్రుఁ డసహ్యుఁ డగు న
మృతరుచి వొడమన్ శర[2]త్తమీముఖమటులన్. 170

గీ. పాంథజనపాపమో [3]యామ్యవాయువునకు
బుద్ధిభేదంబుగా నిట్లుఁ బుట్టె నేమొ.
కదలఁ బోదు దిశామోహకారణమునఁ
జందనధరంబుఁ దాఁటి వేర్పాయ నెపుడు. 171

క. ఈరీతిఁ దిరుగుపరిమళ
భారపటీరానిలమునఁ బఱఁగెఁ జిరముగన్
గారా మఱువ్యాహారము
లౌరా! భూగృహవసతిప్రియస్పృహిణులకున్. 172

డోలాకేళి

క. స్మరసురవిమానసర్గము
సురభిసమస్తర్తువిభవసూచకము రసో
ర్వీరమణప్రసాదమాలిక
కరిగమనాడోలికావికాసం బొప్పెన్. 173

1. వాయువు. 2. రాత్రి. 3. దక్షిణదిక్కు.



క. డోలాఽధిరూఢనారీ
లీలాయితపృథుకటిస్థలీభారసమా
లోలాఽలంబగుణత్రుటి
గ్రాలదు; కుసుమాస్త్రభాగ్యకారణమ యగున్. 174

క. డోలాక్రీడాందోళన
నాళీకాఽస్యలఁ గనన్ జనంబులు మూఁగన్
లీల మరుఁడు తనలక్ష్యవి
శాలత నమ్ములను వమ్ము సలుపక కురిసెన్. 175

క. ఊఁగుడువేడుక బల్దవు
నూఁగి మఱలుగరిత లంది రుప్పరవీధిన్
మూఁగినవేల్పువెలందుల
లోఁ గన నాసోయగంబులో సగపాలున్. 176

క. తరుణీశ్రోణీవిస్తా
రరుద్ధడోలావిలాసరమ్యఫలకమం
దరుదుగ విలు వంచినసుమ
శరునకు మివులం బ్రవేశసమయం బబ్బెన్. 177

క. డోలాలోలాంబుజనే
త్రాఽళీసౌందర్యకలన నభివర్ణింపన్
బోలున్ బూవిల్తుఁడు తగఁ
గ్రాలెనయేన్ గవిత యది వరమహిమచేతన్. 178

క. వెలఁదులయుయ్యెలలాటలు
గెలఁకుల మల్లికలు గలయఁ గెరలులవంగా
నిలములు ముఖ్యాంగరమా
కలన మిడెన్ భువనమోహకారిమరునకున్. 179

క. పదములను జాచి డోలలఁ
గుదురుగ నెక్కొని చివర్లఁ గొనరెడుచెరఁగుల్
ప్రిదులుచెలులకోర్కెలకును
విదితముగానియెడఁ గాంచఁ బేర్చిరి యువకుల్. 180

క. సారెకు దూరం బెగయుచు
జారుచుఁ గ్రిందికి నితంబజాడ్యం బలఁ డో
లారతి శ్రాంతి జయించుచు
నారులు పురుషాయితంబున న్గని రెమ్మెల్. 181

క. అలివేణీస్తనసీమా
దళితుం డై శ్వాసమారుతములఁ బ్రతికి య
త్యలఘుక్లేశత మరుభృ
త్యులలో మలయానిలుఁడు సమున్నతిఁ గనియెన్. 182

క. శింజానమాపురాన్విత
కంజాక్షీపూర్ణడోలికలఁ దలఁతు నొన
ర్చెం జైత్రుఁ డనుచు నుద్వసఁ
గంజాశుగరాజధానిఁ గలితవసనఁగన్. 183

క. డోలావిలాసరత లగు
బాలలవదనాబ్జములను బరిచుంబించెన్
మేలిదుకూలము లాగెన్
వ్రాలెన్ గటిపైఁ బటీరవాయువు గరిమన్. 184

క. కాననచరపుంస్పికచయ
మూనెన్ గలపంచమమునసమున్నతి లీలా
గానాఽసక్తవధూజన
తాఽనూనచ్ఛాత్రభావ మందుట కతమో. 185



క. వనదేవతాయుతంబుగ
ననయం బుద్యానవాటి నలరెడుపులుఁగుల్
వనజాక్షులతోఁ బాటుగఁ
గనె సంభ్రమరహితడోలికాకేళికలన్. 186

చ. కరసరసీరుహద్వితయగాఢగృహీతవిలోలడోలికా
భరణసమర్థరజ్జుచయవారిజదృగ్జనతానిరస్తవి
స్తరపరిధానబంధనవిధాననితంబతటీనిజోచ్ఛ్వస
న్మరుదురుమోహితుం డగుచు బ్రామ్పడియెన్ మరుఁ డంత వింతగన్.

క. విరహిణులకంఠములు త్వర
దరియుప్రియులబాహుపాశతతిఁ బట్టువడన్
బరువడి వృథ యమపాశో
త్కరముఁ బిలుచుమధుఁడు లతలఁ గల్పించె స్మృతిన్. 188

క. కిసలవ్యజననివారణ
మసమీరనికేతనోదరాఽవాస ము్మ
ల్లసిలె విరహిణీమూర్ఛాఽ
వసరక్లేశాపనయనపథనూతన మై. 189

క. అతిముదమునఁ గోకిలకూ
జితానుకృతి శుకకులంబు సేయ, విరహిణుల్
వెతఁ గని యిలు [1]వెలలించిరి;
మతిమద్గుణ మదనుఁ బట్టి మార్పఁ గనుఁ గదా! 190

క. వెలి నలిరవముల వినుటన్
వలి యుడిగెనొ నా నెఱింగి పంకోదరమున్
వెలలుచు నలినము పొలిచెన్
గలితాబ్దద్వితయకన్యకాముఖకాంతిన్. 191

1. 'వెడలించిరి' కిఁ బర్యాయమని.

క. అరవిరిమొల్లలమొగడల
సరిసొబఁగగునవరదములసౌరున వఱలెన్
గర మటవీస్థలులమొదుల
మరగెడుబాలుండ నాఁగ మధుఁడు మురువునన్. 192

క. ఆనెన్ [1]వననలినాలయ,
మానితమలయానిలాతిమానసురభిగా
నూనశ్వాసము ముగ్ధము
సూనస్మితదంతురంబు సురభిముఖంబున్. 193

క. క్రమముగ వర్ణజ్ఞానో
ద్యమనియముఁడు, మధుఁడు వ్రాయునక్షరమాలా
క్రమ మన మహిఫలకంబున
భ్రమరీపదచిహ్నసుమపరాగం బడరెన్. 194

క. తరువుల నెక్కెను బుప్పొడి
బురుజులపైఁ బొరలెఁ దీవపూవులువఁ దా
నురవడి లాగెను వనిఁ గే
ళిరతి వసంతుండు సేయ లేఁ డెట్టిపనుల్ ? 195

క. ప్రాయం బూనె వసంతుఁ డ
మేయమదభ్రమరవందిమృదుగీతయశః
స్థేయుఁడు ముకుళస్తనవ
ల్లీయువతుల కిడఁ బ్రవాళలీలాఽధరమున్. 196

క. లీల మరురాజ్యభారముఁ
దాలుచుచైత్రుఁడు పికీరుతముభుజ మొకఁ డై
క్రాలఁగ లవంగవనవా
తూలం బితరంబుగా నుతుండై వెలసెన్. 197

1. వనలక్ష్మి.



క. యమదిగనిలరాశీకృత
సుమరేణూత్కరము లెల్లఁ జొప్పు సెడని వై
సమదమధుద్విరదంబున
కమరించినపాంసుశయ్య లనఁగాఁ బఱఁగెన్. 198

క. రోలంబాఽరవనిబిడిత
పాళీవాసంతికానవప్రసవము చై
త్రాలంకారోదయవే
ళాలసమానశుభశంఖలలితం బయ్యెన్. 199

క. శీతర్తువు [1]కడ నన నూ
ర్యాఽతపతప్త మగుచందనాచల మొందెన్;
శీతవిధి వీజనోపమ
తాతతచందనకిసల[2]సదాగతివలనన్. 200

క. చేతస్వినీమనసునను[3]
భూతిన్ విడి పాఱుమానమున్ జీవముతోఁ
జాతురిమైఁ బట్ట ననన్
వాతము మధుహితము దెసలఁ బట్టి భ్రమించెన్. 201

క. అవశవిరహిణీకంఠో
ద్భవలీలాపంచమమున భావజుకార్యం
బవితథగతి జరిగెన్ బ
ల్లవితతిఁ బికపంచమమున కమరె యశంబున్. 202

క. అందెకు నందెకుఁ గొల్పల
మొందించినకతనఁ [4]గాంచనోత్కర మొప్పెన్;
విందుగ మధుసామంతుఁడు
కందర్పేశునకుఁ బఱచు[5]కాంచన మనఁగన్. 203

1. దూరము. 2. వాయువు. 3. అనుభవము. 4. సంపెఁగలు. 5. బంగారము.

క. చరియించె నామ్రతరుమం
జరులన్; జుంబించె సకలనవ్యకలికలన్;
తరుణీగణమధ్యస్థుని
కరణి క్షణం బేని నిలువఁ గన దలి యిటులన్. 204

క. ఏకైకాఽశ్లేషణలఁ ద్రి
లోకైకగురుఁడు విలాసిలోకమునకుఁ; దాఁ
బై కిడి వనసర్వస్వా
శోకదళకరాల మధుఁడు సూడఁ డరిభటున్. 205

క. తన కగుగజగమనాపద
వనజతలక్షతిఁ గొలందివగ యని తలఁచెన్
గనుచు నశోకము వకుళము
గనులలనావదనసీధుకాంక్షను మిగులన్. 206

క. రటదళిపటలీకంకణ
పటుచూతనగాఽళిబాహుపంజరమున సం
ఘటితపికమృదునినదలం
పటుఁ డై హితుఁ గంతు మధుఁడు వడిఁ గౌఁగి లిడెన్. 207

క. వికచశ్రేణీస్థితచం
పకతతకేళివనమధ్యభాగము లొప్పెన్
నికటాఽయాతవిరహిణీ
ప్రకరకనకకాంచికావిభాసితములటుల్. 208

క. తమపల్కుతోఁ దలఁకులీ
లమెయి నెగయుకుండలంబులన్ విరహిణు లొ
ప్పమరిరి విసరినటుల్ పై[1]
కమునకు మర్మాఽర్తిఘూర్ణగళపాశములన్. 209

1. పికసమూహము.



క. మోదుగుపూములు సూపుచు
మోదమునన్ లేఁతలతచబుకును విసరుచున్
[1]బూదొనజోదాన విరహ
వేదనఁ జందనమరుత్తు పెనుపన్ దొడఁగెన్. 210

క. ధరణీరుహయోధులు సుమ
శరవర్షముఁ గురియు చుండఁ జైత్రాఽఖ్యమధు
ద్విరదాధిరూఢుఁ డయి స్మర
ధరణీపాలుండు మిగులఁ దాల్చె గరువమున్. 211

క. చిత్రీకృతకాననుఁ డగు
చైత్రుం డద్భుతసుమాస్త్రసంతతిఁ గూర్పన్;
[2]బత్రధిభరమున కోడి స[3]
పత్రాఽసనుఁ డయ్యు మరుఁ డపరముఖుఁ డయ్యెన్. 212

క. శృంగారిణీధవళితా
భంగప్రోచ్ఛలితదశనపంక్తిద్యుతి ధౌ
తాంగుఁడు శశి యైనటు మె
ల్లంగఁ దదంశులు ప్రసాదలాభముఁ గనియెన్. 213

క. మదనునకు మిత్రుఁడవు చై
త్ర! దళితతనుఁ డతఁడుగాఁ జెదరదు తనువు నీ
కిది యెట్టుల? తెలిసెన్ లోఁ
గుదురు విరహిణులఁ గలంచఁ గోరునెప మగున్. 214

క. విరహిక్షయదీక్షాఘన
దురితునిఁగా నిన్ను దలఁచి తొడరదు నిజ మీ
శ్వరునేత్రాగ్నియు నాయక
విరహితలయఖండపాపవృద్ధికతమునన్. 215

1. మన్మథుఁడు. 2. అంబులపొది. 3. ధానుష్కుఁడు.

క. హరసమరస్థితశంబర
హరుపార్శ్వము వీడి క్షాత్ర మఱి పాఱితి వౌ;
స్మరునియనంగునిముందర
మఱల నిలిచి తిప్పు డెటుల మధుచండాలా! 216

క. లోకమువెలిగాఁ దిరిగెడుఁ
గోకిలములు సగము గాలుకొఱవినలుపు లౌ
మైకలుములఁ గలుషస్థితి
నీ కౌతత్సంగ మిచట నెఱి ఫలియించెన్. 217

క. దోసము గలిగినను నినుం
బాసి మరుం డుండమికి సుమా! యిది కత మౌ;
నీసున విరహిణులఁ గలఁచు
దోసపుబరు వొరుఁడు పూన దొరకొనమిఁ గదా! 218

క. ఈరీతి వసంతాగమ
మారన్ మిఱినవిరాళి నతిపీడిత లౌ
వారిజనేత్రల కొదవెను
సారెకు నచ్చెరువుఁ గూర్పఁ జనుచేష్టితముల్. 219

క. యువజనగంభీరత చా
టువచోవిముఖత విభవపటుత్వ మితరకై
రవదృగ్గదచిహ్నము మా
నవిముఖలు దలంతు రది గుణ మని దొసఁగునన్. 220

చ. వెలఁదులమానపున్మదుల విప్పఁగఁ జెప్పెను బుంస్పికాళికిన్,
మలయసమీరముల్ విభుత మైకొనఁ దీర్చెను గేళికర్మలోఁ,
గలయ జగత్త్రయిన్ విరహకంటకకౌశలి యైనకంతుక్రే
వల వెలసెన్ మధుండు సచివస్థితి దుర్ఘటముల్ ఘటింపఁగన్. 221



చ. అలులకెసంగెఁ దేనె పువులందు విలాసముగా మునుంగఁ; గో
కిలములకంఠగోళములఁ గీల్కొనె స్థాయితఁ బంచమంబు; వ
ర్తిలెఁ ద్రిజగజ్జయద్భటతఁ దీరి మధుండు జగజ్జయైకదో
ర్బలపరిపాలనద్యుతికిఁ బ్రార్థన లేకయె కామరాజుకున్. 222

చ. అలులు జగద్వియోగిదళనాయతు నుజ్వలబంధుఁ జైత్రు వం
దులు బిరుదాళిఁ బేర్కొనుచదు ర్దగఁ బాడెను; గౌతుకంబునన్
వలపులతేఁడు మే లయినపౌష్పధనుస్సు ధరింప నిప్డు గో
కిలలలనారుతంబు సెలఁగెన్ ద్రిజగజ్జనమానమోష మై. 223

చ. పికరుతిరుష్ట యై చెఱకువిల్కొళ నేర్చు; దవాగ్నిఁ గోరు ఖే
దకలుష యై పటీరగిరిఁ దత్పవనంబున కోడి; దుర్మనో
వికలతచేతఁ గాంత పువువిల్తు వసంతుని వేర్పరింపఁ గో
రిక గల దాను; నేమి యొనరింపదు నీవు లభింపకున్నచో? 224

మ. భ్రమరీవిభ్రమభోగయోగ్యమధువుల్ ప్రాపించె గుర్వెందలన్;
యమదిగ్వాయువు లింతయైన శ్రమ వాయన్ జూడ వొక్కప్పుడేన్;
సుమరేణూత్కరముల్ విలాసగిరు లై పొంపొందె భృంగాళికిన్:
సుమబాణాప్తవసంతునందు విరహాసుస్థాయి యౌ నెట్టులన్. 225

మ. పలువూలన్ దరు లెల్లచోట్ల నెసఁగెన్ భ్రాజిష్ణు[1]భస్త్రాకృతిన్
వెలసెన్ లోకము ఖడ్గరుజ్మయముగా భృంగావళుల్ ప్రోవు గన్,
బొలిచెన్ జైత్రుఁడు సాధుసజ్జుఁ డయి గెల్పుం గూర్చునారాచముల్
గలుగన్ జేయ జగత్త్రయీప్రహరణాఖర్వోత్సు[2]కోగ్రారికిన్. 226

చ. మలయమువెల్వలన్ మలయమారుత ముండమిఁ గోరెదున్; సఖీ
కలకల మూన్చు దూరము పికంబులఁ దోలఁగఁ గేళికావనిన్:
గొలుచును దేఁటులన్ గలయఁ గ్రోలఁగఁ గేళివనాంతవాసనల్
పొలఁతి యొనర్ప దేది? యసువుల్ నిలుపన్ బెడబాటువేళలన్.

---

1. అంబులపొది. 2. మన్మథుఁడు.

ఉ. దోలల నూఁగుద్రావిడవధూటులశ్రోణులవేగ మీఁగుచున్;
లాలితసింహళీవదనలబ్ధకనద్ఘనసారవాసన
న్దేలుచుఁ; జందనాచలవినిర్గతవాతవితానముల్ విలా
సాలసలోకజాలసముదంచితసేవలఁ గాంచఁ గల్గెడున్. 228

శా. [1]ఉల్లోలించుచు నారికేళఫలకుక్ష్యుద్యన్నినాదాంబువుల్,
[2]బల్లార్పించి కవేరజాతటసురాభాండంబులన్ [3]దాటులన్,
జెల్లన్ నల్లననంట్లు దాఁక శిశిరస్థేయంబు లీతెమ్మెరల్
ప్రోల్లాసించెను ద్రావిడీసితకపోలోత్క్షిప్తవేగంబు లై. 229

శా. రోలంబాళి నధిజ్యమన్మథధనుర్భోంగంబు నొందన్ లతల్
త్రైలోక్యైకజయాస్త్రతన్ గనవ? కోదండంబునన్ బుష్పముల్;
దోలాందోలనకేళిలోలవనితాస్తోమప్రయుక్తాస్త్రుఁ డి
క్కాలాన్ జలలక్ష్యభేదనవిధిన్ గంతుండు గర్వించెడిన్. 230

శా. కేళీలల్ మదపుష్పలిట్సుమరసాఽకీర్ణంబు లయ్యెన్; విట
ప్యాళుల్ గూలుభయంబుఁ దెల్పెను లతాంతాత్యంతభారంబులన్;
దూలెన్ దైన్యముఁ జైత్రుఁడున్ [4]బ్రదరసందోహావ్యయాధ్వంబునన్;
గ్రాలెన్ లక్ష్యములం దలక్ష్యములనున్ గాముండు వి ల్వంపఁగన్.

చ. నవయువకుండు చైత్రుఁడు ఘనం బగుచిత్రలిపిన్ గడింపఁగా
నవసుమవర్ష మేవని దనర్ప దజపాంగపువర్షమున్ బలెన్;
దవులుచు దోలలన్ జెలఁగుతన్వులబల్కటిగుబ్బ లూఁచులం
కవలనిగాలికిన్ వలను గా వెటు మానమహీజభంగముల్ ? 232

మ.స్ర. దనుజేంద్రోద్యానలీలాతరుతలగతసీతాపదాంకప్రయుక్తిన్
ఘనసారద్వీపభూభృద్గహనతలరజస్కంబు లై కేరళస్త్రీ
జనకేళీవీటిచూర్ణస్ఖలితముఖహృతశ్రాంతిమై మోద మొందెన్
ననవిల్కారుండు గెల్పొందఁగ మెయికొనుచు న్దక్షిణాశానిలంబుల్.

1. కల్లోలంచుచు. 2. బల్లు మని ధ్వనింపఁ జేసి. 3. తాటిచెట్లు. 4. అస్త్రము.



మ. ఎది చూతాంకురకందళీకబళనాహీనశ్రవఃపేయ మై
కదియున్ గాయజజైత్రపత్రితం గన్నంతనే; పంచమం
బదె తాలుస్థలసంకటాటనముచే నామూల మున్మూల మై
నద[1]దన్యేధితకామినీగళబిలాంతస్సీమలన్ వీడెడున్. 234

క. విరహవిధురవామాజన
పరంపరాప్రహితచిత్తభవలేఖవచః
పరిమళములు సుమవేళా
వరవర్ణన లిడిరి పతికి వందు లిటు దగన్. 235

తోటకవృత్తము

కరుణా వరుణాఽలయ ! కామితదా !
గిరిగహ్వర సుందరగేహ ! హరీ !
కరి-శత్రుసుతావన ! కమ్రముఖా !
[2]ధరశాయి ! నృసింహ ! సదావిమలా ! 236

ఇది శ్రీత్రిభువనమల్లదేవవిద్యాపతి-కాశ్మీరక-
భట్టబిల్హణ మహాకవివిరచితవిక్రమాంకదేవచరిత
మహాకావ్యంబునకు శ్రీవేంకటేశ్వర
శ్రీనరసింహదేవపాదపద్మాఽరాధన
సమాసాదితకవితావైశారద్య
'ఆంధ్రబిల్హణ'బిరుదాంచిత
లక్ష్మణ-విశ్వనాథ
కవిసోదరాంధ్రీకృత
మహాప్రబంధంబునందుఁ
దృతీయాఽశ్వాసము
సమాప్తము

1. కోకిలము. 2. (తిరుమల) పర్వతమునందు వసించుదేవుఁడు.

# విక్రమాంక దేవ చరితము

## చతుర్థాశ్వాసము

క. కరివర-రిపుసుతపాలా!
ఉరుకలిదానవవిదారణోద్యత[1]వాలా
కరుణారసభర! వేంకట
గిరి-గిరిబిలవాస! హరి! నృకేసరి! దేవా! 1

క. ఈలలి నలినవిశిఖసఖు
కాలం బారంగ మిగులఁ గర్ణోత్సవ మై
చాలఁగ నబ్బుర మొదవెడు
జోలిన్ విక్రమనృపాలసోముఁడుఁ వినియెన్. 2

ఉ. [2]కంజనపత్నలేఖ కెన గాఁ దగునంగ[3]విభాతి, మారమృ
త్యుంజయమంత్ర మై, మనసిజోద్ధృతజైత్రపతాక నా జగ
త్పుంజదృగాళికార్మణతఁ బొల్పుఁ గనన్ గరహాటభూమిభృ
త్కుంజరుకూర్మిపుత్రి సొబఁగున్ గనుఁ బేరునఁ 'జంద్రలేఖ' నాన్. 3

క. వరవర్ణిని యగువిద్యా
ధరకన్యక కామె కిందుధరునాన స్వయం
వరము జరుపఁ బడు; నా
క్కరునిన్ గూరిచి యెఱుంగఁ గా దెవ్వరనాన్. 4

క. అంగన దాలిచి మించున్
శృంగారముదైవతంబు చేతోభవహృ
ద్రంగము విభ్రమములకు న
భంగప్రాంగణము నైనవయఃఉదయంబున్. 5

1. ఖడ్గము. 2. చంద్రుఁడు. 3. కాంతి.



సీ. లావణ్యరత్నాఽకరాఽవిర్భవన్మణి
శ్రేణిగాఁ దన్నఖశ్రేణి యలరు;
నసి గలతమముందుఁ బసిఁడియందెలఁ గిన్కఁ
గనియె నా నెఱు పగుకాళ్ల దనరు;
వదనేందుచంద్రికాఽవరణము లై పాద
సంగతాబ్జిని దాఁచుస్తనము లమరు;
మరుకేలుదోయిదండముఁ దెల్పుపల్కు నా
నెలతాజిగిని మించుమోల రహించు;

గీ. హస్తసర్వస్వహరణ నిభాఽళి కంటఁ
జనని[1]మాతంగతను గూర్చునక్తులు దగుఁ;
గలికి కల లేఁతఁదనము వే తొలఁగి లలిగఁ
గ్రొత్తజిగిజవ్వనము గూడికొని రహింప. 6

గీ. లలనకాల్గోరురతనాల లక్కపూఁత
నెలకు గందంపుఁబూఁతచేఁ దెలుపుసేఁత;
జాగ్రదబ్జరమాహరచ్చరణములకుఁ
జిత్రమే! మత్తగజగతిస్తేయరీతి. 7

చ. మునుఁ గనఁ బోనిరాగమునఁ బొల్పుపదంబుల కొందెఁ బూర్వప
క్షనియతిఁ బల్లవోచ్చయము; కంజము లొందెను బ్రత్యుదాహృతిన్;
గనియెడి భేదమున్ బదయుగంబునదన్ భ్రమమాన[2]మానసం
బున నెల వైనహంసచయముల్ మనముల్ మిగులన్ గలంగఁగన్.

ఉ. నల్లనిజాలయందెలు ఘనంబుగ నూనతదంఘ్రు లంత శో
భిల్లె నితంబభారపరిపీడ బొమల్ ముడి వెట్టె నాఁగ; రా
జిల్లె బెడంగుగాఁ బసిఁడిఁ జేసినయందెలదాలు జంఘ ల
న్వల్లుల కూన్చుకుంకుమముపాదు లనా నలినాక్షిపట్టునన్. 9

1. చండాలత్వము, 2. మనస్సు-మానససరస్సు.

క. రంభోరూరుద్వయమున
రంభాస్తంభములు గనెఁ బరాభవము; సుపా
లంభన గా కతిమృదువులు
జృంభించునె [1]జడము లైనఁ బృథుజయభేరిన్. 10

ఉ. త్రుంగితిఁ ద్రుంగితినా నని యరుంతుద ఫూత్కరణం బొనర్చు న
య్యంగన '[2]కాంచి' సారెఁ బెను పందుపిఱుందువెతన్ రుతించె నాన్;
జెంగటిచేడెపిండు తమచేతుల సాలమిఁ జాలఁ దూలుచున్
సంగతముం బొనర్చె నొకదాయగ మేఖలఁ దత్కటిస్థలిన్. 11

చ. [3]శుచికనకంపువేది, నవసూనశరాఽసనరంగపీఠమున్,
ప్రచురనవాంగ[4]సౌష్ఠవవిభా[5]ఘన మౌజఘనస్థలంబుఁ బూ
నుచు మొలనూలుఁ గట్టఁ గడు నోపదుచున్ బరిచారికాజనం
బుచితము గా ద టంచు జఘనోద్ధతి నింద యొనర్తు రేఁపునన్. 12

ఉ. నాతి నితంబగౌరవమునన్ గడుఖేదము నొంది కేళికా
కౌతుకవేళలన్ విడుచుఁ గందుకమున్ గదలంగ లేక; వి
ఖ్యాతతదీయదుర్గజఘనాఽయతి విస్మితి కాస్పదం బగున్;
శీతకరాఽన్య మారునకుఁ జెల్లు సుదూరపతత్పృషత్క మై. 13

సీ. రశనామణిప్రభాత్రస్తతిమిరలేఖ
వలె నల్లగా నాభిబిలము సొచ్చె;
మొల[6]విదూరంబునఁ బొలిచి చన్నుల నాను
రతనంపు[7]వాగలరమణ నొప్పెఁ;
గాయజకాంచన[8]కటకనిర్గత[9]యావ
ధారగా నాభిచెంతన యెసంగెఁ;
[10]గడెముఁ గూడినమరు[11]గౌరుసంకెలఁ బోలి
పొక్కిలిసుడినుండి మున్ను సాగె;

1. ల-డల కళేబరమాచేత 'జడము' అనియును నర్థము. 2. ఒడ్డాణము.
3. శృంగారము. 4 లావణ్యము. 5. సంఘాతము. 6. వైడూర్యమణులు పుట్టుచోటు. 7. శలాక, 8. కంకణము. 9. లక్క. 10. నిగడము. 11. ఏనుఁగు.



గీ. నాభిమండలమును జొచ్చి నవగభీర
తాఽఽప్తతాత్పర్యము వహించె ననఁగ నెనఁగె;
వల్లరీశ్రేణికాలీల నుల్లసిల్లెఁ
గలికిసొంఁగారునూఁగారు విలసితముగ. 14

ఉ. తుంగకుచద్వయంబు ననతూపులవింటను నూఁది కంతుఁ డె
క్కంగ ఘటిల్లుధన్వ[1]టనికల్పితముద్రగ నిల్చె; నబ్జజుం
డంగనసృష్టి సేయుతఱి నందపుసంపద యంత మొందఁ బూ
ర్తిం గనఁ జేయ లేక బిలరీతిగ నిల్పెను నాభి నాఁ దగెన్. 15

చ. అల మదనాఽజ్ఞలన్ వరుస యౌవనలక్ష్మి లిఖింపు చుండఁ బొ
క్కిలి యనుబుడ్డినుండి వెలికిన్ దొలఁ కొందుమషీద్రవంబుగా
మెలఁగుచు [2]నారు మీఱె నిశి మిక్కిలి లోఁ తగుపొక్కిలిన్ బరన్
గలిగెడుశంక మన్మథుఁడు కౌనునఁ దిన్నఁగ నిల్పుపాద మై. 16

క. [3]ఘననిభకుంతల దాల్చిన
ఘనమౌక్తికహార మొప్పుఁ గనె నాభ్యా[4]వ
ర్తనలావణ్యజలోద్ధృతి
కను వగుఘటియంత్రగుణమ యని యుపమింపన్. 17

చ. స్తనయుగభారమున్ గుఱఁచి శంకితభంగవలగ్నసీమ గూ
ర్చినకనుబొమమోడ్పు[5]పరిరీతి యనన్ ద్రివళీక్రమం బగున్;
దనురహితత్వ మేర్పడుట దర్పకుతద్వనితావళిత్రయం
బనుతనదారిమెల్లగయునార్తి యగున్ రతిమాత్రవేద్యగా. 18

క. ఆరోహింపన్ జాలని
దై రహిఁ గనుకుచతటంబు నవలఁగ నిడుచున్
దే రథుగ మారుఁ డూన్చిన
దారులటా లనఁగఁ ద్రివళిదామము వొలిచెన్. 19

1. ధనుస్సుకొన. 2. రోమరాజి. 3. మేఘము. 4. సుడి. 5. పంక్తి.

క. స్తనభరసమున్నతిక్రమ
మునఁ బైఁ బైఁ బొడుపు సూపుముక్తాఫలహా
రనిహితముద్రావళిగాఁ
గనకాంగివళిత్రయంబు కనకనలఁ దగెన్ 20

క. వనజనయనయనదుఁగౌనుఁ
గనుగొని లావణ్యపూర్ణఘనకుచములకున్
జనుదారి నలువ త్రివళిన్
జన రానివిధాన విషమసరణిన్ నిలిపెన్. 21

తే. గీ ఏయెడఁ గృశాంగి కార్ముకవృత్తికిఁ దగె
నయ్యెడనె నొచ్చెఁ దృఢముష్ట్యనంగుచేత
బరు విడుచనుల్, రణత్కాంచి పోషింపఁ
గౌనుకార్శ్యం బెటు సహేతుకంబు గాదు! 22

చ అతివనిరంతస్తనయుగాంతరమందు [1]వినోదకుండలీ
కృతదృఢచాపదండుఁ డయి కీరతురంగుఁడు మించుఁ జిత్ర మౌ;
మనిఁ దలఁతున్ వధూటికుచమండలి దాఁ గఠినత్వ మూనఁగా
రతిపతికిన్ దదీయహృది రాజిలు నంచు నకష్టసాధ్య మై. 23

క. చిలుకస్థల మొరయఁ గుచ
స్తబకద్వయ మంగనావతంసము నర్మ
ప్రబలోక్తులఁ గనఁ జాలదు
[2]నిబిడీనహ్రీనతాఽస్యనీరజ మెపుడున్. 24

క. తనయౌవనలక్ష్మికి మును
మును వచ్చినమదనుఁ జుట్టమును నున్ముఖుఁగా
స్తనయుగ్మాంజలిబంధం
బున నానరుచసరణిఁ దోఁపఁ బొలఁతి రహించెన్. 25

1. క్రీడ. 2. నిబిడము.



క. కలికిచనుంగవనిందకుఁ
గలరె సమాధానవిధి? పెకలుఁబవికలకున్
నలలితపిధానతాస్థితిఁ
గలిగింపన్ జాల కున్కి కారణ మగుడున్. 26

ఆ. వె. దంతికుంభము లగు దంభయుతంబులు;
కలశము లగు మందకౌశలములు;
చక్రవాకము లగు సరవి వరాకముల్;
లికుచకుచకుచంబులకును ముందు. 27

చ. వదనసుధాంశుచంద్రికల వర్ధిలువెల్లువఁ దేలియాడుచున్
గదియువలిన్ వడంకుగతిఁ గాంతచనుల్ దమలోన రాయుచున్,
మదనవ్రతంబు నిక్కముగ మౌళిమణిద్యుతికిన్ నిరంతరో
ద్వదనముగాఁగ నిల్చి గనుపట్టుఁ గొలందిఁ జరించునట్టులన్. 28

ఉ. సారసనేత్ర దుర్వహకుచద్వయమండలమున్ ధరింపఁ, బెం
పారె నఖర్వగర్వకుధరాగ్రతలస్థితి పుష్పధన్వికిన్;
దీరెను మిన్న లౌచనులనీడ తదీయముఖేంద్వగోచరో
దారవళిత్రయీతటసమాశ్రయలీన[1]తమిస్రలేఖ యై. 29

చ. సుదతిగళప్రదేశమున సూత్రిత మైనటు రేఖికాత్రికం
బుదయముఁ గాంచె [2]గ్రామమధురోర్జితత్రిస్వరసన్నిధాన మై;
మదనున కయ్యె లోకజయమంగళ[3]కంబుగ నగ్గళంబు పెం
పొదవుముఖాంశుసాగరసముద్భవ మై కడుసుందరంబుగన్. 30

ఉ. ఆపె విపంచిపంచమరవామలచాతురి స్వీయకర్ణసం
వ్యాపిసుధాప్రపూరకలనామితకాకలికాస్వనాళిచే;
నాపికవాణిపాణియుగ మందెను సౌమనసాశుగాసన[4]
వ్యాపృతిఁ గాంచుమేటిధనువందు నశోకకిసాలసామ్యమున్. 31

1. చీఁకటి. 2. షడ్జాదిస్వరములు. 3. శంఖము. 4. పుష్పచాపుఁడు.

క. నీవదనేందున కెదురుగ,
నోవనితా! నేను నిల్వ నోప ననునటుల్
[1]ఘాణనిపాణియుగిఁ హే
లావనజం బూన్చెఁ బటువిలాసస్ఫురణన్. 32

తే. గీ. రతిపు[2]శౌండీర్య-గర్వనిర్వాహమునకుఁ
దగెదు[3]ప్రత్యాశగా బ్రహ్మ తన్విహస్త
తలమునందు లిఖించె నుదారదీర్ఘ
మగుచు నొప్పునాయూరేఖ నక్కజముగ. 33

తే. గీ. పవుసునిగ్గుల నిగుడించుపక్ష్మలాక్షి
బాహులావణ్యమీలితభర్మవలయ
మల సఖీజన మాశ్లేషములను దమదు
మేనఁ గాఠిన్య మొరయ నద్దానిఁ గంద్రు 34

ఉ. కాంచనకంకణంబు సుమగాత్రిప్రకోష్ఠతలంబునందునన్
గాంచనకంజనాళ మనఁ గైఁ గడియంబుగఁ నొప్పె సొంపుగాఁ
గాంచనకంకణావళిఁ బ్రకాశిలెఁ దద్భుజవల్లి తూణికా
[4]కాంచనక్రమమౌర్వి సుమకార్ముకుఁ డింపుగఁ జుట్టెనో యనన్. 35

చ. అలరు వెలందిప్రేళుల హొయల్ వెలిఁ జిమ్మెడునుంగరాలప్రో,
వలరులవిల్తునంపగమి హత్తినసూక్ష్మశరవ్యముల్ వలెన్;
జిలుకలకొల్కికేలునఁ బసిండికడెంబులచాలు గ్రాలె నా
చిలుకవజీరుఁ డుల్ల మనుజింకను గట్టగ నిల్పుత్రాళ్ల నాఁ. 36

ఉ. సారసమిత్రుఁ [5]డంశువున సారసతస్కర మౌటఁ గట్టె నా
సారసనేత్రహస్తము వొసంగె సహాటకకంకణస్థితిన్;
సారసనేత్ర మూపు లల చన్నులప్రేఁగున దవ్వఁ బర్వి వి
స్సారసపద్యుదారరుతి నల్పుకడెంబులఁ బోరనాఁ దగున్. 37

1. స్త్రీ. 2. అహంకారము. 3. ఆడియాస. 4. సంపెంగ. 5. వ్రాదు-కిరణము



చ. లలనభుజద్వయంబు సరళం బయి యుండిన మోదుతూండ్లశ్రీ
విలసన మాక్రమించు నెటు; విస్తృతచారుకుచద్వయంబుచేఁ
దలఁగఁ బరస్పరం బయినదర్శన మెట్లు మృణాళికాయశం
బులఁ బొలియించుకార్యమున మూఁడును మంతన మాభుజాలకున్.

సీ. తనయరుణత మోముఁదమ్మికి సిరిఁ గూర్చి
పరికెంపుదివ్వెలమురువు డుల్చి
తనసోదరత నెలఁ దనరుకౌస్తుభ మన
మోవిని మంకెనపొలుపుఁ దాల్చి
తనయునికి నాసాగ్రమున భర్మనాశికా
విచ్యుతమాణిక్యవిభవ మంది
తనమోము రేవెలుంగునకు ననిందిత
సంతతోదయసంధ్యదాయ మెలఁగి

తే. గీ. వధువు వాతెఱ లావణ్యవనధియందుఁ
బొలుపుఁ గనువిద్రుమం బనఁ గులుగు నెనసి
దొండపం డనఁ జిలుకలతుటుము భ్రమయ
రాచకొమరులలో రాగ మేఁచ నెసఁగు. 39

క. తనప్రాముఖ్యల విడి నూ
తనశరముల నినుచునిచ్చ దర్పకుఁ డెలమిన్
దనదాన నధోముఖంబుగఁ
దనరించినయటుల [1]నాస తన్వికి నొప్పెన్. 40

చ. పొలఁతుకకన్ను కల్వసిరి మ్రుచ్చిలె నా నది క్రొత్తయే? చెవిన్
బొలిచెడుకల్వ యేమినుడువుల్ వచరించు? నెఱుంగ; బోదజం
కలతవులంబు చూపునకుఁ గల్గక యుండిన నెట్లు దూఁగు వి
చ్చలవిడిగాఁ జెవిన్ బొదువుచక్కనిలేగతికన్ జవిన్ గానన్. 41

1. ముక్కు.

క. శ్రుతిమార్గమునన్ దద్దృ
గ్ద్వితయంబు ప్రకామధవళదీప్తి నదరఁ ద
ద్వ్యతిరేకాఽకృతిగా నే
గతి నగుఁ గృష్ణానురాగకలనంబందున్. 42

క. శృంగారిగురుం డగున
య్యంగజుఁడుం గూడఁ గుతుకి యగుట వినుఁడు వా
లుంగంటిచెవులకున్ జను
తొంగలికన్నులకు శిష్యదోహలతఁ గనున్. 43

క. సౌందర్యపాత్ర మగువద
నేందువునన్ హరిణసంగ మెనయుభయమునన్
సుందరిశ్రుతి[1]పాశంబుల
యందుం [2]బాశములఁ గూర్చె ననఁగా నొప్పెన్. 44

చ. ఇంచుక నెమ్మెఁ జిమ్ము[3]బొమలిందువెలంది రహించె శైశవా
ద్యంచితకేళి లాఁపునవయౌవనమున్ బెదరించునట్టులన్;
జంచలనేత్రదృగ్యుగము సాగెడుకుండలరత్నకాంతిఁ దూ
లించనుబోలె శ్రోత్రయుగళీతల మెక్కుచు నిక్కు చుండెడిన్. 45

క. నాసా[4]వంశచ్యుతము
క్తాసదృశపటీరబిందుకలితనిటల మై
యానకినాసావంశో
ద్భాసితహరితదళయుగనిభభ్రువులఁ దగెన్. 46

క. తనయుచెలిమి నెనఁగెడు[5]గుహ
ఘనహనబర్హి గిరిజగాఁ దలఁచి మరిన్
దనతలపై నెక్కెనొ నాన్
దనయలకభరంబునన్ సుతను విర వొందెన్. 47

1. శ్రోత్రములు. 2. త్రాళ్ళను. 3. కనుబొమలు గలయంద మగు కాంత.
4. వెదురు. 5. కుమారస్వామి.



మ. తనుఁ దానే కయిసేయఁ జెక్కిలి విదగ్ధత్వప్రగర్వంబునన్;
గనుఁ దాళీదళరక్తిఁ, బైఁడితొడవుల్ కైసేయుటల్ మానుచున్;
జనుఁ జెండాటను వీడి శారికలశిక్షన్ మోదముం గాంచఁగాన్;
దనుఁ దా నాతి యలంకరింపకయ సౌందర్యమ్మునన్ మించెడున్. 48

చ. సరసిజముల్ ద్విరేఫతతి [1]శస్త్రిగఁ గుక్షి ధరించు; నైశధా
తఱిఁ గని మింటిముంగిటినిఁ దాఁటఁగ వచ్చును జందురుండు; బి
త్తరి భువనత్రయీరుచివితానము మోమున దొంగిలింప వం
దురుఁ గన కుండు నెద్ది ? స్వతనూసుషమాపునరాగమేచ్ఛచే. 49

శా. సాక్షాత్కంతుధనుస్సు భ్రూయుగమునన్ సౌభ్రాత్రమున్ బూను, యో
గక్షేమంబుల నల్లకల్వలయెడన్ గన్దోయియున్; దోయజా
తాక్షీలోకజయత్వరాఽన్వితశరీరాంగాళిమ్రోలన్ గడున్
లక్షించున్ మలినస్థితిన్ నఖిల[2]కల్యాణంబు మూలాఽకృతిన్. 50

చ. కనులకుఁ గర్ణయుగ్మమునఁ గల్గను మేరలపోరు నిచ్చలున్;
స్తనయుగరుద్ధహృత్స్థితి ఝషధ్వజుఁ డూను బలాత్కృతిన్; బలం
బునఁ బడ వైచుఁ గ్రందనముఁ బూన్మొలనూల్దవుగా నితంబ; మం
గడమెయి నిట్టులన్ జయము గాంచును జవ్వనపుంబ్రవేశముల్. 51

ఉ. ధోలఁ గదల్మొలన్ గనుచుఁ దొయ్యలి సిగ్గెనయున్; గపోతరా
వాఽళి స్మితాఽస్య యై దెసల నారయు నిక్కుచు; ముండ్లతాకిడిన్
గేళివనిన్ సహింప కటఁ గ్రీడ యొనర్పఁగఁ బోదు; మౌగ్ధ్యముల్
వ్రాలఁగఁ జేయుయౌవనము [3]వామయెడన్ గనుపట్టు [4]సజ్జ మై. 52

చ. నటనము నేర్పుసాకున ఘనస్తని గాత్రసమర్పణంబు నే
ర్పుట, గళకుంఠరీతి కడఁ గాంచుట లాలితపంచమధ్వని,
నృటునుతి యేల ? సర్వలలనాజనమండన మయ్యెఁగా సఖీ
పటలగురుస్మరాల్పతరబాధనె భామిని నేర్చె ప్రౌఢతన్. 53

1. చురకత్తి. 2. బంగారము. 3 కామిని. 4. అలంకృతము.

చ. స్తనతట మున్నతంబు. నడుచక్కి కృశంబు, మొగంబు నిర్మలం
బును. బిఱుఁదుల్ వధూటిగురు[1]పుష్పపృషత్కమృగేంద్రపీఠి, యీ
యనువున నాల్గు నామెయెడ నబ్జజుఁ డూన్చి సుగద్యపద్యభం
గిని మతిఁ బూన్చతుర్ముఖతఁ గీల్కొనెఁ దృప్తిన టంచు నెంచెదన్.

ఉ. ఈగతి వీనువిం దగు[2]ప్రవృత్తిని వించుఁ మదిన్ దదీయగా
థాగతకౌతుకంబు మఱి తాల్చుచళుక్యనిచెంత జ్యారవో
ద్యోగదలుండు శ్రోత్రమునమండి తొలంగఁగఁ గమ్మ యమ్మరుం
డాగజయానవృత్తమునె యాదటఁ దాఁ జిగురింప నెక్కొనెన్. 55

క. అమ్ములు పమ్ముసుమేషుగు
ణమ్మురవ మ్మెనెడుగర్జన మ్మడరఁగ వా
కొమ్మ నృపుమానసమ్మునఁ
బిమ్మట రాయంచపెంటివిధమునఁ జొచ్చెన్. 56

క. బాలప్రవాళనిభరుచి
బాలాపాదంబు సోఁకఁ బాటిల్లె నిలా
పాలస్ఫటికాచ్ఛమనః
పాళిన్ రక్తిమ ముపాధిభవమో నాఁగన్. 57

క ఆమనికరువలి భీతిలి
సోమునికరదండములను సోలునితఁడు, గాఁ
డామన్మథభూమీనా
థామర్షభీభీషిఽఽశి నార్తుఁడు దేనన్ ? 58

క. రేలగుణంబులఁ బగలన్
దాలిచి దినసుతుల రేఁ దవిలి నడుపుచున్
రేలుంబవళ్ళు రెండును
గ్రాలనియిలనే నృపుండు క్రమమునఁ గోరెన్. 59

1. మన్మథుఁడు. 2. వార్త.



శా. ముల్లోకంబుల మోహమున్ గొలుపఁగాఁ బూన్విద్యనాఁ బోలుత
ద్వల్లీగాత్రిసమాశ్రితిన్ ఘనజయాఽస్త్రన్ గాంచి కంతుండు వే
వి ల్లెత్తెన్ విలుకాఱులందు మునుగాఁ బెం పొందునారాజుఁ దా
దిల్లన్ జేయ నమేయలీల నిజపాండిత్యంబు స్తుత్యంబుగన్. 60

క. తనకాంతిచేత హిమధా
మునికాంతి నడంచుదివసముఖరమవలె గో
ము నిగుడ్పుగరితచే నాం
దెను బాండిమ మవనిపప్రదీపక మపుడున్. 61

క. శృంగార[1]మణీధివేలగ
నంగన తనయందు వసతి నందఁగఁ దద్భ్రూ
ద్రంగము మణిగణమునవలె
సంగతనూత్నానురాగసాంద్రం బయ్యెన్. 62

క. ఉవిద నతభ్రువు సుభగగ
నవును; బ్రసాదంబు మరుఁడు నలరించు నటం
చవిరతచింతన్ [2]దొలఁకెను
భువనత్రయచింతఁ దొలఁచఁ బోలెడునృపుఁడున్. 63

చ. నృపవరుఁడు నిశ్వసింపఁ, గృశియింప, నికంకుశభంగి నంగజుం
డవిరతజాగ్రదుగ్రవిశిఖాఽసనశింజిని యై క్రమంబుగాఁ
గవిసె జయాఽస్థ; ని ట్లతఁడు కంతునికిన్నకుఁ బాత్రుఁ డైన. సా
ధ్వివిధినిఁ దెల్పునట్లు రతి ద్రిప్పె ముఖంబుఁ ఖరాన్ముఖంబుగాన్.

క పున్నమచందురుమోమున
నన్నవ యన్నెలతేనియందు మెలఁగి వే
అన్నలవికాసదీక్షను
గ్రన్నన బిసినులమటోలె గ్రహించె వదిన్. 65

1. రత్నాకరము (సముద్రము). 2. చలించెను.

క. వామానితంబబింబని
కామాఽయతికారణంబుగా నన భూమీ
కాముకుమనమున నుత్తమ
కామిని యెవతెయును జోటు గాంచక యుండెన్. 66

ఉ. అంతిపురంబుసుందరులయందలిద్వేషమునన్ నితాంతమే
కాంతనిషేవణంబును దదన్యు లెఱుంగమిఁ గోరియున్ ధరా
కాంతుఁడు నై జరీతిఁ గనెఁగా! కడు [1]దాండమితంబుగా; నుప
క్రాంతలతాంతకుంతవిశిఖక్రియ లేక్రియ డాఁప నయ్యెడున్? 67

చ. శ్రవణము జారుకర్ణికను భ్రాంతిఁ గనున్ ననవిల్తుకమ్మగా;
శ్రవణ మిడున్ స్వశీర్షసుమసారసమాగతషట్పదోదితాఽ
రవమునకున్; మినున్ వినుఁ; బ్రరక్తి విలాసపుభిత్తులన్ గనున్:
నృవరుఁడు వేఁడఁ డేమి తరుణీచరిత్రశ్రవణాభిలాషి యై? 68

ఉ. ఏగతి నాతి యుండు నని హృత్స్థలి నుత్సుకుఁ డై నతేనిచే
తోగతి బాణతూలికలఁ దొయ్యలిఁ గంతుఁడు వ్రాసి చూపె; రం
భాగరిమోరుకాంతి గలభామినిమోమును గాన్క వెట్టుచున్
సాఁగి దిగంగనల్ గొలువ సాగిరి ప్రౌఢవిలోకనున్ నృపున్. 69

క. పరివారము భీతినిఁ జి
త్తరువునవలె నుండె మౌనతత్పరుఁ డగుడున్
నరపతి; గృహకేళిశుకో
త్కరగళవివరముల నుడులుఁ గ్రమ్మక యుండెన్. 70

క. వారపురంధ్రులనడుమ న
వారితసరసోక్తినిపుణ వరదూతి నృపుం
డారసి కాంచీరుతిసన్
[2]గేరున్ ఘనదోషముఖరకీర్ణం బనుచున్. 71

1. ధ్వన్యనుకరణము. 2. తిరస్కరించును.



చ. హిమజల మెంతయున్ దలఁప నెంచనియట్టిది, చందనాంబుపూ
రముల కసాధ్య మైనయది, రత్యధిపురం డలపారసీకతై
లమనలమే కరంబు నచలాపతిఁగూర్చి శరంబులందుఁ బొం
దమరించి తారసించె [1]ననయంబుగఁ దద్విజయైకదీక్షుఁ డై. 72

క. శ్రాంతుఁడు, నిద్రాఽలసనే
త్రాంతుఁడు కూన్కఁ దగుతేనియందు శరంబుల్
కంతుఁడు పలుపుచ భంగం
బెంతయు శాత్రమునఁ దలఁపఁ దేకభటుం డై. 73

క. కుంతలకంతువలపుఁ గను
కాంత చెలులలోఁ బతాకగా నిర వొందెన్
గంతుఁడు ప్రతాపి యయ్యె [2]న
నంతాపతియందె తాప మంతఁ గొలుపుచున్. 74

క. స్వశరీరలగ్నఁగఁ బరో
దిశఁ జిత్రితనట్లు, [3]కండ్లతీరు తిరుగు చు
న్నశశిముఖిఁగ నామెనె కనె
నిశలన్ క్షణమాత్రలబ్ధనిద్రుం డగుచున్. 75

క. చందురునాతపమును విడి
చందనపాపి నటనుండి చంద్రిక మఱి వా
పిం దిరిగి యిటు భ్రమించుచు
డిందించె న్మరాఽర్తి రే ల్కడిందిగ నతఁడున్. 76

తే. గీ. అతనుచాతకకలితదివ్యాంబుధార
కర్ణపాళీసుధాస్ఫాటికప్రణాళి
యైన యేణేక్షణావార్త నాత్మఁ గొనుచుఁ
జేరెఁ జారుఁడు ధాత్రీశుచెంత కంత. 77

1. అత్యంతము. 2. భూపతి. 8. బందిచక్రములవిధము.

చ. తనముఖమం దెసంగెడుకథారసధారల నైజదంతనూ
తనరుచిభంగిఁ జిందుచు నితాంతముఁ దంచితవక్త్రకాంతులన్
దనరిఁచి యానతాననవిధావిశదీకృతభక్తియుక్తిని
ల్చినతనుఁ జూచుతేనికి వచించెఁ జరుం డిటులన్ గ్రమంబునన్. 78

తే. గీ. మరునిశర మగుసుమనిర్మాణసరణి,
దృక్చకోరకవృత్తి యనిందుజంబు,
ముజ్జగమురంజన మొనర్పఁ బొడమురాగ
విద్య విద్యాధరప్రభుప్రియతనూజ. 79

చ. అకుటిల మౌగుణోచ్చ్రయమునందు వహించెదుపక్షపాతమో,
సకుతుకచిత్తుఁ డై నలువ [1]సంగడి సంఘటియింపఁ బూనులో,
సకి నిను విన్నమాత్ర నృపసత్తమ! యీభువనత్రయంబునన్
సకలము జీవలోకము మనంబున నెంచెను ద్వన్మయంబుగన్. 80

తే. గీ. తనిమమున మున్గినట్టియూతన్వి మేనుఁ
గరము శరముల ముంచినకారణమున
[2]నెఱి కొనన్ బోలుసూక్ష్మ మౌగుణులయందుఁ
గనియె శ్రేష్ఠప్రకర్షంబుఁ గాయజుండు. 81

చ. వలపులతేఁడు వింటియెడ వాంఛ దొరంగఁగ నారి నారిగా
నిలుపునటుల్ తనుత్వముఁ గనెన్ గనకాభతదంగయష్టి; న
వ్వెలఁదికిఁ జెప్పెఁ బోలు వెదవిల్తుఁడు సౌగతశాస్త్రమర్మ మ
క్కలికి నినున్ వినా వితథకాంక్ష సవజ్ఞ రచించు నాత్మకై. 82

ఉ. తంతుకృశాంగమున్ గలుగుతన్వికిఁ గార్మ్యకర్మవార్త వో.
నెంతయు సన్నగిల్లి కుసుమేషునకున్ గుణ మైనఁ గాదు; తా
నెంతయుఁ ద్వద్వియోగమున నెద్యుఁ దనుత్వము నింటికందమున్
సుంతగఁ దాఁకి క్రమ్మఱు నుసుర్వడగాలిఁ జలించునో యనన్. 83

1. జత. 2. ప్రజ్ఞ.



క. సుతనుస్తనపీఠంబున
సతనుశిఖిద్రావితాఽత్మహారగ ముక్తా
తతిపిండ మరయ నయ్యెన్
బ్రతిబింబిత మయ్యె రాత్రిపతిబింబ మనన్. 84

క. సోరణమునుండి చిత్రా
గారం, బటనుండి కేళికావని, వలభిన్
జేరుచు నటపై నెటనేన్
గూరుపదు పదంబు మరునకున్ బెదరినటుల్. 85

మ. కలలోఁ [1]గాలగళుండు గూర్పఁ దెలిపెన్ గల్యాణి నీపాణి; న
క్కలవాణీజనకుం డొనర్పఁ డితరక్ష్మానాయకార్థిత్వమున్;
నిను బ్రశ్నింపఁ దభీష్టభంగ మగు నన్భీతిన్; నినున్ గోరుఁ; బో
కల నిన్బోల్ప్రియ నంది వంశము [2]నలంకారింత్రుగా కన్నియల్

క. వరణావసరము దరిసెన్
నరపాల! ప్రసన్నతం బొనర్పు పయన మ
వ్వరవర్ణిని యెల్లర విడి
వరియించున్ విజయరమవిభాతి నిను మదిన్. 87

క భూరమణుఁడు విని మోదం
బార స్వయంవరసమాగతావనిపాళిన్,
[3]మారావనిభృన్నగరిన్
జేరెఁ దమి జవాశ్వదలవిశిష్టత నెఱయన్. 88

క. అంగముల నిముడనటె హృ
ద్రంగత్తోషంబునన్, సుతాజనకుఁడెదు
రోక్కం గడఁగి యర్ప లిడె రా
ట్పుంగవున కతండు నర్ఘపుంజముతోడన్. 89

1. శివుఁడు. 2. అలంకరింతురు. 3. మన్మథరాజధాని.

క. పెన్నిధిఁ గన్నవిధిన్ గని
యె న్నెమ్మి నృపుండు కుంతలేశ్వరునిం దా
గన్నెలతండ్రుల కున్నే
సన్నుతజామాతఁ గనినసాటి పదంబుల్. 90

క. గౌరవముల నెరపి సమ
స్కారము గావించి, దారి క్ష్మాపతి సూపన్,
జేరెఁ జళుక్యుఁడు వరణ
ప్రేరితహృదయావనీశ వితతస్థలమున్. 91

క. దుందుభిరవముల, నానక
బృందనినాదముల, [1]మిగిలి పెం పగుసూత్సా
నందోత్సవభువి కన్య ము
దాందోళితుఁ డై నృపాలుఁ దన్వేషించెన్. 92

శా. [2]భంగశ్రేణి మరాళమ ట్లతఁడు సోపానాళి లంఘించుచున్
భృంగజ్యాళజ్ఞ సువర్ణపద్మరుచిమైఁ బెం పారుదాంపేయపీ
ఠిం గై సేయుచు శుభ్రదేహమున రాడ్బృందావృతుం డై తగెన్
రంగత్క్షీరధి హస్తిశాబనివహప్రావేష్టితేంద్రేభ మై. 93

క. కై లాసపితాలయ మది
యోలిన్ నృపసింహ మంత్రి సూఁదఁగ నృపతుల్
బాలఁ దలంచిరి పొందఁగఁ
జాలనిసింహిగఁ గురంగజాలము వోలెన్. 94

తే గీ. మణిమయవితానములఁ గుట్టిమములఁ బ్రతిఫ
లించునృపబింబములచే సలీలముగను
పౌరుఁ గాంచెస్వయంవరోత్సాహశాల
ముజ్జగముకాముకులు తనున్ బొందినటుల. 95

1. అతిశయించి, 2. తరంగములు.



క. మణిమయమంచముల విభూ
షణమణిగణమందుఁ జూడ సాగిరి మొగముల్
గణియించుకోర్కి ముఖల
క్షణప్రకర్షంబు నృపతిశతములు సభలోన్. 96

క. ముత్తెపుమేల్కట్టుల భూ
భృత్తులప్రతిబింబపంక్తి యెసఁగెను నేత్రా
గ్యోత్తరుపైననొ పూవుల
చిత్తడి నిడ నిగుడుసురలశ్రేణి యనంగన్. 97

క. హేలావేది పతింవర,
పోలున్ ముత్తెములదామముల, [1]నుడులు బహు
స్త్రీలోలుఁడు నెల యనుమొఱ,
ఖీలోలతఁ ద న్భజింపఁ బేర్చె ననంగా. 98

తే. గీ. అధికతరతేజమున సభయందు మిగుల
భాతిఁ గల్పించువసుమతీపాలు రంత
విక్రమాదిత్యసన్నిధి వేగుజాము
దివ్వెరీతిగ నిల్చిరి తేజమేద 99

చ. కనకశలాకికాసుభగగాత్రి యనేకనృకాంతభాగ్యకాం
చనపరిశీలనేచ్ఛ సుమచాపుఁడు పట్టినశాణపట్టి యై
కనఁ బ్రదపఁ జూపునే ర్పెసఁగఁ గంధరఁ ద్రిప్పుఁ గొలందిలీల యొ
ప్పినమొగ; మిందు మిన్దిరుగువీటఁడి [2]దోషిని దూఱనో యనన్.

చ. సకలనృపప్రతారక[3]విసారపతాకునితర్జనంబుగా
నొకబొమ నెమ్మె కిమ్ము సగ మున్నమితంబును దాల్చి నాథుకు
త్తుక నిడఁ గై నిఁ దాల్చుసరిఁ దూఁగెడుసీర్ష్యను బోలెఁ బూను నా
న్యకమల మంగనామణి సహాశయవక్రవిలోకనంబుగన్. 101

1. నక్షత్రములు. 2. దోష = రాత్రి గలవాఁడు = దోషము గలవాఁడు అని శ్లేష. 3. మీనకేతనుఁడు (మన్మథుఁడు).

ఉ. కెంపులగోరలందుఁ దిలకింపఁగ నొఁ బ్రతిమాచ్ఛలంబునన్
సొంపుగ దిక్కు లయ్యువిదసోయగముల్ రహిఁ దాల్చినట్లుగన్;
దెంపున నాత్మదారవిరతిన్ భజియించుచు మారుఁ డైన నా
చంపకపుష్పగంధి వరునన్ గొలువంగఁ గ్రమించె నాఁ దగెన్. 102

క. నిగుడునిజాంగవిభాతిన్
నగలందలితాలను మలినం బొనరిఁచి దిం
బగతినయేన్ దవులనియటు
దెగడున్ సామాన్యవసుమతీపతివితతిన్. 103

క. చెలి, మూపున హారలతాం
చలస్థితచలద్విలోకనచ్ఛటఁ ద్రిజగ
ల్లలనలదర్ప మదల్చుచుఁ
బొలుపు మిగులుఁ గీర్తిచెక్కమును బూనె నన్. 104

క. తనబడిన వచ్చుత్రిజగ
న్మనముల దాక్షిణ్యయుక్తి మన్నింప నన్
మనసిజమత్తగజగతిన్
వనిత కొలఁది జాగు చేసి పదముల నిలుపున్. 105

క. ఘనసారపత్రవీటి
న్దనరి కదలువామకరమునన్ దగి గండో
జ్జనితపులకాంకురశ్రీ
వనిత గనుచుఁ గొద్ది నవ్వి వఱలును నానన్. 106

క. వెలఁది పదం బిడెఁ గుట్టిమ
ములపై సంక్రాంతరాగభూకాంతమనం
బులను వలెన్ బ్రమదముచే
నలనతఁ గనురాజహంసియానము మిగులన్. 107



క. సుమనశ్శిలీముఖాఽఢ్యము
సుమశరుభస్త్రి యనఁ బూనె సుందరి వేణిన్;
సుమనయిషుజ్యావలయో
పమితశ్రుతిచుంబినయనపత్రస్ఫురణన్. 108

తే. గీ. కళికఁ బోలుమదనకేతకశర మంతఁ
జలితచూర్ణాలకలతాఽఽళి స్పర్శ సేయుఁ;
దనదుకమబొమ యనువింటఁ దనరునుదుటఁ
జెలి పటీరంపులేఖను జేర్చి మించు. 109

గీ. క్షీరవారాంనిధానవీచీపరంప
రానుగత యగుపద్మాఽలయాంగన యన
సితదుకూలోత్తరీయంబు చెన్నుఁ గూర్చి
నప్పతింవర పొడసూపె నంత సభను. 110

చ. నలువ పసిండికొండ[1]కరణంబులఁ గైకొని విస్తృతప్రభా
విలసన మూన్చి చేసెనొకొ పీనపయోధర; నట్లు గానిచో
నిలిపినతోడనే పదము నిస్తులరంగతలంబునందుఁ బొం
దలవడఁ జేయు నెట్లు సభయంతయు లోభపరీత మౌనటుల్? 111

క. బాలారత్నం బిష
స్మీలితదృశ యై విలాసనీరజము దిశా
పాలుర హేతువున దిశా
శ్రీ లిడుదౌత్యంబు నవధరించునటుఁ గనెన్. 112

క. మిగులన్ లాగినధనువునఁ
దగుమరుచేఁ జేతమందుఁ దాడితుఁ డయి యా
ముగుద విలాసపతాకన్
దగఁ గని గుంతలుఁడు మదినిఁ దలపోసె నిటుల్. 113

1. ఇంద్రియములు.

క. ఘటయింప దెట్లు లోభము
[1]లటభారత్నం బమూల్యలావణ్యనము
త్కటు యెవ్వని ? కది నమ్మక,
త్రుటినేన్ గూర్కఁడు మరుందు రొదరుచుఁ [2]గాఁ పై. 114

క. ఇది యౌవన[3]జలనిధిసుధ,
యిది యంతఃకరణ[4]కార్మణేర్ధ[5]క్షోదం,
బిది హేలాతరుదోహద,
మిది యగు లావణ్యరత్నఘృణిపుంజంబుఁ. 115

తే. గీ. నిండునెలపొడుపున కిద్ది నిత్య[6]రాక
విభ్రమరసాఽశిపరిపాకపృథివి యిద్ది
మరుదొరతపస్య కౌ నిద్ది మహిత మైన
త్రిభువనైకసామ్రాజ్యసుస్థిరఫలంబు. 116

క. వనితాపయోధరేందిర
ఘనస్వనన్మనసిజాతగర్జాంచితదీ
పన వైదూర్యాంకురని
త్యనవోద్గమములకు దోహదం బై యొప్పెఁ. * 117

క. కాంతిదరిద్రతఁ గను [7]న
శ్కాంతుఁడు; [8]విరితావల కేమి తత్త్వము ? వాణీ
కాంతునియందపుసృష్టిని
గాంత హరించె నన నమ్మఁగాఁ దగు నెట్టుల్ ? 118

ఉ. సారె సఖీతతిఁ బలుకుచాడ్పునఁ జూ పెనయించు నావయిఁ
నారి; ప్రసన్నతఁ గనె ననంగుఁడు; మత్సరయే నిజంబు; క్రీ
డారభసంబునఁ వలెఁ దటాలునఁ [9]దాఁచె నిజాఽశ్; హారముఁ
దారుచు; దూర ముంచు; నృపుఁ దన్వి గనఁ మరుఁ దేమి సేయఁడుఁ.

1. సుందరి. 2. వహరాజవాను. 3. సముద్రము. 4. వశీకరణము.
5. చూర్ణము. 6. పూర్ణిమ. *వైదూర్యములు పుట్టుటకు మేఘగర్జనము
దోహదమగును అని ప్రసిద్ధి. 7. నక్షత్రేశుఁడు (చంద్రుఁడు). 8. వికచో
ల్పంములు. 9. తన్నెను.



ఉ. కుంతలనాథుఁ జూచి యలికుంతల కంతుశరాఽర్త యయ్యెఁ; న
శ్కాంతముఖేందుదర్శనము గాఁగ ఘనోల్లసితానురాగవా
ర్ధ్యంతరమగ్న లై యచట నారయ వచ్చినరాజు లెల్ల ర
త్యంతవిచిత్రతల్ గొలుపునట్టినడల్ గని రంద మేదఁగఁ. 120

తే. గీ. సకలభూపాలభూషణచయముకన్న
నుత్తమం బగుతనహార మున్నతమ్ము
గా నుర మొనర్చి దూరముగా వెలార్చె
నొక్కవిశ్వంభరాజాని యుత్సుకతను. 121

తే. గీ. కాయదీప్తితిరోహితకాంతి నున్న
కనకసూత్రం బవజ్ఞమైఁ గడగఁ దిగిచి
మౌక్తికవిభూషణం బిడె మహిపుఁ డొకరుఁ
డురమునఁ బతింవరఁ గాంచు నుత్సుకతయు. 122

తే. గీ. చెదరినట్టిచూడామణిసీమయందు
విభ్రమాంబుజ మొక్కపృథ్వీవరుండు
నిలుపుతలఁ పూన నౌదల నిలిపికొనియెఁ
బౌరనారీమణుల్ దన్ను బరిహసింప. 123

తే. గీ. మంచసీమ సగర్వుఁ డై మహిపుఁ డొక్కఁ
డగ్రపాదంబు సారించి యనవరతము
హ్రస్వనిస్త్రింశపుత్రికాశ్రమముఁ జూప
హస్తయుగ్మముఁ గడు నుంయాడఁ జేసె. 124

తే. గీ. చెమట వొడమక యున్న నంగమునఁ గప్పు
రముదుమారము గలయించి, శ్రవణయుగ్మ
మందుఁ గలకుండలముల నమందగతిని
వితగఁ బరివర్తన మొనర్చె క్షితిపుఁ డొకఁడు. 125

తే. గీ. వీటికాపేటికావాహుఁ డిట్టుఁ గొట్టెఁ
గ్వణితకంకణయుతనిజకరముచేతఁ;
దమ్మలపుటాకుపై గోళ్ళఁ దగ లిఖించె
మారవంచితుఁ డగుమహీదారుఁ డొకఁడు. 126

తే. గీ. గోష్ఠిమిషమునఁ దనవాక్పటిష్ఠరీతి
నిట్టు లట్టులు వల్కుచు నితరవిభుఁడు
వీటిపేటికనుండి యర్పించె నచటఁ
గలపరుపురుజనములకుఁ గప్పురంబు. 127

తే. గీ. వస్త్రమును జొన్ని వసుమతీవరుఁ డొకండు
కనకపీఠంబు నెత్తుగాఁ దనరఁ జేసి
నూత్నతారుణ్యమును దెల్పుయత్నమున న
జాత[1]కూర్చముఖంముచే సాగె వితగ. 128

తే. గీ. పృథ్వీవరుఁ డొక్కరుఁడు వీటిపేటి మోయు
వానివీఁపునఁ దనదేహ మానిచియు ను
దంచితభ్రూలతాపతాకాఽననంబుఁ
గనఁగఁ జేసెఁ దనంత నకారణముగ. 129

తే. గీ. ఆవలించుట నున్నతహస్తయుగ్మ
ఘట్టితాంగుళులన్ జిటుకలు ఘటించి
గద్దెపైఁ బడి దుర్వారకామభూత
మోహితుం డయ్యె నితరభూభుజుఁ డొకండు. 130

తే. గీ. కంఠమందలిపంచమకాకలి దగఁ
బొల్పుస్మితమును గనఁ జేసి భూపుఁ డొకఁడు;
గొన్నిపలుకులు గూరిచికొంచు నొకఁడు
గడఁక గాథాకవిత్వసంగ్రథనఁ జూపె. 131

1. మీనము.



క. వైతాళికాఽవళిగీ
తాఽతతతుములంబు నాఁపి యారాజతనూ
జాతకుఁ గలగళ చారిక
చాతురిఁ గ్రమముగను రాజచక్రముఁ దెలిపెన్. 132

చ. అర దెగువైరిమూర్ధతతి నాహత మై తనకత్తి మొక్కపోన్
గిరిశభుజాంగదాహిఫణకీర్ణమణీకషణంబుఁ గోరె; నీ
శ్వరుగిరి వామపాణి నెగఁ బట్టి, హిమాగముఁ బెల్లగింప ను
ద్ధురరణఃండ్వదభ్రభుజదోహలుఁ డై కుడికేలు దారిచెన్. 133

తే. గీ. తన[1]శిలీముఖపంక్తికి దశముఖముఖ
జలజములను భోగాఽస్పదములను జేసి
నట్టిశ్రీరామునన్వయమందుఁ బుట్టె
వెలఁది! నృపుఁ; డీతఁ డగుత కన్విందు నీకు. 134

క. కేకారవముఖరితనర
యూకాననసీమ వీని నొంది తిరుగుచున్
సాకేతపురిని నొనరుపు
మా! శ్లాఘ్యవిలాసజాలకాఽళీసేవన్. 135

క. నీచోపకృతిగ సుదతికి
నాచారికహితము వ్యర్థ మయ్యెన్; బ్రేమల్
క్వాచిత్కంబుగఁ దోఁచున్
బ్రాచీనభవాఽత్తకర్మపరిపాకమునన్. 136

క. మధులక్ష్మి మావి మెలఁగెడు
మధుపసతికిఁ గొండగోఁగుమాడ్కిఁ బెఱదొరన్
మధురాఽలాపకుఁ జూపుచు
మధుమధురకలోక్తిఁ జేటి మన్ననఁ దెలిపెన్. 137

1. బాణములు-తుమ్మెదలు.

క. ఈవిక్రకలాంధనుగుణ
రావం బాహవములన్ బఱఁగి సుషిరములన్
వావిరిఁ దచ్ఛౌండీర్యక
థావళిఁ బాతాళజనుల కపుడే తెలుపన్. 138

చ. కదనకబంధనర్తయిత గర్వితభూపతిసేవితుండు చే
దిరాజ యితండు చూడు సుదతీ! మరుపెక్కొము నీదుచూడ్కి యం
చుదితరతిన్ వచింపఁ జరి యుగ్మలి వాల్పుక కన్ను వానిపై
వదనమునుండి తమ్ములము వైచి దిగన్ నిరసించె న్యక్కృతిన్.

ఉ. భీతకురంగనేత్రఁ బరపృథ్వివరేణ్యునిసమ్ముఖంబుగాఁ
జాతురి మీఱఁగా నుడివెఁ జారిక దారిచి; కాన్యకుబ్జభూ
నేత యితండు దిగ్జయఘనీకృతభూమిరజంబులన్ సరి
న్నేతృచయంబులన్ స్థలగతిన్ బొనరించు నకుబ్జకీర్తి యై. 140

క. అని చారిక పలుక నతా
నన యై స్తనపీఠి దృష్టి నాటుచు నయ్యం
గన దెల్పె స్థూలభావము
జనవరునవయవములందు సవ్యంగ్యముగాన్. 141

క. కలనూపురగతి లోభ
స్ఖలితధరావరమరాళచక్ర యగుచు ముం
గలఁ గొలఁదిగ జనువెలఁదికి
నెలన వ్వెలయంగ దూతి యి ట్లని నుడివెన్. 142

క. వాఁడిమిఁ గ్రోధమునన్ వడిఁ
గాఁడినయెవ్వానిముల్కి గడిఁదిగ శంకల్
మూఁడుమృడుం దక్కటిమెయి
గూఁడు వెలిగ లాగె శబరకుహనాకృతిమైన్. 143



చ. శంక యొకింత లే కెవఁడు శంకరమల్లరణంబునన్ నిరా
తంకము లైనస్వేదజలధారల నిల్వఁగఁ జేయ నాకురం
గాంకవతంసుకక్షమునయందలిబాణిద లాగె; వాఁడె కీ
శాంకుఁడు; వీఁడు తత్కులజుఁ డంగన! యేకభటుం డుదగ్రుఁడున్.

క. కుతుకమునఁ గనుమ వీనిన్
సుతనువ! తేజస్వి యితఁడు సొం పగుచర్మ
ణ్వతితటమునఁ గలవిపిన
క్షితులన్ రమియింపఁ గోర్కి చిత్తమునఁ దగన్. 145

క. తలపైఁ బాదము నిడ నా
వలనుగ మున్ జనెదుక్రమము వాటిలఁ బరభూ
వలయతిలకుఁ గూఱిచి కో
మలికన్ జారిక వచించె మంజులఫణితిన్. 146

క. హాళిన్ [1]గపిశీర్షకశృం
గాళి కలిసి దివికి రథ్య యగుఁ; గాకున్నన్
గేహగృహప్రాంగణము ను
రాలయ మెటు లగును జూడ నచటిజనులకున్. 147

క. అదియే 'కాళింజర'ధర,
ముదితశ్రీనీలగళసమున్నతలీలా
సదనము; తన్నేత యితఁడు
ముదిత! వశీకృతనృపుండు; పూన్పు కనుగొనన్. 148

క. [2]ముత్తెమున దారమట్టులఁ
జిత్తభవావిద్ధచిత్తసీమ మహీశుం
డత్తమి బిత్తరికిన్ జరి,
హత్తినకుతుకమునఁ దెలిపె నవనిపు నితరున్. 149

1. కోటకొమ్మ. 2. రంధ్రముచేయఁబడని ముత్యమని తాత్పర్యము.

ఉ. సంగరనిస్పృహ[1]ప్రతిరసావరవాసములన్ బరాక్రమో
త్తుంగభుజుండు గాంచు నిజతూర్ణవిలాసచపేటభిన్నమా
తంగనివాసముల్ [2]హరివిధంబున; గోపగిరిప్రభుండు వీఁ
డంగన! యీతఁ డీపుడమి స్వచ్ఛయశస్వియు నేకశూరుఁడున్.

చ. మగువ! త్వదీయదృక్కుముదమాల స్వయంవరపుష్పదామమున్
దగులుచుదూత గాత మని తన్వికిఁ జారిక వల్కె వేర్కతం
బగుపడ కున్కి వీడఁ, దనయందెల్లమోఁత ఘటించిదూతె, వే
లగుధరజేంద్రుఁగూర్చి యసమాస్త్రశరంబులు తన్ను గోరఁగన్.

క. పుష్పాఽశుగవశరాడ్వా
స్తోష్పతులం దెవరినడుమ సుందరి సనెనో
పుష్పస్రగ్జమున వలె
బాష్పములన్ వారికనులు ప్రమదమునఁ దగెన్. 152

చ. ఘోరి రిపురాడ్వధూసితకపోలతలాలకవల్లరీతతిన్
బరపి నశైవలాశ్రువులభంగిఁ గుభృత్కటకోత్కరంబునన్
నెరపి ప్రతాపవహ్నిఁ దను నిల్చినశత్రుగృహాంగణంబులం
దిరవు గనన్ దృణంబులు, రహించు నపూర్వసమిద్ధతేజుఁ డై. 153

క. మాలవపతి యితఁ; డితనికిఁ
బ్రోలగు 'ధార' యిడు ముదముఁ బొలఁతి! విలాసాఽ
వాల యగునీకుఁ; గంతుఁడు
గ్రాలున్ మంత్రి యయి నీదుకడ వీనియెడన్. 154

క. ముక్కుకొన కణఁచుచూడ్కిన
యక్కన్నె నృపాలుఁ దెగడె నని కనినటు ముం
జక్కికిఁ గొలఁదిగఁ జని స్మృతి
నెక్కొన [3]నగుముగుదకుఁ జరి నేర్పునఁ బలికెన్. 155

2. శత్రురాజులు. 2. సింహము. 3. నవ్వునట్టి.



చ. తురగఖురక్షతిన్ క్షితికిఁ దూఁగుతనుత్వముచేత విన్నయ
ట్లురగలతాంగు లెవ్వనియమానయశంబు ఫణీంద్రుగానమం
దిరములఁ బాడుచుంద్రు; భుజనిర్జితరాజ్ఞికరుండు వీఁడె గూ
ర్జరుఁడు; స్మరాస్త్రముల్ గురియుచక్షువుఁ గూర్పుమ! చాన! వీనిపై.

క. లీలానాళీకము మధు
పాఽళిపయిన్ విసరి బాల యతనిన్ దెగడెన్,
బాలకు ముందుగ, గర్వముఁ
దాలిచి కొంత సని చరియుఁ దాఁ బలికె నిటుల్. 157

క. మిగులన్ బొడు గగునొడలున
జిగిగందపుఁబూఁతఁ జెందుసితరుచి నితఁ డో
మగువ! పయోఽబ్ధిగమందర
నగమునిగన్ [1]వార్చుపాండ్యనాథుఁడు; కనుమా! 158

క. వీనిచెలిమి నీ కూన్పెన
యేనిన్ మారుఁడు పటీరవృక్షవిలాసో
ద్యానమునన్ జందనపవ
మానవితానంబు నిన్ను మరగి భజించున్. 159

క. అన విని గుణభాజనుఁ డై
నను భాగ్యవిహీనుపట్టునన్ సిరివలె నా
ననము మఱల్పఁగఁ జెలికిన్
దనముడికారంబు దోఁపఁ దాఁ జరి పలికెన్. 160

చ. మురువున వార్ధి మున్గి దరిపొంత వనిన్ జరియించుదిక్కరుల్
కరిణులఁ గూడుటన్ భవముఁ గాంచెనొ నాఁ దగుదంతు లేధరా
వరుజయయాత్రలందు మదవారిఝురీయుతి నెల్లదిక్తటాం
తరములఁ దిర్గు దిగ్గజవితానదిదృక్షవలెన్ బ్రసక్తిమై. 161

1. ఆచమనము చేయు.

క. తనరత్నావళి నర్థులఁ
దనియింపన్ జూచునెవనిఁ దగ దనినటులన్
దన[1]మదజలగజడిండిమ
మున రత్నాకరము మంద్రపుశ్రుతిఁ గొలుపున్. 162

చ. తనపృతనల్ దనర్చెడునితాంతభరంబునఁ గ్రుంగుధాత్రిఁ బూ
ర్వనియతి నిల్ప నేపృథివిపాలుఁడు యామ్యదిశాఽర్ణవోచ్ఛల
ద్ఘనతరవీచికాతతికి [2]దామెనగాఁ గదియించె నైజగో
త్రనిభతనూల్లసత్తటగతద్విరదేంద్రఘటాచ్ఛలంబునన్. 163

తే. గీ. తమపదంబులు ద్రొక్కఁ దుత్తుమురు లైన
ముత్తెములపొడి నర్ణవాంబువులతోడఁ
ద్రాఁగి వమియించె నాఁగ నుద్ధతపృషత్క
దంబరంబున నెవనిగజంబు లొప్పు. 164

క. పూరితదిక్తటకరిణీ
వారముపై యువతు లెవనివాకిటఁ బో, నా
శారమణపురగవాక్షము
లారున్ జోత్స్నాసితంబు లై పగలైనన్. 165

క. చోళుఁ డితఁడు నినుచున్ ది
క్పాళి యశఃపుంజకలితపాళిన్ శుభశం
ఖాఽళినివలె విజయోత్సవ
వేళావైభవముభాతి బిసరుహవదనా! 166

క. తరుణీ! విలాసవిద్యా
ధరరాజమరాళ మితనిఁ దాల్పుము భుజపం
జరమున విమానజాల
స్ఫురణ; దృగుత్సవము 'కాంచి'పురి నీ కూర్చున్. 167

1. మదించినసీటియేనుఁగులు. 2. పొదవైనలావుత్రాడు.



ఆ. వె. అనిన నతనిఁ గడచె నన్యత్ర పూన్కిని;
నిలిచెఁ గుంతలునకు నెలఁత యెదుట;
గొప్పవేలచేతఁ ద్రిప్పఁ గన్నను నది
వదలు నెటులఁ దనదుప్రాక్పథంబు. 168

తే. గీ. కాంతయత్యంతదీర్ఘదృగంతములను
గృష్యమాణుఁడు గాఁ గుంతలేశుఁ డంత
నచట [1]నిర్వాపితాశు లై రన్యు లెల్ల
మలినులటు దీపవర్తిధూమములచేత. 169

సీ. నృపుఁ డొక్కరుఁడు నేను బ్రియజాని నీచాన
యెడఁ బరాఙ్ముఖుఁడ నం చెచ్చరించె;
విభుఁ డొక్కరుఁడు వేడ్క విటపార్థివులఁ జూడ
నరుగుదెంచితి నిట కని వచించెఁ;
బృథ్వీపుఁ డొక్కండు వృథ న న్నిటకుఁ దెచ్చె
వంచించి తని మంత్రివరుని దూఱె;
నితరనృపాఽస్యంబు లెనసె నతిన్ వజ్ర
హతము లైనట్టుల హరువు దొఱఁగి;

తే. గీ. సర్వసర్వంసహాకాంతచక్రమందు
లోలలోచనదృష్టి చాళుక్యసింహ
పీఠమండను వెదకి సంప్రీతిఁ గాంచ
నంబువులఁ బాలు గొను రాజహంసివోలె. 170

క. మఱిఁ జారిక చెలికిన్ దన
నెఱపలుజిగివెల్లి, నితరనృపతులదృష్టిన్
నెఱసినచెలియకళంకము
నఱిముఱి క్షాళిత మొనర్ప ననఁ బలికె నిటుల్. 171

1. 'అర్పఁబడినఆశలు-అర్పఁబడినయగ్ని' అని శ్లేష-ఆశ అనగా అగ్నియని కూడ నర్థముగలదు.

క. కమలవదన ! నీచూడికి
కమనీయార్థము గ్రహింపఁగా నెఱుఁగు; సమ
స్తమహీపుల నాచుగ విడి
భ్రమరివలెం దగిరె నితనివక్త్రాబ్జమునన్. 172

క. అనితరసామాన్యం బీ
ఘనరూ పెందేని ముందుఁ గాంచితె ? చెలి ! శ్రీ
కిని వాణికి నెల వగునీ
జనపతిసౌభాగ్యగుణముఁ జాలను బొగడన్. 173

చ. సతము మదేభసంగతి దిశాగజపాళి నవజ్ఞఁ జూచునీ
చతురజిగీషసప్తులు దిశాతతి నిచ్చలుఁ ద్రిమ్మరున్ ద్రుటిన్;
క్షితి యొకచోనె వ్రేఁ గగుడు శేషశిరస్థలి నిల్వఁ బో వనా
నితఁడు సమస్తదిక్కుల స్వకీయచమూగజరాజిఁ బంచెడున్. 174

క. ఉరగపధృతమహీఫలక
స్థిరతకునై కాఁడఁ బడినధృఢకీలపరం
పర యన విజయస్తంభో
త్కర మెల్లెడ నీనృపుండు గాడె ననఁ దగెన్. 175

క. ప్రోతనృపశిఖారత్న
వ్రాతోభయపార్శ్వధరణిపాలకృపాణం
బాత్పటి నిలుచున్ బ్రమో దయి
యాతతశేషారిగళఖరాస్థివిదళనన్. 176

క. విజయోత్సవంబువాకిట
సుజవమునన్ జోళపతియు సోముఁడు రాఁగన్,
భుజయుగమున నీభూభుజుఁ
డజయుం డిర్వురను వెడల నడఁచెఁ గడిమిమైన్. 177



తే. గీ. అబ్బురపుటీవి నొప్పునీయవనివరుని
యెదుటఁ బరమాణుసమమ్ము లౌ త్రిదివతరువు
లెటుల సదృశంబు లగును నీపృథివివరున
కతులలోకత్రయీగౌరవాస్పదునకు. 178

క. ముంజుండే పోలనిచో
గుంజంతయునేని; భోజు[1]కొఱ యెంత ? కవీ
ద్రంజను నొందుకవులపద
కంజములకుఁ బాదదాసిగా సిరి నిలుచున్. 179

క. ఈసాహసాంకుమది నవి
లాసభ్రూభాగయుగ్మలాస్యములు వధూ
టీసస్మితాస్యములు విడి
భాసించును వేఱుచోట్ల భయరహితముగన్. 180

క. ఇతని గళంబున నిల్పుమ !
యతివ ! భుజాబంధదూత యౌమాల; రతీ
పతియిడుములు ఫలమొందుతఁ
జతురాస్యన కగుతఁ గీర్తి సమయోగమునన్. 181

క. హ్రీనిరసన చరిపల్కుల
నైనటు నెపమునన యంత నబలామణి మో
దానన్ సంవరణస్రజ
మానృపవరవిక్రమాంకునఱుతన్ గూర్చెన్. 182

క. మదషట్పదకృతఝాంకృతి
మదవతి పతియఱుత నిడినమాల రహించెన్
మదరాట్సౌభాగ్యజయా
స్పదలీలాడిండిమంబుఁ జఱచె ననంగన్. 183

1. ప్రయోజనము.

క. భుజలేఖాద్వయి కుసుమ
వ్రజమున సౌభాగ్య మొందె; రాజుగళమునం
దు జిగి రహించినను వా
రిజాక్షినిఁ గవుంగిలింప నృపతి త్వరపడెన్. 184

చ. అలరుతఁ బుష్పకేతనుశరాసవిశిష్టకళారహస్య: మ
న్నలువయు యుక్తకార్యఘటనావిధికై పొగ డొందుఁ గాత మం
చల పురయౌవతంబు ముద మందుచుఁ బల్కెను వారిఁ గాంచి; యీ
యిల సమవస్తుయోగమున నేరికిఁ బ్రీతి జనింప కుండెడిన్? 185

చ. మృదులమృదంగనిస్వనసమేతవివాహసమర్హ మండపం
బుదితవిపాండుకీర్తియుతుఁ డుగ్మలితోడుత నెక్క, రాగసం
పద లల సంక్రమించునరపాలురయెల్లరలక్ష్మిచేవలెన్
గదిసె నుదారకాంతి నధికంబుగఁ గుంతలసోముఁ డయ్యెడన్ 186

క. వరసాహసలాంఛననృప
కరపీడనకౌతుకంబు కడఁ జన నకలో
ర్వీవరమణుల వీడెఁ గీర్తియుఁ
గరముఁ గృతార్థ యగునృపునికన్యకలోలెన్. 187

తే. గీ. దెసలకొనల వెలింగెడిదీపకాంతి
శాంతి నందఁగ సుభగతాక్షయముచేత,
నృపులు నలు వంది రపుడు తదీయధూమ
ధూసరితదేహు లై కాంతిఁ బాసె ననఁగ. 188

తే. గీ. సిగ్గువడి రాజు లెంతటిచేటు కైన
సాహసించిరి; కాని శ్రీసాహసాంకు
తీక్ష్ణకంకపత్రమ్ములతీవ్రదీప్తి
వారి కెట్టులు సహ్య మౌఁ బ్రధనభూమి? 189



ఉ. భూపతిసంఘమెల్ల నృపపుత్రిక నందమి డెందమందు సం
తాపము నొంది మోముజిగి దప్పఁ దొలంగెను గోర్కె లూడఁగా;
భూపతి యొప్పె నూత్నవధువున్ గడుమోదముతోడఁ గూడి ల
క్ష్మీపతి దైత్యులన్ గెలిచి శ్రీసతిఁ గూడి రమించునట్లుగా. 190

తే. గీ. సవతియువిదలకెల్ల దుస్సహము గాఁగఁ
దనదుసుగుణగణంబునఁ దరుణి వరుస
నధిపుమానససామ్రాజ్య మధివసించి
స్వవశమున నేలె నతనిఁ బంచశరునాన. 191

ఉ. కుంతలనాథుడెందమునఁ గోమలివక్త్రశశాంకబింబ మ
త్యంతముదంబునన్ జొరఁగ నంత సపత్నిముఖాంబుజంబు లం
తంతఁ దొలంగి యీవలకు నై నిలిచెన్, మనమందు నిల్వఁ దా
మెంతయు సంకుచింతు మని యెక్కుడుభీతి వహించెనో యనన్.

క. వివిధోపచారచణుఁ డగు
నృపవరునియెడ విడిచెఁ బడఁతి నిజనూత్నోఢా
ప్రవణత; నవోఢ చిరముగ
స్వవరుదరిఁ గనుట యతనియసామర్థ్య మగున్. 193

వసంతము

శా. మారాస్త్రాధికృతుండు, [1]పైకగళసంపద్దాత, చంద్రాంశువి
స్ఫారశ్వేతగుణాఢ్యవహుండును, రసక్ష్మాపాలసామ్రాజ్యవి
స్తారామాత్యుఁడు, వృక్షచిత్రకరుఁ, డుద్యన్మానవృక్షచ్ఛిదో
దారానేకప మంతఁ జైత్రుఁ డిడె నూత్నప్రీతి భూభర్తకున్. 194

క. స్మరరాజు జగము గెలువఁగ
సరదారుఁగఁ జేసె నవ్వసంతుని; నతఁడున్
గరువలి నెగసినసంపెఁగ
ల రహించె సువర్ణవృష్టులం ద్యాగివలెన్. 195

1. కోకిలలసమూహము.

క. ప్రసవవిసర కేసరముల
దెసలెల్లన్ స్వర్ణకాంతి దీపింపఁ బసిం
డి[1]నవరణల్ గలనతుల క
భిసార [2]మహామందుఁగూడ వేడుకఁ గూర్చెన్. 196

క. బురదసరిచిక్కనిమధువు
వలదన్ బాదంబు సిక్కువడ షట్పది దా
వెర వెఱుఁగక పిలిచెన్ మధు
కరమున్ నిరతంపుదుఃఖకలితరవములన్. 197

తే. గీ. తేనె నిండినపూవును దేఁటి యొకటి
యాసచే రంధ్రమున్ మూసి యచట నిలువ
నన్యమధుపంబు లానెఁ దదన్య[3]సరణి;
నార్జనము సేయువారి కియ్యదియె [4]సరణి. 198

ఆ. వే. చందనాచలంబు చందనతరుసంగి
భుజగగరళతాపమును వహించి
నటు దరీముఖముల నతిశయనిశ్వాస
పవనముల యథేచ్ఛఁ బఱఁగఁ జేసె. 199

సీ. విరహిజనులు భూమివివరంబునన్ వసి
యింపఁగఁ గోరుదు రెల్లవేళ;
మత్తపికీపంచమస్వరపీడితుల్
బాధిర్యయోగంబు [5]వలతు రెప్పు;
డాక్రందములఁ గోకిలాఽరావముల్ వెంచు
మతిలోప మక్కట మధుఁడు గూర్చు;
మరు[6]పరాస్త్రము లోర్చుమహితుఁ డామనిఁ బిక
పంచమనాదాస్త్రవశత నొగులు;

1. నగలు. 2. పగలు. 3. మార్గము. 4. విధము. 5. కోరుదురు.
6. ఇతరాఽయుధములు.



తే. గీ. నంత రాజేంద్రుఁ డామనియందముఁ గని
తనదుశ్రమమెల్ల సఫలతఁ గనె నటంచుఁ
దలఁచి యంగనపాణిపద్మంబుఁ గొనుచు
జిత్ర మైనట్టియుద్యానసీమఁ జేరె. 200

క. కుంతలపతి యుద్యానం
బెంతయు సంతసము మీఱ నీక్షించి తమిన్
గాంతామణితోఁ బల్కెను
గంతుధనుర్జ్యారవామకారిరవమునన్. 201

తే. గీ ఇంతి! నీకనువిందు వసంతుఁ డూన్చు
మరుఁడు రతిజన్మభూమి, యామనిసుశోభఁ
ద్వత్తనూలక్ష్మి నత్యంతదర్ప మడరి
చీరికిం గొనఁడుగద! కించిత్తుగూడ. 202

తే. గీ. [1]చిత్రసేన నామని సమీక్షింపఁ గోరి
యువిద! మదనరా జధిష్ఠించునుపవనంబు
త్వద్విలాసావలోకనధన్య మగుత;
వనముచే నీవు నీచేత వనము మెఱయు. 203

మ. కో. [2]కామవిభ్రమరాట్పురీ! సముఖంబునన్ నిను జూచి [3]వే
యామధుం దల స్వాగతిన్ మధుపామృతాఽరవ సంతతిన్
బ్రేమ మీఱఁగఁ బూర్వభాషణవిశ్రుతిం బచరించెడిన్;
గామినీ! కయిసేయుమా! సుమకమ్రశోభవనస్థలిన్. 204

పృథ్వీ. లతాలలన లిచ్ఛమై లలితలాస్యముల్ సేయఁగా
సుతన్వి! కర మర్థి నీ విటకుఁ జూడ నేతేరఁగాఁ
బతత్కుసుమజాలసంపదల వన్యరంగస్థలిన్
సతోషకుసుమాంజలుల్ సలుపుచాయ చూపట్టెడిన్. 205

1. విచిత్ర మైనసేన గలది. 2. మన్మథరాజధాని. 3. వేగముగా.

క. నీకాలిదెబ్బఁ గాదె ! య
శోకము ధన్య మయి తరుల శోభిలు; నవలా
లే[1]కృతుల దాసులుగ మదిఁ
గైకొని క్రీడింత్రు వారిఁ గను మరుఁ డెలమిన్. 206

క. ఈవకుళవృక్ష మెంతయు
సేవన్ గలిగించు నాకు వృక్షాళి; వసం
తావసరంబున నైనను
బూ విరియఁగఁ గోరు నీదుపుక్కిటినీటన్. 207

క. ఒక్కెడ శివుకోపముచే
నక్కంతుఁడు దగ్ధుఁ డైన నంత వసంతుం
డొక్కుమ్మడి నీవలెనే
లెక్కకు మిక్కిలిగ మరుల లీల సృజించున్. 208

ఉ. నీతనువల్లిపుష్పములనిండువిలాసమునన్ మరుండు నో
కాతరనేత్రి ! లాగఁ బడఁగాఁ దనదృష్టి భ్రమించి యామనిన్
నూతనశస్త్రసంపద లనూనముగా వికసింప, వానిఁ దాఁ
బ్రీతిఁ బ్రయోగమున్ సలుప వేడుక గల్గియు నెక్కడండుగా. 209

తే. గీ. చైత్రుఁ డర్పించు[2]గుణమున మైత్రిఁ గాంచి
మానవంతులమానంబు మాన్పఁ గలుగు
ప్రసవమందును మరునిచాపంబునందుఁ
జేరుచుండు [3]శిలీముఖశ్రేణి గడఁక. 210

క. చెలి ! పుంస్కోకిలములు నీ
కిల ఛాత్రములటు వసంతఋతుకలితము నీ
విలసద్గానకలాకౌ
శలమున్ బంచమరుతిన్ బ్రసారము సేయున్. 211

1. ధన్యులన్. 2. ఇది అల్లెత్రాటికిఁగూడ శ్లేష. 3. తుమ్మెదలు-బాణములు.



క. మధురమకును నీకును నా
[1]మధుపగుణుం డగును దుల్యమాన్యుఁడు; కానీ,
మధురమయెదుట ననంగుని
బుధవినుత ! యొనర్తు వీవు పూర్ణాంగునిఁగా. 212

దోలాకేళి

శా. అంతన్ గుంతలచక్రవర్తి సరసాత్యంతప్రియవ్యాహృతిన్
గాంతాశ్రోత్రవిభూషణంబు పునరుక్తం బౌనటుల్ సేసి తా
సంతోషంబున దోలికావిహరణాఽసక్తుండు కాంతామణిన్
జెంతన్ లోలవిలాసదోలిపయిఁ జేర్చెన్ శ్రాంతి శాంతింపఁగా. 213

క. దోలాలోలాలక, [2]ము
ల్లీలాభ్రూవల్లి, భ్రాంతదృక్కంజము న
బ్బాలావక్త్రము శరటం
కాళిఁ [3]దొలఁచి తేనిహృది ననంగుఁడు నిలిపెన్. 214

క. పంచమరుతగీతంబు స
మంచితభ్రూవల్లిదృష్టి, యందెలర్వవముల్,
మించునృపాంగనయాత్రయి
పంచశరున కయ్యె శస్త్రపంక్తి త్రిజగతిన్. 215

ఆ. వె. వెలఁదిపిఱుఁదుబ్రేఁగుపేర్మి నుయ్యేల సాగి
తారతరముగా రుతంబు సలుప
జ్యానినాద మెఱుఁగ నట్టిపంచశరుండు
కుంతలక్షితీశు వంతపఱచె. 216

ఆ. వె. ప్రియవిలాసదోలఁ [4]బృథ్వీభుజంగుండు
తోడుతోడ నూఁచఁ దొడరు చుండ
సకలవనితలందు సౌభాగ్య[5]గుణకోటి
చెందె భంగ మంతఁ జిత్రముగను. 217

1. మన్మథుఁడు. 2. మోదవిలాసము. 3. తొలఁగించి. 4. ఇది రాజు బిరుదనామము. 5. గుణము-త్రాడు.

క. ఆలోలాక్షీదోలాఽ
లోలాఽనవమార్గసఖ్యలోలుపభూమీ
పాలవిలోచనములకుఁ
గ్రాలె గతాఽగతము లంత [1]గవ్యూతిగతిన్. 218

## పుష్పాపచయము

తే. గీ. అంత నుయ్యేల దిగి ప్రియునంకమందు
క్షణము విశ్రాంతిఁ గొని శ్రాంతి శాంతి నందఁ
జైత్రశోభాఽహృతాఽత్మ యై సారసాక్షి
కదలెఁ బుష్పాపచయకాంక్ష క్రందుకొనఁగ. 219

క. కుంతలపతిబొమ్మసైగల
నంతఃపురకాంతలెల్ల రతిముదమున [2]వ
ల్ల్యంతావచితికి నడచిరి;
కాంతుప్రసాదంబు సీమ కౌతకమునకున్. 220

క. లెక్కకు మీఱువిరులఁ దగి
యక్కంతున కితఁ డొసంగు నైదె శరము లం
చిక్కృపణత్వ మెఱఁగి యన
నక్కాంతలు గొనిరి మధునియఖిలస్వంబున్. 221

చ. అల తలఁ గల్గుపూల్ గొన నృపాంగన యెక్కఁగఁ దుంటివ్రేఁగునన్
బొలియుదు నన్నభీతి ననఁ బో కదలెన్ వకుళంబు; [3]పమ్మి వం
చులతయుఁ బుప్పొడిన్ గలికిచూడ్కుల నింపఁగ [4]సందు నంది వే
ర్కలికి కవుంగిలించె నృపుఁ; గల్గనె భంగము భాగ్య మబ్బుచోన్.

క. కుసుమములు గోయునాకరా
జసతి నశోకంబు కిసలశయమునఁ గొట్టెన్;
గుసుమాఽయుధుఁ డది ద్రెంపఁగ
నసివల్లిన్ లాగె ననఁగ నళితతి రేఁగెన్. 223

1. రెండుకోసులు. 2. పుష్పాపచయము. 3. విజృంభించి. 4. అవకాశము.



ఆ. వె. దయితుఁ డొక్కదయితఁ దరువు నెక్కింపఁగఁ
గటిభరంబునన్ బ్రగల్భ గాక
బోదెనుండి వృక్షమూలము విపరీత
భంగిఁ జేరె భిన్నపదయుగమున. 224

క. అక్కాంతలుకాంతలు చె
ట్లెక్కి [1]విధూననము సేయ వృక్షములు దగెన్
బిక్కటిలు [2]తుంట్లవ్రేఁగున
స్రుక్కుదు మని లఘుతకొఱకు సుమముల విడె నన్. 225

ఆ. వె. విరులను గొని జెలులు పృథివీతలముఁ జేరఁ
గేరిధరణిజాతజాలమెల్ల
బరువుచేత భంగపడ లే దనెడుగర్వ
మునను బోలె శీర్షములు నిగిడఁచె. 226

ఆ. వె. చెలులచెమటఁ, గుసుమములరజోభరమున
[3]నడుసు గల్గ నెల్లయెడల, మరుఁడు
గాంచె వాన మపుడు కఠినోన్నతము లైన
మదవతీజనకుచమండలముల. 227

సీ. వ్రతతీపరిచ్యుతవల్ల్యంతరజములఁ
జెలులనాభులు నిండి స్థలులు గాఁగ
మానినీమధ్యముల్ మరునిలీలాగతి
ప్రాంగణతాభంగి పరిఢవిల్లె;
నారామ లారామసారవత్కుసుమముల్
తీసికొనన్ బ్రవర్తిల్లు చుండ
మధుజీవషట్పదమానినీవ్యూహముల్
కోలాహలముఁ జాలఁ గొలుపు చుండె;

1. కంపనము. 2. పిఱుఁదులు. 3. బురద.

తే. గీ. అంతనొకకామిని సపత్నియక్షియుగళి
నినిచి పుప్పొడి నాటలనెపముచేతఁ
దాఁ బ్రియునిచుంబనంబుపాత్రత్వ మందె;
సతులవైదగ్ధ్యరీతి కసాధ్య మున్నె! 228

క. మానిని నృపసతి యొక్కతె
సూనోచ్చయవాంఛ విడిచి చూచుచు నుండె౯
నానానారీభుజమూ
లానూననఖక్షతాళి నాసక్తిమెయి౯. 229

క. తరుశాఖ వంచి నృపుఁ డొక
తరుణి నచటఁ జేర్చినంతఁ దత్కటిసీమా
భరమున నాశాఖ యచటి
పెఱయువిదలయెదలనరిగ భిన్నం బయ్యె౯. 230

తే. గీ. నృపుఁ డొకసతికి నవతంస మిడఁగ నామె
తృణమునకునేన్ గొనదు పరస్త్రీల నెవరిఁ;
బతిప్రసాదంబు సతులసౌభాగ్యమదము
నవతరిలఁ జేయుమదిరాసహస్రముగద! 231

క. కుసుమపరాగం బెల్లెడఁ
బ్రసరించి సమస్తనేత్రబంధముఁ గొలుప౯
గుసుమశరుఁడు చెలులతనుల
నసమామోఘాస్త్రుఁ డయ్యె నాశ్చర్యముగ౯. 232

క. [1]ఈరముననుండి కపి యొక
నారిచెఱంగుఁ గ్రుధ నీడ్చిన౯ ధూర్తమైఁ
బారి యది నాథుకౌఁగిటఁ
జేరె౯ బెఱచెలులు గిన్కఁ జెందర దాన౯. 233

1. పొదరిల్లు.



మ. కటిభారాధికగౌరవంబున లత౯ గామార్త భంజించి
విటుపైఁ బడ్డ సహింప కన్యవనితల్ పెన్బాధల౯ జెంది; రం
తట వేఱొక్కతెకొప్పునందు ధరణీనాథుండు సంపెంగల౯
దిట మౌప్రేమ నలంకరింప నితరల్ నెక్కొల్పి రాత్మ౯ రుష౯.

మ. సుమరేణూత్కర[1]వర్ణికాఽఽళి నృపుమించుంబోండ్లు బాహావరా
క్రమరంగంబున నర్తకీత్వమున కక్కాముండు గైసేసిన
ట్లమర౯ గల్గిరి; సూనబాణములఁ బుష్పాఽఽసారముల్ గూర్చెఁ గౌ
సుమబాణుం డన నొప్పి రెంతయు సుమస్తోమాధికాలంకృతి౯.

క. భూరమణునాంద్రవెన్నడి
వే రొద లిడు చేగు చొప్పె భృంగపటలి శృం
గారిణులగురుఁడు మరుసుమ
వార మపహరింపదొనఁగు వ్రాక్రుచ్చె నన౯. 236

క. సుమరజములఁ గలియుచు స్వే
దము జాల్గొనుచెలులపసిఁడితళుక్కులతనువుల్
సుమశరునూష్మమున౯ గొం
చెముగ ద్రవీభూతము లగుచెలువునఁ బొలిచె౯. 237

చ. ఇటు నటు వ్రాలుతేఁటి నొకయింతి కరాబ్జమున౯ విదుర్చ చం
తటఁ బొగడె౯ శిశుత్వమునఁ దా నల నేర్చినకందుకక్రమం;
బటులనె క్షిప్తమై యది ముఖాబ్జమునుండి కరంబు, మోముపై
నటుపయిఁ ద్రోయఁ జేరె; నల స్వార్థపరుల్ త్రప నెందుఁ గాంతురే!

తే. గీ. ఆయరాళనయనలు రాయంచగముల
నాదములఁ బిల్వఁ బడి రన న్గౌతుకమున
నీడ్వఁ బడి రన నలసట నెడపఁ జనిరి
కేళిసరసీతటము జలకేళి సలుప. 239

1. రంగులు.

క. స్తననిర్మిత మగుభారము
నను నాఁగిలితివేని నడుమునన్ గలచులకం
దన మెటు దెలియవో నాఁ గా
మినీపదము లందెలరొద మేదిని కనియెన్. 240

క. వెలఁదు లురోజాత్యున్నతి
నిలఁ గన కుండిన, మరాళబృందము పున్నెం
బులకలిమి నందెలరుతిన్
[1]వెలుఁ దెలిసి చెలులపాదవిన్యాసములన్. 241

క. వనమున రవితాపముచేఁ
గనలునతీపదములన్ జఘనతలములు వీ
జనమును మొద లిడె స్వీయవ
సనాంచలములన్ శ్రమంబు జార్చుటకో నాన్. 242

శా. బాలాలోలవతంసపల్లవము లుద్భాసించె గండస్థలీ
వ్యాలోలద్వ్యజనానుకారు లయి స్వేదాంభస్స్రుతిన్ మాన్చుచున్;
బాలిండ్లన్ వదనాబ్జసంగతము లై వర్తిల్లి నీహారముల్
బోలన్ జాలెదునూర్పులన్ శ్రమజలంబుల్ వాపు నా నొప్పెడున్.

క. అక్కాంతలుకాంతలనడఁ
[2]దెక్కలిఁ గొని యంచపిండు దివ మెగసెను బెం
పెక్కనభయముననో యన
నక్కమలజువాహనంపునంచలఁ గదియన్. 244

జ ల క్రీ డ

క. వరసారసనయనలతోఁ
గరేణుకాసహితమత్తకరటివడువునన్
నరపతి హేలాంచితపద
చరుఁ డయి సరసిజవతంససరసిన్ జొచ్చెన్. 245

1. వెరలు. 2. దొంగతనము.



క. తరుణీముఖరుచితస్కర
సరోజసౌహృదఫలంబుఁ జవిఁ గొనెఁ గొలఁకుల్
ధరణీపతితరుణులు త
త్సరఉత్పలనేత్రములను సరవిన్ బెళుకన్. 246

తే. గీ. రాజతరుణులబింబోష్ఠరాగకలన
[1]నుత్పలంబులు రక్తపద్మోత్కర మనఁ,
గాటుకన్ బద్మములు నల్లకల్వ లనఁగ
దగి విపర్యయ మిటు లొప్పెఁ దమ్మికొలని. 247

క. హేలా[2]ప్రవిదారణమున
బాలాజన మంబుజముల భంజించెను; బ
ద్మాలయ మున్నె భూమీ
పాలున్ జేర మిరవుఁ గాంచెఁ బ్రజ్ఞావతి యై. 248

చ. సరసి పురంధ్రిపాదముల క్షాళన సేసి తరంగపాణులన్
గరము సముచ్ఛలజ్జలకణంబుల మ్రొక్కుఁ దదంఘ్రివారి నా
వలి; జితాంబుజాతపదపల్లవ[3]నైజరుచిన్ బరీక్ష నా
[4]నెరపఁ దదీయపాదముల నిండినలత్తుక నూడ్చె వీచులన్. 249

మ. అళిసంరబ్ధనృపాంగనామణులపాదాలక్తకం బూడె న
జ్జలజావాసముఁ జేరుమున్నె శ్రమసంజాతాంబులన్; దోడుతోన్
మలఁచెన్ గొంతలమేనికుంకుమములన్ గాసార మబ్జప్రభల్
దొలఁగం జేయుతుషారశైలమున నొందున్ జన్మ మం చీర్ష్య నాన్.

తే. గీ. ఇట్లు నీరాడురాజపూర్ణేందుముఖుల
లోన నొక్కతె కాల్ జారి లోన మునుఁగ
నతఁడు సంభ్రమమున లాగె; నంత నవతు
లాసుదతిఁ గాంచినంతట నీసుఁ గనిరి. 251

1. నల్లకలుము. 2. యుద్ధము. 3. స్వాభావికము. 4. వెలవేర్పుటకు.

ఉ. ఆయువతీజనాననము లబ్జరమన్ గొని యబ్జరస్యతన్
దీయఁగఁ బాంథకోటివలెఁ దేజముఁ బుప్పొడిఁ దప్పి భృంగముల్
పాయక చేరె; భాసితనృపాలసతీసముఖాన భృంగపా
నీయగృహాయితాబ్జముల నీరజలక్ష్మి [1]ప్రపేశ యై తగున్. 252

క. ఉపలఘునము లక్కాంతల
విపులనితంబంబు లటఁ బ్రవేశింపఁ గొలం
కు పొలిచె నుత్తుంగతరం
గపటలి త్రుచిరసమునఁ గడు హెచ్చె ననన్. 253

తే. గీ. అచటఁ [2]జాళుక్యవిద్యాధరాబ్జముఖుల
వదనచంద్రపరంపరల్ వఱలు చుంట
వనజములు ముకుళించు నన్భయమున నన
నళులు సొరవు వికసితాబ్జములనునేని. 254

క. నృపతిసతీనైసర్గిక
వపుశ్ఛవిఁ దిరస్కృత యయి పద్మాలయ శ్వా
సపవనమున నసఁ గమలము
లపరాగము రేఁగె నట విలాసము గాఁగన్. 255

క. జితకుంభికుంభతరుణీ
తతకుచయుగమున నృపుండు దాఁ గరయంత్రో
దితజలధారన్ రువ్వఁగ
నతనువిముక్తాతినిశిత [3]మలుఁ గన నొప్పెన్. 256

క. పురమిదొర విడుచుధారలు
మెద వంచినపతఁతిచెవిని మించు[4]రవమొనన్
వడిఁ దాఁక, నీరు తుము రై
యడరెన్ ముత్తెము లనంగ నచ్చటనె కనన్. 257

1. ప్రపా + ఈశ = చలివెందల యధికారిణి. 2. ఇదియారాజు బిరుదనామము.
3. బాణము. 4. వజ్రము.



తే. గీ. రాజకరయంత్రజలధార రాజవదన
కుచకలశపీఠిఁ బొర్లాడికొనుచుఁ బఱఁగె;
నంతఁ బ్రతివల్లభలయుల్లమందుఁ గోప
వల్లరులఁ బల్లవము లుల్లసిల్లె వింత, 258

ఆ. వె. ఇట్లు లుత్సవముల నీసుఁ దనుభవించి
విడిచె సలిలకేళి వెగటుఁ గాంచి;
జగతిఁ [1]గెలన మెటు విసర్గరమ్యం బైన
నగునుగాదెఁ! విరస మతిగ నలుప. 259

తే. గీ. కాటుకలు లేక నల్లనికన్ను లమరి
కుంకుమన్ బూయక పసిండికొమరు మిగిలి,
యలరు స్నానావసానమునందు రాజ
మానవతుల కకృత్రిమమండనంబు. 260

చ. స్తనముల లిప్త మైనహరిచందన మక్కలనెల్లఁ బాఱఁ, గా
మినులవియోగ మొంది యన మేనఁ ధరించెను దెల్పు నొప్పుఁ; బ
ద్మనయన లంతఁ బట్టములు మార్చ, నగల్ ధరియింప, వమ్మ గా
దని మది నెంచి కార్ముక మనంగుఁడు క్రమ్మఱ లాగె రాజుపై.

మ. వెలసెన్ గొంతలకుంతలవ్రతతు లబ్బిందుప్రసూనంబు లై
పొలిచెన్ మజ్జనశీతలస్తనతటుల్ పుష్పాస్త్రుధారాగృహం
బులు నై; యైన నృపప్రియాజన[2]సహోద్భూతాంగసౌందర్య[3]సం
కలనాఖండనమండనక్షతిఁ దనుల్ గాంచెన్ విచిత్రద్యుతిన్. 262

కవిరాజవిరాజితము

ఖరకలిదానవవీరహరా! పరికల్పితలోకశుభా! యభవా!
గిరిబిలవాస! విచిత్రతనూ! పరికీర్తకభక్తగుణవ్రజయా!
కరి-రిపునూనుకృతావన! సర్వజగత్పరిపాలన! సర్వమయా!
హరి-నరకేసరిరూప! జగన్నివహప్రభవాఖిలరక్షలయా! 263

1. కార్యముఁ ఇది కన్నడపదము తెలుఁగులోవాడఁ బడి యున్నది, 2. సహజ.
3. పొందుట.

ఇది శ్రీత్రిభువనమల్లదేవవిద్యాపతి-కాశ్మీరక
భట్టబిల్హణ మహాకవివిరచితవిక్రమాంకదేవచరిత
మహాకావ్యంబునకు శ్రీవేంకటేశ్వర
శ్రీనరసింహదేవపాదపద్మాఽరాధన
సమాసాదితకవితావైశారద్య
'ఆంధ్రబిల్హణ' బిరుదాంచిత
లక్ష్మణ-విశ్వనాథ
కవిసోదరాంధ్రీకృత
మహాప్రబంధంబునందుఁ
జతుర్థాఽశ్వాసము
సమాప్తము

---

# విక్రమాంకదేవ చరితము

## పంచమాశ్వాసము

క. శ్రీరమణ! వేంకటేశా!
వీరనృసింహేశ! వేదవేద్య! సురేశా!
సూరిస్తుతపదపద్మా!
భూరిగుణా! దేవదేవ! బుధజనవంద్యా! 1

### సాయంకాలము

ఆ. వె. క్రుంకు దైన [1]మిగులుకుంకుమారుణకాంతిఁ
దనరున్నృవరుసతులఁ దాఁకుట ననఁ
బాటలత్వ మంతఁ బైకొనఁ గాంచిన
రశ్మిపటలి దివసరాజు గ్రాంచె. 2

తే. గీ. కంజినీపరిచితము లోకంటకముల
చేతనుంబోలె మిత్రుండు శీర్ణపాదుఁ
డగుచు సాగరతలమున కరుగుట కయి
పశ్చిమక్ష్మాధరస్కంధభాగ మెక్కె. 3

తే. గీ. స్నిగ్ధ మంబరతలమునాశ్లేష మంది
యపరజలధి మునుఁగురవియంశుచయము
పొట్టు దుల్చిన[2]చిఱుసెనగపొడినిఁ బోలి
పాటలం బయి యపుడు గన్పట్టనయ్యె. 4

---

1. అతిశయించు. 2. మసూరధాన్యము — ఉత్తరభారతదేశములో తఱచు వాడబడు ఎఱ్ఱ కందిధాన్యము.

క. [1]సన్నరుచి రవి సరిత్పతిఁ
గ్రన్ననఁ బడె రత్నకాంతిఁ బ్రార్థింప ననా;
నున్నతపదపతితులకు స
మున్నతసత్వంబు సున్న యురుమహిములకేన్. 5

ఉ. చంచుపుటీగృహీతబిససంతతిఁ గోరు వియోగభీతి బం
ధించను గోకిఁ గంఠము గదించెదుత్రాడుగఁ జేయఁ; బెక్కు గ్రం
దించుఁ; ద్యజించుఁ జంచుగతనీరజకాండముఁ; బెన్ లుఠించుఁ; గా
వించదు కోక మేమి? చెలి వీడువిషాఽహతి త న్గలంచఁగన్. 6

క. ఉన్నత[2]కుజాగ్రముల, ఘూ
ర్ణన్నికరశిరంబులను, [3]నివేశశిఖల, వి
చ్ఛిన్న మయి వర్గకాలవి
ధి న్నశినప్రియునికాంతి తెరలెఁ బలుగతిన్. 7

క; దీనన [4]సప్తినిఁ గనె దివి
జేశుఁడు; తన కిచ్చు నెప్పుడే ననునాసన్
బూనుగతి వార్ధిఁ జొచ్చె ది
నేశుఁడు [5]వీతులను మార్చునిచ్చమెయి ననన్. 8

క. చరమదిగంగనమో మం
బరమణి ఘనరాగ మడరఁ బరిచుంబింపన్
సరసిజిని యేమిసేయును
వరాకి; తనతమ్మికన్ను వడి ముకుళించెన్. 9

క. వారువముల [6]కుప్పరమున
వారనివేగమున దూఁకులదలిక నడఁచన్
[7]వారుణి నానంగ నన రవి
వారుణిజన్మమున నొప్పువారిధిఁ జేరెన్. 10

1. నశించిన. 2. వృక్షములు. 3. గృహములు. 4. అశ్వము. 5. అశ్వములు. 6. ఆకాశము. 7. మద్యము.



క. బింబారుణ[1]మిత్రప్రతి
బింబం బంబునిధిఁ జెంది [2]ద్విరసనవరశ
య్యం బవళించిన [3]తపనీ
యాంబరుకౌస్తుభవిలాస మంది యెసంగెన్. 11

తే. గీ. వారివారణసాధ్వసకారణమున
వార్ధిఁ జొర కుండున ప్తిదృక్పథము మఱుఁగు
పఱపనో నాఁగ [4]నాళీకబంధుఁ డపుడ
వడి జగద్వ్యాపినిజధామపటము లాగె. 12

తే. గీ. త్రిభువనాంగణదీప మద్దినకరుండు
పవనమునఁ బోలె బ్రహ్మచేఁ బ్రశమ మొందఁ
బ్రబలముగఁ బర్వు[5]ధూమ్యాపరంపర యన
నీలతిమిర[6]వితానంబు నిక్కె జగతి. 13

క. రతనాలవరుస బింబ
ప్రతిబింబిత దీపశంకఁ బడసె ననఁగ ఖ
చ్యుతుఁ డై [7]పతంగుఁ డంతన్
ద్రుతగతిఁ దాఁ దైలపాత్రతుల్యాబ్ధిఁ బడెన్. 14

క. ఇనవాహన[8]రింఖాక్షత
వననిధితీరగతశుక్తిభవమౌక్తికరీ
తిని వలె గగనము తారల
[9]కనకనలన్ దిలకితంబుగా దం బారెన్. 15

## అంధకారము

తే. గీ. పద్మవివరకుటీరకబంధభీతి
విద్రుతమధువ్రతాసితవిస్తృతాంధ
తమసరాశి నిరోధించె నమరమార్గ
మందు దృష్టిప్రసరణ మనంకుశముగ. 16

1. సూర్యుఁడు. 2. సర్పము. 3. విష్ణువు. 4. సూర్యుఁడు. 5. పొగల గుంపు. 6. మేలుకట్టు. 7. సూర్యుఁడు. 8. గిట్టలు. 9. ప్రకాశము.

క. నీలమణీకీలితగాఁ
గాలాంజనపుంజభిన్నగా నెల్లెడలన్.
[1]కీలాలరాశిఘనక
ల్లోలప్లావితగ నిరుల లోకరమ దగెన్. 17

క. అలకనటాచ్ఛలరీతిని
[2]నలికములను విప్రకీర్ణ మయి [3]లటభలకుం
తలబంధవిభవమునఁ దమ
మలరెన్ దశముగను బింద మై యంతంతన్. 18

చ. సకలపిధానశక్తి గలసంతమసంబు కనుల్ ముడించి త
త్ప్రకటపటుత్వభంగమును స్పర్శ[4]హృషీక మొనర్చె; హావడిన్
బ్రకటన సేయుతత్తిమిరవారము లెవ్వనిచూడ్కి నొంపఁ బో
వకట! ప్రియాభిసారవివశాంగభవార్తలదృష్టి తప్పఁగన్. 19

క. దుమ్ములతల్పమ్ముల సుర
తమ్ములతవు లందుతన్వితతికి సకలలో
కమ్ముకను లాఁపుతిమిరచ
య మ్మెం దెం దెనయఁ బోదు యవనికలవిధిన్. 20

క. చరమగిరిచటియ నటికెడు
సురపడి రవిరుచులు చిద్రుప లొందినయటు లై
పఱఁగెను దీవ్యద్దీపక
కిరణములు తమిస్రదంతికిన్ [5]సృణిసరణిన్. 21

## అభిసారికలు

క. తరుణులు గనిరి నిరంకుశ
సరణిఁ గ్రమాభిసరణముల స్వప్రియులను పూ
త్కారణముల దివ్వె లార్చుచు
[6]సరణిన్; స్మరుచాపలంబు జయముఁ గనెడిన్! 22

1. జలరాశి (సముద్రము), 2. నొసట. 3. సర్వాంగసుందరు లగుస్త్రీలు.
4. ఇంద్రియము. 5. అంకుశము. 6. మార్గము.



క. ఖరసహిత యగుచు రజనిగ
శరీర మనువుపఱచి యొకచాన జనులక
న్నొఱఁగించి సంచరించెను;
స్మరుఁ డెవ్వని నేమి సేయ సాగింపఁ డిలన్. 23

తే. గీ. తనస్థలంబున సఖిని నెక్కానఁగఁ జేసి
కరమునన్ దివ్వె ధరియించి కాంతురతి[1]ని
కాంతముగ జేరె నొక్కనిశాకరాస్య;
యలరువిల్తునియుపదేశ మద్భుతంబు. 24

గీ. పాకపాండుర [2]శరకాండభాసుర మగు
వదనము వహించి పల్కెఁ బూర్వకకుబబల,
యాత్మగర్భంబునందుఁ బెంపారు చున్న
రోహిణీకాంతుపరిణామరూఢి నపుడు. 25

## వెన్నెల

క. సురపతిగేహచకోరీ
పరిపీతత్యక్త మైనపటుకేతకపు
ష్పరజఃపాండురచంద్రిక
తిరిగె నపుడు పూర్వశైలతీరాటవిలో. 26

ఉ. తూరుపుఁగొండకొమ్ముల విధుం డఱ దోఁపగఁ జారుచందనో
దారవిలేపనభ్రుకుటిఁ దాల్చినటుల్ తగెఁ బ్రాగ్దిశాఽస్య; మ
త్తూరుపుఁగొండనెత్తమునఁ దోఁచెను గెందిమిరంబులందుఁ గే
శీరతి ధాతుధూళిపరిలిప్తతనుం డన బాలచంద్రుఁడున్. 27

చ. రవి యరుణాంశుఁ డై చనఁ ద్వరన్ బిసినిన్ నెల మోసపుచ్చఁ ద
చ్ఛవి నవరించినట్టు లయి చాలఁడ మోన మొనర్ప దాని; స్వ
చ్ఛవిఁ దిమిరంబు భీత మయి సాంద్రధరాటవిఁ జొచ్చె; నంజన
చ్ఛవిమలినంబు లయ్యె మృగశాబదృశామనముల్ విచిత్ర మై. 28

1. గృహము. 2. తెల్లగడ్డి.

తే. గీ. అనమపర్వతకుంజభూప్రాంతములను
గుమిగఁ గూడినధ్వాంతచక్రముఁ గ్రమించి
పూర్ణచంద్రమయూఖముల్ పొలుపు మీఱె
దుర్గశేషము రచియింపఁ దొడఁగె ననఁగ. 29

తే. గీ. అసితతాళఫలశ్రేణికాఽన్విత మగు
పూర్వపర్వతవనభూమి పొలుపుఁ గాంచె
నిమ్నతిమిరశిరఃక్రమాన్విత యగుచుఁ
గుముదినీబాంధవకరోపగూఢ యట్లు. 30

చ. పగ లుపవాసముల్ సలిపి పారణకుఁ బెద లైనచంద్రికా
ఖగవధువుల్ నిగుడ్చుదృగఖర్వరుచాఽఽవళిచేతఁ బోలె నా
ప్పగ నరుణంబు లౌకుముదమోదకురుక్పటలంబు లుర్విపై
జిగిఁ గనె రత్నకంబళముచేఁ బరితఃపరివిస్తృతం బటుల్. 31

తే. గీ. మానినీబాష్పనిర్భరాంబకకదంబ
కముల క్షాళితుఁ డైనటుల్ కమలవైరి
యుదయరాగం బశేషంబు వదలివైచి
తూర్పుచెలి తీర్చుతిలకబిందువుగ నిలిచె. 32

క. జగములకుఁ బ్రియముఁ గూర్చెదు
నిగనిగలన్ బ్రుబ్బు ననఁగ నీరజరిపుఁ డా
తొగమగువ మేలుకొలిపెన్
దగఁ దనపాదముల నర్మతత్పరుఁ డగుచున్. 33

తే. గీ. వెండియద్దంబునిద్దంబు వెలితి సేయఁ
జాలి [1]యచలాగ్రశృంగవిస్ఫార మైన
యంబురుహవైరిబింబమం దలరు[2]చిన్నె
యంబరప్రతిబింబవిడంబి యయ్యె. 34

1. పర్వతము. 2. చిహ్నము.



తే. గీ. స్ఫటికశైలవిటంకసంచయము కరఁగి
నిండుగాఁ బాఱుసెలయేటినిచయమునను
బోలె, శశిరుచిపూర్ణ యై భువనలక్ష్మి
మానినీమానపంకంబు మాన్పి వైచె. 35

తే. గీ. పిండదుగ్ధసమం బగువిధునిధామ
మమితముగ మాంసలత్వంబు నావహిలఁగ
నమృతదీధితి తన్మిశ్రజార్థ మప్పు
డబ్ధినీరు పైకిని లాగె ననఁగ నొప్పె. 36

తే. గీ. సకలదిక్తటపాటనశంకఁ గూరు
నిందుకిరణసుధాపూర మెనసె నపుడు
మంథభూధర[1]విశరారు మహితదేహ
కలితదుగ్ధపయోరాశి విలసనంబు. 37

క. కేకతరసనమము ప్రకృతి
శీతలమున్ భువనమెల్లఁ జెలగుహిమాంశు
[2]ద్యోతము వేనిమెయికి వి
ఖ్యాతపటీరంబు గాదు? కాంతి-గుణములన్. 38

క. ఎండేఁ జల్లుఁడు [3]ఘటికలఁ
జందనసితచంద్రికారసభరం బనుచున్
[4]గ్రమ్మంది సఖీపదములనై
నం దయితలు లేనిస్త్రీజనంబు వచించెన్. 39

క. తనమాన మడఁచి వడి మా
నిని యొక్కతె వెడలి ప్రియునినెలవునకై మున్
జనుదెంచుగాలిగూడను
దనలాఘవమునకు నడ్డదలగాఁ దలఁచెన్. 40

1. శిథిలమైన. 2. ప్రకాశము. 3, చిన్నకుండలు. 4. సోలి-

## మధుపానగోష్ఠి

క. ఈరీతి స్మరాఽప్తుం డగు
¹తారాపరివృఢుఁడు జరఠతను మించ నలం
కారంబులు దాల్చినతన
నారులఁ బానమున కూర్చె నరవరుఁ డెలమిన్. 41

తే. గీ. కుసుమశరునద్భుతాఽశుగఖురళి యగుచు
విభ్రమద్వీపబంధనపృథివి యగుచుఁ
గుంతలనృకాంతశుద్ధాంతకోమలీద్ధ
పానకేళిరభస మప్డు పరిఢవిల్లె. 42

వ. అంత నయ్యాసవపానోత్సవం బాలవాలవలయవిలసితసరసరాగల
తాఽనుకరణసువర్ణభాజనరమణీయారుణమధుధారాశ్రేణియు, శ్రేణీ
భూతక్షితిపతినితంబినీపరిచుంబనకేళీరభసత్రాసకంపాయమానమణిచష
కనివిష్టవిషమేషుప్రేరకసీధురసంబును, సీధురససౌహృదాఽవహ
విహాయోఽవలగ్నాఽశీగురుస్మరసంవననచూర్ణాయమానమానవనా
థైణీలోచనాతనుగళద్ఘనసారపరాగంబును, ఘనసారపరాగవిశదాఽ
సవపూరిత²పారీనివిష్టప్రతిబింబవిధాస్ఫటికోపలపిధానాయమానయా
మినీకమనకమనీయంబును, కమనీయాఽసవసువర్ణపాత్రోత్థధూప
ధూమాయితనవప్రసవసౌరభసమాయాతమధువ్రతపంక్తియుఁ, బంక్తీ
కృతప్రమదాపాటలాధరదళప్రణామానుసరణపాణితలఘటితఘటికాస
మ్మశాఽనీతమదిరంబును, మదిరాదృశాఽఽస్యప్రవేశసమయదశ
నాంశుసంగానంగకీర్తికందళదాసవపేశలంబును, పేశలతరపాటలా
ధరాప్రవాళకపోలతలస్థలదలిగుణమార్గణీకృతవిభ్రమప్రశస్తియు, విశ
న్మదనమదిరంబును, విశన్మదిరమదిరాఽక్షీవదనంబును, విశన్మదిరాక్షీ
వదనధరావరాంతరంగంబును, విశద్ధరావరాంతరంగరాగవారాశియు
నై విజృంభించుసమయంబున నంబుజారిం గూర్చి నారీజనంబు:- 43

1. చంద్రుఁడు. 2. గిన్నె.



ఉ. ప్రాలెదవేలరా! తుహినభానుఁడ! నామధుభాండమందు; భూ
పాలునిఁ గుంతలాన్వయదివాకరుఁ గానఁగ లేవొ; యీతఁ డు
ద్వేలపరాక్రముం డగుఁ; ద్వదీయకళత్రము రోహిణీసతిన్
ఫాలతలంబునం దలకపల్లవముల్ గన కుండఁ జేసెడున్. 44

క. కైరవిణిఁ గాను; నీవిటు
లోరీ! మధుపాత్రయెదుట నుండెద వేలా!
నీరమణికంటికాటుకఁ
గూరుకళంకంబు సిగ్గుఁ గొలుపదె! నీకున్. 45

క. మధుపాత్ర నున్ననిన్నున్
మధుయుతముగఁ గ్రోలి దాన మానవతీవే
వధుకారకుఁ గులకంటకు
వధియించెద నిపుడె పాంథబాధక! చంద్రా! 46

క. నామధుపాత్రముఁ దాఁకిన
బాములు రెం డలము నిన్ క్షపాకర! యీభూ
కాముకుఁడు సైఁపఁ డిటు; నటు
నీమీఁదన్ గినుక రోహిణియు నిగిడించున్. 47

ఉ. తానవ మూనె దీవు శశి! తంతునమంబుగ నిక్క మందఁగా
రానియెయారిఁ గోరి కనరా! పరమార్థము క్షారవారిధిన్
నీనభమందునుండి పడునిక్కపుహేతువు చాపలం బగున్
గాని మ లొండు గాదు ¹మహికాద్యుతి వై తగునీదుబాధకున్. 48

ఉ యౌవతలంపటుండవు చలాఽక్ష్ముఁడ వౌ దని ²దారతారకల్
నీ విటు పానపాత్రముల నిల్వ నినున్ విడ కుండుఁ జాయలన్;
నీ విను దూఁకి యామినుల ³నీరవరాఽశను జెందుటన్ దురా
శాఽఽవిలు నిన్నుఁ జేయుఁ గకుబంగన యందునిజంబు నెంచెదన్.

1. మంచు. 2. భార్య లైననక్షత్రములు. 3. వరుణునిదిక్కు.

క. నామనమునఁ గలనిర్మల
కాముకవరుఁ గలఁచె దేల! ఘనమన్మణిపా
రీమదిర వీధు మెఱుఁగవె
నీమేనన్ గలుగుకందు నీరజవైరీ! 50

క. అనిలమునఁ దరళభావం
బెనసియుఁ దీపములఁ బోలి యెగుడుదిగుడులన్
బొనరతు వెద్దియొ కనుకో
ర్కి నదియుఁ బ్రాపించువేళ గీల్కొనె నీకున్. 51

క. నిను బహువల్లభు నిచ్చలుఁ
గను వంచిత యై వరాకి క్షప; నిలుచు నభం
బున విప్పినతారల నీ
యనయచరిత మరయ నెల్లయందున నదిగో! 52

క. దృక్కోన భావం బరుణిమ
చెక్కుల విభ్రమముకతము చెన్నగుబొమమో
డ్పెక్కరణిన్ [1]వరలాలనఁ
దక్కుచెలులమాన మెచ్చఁ దనరె మదంబున్. 53

క. అతిశయలీలాఽర్ధనిమీ
లితనేత్రయుతాబలాఽఽవళీమంజులజ
ల్పితముల నీగతి విని భూ
పతి యెంతయు సమ్మదంబు వడసెన్ దనలో. 54

సురతము

ఆ. వె. పానకేళివిభవపరిపాటి నందించి
మత్తపక్ష్మలాక్షి మహిషిఁ 'జంద'
లాఽఽఖ్యదేవిఁ గాంచి యపుడు గుంతలనేత
తల్పగృహముఁ జేరెఁ దత్సతిఁ గొని. 55

1. ప్రియసాంత్వనము.



క. ఎది మదనున కాయువు నిదు;
నెది ఫల మిడఁ జేయు యౌవనేలాజము: నె
య్యది యగు రాగాబ్ధికి సుధ;
యది యదటన్ సలిపె భూతలాధిపుఁ డపుడున్. 56

క. ఇరువురిముఖవిభ్రమవి
స్ఫురణంబమితి నెఱుఁగఁ జనదువో! ప్రీతి సదృ
క్సరణిన్ బొడమెను వారికి
స్మర[1]శరవిష్టరతులాప్రమాణ మయినటుల్. 57

క. ఇతరేతరదృగ్లీలా
నితాంతకౌతుకరసాఽఽప్తి నిద్రాకుతుకాఽ
యతినైనన్ ద్రుటినేన్ ము
ద్రితలోచనపుటులు గారు వృద్ధిఁ గనురతిన్. 58

క. గురుతర మై [2]చిత్రలలిత
వరనిధి యై పఱఁగుకేళివసతిఁ బ్రణయమున్
సరి యగుటలు తెలియ నన్నన్
మరుఁ డిదె మానంబు వారిమనముల సారెన్. 59

వైతాళికులు

మ. సరసం బై కడుభిన్న మై తనరుషడ్జధ్వానగంభీరవా
క్పరిపుష్టాద్భుతభంగి యై యమృతసంభావ్యంబు నై మించు వా
క్సరణిం గూరిచి యంతఁ గల్య మగుడున్ గల్యాణగానంబులన్
సురతాగారముచేరువన్ సలిపి రస్తోకంబుగా [3]మాగధుల్. 60

ఉ. రాతిరి దీతె దేవ! నిదురన్ విడు; మంబరభూరుహంబునన్
శీతరుచిన్ గనం బడియెఁ బెం పటి రిక్కలపూలప్రోపు ల
చ్చాతశరాఽప్తమిత్రుఁ డగుసోముఁడు పంచషమాత్రలంతలోఁ
బాతముఁ గాంచు నయ్యపరవారిధిసైకతరాజహంస మై. 61

1. ధనుస్సు. 2. అద్భుతవిలాసము. 3. వైతాళికస్త్రీలు.

మ. లలితం బయ్యె విలాసకీరరుతి లీలాభిన్నషడ్జాఽయతిన్
గళితం బయ్యెను దంతపుంబరణిఁ బోల్ కంజారియందుండి వె
న్నెల దేవీ ! మిహిరుండు దూర్పుదెసకున్ దీర్పున్ విభూషాస్థితిన్,
జలజాతచ్ఛదవిభ్రమాంచలలసచ్చక్షుర్ద్వయిన్ విప్పుమా ! 62

మ. లలనామీనలలామ లేఖలిఖనాలబ్ధానువాల్లభ్యముల్
జలజాతాంబకలంఘితజ్వలనవిస్ఫారాస్త్రమార్గాఽయతిన్
వెలయం గల్గినదీపకాంకురము లెంతేఁ గాంతిహీనంబు లై
తెలవారెన్ దుముగ్రమ్ము[1]షణ్ముఖహయస్త్రీమాళికన్ బోల్ ధవిన్. 63

శా. ఎవ్వాఁ డంగజరాజపాంథవనితాబృందారిసేనాఽగ్రగుం
డెవ్వాఁ డెల్లెడఁ జిమ్ము వెల్గు భువనాహీనాఽర్తిశాంత్యర్థ మై
య[2]వ్వార్తాతనపత్నుఁ [3]డుజ్జ్వలరసప్రాలంబకుం డొందెడున్
మవ్వం బేదఁగఁ బృష్ఠరేణుసితకూష్మాండప్రకారాఽకృతిన్. 64

తే. గీ. ఖండుఁ డయి యెన్నియేన్ రే లెవండు దాల్చు
నంగజపరశుసదృశకృశాంగభంగి
యామినీభామముఖపటీరాంకబిందు
[4]వింక నిందుఁడు కనువిందు గ్రుంకు చుండె. 65

మ. కల[5]నానన్ బరివారవారిజదృశాకాండంబు హెచ్చింప మి
క్కిలిగా వంచినమోములన్ దగుకురంగీలోచనల్ ఖండితల్
కలఁతన్ గాంచిరి నున్ననౌతొడవులన్ ఖండించుటన్ జంత మై
తుల లేనట్టికపోలపాళిఁ గడు దృక్తోయంబు తూర్ణంబుగన్. 66

ఉ. మారుఁడు రాగికంఠముల మర్మభిదాపరిపాటిఁ గూర్పు లీ
లారసదర్పపాశపటలంబులు, మానగజాంకుశంబులున్,
సారసనాళతంతుసదృశంబులు నంబుజవైరిపాదముల్
ధారుణినాథ ! కోకసురతంబుల సాక్షులుగాఁ జెలంగెడున్. 67

1. కోడిపెట్ట. 2. చంద్రుఁడు. 3. శృంగారరసంజీవనుఁడు. 4. ఇగురఁగా.
5. సిగ్గు.



తే. గీ. నిరుపమార్థంబు స్ఫురియించుఁ; జరణతోక్తి
పరిచయం బొందు సకవివాక్సరణినేని;
సుకవి ! సారస్వతపువేళ యొకఁ డగు నిది;
క్షణము కావ్యావహితచిత్తసరణిఁ గనుము ! 68

మ. పటుగండస్థలదానదుర్దినపయఃపంకంబులన్ సంపదల్
మటుమాయంబుగ ముస్గి ధాత్రీధవధామప్రాంగణక్షోణిఁ బి
మ్మటఁ గన్పట్టనియట్లఁ జేయఁ దగునీమాతంగముల్ శృంఖలా
రటనాంఘ్రిక్రమ మొప్పఁ బాంసుతతపర్యంకస్థలిన్ లేచెడున్. 69

మ. మరుతూపుంగమి సోఁకునాథులనతుల్ మాయింప రా కుండి, చం
దురువెల్గుల్ చెదరింప రాక బిరు సై తోరంబుగాఁ గుక్కుటో
త్కారతాలుస్థలసంకటప్లుతనినాదక్షుద్ధ మై వీడెఁ దా
మరసాఽస్యాఽవళిమానపుంముడులసంపర్కంబు భూమీశ్వరా !

ఉ. కైరవభైరవుండు ఖరకాండుఁడు ప్రాక్క్షితిభృద్విలాసవి
స్ఫారుఁడు మానిచెన్ దిమిరభారముఁ; గైరవబాంధవుండునున్
గూరినసాధ్వసంబునఁ జకోరిక లాని మిగుల్చుమంచునన్
గూరె నకాలమందున నకుంఠితతండులచూర్ణపాండుతన్. 71

మ. స్మరునానన్ నిలు చున్నవారలకు నుత్సాహంబుఁ గల్పించి దు
స్తరభీతిన్ సుదతీమనంబులను విస్తారించి లేఁబ్రాయపున్
నరులందున్ నడకల్ గనుంగొనఁగఁ గందర్పుండు గా వుంచె నాఁ
దిరిగెన్ సారసపౌరభగ్రహణవృత్తిన్ గల్యవాతూలముల్. 72

చ. ఇరుకడ లెక్క పాయుచరలేటివలెన్ వినువీధిఁ గ్రమ్మి చె
చ్చెరఁ దుహినాద్రిడాపరుపుసీమలఁ జందనపంకభంగి యై
పెరుగుచు నిప్డు గూర్కుఁ గను వెన్నెల [1]యాంధ్రులకండ్ల నిల్చుదే
వరకు జగత్త్రయీకమనవశ్యకరౌషధియోగచూర్ణ మై 73

1. ఆంధ్రస్త్రీలు.

తే. గీ. [1]ఖండితాగండములఁ దమకాంతి నుంచి
నట్లు దీపంబు పొందిమ మందికొనియె;
[2]విప్రలబ్ధాఙ్గనలన్ దేమ విడిచి [3]స్వకము,
దాఁచినట్టులఁ జంద్రకాంతంబు లెండె. 74

చ. [4]తెరలి [5]నిషాదిభీత మగుదేవవరేణ్యగజంబునుండియున్
బఱఁగియు గుంపుగా [6]నరుణబాధితవన్యగజాళి ద్యోస్థలిన్
[7]దరము రుతించు వన్య[8]హయదస్యువులన్ జన మానబాధలున్
దరణిహయాలు తూర్పుగిరిఁ దత్తఱపాటునఁ దూలి వీడెడున్. 75

చ. దరులగిరుల్ తమిస్రములఁ దారిచి మోస మొనర్చె నాన్ దివా
కరుపదముల్ శిరంబులను గైకొనె నంతట వాని కెట్టులో
శరణ మొసంగుహేతువున [9]సావి నవాంబుజబాంధవుండు ద
చ్ఛిరములనే కరంబులను జేర్చి చెలంగెడు భాఃప్రపూర్ణుఁడై. 76

చ. మరునికటారులైదును హిమద్యుతిశాణశితంబు లయ్యెఁ జె
చ్చెరఁ గడు మోదుఁ గాంచు వడిఁ జేర్చిన నేనయహీనలందు; నా
గరితలు నెత్తులం బొదువుకై రవపల్లవముల్ పదంగ ని
ల్తురు విధిగాఁ బ్రియాంఘ్రులకు లొంగి కవుంగిటఁ గోర్కి మీఱఁగన్.

చ. [10]నిరతి గతాగతంబులను నిచ్చలు భానుజగానకున్ గరున్
బఱఁగినసూరుతేరు విడువార్వము లన్ భ్రమఁ బాయఁ జేయునీ
తురగబలంబు మేల్కొనును దూఁగి రమాశుభదుంధుభిధ్వని
స్ఫురణముచేతఁ [11]గల్యపరిశోభిత[12]హేషితరీతి [13]మందురన్. 78

1. నాయకుఁడు రాత్రి వేఱొకస్త్రీకడ గడపి యాగుర్తులతో రాఁగాఁ జూచి కోపించునాయిక. 2. సంకేతస్థానమునఁ బ్రియునిఁ గనక మోసపోయి వ్యాకుల యగునాయిక. 3. తనది. 4. తొలఁగి. 5. మావటివాఁడు. 6. సూర్యసారథి. 7. కొంచెము. 8. మహిషము (అశ్వశత్రువు) 9. అని. 10. తత్పరత. 11. ప్రభాతము. 12. సకిలింపు. 13. అశ్వశాలి.



చ. అసురవినాశహేతు వగునన్వయమందు జనించుటన్ [1]బిస
ప్రసవభవుండు బంధ మగువాఁడు, పయోధికిఁ [2]దాపి-సూర్యజా
ప్రసవముచేత మామ యగువాఁడు, సమస్తజగద్విటంకదీ
పసముఁడు తత్క్షణప్రభవబాలదృగర్హత [3]హంసుఁ దొప్పెడున్. 79

తే. గీ. కినుకమెయి లేచి పోవ నుంకించి కదలి
ద్రాక్షస్ఫుట[4]త్రామచూతరుతంబు దోఁపఁ
దుమ్మమొర లగునెపములఁ ద్రుటి వచించి
మఱల వరకేళిశయ్యలఁ దొరఁగి రాండ్రు. 80

చ. గౌరీవల్లభఫాలదృగ్జ్వలనదగ్ధ[5]స్వాంతభూచందనో
దారస్ఫారరసావదాతరుచిమ[6]ర్ధారాగృహత్వాఽయతిన్
దీరం గల్గినచంద్రుఁ డస్తగిరి దీప్తిం బాయ [7]క్షౌద్రాన్విత
స్ఫారానూనపిశంగమాహిష[8]దధిచ్ఛత్రచ్ఛవిన్ గన్పడున్. 81

క. క్షితిపులు జవదాఁటనియా
నతిఁ దగి మరునాస శిరమునం దాల్చుమహీ
పతి మాగధీనుతిన్ విని
నతి[9]యుపధానంబు దనభుజంబుఁ దొలంచెన్. 82

## రాజు కల్యాణపుర ప్రవేశము

ఈ పద్యమునుండి 137 వ పద్యమువఱకు అచ్చతెలుఁగు.

క. పలుపగల నిమునమట్టుల
వలరాజున [10]కిందువేడ్కపనులఁ గడపి కుం
తలుఁ డల వేసవి గాఁ దన
పొలఁతుకతో నెలమిఁ దనదుప్రోలిన్ గడఁకన్. 83

క. దరియఁగ నయ్యేలిక ప్రో
ల్సొరఁ బడుటను వినినయపుడ చొప్పడె వేడ్కల్
తరతరమ పొదల నోమెడు
గరితలకున్ జిలుకరౌతు గఱపెడుచెయ్వుల్. 84

1. బ్రహ్మ. 2. తాపీ-యమునానదులు. 3. సూర్యుఁడు. 4. కోడి. 5. మన్మథుఁడు, 6. జలగృహము. 7. తేనె. 8. పెరుగుమీఁగడ. 9. తలగడ. 10. ఇంపు.

## పౌరస్త్రీల మన్మథచేష్టలు

వ. అంత నయ్యేలిక ప్రోలన్ మేలిరాదారిన్ దీరినపౌరుఁ జను చుండఁ బ్రోయాండ్రలో:—

దారిని జారినమగఱాలినుసువాలుకొన గ్రుచ్చికొనినడాకాలుఁ బై కెత్తి యయ్యేలికఁ గొలువ ననా నొంటికాల్తపము గోమునన్ బూనునొక చెలువయుఁ, జెలు వలరుచెవితొవదుమ్మునన్ గ్రమ్మునీరున నొక కన్నును జిఱునగవు దొలఁకాడుకడమదియుఁ గలిగి మెలి గొన్న తలంపుల వెలిఁ బెట్టుదిట్టతనంబున మరునాటకత్తియ నాఁ దగునొక కలికియుఁ, గలికితనంబునన్ గిటికీసందులలోనుండి తేనిఁ గని వలతేనికి గుఱి యగుచు వానికి విల్లునఁ గలవలంతితనంబు వెల్లడించు నొకప్రోడయుఁ, బ్రోడతనంబున నించువిల్కానిగుఱించి "మీాతేఁడు వాఁడిమగలన్ దలకట్టు, కట్టెదుటఁ గన్పట్టుఁ, బోటరి పైన దీటుఁ గొని మగంటిమి నిగిడింపుము, ముగుదలకు బెదరుఁ గూర్తు" వను పరుసంబులఁ గసరునొకజాణయు, జాణతనంబుతగవునకుఁ బిలువ మగువల కంపినకమ్మగాఁ జెవి వీడి నిట్టూర్పుగాడ్పునన్ దవ్వులన్ జనుకమ్మన్ గని యెమ్మెఁ జిమ్మునొకసింగారియు, సింగారించిన పెన్గొరునెక్కినయేకిమీానిఁ గని యతనికి సరిఁ బఱఁగునురవడి మత్తుఁ గనుమరుగొరు నెక్కినటులఁ దలంచు నొకమించుఁబోఁడియు, మించుఁబోఁడిమి గలిగి యొడ్యాణంబున రాణించు గుజ్జుగజ్జియల మ్రోఁగించియుఁ గ్రైతొడవుల మివుల నులివుఁ గొలిపియు తేనిఁ దన్నుం గానఁ జేసిన దై తననేరుపునకు గరువపడి మెడ నిగిడించు వేటొకయొయ్యారియు, నొయ్యారితనంబున రాకొమరు నరయు నురవడి వేడుకరాయంచలు వెనుఁ జన వడిన్ జనుచుఁ దగవు కా దనుబెదరున వలె తేనిఁ గని తనయంచనడ వీడునొకయింతియు, నింతింతియ కానిసోయగంపుఁదరఁగల మిగులఁ దొలఁకాడుచు



హొయలు వెలయించుతనకనుబొమతీవియఁ దవులుకొని నిలుచువల పులతేనిఁ గ్రేగంటిచదరంబున నాడించునొకమిటారియు, మఱియును:-

సీ. [1]కుంకుముకెంజాయఁ గొనరుమైపసఁ దగి
యెమ్మెమైఁ గ్రైదీవ నెత్తె నొకతె,
తన్ను బాటింపనిమన్ననిఁ గని వడి
రహి మీఱఁ దనమెడ వ్రాల్చెనొకతె,
మొలపైన డాకేలు పూనిచి తనవంగు
కేలుడాలున నిల్చి వ్రాలె నొకతె,
యెలుపుతాసోరణం బెనసి నిద్దపునెల
వెలుఁగువెల్లనిమెయి నిలిచె నొకతె,

తే. గీ. వలవఱద మున్గి కేల్గూఁత వలచినటుల;
విల్లు గొన నెదఁ గలమరున్ వేఁడినటులఁ;
దివిరి దొర నొంప మరునివిల్ దీర్చినటులఁ;
జాలవలెఁ దాను మరునగ్గి వ్రేలినటుల. 86

చ. తనిసినటుల్ తలంచికొనుఁ ద న్నొకయన్నులమిన్న, తేనిగొ
ద్గునఁ గలవల్పచేఁ బొలుచుక్రొవ్వలితెమ్మెరఁ జెమ్మటల్ సనన్;
ననవిలుకానివిం దయిననాతికి మో మయి తేఁడు పల్కుచోఁ
గినుక నొకర్తు త్రిప్పు నఱ్రేఁగనుచూడ్కి బిరాన నోర్వమిన్. 87

ఉ. సామినిఁ జేర్చుమేలునకుఁ జాన యొకర్తుక దారిఁ గొల్చెఁ దాఁ
దామరతేకుబంతి ననఁ దద్దయు లత్తుకయంట్లు రాలఁగన్;
లేమ యొకర్తు తన్ దొర లభిన్ గన వ్రాల్చె మెడన్; మరుల్ నిలం
బోమినిఁ బూవువిల్తుఁ దనుబోయఁడు గూల్చెడులేడిపోఁడిమిన్. 88

1. ఈపైనాల్గు సీసపాదములు. ఎత్తుగీతినాల్గుపాదములతోఁ గ్రమాన్వయము గలవి.

చ. నర [1]జఠ నొందఁ గిన్కమెయి నల్వ పిఱుందును గట్టెనంచు వే
పఱతెంచి యొకర్తు నూల్విడిచి వైచి వడిన్ మునుఁ బోఁ దొలంగెఁ; బ్రే
ముడిఁ గని యావులించి జఠ మూఁపున వ్రాల నొకర్తు తా మఱిన్
గడు బెదరించునట్లు దగెఁ గాంచుచు రాయఁడు కూర్మిఁ జూపమిన్.

గీ. తనకు విందుగ వచ్చుకుంతలున కెలమి
మన్నన లొనర్ప నిలుచునమ్మరునిచేతఁ
[2]బూన్పఁ బడినట్టు లొకపూవుఁబోఁడి గూర్చె
నెమ్మిఁ గ్రేఁగంటిచూడ్కులఁ నిడుపుదండ. 90

వ. ఈవరుసఁ గ్రోయాంధ్రు పుడమియొడయనిఁ గనుచుఁ గొందఱు
పెఱల వెనుఁ ద్రోసి మునుఁ జనుసురవడి నీసుమెయి నొకతెంగూర్చి
వేఱొకతె తమలోనః— 91

క. సరములు తెగినను దిగ విడి
పఱుఁ గిడెదవు, చెఱఁగువల్వ పడిన నిలువ వీ
వరయుమ ! నిజ మగుఁ; బాతెదు
తొరఁగినక్రేఁగోకఁ [3]దెగడి తొయ్యలి ! తోడ్తోన్. 92

క. తొడుగులు తొడుగకయే యిటు
దుడదుడ దొర కెదుటఁ జనుట దొసఁ గెసఁగదు; నీ
యదరెడు చనువ్రేగుమెయిన్
గడువెఱ నిడు; దొడనఱవికఁ గడగా నిడుటల్. 93

క. నడయెగుడుదిగుడు గాకయ
వడునెవమున మోము వంతపా లగు టేలా !
వడి గెలుతురు తమవిద్దెలఁ
బడుచుల యిట ముగుద ! మరునివడఁతినయేనిన్. 94

1. అలసత్వము. 2. నియుక్త. 3. ఉపేక్షించి.



క. సందియము లేదు, నిను మఱుఁ
డొందెన్, గెందమ్మికంటిరో ! వెదలితి వొఁ
దొందరనరఁ; గొరడాదె
ల్పం దిని బెద రొందునాఁడు [1]బాబా వోరెన్. 95

క. నిలుతువు మెయి గదలఁగఁ జూ
పుల కద్దై మాకు ముందుఁ బొలఁతి ! యదిగో ! పెన్
జలమున నెత్తాసోరణ
ముల నిలిచెదువేఱుచెలులఁ బొగులుతు వెట్టుల్ ? 96

క. వెలయించుచు నెలకూనలు,
కొలఁదియయిన. [2]ఱాఁగ ! పోకరు గానె; దెవరిమెయిన్
గెలుపు మరున కిడుముల్కాని
కల నరు లై కలయ వెఱయ వఱనెలగులుతుల్ ? 97

క. నేరుపుగరువం బనయముఁ
గూరు నినున్; గొంత తేనిఁ గొలువుమ ! పొలఁతీ !
[3]పేరులఁ దగుపేరుం బం
గారాకున మరున కిడుమ ! కానుకగాఁగన్. 98

క ఎమ్మె లనువిండ్లు ముందుగఁ
బమ్మినసంబరముతోడ బల్బొమలాడం
గ మ్మెయిమెయిఁ బల్కెదుప్రో
ల్గొమ్మలనుడువులను తేఁటు గూర్మిన్ వినియెన్. 99

క. వెనుకన్ గినుకన్ జెవి [4]కిం
దనినుడిఁ దను నాఁపునత్తెఁ దాఁ గని సైరిం
పను గాక యోర్తు తలఁచెన్
మును బున్నెము సేయఁ బడుపుఁబొలఁతిగ నగుటల్. 100

1. గుజ్జము. 2. జారిణి. 3. నామాంకిత మగుహారము. 4. ఇంపు గాని.

క. మొలబరువున నగు[1]గరువం
బలమినయటు లోత్తు గదలనట్టియడుగులన్
లలి నగరునఁ జనునాఁడే
స్గలను వలెన్ మన్నుతేనికొమ్మలఁ దెగడెన్. 101

క. మరుబారికి గుఱి యగుబి
త్తరులన్ దొర నరయఁ గోరుదాని కొకతెకున్
బఱఁగెన్ గన్రాపోకలఁ
బరు గామదగాఁగఁ జెవితొవకుఁ గనుఁగొనకున్. 102

క. ప్రోయాంద్రచూడ్కివలచాల్
రాయంచగ తేఁడు దాఁటి రానగరులముం
జాయలఁ గొలకుల నంచలు
వాయనితనరాచవీటిపట్టున్ జొచ్చెన్. 103

## గ్రీష్మము

క. కలయెల్లర కెలమియుఁ [2]గను
కలినెమ్మియుఁ గూర్చి ముదముగా నక్కజపుం
దలిరుంబ్రాయపుటుమ్మను
గలమేలిక [3]వదకుఁ దగినకలిమి గడించెన్. 104

క. సోయగముమ్రానిమొగ్గల
చాయఁ దనరు[4]నాజినగల సామి యెనంగెన్
బాయక ముజ్జగములకున్
దోయికి [5]నామెతల తుమురుతో వెల్లువ యై. 105

మ. వెలిముత్తెంబులదాలు బోల్చెమటసొర్వెల్లిన్ మెయిన్ జెంది తేఁ
దలరెన్ దీటుగఁ 'ద్రామపర్ణి' యనువాఁగం దిమ్ముగన్ సంద్ర మై;
వెలిగందంబున వెల్ల నొచనులతీవెంబోండ్లకాఁగిండ్లలో
గెలిచెన్ వేసవియుమ్మగాక [7]మరుసేగిన్ గూడ్పున్వేఁడియున్.

1. గౌరవము. 2. చూపు. 3. గీష్మతాపము. 4. ముత్యములు. 5. అమృత శీకరములు. 6. విరహబాధ.



క. గందపుఁబూఁతమెయిన్ జ
ల్లందన మూనుమెయితో నెలంతలయెదలన్
బొం దయి యొదయఁడు [1]కెందొగ
విందల్లునివేఁడివేఁకిఁ బెనిచె వెఱఁగుగన్. 107

క. గందపుఁబూతన్ దెలుపుం
బొందుపుడమితేనిమేనిపొంత లెసఁగెఁ జ
క్కందనపుఁగడలిదరి మి
న్నందఁగ నుప్పొంగి వాని నలమెనొ నాఁగన్. 108

క. ఏలిక మూపుల రెంటన్
దాలిచె గందంపురేకదంటను [2]గెలుపున్
వేలుపుబోనముఁ గ్రోలెడు
రాలచ్చికి వెండిగిండ్లు రహి నిదినయటుల్. 109

ఉ. ఏలికమూపు లొప్పె నెనయించినగందపుఁజుక్క లొంది సాఁ
బాలుగ నేలఁ జేసి తమపై నిలుపన్ [3]వలితెల్లతామలల్
దాలుచుకొమ్ములట్లు, గయిదండఁ గలంగుదురంబుసంద్రపున్
వేలుపుబువ్వయుండజత బీరముఁ దెల్పగఁ జేఁడు దాల్పె నాన్. 110

క. మొగమందున నిలిచినసుది
మగువ గొలువ నిలుపుమంచుమలయల్లునిరూ
పగు నన నొసటన్ దీర్చిన
జిగిగందపురేక దొరకుఁ జెన్నున్ గూర్చెన్. 111

క. జగ మలముప్రొద్దువత వోన్
దొగవిందువెలుంగుఁ గవియు[4]తోయమునఁ దగెన్
జిగిగందపుఁబూఁతన్ వలి
[5]రగుబఁజమలకుఁ బోలిక యగురాకొమరునొదల్. 112

1. మన్మథదాహజ్వరము. 2. విజయామృతము. 3. మంచు గలస్ఫటికాంద్రి. 4. విధము. 5. అతిశయించు.

క. సోయగపుఁగదలియల నాఁ
డీయనివిత్తుఁ దను[1]మింటిత్రిమ్మరియడిదం
బో యన నిగఁ గనువేసవి
నాయేలిక తాన మైనయాలికిఁ దీర్చెన్. 113

ప్రకారాంతరానువాదము

క. మీన్ దాల్పుమింటిత్రిమ్మరి
యందినవాలేకఁ బోలె నందపుఁగదలిన్
జెందెడుతరఁగలుగా దొర
పొందించెన్ దురముఁ జెలికి మున్గుపు గాఁగన్. 114

క. మొగముతొగవిందునందున్
నిగిడెడుసిరియందెదొదకు నెమ్మిని దిగువ
ల్కగరితయంచ యనా నెద
నిగఁ గనె గందంపుఁజుక్క [2]సేనికిఁ దొద వై. 115

క. [3]చలిమిరిక్కై కై వేయం
చులవా ల్పోల్తామరాకు సొప్పద వేరైకఁ
గలవేడుకవెలితామర
చెలఁగె దొరకు సిరిమగనికిఁ [4]జందమువోలెన్. 116

క. ఏలికయెద గందముచేఁ
దాలుచురేక దగె వాయిఁ దగఁ జన్నుపలుకుం
గోల[5]రవా లగుతెలిపు
ల్గోలిన్ దను ముక్కునుండి నూడుచుతూఁ డై. 117

సీ. విరివిగఁ బఱఁగుతుంపురుల పెన్పరులతో
మంచుసోనను గురిపించునటుల,
నంతటఁ బటికంబు లమరిననేలచే
వలిని తారుష్ట్వగాఁ బడసినటులఁ,

1. విద్యారథుని (దివాకరుఁడు) కత్తి. 2. తనిక. 3. చలువ. 4. శంఖము.
5. వాహనము.



బెనుచలిన్ ముదుఁగువేవెల్గువెల్గులచేత
ము న్నెన్నఁడును ముట్టఁ బోనియటుల,
నెండ నేనియు నల్వ యువము నూర్పఁగఁ గావఁ
బూనుచు పెగ్గోట లైనయటుల,
తే. గీ. విచ్చుమొగలులరేకులఁ బేర్చి గంట
ములగములు పైకిఁ బొడుచుక మూఁగినటుల,
మబ్బులను బోలునరఁటాకుదిబ్బ లలమి
చుట్టఁగను దమ్ముఁ దొవసూదు సూదనటుల. 118

క. సోరణములసందులలో
బారులుగా నచ్చ మౌచు బయలువడెదు నీ
ర్ధారలనెపమున వేసవి
దీర ముడుప ములుకులవరి క్షేపణపు నన్. 119

క. వెలయుచు బడ లఱ మరునకు
విలు నెక్కిడ నాన పెట్టుపె[1]న్దారలయి
మ్ములఁ గొమ్మలతో నదిప్రా
ద్దుల నానదిజగమునేలుదొర లలి నిలిచెన్. 120

ఉ. గందపుఁబూఁత వెల్లనినిగన్ వలికొండవలిన్ జెలంగి చ
క్కందనమిక్క లౌచెలులగబ్బిచనుంగవ లండ గాఁగ రా
చందురుఁ డొప్పె ముజ్జగము సాఁగిల నొప్పు[2]తలంపుచూలితే
నిం దులకించునట్లు వడ నీల్గఁగఁ జేయఁగఁ జాల నైనటుల్. 121

క. వెలఁదుల గంద మలందని
వలిమేన్, [3]గలిగొట్టుఁదీవవలనన్ దొగ రౌ
వలికరువలి, [4]నగుమల్లియ
వెలసె నపుడు గావ మరునిబీరము నచటన్. 122

1. ధారాగృహములు. 2. మన్మథుఁడు. 3. పాటలలత. 4. నవ్వు(వికసించు).

చ. ముగుదలతళ్కునీర్వలన మోనము నొందుచుఁ [1]గుంటఁ బాలు నాఁ
దగుతెలినీటిలోఁ బడుచుఁ దారవు నీరును బాలు వావఁగా
నగునెడ కంచ లన్నులకు నంత నడల్ గదియించి యందెలం
దగునులి వొందె నా నిలిచెఁ దమ్ములఁ దుమ్మెద లంటి మ్రోయఁగన్.

చ. ఎలమినిఁ దాన మాడుదొరయింతులమోములరిక్కతేండ్లతోఁ
జలమును వీడఁ జూచె ననుచాయను దమ్ములు వారికాళ్ళపైఁ
గలసిరి నుంచు నెందు; నెటఁ గల్కులతుంటుల రేఁగి నిక్కు పె
న్నలలయుయేల [2]బెగ్గురులు హాయిగఁ గూయుచు నూఁగుచుండెడున్.

చల్లుపోరు

క. ఏలిక యాలలి నిడుపుగఁ
గ్రాలుచుఁ బొగ డొందుతోఁ గల[3]వేడ్కకెళా
కూళులఁ దనగోలలతో
మేలంబునఁ [4]జల్లుపోరు మిగులన్ సలిపెన్. 125

సీ. [5]అలయుచెలులగొట్టములదార లనుమరు
కోల లొందెడునల్లడా లనంగ,
దొరమేనిజిగినీటఁ బఱఁగెడుమరుమీనుఁ
బడయ గాలపుదార మిడుట యనఁగ,
గరితలగమి కాన్కగా మరుదొరకయి
యందుఁ బడన్ జిమ్మునంచ యనఁగఁ,
గైఁగ్రోవిదారలఁ గడుఁ గల్కు లగలింప
[6]నమ్మెత్తుమరుగుఱి యయ్యె ననఁగ,

తే. గీ. తేనికైఁ దామరాకు పేర్మిని గడించెఁ;
దద్ద నిడుపుగఁ జెలి చిమ్ముదార దసరె;
తేఁడు దారలతీవలగూఁడునఁ దగె;
నెక్కటిమగండు తేఁ దుక్కు దక్కి నిలిచె. 126

1. కొలఁకునందు. 2. సారసపక్షులు. 3. విలాసక్రీడాసరస్సులు, 4. జలక్రీడ. 5. ఈసీసములోఁ దొలి నాల్గుపాదములకుఁ గ్రమముగా నెత్తుగీతము నాల్గు పాదములతో నన్వయము. 6. బాణము.



చ. కలుకులచన్నులన్ బొలుచుగందపుఁబూఁతలు తేండ్లమిన్న వి
చ్చలవిడి రువ్వుదారల నెసంగెడునీరున జారు చుండఁగాఁ
దొలఁగెడునో యటంచు నల [1]తుమ్మెదయల్లెగలట్టిమేటి దా
వలపు నొనర్చె వారియెదఁ బాయనిచిక్కనిరంగుబొమ్మగన్. 127

క. చక్కనిచూపులపైదలి
చెక్కిలిఁ గైఁగ్రోవిదారఁ జిమ్మదొర దగెన్
నిక్కు[2]తొవతీవనేస్తుని
యక్కునఁ దనవెల్గుగడను నన్పెడు[3]ప్రొద్దై. 128

క. దొర చిమ్మ గొంతు గుఱిగాఁ
బఱతెంచెడునీటిదారఁ బడఁతి యొకతె దా
నరయుచు వంగుచుఁ బొరలుచు
మురువుగ మరుకత్తిదారఁ బోలెన్ దాఁటెన్. 129

చ. వెలఁదులచన్నులన్ దొరఁగు[4]వీఁజియ నల్పగుసోననీ రనన్
దలఁకుచుఁ దిగ్గునంచగమి నవ్వ గమించఁగ, జారుకుంకుమన్
గలిసి తొగగ్గడించె మరుగొ రెలమిన్ మునుఁగంగ నౌదలన్
దొలఁగెడు[5]చెంద్ర మొందునవి దోఁపఁగ బావులనీరు లత్తుకన్. 130

క. అలలఁ జెలఁగి వేడుకముం
గిళులన్ గలకొలఁకులందు నిగిడె [6]సిరముదు
మ్మల మలయల్లునలుకచి
చ్చు లఱన్ ముగ్గువెదవింటిజోదుబసుమ మై. 131

క. క్రమ్మిననల్[7]యగల్పొగ
[8]నెమ్ము దొరఁగుచెలులచంటినెలవులయందే
కమ్మనివిల్దాలుపు దా
నెమ్మి మిగులఁ గనియె నిద్ది [9]నెఱి నక్కజమౌ. 132

1. మన్మథుఁడు. 2. చంద్రుఁడు. 3. సూర్యుఁడు. 4. కస్తూరి. 5. సిందూరము. 6. చలువఁదనమునకు స్థాన మగుకర్పూరము. 7. అగరువు. 8. తడి. 9. పూర్తిగా.

క. ఆమని కెలనన్ గ్రాలమి
నామనిచెలికాఁడు దొనల నమ్ములు లేమిన్
[1]జాములవిరిమల్లియలన్
గో మరుఁగ్రొమ్ముగుల [2]దిటము గొనకొని నిలిచెన్. 133

క. తరఁగలవరుసలఁ గాటుక
దొఱఁగినదొరచెలులకనుల[3]దొర లై వఱలెన్
విరివిగ [4]నూతెడుతాఁతన్
బొరలుపఁ [5]టులు వాయుమరునిముల్కిగములకున్. 134

క. [6]వేడుకగ్రుంకుటఁ గుంకుము
లూడినయాంధ్రమెయి గోటియొత్తులు దాల్చెన్
వీడక సౌరుకదలిదరిఁ
గూడినపవడంపుఁగెంజిగురులనిగనిగన్. 135

ఉ. ఆపయి నాలిచెక్కు నొదయందు కదున్ మెయి గగ్గురింపఁగా
రూపులు కస్తురిన్ మురువు రూపడఁ దీర్చుచు నుండ, వేర్పెలుల్
మో పగునీసుఁ జేసి తెలుపున్ గనుచెక్కులఁ బర్వు కంటినీ
రాఁపనటుల్ దొలంచి బిరు సౌకదకన్నుల రువ్వి రద్దొరన్. 136

క. గొం తించుక యెత్తినయొక
యింతికి దా నంతఁ దురుము నిడఁగన్ గనుచున్
[7]వంతవడ వాడుచెక్కుల
వింతగ నిడుకేళ్ల ప్రేదుల [8]వెక్కిరి పెలలున్. 137

క. ఆమని సన బీరం బఱి
పూముల్కులమేటి కిట్టిపోకల బిగి గాన్
జాముల వలిఁ జిమ్ముదనుల
సామ్మి గదిసి వడగరువము నడలిఁచె మిగులన్. 138

1. కాంతలు. 2. ధైర్యము. 3. సమానము. 4. నికషోపలము. 5. ముటిక. 6. విలాసస్నానమునందు 7. చింతాతాపము. 8. హరపడిరి.



## నిదాఘాంతము

క. తనబీరముఁ బరమోన్నతిఁ
దనరించియు దావభస్మతతిఁ దనయశమున్
గనఁ జేసియు వేసవి యం
తన డించెన్ బౌరుషంబు ధన్య మయినటుల్. 139

క. దినములఁ గొన్నిటఁ దీండ్రముఁ
దనరిఁచి బీరంబు విడెను [1]దప మంతటఁ బెం
పున కిరవులుగా నెచ్చట
ననఘము మను చుండుదురు పరాపకృతిపరుల్ ? 140

## ప్రకారాంతరానువాదము

క. కొలఁదిదినంబులు తీక్ష్ణతఁ
జెలఁగించి ప్రతాపహానిఁ జెందె నిదాఘం
బల పరబాధైకపరుల్
మెలఁగుదురే చిరముఁ బెంపు మేకొని యెందేన్ ? 141

క. [2]కారగ్గి గాల్పువనములఁ
గూరినభస్మముల [3]మలలు కొమ రొప్పె నొదిన్
జేరినబాలతరులు సన
వారనివైరాగ్యమునఁ దపస్వితఁ గనె నాన్. 142

క. వడచేతవాడువాఁకల
నడిమియెడన్ విడిచి యింపునన్ గూయుచు జా
రెడురాయంచలదంతులు
బెడఁగు లెసఁగుమేఖలలుగ వెలసె నదులకున్. 143

1. వేసవికాలము. 2. దావాగ్ని. 3. పర్వతములు.

చ. సకలజగంబులన్ గలరసంబుల మిక్కిలి క్రోలి, పీనతా
ప్రకటభరాతిరేకమున భాసిలుభాస్కరుభార మూనఁ జా
లక కడు మెల్ల నౌనడుగులన్ జనువాజులయందుఁ బోలె నిం
తకు మతి యింతకున్ బ్రబలు దైర్ఘ్యముఁ గాంచుచు నుండె [1]ఘస్రముల్

చ. ఇతరసరిత్ప్రతానములు హెచ్చుఁ గృశించిన వై మునున్ జనన్
యతనము సేయుచున్ జరఠ మైనను జావనిచోఁ దుషారప
ర్వతతటభూతరంగిణులపట్టునమాత్రమె నిల్చె నిమ్నగా
పతి కుపగూహనోత్సవము వారక వేసవి నవ్వి పాఱఁగన్. 145

చ. శిశిరశిలోచ్చయద్రవవిశిష్టజలోద్వహయక్షదిఙ్నదుల్
శిశిరతఁ గూర్చునట్టుల నశేషసరిద్వరహార్దికిన్ దగెన్;
[2]గుళ మఱఁ దామరాకుగమి గూలి సపంకము గాన్, బరాఽపగల్
కృశత ననబ్ధిసంగ లయి యొప్పె వియోగదశన్ జిరంబుగన్. 146

చ. [3]చలినెల వేలుదాన తనచన్నులదాయ వెలార్పఁ గుంద లన్
[4]లలిఁ గనుచున్ మొగంబులఁ దొలంకినమూఁకుడుసీ రెఱుంగ; ర
చ్చెలినునుమోవి నానుతమిఁ జెందినవారు తదర్పితప్రపా
జలము సహింప కాని రనిశంబు సపాటలగంధ మైనన్. 147

క. జ్వలదారణ్యానలదం
ధులు మారుతములు నిదాఘతూర్ణశ్వాసా
నిలము లనన్ సోష్మము లై
తలఁగెను బాటలరదచ్ఛదముల నొరయుచున్. 148

చ. విరియుతపర్తువందు దినవేళ సరోజపటీరపంకముల్
వఱలుప్రియాంకపాళుల విలాసులు [5]గగ్గురులన్ సుఖింతు; రొం
డొరులు పెనంగి కూర్కుఁ గను చంద్రు ప్రదోషమునంద తత్పర
స్పరరయనిశ్వసత్పవనపాళిఁ గపోలపుఁజెమ్మ వమ్ము గాన్. 149

1. దినములు. 2. జలము. 3. చలిపందిరి (దప్పికనీరు పోయుచోటు - చలివెందర). 4. విధము, 5 పులకలు.



క. వనజరహితాఽననముఁ జం
దనరహితవిలాసవృద్ధిఁ దవిలినలలనల్
గనఁ జేసిరి మెల్లఁగఁ దప
మెనయుప్రతాపప్రహాని యెదుగుచు నుంటన్. 150

క. మిళితార్కమండలం బగు
జలధరఖండంబుఁ గాంచె జనవరుఁ దపు డె
వ్వలనుండియో సకుండల
జలధరవేళాశిరంబు నగ మెగసినటుల్. 151

చ. సురలు నిదాఘతాపమున శూన్యజలం బగుగంగయందుఁ [1]బు
ష్కర మరయంగఁ గోరి నది[2]కర్దమమున్ గడు రేఁపి రన్గతిన్
వఱలుఘనార్భకంబుఁ గని పల్కెఁ గుతూహలలోలనేత్రకున్
దరుణికి నంకతల్పమునఁ దావుగ నిల్పి ధరావరుం డిటుల్. 152

## వర్షర్తువు

తే. గీ. మహితతారాఽధ్వవిపినతమాలమాల,
క్షోణిధరమూర్ధసురుచిరకుంతలాఽళి,
చంచలాదీపికాంజనచయనిభంబు
నవ్యజీమూతపటలి, చాన! కను మదిగో. 153

తే. గీ. చంచలాదీపికోత్థకజ్జలముఁ గూర్ప
వర్ష యుత్కంఠఁ బట్టుకర్పర మనంగ
ఘననిరోధంబునన్ జండకాండుమండ
లంబు గన్పట్టు న ల్పంది యంబుజాక్షి!. 154

క. భ్రమరాసితఖచరీవి
భ్రమకృష్ణాగురుజధూపపటలిఁ గలిసె నాన్
రమణీ! సద్యఃప్రచురత
రమణన్ వహియించు జలధరం బదె కనుమా! 155

1. జలము. 2. బురద.

క. పలువన్నెలు గలరతనపు
విలు నెటు నిర్మించె మొగులు; వే సాగరపుం
బలువన్నెలరతనంబుల
మొలక లలముజలము [1]రేఁపెఁబో నిక్కముగన్. 156

క. [2]వనదోన్ముఖ[3]శిఖిముఖములఁ
దినఁ గొనఁ బడుఫణులఫణల దీపించుమణీ
ఘనదంశులు [4]వాంతములు గఁ
దనరు[5]నిలింపేనుధనువు తథ్యమ మింటన్. 157

ఉ. ధారణిభృన్నితంబములఁ దారుచు, శ్యామదుకూల[6]విభ్రమిన్
దీరుచుఁ, [7]బక్కణాధ్వములఁ ద్రెళ్ళుచు భల్లుకభంగులై, తటి
న్నారులలాస్యభంగులను దన్వి! [8]గళజ్జలకాండవప్రముల్
గా రహిఁ గ్రీష్మతాపతపఖస్థలసీమల మబ్బు లుబ్బెడున్. 158

క. మొగుళు లను[9]సానకండ్ల నమ్ములు మరుండు
వాఁడి సేయఁగ నాడాలవలన రవులు
నింగలపుమిణుగురులభంగి నెనసి మించు
మించుఁదీవియఁ గాంచుమ! మించుఁబోఁడి! 159

క. అంబునిధానాంతఃస్థన
గంబులకుశలంబువార్తఁ గాంచి దరిసె నాఁ
గం బర్హితాండవారం
భం [10]బరురుతిఁ గొలిపెఁ [11]జఘుల వారిధరంబుల్. 160

1. పైకిఁ దీసికొనెను. 2. మేఘము. 3. నెమిలి. 4. క్రక్కఁబడినవి. 5. ఇంద్రధనుస్సు. 6. విలాసము. 7. ఆటవికులపల్లె. 8. ఒడియునీరు గలతెరబట్టలు. 9. నికషోపలములు. 10. ఉప్పుర్వని. 11. పర్వతపానువులు.



క. నీకురులవలననోటమి
పైకొన జీవితముఁ దెగడు బర్హులు; గానన్
బాకారివింటి కెదురుగ
బాకులునగుకోర్కిఁ బోలెఁ బైదలి! నిలుచున్. 161

ఉ. వానలలో జిగీషువులె ప్రక్కనఁ బెట్టఁగఁ గార్ముకంబు తె
చ్చో నిగిడించు నేర్పు బలసూదను[1]ధర్మువు చిత్రభంగిగా;
నానఁ దొలంగ రాని దయి యామనినేస్తునిచాప మొక్కఁడే
దానరా! నే నెఱుంగుదును పైఁపనియ ట్లిపు దేపు సూపెడున్. 162

చ. సకలధరాంతరస్థితరసంబును లాగి కరాళిఁ నీతఁ డాఁ
గక వడ కూన్పుఁ బాటవ మఖండముగా ననుచున్ [2]ద్విషాంపతిన్
బ్రకటితచండతన్ బయికిఁ బర్వతటిత్కరముల్ దగంగఁ ద
గ్గక కదు దూఱునట్లు గనఁగా నగుఁగా ఘన మంబుజాననా!. 163

తే. గీ [3]తపసుహృత్తిగ్మరుచికాంతి తమ్మిసూఁడు
మండలముఁ జొరఁ బడ దాని మాయఁ జేయ
నని యెఱుంగుదు నదె మదిరాక్షి! కనుమ!
వారిదంబు నిరోధించు వారిజారి. 164

తే. గీ. మూడులోకంబులన్ గడు[4]మూరుకొనిన
గ్రీష్మమును గిన్కమెయి ముద్దరీతి మ్రింగి,
మ్రోల నిలఁ జేసినతదస్థిమాల యనఁగ
నదె బలాకాళిఁ జెలి! వలాహకము వఱలు. 165

క. తరుణి! జగత్త్రయదుర్లభ
వరగతులన్ నీదుచెంతఁ బడసియు శిక్షన్,
సురహంసగురుతలోభము
వఱలుట నన మానసంబుఁ బడసెడు నంచల్. 166

1. ధనుస్సు. 2. సూర్యుని. 3. గ్రీష్మబంధువు. 4. ఉత్ఘూడించిన.

క. సురధనువు దరియునంచలు
[1]శరదపతద్బిందువుల విసార్యంగుళిక
స్ఫురదిష్వాసనముఖమునఁ
బఱఁగెడు[2]గోళీ లటంచుఁ బాయు మొయిళులన్. 167

ఉ. కేకులముక్కులన్ [3]మఱుఁగుఁ గీల్కొని, కోమలకూజితాంకుర
ప్రాకటభంగి వెల్వడుచుఁ, బాంథవధూటులకొర్దివేఁడి[4]యూ
ర్పోకల గాసిఁ గాంచి, [5]కణముల్ ధరణిం బడు; నిర్మలన్ గరున్
వాకొన రానినీతిఁ గని వారిధరప్రకరచ్యుతంబు లై. 168

క. అలవాటు లేమిఁ దమము
క్కులకొనలన్ జిలునెమిళ్ళు గొనఁ గన కీర్ష్యన్
గొలిపినయటుల నవాబ్దం
బులకణములు పుడమిఁ బడుచుఁ బొరలున్ దరుణీ! 169

క. ధరణీధరకటకములఁ బులు
వఱగించుచు వీర[6]మురజ ఘాంకృతులు దగన్
శరదాఽగమంబు వెదకెడు;
సురుచపలాదీపకేతనోన్నతిఁ దపమున్. 170

ఉ. అల్లదె! నల్లలేగఱిక వ్యాప్తము లై, [7]యమరేంద్రగోపముల్
మల్లడి గొన్నలుల్ గలుగుక్ష్మాధరసీమలయందు వేల్పురా
విల్లు వియచ్చ్యుతిన్ గని భువిన్ బడెనో యనుభ్రాంతిచే వలెన్
దల్లడ మంది మ్రొగ్గు జలదంబు భ్రమచ్చపలాదృశాఽఽయతిన్.

తే. గీ. చద లనెడునీలనీరజపదమునుండి
వ్రేలునాళంబులకు సరిపోలుజిగులఁ
బొలిచి వలతేనికోలలప్రోవు లనఁగఁ
బడెడు ధారాపరంపరల్ [8]వార్దము విడి. 172

1. జలదము. 2. గుండ్లు. 3. చాటు. 4. ఊర్పు + పోక = నిశ్వాసము.
5. బిందువులు. 6. మృదంగము. 7. ఆర్ద్రపురుగులు. 8. మేఘము.



తే. గీ. మారనారాచముల [1]నయస్కారుసరణిఁ
బదనుఁ గదియించు ముగుద! తోయదసమయము
శ్యామలాంగారరుగ్జలదాంతరమునఁ
దనరు[2]శంపాఽఽశ్రయాశంబుఁ గనుమ! నిజము. 173

క. వేసవిచెలి నీప్రియరవి,
నీసైదో డివురఁ జేసె నిఖిలజల మటం
చీసుమెయి మొయిలు ధారా
[3]ప్రాసంబులఁ గొట్టు బిసిని వడి ధేర్మనుచున్. 174

తే. గీ. [4]అల్పనదిసంగమోత్సుకు నాపగాఽధి
పతిని సంప్రతి గనుచు నధ్వముఁ గ్రమించి
స్థీదము లగునదాంతరనివహములను
దమకుఁ దామె మహానదుల్ త్వరగఁ బడెడు. 175

క. ఇందీవరనిభనిర్మల
[5]కందస్రజ మంబుభరముకతమున వ్యోమం
బందుండి వ్రాలి యెల్లెడఁ
జెందుబురద నరసి సానుసీమల నిలుచున్. 176

క. స్తనదబ్దములవలన నం
బునిధిచరిత మెదియొ వినుచుఁ బొడముకినుక వా
హినులు [6]కలుషతఁ గదలి నోర
యను గోలాహలము లెసఁగునూర్ములతోడన్. 177

క. [7]సరిదినసమాగమత్వరఁ
బఱఁగిడునంభోధిసతులు పర్వతనదు లం
తరమున నాఁపఁగ జగడం
బురరవమునఁ జేయునటుల నొప్పు లతాంగి!. 178

1. కమ్మరివాఁడు. 2. మెఱుపుఅనెడునగ్ని. 3. ఈటెలు. 4. ఈ పద్యమున 'నదీ–నద' శబ్దములు 'స్త్రీ-పుం' లింగములు. వీనిచేత స్త్రీ-పురుషస్ఫురణ కలుగును. 5. మేఘమాల. 6. పాపము-కలఁకఁబారుట. 7. సరిత్పతి (సముద్రుఁడు).

క. కను మంగన! ఘనములు దా
మెనయించిననీట నవని యెంతగ ఖేది
లైనా యని కనుగతిఁ [1]గొడువుల
యనుస్మృతి క్షితి [2]నుచ్చు [3]నమ్మయము లగుధారల్. 179

క. అందంద [4]సమదవీచిక
లం దరిఁ [5]బృషతాఽళిముక్తలం జల్లి సము
ద్రేందుముఖీవంచన నాఁ
గం దిరుగు సముద్రవేషకలన నదంబుల్. 180

క. రేల నభిసారికలు [6]జం
బాలితమార్గముల జారఁ బదములు నిలఁగా
నాలంబన మాశించిరి
మేలిమికట్ల యనుశంక మించుందీవన్. 181

క. ప్రతిబింబరీతి సంబుద
మతిజలవృద్ధి యటు యర్థి యయి నీలీలా
శతపత్రాఽకరమునఁ దాఁ
దతవీచీదండతాడిత మగునటు దగున్. 182

ప్రకారాంతరానువాదము

క. తననీ రలఁగా నర్థిత
ఘన మదె ప్రతిబింబరీతిగా నీలీలా
వనజాఽకరమునఁ దగుఁ ద
ద్ఘనవీచీదండతాడితం బౌనటులన్. 183

క. జలదము జలధిజలంబును
[7]గలపైనన్ గొనియె నిజము; కానన్ గోలా
హల మొనరిఁచి గ్రహియించును
జలధివధువు తజ్జలంబు జలజాతముఖీ! 184

1. సన్ననికొయ్యలు. 2. దూసికొనిపోవును- 3. జలమయములు, 4. నగర్వమగు 5. నీటిచుక్కలు. 6. బురద గలత్రోవలు. 7. వర్థి:- గదువు అని రెండర్థములు.



క. జలధి, జలంబుల జలదం
బుల కొసఁగె నిజంబు [1]వృద్ధిఁ బొంద; నుదన్వ
ల్లలనలు గొంద్రు తదంబువు
లల శిఖరి[2]ప్రస్థశతసహస్రవిమర్శన్. 185

తే. గీ. సాంద్రపురసోపబృంహణసరణిఁ గూర్చి
యేటులన్ దార్చి నాయొద లెనయఁ జేయు
నిది యటంచును రిత్త దన్ గదియుమొగులు
నింతి! పోషించు నిజము, ధునీశుఁ డలరి. 186

తే. గీ. మెఱుపువడ నీలఘన మదె మిగులఁ గరఁగి
కాంత! యిలకుఁ [3]గపాంరంగముగ నయ్యె
దానఁ దనరు ధరిత్రి యుద్గతవినీల
ఘనకుంతల యై జరన్ బాసినటుల. 187

క. ఏయదనున నిర్ఝరిణీ
నాయకున కకీర్తి యటుల నాటెనో యెఱుఁగన్,
దోయధిసతుల కగస్త్యుం
డీయదనున నెదుటఁ బడిన నెఱఁగుదు రతనిన్. 188

క. ఖతలస్థిత్వడ్వీరు
త్కృతదోహదకర్దమద్యుతిన్ దగుకంద
ప్రతతి, వియచ్చ్యుతకల్మష
గతవారికి [4]గాలనాంశుకం బనఁ దనరున్. 189

1. వర్ధి-అభివృద్ధి (శ్లేష). 2. కొండచరియ-కొలతడాము (శ్లేష). 3. తల యందలి నీలిరంగు. (నీలిరంగు వేసినట్లు నల్లగతికయను కేశములుగల భూమి వర్షాకాలములో ముసలితనము పోయి యువతి యై నీలకుంతలవలెఁ గనఁ బడును. 4. ఒడియఁ బోయుబట్ట.

క. నీలాబ్దపంక్తి, సహజవి
నీలాశ్వము లెట్లు దారి నిగుడు నని భయా౽
లోలత [1]వాగెల బిగియన్
దాలుచ నిజ మిపుడు తన్వి ! [2]తార్క్ష్యాగ్రజుఁడున్. 190

తే. గీ. జలదమా ! ప్రియురాలిఁ జంచలను నీవు
గనక తనరించునీముహుఃక్రందనంబు
కనికరం బైనఁ గలిగింపఁ గాన దౌర !
[3]యధ్వగులఁగూర్చి యిద్ది మహా౽ద్భుతంబు. 191

తే. గీ. నిజము, నిచ్చలు నీయెడ నెఱిఁ బ్రియంబుఁ
గనుమెఱుఁ గెఱుంగ దన్యులకష్టదశలఁ;
గానిచో విరహిజులను గలఁచు చున్న
నేల వారింప కుండు ని న్నెలుఁగు నెత్తి ? 192

తే. గీ. ఎట్టులో మాప్రియుండు మమ్మోనయు నైన
నిజము నమ్మము తిరిగి ని న్నెమ్మనమున
వనదమా ! మాటికిని విష్ణుపదము ముట్టఁ
బాఱుచు స్వకార్యపరతను వదల వెపుడు. 193

మ. వెలినల్పే యన రాదు; పాంథవనితాపీడా౽ఘమం దైదుతూ
పులవిల్కానికి మంత్రి వౌటఁ గడు నల్పుం జెందు నీడెందమున్;
మెలఁగన్ జేయుదు కౌతుకం బొకటి సుమ్మీ ! పాంథనిర్మూలనన్
దొలిము ల్లోనెల మ్రింగు దధ్వగలయందుం బ్రేమ లే కుండియున్.

చ. పలుకఁగ నేల ? యధ్వగలభాగ్యవిపర్యయవృద్ధిచే జలం
బుల మకరా౽కరంబునన ఘొందియు నీల్గక నీదురాక యౌ;
నల గిరిశృంగసంగతవిషాపహరౌషధి గన్పలంబొ నీ
వలరుతు వద్దు నర్యమరథాశ్వ[4]గుణాహులు మ్రింగఁ బోవమిన్.

1. గుఱ్ఱపు కళ్ళెములు. 2. గరుఁడునియగ్రజుఁడు (అరుణుఁడు, అనూరుఁడు) సూర్యసారథి. 3. విరహులు. 4. పగ్గములుగా నున్ననర్పములు.



ఉ. వారిదమా ! నిజంబ, యొకవార్త సరిత్పతినుండి నీవు [1]పా
కారిమదావళంబునకు నందఁగఁ జేయుచు దానఁ జుట్టమై
మీఱెద; వట్లు గానియెడ మింట భ్రమించుచు నుండఁ జెందఁగాఁ
దారక యున్నె నిన్ను సురతల్లజమత్తగజంబు ప్రేల్మిడిన్. 196

క. మృషలు వచింపఁగ నేలా ?
[2]తుషధూమవిధూసరంబ ! తోయదమా ! [3]వే
విషమమరణములఁ దొలఁగి ప
రుషింతు [4]వధ్వగలపాపరూఢోపకృతిన్. 197

క. మరుబారి కగ్గలంబగు
విరహిస్త్రీవార ముఖమువిషదముఁ గనుచున్
దరుణీ ! యను నిటుల నిరం
తరకంఠా౽గతదృగస్రుతంద్రత నుదులన్. 198

క. ఘనమా ! [5]క్షణరుచి క్షణమే
కను నిను; గాదేని సతముఁ గన కుండుత; నీ
ధ్వనిడిండిమంబు వెలిగాఁ
గను నెటులఁ బ్రవాసినీనికాయము పతులన్. 199

చ. కలుగదు షోడశాంశమును [6]గందమ ! నీకళలోఁ, బ్రసిద్ధియే
కలదుసుమాస్త్రుచుట్ట మని; కాక వసంతున కున్నె పేర్మి; యొ
దలఁ గుసుమాస్త్రుశాసనముఁ దాల్పకయున్న సహించునే యిలన్
మలినత నూనునీవదనమండలమున్ గనదభ్రరాజమా ! 200

క. వరు నందినయేవిరహిణి
జరుపదు నీసేవ ? మీఁదు, జలధరమా ! త
ద్వరుఁడును; బేర్మి వచింపఁగఁ
దరమా ! యగు మాకుకవివి తద్విధి నుడువన్. 201

1. ఇంద్రునిగజము (ఐరావతము) 2. పొట్టు కాలు చుండఁగా వెరలుపొగ. 3. వేయి.
4. విరహిణులను బాధించునీపాపము, మృత్యువును నీవుజయించుటకు ఉపకారి యైనది. 5. మెఱుపు. 6. మేఘము.

క. విరహులఁ గూర్చుట నీకున్
సరి యితరుఁడు లేఁడు దౌత్యసరణులఁ; బరులన్
దరిసి వచింపనిసాధ్వుల
[1]కురవుగ ధ్రువ మీవు దాల్తు వోయి! క్షణరుచిన్. 202

క. వేణీవలయము లూడఁగఁ
బ్రాణేశాంకప్రవేశవాసశశిరతన్
రాజించుచెలులు నీసుమ
దాడామాత్యత్వపటిమ వాకొంద్రు గదా! 203

## ప్రకారాంతరానువాదము

క. జడచుట్టులు సడల మగల
యొడిపట్టుల నిలిచి శైత్య మొందు వెలందుల్
నుడువుదురు నీదుమరునే
ల్పడి కగులీలాప్రధానిపటిమను; గనుమా! 204

క. మారాఽతురతరుణుల కథి
సారమునన్ [2]దుర్దినంబు సలుపుదు, స్మరకే
శీరచిత[3]కాండపట మై
తీరుదువు పరోపకారధీరాగ్రణి వై. 205

ఆ. వే. [4]కల్యవర్గమందు ఘనమ! యగ్రణి వీవు;
కౌముదియును నీదుకాంతిఁ [5]జనదు;
దానితెలుపుఁ దాల్పఁగా నేల? కస్తూరిఁ
దొలఁగి సుందరంబె! [6]మలయజంబు. 206

ఉ. చందనగంధవాహములసంగతిఁ గోకిలపంచమధ్వనిన్
జందురుతోడనున్ [7]దొడరి చైత్రుఁడు సల్పఁగఁ గల్గు నేమి? నే
యందును లేఁడు ని న్నెనయునంగభటుం డొకఁ డేని [8]జైత్రుఁ డౌ
[9]క్రొందలిరాకువాలు గలప్రోడకుఁ; బల్కఁగ నేల వేయుగన్. 207

1. అర్థముగ. 2. మబ్బుగప్పినదినము. 3. తెర. 4. ప్రాతఃకాలము. 5. పొందదు. 6. చందనము. 7. కలిసి. 8. జయశీలుఁడు. 9. మన్మథుఁడు.



క. ఘనమా! నీదర్శన మై
నను బ్రియుఁ గననట్టియంగనలు విధిహత లై
కనరు గణన; భిత్తి వినా
పొనరుపఁ జిత్రంబు వసుధఁ బొసఁగు నెవనికిన్? 208

చ. పతు లటు చేరఁగా విమలభావమునన్ దగి [1]చాటుకారితాఽ
మితదరహాసధాత[2]పరిమేదుర[3]పాటల[4]దంతపత్రసం
గతి సుదతుల్ భజించెదరు నవ్యవిలాసనిమీలితేక్షణ
ప్రతతి దగన్ బయోధరపరంపర నైజకృతార్థతాఽఽయతిన్. 209

## సరిదుపాలంభము

తే. గీ. అబ్ధిసంగమపీయూష మరయఁ బోక
గ్రీష్మదినముల మిగులఁ జిక్కియును గష్ట
మెఱుఁగనటు లేల! సఖి! నాకు హేతు వగుదు?
[5]ప్రాణనాథోపగూహనభంజనమున. 210

చ. దిట మఱి, రూపమున్ దొలఁగి, దృష్టి కగోచర మై, క్షణంబునన్
బటిమ వహించుచున్ [6]జదలిపైన నొసల్ విలసింపఁ బొంగె దీ;
వటులయినన్ విలాసగతి నావలిగట్టును జేర దాఁటి వే
విటపటలిప్రగాఢసుఖవృద్ధినిఁ గందురు [7]పాంసులాంగనల్. 211

చ. కలశముపైన నెక్కి తరఁగల్ త్వరఁ దట్టఁగ నడ్డు వీడి పాం
సులలు పరల్, తరించి నిను, జొచ్చెద రావలిగట్టు; నట్టి[8]పుం
శ్చలులు[9]లలిన్ బొనర్చుటకుఁ జాలను నేను; నితంబడంబరం
బల పొలియించు భారసముదగ్రత నెక్కిననావ నేనియున్. 212

1. ప్రియవచనములు పల్కుట. 2. కోమలమైన. 3. తెలుపు ఎక్కువ గలిసిన ఎఱుపురంగు. 4. పెదవి. 5. ఈశబ్దము పుం-స్త్రీలింగములఁ బ్రయుక్తము. 6. ఆకాశముపైన. 7-8. బంకుటాండ్రు. 9. విధము.

తే. గీ. అలలకోలాహలారవ మలవఱచుచు
విననియ ట్లేల సాగెదు వితగ నీవు;
శ్రీవధోపార్జితాఘనుస్నిగ్ధ వగుదు;
జలధి యేవిధి నెనయు నీసంగమంబు. 213

క. పులినద్వయానుగం బగు
నలయుయ్యేల నిల్పి చేర్పు మవలిదరి నను౯;
[1]బాలిసెడిలో నిశ, కృపఁ గను;
మల కీర్తింత్రు నిను బాంసులాంగనలు లలి౯. 214

ఉ. వేమఱుఁ గృష్ణపక్షతమివేళల వె న్జన, కంజఁ ద్విచ్ఛిర
స్సీమను నిల్పి, పారమును జేరుచు నుంటి; ని టేల గర్వని
స్సీమత; కంటికావరముఁ జెందెదు: నీకు ఘనాత్యయంబు నీ
[2]నేమమున౯ గన౯ గలుగు; నీ కిటువంటినడల్ వొసంగునే. 215

చ. లలితనిజోర్మివస్త్రకిసలస్థలనంబు గఁ [3]దుంటి జారునీ
[4]శ్వలిపముతోఁ బయోధికయి పాతె దయారె! స్వయంబు మూఢ వై
వల దని చెప్పి యన్యలకుఁ బండిత వయ్యెద; వద్బఁ బోదు త
త్కూలసరిదాస్యచుంబి యగుతోయనిధానముదాస్య మేనియు౯.

తే. గీ. కన్నియగ నుండియును నొంటిఁ గనను గూర్కు;
జారు వీడి యొరున్ జూడఁ జాల నైతి;
నిటుల [5]గోత్రాస్థితిన్ జనియెదు[6]వరాకిఁ
గృప నను౯ గాంచి నా కుపకృతి నొనర్పు. 217

తే. గీ. మారశృంగారసాగరాసారతటిని!
యేతరంగిణిఁగూర్చి మారాతుర లగు
చపల లాత్మీయకాంతాభిసారపరత
రేల నీరీతి వాకొన రేల! కనలి. 218

1. నశించులోపల. 2. మేర. 3. పిఱుఁదు. 4. వస్త్రము. 5. కులమునందు గౌరవములేమి. 6. దీనురాలను.



చ. తరుణు లుదారమేఘజలధారల ధౌతదుకూల లౌచు న
త్తరుణమునంద కంతు[1]కరదత్తకరద్వయసంగతిన్, గణిం
పరు మది నేమియు౯ బురదచక్కియల౯, స్వవరాంకపాళికా
సరభసవిస్ఫురత్పులకసంపదుదారనిజాంగసంగతి౯. 219

మ. ఎది [2]సౌదామనితాండవంబునకు నెంతేని౯ మృదంగారవా
భ్యుదయం బై తగు; శక్రచాపమున కుద్ద్యోతించుటంకార మె
య్యది; మత్తేంద్రగజేంద్రకంఠలుఠితావ్యగ్రోగ్రగర్జాఘనం
బదె [3]యభ్రంబు వియోగినీవ్యథకునై యభ్రస్థలి౯ గ్రుమ్మరు౯.

శా. మించుందమ్ములత్రుంపు లుండుబురదల్, మి౯భూమిలేఁబచ్చికల్,
న్యంచద్ధారలవల్లు లన్కలమశాల్యంకూరకేదారముల్,
ప్రాంచచ్చైవలశీరస్తరంగిణులశైవాలంబు. లర్కేందుబిం
బాంచ[4]త్కారలు ప్రీతి నీ కిడుత! కాంతా! నవ్యజీమూతముల్.

ఉ. ఎల్లనెమళ్ళగొంతుల రహించెడుకూఁతల కుచ్చ మూన్చనై,
పెల్లగుధార ల౯లతలఁ బేర్చిననల్లనిపల్లవౌఘ మై,
త్రుళ్ళువిదూరజామలసురోచులయద్దవుగౌపె నౌచు వ
ర్తిల్లును నల్లమబ్బు, రతిఁ ద్రెళ్ళినచోళలకుంతల[6]స్పృశ౯. 222

తే. గీ. సకలలోకరమాపతి సతికి నిట్లు
ప్రకృతిసరసవచోవిజృంభణము మెఱయఁ
దల లతాంతాస్త్రనానల నిలిపికొనుచు
జలదశోభను వర్ణించె క్ష్మావరుండు. 223

చ. [7]దానఁగులఁ గొట్టుగట్టుసయిదో డగువేల్పులమిన్న! రక్కసుల్
వెనఁ గొలువంగ నిక్కుచుఁ గవించుచుఁ బట్టినిఁ బట్టి గిట్టఁగా
విసవిస నిక్కల౯ గుడిపి [8]వేటిఁడి యై కదుఁ గొట్టఁ జేయుర
క్కసియెకిమొని గోళ్ళ నటక౯ గను[9]మానిసిసింగ! దేవరా! 224

1. కరములం దుంచఁ బడిన. 2. మెఱుపు. 3. మేఘము. 4. చెఱసాలలు. 5. కప్పులు. 6. స్పర్శము. 7. శ్రీవేంకటేశ్వరస్వామి. 8. అవివేకి. 9. నరసింహస్వామి.

ఇది శ్రీత్రిభువనమల్లదేవవిద్యాపతి-కాశ్మీరక
భట్టబిల్హణ మహాకవివిరచితవిక్రమాంకదేవచరిత
మహాకావ్యంబునకు శ్రీవేంకటేశ్వర
శ్రీనరసింహదేవపాదపద్మాఽరాధన
సమాసాదితకవితావైశారద్య
'ఆంధ్రబిల్హణ'బిరుదాంచిత
లక్ష్మణ-విశ్వనాథ
కవిసోదరాంధ్రీకృత
మహాప్రబంధంబునందుఁ
బంచమాశ్వాసము
సమాప్తము

—o—

# విక్రమాంకదేవచరితము

## షష్ఠాశ్వాసము

క. శ్రీరమణ! వేంకటేశా!
వీరనృసింహేశ! వేదవేద్య! సురేశా!
సూరివినుతపదపద్మా!
భూరిగుణా! దేవదేవ! బుధజనవంద్యా! 1

తే. గీ. [1]పలితకుంతలములు నాఁగ వఱలుపొందు
రాంబుదంబులచే నంబుదాఽగమంబు
ముదిమిఁ గన విక్రమాంకునిఁ గదిసి యొంటి
నున్నెడల నాప్తుఁ డొకఁ డిట్లు విన్నవించె. 2

క. దొరలు స్వకార్యము వదలుచుఁ
బరితోషము స్వేచ్ఛయంద పడయుదురు; ధరా
వర! నాపల్కెడునది ని
ష్ఠురమే యైనను క్షమింపఁ జూడుము కృపమై. 3

క. పెదదారిని మంత్రస్థితి
యదరినచో నది విషంబ యయి చెడు సేయున్;
గడువాత్సల్యము సోదరు
నెడఁ గలుగుచు నీతిమార్గ మేల వదలఁగన్. 4

తే. గీ. తమ్మునభ్యుదయంబుఁ జిత్తమునఁ దలఁచి
సంగరంబున నోడించి చేంగి (వేంగి) నాథు
వాని[2]వనవాసమును దమ్మువశముఁ జేసి
పంపితి; వతండు నీతికి బాహ్యుఁ డయ్యె. 5

1. నరసిన. 2. ఒకరాజ్యఖండము.

ఆ. వె. న్యాయపథము వీడి యమితధనముఁ గూర్చి
శంక లేక యతఁడు క్ష్మాతలంబు
నెల్ల [1]నుద్విహారమృగముగ నెనయించె
సకలలోకపీడ సలుపఁ దొడరి. 6

సీ. తమకరవేష్టితదంతపృష్ఠము లాత్మ
విభుజయార్జితరమాపీఠములుగఁ,
దమకర్ణశీతగంధవహోచ్చలద్దాన
జలములు స్వాపవిష్ఠలనములుగఁ,
దమదానకర్దమకమలగర్భప్రతి
బింబితరవి రమాబిసరుహముగఁ,
దమదంతములు గిరితటశిలాఘట్టన
నరివీరజయతైక్ష్ణ్య మందునవిగఁ,

తే. గీ. నదరుమత్తేభముల నసంఖ్యాకములను
గడిఁదివాత్సల్యమునఁ దమ్ముఁ బడయఁ జేసి;
తది గణింపక తద్బలోద్ధతియ యూని
యతఁడు తలఁచెను బాపకార్యం బొనర్ప. 7

క. బరువడిఁ దాఁ గొనె నక్రమ
సరణుల వశ్యముగ సకలశబరచయము [2]శా
ర్వరతిమిర మసురులన్ వలె;
దురితాత్ములతోన కలియుదురు దురితాత్మల్, 8

ఉ. ద్రావిడభూపప్రాపు [3]నుపదానశతంబులఁ గాంచి నీదుసై
న్యావళి భేదముల్ గొలుప యత్నముఁ దమ్ముఁడు సేయఁ బూను; నీ
కీవిధి వింతఁ గొల్పుకథ లెన్ని వచించిన నేమి; తత్త్వముల్
నే వినిపింతుఁ; గృష్ణతటి ని న్నెదురున్ గతిచిద్దినంబులన్. 9

1. లేస్సవిహరించకుండునట్లు (సాధుజనాశ్రయము కాకుండ అని ధ్వని).
2. రాత్రులయందలిచీఁకట్లు. 3. కానుకలు.



క. అని చతురమిత్రుఁ డాడిన
విని శారదశశియశుండు వేగిరపడ కే
మనఁ దయ్యె భూధవుఁడు; భూ
మిని ధీరులు వేగపాటు మేకొన రెపుడున్. 10

తే. గీ. 'చపల సిరి యగు; దాన వంచనఁ గనంగ
నేల ! విపరీతబుద్ధి నీ కేల ! వలదు
వత్స !' యని మాటికిఁ దలంచె స్వాంతమందుఁ
బ్రకృతివిమలాంతరంగుఁ డాపార్థివుండు. 11

క. సహసాధర్మహతున్ దు
స్సహశితశల్యసరణి స్వాంతమునం దేన్
వహియించితి నగ్రజు; [1]నను
జహతుం దొనరించుహాని సైరింతు నెటుల్ ? 12

మ. తపియించెన్ జిర మిట్లిలాపతి యనంతం బైనచింతన్ దురం
తపరీతాపపరీతుఁ డై; 'విధివశధ్వస్తాత్మవిజ్ఞానకుల్
కృపకుం బాత్రులె కాని క్రోధకలుషాక్షేపార్హులే ?' యంచుఁ జా
రపరామర్శిత[2]వృత్తుఁ డై పలికెఁ గర్తవ్యంబుఁ జింతించుచున్. 13

క. కలహకుతూహలమున సిరి
[3]కలహమునిన్ మించి తిరుగఁ గనవో ! యనుజా !
కలితదురధ్వాధ్వగ యగుఁ;
దలఁచితి వెట్లీయకార్యతాత్పర్యంబున్ ? 14

ఉ. ఎన్నియొ భూషణంబులు మఱెన్నియొ మత్తగజేంద్రయూథముల్,
విన్నను వొప్పు నిచ్చితిని బృథ్వీధవాహ్వయ మొండు దక్కఁ; నే
మున్నది లోటు ? దుర్ణయము నూనఁగ నేల ! మహార్తి మాన్ప నే
తెన్ను గనన్; జలుక్యకులదేవత ! తమ్మువినీతి మాన్పుమా ! 15

1. దుష్టుఁ డగుతమ్ముఁడు. 2. సమాచారము గలవాఁ డై 3. నారదముని.

క. అనుజన కీదృశనీతుల
ననిపియు నక్రమమునుండి యతని మఱల్పన్
గనఁ జాలఁ డయ్యె నరపతి;
గనునే భంగంబు విధివికారం బెపుడున్. 16

శరదృతువు

శా. అంతన్ దోఁచెను యామినీరమణసద్యశ్శ్రీప్రసాదక్రియాఽ
త్యంతప్రాభవశారదాఽగమము నీలాంభోదసంతానసం
క్రాంతశ్యామలిమక్షమావలయదుగ్ధక్షాళనప్రక్రమో
ద్దాంతస్వైరవిహారధీర మగుచున్ దర్పించి యింతింతగన్. 17

మ. పథికస్త్రీతపవైద్యుతాగ్ని శమియింపన్ మానినీబాష్పసం
గ్రథనీలాంబుదధూమసంతతియు విశ్రాంతిం గనెన్; శాంతత
త్పృథువైశ్వానరభస్మరేణుభరముల్ పేరన్ సితం బయ్యె నాన్
బ్రథితాభ్రంబునఁ బాండురాభ్రములు వైరళ్యస్థితిన్ దోఁచెడిన్. 18

క. [1]హరినీలరసముఁ గుంచెల
నెరపినటుల నలుపు దట్టి నింగిబయలు [2]కం
ధరజలసిక్తం బై కడు
వఱలున్ శాద్వలిత మైనవడువు రహింపన్. 19

క. 'గురుఖేదకారణ మవాం
తరతటినీసంగమంబు తలఁగె జలధి' కం
చురుముదమును గనెనో నాన్
సరవి మహానిమ్నగలు ప్రసన్నము లయ్యెన్. 20

క. జలదము తటిదుష్ణంబున
బలజహితున్ గలఁచె నాఁగ [3]శరద నతండున్
జ్వలదంశుప్రసరణములఁ
గలఁచు ననఁగ వడఁ గదించి ఖరకరతఁ దగున్. 21

1. ఇంద్రనీలమణిద్రవము. 2. జలధరము. 3. శరదృతువునందు.



తే. గీ. శాలిగోప్త్రులు పండినచేలనడుమ
నుండి పాటలకరముల నూన్చి నూత్న
పద్మగతకీరముల నదల్పంగ లేర
కరము లబ్జము లని యవి కదలఁ బోమి. 22

శా. శంపాదీపసముత్థకజ్జలరజస్సాంద్రాఽచితం బైనటుల్
[1]శంపావత్పథ[2]కర్పరంబు నిగిడెన్ శ్యామంబుగా మించుచున్;
[3]శంపావంత ముదన్వదంబుయుతిఁ గొన్నన్ముక్తలన్ రాల్చె నాన్
సోం పై కన్పడెఁ దెల్లకల్వలరుచిన్ స్రుక్కించురిక్కల్ నిశన్.

ఉ. శారదలక్ష్మి తత్క్షణలసన్నవకైరవలోచనాఽఢ్య యై
[4]కైరవబంధుమండలముఖంబు వినీలపయోదమాలికాఽఽ
కారనిచోళమాల దొలఁగన్ గడు వెల్లనికాంతితోడ నొ
ప్పారుచు నున్నవిభ్రమవియన్ముకురంబునఁ గాంచె నాఁ దగెన్. 24

క. ఎండ గలఁచెఁ బగళుల; రే
యెండ జనంబునకు రేల నెలమిఁ గదించెన్;
బండసుధాంశులు నిజగుణ
పొందితి వెలయించి రిట్లు స్పర్ధమెయి ననన్. 25

తే. గీ. ప్రబల మగుచందనపుఁబూఁతవలనఁగూడఁ
గనరు సంతృప్తి నీశరత్కాలమందు
బడలు దొలఁచెడునెలవెల్గునెడల సంజ
నిజగృహాంగణముల హాయి నెఱయుజనులు. 26

క. నేత్రములకు విందు లగుచు,
క్షేత్రముల సితేక్షులతలు చెలఁగెఁ గుముదినీ
మిత్రామృతభరమును విడి
ధాత్రికి దిగుస్ఫటికదండధవళాంశు లనన్. 27

1. నభోమార్గము. 2. కాప్పెర. 3. మేఘము. 4. చంద్రుడు అనెడుముఖము.

క. సురపతివిలు గని నెమ్మలు
[1]దరవశమునఁ గూయు నిజము; తద్విధి గాదే
నరుదుగ నది [2]మఱుఁగుడు నం
బరమున వదనములు వ్రాల్చి మౌనముఁ గనునే. 28

ఉ. క్షోదితమౌక్తికవ్రజరజోభరపాండురచంద్రికల్ దివిన్
ద్రోదిగఁ బర్వి యొప్పెఁ జలముక్తిబంధవిముక్తచంద్రమున్
సాఽదృతి చూచుకోర్కినిఁ బయోంబుధి పొంగుచు వచ్చె నాఁగఁ; బు
త్రాఽదులబంధముక్తి నరయన్ జనకుల్ సనురెంచ కుందురే! 29

క. చిరముగ జలముల మునుఁగుట
సరసిజినుల జడిమ గలుగ జలజహితుఁడు దాఁ
ద్వర నది గెడపఁ గడఁగె ననఁ
గరములవడ నపుడు వఱపెఁ గడురభసమునన్. 30

## ప్రకారాంతరానువాదము

క. చిరనీరమజ్జనంబున
సరసిజినీపాళి నెనఁగు[3]జాడ్య ముడుప నాన్
సరసిజినీమిత్రుఁడు దాఁ
బఱఁగించెన్ మిగుల నాతపంబు సరసులన్. 31

చ. అవమతి సేసి [4]మానసము హంసలు క్రౌంచనగంబుఁ దూఱి భా
ర్గవదృఢలక్ష్యభేదవివరంబున వెల్వడెఁ దద్యశం బనన్;
ధవులు కలంగ సారె, నుపనాథసమాగమహృష్టపాంసులల్
నవ[5]ఘుసృణాఽఢ్యశారదదినవ్రజ మెంచిరి సౌఖ్యదంబుగన్. 32

## చంద్రదూషణము

క. ఘనహిమకరశైత్యంబును
గనునీ వల మేనమృగముఁ గలిగి శిఖరిభి
ద్ధనువుగుఱి వయ్యుఁ బాఱవు.
ఘనతటిదుష్ణంబునకును గరఁగవు చంద్రా! 33

1. భయము. 2. చాటు కాఁగానే. 3. చలువ. 4. మానససరస్సు.
5. కుంకుమపూవు.



క. [1]ఘనపంకపతనపంకిల
తను గౌకౌముది కెవఁడు [2]దొలఁచెఁ? దగఁ గతిను దెవం
డెనయఁడు భయము? వియోగాం
గనలన్ బాధించుపాతకంబున్ గనియున్. 34

క. మదమేల! సతము సుఖములు
పొదలునె! సంపదలు సహజముగ భంగురముల్;
కదియుచు నేఁ డెల్లి విధుం
దుదుఁ డామలకమ్ముగా నిన్ గలశించున్. 35

క. అనయము హృదయము మలినము;
కనదు ప్రసన్నతను నిమిషకాలం బేన్; గా
వున ఖల! నీ వఖిలజగ
జ్జనతాపికి హితుఁడ వైతి స్మరనరపతికిన్. 36

క. ఈరీతిగ మారశరాఽ
సారోద్దీపితవియోగసారసనయనల్
నీరేజారిన్ దూఱిరి
స్ఫారజ్యోత్స్నాస్నపితభువనతతివలయున్. 37

క. స్మరకరదీపిక లనఁ దగు
శరదిందుకరంబు లెల్లజగతి నిగిడినన్
నరపతి గనఁడు ప్రసన్నతఁ
జిర [3]మవరజదుశ్చరిత్రచింతాపరుఁ డై. 38

చ. అతనియకీర్తివార్త హృదయంబు మలీమస మై చనం బ్రసా
దితకుముదాఽప్త [4]శారదయుఁ దెల్వని గూర్పద; యట్టు లయ్యు రా
జతనియెడన్ గృపావశత నర్మిలి రాజ్యము నీఁ గనెన్ బ్రసా
దితహృదయుల్ యశోఽర్థులు మదిన్ శ్రమియింతురె! శ్రీల నిచ్చుచోన్.

1. మేఘ మనుపంకమునఁ బడుటచేఁ బంకముఁ గలిగి యుండుటను. 2. కడి
గెను. 3. తమ్ముఁడు. 4. శరదృతువు. ('ప్రజ్ఞాదిభ్యశ్చ' అను సూత్రము
చేత స్వార్థమునందు అణ్ప్రత్యయము—తద్ధితము).

ఉ. 'అంపితి సాంత్వనోక్తులఁ గులాంతకుఁ డై కుపథానువర్తి యై
యింపుగ నొక్కఁ డైనఁ గొనఁ డెట్టుల వీనికఠోరవృత్తి మా
న్పింపుదు' నం చఖర్వకృప వేమఱుఁ జింతిలుచున్నఁ జుట్టి నా
ప్పిరప నతండు కృష్ణదరిఁ బేర్చె భుజాయుగవీర్యదృప్తుఁ డై. 40

తే. గీ. నరవరు విడిచి యనుజసేనాముఖంబు
నాశ్రయించిరి బహుమండలాధిపతులు;
మతివిపర్యయ మొఁగద మానవులకుఁ
దలఁచుఁ బరిభవకాలంబు దరిసి యుండ. 41

## యుద్ధగజాశ్వసైన్యము

చ. కటతటలోలదానఝరగంధగజేంద్రఘటల్ సమిత్స్ఫుర
చ్చటులహరుల్ గలట్టినిజసైన్యముఁ గన్గొని 'యగ్రజన్ముతోఁ
బటుతర మైనపోరు సలుపంగను జాలఁడు' నంచు నెంచె ను
త్కటవిజయోత్సుకుం డగుచుఁ దమ్ముఁడు రాజ్యసమార్జనేచ్ఛమై. 42

క. సేనాపరికరపీఠన్
[1]దానవమున్ గృష్ణవేణి దాల్చెన్ గడు న
ద్దానన్ నీరధిఁ జేరన్
గానక కోపమునఁ బోలెఁ గలుషతఁ జూపెన్. 43

క. ఒక్కెడ దాహము, లుంతన
మొక్కెడ, మఱి బంధనంబు నొక్కయెడన్ దా
నుక్కఁ జెడి [2]జన్నిచిన్నెగ
నక్కుటిలుఁడు చెడుగుపనుల నలయించెఁ బ్రజన్. 44

ఆ. వే. [3]సత్త్వరాసు లయినజలరాసు లేనియు
స్పర్ధ సేయ రానిసత్త్వరాశి
యయిననృవరుఁ డనుజునయపరంపరఁ
గాంచి చిరముగా క్షమించె మిగుల. 45

1. కృశత్వము, 2. సన్నిపాత రోగచిహ్నము. 3. జంతువులు.



క. ఇల నెది యకృత్య మయి తా
నలరదు నశ్రీకటాక్షుఁ డగుజడమతికిన్ ?
బలికెను దమ్ముఁడు దుర్వా
క్కుల నగ్రజునగ్రమందుఁ గొంకక మిగులన్. 46

ఉ. తమ్మనిదుర్నయాళి వసుధావరుఁ డోర్చెఁ జిరమ్ము; వార్నిధా
నమ్ములుగూడ స్పర్ధను గనం జన వట్టిబలాతిరేకులన్;
సమ్ముఖమం దతండు కువచస్సులఁ గొంకక యన్న నాడు; భా
గ్యమ్ము ద్రొలంగ నిమ్మెయి జడాత్ములు సేయనిచేఁత లుండునే!

క. పలుకంగ నేల! కడు భూ
తిలకుఁడు త్వర మించి తమ్మదిక్కై చనునం
తలు బలిసెఁ దమ్మునకుఁ జా
పల; మిల నయదూరుఁ డిటుల వందురుఁ గాదే! 48

మ. హరిదంతద్విపకర్ణశంఖకుహరవ్యాపిప్రతిధ్వానపూ
ర్ణరవం బై నరనాథదుందుభి శుభప్రారంభ మై యొప్పెఁ; బై
నరిదిన్ దత్పటహోరవంబు మును దీర్ఘాలంబిదిగ్దంతిశే
ఖరశుండాపరిపూర్తి నోటు వడెఁ దత్కర్ణాళి భేదింపఁగన్. 49

క. నరవరుద్విరదంబులసమ
భరమున లోఁతుగను భూమిభాగము క్రుంగన్
చిరముగ జలధరరవమే
దురదుందుభిరవము మింటఁ దోఁచె నిజముగన్. 50

క. అనృపతిబలక్షుణ్ణం
బై నెఱి రేణు[1]తలినంబు నయ్యె గజఘటా
దానార్ద్ర మగుచు [2]గురుతను
బూనెన్ గడు భూమి శేషభోగిఫణములన్. 51

క. జలధులు స్థలీకృతములు గఁ
గలిగెన్ ద్వర మనకుఁ గౌతుకము, నింప నవన్
జల, మల రాజాశ్వంబులు
గొలిపెన్ రేణువు దిగంతగోచరతఁ దగన్. 52

1. తెలిక. 2. బరువు.

తే. గీ. రాజమార్తాండుమత్తవారణగణంబు
వీఁపునఁ గప్పుధూళిచే వెలయుచుండె
నవని నాక్కడ దిగ వీడి యపుడ లేచి
వచ్చుదిగ్దంతినికరంబువడువు దోఁప. 53

క. రవితురగస్పర్ధనొ నా
నవనీశ్వరువాజిరాజి యంటదు పుడమిన్;
మిపుల శ్రమ మయ్యెఁ [1]జక్ష
శ్రవఃపతికిఁ గరుల నిలుచుదక్కయ మోయన్. 54

క. నరపతిమదకరికరశీ
కరభరమున నింగి గాంచఁగా నయ్యె రజః
పరిరుద్ధపథుని సూర్యుని
యరదమునఁ బొడి యగునుడుగణాళి నిగిడె నాన్. 55

క. ఉన్నతకరులకుఁ జేరువ
నున్నజగచ్ఛత్త్రి వొప్పె నున్మదగజసం
గోన్నతభయమును దనహరు
లెన్నఁడుఁ గనకుండఁ జేయ నెసఁగెనొ నాఁగన్. 56

ఉ. వారణయూథపృష్ఠముల వర్తిలుహాటకరత్న[2]శారు లొ
ప్పారె దివిన్ రజం బలమ నానత మైనవిమానపంక్తి నాన్;
ధారణిఁ జేరుధూళి దగె దంతికటస్థల[3]చీనపిష్టముల్
దారిగ, సూర్యవాజులు మతంగజభీతి ననూరుఁ ద్రోసె నాన్. 57

క. కినుక నృపుఁడు కలఁగియు సాం
త్వనమునకు మనంబునందుఁ ద్వరితుం డయ్యెన్;
బొనరనిపని సిరికై చే
య నెసఁగెదరు [4]వంశపాంసనాధిపులె [5]పరుల్. 58

1. సర్పరాజు. (ఆదిశేషుఁడు) 2. యుద్ధగజములయంబారి. 3. ఏనుఁగులకుంభస్థలములపై నుంచెడు సిందూరము (సీసపు-లేక-తగరపుపొడి). 4. వంశదూషకరాజులు. 5. ఇతరులు (ఈరాజు కాఁడని భావము).



క. నదిదరి దరియఁగ నట నటఁ
గద[1]నాఽయతవైరిభటనికాయము దారిన్
గదియుచుఁ గుంతలనాథున
కుదయం బయి పెంపుఁ గాంచ నానరిఁచిరి క్రుధన్. 59

శా. శ్రీరాజన్యుఁడు శోణితాఽక్తతటినీక్రీడాఽభికాంక్షిద్విపం
బారోహించి గభీరతన్ బ్రతిపథవ్యావర్తితాంభోభర
స్ఫారభ్రామ్యదశేషవీరవరమస్త్రవ్యూహసంకీర్ణ మౌ
తీరం బొప్పఁగఁ జేసి, కృష్ణతటినీదేశంబుఁ జేరన్ జనెన్. 60

చ. అవనివిభుం డుపాయపరుఁ డత్తటినీతటమందె నిల్చి సా
మవిధినె తమ్మునిన్ గుటిలమార్గవిదూరు నొనర్పఁ బూనెఁ గా
ని విని గ్రహింపఁ డాతఁ డవినీతుఁడు సాంత్వన మొక్కఁ డేని; భా
గ్యవిభవ మూడుచోఁ గడు నిరంకుశ మౌఁ గద బుద్ధి పాపికిన్. 61

## యుద్ధయాత్ర

ఉ. బాహుపరాక్రమద్విరదభైరవడిండిమరావ మాహవో
త్సాహ[2]భుజంగభుక్సలిలదం బల కుంతలభూమిపాలసై
న్యాఽహతరౌద్రదుందుభిజయోద్యతనాద మశేషరోదసీ
గాహన మై చెలంగె రిపుకాండము లుక్కఱి దిక్కులం జనన్. 62

క. వీరసతులు విజయోత్కట
దీరిరి [3]చదుకంబునందు దిటవుగ గుమి యై,
యారీతి నున్నవారిన్
వీరులు నృపమార్గమెదుట వేడుకఁ జూడన్. 63

తే. గీ. [4]ప్రబలసుభటవిదూరభూభాగమెల్ల
జన్యదుందుభిమేఘగర్జనముచేత
నయ్యె నిదుళాంతరవినిర్గతాసివల్లి
నవమణిగణాంకురోత్పాదనం బనంగ. 64

1. సిద్ధమైన. 2. నెమిలి. 3. చతుష్పథము. 4. విదూరభూమియందు మేఘగర్జనముచేత వైడూర్యమణులు పుట్టు నని కవిసమయము.

తే. గీ. కలహసంభ్రమలోలభంగు లగుచెలుల
కబరులందును గౌషేయకములయందుఁ
బడియె నద్భుతరాగనిర్భరము సంగ
రోద్భటభటాఽవళీనయనోచ్చయంబు. 65

తే. గీ. ఉక్కు మిగిలినసుభటాఽళి యెక్కె [1]సారి
పంజరంబుల నుండ ద్వీపంబు లొప్పె
వెలుపల మణీ[2]పరిష్కృతుల్ పేర్చినట్టి
[3]యవసథంబుల నందమైనట్టి వనఁగ. 66

క. తరుణీహస్తార్పిత[4]నా
గరఖండోద్భూతవీటికను గొఱుకుచు వి
స్ఫురదుత్సాహమున భటుఁడు
కరికరటదళనము తృణమ [5]కా భావించెన్. 67

క. పరరాజన్యశిరశ్శ్రే
ఖరరత్నాంకూరకంటకస్థలిఁ దిరుగన్
గరము సమర్థము లయ్యెన్
దురంగములు [6]లోహబంధదుర్దమఖురతన్. 68

మ. రథసాఽయోధనసక్తమత్తకరిసంరంభోర్మికాస్ఫారమున్
నభఆభోగతరంగచంక్రమణరంగద్వాహసాహస్రమున్
స్వభుజాటోపసముత్సుకోద్భటబహుస్ఫాయద్భటోత్సేధ మ
ద్విభయుద్ధోద్ధతసైన్య మొప్పె క్షుభితాబ్ధిం బోలి దుర్దాంత మై. 69

క. గజములు నృపమందిరమున
నిజకరశీకరము లంపి నిబిడముగాఁ ద
ద్విజయోత్సుకనృపహృద్గత
విజిగీషాప్రసవమాల వెలయఁగఁ దడిపెన్. 70

1. అంబారి. 2. భూషణములు. 3. ఇండ్లు. 4. నాగరఖండదేశోత్పన్న కర్పూరతాంబూలము. 5. అని. 6. అశ్వములపాదములకుఁ గొట్టఁబడు నినుపనాడ్లు:



సీ. జయరమాపరిరంభశంసిభుజంబునఁ
గమలమాలగ స్వద్భుక్సరణి నిగుడ,
వలపున భటలక్ష్మిఁ బులకకంటకములఁ
గనక నాఁ బొదివి తాఁ గౌఁగిలింప,
రిపురాజపంకజగ్లపనహిమం బనఁ
[1]జంద్రహాసము నిజాఽస్యమునఁ దోఁప,
హరి యరివధదీక్ష ననుజమధ్యగుఁ డనాఁ
దనరూపు కటకరత్నయుగిఁ దోఁపఁ,

తే. గీ. జుట్టు పటికంపుగిరికంచెపట్టుఁ బోలు
గంధపుంబూఁత వెలిమేను విందుఁ గొలుప,
ముత్తెములసేన శశిఁ బోలుభూవిభుండు
[2]చదుకమిలు వీడి మత్తగజంబుసరణి. 71

క. వెడలి [3]ప్రతిగ్రాహితబలి
నాదయం డిభపృష్ఠ మెక్కె నూర్జితజవ మే
ర్పడ మంగళతూర్యధ్వను
లడర నుదయశిఖర మెక్కునర్యముఁడు వలెన్. 72

సీ. స్వోపరిస్థితనృపప్రాపితశ్రీదృశా
యుతి [4]హరిగతగజోన్నతి హసించె;
నిజకరాఽస్ఫాలన[5]నేదిష్ఠఘనరణ
శిథిలనృపస్థితి స్థిరముపఱచె;
నాత్మమదాంబుపూర్ణాంఘ్రిముద్ర [6]నృపుని
సిరివడ విడ నిద్ధ సరసిఁ బోలె;
దమ[7]దానపానమత్తసుమలిణ్ణినదముల్
రిపుభేరిరుతి నాఁపురీతిఁ దనరె;

1. చంద్రుఁడు – కర్పూరము. 2. చతుష్పథమున నున్నయిల్లు. 3. కైకొనఁ జేయఁబడిన పూజలు గలది. 4. ఇంద్రుఁడు. 5. సమీపమునం దున్న. 6. రాజలక్ష్మిశాపము పోవుటకు. 7. మదజలము.

తే. గీ. నట్టిభద్రేభమందు వీరావతార
మూర్తి యుత్సాహమానసస్ఫూర్తిఁ దనరి
జగతి నద్భుతసమధికసాహసుండు
పుడమిపతి యంత నవ్వుచు వెడలె వేగ. 73

మ. విజయశ్రీపరిరంభణోత్సుకతఁ దా వేడ్కన్ సమిద్రంగమున్
భజియించెన్ బ్రియసుందరీకలితవేశ్మంబున్ బలెన్; మీఁదటన్
సజవప్రాభవతీవ్రవిక్రమత నుత్సాహించి యెంతేఁ బథం
బజితుం డై క్రమియించి డిండిమరవోదారారిసేనన్ గనెన్. 74

## గ జ సే న

సీ. రదనాంశుకౌముది, మదజశైవలభృంగ
గణతిమిరచ్ఛటల్ గదపు ననఁగ;
మదనిద్రఁ గన్మోడ్చి మదజపంకస్థల
రీతి నా మెలమెల్ల వెడలు ననఁగఁ;
గాసారజలకేళిఁ గైకొని జలజాళి
మించులక్ష్మిని ధరియించు ననఁగ;
[1]వప్రకేళిశిరఃపతితఝురవ్రణ
వారి [2]దుర్దిన [3]మదప్రదము లన;

తే. గీ. నొప్పుమత్తేభములు శశాంకోపమంబు
లైనశ్రుతిభూషశంఖముల్ పూని యుండ
రాజహంసాళిసేవావిరాజి యైన
[4]దానతటినీతటం బనఁ దద్ద నొప్పె. 75

శా. పాదం బొక్కటి యెత్తి, యేభుజబలప్రాజ్యారిపోన్మత్తమం
దూఁదంగాఁ దగు నంచు నెంచె ననఁగా నొప్పెన్ ద్రిపాదస్థితిన్
వేదండంబులు, దానలుబ్ధమలిజిన్నిస్వానవిస్ఫూర్తి, ల
క్ష్మీ[5]దౌవారికయామికంబు లనఁగా మించెన్ సహస్రంబు లై. 76

1. ఏనుఁగులు దంతములతో గిరిసానువులను గోరాడెడియాట. 2. మేఘచ్ఛన్నదినము. 3. మదజలము. 4. మదజలనదీతీరము. 5. విజయశ్రీద్వారమునఁ బహరా కాచునవి.



## అశ్వసేన

సీ. అబ్ధిరుద్ధావని యడ్డు జవం బని
కోపానఁ గశ్యముల్ గొఱకు ననఁగ;
మే మూఁతఁ గొనఁ జూచి [1]మిత్రాశ్వముల్ నవ్వ
ననుసీర్ష్య నా వీడు నవని ననఁగ;
వైదూర్యవియదటద్భానుసప్తులఁ గని
మిన్నొంతిఁ బచ్చిక మెలఁగు ననఁగ;
ఫేనలీల ముఖాన వెలసి పాల్కడలి [2]స్వ
తనుజాశ్వ మని ముద్దు గొను ననంగఁ;

తే. గీ. దగుచు ఖురచయఘట్టిత[3]దస్యుకుట్టి
మస్ఫుటద్వహ్నికణముల [4]ప్రమందు చుండు
చటులపదముల నెటను నశ్వములసేన
యధ్వమున ఘర్షణము వీడి యరుగ నొప్పె. 77

క. చేరువ ఘన[5]డంబరమున
శౌరధనుర్భ్రమను గొలుపుచటులహయంబుల్
తోరపుఁబిడుగు వడుభయముఁ
గూరుచు జగములకు నాఁగఁ గులుకుచు నొప్పెన్. 78

## సుభటసేన

తే. గీ. నృపభటుల్ దమశిరములు హృదయరత్న
భూషణప్రతిబింబితస్ఫూర్తి మెఱయఁ
గరము మరణంబునందు [6]నిర్గహను లగుచుఁ
దల లెద ధరించి రనఁ దోఁచె ధైర్య మొప్ప. 79

సీ. సహజోష్మశుష్కజర్జరచందనము హృది
సేనావధజశల్యసితరజ మనఁ,
బ్రబలదోర్యుగతీర్ణపటురణార్ణవ మయి
పృథుఫేనసమయశశ్శ్వేత మనఁగ,

1. సూర్యునిగుఱ్ఱములు. 2. తనకొడుకగు నుచ్చైశ్శ్రవము. 3. శత్రువుం. 4. నొచ్చు. 5. విజృంభణము. 6. క్లేశము లేనివారు.

సమదారిమర్దనశస్త్రవ్రణస్వాంగ
రంధ్రముల్ సేరె వీరరస మనఁగఁ,
తత[1]తమిస్రాఽళి నాఁ [2]దావాగ్నిదంభఘ
ర్మాహముల్ నా [3]నజయ్యం బనంగ,
తే. గీ. నొప్పి యతిగతకకుబంత[4]రుద్భటంబు
నధికభైరవ మౌసుభటాఽళిఁ గాంచి
సంభ్రమంబున భయ మందె సర్వసేన
కుంతలనృకాంతుఁ దలరాఱెఁ గోర్కి మీఱ. 80

యుద్ధము

క. వీరరసాంబుధి సుభటులు
శూరులు విజయామృతంబుఁ [5]జూరఁ గొనుటకై
ప్రారంభించిరి తెగి [6]ప్రవి
దారణ మిరుగడలఁ బ్రళయదారుణభంగిన్. 81

ఉ. రెండుబలంబులున్ సమరవృక్షము నెక్కి స్వబాహువీర్య మన్
దండము నూని దోలన మొనర్పఁగఁ దత్తరుసంగతంబు లౌ
పండులు తండతండములు వ్రాలె ననం దగె వీరకోటిదో
ర్దండగతాసికృత్తములు ధాత్రికి వ్రాలుశిరోనికాయముల్. 82

క. పగతుఁ బరిమార్చి [7]వల్గితుఁ
డగువీరునియెదను స్వాతులందు సమముగా
విగళితరిపుఖడ్గము ర
క్తగుణచ్యుత సొచ్చె వేల్పుగణము వొగడఁగన్. 83

తే. గీ. శస్త్రపాతిత మైనట్టిశత్రుశిరము
కడు వశము దప్పి యసియాడఁగాఁ [8]బృషత్క
విద్ధ మగుతచ్ఛిరంబున విజయసుధను
గాంచువేడుక సుభటుండు గాంచె ముదము. 84

1. చీఁకట్లసమూహము. 2. దావాగ్నివిజృంభణము గలగ్రీష్మదినములు.
3. ఓడింపశక్యము గానిది. 4. అధికము. 5. పూర్తిగా గ్రహించుటకై.
6. యుద్ధము. 7. పాఱుచున్నవాఁడు. 8. బాణము.



క. మణిమయముకుటముల [1]శకున
గణములు ఘట్టనము సల్ప క్షతచంచువు లై
ప్రణయము సహర్షముగఁ గొన
వణు వైనను నిక్క మైన యామిషమందున్. 85

ఉ. నెత్తురువెల్లి లోఁ దగుచు నిల్చి భటాధ్వము నడ్డగింపఁగా
నత్తఱి నొండొరుల్ గనియు నాహవముం జలుపంగఁ జాల రై;
రుత్తమశీలగానమున, నొప్పుస్మితాక్షుల, వైర మూహకున్
హత్తదు; వీరఖడ్గములయందె [2]కఠిందిమి గాన నయ్యెడిన్. 86

సీ. మానులు తమతలల్ మహి డొల్ల నరిసేన
మెట్టు నన్[3]రీఢనే మిడుకుచుంద్రు;
భిన్నభటశిరంబు చేర్పఁ గౌతుకమును
శత్రుసారితదృష్టి జరుగ కునికి;
నసిఘట్టజాగ్నికణాఽళి పిశాచికాఽఽ
వళి కామిషము వండ నెలమిఁ గూర్చె;
హృదయస్థశరమూర్ఛ నిభకుంభశయులకు
శ్రుతితాళపవనాల శోష దీఱెఁ;
తే. గీ. గరటికరటగళితమౌక్తికచ్ఛలమున
మహితతారాఽధ్వనిభఖడ్గమండలతతి
యొప్పె [4]వినిమీలితర్క్ష మై యుదయ మెనయు
విజయతిగ్మాంశుఁ దోఁపించు వింత ననఁగ. 87

మ. భటవక్షఃస్థలభేదలంపటనమద్భద్రేభ మొప్పెన్ సమి
త్తటదీవ్యజ్జయలక్ష్మిఁ బైఁ గొనఁగ యత్నం బూనునో నాఁగ; నం
తటఁ జాళుక్యబలంబు సర్వమును ద్విడ్దంతావళీసీకనీ
చటులప్రోద్ధతధావనక్షుభిత మై సాగెన్ సమస్తాఽశలన్. 88

1. పక్షిగణములు. 2. పరుషత్వము. 3. అవమానము. 4. మఱుఁగుపడిన నక్షత్రములు గల దై.

మ. ఒకదృప్తేభము గాని యొక్కతురగంబో కాని కాల్బంట్లలో
నొకఁ డైనన్ బ్రతిపక్షవీరలయవాతోద్ధూతు లై సంచరిం
పక యున్నం గని చెక్కులం బులకలం బాటించి చాళుక్యనం
దకుఁ డంతన్ వెడలెన్ మదోద్ధతకరీంద్రం బెక్కి దుర్దాంతుఁ డై.

తే. గీ. [1]జన్యలీలాబ్జసరసి బిసం బనంగఁ
దగునహితకీర్తికందళిన్ దద్దఁ జీల్చి
చతఁడు కరిమేఘఘటలెల్ల నవనిఁ గూల్చి
చద్భుతంబుగ రాజహంసాఖ్యఁ దనరె. 90

క. క్షతకుంభికుంభముక్తా
తతి మొగ్గలఁ బోలి రాలఁ దగె భూపతి స్వా
హితవీరయశస్సుమతరు
వతనుస్వభుజములఁ గంప మందించె ననన్. 91

చ. రిపుగజకుంభిపాళిఁ బ్రహరించుచు [2]నిర్గహనుండు రాజు దా
నపుడు స్మితాస్యుఁ డయ్యెనుబ్రియాస్తనమండలి లోఁ దలంచుచున్;
ద్విపకటపాతితద్విషదుదీర్ణశరంబుఁ దొలంచె నేన్గవీఁ
పుపయినిఁ గాలఁ దట్టి; సురపుష్పచయంబుల నిండె నంతటన్. 92

ఉ. కుంభిపతాకదండమునకున్ గదియన్ బ్రతివీరకోటి దో
ర్జృంభణ మొప్పఁ బంపినవృద్ధశరావళిఁ జూచి కుంభినీ
జంభభిదుండు [3]విభ్రమసుసంభృతుఁ డై పరితోష మందెఁ దా
దంభము మీఱ నెంచి జయదప్రియకీలకమాలికావళిఁగా. 93

మ. ప్రతిపక్షక్షయదీక్షితుం డయినక్ష్మాపాలాగ్రగణ్యుండు హ
స్తతతిన్ వేయిటఁ దాల్చిన ట్లసిలతన్ జ్యాముక్తనారాచసం
తతిచేఁ దోమరభిండివాలముఖనానాహేతిజాతంబుచే
నతిశీఘ్రం బగుదంతిధావనముచే నాభీలుఁ డయ్యెన్ [4]యుధిన్. 94

1. ఈపద్యమున నుపమానోపమేయముల యభేదరూపకము శ్లిష్ట మగు 'రాజహంస'శబ్దముచేఁ జెప్పఁ బడినది.సమానధర్మబోధకము లగువిశేషణములు మూడింటికిని సాదృశ్యరూపకము. 2. క్లేశము లేనివాఁడు. 3. విలాస 4. ఇది 'భువి-దివి-హృది' యను శబ్దములవలె స్వతంత్రప్రయోగము.



శా. అశ్వానీకిని భూమిపాలుఁడు హతాయత్తాత్ముఁ డై త్రుంప స
ప్తాశ్వాశ్వంబులు నూది [1]దామములు ద్రోయం బూనె భీతిన్ వడిన్;
శశ్వల్లూనగళారిహస్తిపక[2]సంజాతోత్తమాంగంబులన్
విశ్వోర్విన్ నినిచెన్ యశంబు దివి నింపెన్ యౌగపద్యంబుగన్.

ఆ. వె. కొండచఱులనైనఁ బిండి సేయుశరాళి
గాసి నెనసి పగఱకరటిదళము
పఱుగు లిడెను దెసల శరణ మందఁగ దిగ్గ
జేంద్రసమితి నాఁగ నెద లురలఁగ. 96

క. రిపుబాణావళిఘట్టిత
నృపకంకటజాతవహ్నిరేణు లెగయఁ దా
నపరిమితసమరజలనిధి,
విపరీతౌర్వానలములఁ బేర్చె ననఁ దగెన్. 97

వ. అంతఁ బ్రధనపృథివిఁ బృథివీంద్రుండు పృథులజయం బంది విజ
యేందిరావిరహదోదూయమానమానసు లైనవైరులకుఁ గరటికరట
ముక్తాపరాగపాండురత్వంబునఁ దపస్విత నొందించె నన నొప్పి,
ద్విరదపదదళితద్విషదనీకినీకపాలకర్పరంబుల బ్రహ్మాండభాండ
పూరణ[3]క్షమకీర్తి యనఁ జరించుచుఁ, [4]దూపుసోనలఁ జిల్కునబ్బలు
మేటిఁ బగఱ[5]చదుకంబున నొకం డైనఁ గడిందిమగంటిమి మార్కొని
[6]కోల్తలల మాఱాడ కుండె. నివ్వడువున గడియలో మార్తుర
నుక్కడంచినవడిమిజగమేలికయొడలున [7]శిలీముఖపాతంబు వేల్పు
లపూసోనలతోన కలిగె. నిట్లు [8]సమనీకముఖంబున ననేకానీకినీజనా
నూనక్షయం బసహాయుం డై సాహసాంకసర్వంసహానాయకుం 98
డొనర్చి యెవ్వానికి వర్ణనాస్పదంబు గా కుండె?

1. పగ్గములు. 2. సమూహము. 3. సమర్థ మగు. 4. బాణవర్షములు. 5. శత్రుసేనావారము. 6. యుద్ధసన్నాహములలో. 7. తుమ్మెదలు - బాణములు. 8. యుద్ధము.

శా. జన్యక్షోణిఁ గబంధతాండవములన్ జాలన్ భయం బంది రా
జన్యోద్దాంతభుజంబు నందె విజయోచ్చశ్రీ యనన్ మించె; శ
త్రున్యస్తాఽత్మతనుత్రబాణములు సంరోధింప దోర్వ్యాప్తి, రా
జన్యుం డూడ్చెఁ గరాంబుజాతమున భ్రాజల్లీల స్మేరాఽస్యుఁ డై.

శా. శ్రీచాళుక్యకులాంబురాశివిధుఁ డుష్ణీషంబుపై శత్రునా
రాచవ్రాతము లంత భార మొనఁగూడం జేర, నాయోధనో
[1]త్కోచద్రంగతలేందిరాంగనకు మ్రొక్కుల్ గూర్పనై పైపయిన్
దోఁచన్ మీతెడుశీర్షమున్ క్షణము వంచున్ భక్తి నా నొప్పెడిన్.

ఉ. మార్తురరక్తబిందుతతి మానుగ హత్తుబిజాల నొప్పుభూ
భర్త దగెన్ వినాశితవిపక్షకిరీటవిముక్తరత్న[2]వి
స్ఫూర్తి యనన్; దదీయశరముల్ బెడిదంబుగఁ గాఁడ రంగమం
దార్తులు ధావితేభకరటాఽవళినుండియు డొల్లరై రిలన్. 101

తే. గీ. మూర్ఛమిషమునఁ గన్నులు మూయు దేల
నాథ కపటంబు విడుమ! భూనాథుసేన
పరిభవం బందుతరుణంబు దరియ నుండ
నీ కుపేక్షింపఁ దగ దనె నెలఁత ప్రియుని. 102

తే. గీ. పురుషదౌర్లభ్యమున దేవభూమి వీడి
దేవపాంసుల లిటకు నేతెంతు రనుచుఁ
గాముకా! నన్ దిరస్కృతిన్ గనకు మోయి!
యనుచు నొకకాంత పలికెఁ దా ననుఁగుకాని. 103

తే. గీ. శ్వాసమారుత మాఁపునీసరణి దెలిసె
సుభట! సురవారసుందరీచుంబనమునఁ
గ్రొత్తనెత్తావి మోమున నత్తమిల్లె
ననుచుఁ [3]బలవించె నొకయింతి తనదుప్రియుని. 104

1. అశుభనాశక. 2. విస్ఫూర్తి గలవాఁడు. 3. ప్రలాపించెను.



క. నిలువక చపలలు సంపద
లల స్వామిగృహంబునుండి యభిసారిక లై
చలియించె నహ! యధైర్యం
బలమె నిను నాదుభాగ్య మబుకతమునన్. 105

క. సురతరుణీగృహమును నా
దురదృష్టవశానఁ జొరఁగ దొరకొని తేనిన్
బరదుర్లభ మిట రాజాఽ
దరము మఱవఁ దగునె నీకు [1]దర్పకవికృతిన్. 106

క, ఇటు వీరభటవధూటీ
చటులాఽక్రందనసహస్రశత[2]దుర్దిన మం
తట రణభూమిఁ గనుచు భూ
విటుఁ డరులన్ [3]వెన్నుటను విడి క్రమ్మఱిలెన్. 107

[4]అలఁతిఁ జళుక్యుఁ డాహవపయఃపతిపారము నెయ్యి పేర్మి, న
వ్వల విలు డించి తాను విని వ్యాకులశత్రుపలాయనంబు లోఁ
గలఁగెను 'గీర్తి యున్ వదలెఁ గాఁ గృపణున్ మహి వీని' నంచుఁ; బం
చలముల దుష్టులందును [5]నిసర్గమహాఽత్ములు పూనుకోపముల్. 108

క. నరపతి సొచ్చె లలితగత
కరేణుకాన్యస్తక్రమకాంచనపీఠ
స్థిరుఁడు [6]జయధ్వజపురిఁ; గొని
హరి-కరి-శుద్ధాంతసహిత మరిసిరినెల్లన్. 109

ఉ. ఉక్కుభటుల్ వనాంతరమునుండి కులాహితుఁ బట్టి తేఁగ న
య్యక్కృప బాష్పగద్గదవచోఽనుగుఁ డౌచుఁ జళుక్యవంశమం
దెక్కటివీరుఁ డందె గృహశృంగవిలంబిత[7]హారదీధితుల్
చొక్కపుఁగీర్తులన్ దెలుప సొం పగుపట్టణమున్ బ్రియంబునన్.

1. మన్మథ. 2. మబ్బుగప్పినదినము. 3. వెంబడించుట. 4. తేలికగా. 5. స్వభావముచేత గొప్పవారు. 6. విజయపతాకము గలరాజధానిని. 7. ముత్తెములసరములు (నిర్విశేషణ మగు 'హార' పదమునకు ముక్తాహార మని యర్థము. ఇతరత్ర 'రత్నహారము' మణిహారము' అని యుండును).

## హేమంతము

ఉ. కుంకుమగోము కాఁపుదల, [1]కొంచలకున్ స్మరదేశికుండు మిన్
పొంకముమ్రుచ్చు, పూవువిలుభూపతిఁ జేరువజీరుగా, శర
త్సంకలితాఽతపాఽర్తముఖ[2]శార్వరివల్లభవల్లభంబు, పెన్
బింకముతోడుతన్ దుహినవేళ లలిన్ బొడసూపె నంతటన్. 111

క. శరదృతువితీర్ణశోభా
గ్యరమాప్రత్యూహదక్ష మగుహేమంతం
బు [3]రసారమణవరాఽస్యా
వరవదననిషేవణప్రవర్తనఁ గఱచెన్. 112

సీ. ఇనునితేజము మాంద్య మెనసిన దివసవి
స్తారకర్షణముత్సవము నొందెఁ;
జెలులకుఁ [4]బొలయల్క, [5]నెలమిని [6]నెఱిఁ గూర్చి
[7]యాయామవతు లయి యందె వినుతి;
సతతం బనంగసంగతగాత్రముల స్త్రీల
కాశ్లేషకౌతూహలాఽప్తిఁ గూర్చెఁ;
బ్రౌఢిమ సంకోచపాత్రత్వ మెనయించి
దివసాఽళి నొనరించె స్త్రీజితముగఁ;

తే. గీ. గాలవశమున శారదకాలమహిమ
దొలఁగ వలఁగొను[8]హైమనర్తువునయందు
నరుల మించెడుయోషిజ్జనంబుపగిది.
దినవితతిహేల లడఁచి యామినులు ప్రబలె. 113

క. [9]అలకాఽలికదామృగమద
కలితకపోలస్థలాలకములకు దోలా
విలసన మూన్చుచు వీచెన్
లలితగతిన్ రాజతాచలశ్వసనంబుల్. 114

1. క్రౌంచపక్షులకు. 2. చంద్రునకుఁ బ్రియము. 3. రాజస్త్రీలు. 4. ప్రణయకోపమునందు. 5. ప్రసన్నతయందు. 6. పరిపూర్ణత. 7. దైర్ఘ్యము గలవై. 8. హేమంతఋతువు. 9. అలకాపురస్త్రీలు.



మ. స్మరదర్పోష్మనివాసభూము లనుచున్ శంకించె నాఁగన్ దమిన్
[1]దారయం బోక హిమంబు ముజ్జగములందున్ వ్యాపనం బూన న
బ్బుర మౌనమ్మకు నిమ్మ లౌకామలచన్ద్రాంతల్ విజృంభించె న
ద్ధురకేంద్రీకృతచూతసాయకమహోదుర్దాంతదుర్గస్థితిన్. 115

క. వారనితరశద్యుతులన్
దారాఽధ్వక్షేత్రమందు నవ్యాంకూర
స్ఫారహిమానీబీజక
వారరుచిన్ బ్రబలె రిక్కబలగము లంతన్. 116

క. హిమమహీధరమారుతమునఁ
దమమోములు పగులుపాటుఁ దాల్చు ననుచుఁ గుం
కుమపూఁత[2]నిచోళంబుల
సుమకోమలు లుంచి రాస్యసోమశ్రేణిన్. 117

క. క్షేత్రములు [3]పుండ్రపాకప
విత్రము లగుఁ; గరుడువాలుపెరుగు వఱఁగెదున్;
గాత్రములు ఘుసృణచర్చా
పాత్రము లగు [4]హైమనప్రభావ మయారే! 118

ఉ. నారిపుఁ డైనసూర్యునకు నవ్యముదాస్పద మిద్ది యంచు దు
ర్వారరుషన్ వలెన్ వలి కరంబు సరోరుహిణిన్ దహించె నా
సూరుఁడు సూచుచుండఁగనె; చోద్యమ! తేజము గల్గువారలేన్
దారుదు రేమి సేయ విధి దప్పినకాలము మ్రోల నిల్చినన్. 119

క. మారునిఁ బరిపోషించుచు
షారాఽగమ మపుడు స్పర్శసౌభాగ్యం బిం
పారఁగ సామాన్యస్త్రీ
వారావయవములఁ గూడఁ బాటిలఁ జేసెన్. 120

1. అంటంకుండ. 2. గవుసెనలు. 3. నలుపు గలిసినయెఱ్ఱచెఱుకు. 4. హిమసంబంధమైన.

## వేఁట

తే. గీ. ఆవిహారార్హదినముల నృపుఁడు చళుక
వంశభవచక్రవర్తి [1]ద్విపఘ్నగామి
నిజభుజార్జితవిభవనిర్నిద్రుఁ డగుచు
వెలసె మృగయావినోదంబు సలుపఁ గడఁగి. 121

సీ. [2]ఘనవినీలతనుత్రగాత్రుఁ డై ధృతనీల
కువలకంకటు మనోభవునిఁ బోలె;
[3]శ్యామవర్మోపరిహారాన విను దిగు
[4]నబ్దోడుయుతవియదటుని మించె;
హారలంబితయోషిదగ్రదేవీస్థితిఁ
బరిజనయుతలక్ష్మివక్షుఁ దయ్యె;
స్ఫటికోజ్జ్వలోరఃప్రసరహారగతముక్త
లను యశోద్రుమకుట్మలత వహించె

తే. గీ. లక్ష్మికులగేహనీలోత్పలములషండ
మునను రాజమరాళంబు వొలుచుకరణి
నిజవినీలాతపత్రంపునిగల నృపుఁడు
భువననేత్రాభిరామవిస్ఫూర్తిఁ దనరె. 122

తే. గీ. సకలకకుబంతరాళప్రసాధనంబు
సలుపుదోర్యుగకీర్తులసరణి దోఁప
నిరుకెలంకుల ఫేనపాండురము లైన
[5]చామరలజంట భూమీశచంద్రుఁ దొప్పె. 123

సీ. [6]కినుకమైఁ దపనవాహనశిరస్తాడనో
ద్యమమున నుత్సుకతను వెలార్చు,
వేవెలుంగువినీల[7]వీతిసంతానంబు
ఘర్మదగ్ధంబులుగా హసించుఁ,

1. సింహగమనుఁడు. 2. మేఘమువలె నల్లనయినకవచము. 3. నీలకవచముపైని ముత్యాలదండతో. 4. మేఘనక్షత్రసహిత విద్యాధరుని. 5. చామరములు—మువర్ణములేకుండఁ గూడప్రయోగముగలదు. 6. ఈపద్యములోఁ దొలి 4 పాదములకు ఎత్తుగీతము 4 పాదములతోఁ గ్రమాన్వయము. 7. అశ్వములు.



దనలోనఁ బవమానమును గణించక దాని
కటిపంగుభావంబు నంటఁ గట్టుఁ,
దనమేను ఖురఖండితనృపాంగణమణీర
జఃపూరితముగ నిచ్చను దలంచు,

తే. గీ. గగనసీమాస్థరింఖకాస్కందితముల;
ఫేనసమపాండునిజదేహవిలసనమున;
స్వీయతేజఃప్రహృష్టహృద్వేగవిధిని;
రవికరోదితపల్యాణరత్నదీప్తి. 124

వ. ఇట్లు విజృంభించుమృగయాసమయసమనురూపాలంకృతతురంగంబుఁ
గుంతలభూకాంతుం డారోహించి [1]వయాళికై వెడలునప్పుడు:- 125

క. చిత్తరువులు గై సేసిన
[2]తత్తడిగమిజీనులందుఁ దవులుజనులచూ
పత్తత్తడు లరుగన్ వె
న్నత్తి, [3]బడన్ గన్నయటుల నరయదు తొలఁగన్. 126

తే. గీ. రమణ భ్రమియించుమన్మథరాజధాని,
లలితపల్లవతతికి విలాసవనము,
రసనియంతకుఁ బరమగౌరవపదంబు
అంతిపుర మన్నృపాలువె న్నంటి చనియె. 127

తే. గీ. అతనివారాంగనలు తురంగాళిపైన
బొమలవిండ్లను గ్రేఁగంటిములుకు లూని
దిగ్జయోద్యతమదనపృథ్వీవరేణ్య
ప్రబలసేనావితాన మై ప్రభఁ దలిర్చె. 128

1. విహారము. 2. అశ్వసమూహము. 3. బడలిక.

క. మృగయాసరసీహంసలు
మృగశాబకశమనదూత [1]లిసుజాగిలముల్
దగి పలువన్నెల, హింసా
దృగంతదృష్టు లన ముందుదెసఁ జనఁ బూనెన్. 129

మ. త్రిజగల్లంఘనజాంఘికోత్సుకతఁ బూ[2]న్తేజీహయం బెక్కి భూ
భుజుఁ డెంతేఁ దెరు వుత్తరించి త్రుటిలో ముంజాయగాఁ గన్గొనె,
న్జవోల్లంఘనసక్తమత్తమృగసంతానాఽకులారణ్య మ
క్కజమున్ దెల్పుచు నాత్మనేత్రపుటముల్ కర్ణాంతముల్ సోఁకఁగన్.

క. అబలాపరిజనయుతి [3]భూ
పబలారి ప్రవేశమొందెఁ బాండుయశుం డా
నిబిడాసితనిచుళదళ
ప్రబలతరచ్ఛన్నరవికరము లగుమలలన్. 131

క. గిరులసరికరులతుల గల
[4]కిరులతుటుము నిగిడె నెదుట క్షితిపతికిఁ [5]గిరీ
పరిచుంబితముస్తాశుభ
పరిమళయుతవదననై జబాలకయుత మై. 132

చ. మును జని కొన్నియంజ లటు [6]పొంపిరిగర్వముఁ బూని మాటికిన్
వెను జనుదెంచువాని సరవిన్ గనుచున్ జను చున్న[7]యేకలం
బు నిభసమానపీనతనువున్ గలదాని [8]నొకండుఁ గక్షమం
దు నిశితసాయకం బొకటి [9]దూఁటి ధరన్ బడఁ గూల్చె నుగ్రతన్.

1. రాజువేఁటకుక్కలు. 2. ఉమత్త జాతిగుఱ్ఱము. 3. రాజేంద్రుఁడు. 4. వరాహసంఘము. 5. ఆఁడువరాహము. 6. సాంద్రమగు. 7. వరాహము. 8. 'ఒకండు' అనునమహద్వాచకమునకు ద్వితీయాంతము. 9. పొడిచి.



ఉ. కొన్ని, [1]లకోరు లంగములఁ గ్రుచ్చినయట్టులె కూలె నేలపైఁ;
గొన్ని, సశల్యకాయముల గొబ్బున దవ్వుల దాఁటి పోయెఁ; బై
నున్నవరాహముల్ దిరిగె నుగ్రనిశాతశరప్రపాతభీ
తి [2]న్నెఱయియారముల్ గలక్షితీధ్రమహావిషమస్థలంబులన్. 134

క. [3]తొలియద్భుతకథ కెంతయు
సలిపె విపర్యయము తేనిశర; మిలఁ బడునే
కలము నధీరము, వికలతఁ
గలదాని వహించె నవని కడుఁ జిత్రముగన్. 135

క. లీలమెయి నేలయేలిక
గీలించినవాలుకోల క్షితిరుహమున వే
కీలుకొను[4]దంష్ట్రి దాలిచె
నాలానాఽబద్ధముగ్ధహస్తివిభవమున్. 136

చ. సకనకశృంఖలం బయినశ్వాన మొకండు వినిర్గమించి యాఁ
గక వన మాక్రమించుకిరికాండముపైఁ గ్రుధ దూఁక, వృషకం
టకముల సంకెలల్ దవిలినన్ వశమేదుచు మాటిమాటికిన్
వికలమతిన్ మొఱుంగుఁ బరివేధితకంఠబిలోద్గతధ్వనిన్. 137

చ. హరిణి యొకండు భూరమణునాశుగహేతువునన్ నిరుద్ధ మౌ.
హరిణముఁ గాంచి తా మఱలి యడ్డుగ నిల్చెను; బ్రాయికంబు, దు
స్తర మగుఁ బో తనూవిరహతాపముకంటె సమస్తదేహసం
జ్వరకర మైనన్నాథునెడఁబా టొదవించెడితావ మెంతయున్. 138

1. క్రూరబాణములు. 2. విశాలము లగుపొదరిండ్లు. 3. పూర్వ మాదివరాహము భూమిని ధరించగా, నిపుడు భూమియే వరాహమును ధరించె నని విపర్యయము. 4. పంది.

తే. గీ. సప్తఋషిమండలముఁ జేరి శ్రాంతి లేని
యాత్రమైణతఁ గనుకొర్కి నన మృగములు
నింగి కెగయుచు నుండు, క్షోణీధవుండు
విల్లు వలయాఽకృతిగ లాగి పేర్చి నిలువ. 139

శా. ఆతం డూన్పుపృషత్క[1]ధోరణుల నవ్యాబ్దాంబుధారాభ్రమ
స్ఫూర్తిన్ గూర్చి నిసర్గనీరనిరతిన్ బర్హిప్రపంచంబు ని
ర్వృతిన్ నిల్పి శరాఽళి మైఁ దవుల్ఁ బాఱెన్; తేఁడు నిఃకేకజీ
మూతర్తుప్రథ నిల్పెఁ బాంథవనితామోదప్రదాఽజ్ఞాప్రథన్. 140

క. శ్రీరాముఁ డల దశాఽనన
దూరుఁడుగాఁ, గుంతలుండుఁ దూర్ణాటవిసం
చారమ్మునఁ [2]బంచాఽనన
మారకుఁ డై కొఱఁతఁ గాంచె మారామునకున్. 141

క. దానముల్కల లాగియుఁ జూ
ల్గనుమృగు లటఁ జేరినను నృకాంతుఁడు దునుమన్
జనఁడు, కడు పెనసి యలసతఁ
దనరుచుతనచెలులవిలసితము స్మృతిఁ దవులన్. 142

చ. పలుకులు పెక్కు లేల! వని భంజితసింహము భిన్నరంకువున్
దళితవరాహవారమును దా నొనరించి నృపాలకుండు న
క్కెలఁకులనే నిజాంగనలకేళివిలాసము లింపు నింపఁగాఁ
జలిసమయంపుసౌఖ్యముల సమ్మద మొందుచు నందె నత్తఱిన్. 143

1. పంక్తులు. 2. సింహము.



## శిశిరము

ఉ. కుంకుముపూవుపూఁత నగుకాంచెమువేఁడిమి గల్గునంగముల్
బింకపుయౌవనోష్మమున వీఁగెడుచన్నెలవుల్ నెలంతలం
దంకిలి యేల! కామిజనయామికుఁ డై రహిఁ గాంచి మించుమీ
నాంకున కొప్పె శైశిరనిశాఽఽవళి జీవితదాయకాఽయతిన్. 144

ఉ. అల్ల విశుభ్ర[1]రాంకవములందు, విలాసపటీరకాష్ఠసం
ఫుల్ల[2]కృపీటయోనిపరిపుష్ట[3]హసంతికలందు, నంతఁ గ్రొ
న్నల్లియగర్వుఁ గాల్పఁగ ఘనం బగుధూమశిఖాఽఽవళిన్ బ్రవ
ర్తిల్లె స్మరప్రతాపము గరిష్ఠజగత్త్రయకామిజైత్ర మై. 145

ఉ. నిప్పులతిప్ప[4]హాసములు నిండిన[5]గేములలోనిపొంతలన్,
విప్పు గలట్టి[6]తూలపటవేష్టనపాళిని, నుమ్మకిమ్ము లై
యొప్పులకుప్ప లౌప్రియలయున్నతసత్కుచమండలంబులన్,
జొప్పుఁ దొలంగి యాఱెఁ జలిఁ జొన్పుతుషారవిజృంభణోద్ధతుల్.

మ. తనుసుస్థత్వముఁ గూర్చువేఁట[7]యలవున్, దద్దన్ మరుల్ విర్వగాఁ
బొనరింపం దగు[8]శ్యామలున్, జెలులయింపున్ గూర్చుకౌఁగిండ్లు, రం
జన మూన్పన్ జననాథుఁడున్ 'శిశిరమే సర్వర్తుసంఘంబునన్
మునుగా సంస్తసీయ' మంచు నెఱఁగెన్ మోదంబు నందిల్లఁగా. 147

ఉ. గౌరివిలాసధూపముపొగల్ దగులన్ నలు పెక్కి, శర్వహా
రోరగముల్ గళక్షతిభయోన్నతి మ్రింగక యున్న వై, యతి
క్రూరహరాద్రివాయువు లకుంఠత [9]శారదగేహపున్బృహ
ద్ద్వారమునుండి మోదముగఁ బాయుచుఁ గాంచె నృపాలుసంస్తుతిన్.

1. సేలువలు. 2. అగ్ని. 3. కుంపట్లు. 4. సెగలు. 5. ఇండ్లు. 6. రజాయి. 7. పరిశ్రమము. 8. రాత్రులు. 9. కాశ్మీరము.

చ. కొలఁది [1]'వితస్త' మంచులను గొంచుఁ, 'బయోష్ణి' గలంచి, 'చంద్రభా
గ'లహరులందుఁ దేలి, శుచిఁ గాంచి [2]'యహస్కర' జోర్మిమైత్రి, ని
స్తుల మగు [3]'సిద్ధసింధు' తటిఁ [4]దూఁచుచు వేగమ దేవదారులన్
బొలిచె హిమాద్రివాయువులు భూపతికిన్ బ్రమదప్రదంబులై. 149

శా. ఈరీతిన్ సతతీజనుం డయి యతం డిష్టక్రియాఽఽసక్తి పెం
పారన్ శైశిరకాలకేళిఁ దగుసౌఖ్యప్రాప్తి నోలాడి ప్రో
ల్పేరెన్ విభ్రమమందిరప్రమదముల్ సెందన్; క్షణం బేని లీ
లారాహిత్యము తాదృశప్రభులకున్ లక్షించునే యెందునేన్. 150

## విక్రమాంకుని రాజ్యపాలనము

చ. పురమిపయిన్ నెగుల్ దిగులుపో ల్పఁ జేసి సహర్షచిత్తుఁ డై
యొదయఁ దతండు యాచకుల కూనిచె బంగరువాన; లోకు లొం
దెడునిడుమల్ దొలంచఁగ మదిన్ బురికొల్పనివారికల్మి లె
ప్పుడు మెఱుఁగుంజిగుర్లసరిఁ బోలి తిరంబులు గాక యాఁగెడున్.

క. [5]పుడిసిలి నెసఁగినకులమునఁ
బొడమినబల్ దొరల నితఁడు ప్రోడ యగుచుఁ, దా
నడఁచెన్ బ్రజలం దొదవెడు
బెడిదపు[6]మనుజరుజ గాక [7]విధికృతరుజయున్ 152

క. మము [8]నీటన్ నించుసము
ద్రము లానృపవశ్యము లనుతలఁపున నన న
ద్దములు క్షమావరు సేవా
సమనుస్మృతిన్ సముపయుక్తజలములఁ గురియున్. 153

1. ఝీలంనది. 2. సూర్యపుత్రి (యమున). 3. గంగానది. 4. తూఁగఁ చేయుచు. 5. చుళుకమునఁ బుట్టిన 6. ఆధిభౌతికరోగము. 7. ఆధిదైవిక రోగము. 8. జలములో.



సీ. అదను గాకయ మిత్తి పొదవఁ బో దెటనేనిఁ,
గలి వరయఁగ రాదుగా యెపైన,
మానసులఁ గడు [1]విన్మానికం బలయింపఁ,
దలఁతనే తొలఁచ గా డ్పలరి వీచుఁ,
బండ్లు చెట్లను గడులరువున భంజించి
భయమునవలెఁ గాంచుఁ [2]బాండురతను,
మావులఁ గావులు మాని తల్పులు మూఁతఁ
గదియింపకయ జనుల్ గంద్రు కూర్కు,

గీ జాలమార్గంబులను జొచ్చు శశికరములె
కాని, కన్నములందుఁ దస్కరులు సొరరు,
దొసఁగు లరయఁగఁ బో కిట్లు దొర స్వకీయ
రాజ్య మొనరించె నిక్ష్వాకురాజ్యమునరి. 154

చ. కకుబిభకంఠగర్జితము గాంచఁగ రానటు తూర్య-దుందభి
ప్రకరవిరావముల్ దెసలఁ బర్వెను; నిచ్చలు వీటవీట నాఁ
గక బలు[3]పండువుల్ దనరఁగా [4]సురమార్గము మించెఁ దద్ధ్వజాం
శుకపిహితాహిమాంశు వయి క్షోణివరేణ్యునిపాలనంబునన్. 155

క. పోరు విడి యెలమిఁ గాంచక,
మీఱుమగతనంబు గలుగుమేటిదొర పొక
ర్కొఱుదొరల వంచినతన
సారభుజాయుగళి కితరశరణముఁ దొలఁచెన్. 156

1. నభోమణి (సూర్యుఁడు). 2. తెలుపు మించినపచ్చఁదనము = వెలవెలఁ బాఱుట. అని శ్లేష. 3. ఉత్సవములు. 4. ఆకాశము.

క. తనయాకృతికిన్ సరి యగు
తనయాఽవళిఁ గులయశోనిధానులఁ గనియెన్;
దనయభిమతతరువు తనం
తన యగు ఫలవంత మసమధర్మాఽత్ములకున్. 157

క. హేమోన్నతవాతాయన
భూమిస్థితిఁ గూర్తు రెలమి భూపతిపుత్రుల్;
దా మెక్కువ్యోమయానం
బౌమతి నెల వైన[1]ఖేచరార్భకులవలెన్. 158

ఉ. ప్రాణసమాన మేను వసుధాఽధివరేణ్యుల; కీతఁ డెంచు ఘూ
సాణువుగా నటంచుఁ దనయంగద నర్థులకున్ వచించువి
న్నాణము దోఁప వారిశ్రవణంబులయందు నివాస మూనుఁ [2]గ
ల్యాణము నై జగౌరవము హానిఁ గనన్ నృపుత్యాగపద్ధతిన్. 159

తే. గీ. ష్మావరస్వర్ణచారుభూషాప్రభాఽఽళి
బెరసి పింగళకాంతిచే వెలుఁగునర్థి
కులము [3]వేలుచు నున్నట్లు తలఁచి వదలె
నర్థిదుర్గతి, [4]ప్లోషభయాన ననఁగ. 160

చ. 'తలఁ గలవేల్పువానసము లథఃస్థలిఁ గూలెడుభీతిఁ, ద్రుంపఁగాఁ
దలకొనఁ' డంచుఁ ద్యాగి యగుతత్పతినుండి భయంబు వీడియున్;
"దొలఁగుము తేఁడు వచ్చె నిదె! త్రుంగుదు" వంచు వచించునట్లు ద
వ్వులఁ జనునర్థికోటికి నృపుం డిడుపైఁడిఁ గలంగె మేరువున్. 161

1. విద్యాధరబాలకులు. 2. బంగారము. 3. కాలు చున్నట్లు. 4. కాలుట.



## దేవాలయము

క. నరవరుఁ డూన్చిన[1]కమలా
వరునినితాంతోన్నతోదవసితం బొప్పెన్,
గరముఁ బ్రబలుకలిఁ దొలఁచఁగ
ధరణీజఠరంబు వెడలుధర్మకర మనన్. 162

క. తారామార్గ మొరయుతద
గారముఁ దొలఁగి చనురవికిఁ గలిగెను శ్రీదై
త్యారిన్ డూఁకమి, సప్తులు
గూరమి బన్నంబు సిద్ధగుణయుగళముగన్. 163

చ. [2]దనుజునిఁబొమ్మగల్పు [3]హరితన్ గనె నీతఁ డటంచుఁ దద్రమే
శునిఁ గని భీతిఁ బోలెఁ బొదసూప దటన్ గలికాలదంతి; [4]త
ద్ఘనతరనాభిపంకజముఁ గాంచదు తుమ్మెదరి మ్మహర్నిశం
బనఘవినీలధూపపటలాఽకృతి [5]నవ్వి వినిర్గమించుటన్. 164

శా. ఆదేవాలయశృంగభాగముల సొంపారున్ స్ఫురన్మౌక్తిక
ప్రాదుర్భూతరుచాఽఽవళిన్ గనకకుంభంబుల్ నభస్సంబు లై
యాదిత్యాశ్వచయంబు [6]దూపఁ గొని తోయభ్రాంతిమై [7]వానిపై
నూఁదన్ మోముల, [8]వానిఫేనముల సంయుక్తంబు లై మించె నాన్.

చ. అచటిపురంధ్రినృత్యములయందు మణీమయ[9]సాలభంజికల్
ప్రచురతరాఽత్మకాంతిపరిపాటి [10]వమించుచు మోదబాష్పతా
రచనము లుల్లసిల్లు[11]నభిరామదృశాస్ఫురణంబు లూనె నాన్
రుచిరము లై సజీవములరూఢి సదా సిరు లీనుచుండెడిన్. 166

1. విష్ణుదేవాలయము. 2. హిరణ్యకశిపుఁడు. 3. సింహత్వము. 4. ఆ విష్ణువు యొక్క. 5. ఆతుమ్మెదలు. 6. దప్పి. 7. ఆ కనకకుంభములపై. 8. ఆయశ్వముఖములయొక్క. 9. బొమ్మలు. 10. క్రక్కుచు (ప్రసరింపఁ జేయుచు). 11. అందము లైనచూపులు.

తే. గీ. అచటిమేల్ప్రాంగణముల నాట్యంపుఁజెలులు
ప్రతిఫలనమిష [1]నుల్లోచరత్నములను
నంబరచరాంగనాస్థాన మందుకతన
నంబరాటనోద్యతలు నా నలరు చంద్రు 167

## తటాకము

ఉ. కారణమానుషం డగునృకాంతుఁడు రుద్ధదిశాముఖంబు గా
సార మొనర్చె దేవళముసమ్ముఖభాగమునందు; నల్గడం
జేరి యతుల్యమై చెలఁగి, శ్రీరహి మించుసరస్సు కెట్టు లు
త్సారితలక్ష్మి యైనపయసాంనిధి యీ డగు నీయిలాతలిన్? 168

తే. గీ. అచ్యుతాంఘ్రిసరోజపరిచ్యుతిఁ గని
[2]సురనికేతనగర్వంబుఁ జొచ్చి వెడలి
వచ్చుసురనిమ్నగా[3]శేషవారి యొప్పు
ననఁగ న త్తటాకము వొల్చు నచ్ఛవారి. 169

తే. గీ. ధాత యగునీనృపాలుని దరిసెనేని
నెప్పుడేన్ దానలోభాన [4]నిల్వలారి,
యతనిదర్పంబు భంజింతు ననినయటులఁ
జెరు వుఱుము, దరిఁ బగిలెడుతరఁగలరుతి. 170

తే. గీ. క్షారవారాశిసంగమకాంక్ష మించఁ,
గానినియమంబు నీ కేల గంగ ! పూన ?
ననినటుల్ హర్షగాద్గద్యమునఁ దటాక
మూర్మికరముల దాని మిన్నొడిసి లాగు. 171

1. మేలుకట్టు(చాందినీ). 2. దేవాలయము. 3. మిగులుజలము. 4. అగస్త్యుఁడు.



చ. మును జనకాఽత్మజావరుఁడు పూన్చినసేతుబంధనంబునన్
వననిధి గాంచె భంగ; 'మల వార్ధికిఁ దా నుదయించుటన్ వచిం
చినఁ గడుఁ జుల్క నౌ' ననుచు [1]జిష్ణునిదంతి యనిందితాఽత్మ మై
తనరెడునీతటాకమునఁ దా నుదయించుటఁ దెల్పు [2]నింతికిన్. 172

క. జలదము లీకాసారం
బులఁ గ్రోలుచు శుక్తులందు ముక్తాశ్రీలన్
గొలుపఁగఁ బురాణముక్తల
కలరవు లలనాకుచస్థలాఽరోహణముల్. 173

ఉ. ఎన్నిక మీఱునేలు లెనయించినమోములు గ్రోలి నిల్చుచున్
బన్నముఁ గూరు[3]భంగయుతవారిధినుండి తొలంగె నాఁగ న
త్యున్నతి నందకొండల సముద్భవ మందునదుల్ నిదాఘ మే
గ న్నగరీతటాకపరికల్పితయౌవన మాక్రమించెడున్. 174.

## పురవర్ణనము

క. సుర-వాణీవరలో[4]కో
త్తరభాగము లంది యెలమిఁ దాఁ గూర్చె ననాఁ
బురమున్ [5]బ్రహ్మపురాఽవృత
మురుసక్తిన్ నిల్చె నాతఁ ధాగి నచ్చోటన్. 175

చ. మొదటిగవాక్షమున్ వదలి ముద్దియమోము ద్వితీయ మంటి పెం
పొదవుట రేలఁ బ్రోలున సమున్నతసౌధవిటంకలంఘనం
బొదవుటయందు శంక విడి యుద్ధవిధిన్ నడుమన్ బ్రవేశ మై
[6]చదురున దాఁటి పోవు ననఁ జంద్రునిఁగూర్చి తలంప నయ్యెడిన్.

1. ఐరావతము. 2. తనభార్య యగునభ్రమువునకు. 3. భంగపాటు - అలలు (శ్లేష). 4. ఉత్తమ. 5. బ్రాహ్మణాగ్రహారములచేఁ జుట్టఁ బడినది. 6. చాతుర్యము.

మ. అట సోపానములన్ నితంబినులు దా మారోహణం బానుచోఁ
గటిభారంబునఁ దూఁగఁ బోదు రని నిక్కన్ భీతి భిత్త్యాఘముల్
దిట పూన్పంగఁ దలంచె నాఁగఁ గృపఁ జెందించున్ నిజా[1]ష్టాపదో
త్కటరుగ్దండములన్ దదీయకరసంతానంబులం దూఁతగన్. 177

తే. గీ. అచటియగ్రగవాక్షతుంగాఽలయముల
తుంగిమంబు గడించెఁ బెన్దూషణంబు
నవటిచిత్రస్థితద్విరదాఽళిఁ గిన్క
శక్రదంతి, ప్రధావనశంకితము, గ. 178

ఉ. ఆపురిపైఁ దిరం బగునిరంతరతుంగసమంచితావనీ
స్థాపితకుట్టిమస్థలుల [2]సారసబాంధవసైంధవాఽళి తా
రాపథమందు నూఁత గన రానిగతిన్, దముఁ బొందుక్రాంతులన్
బాపికొనున్ స్వకీయపదపాళిఁ గదింపుచు నింతనంతటన్. 179

మ. ప్రతిబింబాధ్వములన్ ద్రియామముల నాప్రాలేయభానుండు భూ
పతిప్రో ల్పొంది యటన్ బురంధ్రిజనతాప్రాంచత్సరోలాయిత
శ్రుతిభూషాఽఽదృతరత్నకుండలరుచాక్షద్ధాఽత్ముఁ డై యంతఁ ద
త్సితనాళీకదృశాకపోలసుషమాక్షీరంబులన్ మున్గెడున్. 180

క. హరి [3]గురువు తల్లి యిందిర
యిరువుర కిది యిర వటంచు నెఱుఁగుటనువలెన్
మరున కనేకాన్యాయ్యాఽ
కరునకు నెపుడేని నద్దు కలుగదు నగరిన్. 181

1. బంగారము. 2. సూర్యాశ్వములు. 3. తండ్రి.



## వదాన్యత

మ. ప్రతిపర్వంబున నాప్రతానిధి భూపాలాంబుజాతారి యు
న్నతచిత్తంబున సల్ప షోడశమహాదానంబులన్ దానని
స్సృతవాఃపంకిలతత్పురీనికటధాత్రిన్ గూలుభీతిన్ బలా
యితుఁ డౌఁ దత్పురిఁ బాయుచున్ గలి స్వకీయేచ్ఛావిహారాఽదృతిన్.

క. తుంగస్వర్ణోత్కరములఁ
[1]దుంగసరిగఁ జూచుదానధుర్యుఁ డయినరా
ట్పుంగవుపటీరపాండుయ
శోంగము లోభమున కంత నాస్పద మయ్యెన్. 183

చ. తలఁగక స్వర్ణదానములఁ దత్పురుఁ డౌనరపాలునుండి భీ
తిలి తపనీయభూధరము [2]తెల్పును దాల్పఁ దలంచె నాఁగ [3]ను
త్పలములనేస్తిమండలముఁ [4]బారదపిండ మటంచుఁ దాఁకు ని
చ్చలు దనతుంగశృంగములఁ జాఁచి సితత్వపరీప్సచేవలెన్. 184

క. కనకతులాఽఽరోహణమును
జనపతి ద్విజకల్పశాఖి శత్రుంజయుఁ డై
ఘొనరుప; [5]నగస్తి రాఁగలఁ
దని[6]యున్నమనంబు వింధ్య మభిలాషించెన్. 185

క. కడుఁ గడుఁ బసిండి సీతం
డిడఁగ నడలి పైఁడికొండ [7]ఖాధ్వశ్రీ
దొడరినటులఁ దనపసిఁడినిఁ
గడునల్పున్ దాల్పినట్లుగాఁ గనఁ జేసెన్. 186

1. తుంగగడ్డి. 2. శ్వేతత్వము. 3. చంద్రమండలము. 4. పాదరసము.
5. అగస్త్యముని. 6. పైకిలేచుట. 7. ఆకాశకాంతి.

తే. గీ. దానలీలారతుండు ప్రతాపశాలి
ధారణీనాన్వయముల రిక్తములఁ జేసి,
యర్థిజనగేహముల నింపె హాటకముల
దిఙ్ముఖంబుల సద్యశస్ఫీతుల నినిచె. 187

తే. గీ. చక్రవర్తిశిరస్స్థితి సౌరు గాంచి
విశ్వచక్రర్ధినియమప్రవీణుఁ డగును
దారశీలుఁడు ప్రతికూలతను గడించె
నిలను లేమినిఁ గల్పించునలువవలన. 188

## యుద్ధము

ఆ. వె. అరుల కలవుచేఁ [1]గదర్థితుండు చిరంబు
బాహు[2]ఖర్జు వెదుగుపార్థివుండు
చోళగర్వ మెఱిఁగి [3]వాలగుననిఁ గోర్కి
పురికొనంగఁ 'గాంచి' పురము దరిసె. 189

చ. సిరి కుదయింపగా నయిన[4]సింధుజలోన్మథనంబు, పోరులన్
బురికొనఁ జేసి సంతసముఁ బూ[5]న్మని కీక్షణపారణంబు, ని
ర్జర[6]ధనమానినీజనముచాయఁ గ్రయాఽపణ, మిట్లు మించునం
గరముఁ గ్రమంబునన్ సలుపఁగా సమకట్టిరి చోళ-కుంతలుల్. 190

తే. గీ. ఉచ్ఛలద్వీరరసజృంభితోర్మినిర్మ
లములు సుభటాసియష్టు లుల్లసిలెఁ గోశ
బిలవినిర్గతిఁ గని [7]నాకుబిలము వెడలు
కాలపాశా[8]నిలాశనకాండములన. 191

1. విసుగు చెందినవాఁడు. 2. దురద. 3. గొప్పయుద్ధమునందు. 4. సముద్రము. 5. నారదుఁడు. 6. వేశ్యలు. 7. వల్మీకము. 8. సర్పసమూహములు.



ఆ. వె. జయరమాప్రభూతసౌభాగ్యవశమున
బలయుగంబుభటులు చలము మీఱఁ
బరుఁగు లిడుచు నొగులువడిరి వడిన్ మున్ను
సాగి పోవుబాణచయముచేత. 192

తే. గీ. తనయురమ్మున నిఱికినదంతిరదముఁ
గత్తిచేఁ ద్రుంచి దవ్వుగాఁ గరినిఁ బఱపె;
బిలమునన్ బ్రాణముల్ బయల్ వెడలకుండఁ
[1]గీలకంబుఁ బ్రతిక్రియాకృతిగఁ ద్రోయ. 193

తే. గీ. అర్ధచంద్రశరంబున నర్ధకృత్త
మూర్ధ మసియాడుచున్ భటుమూపునందుఁ
జేర డాకేల నది వట్టి పొఱువీరుఁ
డెల్లజనులపొగడ్తకు నిక్క యయ్యె. 194

తే. గీ. కంకటయుతుం డొకండు వక్షమున విఱుగు
శరము లెగయించువహ్నిచే నెఱుఁగఁ దోఁడు
[2]పరుఁడు మోమునఁ దూర్పుకృపాణధారఁ,
దాగ యనెడుభ్రాంతి నది మరిఁ దొడివికొనఁగ. 195

తే. గీ. అరికరిరదాంకుర[3]ప్రోత మైనమోము
పులకనికరాంచితం బయి పొలుపు మిగులఁ,
గనఁగ నయ్యె సలీల నొక్కఁడు మృణాల
దండమునఁ గీర్తిసుధ నాను చందునటుల. 196

1. మురికి. 2. శత్రువు. 3. గ్రుచ్చుకొనఁ బడిన.

తే. గీ. మఱిమఱి నరాతిశరముల [1]నిఱుకులెల్ల
నఱుకు లైననిజాస్థిపంజరముఁ దాల్చె
వెరవుగా సూర్యమండలోదరమునందు
సుఖముగాఁ దూఱుటకుఁ బోలె సుభటుఁ డొకఁడు. 197

తే. గీ. ఎడనెడఁ రక్తపంకమం దడరునుష్ణ
కరునిప్రతిబింబమాలిక కరముఁ దాల్చె
రక్త మానెడుకోర్కిఁ జేరంగ వచ్చు
[2]యామినీచారిణీపారికాంక్షిపోల్కి. 198

తే. గీ. తనుఁ బొదివినట్టి ములుకులఘనశరమున
నెదిరి నదటున నేయంగఁ [3]జదురుఁ గనని
తనభుజంబును గాంచెఁ బెన్గినుకతోడ
మిగుల [4]వైలక్ష్యవంతుఁ డౌమగఁ డొకండు. 199

తే. గీ. తనదుకర-కర్ణఖండనమున వమాన
మునకుఁ దగువిధి భటునిచేఁ బొంది, లజ్జ
మిగులఁ దాల్చినయటు నగ్గినిగఁ జెలంగు
క్షతజనది మున్గె నొకమహాసామజంబు. 200

తే. గీ. రెండురదములు చీలఁగా రెండుగాఁగ
దంతములు నాల్గు దాల్చువిధంబు దోఁప
దంతి యొక్కటి వేల్పు[6]చౌదంతిపోలుపు
వడసె [7]భటపేటకము దేవభావ మొంద. 201

1. మర్మములు. 2. రాక్షసస్త్రీలగిన్నెలవరుసలు. 3. నేర్పు. 4. విస్మయము. 5. పౌరుషవంతుడు. 6. ఐరావతము (నాలుగు దంతములు గలది). 7. భట సమూహము.



ఉ. [1]వా లగుసామురేవెలుఁగువాలులఁ [2]దున్మయి దవ్వ దూఁకి దోః
పాళికి, నాపయిం బృథివి వ్రాలెడుదంతిరదాంకురావళుల్
వేలుపుఁబూలసోన యని వింతఁగఁ జూచుభటాళియందుఁ బ్రా
ల్మాలిక దోఁప వారితలలం గుఱిఁ దప్పక కొట్టు బిట్టుగన్. 202

తే. గీ. నవశిరీషసుమమృదుబాహువుల నిప్పు
డుంచకుము సంపరణమాల నుంచుచోట
నలరులకు విల్వ యెచ్చునీయదనునందు
ద్యుత్రసజములు లుద్ధత మేన ! యూన్చునీవు. 203

తే. గీ. వరులకట వేమి యిట లేదు పరవధూటి
కొనినవరు వరవర్ణిని ! కోరు దేల ?
వరపరీక్షావిషయమున వనిత నీదు
[3]చదురు కొఱఁతగఁ గంద్రు నిర్జరసుదతులు. 204

తే. గీ. మూర్ఛమైఁ గన్నులను మూయ ముధగ వీరి
వ్యోమయానంబునందు నీ వుంచికొంటి;
తేఱ [4]కృతఘాలముగ యుద్ధదేశమందు
నుత్సుకత మీఱ మఱి పడు చంద్రు కనుమ ! 205

ఉ. మేర దొరంగునీభటుఁడు మేకొనెఁ జేష్టితముల్; విమానపున్
దోరణగండ్లనుండి పెఱసుందరి తన్ గనినంతమాత్రనే
యారమణీలలామమునకై త్వర సేసెదు చూడు వీఁడు తా
నోరమణీ ! నినుం మొదల నొందినవిం దయి యుండియున్ సుమా !

1. వాఁడి యగునర్ధచంద్రబాణములు. 2. ముక్కలై. 3. చాతుర్యము.
4. నాసలు చిట్లింపుగా.

తే. గీ. తొలుత నితనికి మాల యేవెలఁది యిడెనొ
తెలియ దిరువురు మీరు వాదించు చుండ,
నితఁడు సౌభాగ్యనిధి రణవ్రతపరుండు
స్వయము వరియించుఁ గాక నిశ్చయవిధంబు. 207

చ. సొబఁగుమదంబునన్ మరులు సొన్పి మఱుంగున నున్నదీనిచేఁ
బ్రబలపుమోస మొంది వలరాజువెతన్ గనుఁ గాననట్టివీఁ
డబల! త్వరన్ బరాన్మఖత నందుపిశాచి భ్రమించి చేరి వే
[1]దబమువిధం బెఱింగి పడి డాయక పాయు [2]వెడంగుకై వడిన్. 208

తే. గీ. పరుల కుపకార మొనరించునరణులందు
నారదునకన్న లేఁడు విశారదుండు
త్రుటిని ఘనకదనంబులఁ దొడరఁ జేసి
కాముకాభావతను మాన్పుఁ గనఁగ మనకు. 209

చ. కడఁగి సహర్షులై భటులకంఠములన్ గ్రహియించి కౌతుకం
బడఁగఁ గడుంగడున్ [3]బరుగు నందుసురక్రయనాయికాఽవళుల్
వెడవిలుకాని మేల్కొలిపి పేర్చుకథాకలనంబు, డంబుగా
నడరెను గర్జవీథి నమృతామలపేశల మౌచు నయ్యెడన్. 210

తే. గీ. ఇంతలోఁ గుంతలుండు [4]జేదంతి నెక్కి
జ్యానినదనిష్ఠురముగ శిఞ్జారవ్య
నరణిఁ బరబలభటసముత్కరముఖముల
విశిఖపంక్తుల నినిచె దోర్విక్రమమున. 211

1. వంచన. 2. అవివేకి. 3. పరుగెత్తుదేవవేశ్యలు. 4. జయగజము.



ఉ. ఏనుఁగు నెక్కునక్కరుల నేనుఁగులంద, తురంగవాహనా
నూనభటాఽళి నశ్వముల నుండియట్టులనే, పదాతిసం
తానములన్ ధరాస్థలిన, నామసమంకిత[1]పత్రసంతతిన్
స్థానమునంద కీలిత మొనర్చెఁ జళుక్యుఁడు, చోళసైన్యమున్. 212

ఉ. వేలు వరింప నేల పృథివీపతి యెచ్చట మచ్చరించినన్
[2]దీఱుఁ దెఱంగుగా వసుమతీతిలకంబులకున్ ద్వయంబె, 'పెన్
[3]గాఱియఁ [4]గారఁ గాంచుట వికావికలై దవువాఱుటల్', ద్వరన్
బాతె ననిన్ ద్యజించి గరువం బఱి చోళుఁడు ప్రాణభీతిమై. 213

ఉ. ఆపయి [5]నజ్యచాపుఁ డయి యస్పతి చోళరమన్ గ్రహించి, కాం
చీపురమందు సత్కవులశిష్టవినోదములందుఁ దేలి తా,
[6]రా పగుదంతివాహినిభరంబు దిగంతర మావరింపఁగా
[7]మో పగునెమ్మెమైఁ దనదుప్రోలినిఁ జేరె సముత్సహించుచున్. 214

## నర్కుటము

గిరి-బిలవాస! శ్రీహరి! నృకేసరి! సర్వజగ
ద్భరణ-జను-ర్లయా! యమరవారకృతావన! సా
గరతనయాఽలయా! యసురగర్వవిభంజన! శ్రీ
కరవృషశైలవాస! నృమృగప్రభు! విశ్వవిభూ! 215

1. బాణసమూహము. 2. అవకాశపడుసు. 3. వేదనచేత. 4. చెఱసాల.
5. అల్లెత్రాడు దించినధనుస్సు గలవాఁడై. 6 సాంద్రమైన. 7. అధికమైన.

ఇది శ్రీత్రిభువనమల్లదేవవిద్యాపతి-కాశ్మీరక
భట్టశ్రీబిల్హణ మహాకవివిరచితవిక్రమాంకదేవచరిత
మహాకావ్యంబునకు శ్రీవేంకటేశ్వర
శ్రీనరసింహదేవపాదపద్మాఽఽరాధన
సమాసాదితగీర్వాణాంధ్రకవితావైశారద్య
'ఆంధ్రబిల్హణ' బిరుదాంచిత
లక్ష్మణ-విశ్వనాథ
కవిసోదరాంధ్రీకృత
మహాప్రబంధంబునందు
షష్ఠాఽఽశ్వాసము
సమాప్తము

—o—

# విక్రమాంకదేవచరితము

## సప్తమాశ్వాసము

క. శ్రీశైలశిఖరభూషా!
దాశార్హా! కనకకశిపుదారణ! భక్తా
భ్యాశనిహితహృదయాబ్జా!
శ్రీశ! శ్రుతిజ్ఞేయ! వేంకటేశ! నృసింహా! 1

### కాశ్మీరము

ఉ. గౌరి వరించుశర్వునకుఁ గైకొని సాక్షిత స్వైరధావన
స్ఫారకలీభ మాఁపుచు, నిసర్గముగాఁ గుటిలంబు లౌ[1]వితె
స్తారభసోర్మి లంకుశతఁ దాల్పఁగ హస్తిపకత్వరూఢిఁ, గా
శ్మీరములన్ బురీవరము చెన్నుగనున్ [2]'ప్రవ'రాఽఽహ్వయంబునన్.

ఉ. ఆపురి[3]యాటతోఁటల సమస్తజగన్నుతమాధురీసము
ద్దీపిత[4]గోస్తనీరసముఁ దిగ్మకరుండు కరాఽఽళిఁ గ్రోలి సం
తాపము శాంతిఁ గాంచె నసఁ దార్చుమణీకిరణాంకురప్రతా
నోపమకోమలాంశువుల నుగ్రనిదాఘదినంబులందునేన్. 3

మ. హరశైలంబును [5]దోస్తులన్ నిలిపి నవ్వన్ వెన్నెలన్ దిక్తటాఽ
వరణవ్యాప్త మొనర్చురావణుఁడు శాపత్రస్తుఁడై సత్వర
స్ఫురణన్ పుష్పకయుక్తి దవ్వ సనుఁ దత్పుర్య[7]గ్రవర్ణప్రతా
పరమాఽఽకర్ణనుఁడై తదీయగృహముల్ వర్ణించుచున్ భైపయిన్. 4.

1. ఝీలంనది. 2. ఇప్పటి శ్రీనగర్. 3. ఉద్యానవనములు. 4. ద్రాక్ష. 5. బాహువు
లనెడు త్రాసు. 7. బ్రాహ్మణులు.

ఉ. ఆపురమందు నిచ్చ భువనావళిదుర్లభపండితుల్ విය
ద్వ్యాపిమణీమయాలయ[1]సదాగతివర్త్మల వ్యాఖ్య లూనుచో
రా పగుగగ్గురుల్ వొడమ రాల్పరె! [2]పూజడి దేవతల్, త్రపా
స్థాపన దానిచే గురువు దాల్చు న టన్పెదు రొంద కున్నెడ౯. 5

ఉ. ఆపురి స్ఫాటికాచ్ఛ[3]యశయావళి ఖేళన మొందురీతి [4]గౌ
రీపితృపర్వతంబు తనశృంగము లూర్ధ్వముగా నిగుడ్చు; [5]స్వ
ర్ద్వీపినిపోటిఁ గన్మధుమతీనదిసైకతహంసి యై [6]కలా
గోపనభార మూనుఁ బలుకుంజెలి యన్నగరి౯ స్వయంబుగ౯. 6

శా. సారానేకవిచిత్రసద్గుణకథాసంకీర్ణకర్ణామృతో
దారం బై కుతుకాకరంబయినత[7]శ్శారస్వతక్షోణిఁ గై
వారం బేల యట౯ వధూజనజనుర్భాషాలయతి౯ బొల్చి పెం
పారు౯ బ్రాకృతసంస్కృతోక్తి ప్రతిగేహంబందు స్తుత్యంబుగ౯. 7

చ. తలఁతుఁ బురి౯ గవీశ్వరవితానవచస్సులు మంథభూమిభృ
త్ప్రులుఠితదుగ్ధవారిధిసుధాఝరిగాఁ దగి శీకరంబుల౯
బొలఁతులయందుఁ బ్రేముడులఁ బూరితి సేసి [8]సుధామయూఖని
ర్మలరుచు లై నయిక్షువుల ద్రాక్షల నిల్కడఁ గాంచి మించెడు౯. 8

చ. కలియుగదుష్టదృష్టి సొరఁ గానని[9]బ్రహ్మనిధాన మౌట, వి
ద్యలవిభవంబుఁ బ్రత్యయనిధానపురంబున నిచ్చ నిల్పి ప
ల్కులచెలి చింత మాని జనులు౯ జన రాన్త్రిణేత్రపర్వత
స్థలిఁ దపముల్ బొనర్చుటకుఁ [10]దారు ధ్రువంబుగ నెల్లవేళల౯. 9

1. వాతాయనముం. 2. పుష్పవర్షము. 3. యశఃపంక్తి. 4. హిమాలయము. 5. గంగానదితోస్పర్థ. 6. కళలను పోషించుభారము. 7. సాహిత్యక-సరస్వతికి నెలవు. (కాశ్మీరము). 8. చంద్రుఁడు. 9. బ్రాహ్మణులనివాసము (అగ్రహారము). 10. పోవును.



చ. ఇరుదరుల౯ జెలంగుగృహబృందములందలితోరణంబుల౯
[1]దర మిడి యాడునాల్మగలతాఁకులఁ ద్రెళ్లినదండలూని [2]శం
కరభవ యౌకులాపఁగ [3]దనర్చుఁ బురాంకమునందుఁ దారకా
పరికలితాభ్రసంగి యగుస్వర్ధునికి౯ సరి యైనపెంపునన్. 10

ఉ. స్నానవినోదసక్తలలనాస్తనలిప్తమనోజ్ఞ[4]ధీరము౯
దాను దొలంచి యంకమునఁ దాల్చుచుఁ గాంతుని నీర్ష్యఁ గిన్కనాఁ
జానలషట్పదాసితకచప్రచయంబుల నూర్మిహస్తసం
తానముల౯ వితస్త సతతంబు నిగుడ్చుచు లాగు నప్పురి౯. 11

శా. శ్రీభట్టారకమందిరోపనగరీసీమంతినీవిభ్రమ
శ్రీభాస్వన్నయనాంతకాంతి [5]తెగువ౯ జె న్నొద్రుతేందీవర
శ్రీభంగీ[6]నికృతిం బొనర్చుచును భంజింపం బడుం దన్మధు
శ్రీభాగ్యంభరజృంభితారభటికోత్సేకంబున౯ దత్పురి౯. 12

చ. చెదరక వాలుభ్రూలతలచె న్నగునున్ననిమొగ్గల౯ వలె౯
జదు రగుకామినీదృశలు సహ్యము లౌ నెటు? లాత్మకాంతిసం
పద హరిణీదృశాంకులతఁ బాటిలఁ జేయుతదంకసుస్థితి౯
మదనుఁడె చాపలంబుఁ బలుమాలు భజింపుచు నుండ నయ్యెడ౯.

ఉ. ఆనగరి౯ భ్రమన్మధుకరాసితకేశిమహీరుహోల్లస
త్కాననదంతురత్వమును గాంచి వచింపఁగ నేల! శూలికో
పానలవిస్ఫులింగకినలావళిసుప్త[7]లతాంతసాయకో
త్థానము సల్పు నందుఁ బ్రమదాజన మాత్మకటాక్షవీక్షణ౯. 14

1. మానము విడిచి. 2. వితస్తానది. 3. ఒప్పును. 4. కుంకుమపువ్వు. 5. సాహసముచేత. 6. త్రోపుడుఁ (మఱుఁగుపఱచుట). 7. మన్మథుఁడు.

చ. తనయొడినుండి రావణుఁడు దర్ప మెలర్పఁ బెకల్చి పాఱఁ జి
మ్మినతెలిఱాలు గాంచఁగ [1]గ్రమించుమదిన్ గల దయ్యె స్ఫాటికా
వనిధర మప్పురిన్ గలుగుస్ఫాటికమందిరచత్వరాఽళి సూ
దెనయదు పార్వతీశవృషభేశ ఖురాంకము లందుఁ గానమిన్. 15

ఉ. 'అనయము రాజరాజపురి యక్షగతం బగు; నిష్కళంకగాఁ
దనరద లంక: మేరువసుధాధర మెక్కినవేల్పుప్రోలునున్
దనరు సలోప మై;' యని నితాంతము గర్వముతోడఁ [2]బోటి దాఁ
గననియటుల్ [3]స్మరాద్రిమిషగాఁ దల నెత్తుగ వీడు దాల్చెడిన్. 16

ఉ. మీఱు నిసర్గసౌభగము మేకొని కావ్యము కుంకుమంబు [4]భా
యోరుగుణంబునన్ జగతి నుండి ప్రియం బయి దుర్లభంబు నై
మీఱుచు లోకసార మయి మించెడుప్రోలున నొప్పు చుండుఁ గా
శ్మీరము [5]లాదిశేషుఁడు విశిష్టతఁ బ్రోచుట కాస్పదంబు లై. 17

ఉ. హేలమెయిన్ రసం బొలుకునిం పగుకన్యామలన్ రహించుదృ
గ్జాలము లంగజాంగనకు సాధనకై శతకల్పకాలముల్
చాలవు; కాంతులన్ మరులు సల్పి రణద్రశనాప్రసాధనన్
గ్రాలి చరింత్రు త్రోవల నఖర్వముదంబున [6]శ్యామ లప్పురిన్. 18

చ. సుకృతయుతిన్ సురోపవనశోభల మించిన వయ్యె నద్భుత
ప్రకటన విస్మ్రుతిన్ గొలువ రానివి యై తగుఁగా వనాంతము
[7]ల్సకలతఁ జందనాఽర్ద్ర[8]మురళప్రియయౌవతగండపాండుతా
వికసితగోస్తనీస్తబకవేల్లిత[9]వీరుదగారముల్ పురిన్. 19

1. పోవుటకునిచ్చు. 2. స్పర్ధ. 3. ప్రద్యుమ్నపర్వతము. 4. కాంతి (ఉజ్జ్వల పదబంధ) గుణము గలకావ్యము - (మంచివర్ణము) గుణము గల కుంకుమపువ్వు అని శ్లేష. 5. 'జగత్తుసారమంతయు నిట నుండుటచే నాదిశేషుఁడు దీనినే రక్షణమునకుఁ గేంద్రముఁ జేసికొనెను'. అని భావము. 6. యౌవనమధ్యమున నున్నస్త్రీలు. 7. కళలతోఁ గూడిన దగుటచేత. 8. కాశ్మీరములో నొక భాగముపేరు. 9. లతాగృహములు.



చ. తమలహరీభుజాలతలఁ దామ పెనంగుచు బంధబంధుర
క్రమత క్షతాఘధవ్య[1]జలగాయుగసంగమయుక్తిఁ బ్రోలుచె
ల్వమరు, నఘఘ్నముల్ [2]'హలధ'రాఽఖ్యుఁ డొనర్చినయగ్రహారముల్
సమధికశైలదుర్గములసావి నాడిన్ దగ ధర్మరక్షకై. 20

చ. మదనకథాప్రభిన్నయువమండలి మెం డగుప్రేమజాలమం
దదటునఁ గూల్చుకోఁ జననియంగన, యంగజకార్మణక్రియాఽఽ
స్పద యగునంగనన్ గననివాపియు, సౌ రగుకేళివాపియుం
బొదవనికేళికావనము నొక్కెడనేనియు నొప్ప దప్పురిన్. 21

ఉ. అపురిభూషలందుఁ దను వందినయాజగదేకబాంధవ
వ్యాపి[3]కలామతానుపమ[4]వైభవ మంచితకీర్తిఁ గాంచుఁ; బూఁ
దూపులజోదుపై నలుకతో వెనుకం జనుత్ర్యక్షునేని ని
ల్పోపక నారు లూనునినదోజ్జ్వలమేఖల లడ్డు సేసెదున్. 22

మ. [5]కృతచర్యాగురుతాఽర్హభూత మయి యద్రిక్షాద్భుతశ్రీపటి
ష్ఠత [6]వైతస్తకృపీటసంగమము నిచ్చల్ నైజకల్లోలసం
తతి దేహిప్రకరంబుఁ దేల్చి యమృతాంధఃస్త్రీదృఢాదోలికా
యితలీలాగమనాంకపాతముగఁ దా నిం పొంది పీటన్ దగున్. 23

శా. యోగాఽసక్తజనాంగముల్ పులకసంయుక్తాలు గా నర్తనో
ద్యోగంబం దల రాముదూపున వెలందుల్ సేయఁ జె న్నొందునా
ట్యాగారంబు విభాసిలన్ [7]'గుణని'కాఽఽఖ్యన్ 'క్షేమగౌరీశ' దే
వాగారంబు రహించు ద్యోతిలక మై యయ్యేటితీరంబునన్. 24

1. నదీద్వయము. 2. కాశ్మీరరాజు. 3. విద్యామతము. 4. స్ఫూర్తి. 5. కృతయుగము. 6. వితస్తానదీజలము. 7. దీనికి 'సంగమక్షేత్రమఠ' మని పేరు.

తే. గీ. అలరు [1]'సంగ్రామ' మఠపు[2]సీమంతభూమి
మండపము, [3]'చంద్రసీమ' కన్పండు వగుచు
ఈశసితకాంతి హరత నిదు [4]'ననంతుఁ'
డిడిన[5]నల్లిండ్లును 'వితస్త' వెనసి నగరి. 25

తే. గీ. శాస్త్రగోష్ఠీవరిష్ఠగర్జద్గవాక్ష
ము లగు 'కాష్ఠీలు'నిండ్లు [6]కన్నురువుఁ గూర్పఁ
బ్రహుతహుతవహధూమధూమ్రశిరములను
విప్రు లెనయింతు రట నిచ్చ భీతిఁ గలికి. 26

చ. ఘనత 'ననంత'రాజసతి గట్టిన[7]శర్వగృహంబుచేరువ
న్దన దగుతుంగిమన్ త్రిభువనంబుమనం బలరించు [8]'గంజ'[9]వా
స్తును గన నచ్చటన్ [10]గలరుతుల్ పొలుపొందుకపోతరావముల్
విని విని పౌరకన్యలు ప్రవీణతఁ గాంచఁగఁ గంఠకాకలిన్. 27

తే. గీ. క్షేత్రముల నున్కియును, వల్కసేవనంబు,
నచట యౌవతభర్మాంగకాంతరంగ
భావముఁ గదించుకుంకుముఁ బడయుట, పురి
గాంచునట్టితపోజైత్రగరిమ గాదె! 28

తే. గీ. [11]ప్రవరపతి మున్ను సాంగుఁడై దివికిఁ జనిన
రంధ్ర మిప్డును నిలువ, స్వర్ద్వారమటుల
నలరు[12]ప్రవరేశ్వరాలయం బద్భుతముగ
స్వర్గపురిఁ జేర్చునాస నెవ్వారి కిడదు? 29

1. ఆపేరు గలరాజు. 2. నదిమిప్రదేశము. 3. ఆపేరు గలమండపము. 4. ఆపేరు గలరాజు. 5. అగ్రహారములు. 6. నేత్రోత్సవము. 7. శివాలయము. 8. ధనాగారము. 9. ఇల్లు. 10. అవ్యక్తమధురధ్వనులు. 11. ఒక కాశ్మీరరాజు. 12. ఈపేరు గలశివాలయము.



తే. గీ. అట [1]'మసృణకరణాసంగ' దాంగహార
మభినయించెడుచెలులనాట్యములఁ జూచి
రంభ స్తంభంబుఁ గనె; వీడె [2]రమణఁ జిత్ర
లేఖ రేఖ; నూర్వశి గర్వలీల వదలె. 30

ఉ. ప్రోల విలాసినీజనవిభూషిత[3]నైకధరావసుంధరా
పాలకసౌధతుంగిమము వర్ణన సేయఁగ నేల! యచ్చటన్
గేలిసమీరజాలకవికీలితపాదయుగుండు పూవువా
ల్దాలుపుదిట్ట సౌరవనితామనముల్ గుఱివెట్టఁ గల్గఁగన్. 31

మ. నును పౌకుంకుమపూఁత నుష్ణ మగుమీనుంగంట్లచన్పెంపులన్
ఘనముల్ [4]రాంకవపట్టికల్ మృగమదోద్గారంబులున్, శైశిరం
బున, వైతస్తజలాంతరాళమునఁ దొల్పుం గాంచు[5]నౌపృష్ఠమ
జ్జనగేహంబులు మిక్కుటంబు లగుస్వసౌఖ్యంబులన్ గూర్చెడిన్.

ఉ. మోరల మంచుతున్కలను మూఢ్చినవారిఘటోత్కరంబు, [6]కా
శ్మీరవరాంగనాకదళిశీతలకోమలగాత్రరేఖ, లో
ప్పారుతుషారగండశిల లందినభూములునేని సర్వసా
ధారణ మై చెలంగు భయదం బగుగ్రీష్మము నాఁప నప్పురిన్. 33

తే. గీ. త్యాగ-సత్యాదిగుణగణధాముఁ డయిన
నరవరుఁ 'డనంతదేవుఁ' డానగరి వఱలి
యరికరిపయోదగర్జితాప్రాప్యమంద
లాగ్రధారాంబువులఁ గీర్తిహంసి నునిచె. 34

1. ఈపేరు గలనాట్యమునందలియవయవములకదలిక. 2. ఒప్పుగా. 3. పెక్కుఅంతస్థులయెత్తుగలరాజసౌధములు. 4. సేలువలు. 5. పడవలపైని స్నానగృహములు. (Boat House bath rooms). 6. కాశ్మీరస్త్రీలు.

శా. [1]క్రీడాకృత్త 'దర' త్ప్రదర్పనిజనిస్త్రింశంబుచే శోకముఁ
గూడం జేసి 'శక' ప్రభుప్రియలకుఁ, [2]గోచక్రజైత్రుండు త
[3]ద్రాడింద్రుండు కృపాణముఁ గడుగు [4]స్వర్గంగాంబులం దెంతయుఁ
[5]గూడఁ గూడనివారిచే దొసఁగు మేకొన్నట్లు శంకించుచుఁ. 35

మ. అలకాగోపురపాళిఁ గీర్తితిలకం బంటింపఁగా నేగి, భూ
తలనాథాగ్రణి కాంచి భార్గవపృషత్కచ్ఛిద్ర మొక్కొంచగు
ల్బలిమేనఁ, నిగిడించెఁ గేళిలవవిస్ఫారాత్మదృగ్జాలముల్
దలితంపుంభుజయష్టిఁ, జందరవచాపంబందు నెంతే రుషఁ. 36

చ. తనతటి సిద్ధు లెల్లపుడు దావుగ నిల్వఁగ, సప్తతాపసు
ల్తనవరదఁ సదల్పెడఁతిలల్ పొరలఁ, రజతాద్రి నిల్చుశ్రీ
త్రిణయనురాణితానమునఁ దీరిన[7]మానసవీచులఁ ధరే
శునిసతు లౌదలఁ గొనిరి శోభనలోలుపమానసాఢ్యలై. 37

చ. హరగిరిఁ గ్రీడమైఁ బెలకినట్టిదశాస్యకరద్రుమాటవిఁ
దురుమఁడ యర్ధచంద్రములఁ ద్రొల్లి రఘూద్వహుఁ, డంతఁ దత్ఫల్
దొరసెఁ గళం కటం చతఁడు తుష్టిఁ గనందు పురాధరిత్రిరా
ట్చరితములం దుదగ్రభటచంద్రుఁడు సారవిదుం దసూయమై. 38

శా. 'త్రైగ' ర్తేలల, 'భర్తులేశ' వసతిఁ, 'దార్వాభిసారంబు'నఁ,
బ్రాగుర్వీశకథానిధాన మగు 'చంపా'సీమలో మించుఁ, గ్రీ
డాగోత్రీకృతశీతభూమిధరరాడ్రాజాజ్ఞ విన్నంత నా
వేగాన్వీతులఁ జేయుచుఁ మిగుల దోర్విక్రాంతిసంయుక్తులఁ. 39

1. అవలీలగా విదళిత మైన 'దరద' రాజులమహాదర్పము గలతనకత్తిచేత. 2. భూమండలమునందు జయశీలుఁడు. 3. రాజేంద్రుఁడు. 4. గంగాతీరముదాఁక దాడి చేసె ననిభావము. 5. అస్పృశ్యులు. 6. క్రౌంచపర్వతము. 7. మానసనరస్సు.



శా. వైతస్త్యాంబుధరంబె మేల్పరిఖగాఁ బాటింప నుత్తుంగదు
ర్గాతిస్ఫారమఠం బొకండు నడుమఁ హర్మ్యాంత నిర్మించి రా
ట్ప్రీతాంశుండు నభఃప్రచుంబి[1]'విజయక్షేత్రాగ్రహారంబు'లఁ
[2]బ్రాఁతిఁ గూరిచె సాలలీలఁ గలిఁ వాయంగ ధర్మానకుఁ. 40

ఉ. ఏసతిసాటి లేనిస్థితి నెచ్చుగ వమ్మ నొనర్ప నాఁగ ల
క్ష్మీసతి విష్ణువక్షమును జేరె మెఱుంగువలెఁ నవాంబుదం,
బా'సుభ'టాఖ్య, యాదినతి యై యశ మొందె యశస్వి యైనయా
శ్రీసచివుం డనంతు, శశిఁ జేరెడువెన్నెలవోలెఁ జేరుచుఁ. 41

మ. దయ దాక్షిణ్యమునఁ క్షమాగుణమునఁ దార్కొణ యొభూమిభృ
ద్దయితారత్నముత్యాగనిష్ఠకుఁ దుదఁ దర్కింప శక్యంబె ! భూ
దయితానేకశిఖామణీకషణ మౌతద్భర్తృఖడ్గంబు త
ద్దయితాపాదతలస్థదాసిగ సమస్తం బొసిరిం జేయఁగఁ. 42

మ. అనయంబుఁ గుటిలాక్షరప్రతతి వ్రాయఁ బూనుకాయస్థులఁ,
ఘనచాటూక్తుల దక్ష లౌపిటుల, [3]దృగ్వర్త్మఁ స్తుతుల్ సేయుగా
యనులఁ వీడి నృపాలులక్ష్మి, గురువిప్రామర్త్యవేశ్మల్ నృపాం
గనతో నొందె స్వ[4]చాపలాగమును బోకార్పన్ నిలన్ గోరెనాన్. 43

మ. బిసినీపత్రసుహృద్ద్విఁ బొరలెఁ బ్రశ్వేతచ్ఛవిఁ గీర్తి, [5]సా
రససంవాసిని వాస మూనెఁ జ్యుతధారానీరఖడ్గంబునఁ;
మిసిమిఁ వళ్యఁడు గా నతిమణికిఁ గాశ్మీరాధిపుం, డొందె వే
ప్రసభాంతఃక్లమవృద్ధి [6]నన్యజగతీపాలేంద్రశుద్ధాంతముల్. 44

1. అగ్రహారములపేరు. 2. ప్రేమచేత. 3. ప్రత్యక్షంబున. 4. చాపల్యమనెడుదోషము. 5. లక్ష్మీదేవి. 6. అన్యపరియిరరాంతఃపురరాంతలు.

ఉ. మానుగఁ గీర్తిచంద్రిక క్షమాస్థలిఁ గప్పునృపాలునా 'లధి
ష్ఠానము'నన్ నిజాఽఖ్యఁ దగుచారుమఠం బొనరించె సత్కలా
జ్ఞానగరిష్ఠదేశజనంబుల కాస్పద మైనయందుఁ దా
వూనదె! కన్నుపండువుగ [1]నుల్లలితస్థితి నెట్టికల్మియేన్. 45

ఉ. పండితభోగయోగ్యముల [2]భాండగృహంబుల నిల్పి, బ్రాహ్మణుల్
తండము లై స్వతంత్రముగ దాత్రిఁ గొనంగ వచించి, [3]యామవే
దండసవాసదిగ్వలయదంతురదంతులు మేదినీస్థలిం
బండువు సేయుసద్యశముమాత్రమె తత్సతి కా పొనర్చెడిన్. 46

ఉ. మానిని గూర్చె సూనశరమర్దనుఁడున్ [4]త్రిజగద్గురుండు నౌ
వానికి నైజశృంగపరిభగ్నఖమార్గసుధామమున్ విత
స్తానదిచెంతఁ; గంతుఁ దటఁ దాండవినీనటనానముత్థకాం
చీనినదాపిధానగుణశింజ శివక్రుధభీతి వీడెడున్. 47

చ. పతిహితతద్ధరేంద్రసతిభ్రాతగ క్షాత్రమహుండు పేరునన్
'క్షితిపతి' భోజరాణ్మహిమఁ జెల్లెను [5]'లోహర' కింద్రుఁ డౌచు; భా
రతి తదురఃస్థితేందిరశిరంబున మెట్టుచుఁ దన్ముఖంబునం
దతికె, విలాసభంగి నిడునట్ట[6]లలామముమించుఁ గాంచుచున్. 48

చ. పరిణతియద్భుతంబుఁ గనుపార్థివుత్యాగము [7]కాంతకీర్తి యై
వఱలఁ గొలంత వల్కెడు నెవండు? స్వకర్కశతర్కపద్ధతిన్
నరపతిచేతఁ గీ దెడలుజ్ఞానిగృహంబుల నిల్పఁ గాంచునిం
దిర నిదురింప దిప్డను దదీయవధూజనభూషణధ్వనిన్. 49

1. కదలికగల. 2. ధనాగారములు. 3. పహరాయేనుఁగులు. 4. పరమేశ్వరునకు. 5. 'లోహర' దేశమునకు రాజు. 6. తిలకము. 7. మనోహరయశము గలది.



తే. గీ. రమణ [1]'బాహుస్థ'లాబ్జినీ[2]రాజహంస
వార్ధ మతనిబాహువు మ్రింగె వడిని [3]'రాజ
పురి'ప్రతాపంబుఁ జెక్కిళ్లఁ బొరలునశ్రు
ఝరుల నన్నులచన్నులు బురదవఱచి. 50

ఉ. దానలతుంటిసౌరున రసజ్ఞత పీఠి యవజ్ఞచే, సభా
స్థాన మలంకరించు నిరుదంతలఁ బండితమండలంబునన్
మానధనుండు హేమ-మణిమండితకుండలనిందఁ జేసి సం
ధానము సేయు వైష్ణవకథాశ్రవణంబె శ్రవఃప్రభూషగా. 51

చ. సుకృతఫలం బనాఁ బొడమె సూనుఁడుగాఁ 'గలశుండు' తన్నృపా
లకుసతియందు; [4]దైవతకులప్రభుదంతికరాతిశాయిదోః
ప్రకటనుఁ డాతఁ డొప్పె, ననిఁ బాయుచుఁ బర్విడుతేండ్లసంపదల్
సకలము లొందె దంతిమదసాంద్రమషీతతపంకఖడ్గమున్. 52

చ. శితకరవాలశైవల[5]విశేషితసాంద్రవినీలరోచు లా
నతిశయదర్పశాత్రవధరాఽధిపతిధ్వజినీశిరంబులన్
జ్యుతములఁ జేసి ధర్మవనజోపమతన్ముఖదర్శనంబునన్
గృతమతి యొచుఁ జేరె సిరి కీర్తివిభూషణ యై నృపాంఘ్రులన్.

మ. జయయాత్రాచణుఁ డౌచుఁ గాంచి స్ఫటికాచ్ఛచ్ఛాయ[6]'మచ్ఛోదమున్'
స్మయ[7]దింద్రాయుధరింఖికాంకతతసీమాచారి యై ధారణీ
దయితేంద్రుండు మితోక్తియుక్తముగఁ ద[8]త్కాదంబరీ[9]సక్తులన్
నయ మొప్పన్ [10]నియమించెఁ జిత్రముగఁ [11]జంద్రాపీడుస్తోత్రంబులన్.

1. పట్టణముపేరు. 2. 'రాజశ్రేష్ఠులు-రాజహంసలు'అని శ్లేష. 3. పట్టణముపేరు. 4. ఐరావతము. 5. వింతరూపము గల. 6. సరస్సుపేరు. 7. అశ్వముపేరు. 8. 'కాదంబరి'యను నాయికపరిజనమును. 9. పరిలనమును. 10. పనిచెను. 11. నాయకునిపేరు. (ఈ పేర్లు 'కాదంబరీ' కావ్యమునందలివి).

ఉ. ఆపయి నుత్తరంబుఁ జనునాతనిచే నుతి నందెఁ బేర్మి, గౌ
రీపతిగోఖురక్షతరేఖలఁ జెన్నగురాజతాద్రి, లం
కాపతిదోస్తటిస్ఖలన గాసిలి శైలతటస్థలంబులం
దూపిరిఁ ద్రిప్ప రిప్పుడును నుక్కఱి కొందఱు శర్వపార్షదుల్. 55

చ. అలకను జాతరూపకపిశాంగులఁ గొందఱ యక్షకన్యలన్
వలచి పరిగ్రహించి యటుపై నుదగాశను మానసంబు పెం
పులఁ గని వచ్చుచున్ గిరిశమూర్ధసరత్సురనిమ్నగాంబులన్
[1]మలయఁగఁ జేసె మానససమాహృతపద్మము లాతఁ డిమ్ములన్.

చ. చతురకృతాస్త్రతన్, సకలశాస్త్రత నాతఁడు గాంచుశంసకున్
క్షితిఁ జెలు లిర్వు రొప్పుదురు శ్రీసతి, భారతి; వారిలో రమా
సతి [2]వనదాఽళకపత్ర యయి సల్పును గొల్వు భుజంబునన్, సర
స్వతి భజియించు వక్త్రశశిఁ జారుయశోధవళాఽతపత్ర యై. 57

మ. మరుదుద్దాంతగతిస్ఫురత్తురగసంవ్రాతంబుచే 'వాలుకాఽ
విరళాబ్ధిన్' వడి దాఁటి 'శ్రీధర', 'జయాపీడ' ప్రభావుండు భూ
వరుఁ డుర్వ్యేకభటుండు గెల్చియును గర్వం బంచు నెంచండు హ్రీ
స్థిరుఁ డై శ్రీరఘురామునం, దతఁడు మున్ జెండాడుటన్ 'దాటకన్'. 58

ఉ. కాలునినాల్కనాఁ దగునృకాంతకృపాణము లోఁ దలంచ, [3]మై
కో లగుభీతిపేర్మి మరుకూర్మలపెంపులు దూలుధారణీ
పాలురు, [4]శాదనీలమహిభాగములం, దబలా[5]శిరోజపా
శాఽళినిఁ, బ్రావృషేణ్యజలదాఽవళి హర్షము డించి రార్తు లై. 59

1. వ్యాపింపఁగ. 2. 'జలదమువంటినల్లనికొఱుగు గలది' యని భావము. 3. నమ్మరి. 4. పచ్చిక. 5. కొప్పులు.



మ. తనకున్ దేవియు 'హర్షదేవు' [1]ప్రసు వౌతన్వంగిపాలింట్లసీ
మను సేవానత[2]యక్షరాడ్వితరణం భాసిల్లు[3]'నేకావళిన్'
గని తేఁ డాతని కద్భుతోపకృతిఁ దాఁ గావింపఁగా నెంచి, రా
మునిముల్లుల్ మును [4]బుష్పకంబుఁ గొనఁగాఁ బొందెన్ మనఃఖేదమున్.

చ. మును దనయొదలల్ దునుమ మొక్కలుకత్తినిఁ [5]గస్తిఁ గాంచి తా
మును గొని రువ్వశర్వగిరిఁ బొల్పగుసానగఁ గోరినట్టియా
మినిచరనేత నైన నని మించి జయించినరాముఁ డేనిఁ [7]బో
ల్కినిఁ త్రిజగత్ప్రసిద్ధగుణలీలు నృపాలునకున్ [8]సముద్రుఁ డౌ. 61

శా. ఆరాన్మంథరభూధరభ్రమణభిద్యద్వార్ధిరుణ్మూర్తి నాన్
దూరవ్యాపినిజోర్ములన్ ధరణిభృన్మూలచ్ఛిదాశక్తి నై
వారం గల్గిన'చంద్రభాగఁ' బృతనాధ్వస్తాంబుతన్ నిల్పి కా
శ్మీరేలాకుముదిన్యతిగ్మరుచి తాఁ జేసెన్ స్థలం బై తగన్. 62

చ. తన[9]ఘనశేషభంగరుచిఁ దంతితురంగము లంటి కాపుఁ గ
న్నను సకలోర్వి గెల్చునరనాయకుసైన్యము [10]లబ్జినీసుహృ
త్తనయను ధారణీలులితదంతురవిభ్రమకుంతలాసితాఽ
భను [11]భయదాంతకస్వసను బాన మొనర్చె నశేషతోయఁగాన్. 63

చ. గిరిసహచారికీర్తుల నిగిడ్చి వసుంధర నించి, సర్వగ
హ్వరిని జయించునాయవనిపాలుఁడు సేరె [12]నరాఽశుగాఽహతుల్
వఱపిస[13]నల్లవెల్లిఁ గురువల్లభుకిరిటి[14]కమ్మ [15]కర్ణజ
ర్జరితవిధిన్ దొఱంగి తరసా [16]మును కొంది రహించు[17]క్షేత్రమున్.

1. తల్లి. 2. కుబేరుఁడు. 3. ఒకవరుస గలముత్యాలహారము. 4. కుబేరుని విమానము. 5. దుఃఖముచేత. 6. రావణుఁడు. 7. పోలిక. 8. ముద్రితుఁడు (ముకుళితుఁడు). 9. గొప్పగా శేషించినయలంకాంతిచేత. 10. యమున. 11. భయంకరుఁ డగుయముని చెల్లెలిని. 12. అర్జునుఁడు. 13. నెత్తురు. 14. దంతపత్రము. 15. చెవి-కర్ణుఁడు. 16. మునుఁగుట. 17. కురుక్షేత్రము.

శా. హర్షం బూన్చుచు 'హర్షదేవుఁడు' సుతుం డై తేనికిఁ బుట్టె 'శ్రీ
హ'ర్షాశ్రితకవిత్వవృద్ధి జనులన్ హర్షాఢ్యులన్ జేసి రా
ట్ప్రోర్షోద్యన్మణిభేదకుంఠితనిజాసిన్ [1]బెట్టిదికై తొద్దువన్
హర్షించెన్ [2]బద నూన్చుచున్ మిగుల శాస్త్రాస్త్రప్రభావంబులన్. 65

ఉ. వానియపూర్వశబ్దపరిపాకము వాక్చతురత్వచర్యలన్,
మౌనము వాదిసంతతికి మైకొనఁ జేయుచు నెల్లబాసలన్
జా నగువానికై త భువనత్రయి సన్నుతి కెక్కెఁ; దన్నిలన్
బానము సేయఁ గర్కశపువాలుక యౌ నల తీయశర్కరల్. 66

ఉ. కోరినవస్తు వొంద గడికొన్నప్రమోదముచేత మించుభూ
దారునిచేఁ దిరస్కృతినిఁ దాలిచి మూర్ఖుఁ [3]గ్లమించి సోలుచు
న్నారులు బాష్పపంకమునఁ దామ [4] లుఠించిరి; గండపాండుతన్
వేఱు నుతింప నేల! కడు వెల్లడి గాన్ శ్రుతిదంతపత్రముల్. 67

మ. 'క్షితిప'త్యాఖ్యనరేంద్రకీర్తినిధి నిస్సీమస్ఫురద్దుర్గసం
యుతి నుత్కర్షతఁ గాంచి హర్షనమజుం 'డుత్కర్షదేవుండు' పొ
రతతుల్ ముత్పులకల్ గనన్, మహికి దుర్వారక్రుధమ్లేచ్ఛసం
తతిసప్తిప్రవజరింఖకాఖురదితముద్రల్ మాన్పి యొప్పెన్ గడున్. 68

ఉ. మానవనేతకున్ 'విజయమల్లుఁడు' నా నొకఁ డాత్మజుండు వే
త్తై నయనాభిరామవిమలాకృతిగా నెగడెన్ బ్రతాపి యై,
స్వాననమందుఁ జెంది కమలాననురాణి రదప్రదీప్తి[5]నం
దానితసూనమాల యుపదానముగాఁ దన కొప్పుచుండఁగన్. 69

1. బంగరుకంకణము. 2. వాఁడి చేయుచు. 3. శ్రమించి. 4. పొరలిరి.
5. కూర్పఁబడిన.



చ. పరిణతలేఖసృష్టియలవాటున నొప్పెడుసృష్టికర్త క
ల్పెరు వగులేఖ మైపొడఁగు చెల్వు నిరన్ [1]లటభాంగనాదృశా
హరుఁడు గ, జ్యానినాదపరుఁ డై యల మన్మథుఁ డెల్లవేళ జా
గరమున నిల్పు సజ్జుడుగఁ గౌసుమచాపశరాభిరాముఁ డై. 70

బిల్హణకవి చరితము

చ. 'ప్రవరపురంబు'నుండి [2]త్రిగవ ర్వెడగా విలసిల్లు, ద్యోస్థలి
న్దవిలెడుమేడలన్[3]'జయవనం', బట నిర్మలవారులన్ బ్రదా
కువులకు నేత తక్షకుని'కుండము' వొల్చెడు, ధర్మకర్త న
ప్రవణత మీఱుననుగ్రకలివక్త్రముఁ ద్రుంచుసుదర్శనంబుగన్. 71

శా. ఆలానంబులఁ బోలుయూపశతముల్ హ ర్వొంద, బంధంబు ల
న్నీలోలత్వమునన్ గలిద్విపము త న్జెందంగ రా కుండ, నా
భీలం బై, తదుపాంతసీమ, సుగుణాన్వితత్వసంప్రాప్తకీ
ర్త్యాళిన్ గ్రామ మొకండు 'ఖోనముఖ'విఖ్యాతిన్ రహిన్ గాంచెడిన్.

ప్రకారాంతరానువాదము

శా. [4]ఆలానంబులఁ బోలు[5]యూపశతముల్ హ ర్వొంద, బంధంబు ల
న్నీలోలత్వమునన్ గలిద్విపము త న్జెందంగ రా కుండ, నా
భీలం బై, పురిఁ జేరి 'ఖోనముఖ' మన్ పే ర్గన్నగ్రామంబు, ధా
రాళాఢ్యయసమగ్రసద్గుణగణప్రాశస్త్యకీర్తిన్ దగున్. 73

ఉ. చిత్రకథాఢ్యభూమియును, [6]శ్రీగిరిశశ్వశురాద్రిమధ్యమ
క్షేత్రము నై నతత్స్థలి వచింపఁగ నేల! తదంతరాన నే
కత్ర, నిసర్గశోభనతఁ గల్గఁగఁ జేసెడుకుంకుమంబు, న
న్యత్రగ, [7]సారవేషసిత మై కడు [8]ద్రాక సమృద్ధిఁ బుట్టఁగన్. 74

1. సర్వాంగసౌందర్యవతి. 2. మూడు పరుగులు (సార్ధగవ్యూతి). 3. అపేరు
గలస్థానము. 4. గజబంధనస్తంభము. 5. యజ్ఞశాలలోనిపశుబంధనస్తంభ
ములు (గుంజలు). 6. హిమాలయము. 7. నరయూథపము. 8. ద్రాక్ష.

శా. ప్రారంభంబున సత్కులాఽభిరతి 'గోపాదిత్యుఁ' డన్‌రాజు కా
శ్మీరాఽస్థానికి మధ్యదేశమునఁ బేర్మిన్ గన్నభవ్యాఽత్ములన్
వే రావించెఁ; దదాదిఁ 'గౌశిక'కులుల్ విద్వద్వతంసుల్ ద్విజుల్
సారబ్రహ్మరతాఽత్ము లుందు రట వంశప్రాభవోపేతు లై. 75

ఉ. వారిమఖాగ్నిధూమ్యలు దివంబున నిండి '[1]శతాధ్వర' ప్రియో
దారయశంబుఁ గూర్పఁ గనినంత, శతాధ్వరుఁ డేరిమాట నే
స్దారుపఁ బోఁడు గోత్రపుటి; నాకముచింతఁ గనండు; ఛాయ దై
వారక చిత్రసంగతునిభంగి విచేష్టితునట్లుఁ బొల్పయిన్. 76

చ. తనసతతాగ్నిసేవనవిధానమునన్ జనియించుస్వేదజీ
[2]వనమున ముజ్జగానఁ గలిబన్నముఁ బాప సమర్థుఁ డై జగ
ద్వినుతపవిత్రవృత్తమునఁ దేజిలుతత్కులజాతులందు న
త్యనఘుఁడు దాల్చె 'ముక్తికల' శాఽఖ్యుఁడు స్వాన్వయశేఖరత్వమున్.

చ. నలుమొగముల్ నివాసముగ నల్వ యొనర్చిననాల్గువేదముల్
[3]పొలు పగునీసునన్ జగడముల్ గన నున్నఁ దదీయశాంతికై
కలిపి నిజాంబుజాఽనన [4]మొకంటనె నిల్పె నతండు [5]వల్లభాఽ
వళి నెనయించులీలవలెఁ బండితవర్యులు మేలు మే లనన్. 78

చ. [6]శ్రుతనిపుణుండు 'రాజకలశుండు' పరాక్రమవైభవుండు దా
తృత గలవాఁడు దద్బుధవరిష్ఠసుతుం డయి పెంపుఁ గాంచె; నం
ధతమసభంగి నేఁడును [7]యథాగతి శీతకుభృత్పరంపరా
స్థితగుహ లెంతయున్ బయటఁ జిమ్ముఁ దదధ్వరధూమపుంజముల్.

1. ఇంద్రుఁడు. 2. బలము. 3. స్థిరము. 4. అమహత్తగు 'ఒకఁడు'కు నౌపవిభక్తికరూపము. 5. దీనిచేతపతనిదక్షిణనాయకత్వము ధ్వనితము. 6. శాస్త్రములయందుఁ బారంగతుఁడు. 7. గమనము వీడక.



చ. సకలజనానుభోజ్యముగ సాగినదాకలు నిండుతోఁటలున్,
సకల[1]కలాప్రదేశములు, స్వచ్ఛజలంబులకూపముల్, ప్రపల్,
సుకృతనికేతనం బతఁడు చోటునఁ జోటున దేశభూషగా
[2]సుకృతిగృహాంగరక్షఁ గలిసూడు సనన్ ఘటియించు నిచ్చలున్.

మ. కొమరుం డై జనియించి 'జ్యేష్ఠకల'శాఽఖ్యుం డయ్యెరుఖ్యాతి కు
త్తమసారస్వతవేది, వేదనిధి, [3]యుచ్ఛ్రాయక్షముం, డద్భుత
స్వమనీషామహిమాఽప్తి వ్యాఖ్యను మహాభాష్యానకున్ లోకవం
ద్యముగాఁ గూరిచె; నొప్పె ముంగిటను శిష్యవ్రాతముల్ భాసిలన్.

చ. అతిథులసేవ [4]నిష్టములయందునఁ [5]బూర్తములందు సేవకా
త్యతులితసాంత్వనన్ గహనమా! యితరార్థసమర్థనంబులన్,
హితకృతు [6]లైహికంబులు ననేక[7]పరంబులు నల్పఁ జాలును
న్నతిఁ దగు 'నాగదేవిఁ' దనఁనాతిఁగఁ గొన్బుధమౌళి కెంతయున్.

బిల్హణజననము

చ. కనకరుచుల్ [8]ప్రతీకములఁ గాంచెనొ నాఁ దగు[9]మేల్మిరోచులన్
[10]గనుమరు లూన్చు'బిల్హణుఁడు' గల్గె జగన్నుతి మించ వానికిన్;
వనజజురాణి బిల్హణునివక్త్రమునన్ నిలు పొందె [11]గీస్త్రయీ
ధ్వని, తన[12]శింజఁ గప్పఁ, దగుతావుగ[13]మౌంజినిఁ దాల్చునాఁడుగన్.

శా. సాంగాఽమ్నాయము, శబ్దశాస్త్రమున [14]శేషాహీశ్వరవ్యాఖ్య, శ్రో
త్రాంగానందము సాహితీగరిమ తత్ప్రాణంబు లై మించ నెం
చంగా శక్తుఁ డెవం డిలన్? వినుఁడు తత్సారంబు స్వచ్ఛస్వధీ
రంగద్దర్పణమందు నందముగ సంక్రాంతస్థితిన్ నిల్చెడున్. 84

1. విద్యావ్యాఖ్యాస్థానములు. 2. ధర్మము. 3. అధికక్షమాసారుఁడు. 4. ఇష్ట కర్మలు:-'అగ్నిహోత్రము. తపస్సు. సత్యము, వేదాధ్యయనము, ఆతిథ్యము, వైశ్వదేవము' 5. పూర్తకర్మలు:-'వాపీ-కూప-తటాకాదులను, దేవాలయములను, ఆరామములను నిర్మించుట, అన్నదానము చేయుట. 6. లౌకికసుఖములు. 7. పారలౌకికసుఖములు. 8. అవయవములన్. 9. బంగరుకాంతులన్. 10. నేత్రమోహము. 11. వాణివేదధ్వని. 12. మంజీరనాదము. 13. ఉపనయనమునందు వటువుమొలఁకు గట్టఁబడుముంజదర్భమొలత్రాడు. 14. పతంజలిభాష్యము.

శా. శ్రీవాణీపదపాంసుకార్మణతపేర్మిన్ దద్విపశ్చిన్ముఖ
శ్రీవీక్షారతి గుంపు గట్టెను [1]గలాస్త్రీరాజి; తత్కీర్తి వా
మా[2]విభ్రాంతిఁ దాలంచుకంచుకులుగా [3]మా నొందె దిక్పాళిఁ ద
త్ప్రావీణ్యోద్ధురసర్గబంధతతి సార్థం బౌచు వ్యాపించుచున్. 85

చ. అతఁడు గడించుపాండితికి నొదలఁ గై కొనె 'నిష్టరామ' నం
జ్ఞత నుతిఁ గన్నయన్న నరనాథవితానసభాఽవతంస మై;
సతము నిజాఽస్యమందు నుడిచానఁ గవీశ్వరమాతఁ గావ్యణా
మృతరస మానుమానవులు మించుప్రపాలలనన్ బలెన్ గనన్. 86

ఉ. నందితకీర్తి [4]యాతనికి నవ్యకలాకుశలుండు తమ్ముఁ 'డా
నందుఁ' డసూయమై మదమునన్ దను దాఁకుకువాదిమత్సరం
బుం దునుమన్ గుఠారముగఁ బొల్చె: సరస్వతి శీతశైలమం
దొందుచు నిష్ఠురత్వము సమున్నతిఁ దన్మృదుజిహ్వ నిల్వఁగన్. 87

శా. చెందెన్ నిర్మలశాస్త్రతత్త్వమును గాశ్మీరంబులందుండి; పై
నందెన్ నిక్కము మంచుకొండఁ గలశైత్యం బెంతయున్; [5]ముమ్మగా
[6]మ్రందన్ జేయు నెటుల్ తదన్యగతి, సామర్థ్యాఽత్ముఁ డై యెల్లెడన్
నిందావాదులమోములన్ నిల హిమానీప్లుష్టపద్మాఽకృతిన్ ? 88

శా. దోలాకేళిలులత్కటీభరమునం దూగాడు చున్నట్టిరా
ధాలీలావతిచేతఁ ద్రుంగి తరు లిందాఁకేని [7]నూర్పోని[8]గో
పాలేశాజిర మొప్పుబృందవనిక్రేవన్ [9]దీర్పెఁ బె కైక్కన[10]ఘ
స్రాఽశిన్ దా మథురన్ వివాదరతి [11]ధీరాఽశిన్ ద్రుటిన్ గెల్చుచున్.

1. విద్యావధూపంక్తి. 2. చంచలత. 3. మనోజ్ఞత. 4. లిల్లడునకు. 5. వరునగా. 6. నొచ్చున్. 7. ఊపిరి వెడలని. 8. కృష్ణుఁడు. 9. కర పెను. 10. దినాళి. 11. పండితాళి.



ఉ. నిస్సమశాస్త్రవాదముల నేర్పునఁ బల్కుచు దిక్కుదిక్కులన్
నిస్సమతద్యశంబులను నిల్పెడుశిష్యుల కంతరాయ మై
దుస్సహదిగ్గజేంద్రమదతోయసమాస్వదనప్రమత్తరం
హ[1]స్సమలిద్రుగాలపనజాఽరవడంబర మొక్కటే తగున్. 90

ఉ. పామరుఁడేనిఁ, బండితుఁడు, బాలుఁడు, వృద్ధుఁడు, స్త్రీ, నరుండునే
సీమహితాఽత్మకావ్యము మెయిన్ బులకల్ మొలవన్ బఠింపఁడేన్,
గ్రామము గాదు; దేశమును గా; దది రాణ్ణగరంబు గాదు; కే
శీమహి గాదు; కానయును లేదు; సరస్వతి లేదు ధారణిన్ . 91

మ. తనయుత్తుంగమణీమయాఽలయము లందం బైనసోపానలీ
ల నిగుడ్చున్ జదలన్ బొదల్పురలప్రో ల్దా నౌసిరిన్ డించి మిం
చినపూర్వైర్యముఁ 'గాన్యకుబ్జము'ను, నిస్సీమంబుగా మ్రోగుగం
గను దర్శించుచుఁ జొచ్చి తద్యశము స్వాఽజ్ఞావర్తిగాఁ బూనిచెన్.

చ. కలి నుడిగించుధర్మధృతఖడ్గము దా [2]వినువాఁకకోశమం
దుల [3]రవిజాతవేణివిధిఁ దూఱి రహించఁగఁ, దీర్థరాజ మై
యలరు'ప్రయాగ'మందు జగదద్భుతసద్గుణసంపదాఢ్యుఁ డై
సలుపుచు దానముల్ నిలిచె సన్నుతుఁ డచ్చటఁ బెక్కువారముల్.

చ. కలయ నిలన్ భ్రమించుకలికాలపుభీతినిఁ దన్నుఁ జేరి చిం
తిలుచును ధర్మ మొందినపథిశ్రమమున్ దనశీకరంబులన్
దొలఁచుచుఁ '[4]గాశికన్' వెలయు[5]ద్యోపథనిమ్నగఁ గ్రుంకి దుర్విధి
స్థలితకుభూపులన్ గన నెసంగుకళంక మతండు [6]దూలిచెన్. 94

1. భృంగశ్రేణిగీతధ్వని. 2. గంగానది. 3 యమునావేణిభంగిని. 4. కాశీపురమునందు. 5. గంగానది. 6. తొలఁగించెను.

చ. అల [1]'కాళింజరభూధ'రేశునకుఁ [2]గాలాభుండు [3]'డాహాల'భూ
వలయేశుండు నిజాశ్వరింఖలరుతిన్ వ్రక్కల్ గఁ [4]'దుక్థార' భూ
తలి రాట్శూన్యముఁ జేయు'కర్ణ'[5]పతి తత్కావ్యాగ్రణీప్రజ్ఞచేఁ
బొలిచెన్ గర్ణసుధారసాస్వాదనసమ్మూర్ఛన్మనఃకంజుఁ డై. 95

చ. మును స్ఫటికాద్రిచేఁ దనివిఁ బొందక డాపలికేల దాని నుం
డను నిడి, మంచుకొండను నిడం దృటి దక్షిణహస్తమునన్ నిగి
డ్చినదశవక్త్రుఁ ద్రుంచురఘుశేఖరురాణ్ణగరం 'బయోధ్య' నీ
ఘనకవి స్వీయసూక్తిరసగాహనఁ జేసెను శైత్య మందఁగన్. 96

మ. ఘనుఁ డౌ'డాహల'భూపుసౌధమునఁ దా 'గంగాధరున్' గెల్చి, గె
ల్వ నెదుర్కొన్నృపు[6]'ధీరులన్ గెలుచువిద్వచ్చంద్రుగాథాళి, ప్రా
చ్యనగప్రాంతచర[7]త్సురేభమదతోయభ్రాంతభృగారవం
బును నిర్జించి సురేంద్రుకర్ణపుటినేన్ బొర్లాడు నం చెంచెరన్. 97

ఉ. కారు సమంబు భోజునకుఁ [8]గానరపాలురు; నీవు నుంటి వే
లా! రహి రాక యీనృపలలామునికొల్వున; 'కేను దుర్విధి
ప్రేరిత' నంచు, ద్వా[9]ర్దమరకృచ్ఛిఖరోర్ద్వయనప్రవర్తితో
దారకపోతరావమిష యై తగె దీనత [10]'ధార' వల్కె నాన్. 98

చ. అనయ మపూతలే యగుచు, నాదటఁ [11]గచ్ఛమునన్ గదింపఁగాఁ
జనక, నుదుల్ వెలార్చునెడఁ జాల జుగుప్సను గూర్చు'గూర్జ'రా
వనిజనసంగ మధ్యమున వర్తిల నందినవంత 'సోమనా
థు' [12]నభవుఁ గాంచి య[13]క్కవివిధుం డల తాఁ దొలఁగించె నెంతయున్.

1. ఒకదేశముపేరు. 2. యమతుల్యుఁడు. 3-4. దేశములపేర్లు. 5. రాజు. 6. పండితులన్. 7. ఐరావతము. 8. నీచనృపతులు. 9. ఉపద్రవము చేయు. 10. భోజునిరాజధాని. 11, కక్షాబంధము. 12. ఈశ్వరుని. 13. కవిచంద్రుఁడు.



ఉ. ఘోర[1]హతిచ్ఛలంబున [2]భృగుప్రభవుం డల రువ్వ[3]నర్గళం
బౌరహి, [4]వార్ధి స్వేచ్ఛగ విహార మొనర్చుట నాఁపు[5]పూగగో
త్రారుహనీలవేల వసుధాతలనాథశతావలోకనో
దారకుతూహలాయతి బుధాగ్రణి తా విహరించె నెంతయున్. 100

శా. పారావారశిరస్స్థలిన్ నిలిపి [6]ఖల్వాటత్వమున్, మీఁదు, లం
కారాజాపహృతాత్మజానుగత యై క్రవ్యాదనేదిష్ఠసీ
తారామాస్థితి వించు భీతిఁ గనునా[7]ధాత్రీసదృక్సేతువం
దారాజన్యుఁడు మెట్ట కున్నను దదీయఖ్యాతి దాఁటెన్ జుమీ. 101

ఉ. [8]అంతలు నింత లౌనృపులయందుఁ బరాఙ్ముఖుఁడున్. సుధీనిశా
కాంతుఁడు [9]యామ్యదిక్కునకుఁ గౌతుకి యై చని యిట్టు లెంచె; 'నీ
ప్రాంతపుఁగాంతలందలికుచాయతియున్నతి నేమి సెప్ప, నా
కంతుఁడె ముజ్జగంబుఁ గొనుగండఁడు ధాత్రత వానిఁ గొల్వఁగన్.'

శా. చోళాఖిల'చళుక్య'భూమిపతిచే సూరీంద్రుఁ డొందన్ మహా
నీలచ్ఛత్ర-మదేభరాడ్ధ్వజముతో[10]న్విద్యాపతిత్వంబు, నా
పై లాలించె దృఢోపగూహనకళావాల్లభ్యవేల్లద్భుజా
హేలాశింజితహస్తభూష యయి యెంతే వాని రాలచ్చియున్. 103

మ. మదపానంబునఁ దుమ్మెదల్ నిదుర [11]మైమై మైకొనన్, గగ్గురుల్
గదురన్ దిక్కరులేని వేనియళ మాకర్ణించు, నాతండు దా
[12]న్గదియుంచెన్ గమనీయకావ్య మిది కరాటేంద్రప్రీత్యర్థ; మి
య్యది యొందున్ జగతిన్ బుధప్రకరంతాలంక్రియాసుస్థితిన్.

1. ఆయుధ (పరశు) వ్యాజముచేత. 2. పరశురాముఁడు. 3. గడియమాను. 4. పూర్వము పరశురాముఁడు తనపరశువుచేతఁ బశ్చిమసముద్రమును తీల్చినపుడు బెదిర్లిన సముద్రము. 5. పోఁకచెట్లు. 6. బట్టతల గలిగి యుండుట. 7. భూమి-దాది (పెంపుడుతల్లి). 8. సామాన్యరాజులు. 9. దక్షిణదిక్కు. 10. విద్యాధికారిపదవి. (ప్రధానపండితపదవి). 11. అనాయాసముగా. 12. కూర్చెను.

తే. గీ. శాలివాహనశకమున 'శర-విధి-వసు-
చంద్ర'సంఖ్యాబ్దమున (౧౮౯౫), క్రిస్తుశకమునందు
'నబ్ధి-ఋషి-నిధి-భూ'సంఖ్యకాబ్దమందు (1974)
'విక్రమాంకదేవచరిత' వెలసె నాంధ్రి. 115

ఇది శ్రీత్రిభువనమల్లదేవవిద్యాపతి-కాశ్మీరక
భట్టశ్రీబిల్హణ మహాకవివిరచితవిక్రమాంకదేవచరిత
మహాకావ్యంబునకు శ్రీవేంకటేశ్వర
శ్రీనరసింహదేవపాదపద్మాఽఽరాధన
సమాసాదితగీర్వాణాంధ్రకవితావైశారద్య
'ఆంధ్రబిల్హణ'బిరుదాంచిత
లక్ష్మణ-విశ్వనాథ
కవిసోదరాంధ్రీకృత
మహాప్రబంధంబునందు
సప్తమాఽఽశ్వాసము
సమాప్తము

సర్వంబు సంపూర్ణంబు.

శుభం భూయాత్.

—o—

# విక్రమాంక దేవచరితము

(బిల్హణకవి సంస్కృత మహాకావ్యానువాదము)

అనువాదకులు

శిరోమణి - ఆంధ్రబిల్హణ - బ్రాహ్మీభూషణ - సుధీంద్రమౌళి

**కప్పగంతుల లక్ష్మణశాస్త్రి**

ఆంధ్రబిల్హణ

**మాదిరాజు విశ్వనాథరావు**

ప్రకాశకుడు :

**కప్పగంతుల లక్ష్మణశాస్త్రి**

హైదరాబాద్

**1974**

# విక్రమాంక దేవచరితము

(బిల్హణకవి సంస్కృత మహాకావ్యానువాదము)


అనువాదకులు

శిరోమణి - ఆంధ్రబిల్హణ - బ్రాహ్మీభూషణ - సుధీంద్రమౌళి

కప్పగంతుల లక్ష్మణశాస్త్రి

ఆంధ్రబిల్హణ

మాదిరాజు విశ్వనాథరావు



(भारतीय शिक्षामान्त्रलयसहाय्येन प्रकाशितम्)

ప్రకాశకుడు :

కప్పగంతుల లక్ష్మణశాస్త్రి

హైదరాబాద్

1974

# విక్రమాంక దేవచరితము

(బిల్హణకవి సంస్కృత మహాకావ్యానువాదము)

అనువాదకులు

శిరోమణి - ఆంధ్రబిల్హణ - బ్రాహ్మీభూషణ - సుధీంద్రమౌళి

కప్పగంతుల లక్ష్మణశాస్త్రి

ఆంధ్రబిల్హణ

మాదిరాజు విశ్వనాథరావు

(भारतीय शिक्षामान्त्रलयसहाय्येन प्रकाशितम्)

ప్రకాశకులు :

కప్పగంతుల లక్ష్మణశాస్త్రి

హైదరాబాద్

**1974**

ప్రథమ ముద్రణము 1000 ప్రతులు
శా. శ. 1895 - క్రీ. శ. 1974

వెల రు. **13-00**

ప్రాప్తిస్థానము
**కప్పగంతుల లక్ష్మణశాస్త్రి**

ప్రకాశకుడు
**'అమర భారతి'**
5-9-22/97, ఆదర్శనగర్
హైదరాబాద్-500 004 ఆం. ప్ర.
టెలిఫోన్ 33782

ముద్రాపకులు
శివాజీ ప్రెస్,
గంజ్ బజార్, సికింద్రాబాదు




చాళుక్యరాజు–విక్రమాంక దేవుఁడు (షష్ఠ విక్రమాదిత్యుఁడు)

పరిపాలన కాలము - క్రీ. శ. 1075-1126

(కల్యాణీ నగర దేవాలయము గోడపైనున్న చిత్రపు ప్రతిరూపము నుండి)

| పుట | పంక్తి | దీనికి | ఇది |
|---|---|---|---|
| 65 | 26 | కువలం | కువలం |
| 72 | 14 | రంతు | రంగతు |
| 79 | 22 | రవిఁగుల | రవికల |
| 81 | 10 | త్ర్యేక | రైత్యక |
| 90 | 19 | గాంర | గాంక |
| 94 | 6 | రణుండు | రమణుండు |
| 97 | 1 | ఠలు | ఠంబు |
| 97 | 13 | జెయి | జేతి |
| 100 | 8 | తరే | తవరే |
| 101 | 18 | జాడఁగా | జూడఁగా |
| 103 | 7 | పిల్లఁగా | సిల్లఁగా |
| 103 | 11 | ప్లావద్రుచి | లాస్యద్యుతి |
| 103 | 18 | చేంగి | వేంగి |
| 107 | 5 | సరణాఽరవ | గతమౌరజ |
| 109 | 7 | ఠంబులేదు | ఠుండు గాఁడు |
| 113 | 4 | బల | ధన |
| 114 | 1 | లెఁగ | రళ |
| 114 | 10 | దాసీగతిన్ | దాసిన్ బలెన్ |
| 114 | 18 | నిచుళానిళాఽత్మకా ర్ముఁడు | యుతనిచుళ నిహితకార్ముకుఁడు |
| 114 | 26 | సంక | సకి |
| 115 | 1 | చెందిన | చెందెనొ |
| 115 | 2 | వగ | వనఁగ |
| 115 | 12 | గలను | గలయు |
| 116 | 23 | రసో | రసే |
| 116 | 24 | ర్విరమణ | శ్వరసు |
| 117 | 7 | మరుఁడుతన | మెయిమరుఁడు |
| 118 | 3 | ప్రిదులు | చెదరు |



| పుట | పంక్తి | దీనికి | ఇది |
|---|---|---|---|
| 118 | 16 | వసనఁగన్ | జనముగన్ |
| 118 | 22 | మూనెన్ | మూనెనొ |
| 118 | 24 | తమో | తనన్ |
| 119 | 7,8 | నితంబ... ...వింతగన్ | ములన్ గుసుమాయుధుండు సుస్థిరుఁ డయి నిల్చె నుచ్ఛ్వసి తధిగరిమన్ జలదంబు డిందఁగన్ |
| 119 | 16 | నయనపథనూతనమై | హావరపథమై వెలుచన్ |
| 119 | 22 | యుడిగెనొ నా నెఱింగిఁవం | యుడుగుట నెఱిఁగె ననఁగఁ బం |
| 120 | 1 | విరి | యఁగ |
| 120 | 1 | డల | డలు |
| 120 | 2 | పొఙఁగగు | పోలఁగ |
| 120 | 2 | రున | రును |
| 120 | 11 | మన మహాఫలకంబున | మున తుణ్ణం బన మహా |
| 120 | 16 | లేఁడ | లేదె |
| 121 | 21 | ఈపద్యమునకు | "అడుగడుగున సంపెంగలు, పొడవు మెఱసె సుభట సైన్యమున్ మదనునకై, యొడఁ గూర్పఁగఁ జైత్రుం డను, గడిదొర వెదఁజల్లినట్టి కాంచన మనఁగన్ |
| 122 | 2 | సకల | వివిధ |
| 123 | 3 | విరహా | విరహి |
| 123 | 15 | తాంగుఁడు శశి యైనటు | తాంగుం డై నటు శశి |
| 123 | 16 | గఁ దరంశులు | గ నిజాంశుల |
| 126 | 9 | ర్శ్యంగం | ర్శృగం |
| 126 | 18 | దళపాం | దపాం |

# ఉపోద్ఘాతము

సంస్కృతవాఙ్మయమందలిఅత్యుత్తమమహాకావ్యములలోఁ జేర్పఁ దగినది బిల్హణమహాకవి రచించినయీవిక్రమాంకదేవచరితము. మీఁదుమిక్కిలి మిగిలినవాని వలెఁ గాక యిది చారిత్రికము. ప్రాచీనపౌరాణికకథాశ్రయము గాదు. కవి తన ప్రభువుయొక్క చరితమునే కావ్యముగా రచించినాఁడు. కావున నుత్తమకావ్యగుణములే కాక సమకాలికచరిత్రయు నిందు జేరి యున్నది. కథానాయకుఁ డైనవిక్రమాంకుఁడు కల్యాణకటకము రాజధానిగా ద్రవిడదేశమునేకాక మిగిలినదక్షిణాపథమునంతటిని జయించి యేఁబదియేండ్లు ఎదురు లేక పరిపాలించినచాళుక్యవిక్రమాదిత్యుఁడు. ఇతనిరాజ్యకాలము క్రీ॥ శ॥ 1076-1126 సం॥ వఱకు ఉండినది.

ఈమహాకావ్యమును చిరకాలముక్రిందనే శ్రీతిరుపతివేంకటకవులు ఆంధ్రవచనకావ్యముగా రచించి 'సరస్వతి' యనుపత్రికలోఁ దిరుపతిశాస్త్రిగారు జీవించి యుండినపుడే, ప్రకటించి యుండిరి. ద్వితీయముద్రణము 1935 సం॥లో వెలువడినది. సంస్కృతమూలముయొక్క ప్రాశస్త్యమును, సుగృహీతనామధేయులు, తమగురువర్యులు కీ॥ శే॥ శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారివలన విని, వారియాదేశానుసారముగా వనపర్తిసంస్థానవిద్వత్కవు లైన శ్రీయుతులు కీ॥ శే॥ మాదిరాజు విశ్వనాథరావుగారును, మిత్రులు శ్రీకప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారును చిరకాలము క్రిందనే పద్యకావ్యముగాఁ, బ్రాచీనకవులసరణిలో నాంధ్రీకరింప నారంభించిరి. నడుమ శ్రీవిశ్వనాథరావుగారు గతింపఁగా శ్రీకప్పగంతులవారు పూర్తిగావించి యుండి, యిప్పుడు, అవకాశము కుదురఁగా ముద్రించి ప్రకటించు చున్నారు. నాయందలిమైత్రిచేత నన్ను దీనికి ఉపోద్ఘాతమును వ్రాయవలసినదిగాఁ గోరిరి.

ఈ కావ్యమును సంపాదించి ముద్రించినకీర్తి పాశ్చాత్యులది. డా॥ జార్జి బ్యూలర్ అనునతఁడు 1874 సం॥లోఁ దనమిత్రుఁడు డా॥ హెచ్-జాకోబీ పండితునిసాయమున, రాజస్థానమున సంచరించుచు జైసల్మేరుజైనభాండాగారమున నతిప్రాచీనలిపియందు వ్రాయఁ బడినప్రతినిఁ గనిపట్టి, ప్రత్యంతరము వ్రాయించి, పరిశోధించి, చారిత్రికోపోద్ఘాతముతో 1875 సం॥లో మొదటిపర్యాయము ప్రకటించెను. పిమ్మట

శ్రీరామకృష్ణభండార్కర్‌పండితులును, డా. ఫ్లీటుగారును దమచారిత్రికగ్రంథములలోఁ జాళుక్యచరిత్రములను బ్రకటించిరి. తమిళములో శ్రీ ఏ. వి. వెంకటరామయ్యర్ అనువారు పరిశోధించి విక్రమాదిత్యునిచరిత్రను 1920 సం॥లోఁ బ్రామాణికచారిత్రికగ్రంథముగాఁ బ్రకటించిరి. 1927 సం॥లో మహామహోపాధ్యాయ పండిత శ్రీరామావతారశర్మగారు, కాశీ జ్ఞానమండల ముద్రాక్షరశాలవారి ప్రకాశనార్థము పునఃపరిశీలన మొనర్చి యీయఁగా వారు ప్రకటించిరి. అటుపిమ్మట సాహిత్యాచార్య పండిత మురళీలాల్‌నాగర్ అనువారు జైసల్మేరుప్రతితో పూనాలోని భండార్కర్‌పరిశోధనాలయమువారిప్రతిని, ఇంకను వారికి దొఱకిన యితరప్రతులను సంపాదించి, పాఠభేదములను బరిశీలించి, కాశ్మీర సరస్వతీభవనము (Prince of Wales Saraswati Bhavan Text Series) వారికి శుద్ధతరప్రతిని సిద్ధము చేసి యొసంగిరి. ఇట్లుండియు నేవేవోకారణములచేత స్ఖాలిత్యములు తగ్గ లేదు. నాగరపండితుఁడు బ్యూలర్‌పండితుని చారిత్రికోపోద్ఘాతమును విమర్శించి, అచ్చటచ్చట ఖండించుటయేకాక, కావ్యాంతమందు, పైజైసల్మేరుభాండాగారమందే దొఱకిన 'చరిత్రచందిక' యనుటిప్పణినిఁగూడఁ జేర్చిరి. ఇటీవల శ్రీపండిత విశ్వనాథశాస్త్రిభరద్వాజ అనువారిసంపాదకత్వమున జైనగ్రంథాదికములపర్యాలోచనపూర్వకమైనప్రతి, సంస్కృతటీకా-హిందీభాషానువాదములతో, బనారసు హిందూ విశ్వవిద్యాలయమువారిచే 1958 సం॥లో మూఁడుభాగములుగాఁ బ్రకటింపఁబడినది.

ఇది పదునెనిమిదిసర్గలమహాకావ్యము. కాళిదాసాదులమార్గమున రచితమైనట్టియాలోకోత్తరప్రబంధమునకు నుపోద్ఘాతమును వ్రాయుటకు, గొప్పవారు, సంస్కృతాంధ్రసాహితీనిష్ణాతులును, చారిత్రికపరిశోధకనిపుణులును బూనుకొనవలసినదిగాని నావంటివాఁడు ఏమి చేయఁ గలఁడు; ఐనను, గల్యాణీచాళుక్యుల చరిత్రను గొంత పరిశోధించినందువలనను, మిత్రులయాదేశానుసారముననను, వారికోరికను గా దనఁ జాలక యేదో వ్రాయు చున్నాను. శ్రీకప్పగంతులవారేకాక మిత్రులు శ్రీతిరుమల రామచంద్రగారును దీనికిఁ బ్రేరకులు. వీరికిఁ గృతజ్ఞుఁడను.

ఈ నాయుపోద్ఘాతమును మూఁడు భాగములుగా విభజించి (1) కవిని గుఱించియు (2) కావ్యప్రతిపాదితవిషయములనుగుఱించియు వ్రాసి (3) ఆధునికమార్గమునఁ జారిత్రికవిషయచర్చను గొనసాగించి, చివరకు, నుపసంహారముగా నాకుఁ దోఁచినకావ్యగుణములను నాంధ్రానువాదప్రాశస్త్యమును గొద్దిగా వ్రాయఁ



దలఁచితిని. ఇందుఁ బ్రధానపురుషుఁడు చాళుక్యవిక్రమాదిత్యుఁడుగాన నాతనిం గూర్చి ఉపక్రమణిక :

## చాళుక్యవిక్రమాదిత్యుఁడు

భారతదేశమందుఁ జరిత్రప్రసిద్ధులు విక్రమాదిత్యు లనేకులు. అతిప్రాచీనుఁడు, శకాది ఒకహర్షవిక్రమాదిత్యుఁ డుండె నని కథలు చాలఁ గలవు. విక్రమమందు ఆదిత్యునితో సమానుఁ డని బిరుదార్థము. విక్రమశకాబ్ద మొకటి, ఎక్కువగా నుత్తరహిందూస్థానమున నీతనిపేర, క్రీ.పూ. 58 నుండి గణింపఁ బడునది కలదు. వింధ్యకు దక్షిణమున శాలివాహనశకము క్రీ.శ. 58 నుండి యారంభింపఁ బడినది వాడుకయం దున్నది. విక్రమాదిత్యుఁ డనుబిరుదును దర్వాత గుప్తచక్రవర్తి చంద్రగుప్త - విక్రమాదిత్యుఁడు (క్రీ.శ. 4వ శతాబ్ది) ధరించెను. ఇతనియాస్థానివాఁడే కాళిదా సని యొక యభిప్రాయము కలదు. ఈ'విక్రమాదిత్య' బిరుదమును 'విషమశీల, సాహసాంక, సాహస విక్రమాంక' ఇత్యాదిగాఁ బ్రయోగించు చుండిరి. భోజునితండ్రి సింధురాజునుగుఱించి 'నవసాహసాంకచరిత' మని 'పరిమళకాళిదా' సనునతఁడు క్రీ.శ. 1010 సం॥ ప్రాంతమున నొకచక్కనిచారిత్రికకావ్యమును వ్రాసెను. విక్రమార్కభేతాళకథలును, భోజవిక్రమార్కచరిత్రలకథలును, అర్వాచీనులు అతిప్రాచీనవిక్రమాదిత్యునికి ముడిపెట్టి, కాలానుక్రమణిక యెఱుఁగక వ్రాసినవి.

చాళుక్యరాజులలో నీవిక్రమాదిత్యనామధారులు అనేకులు కనఁబడు చున్నారు. క్రీ.శ. 550 సం॥ ప్రాంతమునుండి 750 సం॥ వఱకుఁ బాలించినవారిలో నొక విక్రమాదిత్యుఁడు పల్లవచక్రవర్తులవిరోధి కలఁడు. ఇట్లు వచ్చినవారిలోఁ బరిపాలింపక ప్రవాసమునఁ గొందఱు విక్రమాదిత్యులు పోఁగా మఱల సామ్రాజ్యమును సంపాదించిన తైలపుని (972 నుండి) మనుమఁడు ఐదవవిక్రమాదిత్యుఁడు (1008-1012). ఇతని తమ్మునిమనుమఁడే ప్రస్తుతకావ్యనాయకుఁడు, కర్ణాటకచాళుక్యచక్రవర్తి, ఆరవవిక్రమాదిత్యుఁడు (1076-1126) 'త్రిభువనమల్ల' బిరుదాంచితుఁడు. ఈతనియాస్థానమున 'విద్యాపతి' పదవి నధిష్ఠించిన 'బిల్హణ' మహాకవియే యేతత్కావ్యరచయిత.

## ౧ బిల్హణకవి చరిత్ర

ఇతఁడే, కావ్యాంతమున, పదునెనిమిదవసర్గలో వ్రాసినది, ఆత్మకథ (ఆధునిక 'స్వీయచరిత్ర' లవంటిది), ఒకపూర్తిసర్గయే కలదు. అం దిట్లున్నది :-

[1] కాశ్మీరదేశము శైవమతమునకుఁ బట్టుకొమ్మ. వితస్తా(ఝీలం)నదీతీరము నందలి 'ప్రవరపురము'(నేఁటిశ్రీనగరము)దానికి రాజధాని. అదివిద్యలకునాలవాలము, సంపదలకు నిలయము. స్త్రీలుకూడ సంస్కృతము మాటాడువారఁట. 'వితస్తా-సింధు' నదులసంగమము కాశ్మీరమందే. అచ్చటిరాజులు, శివభక్తివరాయణులు కట్టించిన మఠములు దేవాలయములు విద్యాస్థానములు గణనాతీతములు. 'అనంతదేవుఁ' డనురాజును (క్రీ.శ. 1028-1063), అతనికుమారుఁడు 'కలశదేవ'రాజును (1063-1089), అతనికుమారులు 'హర్షాదిత్య - ఉత్కర్షదేవ - విజయమల్లులను' (1089-1101), బిల్హణుఁడు ఎఱుఁగును. వీరిలో విజయమల్లుఁడు మన్మథుఁడే యఁట.

ప్రవరపురమునకు రెండుక్రోసులదూరమున 'జయవన' మనునొకవనమును, దానియందు 'తక్షకకుండ' మనుతటాకమును, నాప్రాంతమున [2] 'ఖోనముఖ' మను ఊరును గలవు. అందుఁ గౌశికగోత్రజులు బ్రాహ్మణు లుండిరి. వీరు 'గోపాదిత్యుఁ' డనురాజుచేత మధ్యదేశమునుండి పిలిపింపఁ బడినవారు. వీరిలో నొకశాఖకు 'ముక్తికలశుఁ' డనుపండితుఁడు కూటస్థుఁడు. అతనికి 'రాజకలశుఁడు', అతనికి 'జ్యేష్ఠకలశుఁడు' ను జనించిరి. ఇతనికి నాగాదేవియందు మహాపండితుఁ డైన 'ఇష్టరాముఁడు'ను, ఈమహాకవి 'బిల్హణుడు'ను, 'కవీంద్రదుర్మదలీలాకుఠార' మగు'ఆనంద'కవియు జనించిరి. ఇట్టిపావనపండితవంశమున వేదఘోషములనడుమ బిల్హణుఁడు జనించెను. అధ్యయన మొనర్చి, పాతంజలమహాభాష్యముతోఁగూడ శబ్దశాస్త్రముఁ జదివి, కర్ణామృత మగుసాహిత్యవిద్యయందుఁ బ్రవీణుఁ డై లేఁత వయసునందే మహాకవి యాయెను.

1. వివరములకు శ్రీతిరుపతివేంకటకవులయాంధ్రానువాదమును జూడుఁడు.
2. నేఁటి 'ఖుమ్మఖ్' అనుగ్రామము. 'పంపాక్' అను చోటికి మారుతిదిశలో మూడుమైళ్ళదూరమునఁ గలదు.



కారణాంతరమునఁ గాశ్మీరదేశమును వదలి, బిల్హణుఁడు మథురాపురమునకు వచ్చి...అందలిసూరిచక్రమును జయించి...బృందావనంబునం గొన్నాళ్లు వసించి యుండి...' తనశిష్యులే...సర్వదిగంతక్షేత్రయాత్ర గావించి తనకీర్తి నివ్యాపింపఁ జేయఁగావెలసెను. ఇతనికావ్యములను జదువనివారు లేరఁట (ఆకావ్యము లేవో చెప్పలేదు). తర్వాత కాన్యకుబ్జాధీశునియాస్థానమునఁ గొంతకాల ముండి (అయోధ్య ?) 'ప్రయాగ, వారాణసి' మున్నగుక్షేత్రములు దర్శించి, 'కాలంజరగిరి' ప్రభువునకు యముఁ డైన దాహళప్రభువు'కర్ణుని'కడఁ గొన్నా ళ్ళుండెను. (ఈకర్ణుఁ డెవఁడో ? మువ్వురు కర్ణులు పరిపాలించిరి. 'చేది'రాజు 'గాంగేయదేవుని'కుమారుఁడు 'కర్ణుఁడు' 1041-1070, సం॥ లోను, అతనితర్వాత ఇరువురుకర్ణులు 'యశఃకర్ణ-గయాకర్ణులు' పరిపాలించిరి). డాహళాధీశునియింట గంగాధరపండితుని జయించి, అట నుండి 'భోజుఁడు' పాలించిన 'ధారా'నగరమునకుఁ బోయెను.

నాఁటికి భోజమహారాజు గతించి కొంతకాల మై యుండ వలయును. ఏల యన నాఁటికి భోజుఁడు లేఁ డని బిల్హణుఁడే వ్రాసి యున్నాడు:—

"నీత్వా గంగాధరమధరతాం డాహళాధీశధామ్ని,
క్రీడాఽఽక్రాంతప్రతిభటకవేః పూర్వదిక్కోటరేషు ।
నిర్జిత్యైరావతమదజలభ్రాన్తభృంగాఽలినాదా
సుత్రామ్ణోఽపి శ్రవసి లుఠితం యస్య శజ్కై కథాభిః"॥(18 = 95)

దీనికి నాంధ్రబిల్హణుల యనువాదము :—

మ. "ఘనుఁ డౌ 'డాహల' భూపుసౌధమునఁ దా 'గంగాధరున్' గెల్చి, గ
ల్వ నెదుర్కొన్రిపుధీరులన్ గెలుచువిద్వచ్చంద్రుగాథాఽఽళి, ప్రా
చ్యనగప్రాంతచరత్సురేభమదతోయభ్రాంతభృంగాఽరవం
బును నిర్జించి సురేంద్రుకర్ణపుటినేన్ బొల్లాడు నం చెంచెదన్".
(7 = 97)

• "భోజః క్ష్మాభృత్స ఖలు న ఖలైస్తస్య సామ్యం నరేంద్రైః,
తత్ప్రత్యక్షం కిమితి భవతా నాఽగతం, హా! హతాఽస్మి।
యస్య ద్వారోడ్డమరశిఖరక్రోడపారావతానాం
నాదవ్యాజాదితి సకరుణం వ్యాజహారేవ ధారా"॥ (18 = 96)

*భోజుఁడు లేఁ డని యిందువలనఁ దెలియుచున్నది. భోజుఁడు గతించిన యనంతరమే బిల్హణుఁడు 'ధారా'నగరమునకుఁ బోయినందువలన, భోజునిచివరి తారీఖు క్రీ. శ. 1050 సం॥ అగుటచేతను, (నాచే నిర్ణీతము చూ The Later days of Bhoja 'The Great' JOR Vol xvi part III March 1947) అటుతరువాతనే బిల్హణుఁడు ధరటికిఁ బోయి యుండవలెను. ఇట్లుండఁగా దీనికి శ్రీ తిరుపతి వేంకటకవులయాంధ్రానువాదమున భోజుఁ డుండఁగానే బిల్హణుఁ ధరటికిఁ బోయినట్లు కలదు. అట్లయినచో 1050 కి ముందే కావలసియుండును. వారియనువాదమున వేఱువిధముగా నున్నది – 'దాహళాధీశునింట నున్న గంగాధరుని జయించి, విలాసముగాఁ బ్రతిపక్షకవికోటి నాక్రమించినయేరాజ దేవేంద్రునికథలు పూర్వదిక్కోటరంబులం దైరావతమదజలాస్వాదమత్తంబులై యున్నతుమ్మెదలరొదలతోఁ బ్రతిస్పర్ధ గావించుచు, దేవేంద్రునికర్ణద్వయముం బ్రవేశించి యచ్చెరువు పుట్టించెనో యట్టి భోజరాజున కితరనృపాలురకును సామ్య మెట్లు లభించును? ఆమహారాజుగుణములు ప్రత్యక్షముగాఁ జూడక పోయితిరి. హా! దైవమా! నేను వర్ణించిన నమ్మదురో నమ్మరోకదా। అతనిధారానగరమే సర్వదా ద్వారోపాంతములయం దున్నవిటంకములమీఁద నున్నపారావతముల యారావములనెపమున నతని నుతించు చుండును. తాదృశమహనీయగుణగరిష్ఠుం డగుభోజరాజకవీంద్రునింగూడ నానారాజసందర్శనకుతూహలంబున బోయి గాంచి, యతనిచే మిగుల సత్కరింపఁ బడి, యయ్యనఘునిసాన్నిధ్యముం దావి......'

అని వారు అనువదించుటకు ఏయాధారమో తెలియదు.

దీనింబట్టి వారి కెట్టిప్రతి, ఎట్టిపాఠాంతరములతో దొరకినదో యని అనుమానము కలుగు చున్నది. అది దొరకినఁ జాల బాగుండును. కాని ప్లీటు, బండా



దీనికి నాంధ్రబిల్హణులయనువాదము :—

ఉ. "కారు సమంబు భోజునకుఁ గానరపాలురు; నీవు నుంటి వే
లా! రహి రాక యీనృపలలామునికొల్వున; 'నేను దుర్విధి
ప్రేరిత' నంచు, ద్వార్ధమరకృచ్ఛిఖరోద్దయనప్రవర్తితో
దారకపోతరావమిష యై తగె దీనత 'ధార' వల్కె నాన్."
(7 = 98)

ర్కరు, బ్యూలరు మున్నగు చరిత్రకారులు 'బిల్హణుఁడు భోజరాజును జొత్తిగా దర్శింప లే'దని వ్రాయు చుండఁగా 'గాంచి యతనిచే మిగుల సత్కరింపఁ బడి' అని వారు వ్రాయుట చాల నాశ్చర్యకరముగ నున్నది. పైశ్లోకములకు బ్యూలర్ పండితుని అంగ్లాను వాదము—

"When in the palace of the Lord of Dahala he conquered Gangadhara, the tale of him who in sport overthrew his rivals in poetry, came, I ween, to the ears of Indra silencing in the caves of the East the hum of the bees that were drunk with ichor flowing from Airawata's temples" (95).

"Simulating the Cooing of the pigeons that nested on the lofty turrets of her gates, Dhara cried to him in pitiful tones : 'Bhoja is my king. He, forsooth, is none of the vulgar princes. woe is to me ! "why didst thou not come into his presence."

ధారానగరమునుండి యాతఁడు గూర్జరదేశమునకుఁ బోయి, యచ్చటి పండితులు తన్నుఁ జక్కఁగా గౌరవింపనందున వారియలక్ష్యజనితపరాభవమువలని మార్గాయాసమును సోమనాథక్షేత్రమందలి జ్యోతిర్లింగదర్శనముచేఁ బోఁ గొట్టు కొనెనఁట. అటనుండి పశ్చిమసముద్రముమీఁదుగా (మళయాళదేశముమీఁదుగా) సేతువునకుఁ బోయెను. అచటినుండి కల్యాణకటకమునకుఁ బోయి చాళుక్యవిక్రమాదిత్యుని సందర్శించి, యారాజునాస్థానిలో 'విద్యాపతి' పదవీనియుక్తుఁడై సుంఖ ముండెను*.

* తిరుపతివారియనువాదమున మఱికొన్ని విషయములు లేవు. ముఖ్యముగా గూర్జరయాత్ర కాన రాదు. భోజరాజదర్శనానంతరము ఇట్లున్నది — 'అయ్యెన ఘునిసాన్నిధ్యముం దాని సముద్రము స్వేచ్ఛాప్రసారముఁ గావింప కుండ భార్గవుం డానర్చిన.......పశ్చిమాంబుధితీరమునకుం బోయి సేతువుం గాంచితి' (పు. 120) 1935 ముద్రణము.

బిల్హణకవిజీవితవిశేషములంగూర్చి సంస్కృతవాఙ్మయచరిత్రకారులు వ్రాసి యున్నారు. మల్లాది సూర్యనారాయణశాస్త్రి గారు తెనుఁగున వ్రాసినదానిలోఁ జాలకొద్దిగాఁ గలదు. ఆంగ్లములో శ్రీ ఎం. కృష్ణమాచార్యులవారు కొంత వివరముగా వ్రాసి యున్నారు. బిల్హణుఁడు భోజుని దర్శింప లేదనియే వీరియభిప్రాయము.

"He intended to see Bhoja of Dhara, but he could not. He went to Anhilwad in Gujarat, but he was not heartily welcomed there and he Complains of this indifference.

"కష్టాదన్యం విదధతి న యే సర్వదైవావిశుద్ధా
స్తద్వ్యాఖ్యాస్తే కిమపి భజతే యజ్జుగుప్సాఽఽస్పదత్వమ్।
తేషాం మార్గే పరిచయవశాదర్జితం గుర్జరాణాం
యః సంతాపం శిథిలమకరోత్ సోమనాథం విలోక్య" ॥ (విక్రమాం 18-97).

దీనికి నాంధ్రబిల్హణీయానువాదము :—

చ॥ అనయ మపూతులే యగుచు, నాదటఁ గచ్ఛమురీన్ గదింపఁగాఁ
జనక, నుదుర్ వెలార్పునెరఁ జాల జుగుప్సను గూర్చు 'గూర్జ'రా
వనిజనసంగ మర్త్యమున వర్తిల నందినవంత సోమనా
థు నభవుఁ గాంచి యక్కఁవివిధుం దల శాఁ దొలఁగించె నెంతయున్.
(7=99).

"He offered his devotions at Somanath and setting out southwards he visited Ramesvara. On his way back he reached the court of Kalyan where Vikramadity VI, Tribhuvanamalla admired his learning and made him his Vidyapati.... ...". దీనింబట్టి చూడఁగా బిల్హణుఁడు భోజునిఁ జూడ లేదు. నత్కారము అనలే పొంద లేదు. ఎట్లు పొందఁ గలఁడు లేని భోజునికడ? ఇంత వ్యత్యాసముతోఁడి మూలము తిరుపతివారికి ఎక్కడ దొరికినదో తెలిసినఁ జరిత్రకుఁ జాల ప్రయోజనకారిగా నుండును.



బిల్హణుఁడు విక్రమాంకుని దర్శించినకాలమునుగుఱించి భిన్నాభిప్రాయములు కలఁ బడు చున్నవి. క్రీ. శ. 1085 సం॥ నాఁటి కీతఁడు ఈకావ్యమును రచించి యుండు నని బ్యూలర్‌పండితునియభిప్రాయము. శ్రీకృష్ణమాచారిగారు క్రీ. శ. 1088 సం॥ నాఁటివిక్రమాంకునినర్మదాతటదండయాత్ర ఈకావ్యమందుఁ గానరా దనియు, నీతనికావ్య మసంపూర్ణ మనియు, నందులకుఁ గాశ్మీరమందు దొరికిన 'చౌరపంచాశిక'యందలియీక్రింది రెండుశ్లోకములచేత నెఱుకపడుచరిత్ర-(ఈకవి రాజాదరమును గొన్నాళ్ళకుఁ గోలుపోయి, ప్రభువు సర్వస్వమును హరింపఁగా దేశత్యాగ మొనర్చె ననుట) - కారణ మని యొకయభిప్రాయము కల దనియు (JRAS iv-5) వ్రాసి యున్నారు.

ఆశ్లోకములు :—

"సర్వస్వం గృహవర్తి కుంతలపతిర్గృహ్ణాతు కిం మే పునః;
భాండాగారమఖండమేవ హృదయే జాగర్తి సారస్వతమ్।
రే! క్షుద్రాస్త్యజత ప్రమోదమచిరాదేష్యన్తి మన్మందిరమ్
హేలాఽఽన్దోళితకర్ణతాలకరటిస్కంధాధిరూఢాః శ్రియః" ॥
"అయి కిమనిశం రాజద్వారే సముద్ధరకన్ధరే
కువలయదలస్నిగ్ధే ముగ్ధే విముంచసి లోచనే।
అమరరమణీలీలావల్గద్విలోచనవాగురా
విషయపతితో న వ్యావృత్తిం కరిష్యతి బిల్హణః" ॥

కాని క్రీ. శ. 1088 సం॥ లో విక్రమాదిత్యుఁడు ఉత్తరదేశదండయాత్ర కావించినట్లు కాన రాదు. చక్రవర్తి యైనతర్వాత నటు పో లేదు. పైఁగా, మఱలఁ జోళులతో యుద్ధమును ప్రస్తావించుటచేతను, నది యాతనిరాజ్యపుచివరిసంవత్సరములలో (1118) నగుటచేతను బిల్హణుఁడు అంతవఱకుఁ గల్యాణకటకమందే యుండె ననియో లేక ఆకాలముననే విక్రమాంకుని దర్శించె ననియో తోఁచు చున్నది.

"భ్రామః కిమన్యదయముత్సహతేస్మ యత్ర
ద్వయ్యేవ తత్ర గతిరావిరభూన్నృపాణాం।
కారాగృహే పతనమాశుపలాయనం వా
చోళోఽపి శీఘ్రమపసారమతశ్చకార."॥ (17 = 67)

దీనికి నాంధ్రబిల్హణులయనువాదము :—

ఉ. వేలు వచింప నేలఁ బృథివీపతి యెచ్చట మచ్చరించినన్
దీఱుఁ దెరంగుగా వసుమతీతిలకంబులకున్ ద్వయంబె, 'పెన్
గాఱియఁ గారఁ గాంచుట వికావిక లై దవు వాఱుటల్' ద్వరన్
బాతె ననిన్ ద్యజించి గరువం బఱి చోళుఁడు ప్రాణభీతిమై.
(6 = 213)

"అథ శిథిలితచాపశ్చోలలక్ష్మీం గృహీత్వా
కృతవివిధవినోదస్తత్ర కాంచీనగర్యాం।
నిజనగరమగచ్ఛత్సాంద్రమాతంగసేనా
భరభరితదిగంతః కుంతలక్ష్మాభుజఙ్గః"॥ (17 = 68)

దీనికి నాంధ్రబిల్హణులయనువాదము :—

ఉ. ఆపయి నబ్యచాపుఁ డయి యప్పతి చోళరమన్ గ్రహించి, కాం
చీపురమందు సత్కవులశిష్టవినోదములందుఁ దేలి తా,
రా పగుదంతివాహినిభరంబు దిగంతర మావరింపఁగా
మో పగునెమ్మెమైఁ దనదుప్రోలినిఁ జేరె సముత్సహించుచున్.
(6 = 114)

విక్రమాదిత్యుఁడు ఈకాలమునఁ (1118) గాంచీనగరమునకుఁ బోయినట్లు శాసనప్రమాణము కలదు. వేంగినిఁ జాళుక్యదండనాయకులు 'అనంతపాలుఁడు,' అతనిమేనల్లుండ్రును, జయించి కంచివఱకుఁ బాలించు చుండిరి. దీనింబట్టి చూడఁగా బిల్హణుఁడు విక్రమాంకుని నతనిరాజ్యపుచివరిదశలోఁ జూచిన ట్లున్నాఁడు. కాశ్మీర



మును బాలించినరాజులలో శ్రీహర్షునితర్వాతఁ బాలించినరాజును బేర్కొనక ఉత్కర్షదేవునిఁ జెప్పుటచేతను, దాహళమును బాలించినకర్ణునికడనుండి యటు-పిమ్మట ధారానగరమువకుఁ బోయి, యటనుండి సోమనాథము, మళయాళము, సేతువు నిత్యాదులను దర్శించి చివర విక్రమాదిత్యుని దర్శించినందువలనను నిదంతయుఁ జాలకాలము పట్టియుండవలెను. కాశ్మీరమును 1089 సం॥ లో హర్షదేవునిరాజ్యాధిరోహణానంతరమే వదలి యుండును. మఱి దాహళమం దెప్పు డుండెనో? విక్రమాంకదేవునిచరిత్రను సంపాదించి వ్రాయుకాలమునకు బిల్హణుఁడు వృద్ధుఁ డై విశ్రాంతి నపేక్షించు చుండె నని ఈశ్లోకములచేఁ దెలియు చున్నది:—

"నీలచ్ఛత్రోన్మదగజఘటాపాత్రముత్త్రస్తచోలా
చ్చాలుక్యేంద్రాదలభత కృతీ యోఽత్ర విద్యాపతిత్వమ్।
అస్మిన్నాసీత్తదను విబిడాఽశ్లేషహేవాకలీలా
వేల్లద్బాహుక్వణితవలయా సన్తతం రాజలక్ష్మీః"॥
(18-101)

దీనికి నాంధ్రబిల్హణులయనువాదము :—

శా. చోళాఽభీల'చళుక్య'భూమిపతిచే సూరీంద్రుఁ డొందన్ మహా
నీలచ్ఛత్ర-మదేభరాడ్ధ్వజముతో'న్విద్యాపతిత్వంబు' నా
పై లాలించె దృఢోపగూహనకళావాల్లభ్యవేల్లద్భుజా
హేలాశింజితహస్తభూష యయి యెంతే వానిరాలచ్ఛ్రియున్.
(7 = 103)

"దిఙ్మాతంగైరపి సపులకైః శుశ్రువే యస్య కీర్తిః
నిద్రాముద్రాప్రణయిషు మదాఽస్వాదతః షట్పదేషు।
తేన ప్రీత్యా విరచితమిదం కావ్యమవ్యాజకాన్తం
కర్ణాటేందోర్జగతి విదుషాం కంఠభూషాత్వమేతు."॥
(18 = 102)

దీనికి నాంధ్రబిల్హణులయనువాదము :—

మ మదపానంబునఁ దుమ్మెదల్ నిదుర మైమై మైకొనఁగా, గగ్గురుల్
గదురన్ దిక్కరులేని వేనియశ మాకర్ణించు, నాతండు దా
న్గరియించెన్ గమనీయకావ్య మిది కర్ణాటేంద్రుప్రీత్యర్థ: మి
య్యది యొందున్ జగతిన్ బుధప్రకరకంఠాలంక్రియానుస్థితిన్.
(7 = 104)

"లబ్ధా లక్ష్మీర్ద్విశతిశి; కృతాః సంపదః సాధుభోగ్యాః;
ప్రాప్తా యోగ్యైః సహ కలహతః కుత్ర నోచ్చైర్జయశ్రీః?
గోష్ఠీబంధః సపది సుజనైః సారనిష్కర్షదక్ష
ప్రజ్ఞాలబ్ధస్తుతిభిరచిరాదస్తు కాశ్మీరకైర్మే"॥ (18 = 103)

దీనికి నాంధ్రబిల్హణులయనువాదము :—

ఉ. కూరెను లక్ష్మి నల్గడలఁ; గూర్చితి సజ్జనభోగ్యసంపదల్;
ధీరుల నోర్చి గెల్చితిరిఁ దేటితి నెల్లెడ వాదులందునన్;
సారముఁ దేల్చ దక్ష మయి సన్నుతిఁ గాంచెడుప్రజ్ఞ మీఱుకా
శ్మీరబుధాళిగోష్ఠి త్వరఁ జెందుత న న్నిటమీఁద నాదటన్.
(7 = 105)

"అరుణమ నృపప్రసాదకణికామద్రాక్ష్మ లక్ష్మీలవాః
కించిద్వాఙ్మయమధ్యగీష్మహి గుణైః కాంశ్చిత్పరాజేష్మహి।
ఇత్యజ్ఞానమయీమకార్ష్మ కియతీం నానర్థకంథాం మనః;
స్వాధీనీకృతశుద్ధబోధమధునా వాంఛత్యమర్త్యాఽపగామ్"॥
(18 = 104)



దీనికి నాంధ్రబిల్హణులయనువాదము :—

శా. చెందం గంటి నృపప్రసాదకణికన్; శ్రీలేశమున్ గంటిఁ; గా
సం తౌవిద్యను నేర్చితిన్; గుణగణం బాధార మై కొందఱ
న్నిందం జేసితి; నిట్లు జ్ఞాన మతి యెన్నే నేరముల్ సేసితి;
న్దెందం బిప్పుడు తేఁటతెల్విఁ గనె; వాంఛింతున్ వియద్వాహినిన్.
(7 = 106)

"మందాకిన్యాః పవనచటులోత్తాలవీచీదుకూలే
కూలోత్సంగే విరచితవతాం యోగనిద్రాఽభియోగమ్।
శేషాః కేషామపి పరిణతౌ వాసరాః పుణ్యభాజామ్
కాన్తస్వాన్తస్థితగిరిసుతావల్లభానాం ప్రయాంతి."॥
(18 = 105)

దీనికి నాంధ్రబిల్హణులయనువాదము :—

చ. పరిణతి, శాంతచిత్తమును బార్వతివల్లభునందు నిల్పి, యు
ద్ధురమరుదుద్ధతోర్మితతి దూఁగుదుకూలముగాఁగ నొప్పునా
మరతటినీతటాంకమున మా నగుయోగసుషుప్తి, రక్తిఁ, బు
త్తురు కడవాసరంబులను, దూలఁగఁ బాపము పుణ్యమానవుల్.
(7 = 107)

పైశ్లోకములకుఁ దిరుపతి-వేంకటకవులయాంధ్రానువాదము—"...చోళేంద్రుని జయించినచాళుక్యరాజదేవేంద్రుం డగువిక్రమాదిత్యభూపాలునకు విద్యాపతి నై, యాభూపతివలన నీలచ్ఛత్ర-గజఘటాఽఽదిసన్మానములకుం బాత్రుండ నై, బిట్టు కౌఁగిలించుకొనుటంజేసి, గల్లుగల్లు మని మ్రోఁగుదాహువలయంబులు గలరాజ్యలక్ష్మీ సౌఖ్య మనుభవించు చుంటిని. కడుపునిండ మదము ద్రావి యొడ లెఱుంగక షట్పదంబులు నిద్రించుచుండ దిగ్గజంబులుసైతము ఎవ్వానికీర్తి పులకితశరీరము లతో వినునో అట్టినేను రచియించినయీయవ్యాజసుందర మగుకావ్యము కర్ణాట భూపాలునికీర్తి నాచంద్రార్కస్థాయిగ నొనర్చుచు విద్వాంసులకుఁ గంఠాలంకార

మగుఁగాత. ఐశ్వర్యమా లభించినది. సాధుభోగ్యము లగుసంపదలా ప్రతిదిక్కునందును వెదచల్లితిని. సజ్జనులతో సహవాసముఁ జేసితిని; ప్రతిభటకవికోటిని నిర్జించి జయలక్ష్మి నార్జించితిని. నా కేమియుఁ గొదువ లేదు. కాని, సారాసార విచారదక్ష మైనప్రతిభాసామర్థ్యము గలిగి కొనియాడం బడుకాశ్మీరకసుజన సంఘముతో నా కచిరకాలంబున సహవాసంబు లభించుఁగాత అని కోరు చున్నాఁడను. మహారాజులయనుగ్రహము సంపాదించితిని. సంపదల ననుభవించితిని. కొంచెమో గొప్పయో చదువుకొంటిని, ఎందఱనో కొందఱినిఁ బ్రతిపక్షుల జయించితిని. ఇఁక నీయజ్ఞానమయప్రపంచముతో సంబంధము విడిచి దివ్యబోధ నీయఁగలగంగాద్వారమున నెప్పుడు నివసింతునో! నా కంతటిభాగ్యము ఎన్నఁడు కలుగునో! మందాకితీరంబునం బవనచలితంబు లగుతత్తరంగంబులనుండి వచ్చు శీకరమిశ్రితం బగుచల్లనిగాలి మెయి సోఁక యోగనిద్ర ననుభవించుచుఁ గాంతం బగు స్వాంతంబునఁ బార్వతీకాంతావల్లభునిం దలంచుచుఁ గాలము పుచ్చుమహాభాగ్యము పుణ్యాత్ములకుఁగాని కలుగదు."

వీనినిజూడఁగా బిల్హణుఁడు మంచివృద్ధుఁ డనియుఁ, జిత్తశాంతిఁ గోరు చున్నాఁ డనియు విశద మగు చున్నది. 'ప్రాయ మింతకు మిగులఁ గైవ్రాలకుండ' అన్నశ్రీనాథునికాశీఖండమునాఁటివయసును దాఁటినదశ, నాగానందనాటకమున జీమూతకేతువు శ్లోకమును జ్ఞప్తిపఱచు చున్నది. (నాగానందము-చతుర్థాంకము) శాతగారియాంధ్రాను వాదము.

"భుక్తము లయ్యె యౌవనపుభోగము; లేలితిఁ గీర్తి యొప్పఁగా
దిక్తతి; నేకవృత్తి గడతేరెఁ దపంబు; సుతుండు శ్లాఘ్యుఁడున్
ద్యక్తరజస్తముండు; సదృశాన్వయసంభవ కోడ లీమెయున్;
వ్యక్తము గాగ నే నిఁకఁ గృతార్థత మృత్యువుఁ గోరఁగాఁ దగున్."

ఇంతటిమహాపండితునిచేత నింతగొప్పకావ్యమును వ్రాయించుకొని, తుదకుఁ గృతజ్ఞత లేక, రాజు ఇతనిసర్వస్వమును హరించి, వృద్ధాప్యమున దేశము వెడల నడచె ననునది నమ్మ రానిమాట. శ్రీయుతకృష్ణమాచార్యులవారి 'సర్వస్వం గృహవర్తి' యన్నశ్లోకముంగూర్చినవృత్తాంతము ఇతనింగూర్చినది యై యుండదు. వృద్ధుని కితనికి నీచౌర్యశృంగారము అతుకదు. ఏదో సంబంధము లేనివ్రాఁత చౌరపంచాశికకు సంబంధించి యుండును.



## బిల్హణుని యితరరచనలు.

బిల్హణుఁడు తనయితరరచనలంగూర్చి యిందుఁ జెప్ప లేదు. నాలుగంకముల 'కర్ణసుందరీ' నాటిక యొకటి, రత్నావళీ-విద్ధసాలభంజికలవంటిది కనఁ బడు చున్నది. 'అణహిల్లనగర' పాలకుఁ డైనగూర్జరాధిపతి, చాళుక్య 'కర్ణదేవుని,' 'భీమదేవ' కుమారుని గూర్చినది. విక్రమాంకదేవచరితమందలి గూర్జరప్రస్తావము చేత, గూర్జరరాజాస్థానమందుఁ గొంతకాల మితఁ డుండి యుండును. రాజాదరమున్ను లభించి యుండ వలెను. కాని దాహళకర్ణునిఁ బేర్కొనుటయు గూర్జరుని మానుటయు, నచటిపండితులయనాదరమును బ్రస్తావించి యచ్చటితన కావ్యనాటకాదిరచనను బేర్కొనక పోవుటయు వింత! 'కర్ణసుందరి' యితనిది కాదా! లేక, ఏమో, ఎందుచేతనో అనాలోచితముగాఁ జెప్ప లేదో! ఆకాలమున నంతటిబిల్హణుఁడు గూర్జరమునకుఁ బోయినవాఁడు మఱియొకఁడు లేఁడుగదా!

శ్రీమల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు తమ సంస్కృతవాఙ్మయచరిత్రమున 'ఇతఁడు కల్యాణపురము చేరకముందు దాహలపురమురా జగు కర్ణభూపాలుని యాస్థానమునఁ గొంతకాల ముండి, యాతఁడు నాయకుఁడుగాఁ గర్ణసుందరీనాటికను రచించెను.' అని వ్రాసి యున్నారు. ఇది నిరాధారము.

'దాహళమం దుండినప్పుడు బిల్హణుఁడు రామాయణమును రచించి యుండు నేమో' యని శ్రీకృష్ణమాచారిగారు ఈక్రిందిశ్లోకమునుబట్టి యూహించు చున్నారు.

"యస్యాత్పృష్ఠః స్ఫటికగిరిణా తం వినిక్షిప్య వామే
ప్రాలేయాద్రేః క్షణమభిముఖో దక్షిణః పాణిరాసీత్ ।
తం పౌలస్త్యం విదలితవతః సూక్తినిఃస్యందశీతామ్
సీతాభర్తుః వ్యరచయదసౌ రాజధానీమయోధ్యామ్" ॥
(విక్రమాంక 18 = 94)

దీనికి నాంధ్రబిల్హణులయనువాదము :—

చ. మును స్ఫటికాద్రిచేఁ దనివిఁ బొందక డాపలికేల దాని నుం
దను నిడి, మంచుకొండను నిదం ద్రుటి దక్షిణహస్తమున్ నిగి

ద్వినదశవక్త్రుఁ ద్రుంచురఘుశేఖరురాజ్ఞగరం'బయోధ్య' నీ
ఘనకవి స్వీయసూక్తిరసగాహనఁ జేసెను శైత్య మందఁగన్.

(7 = 96)

"He was received well in the Court of king karna of Dahala (Bundelkhand) and in that court probly composed a poem in honour of Rama."

దీనికిఁ దిరుపతివారియాంధ్రానువాదము - "పరంపరఁ కుడిచేతం గైలాసముం గదల్చియు సంతసింపక, ఎడమచేతహిమవత్పర్వతముంగూడఁ గదల్చుటకు యోజించినమహాబలశాలి దశకంఠునిం జంపినశ్రీరామచంద్రమూర్తి రాజధాని యగు నయోధ్యను సైతము సూక్తినిష్యందశీతలముం గావించితిని." తా నయోధ్యకుఁ బోయినట్లు చెప్పక దాహప్రస్తావమునను దీనిని చెప్పుటచేత నిది కావ్యరచనయే కాని ఆయూరికిఁ బోవుట గా దని బ్యూలరుగారుగూడ నిర్ణయించి యున్నారు.

The Statement that he cooled by the floods of his song Ayodhya the Capital of the husband of Sita, seems to me rather.......than to point to a journey to Oud. (Intro. పు. 18)

ఈతనిరచనగా నొక 'శివస్తుతి' యున్న దనియు, నందలి లెక్కలేనన్ని శ్లోకములు జల్హణుని'సూక్తిముక్తావ'ళ్యాదిగ్రంథములలో నుదాహృతము లనియుఁ బ్రసిద్ధము వానినిగుఱించి-పరిశోధన లింకను జరుగ వలెను.

'చౌరపంచాశిక' యనునది ఏఁబదిశ్లోకములకావ్యము. అది కాశ్మీరమున దొఱకినది. దీనికే 'చౌరీసురతపంచాశికా' యని నామాంతరము. కాని యిది బిల్హణుఁ డనుకవియొక్క చరిత్రయగునుగాని దీనిరచయిత బిల్హణుఁడు కాఁడు. ఎవఁడును నట్టితనదుశ్చరిత్రమును వ్రాసికొనఁడు. పైఁగా, ముద్రితప్రతులలోఁ 'బంచాల'దేశమందు 'లక్ష్మీమందిర' మనుపురవరమున 'మదనాభిరామ'నృపతి యుండె ననియు నాతనికుమార్తె 'యామినీపూర్ణతిలక' యనియు, నాయూరివాఁడే బిల్హణకవి, ఆరాజకుమారికి సాహిత్యవిద్య బోధింప నారంభించి చౌర్యముతోఁ బెండ్లి చేసికొనె ననియుఁ గథ. దీనికిని బిల్హణకవి చరిత్రకును గవియొక్క నామమందుమాత్రమే సామ్యము. మఱి విక్రమాంకదేవచరితరచయిత యైనబిల్హణునియందు నెట్టి



దుశ్చరితముగాని కాన రాదు. ఈచిన్నికావ్యమున కీపే రెట్లు వచ్చినదోకాని యిందు 'అద్యాపి తాం' అని ప్రారంభించునాయికావర్ణనశ్లోకములేకాని, పైకథ కొన్ని ప్రతులలో లేదఁట. ఎవఁడో ఒకప్రేమికుఁడు తనప్రియురాలింగూర్చి చేసినస్మృతిశ్లోకములుమాత్రమే అవి. మఱికొన్నిట 'వైరిసింహుఁ' డనుగూర్జరరాజుయొక్క పుత్రి యైన'చంద్రలేఖ' (లేక శశికళ) యనుదానికి బిల్హణుఁడు విద్యాగురు వని కలదు (కృష్ణమాచార్యులు). ఈవైరిసింహుఁడు క్రీ.శ. 920 నాఁటివాఁడు, బిల్హణునిపుట్టుకకుఁ జాలపూర్వుఁడు, పైఁగా, సంస్కృతవాఙ్మయమున గురువునకు శిష్యురాలికి నడుమఁ దెర వేసి చదువు చెప్పింపఁ బూనఁగా వారు పెండ్లి చేసికొన్నకథలు చాలఁ గలవు. 'ఉదయన-వాసవదత్త'లవీణాశిక్షణకాలమందుఁ బ్రద్యోతుఁడు వారినడుమఁ దెర కట్టింపఁగా వారు, గాంధర్వముగాఁ బెండ్లిచేసికొని పారిపోయి రని జైనుల కథలు గలవు (ధమ్మపదము). ఇందుచేత నెవరో రచించినశృంగారశ్లోకములకు భిన్నప్రదేశములలో భిన్నరీతులకథలు కల్పింపఁ బడిన ట్లున్నది. 'శ్రీనాథాది యాంధ్రకవులు 'బిల్హణునిఁ' 'జోరుని' భిన్నకవులనుగాఁ బేర్కొనుటచేత నితఁడు వే అని శ్రీకృష్ణమాచార్యులుగారు వ్రాసినారు. 'చోరుఁ' డనుకవియొక్క పేరుమాత్ర మున్నది. కావ్యము కాన రాదు. ఈయకార్యమువలననే అతనికి ఆపేరు కలిగిన దనుటకును నాధారము కాన రాదు. సంస్కృతవాఙ్మయచరిత్రలో రాజకుమారికను బెండ్లి చేసికొన్నవాఁడు క్రీ.శ. 900 ప్రాంతమువాఁడు రాజశేఖరకవి యొకఁడు కనఁబడు చున్నాఁడు. ఇతఁడు బ్రాహ్మణుఁడు, అమె క్షత్రియ.

"చాహువానకులమౌలిమాలికా
రాజశేఖరకవీంద్రగేహినీ ।
భర్తృసత్కృతిమవంతిసుందరీ
సా ప్రయోజయితుమేతదిచ్ఛతి."॥

కాని రాజశేఖరునిఁగుఱించి యిట్టికథలు లేవు.

క్రీ.శ. 1798 సం॥లో రామతర్కవాగీశభట్టాచార్యులు 'చౌరపంచాశిక' యనునొకకావ్యమును వ్రాసి రనియు, నం దొకరాజపుత్త్రుఁడు 'సుందరుఁ' డను వాఁడు, కాళీపూజకుఁడు ఒకరాజకన్యను అపహరించె ననుకథ యనియు శ్రీమల్లాది వారు వ్రాసి యున్నారు.

ఎందువలననో పంచమహాకావ్యములలో నీవిక్రమాంకదేవచరితము చేర లేదు.

ఇంతకన్న బిల్హణమహాకవినిగుఱించి చరిత్ర తెలియ రాదు. మఱి యీతని విక్రమాంకదేవచరితము నరయుదము.

## ౨ విక్రమాంకదేవచరితకథాసారము.

సర్గ–౧. ఇష్టదేవతాస్తుతి – వైదర్భీరీతియొక్క ప్రాశస్త్యము – సుకవిస్తుతి–కుకవినిందాదులు – కవులకు రాజాదరణము – ఇత్యాదులతర్వాత–చాళుక్య రాజవంశోత్పత్తి – బ్రహ్మ తనసంధ్యావందనసమయమున లోకోద్ధరణార్థము, తన చుళుకముపైఁ జూడ్కి నిగిడించి యొకవీరుని సృజించుట–అతఁడే 'చాళుక్యుఁడు'–ఆకులమందు 'హారీతుఁడు', 'మానవ్యుఁడు'–పెక్కురు రాజులు జనించి అయోధ్యను బాలించు చుండుట–తర్వాత దక్షిణదేశమునకు వారు వచ్చుట–వారిలోఁ బ్రఖ్యాతుఁడు 'తైలపుఁడు' (వంశావళిలేదు)–అతనికి 'సత్యాశ్రయుఁడు'–(ఐదవవిక్రమాదిత్యునిఁ జెప్ప లేదు). పిదప 'జయసింహుఁడు'–అతనికి 'త్రైలోక్యమల్లుఁ' డను 'ఆహవ మల్లుఁడు'– ఇతఁడు 'చోళ-మాళవ-డాహళ' రాజులను జయించుట–చోళరాజుపేరు లేదుగాని, మాళవపతి 'భోజుఁడు,' 'ధారా'నగరాధిపతి; డాహళపతి 'కర్ణుఁడు' (ఈకర్ణుఁడు తాను దర్శించినకర్ణుఁడో కాఁడో తెలుప లేదు) – 'కాంచీ'విజయమును రెండవమారు తెల్పెను. ఇప్పుడును జోళరాజుపేరు చెప్పఁడు.

సర్గ—౨. ఆహవమల్లునిక్రమాభివృద్ధి–'కల్యాణపుర'నిర్మాణము–దానిని బ్రతి క్షణము నేమఱక కాపాడు చుండుట–సకలదిగ్విజయానంతరము చిరకాలము పుత్త్రులు లేక పరమశివు నారాధించి వరము పడయుట–శివానుగ్రహమున 'ముప్వురు కుమారు లనియు, వారిలో నడిమివాఁడు దిలీప-మాంధాతలవంటివాఁ డగును' అనియు నాకాశవాణి–తర్వాత 'సోమేశ్వర–విక్రమాదిత్య–జయసింహులు' జనించుట–విక్రమా దిత్యునిజననకాలమందు ననేకశుభసూచకములు–ఇట్లు పుత్త్రోత్సవము వర్ణితము.

సర్గ—౩. విక్రమాదిత్యునిబాల్యము–రెండవవాఁ డైనను గుణశాలి యైనం దునఁ దండ్రి యతనినే యువరాజుఁ జేయఁ దలంచుట–వల దని విక్రముఁడు అన్ననే చేయించి తాను యుద్ధాదికములలో సాయపడు చుండుట–భ్రాతృప్రేమ, ధర్మబుద్ధి, పరిపాలనాదక్షత–తండ్రి విధి లేక యెట్లును దైవనిర్ణయముప్రకారము



విక్రముఁడే రా జగు నని తలంచి పెద్దకుమారునికే యువరాజపదవి నిచ్చుట–విక్ర మునిదిగ్విజయములు(చోళము, మలయము, కామరూప–గౌడ–మాళవములు)–శరణుఁ జొచ్చినమాళవపతిని మఱల నతనిరాజ్యమందుఁ బ్రతిష్ఠించుట.

సర్గ—౪. పేరునకు రెండవసోమేశ్వరుఁడు యువరా జైనను, గ్రియచేతఁ దమ్ముఁడు, విక్రమాదిత్యుఁడు యువరా జై దిగ్విజయము లాచరించుట–కేరళులను బెండాడుట–సింహళీయులు శరణాగతు లగుట–'గంగాకుండ'పత్తనకాంతలకుండల ములు జారిపోవుట–'కాంచి, చక్రకూటము' మున్నగుప్రదేశములను జయించి, దక్షిణ దిగ్విజయయాత్రసమాప్తిఁ గావించి రాజధానికి మఱలునపుడు దుర్నిమిత్తము లగు పడుట–'విక్రముఁడే తొలుత సోమభూపాలునికి యౌవరాజ్య మిప్పించి యిపుడు సామ్రాజ్య మిప్పించు చున్నాఁడు' అని తలంచుచుఁ దండ్రి తీరనిదాహజ్వర పీడితుఁ డై తుంగభద్రలో మునిఁగి శివైక్యము నందినవార్త వినుట–అపుడు కృష్ణా నదీతీరమునఁ దా నుండి, విలపించి, తండ్రికి నుత్తరక్రియ లాచరించి అన్నకడ కేగుట–అన్న ఆదరించుట–తాను జయించి తెచ్చిన దంతయు నన్నకు సమర్పించుట ('నాస్తి లోభో యశస్వినామ్').

తర్వాతఁ గ్రమముగా సోమభూపాలునకుఁ బాపబుద్ధి కలుగుట–తద్వర్ణనము–విక్రముఁడు భరింప లేక తన సపకీర్తి లేకుండ, ద్రావిడాదిరాజన్యులచే నన్న కుపద్రవము లే కుండువట్లు, సామ్రాజ్యరక్షణార్థము దక్షిణసముద్రతీరమునకుఁ బోఁ దలంచి రాజధానిని వదలుట.

సర్గ—౫. విక్రముఁడు తమ్మునికి నాపద రా నీయక వెంటఁ బెట్టుకొని యేగఁగా అన్న విరోధము శంకించి తమ్ములను శిక్షించుటకు సైన్య మంపుట–మఱల మఱలఁ బంపినను వానిపరాజయము, విక్రమునివిజయము–దిగ్విజయార్థము విక్రముఁడు చోళరాజ్యముమీఁదికి బయలుదేరుట–మార్గమున 'వనవాసి, మలయము, కొంకణము' మున్నగువానివిజయము–ఇది విని ద్రవిడభూపాలుఁడు తనకుమార్తె నిచ్చుటకు వార్త నంపి తుంగభద్రాతీరమునఁ దాము సంధించుటకు నియమించుట–పెండ్లి.

సర్గ—౬. చోళరాజుతో సంధి – వివాహబాంధవ్యము – ద్రవిడభూపాలుఁడు తనరాజ్యమున కేగుట – విక్రమునిరణాభిలాష – ఇంతలో ద్రవిడపతిమరణము–తత్క్షణమే విక్రముఁడు 'కాంచి' కేగి, యటఁ గొన్నా ళ్లుండి, పిదప 'గంగాకుండ'

మనుపట్టణమునకుఁ బోయి, శత్రువులను జయించి, బావమఱఁదిని ('అధిరాజేంద్రుని' పేరు లేదు) రాజ్యమందు స్థాపించి, నెలదినములుమాత్ర మచట నుండి మఱలఁ దుంగభద్రాతీరమునఁ దనస్కంధావారమునకుఁ బోయెను.

కొలఁదిదినములలో బావమఱఁదికిఁ బ్రకృతివిరోధము కలిగి, వా రతనిఁ గడతేర్పఁగా, వేంగినాథుఁ డగు'రాజిగుఁడు' చోళసామ్రాజ్యము నపహరించెను; విక్రమాదిత్యునికి వైరి సోమేశ్వరునితో సంధి చేసికొనెను. రాజిగునిమీఁదికి విక్రమాంకుఁడు ఎత్తి రాఁగా సోమేశ్వరుఁడు రాజిగునికి సాయముగా విక్రమాంకుని మీఁదికి వెనుకనుండి దండు పంపెను. అన్నపై రణ మొనర్ప విక్రముఁడు శంకింప శివుఁడు స్వప్నమునఁ బ్రత్యక్షమై 'యతఁడు (విక్రముఁడు) దేవకార్యమునకు నవతరించినవాఁ డనియు, నాతనియన్నకు అదృష్టము లే దనియుఁ, శంకింపక యన్నను జయించుట మే లనియుఁ' బ్రోత్సహింప – ఇరువాగుల రణమొనర్ప, విక్రముఁడు రాజిగునిఁ దఱిమి, యన్నను జెఱపట్టి, కర్ణాటకసింహాసనము నధిష్ఠించెను, తమ్ముని 'జయసింహుని' యువరాజును జేసెను.

సర్గ—౭. తర్వాతఁ గొన్నాళ్ళకు, విక్రమాంకుఁడు మఱల నొకపర్యాయము చోళరాజ్యమును జయించి కల్యాణమును బ్రవేశించెను. వసంతఋతువర్ణనము.

సర్గలు—౮, ౯. 'కరహాటరాజ'కుమారి 'చంద్రలేఖ'ను విక్రమాంకుఁడు స్వయంవరమార్గమునఁ బెండ్లి యాడుట.

సర్గ—౧౦. విక్రమాంకుని వనవిహారము.

సర్గ—౧౧. రాజు 'చందల'దేవితోఁ గాలము పుచ్చుట-వర్ణనలు.

సర్గ—౧౨. మామగారిరాజధానియందుఁ జిరకాల ముండి విక్రమాంకుఁడు మఱలఁ గల్యాణకటకమునకు వచ్చుట – నగరాంగనశృంగారచేష్టలు – గ్రీష్మర్తువర్ణనము.

సర్గ—౧౩. క్రమముగా గ్రీష్మము తొలఁగి వర్షాఋతువు వచ్చుట-చందలదేవితో వర్షాకాలానుభవము.

సర్గ—౧౪. శరత్కాలవర్ణనము. చోళునికడనుండి జయించిన'వనవాసి'నిఁ బరిపాలించు చుండినజయసింహుఁడు ద్రవిడరాజుతోఁ గలిసి కుట్ర సాగించుట-విక్రముఁడు తమ్ముని ననునయించుట.



సర్గ—౧౫. జయసింహుఁడు యుద్ధ మొనరించి ఓడిపోఁగా విక్రముఁడు క్షమించుట.

సర్గ—౧౬. హేమంతఋతువర్ణనము – మృగయావిహారవర్ణనము.

సర్గ—౧౭. సుఖపరిపాలనము – పుత్త్రోదయవర్ణనము – దానధర్మములు-ప్రతిష్ఠలు – మఱలఁ జోళరాజుతో యుద్ధము-విజయము-కాంచీనగరమునఁ గొన్నాళ్లుండి మఱలుట-సుఖాంతము.

సర్గ—౧౮. కాశ్మీరదేశవర్ణనము, కవియొక్క ఆత్మకథ, (ముందే వర్ణితము).

## ౩. చారిత్రిక సమన్వయము

బిల్హణుఁడు విక్రమాంకుని క్రీ.శ.1118 లేక అంతకుఁ గొంతముందు దర్శించి యుండు నని ముందు వ్రాసితిని. అందుల కనుగుణముగా నాతఁడు ప్రత్యక్షముగా నెఱుఁగనివిషయములను విని గ్రహించి యుండినందువలన, విన్నవారు చేయుపొరపాటులవంటివి యీతనిరచనలోఁ జాల పడినవి. ఏ వనఁగా:—

(1) ప్రారంభమందే 'చాళుక్య'వంశము బ్రహ్మచుళుకమునుండి జనించిన దనెను. చుళుకమునుండి జనించి యుండినయెడలఁ 'చౌళుక్య'వంశ మగునుగాని చాళుక్యము కాఁ జాలదు. బిల్హణుఁడు గూర్జరమున నుండినవాఁడు వారిచాళుక్యనామమును, వంశోత్పత్తికథను గ్రహించి, యిచ్చటిశాసనములవక్కాణనుగాని ఉత్పత్తికథలనుగాని గ్రహింపక నూతనకథను జమత్కారార్థము గ్రహించెనేమో! చాల సంగ్రహముగా నయోధ్యాపురసంబంధమును మాత్రమే చెప్పెను.

(2) వంశమును వర్ణించునెడ 'వాతాపిచాళుక్యు'లనుగాని, 'గూర్జర-వేం'గ్యాది శాఖలనుగాని చెప్పక వదలి తటాలున తైలపునితోఁ బ్రారంభించెను. 'సత్యాశ్రయుని' తర్వాతఁ బాలించినతత్సోదరపుత్త్రుఁడు ఐదవ'త్రిభువనమల్ల విక్రమాదిత్యునిఁ' (1008-14) జెప్పక 'జయసింహునిఁ' బేర్కొనెను. అట్టివాఁ డొకఁడు పాలించి యుండఁగా నది యెఱుఁగఁడో లేక తనకావ్యమునకు ననవసర మని తలంచెనో! జయసింహునికి, 'జయసింహుఁ' డనియే మఱియొక కుమారుఁడు శాసనములలోఁ గనఁ బడు చున్నాఁడు. బిల్హణుఁడు వీనిని జెప్పఁడు.

(3) ఈకవికి నుత్తరదేశములతో నుండినంతపరిచయము దక్షిణదేశముతోఁ గాన రాదు. 'కాశ్మీర-కాలంజర-డాహళ-మాళవ-గూర్జ'రాదుల నెఱింగినంత చక్కఁగాఁ 'జోళ-వేంగి'నాథుల నెఱుంగఁడు, 'కర్ణ-ముంజ-భోజు'లను, 'వేంగి-రాజిగునిఁ' 'గొంకణ-జయకేశినిఁ' బేర్కొనెనేకాని 'చోళ'రాజు లగు'రాజాధిరాజ-రాజేంద్రచోళ,-వీరరాజేంద్ర-అధిరాజేంద్రు'లను మందున కైనను బేర్కొనఁడు. ఊరక 'చోళరా'జని చెప్పు చుండును. చారిత్రికపురుషుని నాయకునిగా గ్రహించిన వాఁడు తారీఖులను జెప్పుటకు వీలు లేకపోయినను చారిత్రికవిషయములను జక్కఁగాఁ జెప్ప వలసియుండ నూరక దాఁటుకొని పోవును. తాను రచియించిన 'కర్ణసుందరి' నాటకనే పేర్కొన లేదు.

(4) మొదటిసర్గలోఁ ద్రైలోక్యమల్లునిదిగ్విజయవర్ణనలోఁ గర్ణ - చోళ - మాళవవిజయములను వర్ణించి భోజునిధారానగరమును బ్రస్తావించినాఁడు, రెండవ సర్గప్రారంభమున 'చకార కల్యాణమితి క్రమాదపో పురం పరార్ధ్యం పృథివీపురందరః' అని, ఈరాజుపట్టాభిషిక్తుఁడైన (కొన్నాళ్ల) యనంతరమే, కల్యాణకటకమును నిర్మించుకొన్నట్లు చెప్పినాఁడేకాని మొదటిరాజధానిని 'మాన్యఖేటము'ను జెప్ప లేదు. ఏల ఈనూతనరాజధానిని నిర్మించుకొన వలసివచ్చినదోకూడ వివరింప లేదు. ఎఱుఁగఁడు కాఁబోలు.

## కల్యాణకటక నిర్మాణ చరిత్ర

త్రైలోక్యమల్లుఁడు క్రీ.శ.1042సం॥కు రాజ్యమునకు వచ్చెను. కల్యాణకటకప్రస్తావము పశ్చిమచాళుక్యులశాసనములలో క్రీ.శ. 1033 సం॥నుండియే కలదు. బసవపురాణమున జగదేకమల్లునిప్రస్తావమునఁ గల్యాణకటకమునందలి విష్ణుప్రతిమ వీరశైవయోగిమహిమవలనఁ గరఁగిపోయిన దని యొకకథ(4-ఆశ్వా). మఱియొకకథ, తేడర (దేవర) దాసిమయ్య, జగదేకమల్లునిరాణిప్రోద్బలమున నతనిని జైనమతమునుండి శైవమునకు మార్పించుట (6-ఆశ్వా). ఈజగదేకమల్లుఁడు ఆహవమల్లునితండ్రి, జైనుఁడు, 'మల్లికామోద' బిరుదాంచితుఁడు (1015-1042). ఇతనిరాణి 'సుగ్గలదేవి'. దాసిమయ్యయేకాక కాలాముఖగురువు 'బొంతెయ'మహామునికూడ జయసింహునికి బోధించినవాఁడే. తుదిపదిసంవత్సరములు మతము మాఱుటయేకాక రాజ్యభారమును మహాసమర్థుఁడైనకుమారునికి ఆహవమల్లసోమేశ్వరునికి నప్పగించి, తాను రాణులతో 'పొట్టలకెఱె' (హైదరాబాదు



దగ్గరి'పటంచెఱువు') కడనుండి శైవజంగములను సేవించు చుండెను. కుమారుఁడు సోమేశ్వరుఁడు క్రీ.శ.1033సం॥నాఁటికే ముప్పదియేండ్లకు మించినవాఁడై యుండ వలెను. ఏలన 1044-45 సం॥ ప్రాంతమునఁ జోళులతో యుద్ధము లొనరించు నాఁటికి, నీతనికి సమర్థసేనాపతి కాఁ గలరెండవకుమారుఁడు, ఈవిక్రమాంకుఁడే కలఁడు. కావున 1000 సం॥ ప్రాంతముననే జనించి ఆహవమల్లుఁడు, తల్లి సుగ్గలదేవి, శైవమతాభినివిష్ట, 'సోమేశ్వరుఁ' డని శివనామ మిడఁగా నెదిగి, ముప్పది యేండ్లకు మించినవయసునఁ దండ్రికిఁ గుడిభుజమై తయా రగుటయేకాక, పూర్తి విశ్రాంతి యొసంగి యుండ వలెను. 1042 సం॥లో రాజై 1068 సం॥ వఱకు 26 ఏండ్లు పాలించినందువలన, 68 లేక డెబ్బదియేండ్లు జీవించి యుండును.

సోమేశ్వరుఁడే కల్యాణకటకమును, దండ్రికాలముననే శత్రుదుర్భేద్యమైన కటకముగా నిర్మించి యుండును. ఇందులకుఁ గారణము చాల గొప్పది, ఎంతో చరిత్రతోఁ గూడినది. తైలపచక్రవర్తికాలము (క్రీ.శ.973) నుండియుఁ జాళుక్యులకును జోళులకును వేంగికొఱకు స్పర్ధలు కలవు వేంగివారికిని జోళులకును బాంధవ్యము కుదిరినది. తమఅల్లుండ్రను నెలకొల్పుటకుఁ బశ్చిమచాళుక్యులను బోరాడ నారంభించి దాదాపు డెబ్బదియేండ్లు కృష్ణా-తుంగభద్రాతీరములేకాక, వేంగీ-కల్యాణ-కాంచీ-ధారా-డాహళములు రణరంగములై, యివి యఖిలభారతపర్యాప్త యుద్ధములైనవి. భారతదేశమందలిరాజు లందఱును నెవరో యొకరిపక్షము చేరి పోరాడిరి ఈవివరములను జరిత్రగ్రంథములలోఁ జూడ వచ్చును

ఇచ్చటిరాజకీయములు పరిశీలింపఁ దగినవి. మాళవరాజులు మొదటినుండియుఁ దమిళులమిత్రులు. తైలపచక్రవర్తికిఁ జోళ'రాజరాజు' శత్రువుగా నుండినంతకాలము 'ముంజ'మహీపతి చోళులకు సాయముగాఁ దైలపుని వెనకవైపునుండి బాధించు చుండెను. సత్యాశ్రయునికాలమునకు భోజుఁడు రాజ్యమునకు రా లేదు. చోళరాజేంద్రుఁడు పరాక్రమించునాఁటికి భోజుఁడు మాళవమందును, విక్రమార్కుఁడు చనిపోయి జగదేకమల్లజయసింహుఁడు కర్ణాటకమునను రాజులై పరాక్రమించిరి. ఉత్తరమునుండి మాళపతి భోజుఁడును, డాహళపతి గాంగేయదేవునికుమారుఁడు కర్ణుఁడును, కోసలులు-కళింగులు-చక్రకూటపురాజులును దూర్పునుండియుఁ, గొంకణ ప్రాంతమందలిరాజులు పశ్చిమమునుండియుఁ జోళులకు సాయపడు చుండఁగా

దక్షిణాపథమండలిరాజుల నందఱినిఁ గూడగట్టుకొని పాండ్య-సింహళీయాదులను గూర్చుకొని చాళుక్యులు పోరాడిరి. విమలాదిత్యుఁడు చోళులసాయముతో రాజ్యమును సంపాదించుకొన్నను నిలుపుకొనుట కతనికిఁ గష్టముగా నుండెను. ఇతఁడు 1019సం॥లో గతింపఁగా నితనికుమారుఁడు, మనరాజరాజనరేంద్రుఁడు, రాజేంద్ర చోళచక్రవర్తి మేనల్లుఁడును. అల్లుఁడును నైనవాఁడు, తనసవతితమ్ముఁడు విజయాదిత్యుఁడు చాళుక్యులసాయముచే రాజ్య మవహరింపఁగాఁ దనమామసాయ మపేక్షించి తిరువయ్యారుకుఁ బోయెను. నాఁడు వేంగిరాజ్యమునకు వేఁగి (నేఁటిపెదవేగి-ఏలూరికడ) యు, బెజవాడయుఁ, జాళుక్యులకు మాన్యఖేటమును, చోళులకుఁ గాంచీపురమును, మాళవులకు నుజ్జయినియు రాజధానులు.

యుద్ధములు తీవ్రరూపమును దాల్చినవి. రాజేంద్రచోళుఁడు వేంగిమీఁదుగా గంగవఱకుఁ బోయి 'గంగైకొండచోళుఁ' డని బిరుదము ధరించి, మహాప్రయత్నముతో క్రీ.శ 1032 సం॥లో రాజరాజనరేంద్రునికి వేంగియందుఁ బట్టాభిషేకము చేసెను. చాళుక్యులు తనకాంచీనగరమును ఎక్కడ ధ్వంసము చేయుదురో యను భీతిచే రాజధానిని దూరముగా 'గంగైకొండచోళపుర' మని నూత్నముగా నిర్మించుకొన్న నగరమునకు మార్చుకొనెను. అదే ఈకావ్యమందలి 'గంగాకుండపట్టణము', 'గంగైకొండ' అనఁగా 'గంగను గొనిన=గ్రహించిన = పొందిన' అని యర్థము. దీనికి 'గంగాకుండ' సంస్కృతీకరణము.

మఱల యుద్ధములు; 103. సం॥ ప్రాంతమున 'రాజరాజనరేంద్రుఁడు మఱలఁ, దమ్ముఁడు విజయాదిత్యునికి ఓడి, చోళదేశమునఁ కేగుట, మఱలఁ జోళులు దీకొనుటలు జరిగినవి. కర్ణాటకసోమేశ్వరుఁడు తండ్రికన్నఁ బరాక్రమశాలి. తండ్రికి విశ్రాంతి యొసఁగి రాజ్యభారమును దాను వహించి రాజధానిని, మాన్యఖేటమునుండి కల్యాణమునకు మార్చి, దానిని గట్టుదిట్టము చేసెను. ఇది 1033 సం॥లో జరిగినది. 1042 సం॥లో 'రాజేంద్రచోళుఁడు' మరణించుటయు, 'రాజాధిరాజు' చక్రవర్తి యగుటయు 'జయసింహుఁడు' మరణించి 'ఆహవమల్లుఁడు' చక్రవర్తి యగుటయు సమకాలికసంభవములు కాఁగా మఱల యుద్ధములు ప్రారంభమైనవి. శత్రుభీతిచేత నిరువురును దమరాజధానులను గాపాడుకొను చుండిరి. అదే బిల్హణుఁ డనెను—



"ప్రతిక్షణం క్షాళితమన్యునా రణే
ప్రయుక్తరక్షస్య నృపేణ మానినా।
న యస్య కక్షాం శతమన్యురక్షితా
పురీ పురప్రాగ్రహరస్య గాహతే."॥ (2 = 11)

దీనికి నాంధ్రబిల్హణులయనువాదము :—

క. ఆలమునఁ బ్రతిక్షణమును
క్షాళితమన్యుఁ డగుతేఁడు కాచుపురికి
నేలీలన్ బోటిఁ దలిర్పఁగఁ
జాలద శతమన్యురక్ష సౌ రగుపురమున్. (2 = 12)

వేంగివిషయ మిట నరయఁ దగును. 1031 సం॥లో విజయాదిత్యుఁడు రాజరాజనరేంద్రునిఁ దఱిమి పట్టాభిషేకము చేసికొనెనుగదా. 1035సం॥లో మఱలఁ జోళులు వేంగినిఁ బట్టుకొనిరి. మఱల 1039 సం॥లోఁ జాళుక్యులు వారినిఁ దఱిమిరి. రాజరాజనరేంద్రుఁడు చోళదేశమునకుఁ బోయెను. మఱల 1042 సం॥ నాఁటికి వేంగికి వచ్చుటకుఁ బ్రయత్నించెను. 1044 సం॥ నాఁటికే గొప్పయుద్ధములు జరిగి వానిలో విక్రమాంకుఁడును, విష్ణువర్ధనవిజయాదిత్యుఁడును, తమ్ముఁడు జయసింహుఁడును బాల్గొన్న ట్లున్నది.

తండ్రిపట్టాభిషేకమునాఁటికే విక్రమాంకుఁడు సేనాపతి కాఁ దగినంతటి వయసువాఁడు. వానితమ్ముఁడు జయసింహుఁడుగూడ అట్టివాఁడే. నాఁటికే కల్యాణకటకము నిర్మింపఁ బడినది. కాఁబట్టి 'క్రమాదసౌ' అన్నబిల్హణవాక్యము నిలువదు.

(5) చిరకాలము పుత్రులు కలుగక సోమేశ్వరునికిఁ దపస్సుచేఁ బరమేశ్వరానుగ్రహమున మువ్వురు పుత్రులు పుట్టి రనియు, వారిలో నడిమివాఁడు గొప్పవాఁ డగు నని యీశ్వరానుగ్రహ మనియుఁ, బెద్దవానికి నదృష్టము లే దనియు బిల్హణుఁడు వ్రాసినవ్రాఁతలకును శాసనములలోనివిషయములకును సరివచ్చుట లేదు. ఆహవమల్లునికి రాజ్యమునకు వచ్చునాఁటికే నలువదియేండ్లకు మించిన వయసుగా నుండ, నాఁటికే యుద్ధవీరు లైనరెండవ-మూఁడవకుమారు లుండ, వీరు ఆహవమల్లునిరాజ్యాధిరోహణానంతరము చిరకాలము పుట్టక తర్వాత పుట్టి రనుట అసత్యము.

"విజిత్య సర్వాః కుకుభః స భార్గవ
ప్రచణ్డకోదణ్డపరిశ్రమో నృపః।
ఉవాచ తత్రార్థిశతాని పూరయన్
ఫలం హి పాత్రప్రతిపాదనం శ్రియః॥ (2 = 26)

దీనికి నాంధ్రబిల్హణులయనువాదము :—

ఉ. అప్రతిమానచాపవిభవాఢ్యతభార్గవుఁ బోలుపార్థివుం
డప్రతివీరుఁ డై దిశల నాజి జయించి పురిన్ వసించి య
ర్థిప్రకరార్థకోటిఁ గడుఁ బ్రీతినిఁ బూరణ సేసెఁగాదె; పా
త్రప్రతిపాదనంబు ధర ధన్యతఁ గూర్చు నపారలక్ష్మికిన్.
(2 = 23)

"జగత్స్వనర్ఘేషు సమస్తవస్తుషు
క్షితీశ్వరః పాదతలే స్థితేష్వపి।
అభూద్వినా పుత్రముఖేందుదర్శనం
ప్రభాతనీలోత్పలదీనలోచనః."॥ (2 = 27)

దీనికి నాంధ్రబిల్హణులయనువాదము :—

చ. ధరణి ననర్ఘవస్తుసముదాయములెల్లఁ దమంత వచ్చి యా
ధరణిపుపాదమూలమునఁ దద్వశతాస్థితి నొప్పు చుండినన్
వరసుతుమోముచందురుప్రభన్ గన లేనివిభుండు దోఁచె నాఁ
డరయఁ బ్రభాతనీలకుముదాయితదీనవిలోచనుండుగాన్.
(2 = 24)

ఇదంతయు బిల్హణునికవిత్వము. ఆహవమల్లునికి దాదా పిరువదియైదేండ్ల ప్రాయమునకే పుత్రులు ఒకరివెంట నొకరు ఎక్కువ వయోవ్యత్యాసము లేకయే పుట్టిన ట్లున్నారు.



పుత్త్రులు కలుగుటకు మునుపే ఆహవమల్లుఁడు మహాశైత హైచక్రవర్తిగాఁ బాలించు చుండె నని బిల్హణుఁడు, కావ్యార్థమునకు, దైవనిర్ణయమునకుఁ బ్రాశస్త్య మిచ్చుటకుఁ, గల్పించినాఁడు. యువరాజుగా నాహవమల్లుఁడు చేసినయుద్ధములు కలవుకాని మాళవ—దాహళ—చోళాదిదివిజయము లన్నియు, రా జై, తన పట్టాభి షేకమునాఁటికే పెద్ద పెరిగి చేతికి నందినకుమారులతోఁ గలిసి ఆర్జించినవే యని చరిత్ర తెలుపు చున్నది.

(6) ఆహవమల్లుఁడు తనరెండవకుమారునిఁగాని మూఁడవవానిఁగాని నియో గింపక, పెద్దకుమారునే రెండవసోమేశ్వరుని, ఆదినుండియు యుద్ధములకుఁ బంపక, రాజధానీరక్షణార్థము నియోగించు చుండెను. పైనఁ జూచిన 'ప్రతిక్షణం' అనుశ్లోకమువలన రాజధానీ రక్షణావశ్యకత యింతంత గా దని తెలియు చున్నది. పైఁగా, యువరా జనునది యీకాలమున నొకపదవిగాను నందులకు రాజకుమారుఁడే కాక తదితరులుగూడ నియుక్తు లగుచుండి రనియుఁ దెలియు చున్నది. క్రీ. శ. 1044 సం॥ లో 'శోభనరసు' అనునతఁడు 'వేంగీపురవరేశ్వరుఁ' డను బిరుద ము ధరించి యున్నాఁడు, రెండవసోమేశ్వరుఁడు అటుతర్వాత 1049 సం॥లో నీబిరుదేకాక 'భువనైకమల్లుఁ' డనుబిరుదునుగూడ ధరించుటచేఁ, దండ్రిచేతఁ దర్వాతిరాజుగా నుద్దిష్టుఁ డని తెలియు చున్నది. విక్రమాదిత్యుఁడు 'త్రిభువనమల్ల' బిరుదమును పట్టాభిషేకకాలమున ధరించినాఁడు.

రాజధానీనగరరక్షణము ఈకాలమునఁ జాల ముఖ్యము. లెక్క లేనిసేనా పతులతోఁ గలిసి పోరాడుట అంత గొప్ప కాదు, చోళరాజులు రాజధానిని దూర ముగా మార్చుకొనుటయే యిందులకు దార్కాణ. ఇంచుమించుగా క్రీ. శ. 1044 1045 సం॥ ప్రాంతములకు భోజరాజుకూడఁ దనరాజధానిని ఉజ్జయినినుండి నూతనముగా నిర్మించిన'ధారా'నగరమునకు మార్చుకొనెను. అట్లు దూరము పోయియు క్రీ. శ. 1049 సం॥ ప్రాంతమునఁ జోళులు కల్యాణకటకమును దగులఁ బెట్టిరి. అందులకు బదులు చాళుక్యులు కాంచీనగరము, ఉజ్జయిని, ఉద యపురము, ధారానగరము, మున్నగువానిని దగులఁ బెట్టిరి. కల్యాణకటకరక్షణము కన్న వేంగీపురమునకుఁ జోళులను రానీయక యుండుటయే చాల ముఖ్యముగాఁ గనఁ బడు చున్నది. అచట నతిసమర్థులు ఉండ వలసి యుండెను. 1044సం॥లో 'శోభనరసు' అట్టివాఁడు, 1049 సం॥లో రెండవసోమేశ్వరుఁడు నట్టివాఁడే. ఎవరు జయించినను నాయాప్రదేశములు శత్రుగతములు గా నీకుండ కాపాడుకొనుట

గొప్పవని. అట్టిసమర్థుఁడుగావుననే రెండవసోమునిఁ దండ్రి యెచ్చటను యుద్ధములకు రానీయక రాజధానీరక్షణార్థమే నియోగించు చుండె ననుట విదితము.

(7) తృతీయసర్గలో వర్ణింపఁ బడినవిక్రమాదిత్యునివిజయము లన్నియు నాతఁ డొక్కఁడే సాధించినవి గావు. తండ్రితోను, మంత్రి–సేనాపతి–సామంతాదులతోను మహాసైన్యము కదలి దిగ్విజయయాత్ర చేయఁగా వారితో విక్రమాదిత్యుఁడును బరాక్రమింప, శక్తిమంతుఁ డైనరాజకుమారుఁడుగానఁ జోళరాజులు ఇతని నామధేయమును బలుమార్లు పేర్కొని యుండిరేకాని యావిజయములు ఆతఁ డొక్కఁడే సాధించినవి కావు. ఈకాలమున వేంగియే ప్రధానఫల మని తెలిసినది గదా! మిగిలిన వన్నియు దాని ననుసరించినవి. రాజాధిరాజు, అతనితమ్ముఁడు రెండవరాజేంద్రుఁడు, అతనితమ్ముఁడు వీరరాజేంద్రుఁడును, వారిసామంత–మాండలిక–సేనాధిపతులును, రాజరాజనరేంద్రునికి వేంగిని సాధించుటకుఁ జేసిన మహాప్రయత్నము లేవియు 1049 సం॥ వఱకు నేమాత్రమును ఫలించినట్లు కానరాదు. కాని, చోళులకు సాయముగా భోజుఁడును దాహళాధిపుఁడు కర్ణుఁడును, అటు పడమటఁ గొంకణప్రాంతమువారును. ఇటు తూర్పునఁ జక్రకూటమునారును గల్యాణీచాళుక్యులకు నిరంతరము బాధ కలిగించు చుండిరి. సోమేశ్వరుఁడు ఒకవైపు వీరి నందరిని శిక్షించుచు వేంగికి రాజరాజనరేంద్రుని రా నీయక యడ్డుచుండెను. మొదటఁ గావేరీ–తుంగభద్రాతీరములకుఁ బరిమిత మై యుండినయుద్ధరంగము అఖిలభారతవ్యాప్త మై, రాజు లందఱును, జోళమిత్రులును చాళుక్యమిత్రులునుగా, రెండుపక్ష లైరి.

ఇప్పటఁ గాకతీయులయభివృద్ధి గమనింపఁ దగినది. ఆహవమల్లసోమేశ్వరుఁడు తూర్పున వేంగినుండికాని, చక్రకూటమునుండికాని, ప్రాగుదక్కోణము నుండికాని, ఉత్తరమునుండికాని శత్రువులు ఎత్తి రాకుండఁ గాకతీయులను ఆదరించి వారికి అనుమకొండరాజ్యమును నిర్మించుకొనుట కవకాశ మిచ్చెను. కొంకణ–మాళవభూపతులు బలగర్వితు లైనందున వారిని శిక్షింప నాహవమల్లుఁడు గొప్ప సన్నాహముతో బయలుదేరెను (1049). కొంకణమునఁ గొంతసైన్యము నుంచి తాను భోజునిమీఁదికిఁ బోయెను. నూటముప్పదిమందిరాజులు కలిసి భోజుని ఎదిరించి రని 'మేరుతుంగాచార్యుఁడు' 'ప్రబంధచింతామణి'లో వ్రాసియున్నాఁడు. నూటముప్పదిమంది పూర్తిగా లెక్కకు రాకపోయినను నాహవమల్లుఁడును, నాతని



సామంతులును, హొయసల–కదంబ–పల్లవ–కాకతీయాదులును, పశ్చిమమున గూర్జర–భీమాదులును జాలమంది కలిసి విద్యాధికుఁడు కవిపండితపోషకుఁడు నైనభోజు నెదిర్చినట్లు తెలియుచున్నది. భోజుఁడు కల్యాణీచాళుక్యులకు నింతటి వైరి యైనందులకుఁ గారణము పూర్వపు 'ముంజ–తైలప' వైరమే. నాఁడు ముంజమహీపతియొక్క రత్నాలకిరీటమును జయించినచాళుక్యులు దానిని తమజయభేరికిఁ గట్టి తమయుద్ధప్రయాణములలో నాడంబరముగాఁ బ్రదర్శించు చుండిరి. దాని నెత్తినను మఱలఁ బట్టుకొనుటకు భోజుడు పంపినరాజపుత్రులు ప్రయత్నించు చుండిరి. ఇట్టియుద్ధములలో నాహవమల్లుని సేనలు భోజునినగరమును దగులఁబెట్టినవి, భోజుఁడు ఎనుబదియేండ్లు దాఁటినవృద్ధుఁడు. అందఱితోను పోరాడుచుండి నడుమ నతిసారభేదులతో మరణించెను. చాళుక్యులు మాళవమును బట్టుకొని భోజునివంశస్థుని తమ్మాశ్రయించినవానిని మాళవమందుఁ బ్రతిష్ఠించిరి.

కాని, ఈపని యింతసులువుగా నెఱవేఱలేదు. చాళుక్యులు భోజుని ముట్టడించి యుండఁగాఁ జోళులు కల్యాణకటకమును దగులఁబెట్టిరిగదా! ఈవార్త విని కొంకణమండలిచాళుక్యసేనాధిపతి బయలువెడలి వచ్చి కాంచీనగరమును దగులఁబెట్టెను. ఆహవమల్లుఁడును వెనుదిరిగెను, చోళరాజులు కల్యాణమునుండి చక్కని శిల్పఖండములను హరించుకొని పోయిరి.

ఈసమయమున జరిగినయొకయాశ్చర్యకర మైనసంఘటనము ఏ దనఁగాఁ, జోళరాజులదౌహిత్రుఁడు, రాజేంద్రచోళునియల్లుఁడు రాజరాజనరేంద్రుఁడు లెక్కలేనన్నిపర్యాయములు పదభ్రష్టుఁ డై, ఇఁక మార్గాంతరముఁ గానక 'నన్నయ'నీతిప్రయోగమువలనఁ జాళుక్యులమైత్రిని సంపాదించి మఱల వేంగిని నొందెను. నన్నయ్యకు, వాణస-నారాయణభట్టు, కర్ణాటకమహామంత్రియొక్క బంధువు సహాధ్యాయి. అతనిని వేంగికి రాయబారిగాను బందితుఁడుగాను దెచ్చుకొని, కర్ణాటకుల పక్షము చేరి, చోళులను వదలి, తనతొంటిస్వాతంత్ర్యమును వదలక రాజరాజనరేంద్రుఁడు నన్నయసాయముచే వేంగిని మఱల నొందెను. ఇదియు ఈ 1049–50 సంవత్సరములకాలమున జరిగినది. ఇదిమొదలు పదేండ్లు నిశ్చింతగా రాజనరేంద్రుఁడు 1061 సం॥ వఱకు, శత్రుబాధ లేక రాజ్య మేలెను. ఈ పదేండ్లలోనే ఆంధ్రమహాభారతరచనయు జరిగినది. ఎవనికొఱకుఁ దాము తరతరములుగాఁ బోరాడుచుండిరో యావిజయాదిత్యునికిఁ జాళుక్యులు తమకడనే

పదవుల నిచ్చిరి. చోళులతోడియుద్ధములు ముగియనందువలనను, వారు పగ సాధించు ప్రయత్నములతో నుండినందువలనను విజయాదిత్యుఁడు కర్ణాటకులకడనే యుండి యుద్ధములలోఁ బాల్గొను చుండెను. సోమేశ్వరుఁడు కల్యాణకటకమును, రాజేంద్ర చోళుఁడు గంగై కొండచోళపురమును, భోజుఁడు ధారానగరమును నిర్మించు కొన్నట్లు రాజరాజనరేంద్రుఁడును రాజమహేంద్రపురమును గోదావరికిఁ దూర్పున శత్రువులకు దూరముగా నిర్మించుకొని అచ్చటనే యాంధ్రమహాభారతరచన చేయించెను.

ఎక్కడి మాళవము, ఎక్కడి డాహాళము, ఎక్కడి కాంచీ-కల్యాణ-వేంగీపుర ములు. ఇవన్నియు నాఁడు ఈరాజులరణరంగము లై యుండఁ దండ్రిచెంత నుండి యితరులతోఁ గలిసి పోరాడినవాఁడేకాని విక్రమాంకుఁడు తా నొక్కఁడే యా స్థలములలోఁ దనపరాక్రమమును జూపినవాఁడు కాఁడు. చోళశాసనములలో 'విక్కి, విశయాదిత్త, శింగణ' అని విక్రమాంకుని, విష్ణువర్ధనవిజయాదిత్యుని, జయసింహునిఁ గలిపియే పేర్కొను చుండిరి చోళులు. విక్రమాంకుఁడు శరణా గతుఁ డైన మాళవపతిని రాజ్యమందుఁ బునఃప్రతిష్ఠితునిఁ జేయుటయు నీకాలము నాఁటిదే.

చోళరాజులకు యుద్ధపరాజయములకన్నఁ దమయల్లుఁడు శత్రువులతో సంధి గావించుకొనుటయే పెద్ద దెబ్బగా నుండినది. ఈయవమానమును దాళఁ జాలక గొప్పసన్నాహముతోఁ జోళులు బయలుదేరి, కృష్ణ కుపనది యైన 'హిరెహళ్ళ' నదీతీరమున 'కొప్పం'అనుచోట (నేటికొప్పల్) క్రీ. శ. 1054 సం॥లో ఘోర యుద్ధ మొనర్చిరి. అందుఁ జోళరాజాధిరాజు ఏనుఁగుమీఁదనే చంపఁ బడెను. అతనితమ్ముఁడు రెండవరాజేంద్రుఁడు రణరంగమందే పట్టాభిషేకము చేసికొని యింటిదారి పట్టెను. తర్వాతఁ గొంతకాలము చోళులు చేయునది లేక ఊర కుండ వలసినవా రైరి. క్రీ. శ. 1059 సం॥ ప్రాంతమున మఱలఁ దలయెత్త సాగిరి. ఈకాలమునఁ జాళుక్యవిక్రమాంకుఁడు గంగపాడినిఁ (నేటిమైసూరుతోఁ గలిసిన కోలారు రాజ్యమును) బాలించు చుండెను. చాళుక్యులకు నుత్తర-పశ్చిమ-ప్రాగ్దిశల నుండి శత్రుభయము లే కుండెను. ఇట్టితరుణమునఁ జోళరాజు రెండవరాజేంద్రుఁ డును, వానికుమారుఁడు రాజమహేంద్రుఁడును గంగపాడిమీఁద దాడి సలిపిరి. తర్వాతఁ జోళరా జైన వీరరాజేంద్రుఁడును ఈయుద్ధములలోఁ బాల్గొనెను. విక్రమాంకుఁడు తుంగభద్రాతీరమునకుఁ బారిపోయెను.



ఇందులకుఁ గారణము గొప్పదే. వేంగియందు రాజరాజనరేంద్రునికి నవ సానదశ. 1059 సం॥ నాఁటికి నన్నయ్య గతించినాఁడు. 1061 సం॥లో రాజ నరేంద్రుఁడును బోయినాఁడు. విష్ణువర్ధనవిజయాదిత్యునికి వేంగిమీఁదనే కన్ను. రాజనరేంద్రునికుమారుఁడు రాజేంద్రుఁడు (బిల్హణుఁడు పేర్కొన్నరాజిగుఁడు, తర్వాతఁ జోళ-వేంగీమండలములకు రెంటికిని అధిపతి యైనకులోత్తుంగచోళుఁడు) తనమేనమామలకడఁ జోళరాజ్యమందే యెదుగు చుండెను. విజయాదిత్యుఁడు అదను చూచి వేంగిని ఆక్రమించి తనకుమారునికి రెండవశక్తివర్మకు వేంగిని బట్టము కట్టెను. విక్రమాంకునికి నెంతటిశక్తి యుండినను విజయాదిత్యుఁడు కుడిభుజము. అతనిసాయము లేకపోయినందునఁ గాఁబోలుఁ జోళులు గంగపాడిని ఈకాలమున నపహరించిరి. మైసూరురాజ్యము విక్రమాంకునిబలహీనతచేతఁ జాళుక్యులు పోఁ గొట్టుకొనిరి.

కాని వేంగికిమాత్రము ఎట్టిభయమును లేదు. రెండవశక్తివర్మయుఁ జాళుక్యసైన్యములును గాపాడుచుండుటచేఁ జోళులు అంతదూరము పో లే కుండిరి. అందువలనను, జోళులను బై కి రా నీయక యుండుటకును, విజయాదిత్యుఁడు గంగ పాడి-నొళంబపాడిప్రాంతములకు వచ్చి చాళుక్యసైన్యములను నడప నారం భించెను. మొదటిపర్యాయము విజయాదిత్యునిసాయము లేక పోవుటచే, విక్ర మాంకుఁడు పరాజితుఁ డగుటయు, మఱల విజయాదిత్యుఁడు వచ్చుటయుఁ జింతింపఁ దగినవిషయములు. అన్నకన్నను బరాక్రమశాలియే యైనను విక్ర మాంకుఁడు, బిల్హణుఁడు వర్ణించినంతటిపరాక్రమశాలిమాత్రము కాఁ డని తోఁచు చున్నది.

యుద్ధములు మఱలఁ దీవ్రరూపమును ధరింప సాగినవి. రాజేంద్ర చోళునికుమారుఁడు రాజమహేంద్రుఁడు ఈసందర్భమున నెప్పుడో రణమరణము నందిన ట్లున్నాఁడు. వీరరాజేంద్రుఁడు వేంగిమీఁదికి విజృంభించెను. వేంగి స్వాధీనము కా లేదుకాని విజయాదిత్యునికుమారుఁడు రెండవశక్తివర్మ, బెజవాడకడ జరిగినయుద్ధమున నభిమన్యునివలెఁ బోరాడి మడించెను. క్రీ. శ. 1062-1063 సం॥ ప్రాంత మై యుండును. వీరరాజేంద్రుఁడు ఇంకను మీఁదికి రాక వెనుదిరుగ వలసినపరిస్థితి, అతనియన్న రాజేంద్రచోళునిమరణముచేతఁ గలిగినది. సందర్భములు విషమపరిణామము నందు చుండినవి. వేంగికిని జోళ

రాజ్యమునకును మార్గము కడప-కర్నూలు-లేక బళ్ళారిప్రాంతములనుండియేకాని నేఁటి మదరాసు-బెజవాడ మార్గము బొత్తిగా లేదు. కాఁబట్టి విజయాదిత్యుఁడు తన కుమారుఁడు గతించినను వేంగికి రాక, గంగపాడి-నొళంబంపాడి మార్గముల యందే యుండెను. కృష్ణా-తుంగభద్రాతీరములే శత్రుమార్గములు.

రాజధానికి వడివడిగా వచ్చినవీరరాజేంద్రుఁడు పట్టాభిషేకము చేసికొని, వెంటనే వేంగిమీఁదికి బయలుదేరెను; పరాక్రమశాలి గొప్పసన్నాహముతో 'కూడలసంగమ' మనుప్రదేశమునఁ జాళుక్యులతో ఘోరయుద్ధ మొనరించెను. విక్రమాంకుఁడును, వానితమ్ముఁడు జయసింహుఁడును రణభీరువు లై పారిపోయి రని చోళశాసనములు చెప్పు చున్నవి. ఇ దంతయు 1064 సం॥లో జరిగిన ట్లున్నది. వేంగియేమో స్వాధీనము కాలేదు. విజయాదిత్యునిశాసనములు వేంగి యందు క్రీ.శ. 1063, 1064, 1065 సం॥ ములలోఁ గలవు. చోళులకు మఱలఁ దమయూరికిఁ బోవలసి వచ్చినది.

ఇందులకుఁ గారణము చాళుక్యులనీతిప్రయోగమే. 1064 సం॥లోఁ జోళ లను దండించుటకును, వారు గృహోన్ముఖు లగుటకును నుపాయముగా నాహవ మల్లుఁడు విజయాదిత్యుని దక్షిణదేశయాత్రకుఁ బంపెను. కూడలసంగమమందు విజయాదిత్యుఁడు కాన రాఁడు. ఈప్రయోగముచేతఁ జోళులు వెనుదిరుగఁగానే వారిని మార్గములో 'పొత్తపి'రాజును, ధారానగరజననాథునితమ్ముఁడును ఎదిరించిరి. చాళుక్యమిత్రు లైనపాండ్యులును జోళులమీఁదికి ఎత్తివచ్చిరి. ఈసందర్భమునఁ జోళులను ఆహవమల్లుఁడు ఎక్కడనో పేరు చెప్పనినదీతీరమున నోడించెను.

విజయాదిత్యునికృషిచేత 1067 సం॥ వఱకుఁ జోళు లూరకుండి మఱల ఎత్తివచ్చిరి. విజయాదిత్యుఁడు బలవంతుఁడేకాక చాళుక్యసోమేశ్వరునికిఁ దాను 'కుమారుఁడ' నని (అభిమానముచేత) చెప్పికొని యున్నాఁడు. ఇచ్చట మఱల నూతనపరిణామములు కలిగినవి. ఆహవమల్లునికిఁ జరమకాలము సమీపించు చుండినది. వీరరాజేంద్రుఁడు తన 'మణిమంగళ' శాసనమునఁ జాళుక్యచక్రవర్తి, తానును, దనకుమారులును నోడిపోయినయవమానమును బోఁ గొట్టుకొనఁ గోరి తన్నుయుద్ధమునకు అకూడలసంగమప్రదేశమునకే, 'గంగాకేతఁ'డనుదూతముఖ మునఁ బిలిచె ననియుఁ, దాను బోయి నెలదినము లుండినను నాహవమల్లుఁడు రా లే దనియు-నింకను వివరములు వ్రాసి-చాళుక్యవీరులు పారిపోఁగాఁ దాను జయించినట్లు



చెప్పికొని యున్నాఁడు. ఇది యెంతవఱకు నిజమోకాని దీనినిగుఱించి చాళుక్య శాసనములుగాని, విక్రమాంకదేవచరితముగాని యేమియుఁ జెప్పవు.

(8) నాల్గవ సర్గములో ఆహవమల్లునియవసానకాలము, విక్రమాదిత్యుని యనంతరదిగ్విజయములును, నాతఁడు తండ్రిమరణానంతరము మఱలఁ గల్యాణ కటకమునకు వచ్చి కొన్నా ళ్ళుండి యన్నదుష్ప్రవర్తనను సహింప లేక బయలు దేరుటయు వర్ణింపఁ బడినవి. వీనిసత్యాసత్యముల నరయ వలయును.

విజయాదిత్యుఁడు దక్షిణమునకుఁ బోయి వచ్చి వేంగియందు ఎదురు లేని ప్రభువుగా నున్నాఁడు. 1067 సం॥లో నాహవమల్లుఁడు కొల్లిపాకప్రాంతమున నున్నాఁడు. ఇతఁ డేల వీరరాజేంద్రుని మఱల యుద్ధమునకుఁ బిలిచెనో, పిలిచియు నేల రాలేదో, ఇ దెంతవఱకు నిజమో కాని. యీకాలపుసంభవములు చాల వడి వడిగా జరిగి పోయినవి. ఆశ్చర్యకరము లైనమార్పులుకూడ వచ్చినవి. ఆహవమల్లుఁడు పిలిచియు రానందునఁ గాంబై (కందనవోలు = కర్నూలు) అనుచోట నెలదినము లుండి, రట్టపాడిని (కన్నడరాజ్యమును) జయించి, తుంగ భద్రాతీరమున జయస్తంభము నాఁటి, 'వేంగిని జయింపక వెను దిరుగను' అని ప్రతిజ్ఞ చేసి, కృష్ణను దాఁటి, బెజవాడసమీపమునఁ జాళుక్యులసైన్యములను ఓడించి, యటనుండి గోదావరిని దాఁటి కళింగ-చక్రకూటములకుఁ బోయిఁ వేంగినిఁ బూర్తిగా (నలువైపుల) జయించి, తనకుఁ బాదాక్రాంతుఁ డైనవిజయాదిత్యు నికి వేంగిని ఇచ్చి, గంగాకుండపట్టణమునకుఁ దాను బోయినట్లు వీరరాజేంద్రుఁడు చెప్పికొని యున్నాఁడు. చక్రకూటము ఈకాలమునకుఁ జాలప్రాముఖ్యము నంది యుండినది. ఈకాలముననే రాజరాజనరేంద్రునికుమారుఁడు, రాజిగుఁడు. వీరరాజేంద్రు నితోఁ జక్రకూటప్రభువు ధారావర్షుని జయించి, వానికడనుండి ఏనుఁగులను గప్ప ముగా గ్రహించి, చాళుక్యసైన్యములను, విక్రమాదిత్యుని నెదుర్కొని యుద్ధ మొన రించినట్లు తెలియు చున్నది.

ఇ వన్నియు నేకకాలమందు జరిగినవి కావు. 1067 సం॥ సెప్టెంబరులో వీరరాజేంద్రుఁడు రెండవమాఱు తుంగభద్రాతీరమునకు రాఁగా నాహవమల్లుఁడు కొల్లిపాకకడ నుండెనుగదా! అటువెనుక, తీరనివ్యాధి పట్టుకొనఁగా నాహమల్లుఁడు 1068 సం॥ మార్చి 29వ తారీఖునఁ దుంగభద్రలో మునిఁగి మంత్రపూర్వక ముగా శివైక్యము నందెను. ఈకాలమున వీరరాజేంద్రుఁ డింకను వేంగీప్రాంతమున

నుండెను. గాఁబోలు. విజయాదిత్యుఁడు చాళుక్యబలము తగ్గిన దని తలంచెనో, లేక రాజనీతిప్రయోగమో తెలియదు. వీరరాజేంద్రునితోఁ జెలిమి చేసికొని వేంగినిఁ గాపాడుకొనెను. రాజిగుఁడు ఎచ్చటనుండెనో తెలియదు. ఆహవమల్లుఁడు ఇంకను జీవించి యుండఁగానే విక్రమాంకుఁడును వానితమ్ముఁడును దక్షిణ దిగ్విజయమునకు బయలుదేరి అంతయుఁ బూర్తి గావించుకొని మరలి తుంగ భద్రాతీరమునకు వచ్చినపుడు తండ్రిమరణవార్త వినిరఁట. దీనింబట్టి చూడ ఆహవ మల్లుఁడు తాను ఒకపాటిఆరోగ్యమున నుండినప్పుడే, చక్రకూటమున రాజిగునితో యుద్ధ మొనరించినవిక్రమాంకుని, ఈపర్యాయము దక్షిణదిగ్విజయమునకుఁ బంపిన ట్లున్నాఁడు. వెంటనే రాజిగునిఁ జక్రకూటముననే వదలి వీరరాజేంద్రుఁడు వేంగికి వచ్చి, విజయాదిత్యునితో, ఆత్మగౌరవభంగము గాకుండ, సంధి చేసి కొని మరలినాఁడు. ఇంతలో నాహవమల్లునిమరణము, భువనైకమల్లునిపట్టాభి షేకము, విక్రమాంకుఁడు వెను దిరిగి తుంగభద్రాతీరమునఁ దండ్రిమరణ వార్తను వినుటయు జరిగి యుండును. విజయాదిత్య-విక్రమాదిత్యులు కలిసియే యుండువారు. 1063 సం॥లో గంగపాడి (మైసూరు) చోళులవశ మైనది మొదలు కలసి యుండుట కవకాశములు లేక పోయినవి. కావుననే గంగపాడి పరాజయానంతరము విక్రముఁడును జయసింహుఁడును జట్టు వీడక యుండిరి.

విజయాదిత్యుఁడు యుద్ధవీరుఁడే కాక. రాజనీతికుశలుఁడు. చోళులు పూర్తిగా జయించినయెడల వేంగి రాజిగునిదే యగును. కాని వారికి జయించి నిలుపుకొనుశక్తి యుండెనో లేదో! రాజిగుఁ డింకను చిన్నవాఁడు. పైఁగా రెండవశక్తివర్మమరణా నంతరము విజయాదిత్యునికి రాజిగుఁడే వారసు. తానును పెద్దవాఁ డైనాఁడు. ఆహవమల్లుఁడును వృద్ధుఁడు. ఎందులకైన మంచి దని, మునుపు రాజ నరేంద్రుఁడు తటాలున శత్రువులను మిత్రులనుగా మార్చుకొన్నట్లు, తానును ఇపుడు అపనియే చేసినాఁడు. రాజిగుఁడును, దర్వాతఁ బినతండ్రితో సంధి చేసి కొని వేంగియందు జీవితాంతము పరిపాలింపనిచ్చినట్లు శాసనములే కలవు. కాఁబట్టి ఇదంతయు విజయాదిత్య - రాజిగ - వీరరాజేంద్రు లొప్పియే చేసికొన్నఏర్పాటుగా నుండును.

విక్రమాంకుఁడు దక్షిణదిగ్విజయము ముగించుకొని వచ్చునప్పటికి ఇన్ని మార్పులు - తండ్రిమరణము, అన్న రాజ్యమునకు వచ్చుట, చోళులయాధి



క్యము, అంతటిప్రాఁతమిత్రుఁడు వేంగీమండలేశ్వరుఁడు విజయాదిత్యుఁడు చోళ మిత్రుఁ డగుట. ఇప్పుడు తా నేమి చేయఁ దగు ననునది పెద్దసమస్యగా నుండి యుండును. గత్యంతరము లేనందునఁ గల్యాణకటకమునకే పోయెను. అన్న రెండవసోమేశ్వరుఁడు ఎదురు వచ్చి తోడ్కొని పోయి ఆదరించెను.

(9) భువనైకమల్లునిరాజ్యాధిరోహణము క్రీ. శ. 1068 ఏప్రిలు 11వ తారీఖునఁ, దండ్రి గతించినపదునైదవదినమున, జరిగినది. తత్క్షణమే క్రొత్తరాజు నున్మూలించుట సుకర మని వీరరాజేంద్రుఁడు దండెత్తి వచ్చెనుగాని గుత్తికడ చాళుక్యులు ఎదుర్కొని తఱుమఁ గొట్టిరి. వెంటనే వీరరాజేంద్రుఁడు ఆ మార్గము వదలి కంపిలినిఁ దగులఁబెట్టి చక్రకూటమునకుఁ బోయి అచటఁ గా పుండిన చాళుక్యసైన్యమును దాఁకెను. అటనుండి కర్ణాటకులను జయింప లేక వెనుదిరిగెను. ఇట భువనైకమల్లుఁడు యుద్ధమునందును రాజ్యరక్షణమందును సమర్థుఁడుగానే కనఁ బడు చున్నాఁడు.

ఇటుతర్వాతనే విక్రమాంకుఁడు నగరమునకు వచ్చుటయు, నన్న నాద రించుటయు జరిగినవి. క్రీ. శ. 1068 సం॥ నాఁటికే విక్రమాంకుఁడు ఇంటిలో నన్నతో నున్నాఁడు. అప్పుడు తండ్రి మరణించినరెండవనెల. అటువెనకనే భువనైకమల్లుఁడు, తమ్మునితో సంప్రతించికాఁబోలుఁ జోళులు ఎత్తి రాకుండు నట్లు నడిమిరాజ్యమును బంచి యిచ్చినాఁడు. తనప్రధానసహాయకునికి లక్ష్మణ దండనాథునికి 'బనవాసి'రాజ్యమును, నొళంబపాడి - సిందవాడి' రాజ్యములను దమ్ముఁడు జయసింహునికిని. అలంపురమునుండి యుండుకర్ణాటకప్రాంతీయ రాజ్యము నంతటిని విక్రమాదిత్యునికిని నిచ్చి. చోళులు ఏమార్గమునుండియుఁ బ్రవేశించుటకు సందు లేకుండఁ జేసెనఁట. గుత్తికోటను బాగు చేయించి యచ్చట గొప్పబలగము నుంచెను. భువనైకమల్లసోమేశ్వరునిమొదటిశాసనమందే, రాజ్య మందు నందఱకన్నఁ దాను గొప్పవాఁ డనియుఁ దనకుఁ దర్వాత విక్రమాంకుఁ డనియు నాతనికినిఁ దర్వాత జయసింహుఁ డనియుఁ దమకు మువ్వురకును దర్వాత లక్ష్మణదండనాథుఁ డనియు గొప్పగాఁ జెప్పుకొన్నాఁడు. ఈయేర్పాటు లన్నియు క్రీ శ. 1068 సం॥ జూనునెలకుఁ జేయఁ బడినవి.

విక్రమాంకుఁడు అటువెనుకఁ గొంతకాలమునకు. అసంవత్సరమే, తిరుగఁ బడి చోళరాజుతో సంధి కుదుర్చుకొన్న ట్లున్నాఁడు. అన్నక్రింద దాను బాలకుఁడుగా

నుండినట్లు ఎక్కడను నితనిశాసనములు లేవు. తమ్ముఁడు జయసింహుఁడు 1070 సం॥ జూనువఱకుఁ బెద్దన్నకు సామంతుఁడు. చోళరాజు వీరరాజేంద్రుఁడు 1069 సం॥లోనే తాను విక్రమాంకునికి నతనియన్న రాజ్యమును జయించి యిచ్చినట్లు చెప్పుకొని యున్నాఁడు. కాఁగా, మొదటికొన్నినెలలలోనే విక్రమాంకుఁడు చోళరాజుతోను, గొంకణజయకేశితోను గుట్ర చేసి యన్నకు నెదురు తిరిగెను. కాని తనరాజ్యమందుఁ దుంగభద్రాతీరమందే యతఁ డుండెను. క్రమముగా బలగము కూర్చుకొని, చాలమంది విక్రమాంకునిపక్షము చేరఁగా, అది చూచి జయసింహుఁడు కొన్నినెలలతర్వాత విక్రమాంకునితోఁ జేరెను బిల్హణుని వ్రాఁత - విక్రమాంక-జయసింహులు ఏకకాలమునఁ దిరుగఁబడి కల్యాణకటకమునుండి వెడలిపోయి రనుట అసత్యము. అందులకు నింకను బ్రబలకారణములు నాఁటి సంభవములే.

క్రీ. శ. 1069 సం॥లోనే విక్రమాంక-వీరరాజేంద్రులకు సంధి కుదిరినది. తత్ఫలితముగాఁ జోళరాజు విక్రమాంకునికిఁ దనకుమార్తె నిచ్చి తుంగభద్రాతీరమందే పెండ్లి చేసి తనరాజ్యమునకుఁ బోయి యాకస్మికముగా మరణించెను. వెంటనే విక్రమాంకుఁడు చోళదేశమునకుఁ బోయి, యచటిశత్రువర్గమును జయించి తన బావమఱఁదిని అధిరాజేంద్రుని రాజ్యమందు స్థాపించి, నెలదినములు గంగైకొండ చోళపురమున నుండి వెనుదిరిగెను. ఇంతలో వేంగిని రాజిగుఁడు, తనమేన మామ విక్రమాదిత్యునిపక్షము చేరినందువలనఁగాఁబోలుఁ, దటాలున వేంగినిఁ బినతండ్రి విజయాదిత్యునికడనుండి నాఁచికొని వేంగిప్రభువుగా 1070 సం॥ జూనునెలలోఁ బట్టాభిషేకము చేసికొనెను. విజయాదిత్యుఁడు కళింగములోఁ దలదాచుకొనెను. చోళదేశమందు విక్రమాంకునిచే జయింపఁ బడినవారు రాజిగునిమిత్రులు. రాజిగుఁడు ఎక్కువకాలము తమిళదేశ మందే యుండినవాఁడుగదా! ఒకనెలదినములు పరిపాలించెనో లేదో అధిరాజేంద్రునిఁ గడతేర్చి రాజిగుఁడు 1070లోనే చోళ చక్రవర్తి యాయెను.

ఇచ్చట మఱియొక చిత్రము. ఈకాలపుసంభవములు గందరగోళముగా నున్నవి. తారీఖులచేత విడఁదీసి చిక్కు లేకుండ విషయమును అనుపూర్విగాఁ జెప్పుట కొంత దుష్కరము. కాని, కొన్నిప్రధానాంశములను గ్రహింప వచ్చును. విక్రమాంకుఁడు అన్నకు నెదురుదిరిగి తనమేనమామతోఁ జేరఁగానే రాజిగుఁడు, (బిల్హణుఁడు చెప్పినట్లు) రెండవసోమేశ్వరునితో సంధి కుదుర్చుకొని, కల్యాణీ



చాళుక్యులబలముతో వేంగిని గ్రహించినాఁడు. ఇంతలో మేనమామ గతించి యాతని కుమారుఁడు రాజు కాఁగాఁ, బినతండ్రితో మఱల సంధి కుదుర్చుకొని, ఆయన జీవితాంతము వేంగియందుఁ బాలకుఁడుగా నుండునట్లు నిర్ణయించి తాను జోళసింహాసనమును బట్టుకొని 'ఉభయకులోత్తుంగుఁ' డనుబిరుదును ధరించి తండ్రిరాజ్యమునకును మామరాజ్యమునకును నధిపతి నని ప్రకటించుకొనెను.

ఇప్పుడు విక్రమాంకునిది విషమపరిస్థితి. తాను ఏకాకి యైనాఁడు. కాని, తుంగభద్రాతీరమును వదలక గంగపాడిని గుత్తిప్రాంతమును స్వాధీనము చేసికొనెను. జయసింహుఁడు 1070 సం॥ జూలై వఱకుఁ బెద్దన్నకు సామంతుఁడుగా నుండినవాఁడు. అటుతర్వాతఁ జిన్నన్నతోఁ జేరినాఁడు. 1071 సం॥ నాఁటికి విక్రమాంకుఁడు 'త్రిభువనమల్ల'బిరుదముతో నున్నాఁడు. ఈకాలమున విక్రమాంక - జయసింహులమీఁదికి భువనైకమల్లుఁడు సైన్యములను బంపి యుండును. రెండవ సోమేశ్వరునిరాజ్యకాలము క్రీ. శ. 1076 సం॥ వఱకును నడచినందువలన నాఱేండ్లు విక్రమాంకుఁడు అన్నతోఁ బోరాడి యున్నాఁడు. కాని, ఈయాఱేండ్ల కాలము ప్రయత్నములతో సరిపోయినది. మొదట 1071 సం॥ లో విక్రమాంకుని ప్రయత్నములు ఫలింప లేదు. రాజిగునిబలముచేత సోమేశ్వరుఁడు విక్రమాంకునిఁ దాత్కాలికముగా నాఁపఁ గలిగెను. కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపురములలోఁ గొంత, మైసూరులోఁ గొంతయు విక్రమాదిత్యునియధీనమున నుండినవి. వేంగీ - చోళసామ్రాజ్యములు రెండును రాజిగునియధీనములు.

1075లో విక్రమాంకునికి నవకాశము దొఱకినది. సింహళ - పాండ్యులను జోళులమీఁదికి ఎసకొల్పెను. చేదిరాజు యశఃకర్ణుని వేంగిమీఁదికి 1072-73 సం॥ లో రెచ్చఁగొట్టి గోదావరికిఁ బైనుండి అన్నకు (విజయాదిత్యుఁడు) సాయము రానీయక అరికట్టెను. కళింగులతో మైత్రి నెఱపెను. 1076 సం॥లో విజయాదిత్యుఁడు వేంగిలో మరణించెను. రాజిగుఁడు దానిని గాపాడుకొనుటకుఁ దనకుమారుల నచటికిఁ బంపియు దక్షిణమున సింహళ - పాండ్యులబాధను దప్పించుకొనుచు నుండియు రెండవసోమునికి సాయముగా సైన్యమును బంపెను. కాని, ప్రయోజనము లేకపోయినది. మొదటఁ జోళులతోనే విక్రమాంకునికి యుద్ధ మాయెను. చోళులసాయముతోఁ జాళుక్యులు గంగపాడిని స్వాధీనముఁ జేసికొన సాగిరి. బనవాసికూడ పోయినది. ఇట్లు చోళులతో యుద్ధ

మొనరించు చుండినవిక్రమాంకుని, నన్న భువనైకమల్లుఁడు పైనుండి వచ్చి తాఁకెను. తుంగభద్రాతీరమే రణరంగము. దీనిలో దురదృష్టముచేత సోమేశ్వరుఁడు విక్రమాంకునిచేతఁ జిక్కి బంది యాయెను. ఇఁకఁ జేయునది లేదు. రాజిగుఁడు వెనుదిరిగెను. కాని, గంగపాడి, నొళంబపాడి మున్నగురాజ్యములు చోళులకే దక్కినవి. క్రీ.శ. 1076 సం॥ ఫిబ్రవరినెల 11వతారీఖున విక్రమాంకుఁడు చాళుక్యచక్రవర్తిగాఁ బట్టాభిషేకము చేసికొనెను. అంతటిపరమధార్మికుఁడు అన్నకు ఎట్టిమర్యాద చేసెనో తెలియదు. తమ్ముని జయసింహుని యువరాజుఁ జేసెను.

విక్రమాంకుఁడు తాను రా జగుచునే తనపేరట నొకశకమును, 'చాళుక్య విక్రమ'శకమును స్థాపించెను.

(10) తర్వాతఁ గొన్నాళ్లకు విక్రముఁడు మరల నొకపర్యాయము చోళ రాజును జయించె నని బిల్హణుఁడు వ్రాసెను. కాని, యిది పెద్దవిజయము కాదు. వనవాసిని జయించి దానికి జయసింహుని నధిపతిఁ గావించినాఁడు. జయసింహుఁడు చాలవఱకుఁ జుట్టుపట్ల రాజ్యములను మరలఁ జోళులనుండి గ్రహించినట్లే యున్నాఁడు. వనవాసియేకాక గంగపాడికూడ స్వాధీన మైనది. వేంగిమీఁదికిఁ బోవఁ బ్రయత్నించెను. సాధ్యపడ లేదు. విక్రమాంకుఁడు పాండ్యసింహళీయులను గులోత్తుంగ చోళ రాజిగునిమీఁదికి రేఁపి వారిని అతఁడు దండించులోపల నీప్రయత్నములు చేసిన ట్లున్నాఁడు. ఇవన్నియు క్రీ.శ. 1080 సం॥కు ముందే జరిగినవి. ఇందులో మరలఁ జోళరాజిగుఁడు జయసింహునితోఁ గుట్ర సాగించినట్లు తెలియు చున్నది. జయసింహునిశాసనములు 1080 సం॥కుఁ దర్వాతఁ గాన రానందున, మొదటి నాలుగేండ్లలోనే యాతనితిరుగుబాటు జరిగి యుండ వలెను. అటుతర్వాత జయ సింహునిమాట లేదు. అతనిని విక్రమాంకుఁడు మన్నించె నన్నది యెంతవఱకు నిజమో తెలియదు.

ఇది ౧౨వసర్గములో వర్ణితము. ఈనడుమ 'చందలదేవీ'స్వయంవరాదిక ములు వర్ణితములు. క్రీ.శ.1084సం॥లో విక్రమాదిత్యుఁడు తనతోఁ జోళులు యుద్ధమునకు రాక యున్నా రని యనుటచేత నీయుద్ధాదులు నాఁటితో నిలిచిన ట్లున్నవి. వేంగియుఁ జోళులచేతియందే యుండినది. కులోత్తుంగ రాజేంద్రచోళుఁడు జీవించి యుండినంతకాలము విక్రమాంకునికి వేంగియందుఁ బ్రవేశము దొరక లేదు.



(11) ఇఁకను మిగిలి యుండునది చోళరాజుతోఁదికరపటియుద్ధము. ఇది 17వసర్గములోఁ గలదు. విక్రమాంకుఁడు క్రీ.శ.1076 సం॥ ప్రారంభమునుండి 1126సం॥ చివరివఱకు ఏఁబదియేండ్లు పాలించినాఁడు. క్రీ.శ.1084సం॥కుఁ దర్వాతఁ బశ్చిమచాళుక్యులకు వేంగితో యుద్ధప్రసక్తి రాలేదు అంతవఱకు నుండినకులోత్తుంగునిరాజప్రతినిధులు బలహీనులు. 'చోడగంగఁ' డనుకుమారుఁడు 1084 సం॥లో వేంగికి రాజప్రతినిధి యగుటయు జయసింహునితిరుగుబాటు అణఁపఁ బడుటయు నైనతర్వాత నంతయు శాంతించినది. కులోత్తుంగునిచివరి దినములలో మరలఁ జాళుక్యసైన్యములు వేంగినిఁ దాఁక నారంభించినవి. కుమార తైలపుఁడు 1110–1113సం॥ నడుమ తాఁకెను. ఇందువలన నెక్కువప్రయో జనము లేదు. కాని, 1118సం॥లోఁ బశ్చిమచాళుక్యులు వేంగిని జయించి 1131సం॥ వఱకుఁ దమయధీనమం దుంచుకొనిరి. త్రికళింగములుకూడ వీరికి స్వాధీనము లైనవి. చోళరాజప్రతినిధి, రాజపుత్త్రుఁడు పరాంతకుఁడు నిలువ లేక పాఱిపోఁగాఁ జాళుక్యసైన్యములు కంచివఱకు వెంబడించి ఆక్రమించినవి. కంచిలోఁ గొన్నా ళ్లుండి విక్రమాంకుఁడు మరలె నని బిల్హణుఁడు వ్రాసినది సత్యమే. నెల్లూరినిఁ జోళరాజులు కంచితోఁ గలిపి నెల్లూరిరాజ్యమును బాలించుటకుఁ బినాదులు ఈకాల మున వారు విక్రమాదిత్యునిసామంతులుగా నుండఁగా, నేర్పడినవే.

సంస్కృతవాఙ్మయమునందుఁ బ్రత్యేకముగాఁ జరిత్ర యనఁ దగినకావ్యము లేదు. చారిత్రికజ్ఞానము లేక కాదు. ఇతిహాస-పురాణములు, రాజవంశావళులు, పంచాంగగణనము, వివిధశకాబ్దములు, పౌర్వాపర్యజ్ఞానము, కృతయుగాది విభజనము ఇవన్నియు లేకపోలేదు. ఆధునికులదృష్టిలోనికాలమానవివరములు కానరావు. దేశము ఆసేతుహిమాచలము అతివిశాల మగుటచేత జనులజీవితము లలో విశ్రాంతి లేక యెంతో కాలగర్భమున లీన మై పోయినందున మనకుఁ దెలియుట లేదు.

కాని, యనాదినుండియుఁ గావ్యగుణములు పెంపొంది అన్నివిషయములను హృదయాహ్లాదకరముగా వర్ణించుట యేర్పడి, నగరార్ణవశైలాదివిభజన మేర్పడి యొకరసపువక్కణ హృదయములలోఁ గుదురుకొన్నది ఎంతటిచరిత్ర నైనను నీవక్కణ యథాకరించినది. చారిత్రికవిషయముల నితివృత్తములుగా గ్రహించినవారుగూడ నీతిబోధకొఱకు నాయకునిలోనిదోషములను బరిహరించియో,

యన్యథా కల్పించియో రచించుసంప్రదాయ మేర్పడినది. చరిత్ర యిట్టిరచనను సహింపదు. నాయికా - నాయకులదోషముల నెంతవిశదముగా వ్యక్తీకరించిన నంతమంచిది చరిత్రకు. అప్పట మైనవాస్తవకథనము చరిత్రము. నాటకాదులలోఁ బ్రతినాయకునిఁ జాల దోషిగా వర్ణించుటగూడఁ జరిత్ర సహింపదు. కావ్యగుణములు బొత్తిగా లేకపోవుటయే చరిత్రలోనియుత్తమగుణము. కావున విక్రమాంక చరితాదులు చరిత్ర కాఁ జాలవు.

ఇట్లు విక్రమాంకదేవచరితమందలివిషయములకుఁ జారిత్రికవిషయములను బోల్చినయెడల వాస్తవము స్ఫురించు చున్నది. బిల్హణుఁడు ఇచ్చటఁ గావ్యోపసంహార మొనరించి పుత్రోదయాదికములను వర్ణించినాఁడు. కాని, నాఁటికే పెద్ద పెరిగినకుమారులై లవ-సోమేశ్వరాదులు కనఁబడుచున్నారు. బిల్హణుఁడు రాజతరంగిణీకారునివంటివాఁడు కాఁడు. చరిత్ర వ్రాయుట అతనియుద్దేశమున్ను గాదు. మనచారిత్రికకావ్యము లేవియుఁ జరిత్రలుగాఁ బనికి రావు. ప్రభువును స్తుతించుటయు, నందుఁ గావ్యగుణములను జొప్పించుటయుఁ, బ్రభువుయొక్క దోషములను బొత్తిగాఁ గప్పిపుచ్చి యతనిని ధర్మరాజుగా వర్ణించుటయే బిల్హణునియుద్దేశము. అతఁడు కావ్యము వ్రాసి కృతకృత్యుఁ డైనాఁడు. ఈభావమే యాతనిచివరియాశ్వాసమందలి ఆత్మకథలోఁ గాన నగు చున్నది. చాళుక్యవిక్రమాదిత్యునిపరిపాలన సర్వదక్షిణాపథపర్యాప్తమైయుండి యాతనిసామంతులుగాఁ గాకతీయులు, హొయసలులు, యాదవులు, శిలాహారులు మున్నగువా రెందఱో కనఁబడు చున్నారు. రాణులు పలువురు. కాని, యావివరములు కావ్యమునకు అనవసరములు.

ఈచరిత్ర మంతయు నాకు నొకచోట దొరక లేదు. చిరకాలముగా నేను చేయు చుండినపరిశోధనయొక్క సార మిది. శ్రీ డా॥ నేలటూరు వెంకటరమణయ్యగారు, ఆచార్య నీలకంఠశాస్త్రిగారు, ఇంకను ఉత్తరదేశపుచరిత్రకారులు పలువురును వ్రాసిన ఆయారచనలలోఁ జాళుక్యులమూలాధారశాసనములను వాఙ్మయమును సమన్వయించి వ్రాసితిని. జిజ్ఞాసువులు ఆయారచనలను జూడఁ దగును.

మహాకవి బిల్హణుఁడు త న్నాదరించినప్రభువునెడఁ గృతజ్ఞుఁ డై, యాప్రభువు కావ్యనాయకుఁడు గాఁబట్టి, యాతనిచరిత్రను రచించునెడఁ బొత్తిగాఁ గావ్యమర్యాదలను పాటింప వలసినవాఁ డాయెను. వరుస(క్రమము)ను పాటించుటకును, సంభవములను వర్ణించుటకునుమాత్రమే చరిత్రను గ్రహించెను. రెండవసోమే



శ్వరునిఁ బ్రతినాయకునిస్థానమున నుంచినందున నాతనిపై దుశ్చరితముల నారోపించెను. అట్లే తమ్మునికి జయసింహునికిని నాయకుని, సత్యోత్తమునిఁగా వర్ణించెను. చందలదేవిని నాయికఁగా, వేఱురాణులు పలువు రున్నను, స్వయంవరాదిక కల్పనలచేతఁ, బ్రధానీకరించెను.

మహాకావ్యలక్షణముల నన్నిటిని బిల్హణుఁడు వదలక పొందుపఱచెను. అష్టాదశవర్ణనలలో దేనినిగాని వదల లేదు. నవరసములు, ద్వాత్రింశదలంకారములు, కాళిదాసాదులను స్మృతికిఁ దెచ్చుశైలీవిధము, శయ్యాసౌభాగ్యము మున్నగువానిచేతఁ బఠితలహృదయముల నలరించెను.

## ఆంధ్రానువాదము

శ్రీకప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారు, కీ॥ శే॥ శ్రీమాదిరాజు విశ్వనాథరావుగారును గలిసి ఈమహాకావ్యమును ఆంధ్రకావ్యముగా నొనర్చి ఆంధ్రులకు మహోపకార మొనర్చినారు. సంస్కృతాంధ్రములలో నిష్ణాతులు, కవితాశక్తి గలవారు. 'కావ్యాలంకరణజ్ఞ మేవ కవితాకన్యా వృణీతే స్వయమ్' అని బిల్హణపంచాశికలోని పద్యములోవలెఁ గవితాకన్య వీరిని స్వయముగానే వరించిన ట్లున్నది. సంస్కృతమం దెట్లు కవన మల్లఁ గలరో ఆంధ్రమందు నంతకు మించి అల్లఁ గల రని ఈకావ్యానువాదమే ఋజువు సేయు చున్నది. ఖండకావ్యములును, గేయములును, జానపదానుకరణములును, ప్రాసవాక్యములును వ్రాసికొని ఆమాత్రమునకే పరమానందభరితు లగునేఁటికవులకాలమునఁ, బొత్తిగాఁ బ్రాచీనమహాకవులధోరణిలో వీరు ఈకావ్యమును ఒకమహాసాధనగా వ్రాయుటయు, బిల్హణమహాకవియొక్క సంస్కృతకావ్యమునందలిగుణములను దేనినిగాని తెనుఁగున వదలక యాంధ్రీకరించుటయుఁ బ్రశంసనీయములు. ఇతరానువాదములలోఁ గాన నగుమూల విరుద్ధార్థములు వీరికడఁ గాన రావు. ఏపద్యముఁ జూచినను చక్కఁగా, మనకు దొఱకుమూలములకు సరియైనయనువాదములేకాక వివరణములుగాఁ గూడ నున్నవి. రుచిని వర్ణించుటకన్న రుచిఁ జూచి యెఱుఁగుట మేలు. వీరిలో శ్రీనాథుని'వార్తాప్రసిద్ధి'తోఁ బోతరాజు నుడికారము, దిక్కన'రసాభ్యుచితబంగి'యు మేళవించి రచన చదువను జదువను హృద్యముగా నున్నది చదువరులే యెఱుంగఁ గలరు. మచ్చునకుఁ గొన్ని యనూదితపద్యములు చూడుఁడు:—

భోజునిఁగూర్చి :—

"భోజక్ష్మాభృత్ స ఖలు న ఖలైః తస్య సామ్యం నరేంద్రైః
తత్ప్రత్యక్షం కిమితి భవతా నాఽగతం, హా! హతాఽస్మి ।
యస్య ద్వారోడ్డమరశిఖర క్రోడపారావతానాం
నాదవ్యాజాత్ ఇతి సకరుణం వ్యాజహారేవ ధారా॥"

దీనికి ఆంధ్రబిల్హణులయనువాదము :—

ఉ. 'కారు సమంబు భోజునకుఁ గానరపాలురు; నీవు నుంటి వే
లా, రహి రాక యీనృపలలామునికొల్వున; కేను దుర్విధి
ప్రేరిత' నంచు ద్వార్డమరకృచ్ఛిఖరోడ్డయనప్రవర్తితో
దారకపోతరావమిష యై తగె దీనత 'ధార' వల్కె నా॥

ఇందుఁ 'గానపాలు' రనఁగా 'నీచనృపతు' లనియు, 'డమరకృత్' అనఁగా 'నుపద్రవము చేయు' అనియు, 'ధార' యనఁగా 'భోజునిరాజధాని' యనియు నధోజ్ఞాపికలోఁ బఠితలసౌకర్యార్థము వివరించినారు. మూలమందలి 'సకరుణం' అన్న పదభావము 'దీనత' యనుటలో బాగుగాఁ గుదిరినది.

మూలముతోఁ బోల్చి పఠించువారికి ననువాదకులసంస్కృతభాషాపరిజ్ఞానము, ఆంధ్రకవితాపాటవమును చక్కఁగా విశదము లగును. శ్రీనాథ – పోతరాజాఽదులవలె మూలమునందలి ఒక్కొక శ్లోకమునకుఁ బద్యమును నొక్కొక నైదాఱు శ్లోకములను గ్రహించి వానిభావమును, మూలకారునిపదప్రయోగౌచితినిఁ బోనీయక వాని కింకను మెఱుఁగుగాఁ బ్రత్యేకకావ్యమో యన నాంధ్రభాషామర్యాదకులోనై యాంధ్రీకరణము నడచినందుల కొక యుదాహరణము. అష్టమసర్గములోఁ జంద్రలేఖాలావణ్యాఽదికమును విక్రమాంకుఁడు విన్నభాగము :—



"సమయే తత్ర పుష్పాస్త్రమిత్రే విక్రమభూపతేః ।
ఉద్ఘాటనూతనాఽశ్చర్యా శ్రోత్రమైత్రీమగాత్కథా ॥ (1)

యథాఽస్తి విజయస్తంభప్రశస్తిరివ మాన్మథీ ।
కరహాటపతేః పుత్రీ త్రిజగన్నేత్రకార్మణమ్ ॥ (2)

విద్యాధరకుమారీ సా గౌరీదయితశాసనాత్ ।
కృతే కస్యాపి కురుతే స్వయంవరమహోత్సవమ్ ॥ (3)

చన్ద్రలేఖేతి నామ్నాఽస్యాశ్చన్ద్రలేఖాసమత్విషః ।
మృత్యుఞ్జయమహామన్త్రమైత్రీమేతి మనోభువః ॥ (4)

అన్తరఙ్గమనఙ్గస్య శృఙ్గారకులదైవతమ్ ।
అఙ్గీకరోతి తన్వఙ్గీ సా విలాసమయం వయః ॥ (5)

తస్యాః పాదనఖశ్రేణిః శోభతే లటభభ్రువః ।
రత్నావలీవ లావణ్యరత్నాకరసముద్గతా ॥ (6)

స్తనభారోఽత్ర వక్త్రేన్దుచన్ద్రికావరణం మమ ।
ఇతి తత్పాదయోర్లగ్నా వేద్మి ప్రాఙ్గణపద్మినీ ॥ (7)

అమూల్యస్య మమ స్వర్ణతులాకోటిద్వయం కియత్ ।
ఇతి కోపాదివాఽతామ్రం పాదయుగ్మం మృగీదృశః ॥ (8)

వీనికి నాంధ్రబిల్హణులయాంధ్రీకరణము, చతుర్థాశ్వాసము :—

"ఈలలి నలినవిశిఖసఖు
కాలం బారంగ మిగులఁ గర్ణోత్సవ మై
చాలఁగ నబ్బుర మొదవెడు
జోలిన్ విక్రమనృపాలసోముఁడు వినియెన్. (2)

ఉ. కంజసపత్నలేఖ కెన కాఁ దగునంగవిభాతి, మారమృ
త్యుంజయమంత్ర మై, మనసిజోర్ధ్వృతజైత్రపతాక నా జగ
త్పుంజదృగాళికార్మణతఁబొల్పుఁ గనన్ గరహాటభూమిభృ
త్కుంజరుకూర్మిపుత్రి సొబఁగున్ గనుఁ బేరునఁ 'చంద్రలేఖ'నాన్. (3)

క. వరవర్ణిని యగువిద్యా
ధరకన్యక కామె కిందుధరునాన స్వయం
వరమహము జరుపఁ బడు నొ
క్కరునింగూఁడి యెఱుంగఁ గా దెవ్వ రనన్. (4)

క. అంగన దాలిచి మించున్
శృంగారముదైవతంబు చేతోభవహృ
ద్రంగము విభ్రమములకు న
భంగప్రాంగణము నైనవయఉదయంబున్. (5)

సీ. లావణ్యరత్నాఽకరాఽవిర్భవన్మణి
శ్రేణిగాఁ బన్నఖశ్రేణి యలరు,
నసి గలతమముందుఁ బసిఁడియందెలఁ గిన్క
గనియె నా నెఱు పగుకాల్లు దనరు;



వదనేందుచంద్రికాఽఽవరణము లై పాద
సంగతాబ్జినిఁ గాచుస్తనము లమరు;
మరుకేలుదోయిదంటముఁ దెల్పుపల్క నా
నెలతాజిగిని మించుమొల రహించు;

గీ. హస్తసర్వస్వహరణ నిభాఽశి కంటఁ
జననిమాతంగతను గూర్చునక్షులు దగుఁ;
గలికి కల లేతఁదనము వే తొలఁగి లలిగఁ
గ్రొత్తజిగిజవ్వనము గూడికొని రహింప. (6)

ఈ సీసము 5, 6, 7, 8 శ్లోకముల కాంధ్రీకరణము. ఇత్యాదు లెన్ని యేనియుఁ జూప నగును. అనువాదకులసమాసఘటనయు, శైలీసారళ్యమును బూర్వకవిరచనాఽనుగుణ్యము లై యలరారు చున్నవి.

పంచమాఽశ్వాసమున రాజు కల్యాణపురప్రవేశముసందర్భమున 83 వ పద్యమునుండి 138 వ పద్యమువఱకు నచ్చతెనుఁగున రచియింపఁ బడినదికూడ సహజధారవలె మనోహరముగా నున్నది. ఇందలి 85 సంఖ్య గలవచనము ముక్తపదగ్రస్తము. ఇట్టిదే 44 వ సంఖ్య గల సంస్కృతసమాసప్రాచుర్య మైన ముక్తపదగ్రస్తవచనముగూడ మనోహరముగ నున్నది.

వీరిషష్ఠాఽశ్వాసమందలియుద్ధవర్ణనాఽదికసీసపద్యములు ప్రబంధకవుల శైలిని జ్ఞప్తికిఁ దెచ్చు చున్నవి.

ఉదా :- 71 'జయరమాపరిరంభ శంసిభుజంబున,'
73 'స్వోపరిస్థిత నృపప్రాపిత శ్రీదృశాయుతి'
75 'రదనాంశుకౌముది, మదజశైవలశృంగ'

ఇత్యాదులు చాలఁ గలవు. యుద్ధవర్ణనమందుఁ దదుచితసమాసఘటనకు ఉదా :-

మ. 'రథసాఽయోధనసక్తమత్తకరిసంరంభోర్మికాస్ఫారమున్
నథలఽభోగతరంగచంక్రమణరంగద్వాహసాహస్రమున్
స్వభుజాఽటోపసముత్సుకోద్భటబహుస్ఫాయద్భటోత్సేధ మ
వ్విభుయుద్ధోద్ధతసైన్య మొప్పె క్షుభితాబ్ధిం బోలి దుర్దాంత మై.' (6-69)

ఇది ప్రబంధమార్గానుగుణ్యమే. శరదృతువర్ణనమందలిపద్యములును మనోహరములు :-

శా. 'అంతన్ దోచెను యామినీరమణసద్యశ్శ్రీప్రసాదక్రియా
త్యంతప్రాభవశారదాగమము నీలాంభోదసంతానసం
క్రాంతశ్యామలిమక్షమావలయదుగ్ధక్షాళనప్రక్రమో
ద్దాంతస్వైరవిహారధీర మగుచున్ దర్పించి యింతింతగన్.'
(6-17)

పై పద్యములను జూచి చదువరులే యెఱుంగఁ గలరు. అనువాదకు లగు శ్రీకప్పగంతుల లక్ష్మణశాస్త్రి - శ్రీమాదిరాజు విశ్వనాథరాయ కవిసోదరుల కివే నా ధన్యవాదములు.

(శాస్త్రిమనుమఁడు)

24-11-1973
మదరాసు.

(వేదము వేంకటరాయశాస్త్రి)



"ఇద్దియె మేము; మేమె యిది; యిద్దియె మాదువిశిష్టకార్య మౌ;
నిద్దరియన్యకృత్యము ల వెల్లరతోడిసమానధర్మముల్;
పెద్దది యొక్కకార్యమును బేర్కొని చేసిన జన్మ సార్థ మౌ;
నిద్దియె సృష్టి కర్థ మగు; నీకృతి మాజను వొందె సార్థతన్.

అని యభిజ్ఞులు పేర్కొన్నదుర్లభము లగుమేలిసుణములన్నియు నిందు నెలవుకొన్నవి. కాళిదాసాదిమహాకవులకుఁ బ్రియతమ మగువైదర్భీమార్గమునఁ బ్రసాదసురభిళ మగునీబిల్హణమహాకవిరచనము విచ్చినవిరజాజులపొద.

అబ్ధిషు స్థలపథీకృతేషు నః
పూర్యతే జవవిధా కుతూహలమ్ ।
ఇత్యకుర్వత దిగన్తగోచరం
నూనమస్య తురగాః క్షమారజః ॥ 14-62

అనునిందలితురగవర్ణనపద్యభావమును :

ప్రయాతుమస్మాకమియం కియత్పదం
ధరా తదమ్భోధిరపి స్థలాయతామ్ ।
ఇతీవ వాహైర్నిజవేగదర్పితైః
పయోధిరోధక్షమముత్థితం రజః ॥ నైష. 1-69

అని చింతామణి మంత్రసిద్ధుఁడు శ్రీహర్ష మహాకవి ప్రతిధ్వనించుటయును,

నీలనీరదనిచోళకోజ్ఝితే
వ్యోమదర్పణతలే శరద్వధూః ।
చంద్రమాననమివ వ్యలోకయత్
తత్క్షణోన్మిషితకైరవేక్షణా ॥ 14-32

అను పద్యభావమునకు

వికచపద్మనిరీక్షణమాత్మనో
ముఖమవేక్షితుమాత్తకుతూహలా ।
నియతమభ్రనిచోళకగర్భతః
శరదకర్షదహర్పతిదర్పణమ్ ॥
మధురావిజయము 5-45



అని వైదర్భీమార్గము నుద్యోతించిన మధురకవయిత్రి గంగాదేవి కైవారము వలుకుటయును, ఆలంకారికశిరోమణి యప్పయదీక్షితులవారు :-

తత్పాదనఖరత్నానాం యదలక్తకమార్జనమ్ ।
ఇదం శ్రీఖండలేపేన పాండురీకరణం విధోః ॥

అనుశ్లోకమును జిత్రమీమాంసయందును,

''రథస్థితానాం పరివర్తనాయ
పురాతనానామివ వాహనానామ్'' విక్ర 1-1

ఇత్యాదిశ్లోకమును ఉత్ప్రేక్షాలంకారమునకును,

''సాహిత్యపాథోనిధిమన్థనోత్థమ్
కర్ణామృతం రక్షత హేకవీన్ద్రాః''
విక్ర. 1. 11, 12.

ఇత్యాదిశ్లోకద్వయమును ఆక్షేపాలంకారమునకును నిందుండి యుదాహరించుటయును బరిశీలించినచోఁ బెద్ద లీకావ్యమునెడ నెంతటియాదరాభిమానములను బ్రదర్శించిరో గమనింతుము

ఇంత గుణసంభృత మగునీమహాకావ్య మింతవఱకును నాంధ్రసహృదయుల యనుభవమున కందక దూరదూరముగనే యుండిపోయినది. దాదాపు అర్ధశతాబ్దికి ముందు సుగృహీతనామధేయు లగుశ్రీతిరుపతి - వేంకటేశ్వరకవులు దీనిని వచనకావ్యముగా నాంధ్రీకరించిరి. కాని వారు దానియెడల వలసినంతశ్రద్ధ వహింపమికారణముగా నది యుండియు నసత్ప్రాయమే యైనది. మఱి యిప్పుడు మన్మిత్రులును, మొన్నమొన్నటివఱకును నాంధ్రప్రదేశప్రభుత్వవిద్యాశాఖయందుఁ బ్రాచ్యభాషావిభాగమున "డిప్యూటీ డైరెక్టరు"గా నుండి ప్రకృతము విశ్రాంతి నందినవారును, బహుభాషానిష్ణాతులును నగుబ్రహ్మశ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి గారును, దన్మిత్రులు కీ॥ శే॥ శ్రీ మాదిరాజు విశ్వనాథరావుగారును గలిసి దీని నాంధ్రమున ననువదించి ప్రకటించి యాగొప్పకొఱఁతను దీర్చి యాంధ్రసాహితీరసజ్ఞులకు నాదరపాత్రు లైనారు.

# సమీక్ష

పదునొకండవశతాబ్దియందు బిల్హణమహాకవి యనల్పశిల్పసుందరముగా నంతరించి పశ్చిమచాళుక్యయశస్సౌధమున కీర్తినుమనోహరసువర్ణకలశము 'విక్రమాంకదేవచరిత్రము'. సంస్కృతమున విరళవిరళములుగా నున్నకతిపయ చారిత్రికకావ్యములలో నిది పేర్కొనఁ దగినది. లభ్యము లగువానిలోఁ బ్రాచీనము గూడ. హమ్మీరవిజయ, మధురావిజ, యాచ్యుతరాయాభ్యుదయాదు లింతకన్నను నాధునికములు. అందందు గ్రంథాంతరములఁ గన్నవియు, నానోట నానోట విన్నయు నగుకథాంశములను గుదిగూర్చుట కాక, కవి తాను స్వయముగా ననుభవించినట్టిదియుఁ బ్రత్యక్షముగాఁ జూచినట్టిదియు నగుచరిత్రమును సర్గబంధముగాఁ దీర్చినచో దాని వైశిష్ట్యము ద్విగుణీకృత మగును. అట్లయ్యును సంస్కృత చారిత్రికకావ్యములలో వానిచారిత్రికతకన్న కావ్యత్వమే విస్పష్టముగా భాసించును. రసబంధాభినివిష్టు లగుకవులు అంతశ్చైతన్యమున కిచ్చినంతగా బాహ్యశరీరమునకుఁ బ్రాధాన్యము నీయ లేదు. ఇతివృత్తమును గావ్యశరీరముగా భరతుఁడు నిర్దేశించినను మహాకవులు దానిని దమకవితాశిల్పచిత్రణమునకు ఫలకప్రాయముగ మాత్రమే గ్రహించిరి. ఇతివృత్తము ఇతిహాసమువలననే సిద్ధించు ననియు, నందువలనఁ గవి తన్నిర్వహణపరుఁడు గాక రసైకదర్శనుఁడు కావలె ననియు ఆనందవర్ధనులు వక్కాణించినారు. ఆసహృదయసాహితీవిమర్శకులయాదేశము తరువాతివారికి శిరోధార్య మైనది. అందువలనఁ 'చరిత్ర' మనుపేరుతో నున్నను నీకావ్యమునఁ జారిత్రికాంశములు పెల్లుగా లభింపవు మఱి కావ్యశిల్పమునకే సామ్రాజ్యము.

సంస్కృతమునఁ బంచకావ్యములతరముతరువాత వెలసినకావ్యములలో 'విక్రమాంకదేవచరిత్రము' కవితాశిల్పమునఁ బ్రథమగణ్య మై యున్నది.

"నవోఽర్థో, జాతిరగ్రామ్యా, శ్లేషోఽక్లిష్టః, స్ఫుటో రసః,
వికటాక్షరబన్ధశ్చ కృత్స్నమేకత్ర దుర్లభమ్"

అనువాదము నొకకళగా దిద్ది తీర్చినఖ్యాతి యాంధ్రసాహిత్యమునకు మాత్రమే దక్కినది. "అనువాదమును నొకకళయా?" యనువారును లేకపోలేదు. ఒకవ్యక్తి నెదుట నుంచుకొని తత్ప్రతిబింబమును జిత్రించుటను గళ కాదందుమా? ఊహాకల్పిత మగుస్వేచ్ఛాచిత్రమును జిత్రించుటకన్న నిది దుష్కరమును, ప్రతిభావంతమును నగు ననుట సహృదయైకవేద్యము. ఉత్తమరూపచిత్రణమును జూచినపుడు అందు వస్తుసౌందర్యమునేకాక చిత్రకారునిశిల్పనైపుణ్యమునుగూడఁ బ్రశంసింపమా ? ఇందు మఱియొకవిశేషమున్ను గలదు. ఊహాచిత్రమున నేవేని లోపము లున్నచో నవి విశిష్టభావుకులకుమాత్రమే యెఱుకపడును కాని ప్రత్యక్షవస్తుచిత్రణమునందలివి – బింబప్రతిబింబములు రెండును నెదుట నుండుటచే– సామాన్యునకు సయితము తెలియవచ్చును. అనువాదమువిషయమునను నింతే. మూలగ్రంథమున కాభాషలో నెట్టిస్థానము గలదో, యట్టిస్థానమును భాషాంతరమున ననువాదమునకును నెలకొల్పుట సామాన్యము కాదు. కావుననే అందుఁ గృతార్థులైననన్నయాదులను, శ్రీనాథాదులను నాంధ్రలోకము మహాకవులనుగా సంభావించినది.

నన్నయపురాణానువాదమునకు మార్గదర్శకుఁడు కాఁగా, శ్రీనాథుఁడు కావ్యానువాదమునకు దేశికుఁ డైనాఁడు. అతఁ డామార్గమున మఱుఁగుమెఱుఁగులను గనిపట్టి వెలయించి. "యాంధ్రభాషానైషధాబ్జభవుఁ," డైనాఁడు. అతని సూత్రములు తరువాతివారికి నిర్దేశకము లైనవి. ఆధునికులలో ననువాదము మూలమునకు మఱింత సన్నిహితము కావలె ననుదృష్టి గోచరించును. అది మంచిదే కాని దానివలన ననువాదము స్వతంత్రతారేఖను, గళాప్రతిపత్తినిఁ గోలుపోయి మూలమున కొకకృత్రిమవ్యాఖ్యగా మాఱిపోవుప్రమాద మున్నది. దానిని దప్పించుకొని కృతార్థు లగువా రెందఱో ! ఇంతకును నిది కత్తిపై సాము.

'ఆంధ్రబిల్హణ'ఖ్యాతి నందిన యీకవిద్వయ మొనరించినప్రకృతకావ్యానువాదముగూడఁ బ్రాచీనమహాకవులు చూపినమార్గముననే సాగినది. ప్రాయికముగా నిది మూలమునకు నన్యూనానతిరిక్తమై పరమవిధేయముగ సాఁగిన దన వచ్చును, మచ్చున కొకటిరెం డుదాహరణములు చూపుదును :—



"క్షపాకరః కాతరరశ్మిమణ్డలః
పురన్ధ్రిగణ్డస్థలకాన్తిసమ్పదా ।
వికీర్ణసమ్మార్జనభస్మరేణునా
బిభర్తి యస్మిన్ ముకురేణ తుల్యతామ్"

మూలము (2-3)

కం॥ భీతైణాక్షీగండ
ప్రాతరుచిన్ గాతరాంశుపరికలితుం డై
శీతాంశుఁడు సమ్మార్జన
ధూతరజఃకీర్ణముకురతుల్యతఁ గనియెన్.

అనువాదము (2-4)

ఇందు మూలభావము చెక్కుచెదరకుండ నశిథిలబంధమున స్వతంత్రరచనమువలె భాసించుట కానవచ్చును. ఇట్టిదే మఱియొకటి:—

గాయన్తిస్మ గృహీతగౌడవిజయస్తమ్బేరమస్యాహవే
తస్యోన్మూలితకామరూపనృపతిప్రాజ్యప్రతాపశ్రియః ।
భానుస్యన్దనచక్రఘోషముషితప్రత్యూషనిద్రారసాః
పూర్వాద్రేః కటకేషు సిద్ధవనితాః ప్రాలేయశుద్ధం యశః॥

(మూలము 3-74)

మ. కలనన్ 'గౌడ'గజంబులన్ గొనుచు వీఁకన్ 'గామరూ'పాధిపా
మలతేజోవిభవంబులన్ దులుచునాక్ష్మాపాలుప్రాలేయని
ర్మలకీర్తిన్ గడుఁ బాడు చుండిరి సహర్షస్వాంతలై ప్రాగ్గిరిన్
నలినీమిత్రరథారవాహృతనిశాంతస్వాపసిద్ధాంగనల్.

(అనువాదము 2-139)

ఇందు భావముతోఁబాటు బంధచ్ఛాయయును నందగించుట స్పష్టము :-

ఇందలిపద్యములయెత్తుగడలు కొన్ని శ్రీనాథాదులరచనములను దలఁపించుచున్నవి. చంద్రలేఖాస్వయంవరఘట్టమునందలియీపద్యమును దిలకింపుఁడు :

సంగరనిస్పృహప్రతిరసావరవాసములన్ బరాక్రమో
త్తుంగభుజుండు గాంచునిజతూర్యవిలాసచపేటభిన్నమా
తంగనివాసముల్ హరివిధంబున; గోపగిరిప్రభుండు వీఁ
డంగన! యీతఁ డీపుడమి స్వచ్ఛయశస్వియు నేకవీరుఁడున్.
4-150

విక్రమాంకునిచోళనగరప్రస్థానమును వర్ణించుసందర్భములోనిమఱియొక పద్యమును జూడుఁడు :

కకుబిభకర్ణనిర్దళనకారిభయానకదుందుభిధ్వని
ప్రకటన నభ్ర మభ్రమువరధ్వనినిర్భర మైనటుల్ తగెన్
సకలదిగంతభిత్తులను సామజఘట్టన సస్వనంబుగాఁ
బెకలినటుల్ స్ఫురించె శ్రుతిభీకరభేరిరవప్రతిధ్వనిన్. 3-50

దుందుభులు మ్రోఁగినట్లే యున్న దీరచనము. మూలమునందలి పదబంధవైచిత్ర్యము శ్రీనాథునియడుగుజాడల సురక్షితమై గావింపఁ బడినది.

కందపద్యములు వీరిరచనమున వింతవింతయొయ్యారములను సంతరించుకొని "రసవన్మాకందము" అనుసూక్తిని సార్థకపఱచుకొన్నవి. వసంతవర్ణనమునుండి యొకదాని నుదాహరింతును :

దోలావిలాసరత లగు
బాలలవదనాబ్జములను బరిచుంబించెన్
మేలిదుకూలము లాగెన్
ప్రాలెన్ గటిపైఁ బటీరవాయువు గరిమన్.

రెండుసమాపకక్రియలను ద్వితీయ - తృతీయపాదములతుదల నిలిపి మూఁడవక్రియను జతుర్థపాదాదిని నవ్యవహితముగా నిబంధించుట భావవిశేషద్యోతక మై



పద్యగతికి నొకయొయ్యారమును జేకూర్చినది. ఇట్టివిశేషము లీరచనమునఁ గోకొల్లలు.

ఓజః-ప్రసాదములసమాహార మగురమణీయోదాహరణ మిది మఱియొకటి:-

"యస్య భ్రామ్యద్భ్రమరపటలీశ్యామకేలిద్రుమాణా
మారామాణామవిరలతయా కోఽప్యసౌ సన్నివేశః ।
యస్మిన్ రామాః కుసుమధనుషం దృగ్భిరున్మార్గభర్గ
క్రోధజ్వాలాకిసలయచయే సుప్తముత్థాపయన్తి"
(మూలము 18-13)

"అనగరిన్ భ్రమన్మధుకరాసితకేళిమహీరుహోల్లసత్
కాననదంతురత్వమును గాంచి వచింపఁగ నేల? శూలి కో
పానలవిస్ఫులింగకిసలావళిసుప్తలతాంతసాయకో
త్థానము సల్పు నందుఁ బ్రమదాజన మాత్మకటాక్షవీక్షణన్."
(అనువాదము (7-14)

ఇ ట్లెన్నియేనియు నుదాహరింపవచ్చును.

ఇంతేకాదు; ఒకవంక ఇట్లు క్లిష్టతమ మగుననువాదకార్యమును నిర్వహించుచునే, మఱియొకవంక పంచమాశ్వాసమున, మధుపానగోష్ఠీవర్ణనవచనమున సుమధురజటిలసమాసభూయిష్ఠ మగు ముక్తపదగ్రస్తమును; నందే 'కల్యాణ' పురప్రవేశవర్ణనమున నచ్చతెనుఁగుకూర్పును; నంతలో నాఁగక పౌరాంగనామన్మథచేష్టావర్ణనవచనమున నచ్ఛాంధ్రముక్తపదగ్రస్తమునుగూడ నిర్వహించుట వీరియప్రతిమానప్రతిభావ్యుత్పత్తులకుఁ దార్కాణము. అబాలసులభము లగునిట్టి గరిడీసాములు సాధారణపాఠకుల కొకింత యుద్వేజకములయినను, ప్రగల్భమతులకుఁ బరమాస్వాద్యములు కాకపోవు.

ఈయనువాదమునఁ బ్రాయికముగాఁ బ్రౌఢశైలియే యాదృత మైనది. మూలకారునివైదర్భీరీతి నాదరింపకపోవుటకు వీరిపాండిత్యాభిమానము, నిరంతరప్రౌఢప్రబంధపరిశీలనాభ్యాసమున్ను గారణములు కావచ్చును. అభిరుచిభేదమునుబట్టియు, నధికారితారతమ్యమునుబట్టియు నీమార్గము సాహితీలోకమునఁ బరమాదృత మైనదనుటకు సందేహము లేదు

ఈసందర్భమున నొకవిషయము సహృదములకు నివేదింప వలసి యున్నది. క్రీ. శ. 1875 సం॥లో జర్మన్‌దేశీయుఁ డగు 'డాక్టర్ జార్జి బుహ్లర్' పండితుఁడు ప్రప్రథమముగాఁ బ్రకటించినమూలగ్రంథముప్రతి యాధారముగా నీయనువాదము సాగినది. ఆమూలగ్రంథము, ఆపిమ్మటఁ గ్రమాభివృద్ధి నందినపరిశీలనములతో ముమ్మాఱు ప్రకటిత మైనది. తుదిముద్రణము 'వారాణసీ' హిందూవిశ్వవిద్యాలయమునందలి 'సంస్కృతసాహిత్యపరిశోధకమండలి' వారియాజమాన్యమున సంస్కృతవ్యాఖ్యతోను, హిందీయనువాదముతోను క్రీ శ. 1958 సం॥ లోఁ బ్రకటిత మైనది. ఈయాంధ్రానువాదము ముగిసినతరువాత మూలగ్రంథము ముమ్మాఱు ముద్రిత మైనది. వ్యాఖ్యానముగూడ లేనిమూలగ్రంథసాహాయ్యముతో నీకవిద్వయ మింతశ్లాఘ్యముగా నాంధ్రీకరించుట వారిప్రతిభావ్యుత్పత్తులకు గీటురాయి యన వచ్చును.

ఈయనువాదము సంపూర్ణ మై చాల కాలము గడచినది. అనువాదకర్తలలో నొక రగుశ్రీవిశ్వనాథరావుగారు కీర్తిశేషులును నైనారు. ఇంతకాలమునకుఁ దరువాతనేనియు నీగ్రంథమును బహుళము లగువ్యయప్రయాసల కోర్చి సర్వాంగసుందరముగా ముద్రితప్రకటితము గావించి యాంధ్రసహృదయలోకమున కందించిన బ్రహ్మశ్రీ లక్ష్మణశాస్త్రిగారిని హృదయపూర్వకముగా నభినందించుచున్నాఁడను.

ఆంధ్రభాష విక్రమాంకదేవచరిత
మవతరించుటయె ముదాఽవహంబు;
కడుసమర్థులైనకవులచేఁ బడుట నె
త్తావి కుందనమునఁ దావు గొనుట ॥



రసమహోదధి బిల్హణురచన; దాని
తలము స్పృశియించి, జాతిరత్నముల నెత్తి,
మెఱుఁగు లిడి తెల్గువాణికి మేలితొడవు
సంతరించుట వైదుష్యసారఫలము ॥

ఇంతటికావ్యముఁ బ్రతిభా
వంతముగాఁ దీర్చి తెనుఁగువాణి కొసఁగున
త్యంతకృతి సుకవిమిత్రు వ
లంతి న్నిను నభినుతింతు లక్ష్మణశాస్త్రీ !

పూర్వచాళుక్యశాఖ కద్భుతయశంబు
నలవరించెను నాఁడు నన్నయమనీషి;
నేఁడు పశ్చిమచాళుక్యనిబిడకీర్తి
మీకతనఁ దెల్గువీటియ మేళవించె ॥

హాయి ! "సురేంద్రమౌళులు !" బు
ధాఽదృత'విక్రమ'కావ్యమున్ సుధా
పేయముఁ దెల్గు సేసి మురి
పించితి రాంధ్రుల నాంధ్రబిల్హణాఽ
ఖ్యాఽఽయతి; మీయనుంగుప్రమ
దాశ్రువులన్ దివిఁ గల్పసూనముల్
పోయఁగఁ గప్పురంబు నెగఁ
బోయుఁడు రోదసి సౌరభింపఁగన్ ॥

బ్రహ్మశ్రీలక్ష్మణశాస్త్రిగా రింకను సముదాత్తతమము లగునుద్గ్రంథములను పెక్కింటిని రచించి యాంధ్రశారద నారాధింతురుగాక ! అందులకు వలయునాయురారోగ్యాఽదికములను బరమేశ్వరుఁడు వారికిఁ బ్రసాదించుఁగాక !

కం॥ "అసమానోల్లేఖరచనఁ
బనఁ గనుకృతికనక మిద్ది; పండితచేతో
వినరకషపరీక్షిత మై
ఘనఁగుంగాత జనకంఠభూషణ మగుచున్."
ఆంధ్రవిక్రమాంకదేవచరిత్రము (1-124)

ఇట్లు
సుధీవిధేయుఁడు

[illegible]

సంస్కృతాంధ్రాచార్యుఁడు,
శ్రీమలయాళస్వామి ప్రాచ్య కళాశాల.

ప్రొద్దుటూరు
ప్రమాది మాఘ బహుళ పంచమి.
11-2-1974

—o—

కళాప్రపూర్ణ ఆచార్య
శ్రీనిడుదవోలు వెంకటరావుగారు- ఎం. ఏ.

# విక్రమాంకదేవచరిత్ర - ఆంధ్రానువాదము

## I

### బిల్హణునిచరిత్ర

తెలుగుభాషలో ననూదిత మై నేఁడు తెలిసినయీవిక్రమాంకదేవచరిత్రకు మూలము సంస్కృతమునఁ గలవిక్రమాంకదేవచరిత్ర. సంస్కృతవాఙ్మయమున గణన కెక్కినకవులలో నొకఁ డైనబిల్హణమహాకవి దీనిని రచియించెను. ఉత్తర భారతమునఁ గాశ్మీరదేశవాసి యైనబిల్హణకవి దక్షిణదేశమున నేఁడు కర్నాటక రాష్ట్రమున నున్న 'కల్యాణి' (కల్యాణకటకము) రాజధానిగా క్రీ. శ. 1030 ప్రాంతమునఁ బశ్చిమప్రాంతము నేలినవిక్రమాదిత్యనృపాలుని పేర నాతనిచరిత్ర నీకావ్యమున వర్ణించెను. విక్రమాదిత్యుఁడు పశ్చిమచాళుక్యరా జగుటచేతను పశ్చిమచాళుక్యరాజులచరిత్ర కిది యత్యంతోపయుక్త మైన దగుటచేతను జరిత్ర కారులు దీనిని బ్రామాణికముగ గ్రహించి యున్నారు.

### బిల్హణుఁడు - తెలుఁగు సాహిత్యము

బిల్హణునికృతి విక్రమాంకదేవచరిత్ర తెలుఁగువారి కెంతపరిచితము గాదో, కృతికర్త బిల్హణుఁడు తెలుఁగువారి కంతపరిచితుఁడు. సంస్కృతమునఁ, గాళిదాసాదిమహాకవులు తెలుఁగునఁ గవిపండితలోకమునమాత్రమే ప్రసిద్ధులు. కాని, బిల్హణుఁ డట్లు గాదు - అతఁ డాంధ్రప్రజానీకము నాకర్షించినకవి - కాళిదాసాది మహాకవులకథలు కట్టుకథలుమాత్రమే తెలుఁగున వ్యాప్తిలో నున్నవి. కాని కావ్య సాహిత్యస్థాయి కెక్క లేదు - "బిల్హణీయము" అనుపేర బిల్హణకవికథ తెలుఁగునఁ బ్రబంధనాటకప్రక్రియలమూలమున వాఙ్మయచరిత్రలో స్థానము గడించుకొన్నది. ఇది తెలుఁగుసాహిత్యచరిత్రకుఁ గ్రొత్తవిషయ మగుటచే దీని వివరణ మావశ్యకము.

### బిల్హణునిచరిత్ర - సంస్కృతము

తెలుఁగుసాహిత్యమున బిల్హణునిఁగూర్చి తెలిసికొనుటకు ముందు సంస్కృతమున బిల్హణకవిచరిత్ర నెఱుంగుటయు నావశ్యకమే - సంస్కృత వాఙ్మయచరిత్రలన్నింటియందును నాతనిఁగూర్చి యున్నది. కాని తెలుఁగుదేశమున

నాతనికిఁ గలసంబంధముఁగూర్చి యవి చెప్పవు. మొదట సంస్కృతమున బిల్హణుఁడు, తనవిక్రమాంకదేవచరిత్రమునఁ జివరిసర్గలో స్వకీయ వృత్తాంతము తెలిపినాడు

[1]బిల్హణుఁడు కాశ్మీరదేశీయుఁడు-అందు 'ప్రవరపుర'మునకుఁ జేరువగా నున్న 'కోనముఖ'గ్రామవాసి – అతఁడు మహాకవి యై, విద్వాంసుఁ డై, అనేక

---

1. సంస్కృతమునఁ గాశ్మీరదేశీయు లగుకవిపండితు లిట్టినామధేయములు గలవారు గలరు - వారు తెలుఁగు వారికిఁ బరిచితులే అయినను ఆనామముల వ్యుత్పత్తు లంతగాఁ దెలియవుగాన నిట వివరించు చున్నాను - భాషావేదులు వీనిని బరిశీలించెదరుగాక :–

1. మల్హణుఁడు - మల+హణ=మలము నడఁచు వాఁడు, పోఁగొట్టువాఁడు. తెలుఁగు మల్లన – మల్లిదేవుఁడు

2. కల్హణుఁడు - కల+హణ – మదము నడఁచు వాఁడు : పోఁగొట్టువాఁడు. కల్లన – కల్లిదేవుఁడు.

కల యనఁగా మదము.

"కలో మదః తద్యోగాద్వా కలః 'కలమదే'
కల మనఁగా మదము. అది గలిగినది -"
(అమరకోశము)

3. బిల్హణుఁడు - బిల+హణ=భేదము నడఁచువాఁడు బిల్లన – వ్యవహారమున బల్లన. బల్లిదేవుఁడు.

బిల యనఁగా భేదము.

"బిల్యతే భిద్యత ఇతి బిలం
'బిల - భేదనే' - భేదింపఁ బడునది" (అమరకోశము)

4. జల్హణుడు జల+హణ – జడత్వము - నడఁచువాఁడు. జల్లన - జల్లిదేవయ్య - బాలయ్య

"జలం నీరే జడే త్రిషు. ఇది ఉదకమునకుఁ
నానార్థరత్నమాల బే రగునవుడు ; జడునకుఁ
ద్వ్యక్షరకాండ. బే రగునవుడు

పైవానిలో - మల్లనపేరు - శ్రీశైలమల్లన్న - తెలుగున విశేషవ్యాప్తిలో నున్నది – తక్కినవి కన్నడదేశమున వ్యాప్తిలో నున్నట్లు పాల్కురికిసోమనాథుని బసవపురాణ - పండితారాధ్యచరిత్రలవలనఁ దెలియు చున్నది.



రాజాఽస్థానములందుఁ దనవిద్యావైదుష్యము ప్రదర్శించి, దక్షిణమునకుఁ దరలి – విక్రమాదిత్యునియాస్థానమున స్థిరపడెను. కాని, తాను స్వదేశ మగుకాశ్మీరమునకుఁ దిరిగి పోలేనందులకు నెంతో చింతించి, వారాణసీక్షేత్రమునకు వెడలెను.

## కృతులు

అతఁడు విక్రమాంకదేవచరితమేకాక – కర్ణసుందరి అనునాటకను, 'చౌరపంచాశత్తు', లేక 'సురతపంచాశత్తు' అనుముక్తకగ్రంథమును – 'బిల్హణస్తవ' మనుశివస్తవమును రచించెను – వీనిలోఁ జౌరపంచాశత్తు చోరకవిపేరిటఁ బ్రత్యేకముగా వ్యాప్తి చెందినది-చోరుఁ డనునది బిల్హణునకు నామాంతరము.

కర్ణసుందరీనాటిక తెనుఁగున ననూదిత మైనది[1]. 'బిల్హణస్తుతి' సంస్కృత వాఙ్మయచరిత్రకారులకుఁ బరిచితము కాదు. తెలుఁగుదేశమున వ్యాప్తి గలది.

### బిల్హణకవిశివస్తుతి – తెలుఁగుదేశము

'బిల్హణస్తుతి' – ముప్పదియారుశ్లోకములు గలశివస్తుతి – ఇందుఁ జక్కనికవితయేకాక చమత్కారజనకము లగుభావములు నున్నవి – బిల్హణుఁడు శివభక్తుఁ డని అతనివిక్రమాంకదేవచరిత్రనుబట్టి మనము తెలిసికొన వచ్చును. అతఁడు శివభక్త్యతిశయముచే రచించినయీ స్తవమును దెలుఁగుదేశమున శైవులు మహిమ్నస్తవాఽది స్తవములలోనహా పఠించు చుండెడువారు – మహిమ్నస్తవాఽదు లైదు.

1. మహిమ్నము – పుష్పదంతరచితము.
2. మల్హణము – మల్హణకవిరచితము
3. మలయరాజీయము – మలయరాజకవిరచితము.
4. అనామయము – దండికవిరచితము.
5. హలాయుధము – హలాయుధరచితము.

---

1. ప్రస్తుతవిక్రమాంకదేవచరిత్ర ననువదించినవారే దీనిని ననువదించిరి.

కాని శ్రీనాథమహాకవికాలమున - క్రీ శ. 1426 ప్రాంతమునఁ - బైపంచస్తవములలో - మలయరాజీయమునకు బదులు - బిల్హణస్తవమును శైవులు పఠించుచుండెడివా రని ఆతనిరచనములనుండి తెలియు చున్నది - పైస్తుతిరచయితలలో - మల్హణ - బిల్హణు ల నిద్దరిని ఇతరసంస్కృతకవులతోఁ బాటు శ్రీనాథుఁడు, పేర్కొని వారికి నంజలించినాఁడు.

గీ॥ బాన-శివభద్ర-సౌమిల్ల-భల్లులకును
మాఘ-భారవి-బిల్హణ-మల్హణులకు
భట్టి-చిత్తపకవి-దండిపండితులకుఁ
గీలుకోలుపుడు నొసలిపైఁ గేలుదోయి-

భీమఖండము (1-7)

ఇట్లు కవిస్తుతిలోఁ బ్రశంసించుటయేకాక, శ్రీనాథకవిబిల్హణస్తవములోని యీక్రిందిశ్లోకమును, దనహరవిలాసమువ ని ట్లనువదించెను :-

బిల్హణస్తుతి - 3వ శ్లోకము

పంచబ్రహ్మషడంగబీజముఖరప్రాసాదపంచాక్షరీ
వ్యోమవ్యాపిపురస్సరేషు మనుషు ప్రౌఢిః కుతో మాదృశామ్ ?
ఓంకారాऽదినమోऽన్తముద్రితభవన్నామాऽవళీకల్పితమ్
సర్వం మంత్రతయా ప్రభో ! పరిణమత్యంతర్బహిర్వ్యోగతః.

శ్రీనాథుఁడు

పంచబ్రహ్మషడంగబీజసహితప్రాసాదపంచాక్షరీ
చంచన్మంత్రపరంపరాపరమనిష్ఠాతత్పరత్వంబునన్
మంచుంగొండయనుంగుపెండ్లికొడుకున్ మధ్యాహ్నకాలంబు సే
వించున్ నిర్జరరాజసూనుఁడు మనోవీథీసదాऽధ్యాసతన్[1] (7-33)

1. శ్రీనాథునిసంస్కృతకవిస్తుతులలో నెన్నియో విశేషము లున్నవి. మల్హణుఁడు, బిల్హణుఁడు మొద లగుకాశ్మీరకవులను దొలుతఁ దెలుఁగునఁ గవిస్తుతిలోఁ బ్రవేశపెట్టినవాఁ డతఁడే - శ్రీనాథునిసంస్కృతకవిస్తుతులనుగూర్చి ప్రత్యేకపరిశోధన చేయుట యావశ్యకము.



ఈబిల్హణస్తవము నాధునికయుగమున శ్రీవింజమూరు లచ్చీరాయకవిగారును (1860-1927), శ్రీచిదిరెమఠము వీరభద్రశర్మగారును (1890-1950) తెలుఁగున ననువదించిరి[1].

ఈశివస్తుతిలో బిల్హణుఁడు వివిధవృత్తములు వాడినాఁడు - శివుఁడు శార్దూలచర్మాంబరుఁ డగుటచేత - శార్దూలవృత్తములే హెచ్చుగా (23) వాడినాఁడు. ఆర్య, వసంతతిలకము మొదలైనవిగూడఁ గలవు.

బిల్హణుడు - శృంగారప్రియత్వము

ఈ స్తవమున, నీక్రిందిరెండుశ్లోకములు పైవిషయమును నిర్ధారింపఁ గలవు.

"ధత్సే మూర్ధ్ని సుధామయాంశుకలశ్లాఘ్యే కపాలస్రజమ్
వక్షస్యద్రిసుతాకుచాగురురజస్సాంద్రే చితాభస్మ చ[1] ।
తద్బాణాऽదికవిప్రణీతలలితస్తోత్రప్రబంధప్రియే
త్వత్కర్ణే లభతామయం మమ గిరాం గుంభోऽపి ॥
సంభావనామ్" 2 శ్లో

"అర్థానర్థనిరూపణవ్యసనితామాధ్యస్తుతివ్యగ్రతా
మేణాక్షీకుచలాలనప్రణయితామద్యాపి వర్తామహే ।
త్వద్ధ్యానవ్యవధానహేతుషు మనస్త్వచ్చాటుకావ్యేషు వాక్
త్వత్పూజావిధురేషు కర్మసు కరః శ్రీకంఠ ! నోత్కంఠతే"
35 శ్లో

1. వేదకావ్యస్మృతితీర్థ, శైవధర్మాऽచార్య - శైవవిద్యానిధి చిదిరెమఠము వీరభద్రశర్మగారు, వీరశైవాऽచార్యులలో విశిష్టులు. వీరు కాశిలోని 'విశ్వాऽరాధ్య జంగమవారి' మఠమున కధ్యక్షులుగా నుండెడివారు. వీరు ప్రకటించిన శివపంచస్తవి (భక్తరంజనీవ్యాఖ్యతోఁ గూడినది) ఆంధ్రశైవవాఙ్మయమున నుత్తమగ్రంథము. ఇందుశివపంచస్తవములు, ప్రతిపదటీకాతాత్పర్యములతోఁ టీకలతో వెలయుచు, సాహితీవేత్తల కత్యంతోపాదేయములుగా నున్నవి. ప్రకటన 1943.

## బిల్హణీయము - బిల్హణకథ[1]

తెలుఁగుసాహిత్యమున బిల్హణకథ వ్యాప్త మగుటకుఁ బై బిల్హణుని శృంగారప్రియత్వమే హేతువు ఈకథ బిల్హణీయ మనుప్రబంధమునుండి యిట్లు తెలియు చున్నది.

"పాంచాలదేశమున 'లక్ష్మీమందిరము' అనునగరమును 'మదనాభిరాముఁ' డనురాజు పాలించు చుండెను - అతనికి 'యామినీపూర్ణతిలక' అనుకూఁతు రుండెను - ఆమె యౌవనవతి' కాఁగానే - ఆమెయభిలాష ననుసరించి, రాజామెకు సాహిత్యవిద్య నేర్పుట కొకయాచార్యుని నియమింప మంత్రి కాజ్ఞాపించెను. మంత్రి విచారింపఁగా నక్కడిపండితులు :

"అనిన, 'మల్హణ - బిల్హణు' లనఁగఁ గవులు
సరసు లిరువు రలంకారసహితు లందు
బిల్హణుం డనువాఁడు గంభీరుఁ డధిక
తముఁడు కవిరా జనంగ స్తోత్రములు వడసె" (1-70)

అని వారలపేర్లు తెలిపిరి, రాజు బిల్హణునిఁ బిలిపించి, అతనిసౌందర్యమును జూచి యౌవనవతి, సౌందర్యవతి, యగుతనకుమార్తె కితఁడు చదు వెట్లు చెప్పునని సంకోచించెను అప్పుడు మంత్రి "మనరాజపుత్రి 'అంధునిఁ జూడ' నని వ్రతము పట్టినది - బిల్హణుఁడు 'కుష్ఠరోగినిఁ జూడ' నని వ్రతము పట్టి యున్నాఁడు - అందుచే - రాజపుత్రికి - 'బిల్హణుఁ డంధుఁ' డని తెలిపి, బిల్హణునకు 'రాజపుత్రి కుష్ఠరోగి' యని యెఱింగించి, వారిద్దఱిమధ్య నొకతెర కట్టించి, రాజపుత్రికి విద్య నేర్పునేర్పాటు చేయుదు" నని యట్లే చేసెను. రాజున్ను దీనికి సమ్మతించెను.

1. బిల్హణీయమునకు సంస్కృతమున ముద్రిత మై ప్రచారములో నున్న "బిల్హణచరితమ్" అనునది మూలము. ఇందు 150 శ్లోకములమాత్రమే కలవు- ఈనూటయేఁబదిలో 50శ్లోకములు 'చౌరపంచాశిక' శ్లోకములు - ఈగ్రంథరచన కాలము మనకుఁ దెలియరాదు - కాని శ్రీనాథునికాలమునుండి యిది ప్రచారములో నున్నట్లు తెలియు చున్నది.



యామినీపూర్ణతిలక-కాండపటముమధ్యగా బిల్హణునియొద్ద విద్యల నభ్యసించి సకలకళావిశారద యయ్యెను. ఇట్లుండ నొకనాఁడు పున్నమవెన్నెలరేయి నామె తెర వెనుక శయనించి యుండెను బిల్హణుఁడు, ఆపండువెన్నెలసౌభాగ్యమును దిలకించి, తాను గవిగానఁ, జంద్రునితో మచ్చునసహితము అద్భుతముగా వర్ణింపఁ దొడఁగెను. తెరవెనుక నామె యీవర్ణనము విని - "బిల్హణుఁ డంధుఁ డని చెప్పినారు - కాని యతఁడు నిజముగా గ్రుడ్డివాఁడే యైనచోఁ జంద్రునితో మచ్చనుగూడ నెటుల వర్ణింపఁ గలఁడు?ఇది నాతండ్రి యెత్తినపన్నుగడ యని, తెర దిగఁ ద్రోసి బిల్హణునిఁ గాంచి మోహపరవశ యయ్యెను. వారిరువురు మన్మథక్రీడావిలాసమగ్నులైరి

ఈసంగతి ఆమెనెచ్చెలులు రాజున కెఱిఁగింపఁగా నాతఁడు కోపోద్రిక్తుఁడై బిల్హణునికి శిరశ్ఛేదము చేయ నాజ్ఞాపించెను. రాజు, తలవరియు నట్లు చేయుటకుఁ బ్రయత్నించియు నాతనిధైర్యముఁ గాంచి, యట్లే నిలిచిరి. బిల్హణుఁడు అప్పుడు తనప్రియతోఁ దా ననుభవించినక్రీడలన్నింటిని నేఁబదిశ్లోకములలో వ్రాసి పంపెను కాని రాజు వానిని జదువక తిరస్కరించెను. తిరిగికూడ బిల్హణుఁడు, రాజనీతినిఁ గూర్చి ఒకశ్లోకమును వ్రాసి పంపెను. రాజు దానిని జూచియుఁ దిరుగఁ గొట్టెను - అంతఁ గవి యిట్లు మఱియొక శ్లోకము వ్రాసి పంపెను - "కవి శాపానుగ్రహ సమర్థుఁడు. ఎందఱో రాజులు కవులశాపమువలన రాజ్యభ్రష్టులైరి. నీవును న ట్లగుదువు" అని శ్లోకతాత్పర్యము అది చూచి రాజు వెంటనే కవినిఁ బిలిపించి, యామినీపూర్ణతిలక నాతని కిచ్చి వివాహముఁ గావించెను.

శృంగారరసాత్మక మగు పైకథ తెలుఁగుకవుల నాకర్షించినది :-

1. బిల్హణీయము : చిత్రకవి సింగరాచార్యప్రణీతము,
   ముద్రితము - 17 వ శతాబ్ది.
2. శృంగారసుధాసముద్రపూర్ణచంద్రోదయము,
   18 వ శతాబ్ది - అముద్రితము.
3. మదనసాయకవిలాసము : చదువుల సోమలింగకవి,
   18 వ శతాబ్ది - అముద్రితము.
4. యామినీపూర్ణతిలకావిలాసము : చెళ్ళపిళ్ళనరసకవి,
   19 వ శతాబ్ది - ప్రారంభము-ముద్రితము.

ఈనరసకవి సుప్రసిద్ధు లగుచెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారిముత్తాత -

5. నవయామిని : మారేమండ నాగేశ్వరరావు. 20 వ శతాబ్ది-ముద్రితము.
(గుంటూరు ఆంధ్రక్రైస్తవకళాశాలలో నాంధ్రోపన్యాసకుఁడు)

## నా ట క ము లు

శ్రవ్యకావ్యకర్తలనే కాక 'గురజాడ'వంటినాటకకర్తలను నీయితివృత్త మాకర్షించినది.

1. బిల్హణీయము — నాటకము - రెండంకములదిమాత్రము లభ్య మైనది.
ముద్రితము. ఆంధ్రపత్రిక మొదటిసంవత్సరాది
సంచిక - 1909. విశాలాంధ్ర - 1950.

2. బిల్హణీయము - నాటకము - మారేపల్లి రామచంద్రశాస్త్రి
(1873-1951).
ముద్రితము 1913. రచన 1902

3. ,, ,, అ. రామానుజాచార్యులు - 1904

4. ,, ,, గూడా కృష్ణయ్య - 1910

5. ,, ,, ఉమ్రే అలీ షాహ - 1910[1]

## య క్ష గా న ము

బిల్హణునికథ నాటకముగానేకాక సంప్రదాయసిద్ధము లగు యక్షగానములుగాఁగూడ వెలసినది.

బిల్హణీయనాటకము - యక్షగానము -
గొన్నాబత్తుల అమ్మనార్యుఁడు - 1884 - రచన
ముద్రితము - 1901

ఇది ప్రశస్త మైనరచన.[2]

బిల్హణీయము - ధనకుధరం రామానుజాచార్యులు[3] - 1903

పైవివరణనుబట్టి తెలుఁగుదేశమున, బిల్హణునికథ కెట్టిప్రచారము గలదో తెలియును.

1. తెలుఁగునాటకవికాసము - డాక్టరు పోణంగి శ్రీరామ అప్పారావు.
(పి. యస్. ఆర్. అప్పారావు) పుట 671
2. ఆంధ్రయక్షగానవాఙ్మయచరిత్ర - పుట 192
3. ,, ,, పుట 210



## బిల్హణుఁడు - చోరకవి.

సంస్కృతవాఙ్మయమున బిల్హణుఁడు, చోరకవి వేర్వే రని వ్రాయఁబడినది. కాని యది సరి కాదు-'చోరపంచాశత్తు' అను కృతి చోరకవి దని వారిభావన. కాని ఆపంచాశత్తునకుఁ గర్త బిల్హణకవి యని, ఆతఁడే చోరకవి యని, బిల్హణీయమందలియీక్రిందిఘట్టము నిరూపించు చున్నది:-

రాజాజ్ఞ ననుసరించి, భటులు, బిల్హణుని వధ్యస్థానమునకుఁ గొనిపోవునపుడు, వీథులలోఁ బౌరజను లిట్లు చెప్పుకొనఁ దొడఁగిరి:—

క. చోరుఁ డనునామ మీకవి
కారయఁగను నేఁటికిని యథార్థం బయ్యెన్.
జారుఁడు; మఱి రెండుం దగె;
సూరులు మెచ్చుదురె జారచోరత్వములన్. (3-84)

సంస్కృతమున నీశ్లోకములు"అద్యాపి"అనుపదద్వయముతోఁ బ్రారంభింపఁబడును.

## బిల్హణునికథ - మహారాష్ట్రము.

తెలుఁగుదేశముననేకాక మహారాష్ట్రదేశమునఁగూడ బిల్హణునికథ వ్యాప్తిలో నున్నది. 'బిల్హణచరిత్ర'అనుగ్రంథ మాభాషలోఁ గలదు.[1]అం దీరీతిగా నున్నది:-

బిల్హణుఁడు కాశ్మీరదేశీయుఁడు. ప్రవరపురమునకుఁ జేరువ కోనముఖగ్రామవాసి. కాశీనుండి రామేశ్వరమువఱకు నీతఁడు సంచరించి పలువురు పండితుల యెదుట స్వకవితాకౌశలప్రదర్శనమును గావించి, వారిమెప్పును బడసి దైవవశమున గుర్జరదేశపునరసింహరాజుపుత్రిక యగుశశిరేఖకు నితఁడు విద్యాబోధకుఁడుగా నుండి యామెను బ్రేమించి మిక్కిలి కష్టములపాలై తుదకు వివాహ మాడెను.

తెలుఁగుదేశమున బిల్హణకథకును, మహారాష్ట్రమున బిల్హణకథకును పేర్లలోఁ గొంతభేద మున్నను గథాకథన మంతయు నొక్కటే - రెండింటియందును బిల్హణుఁడే కథానాయకుఁడు - కథయంతయు నొకటే:-

1. శ్రీవిఠల్‌కృత "బిల్హణచరిత్ర" మరాఠీ. పుట 163.

| తెలుఁగు | మహారాష్ట్రము |
| --- | --- |
| పాంచాలదేశము | గుర్జరము |
| మదనాభిరాముఁడు | నరసింహరాజు |
| యామినీపూర్ణతిలక | శశిరేఖ |

మహారాష్ట్రమండలికథ, బిల్హణుడు విక్రమాంకదేవచరిత్రచివరిసర్గలోఁ దాను జెప్పికొనినదేశనివాసవిషయమున సరిపోవు చున్నది ఇఁక నిందలి బిల్హణకథయుఁ దెలుఁగుదేశపుబిల్హణకథతో సరిపోవు చున్నది - తెలుఁగుదేశమున నీకథలో దేశము-రాజు - రాజపుత్రిపేళ్లలో మార్పు గలుగుటకు హేతు వున్నది. బిల్హణునిఁ గూర్చినయీకథలు గ్రంథస్థము లైననాఁటికి బిల్హణునికిఁ దరువాతఁ జాలకాలము పట్టినది - తెలుఁగున క్రీ-శ. 7వ శతాబ్దిని ఇది తెలుఁగులోనికి వచ్చినది. తెలుఁగుకవి తా నప్పటికి విన్నకథను యథామాతృకముగాఁ గావ్యముగా రచించెను. తక్కినకవు లందఱు నొకరి నొక రనుసరించిరి.

మరాఠీకథలో - "బహుకష్టములపాలై" అనువాక్యము తెలుఁగుబిల్హణీయము కథతో ననువదించుచున్నది. ఈతరువాతఁ గొంతమంది చరిత్రకారులు - బిల్హణుఁడు పెండ్లి యాడినకన్య - గుజరాతునందలి 'అణహిల్వాడు' నగరమందలి దని చెప్పు చున్నారు-తెలుఁగుకవుల కీమహారాష్ట్రమండలికథ పరిచితము గాక పో వచ్చును.

ముందు నేను జెప్పినట్లుగాఁ దెలుఁగుకవు లప్పటిజనప్రవాదము ననుసరించిన కథను గ్రంథస్థముఁ జేసిరి. మొత్తముమీఁద బిల్హణకథకుఁ దెలుఁగుదేశమున నున్నంతప్రచారము మహారాష్ట్రములో లే దని చెప్ప వచ్చును. తెలుఁగుదేశమందలి కథ చెప్పక పోయినను, మహారాష్ట్రదేశమునందలికథ విక్రమాంకదేవచరిత్రకథతో సంబంధము తెలియవచ్చుటచేతను, గథలు రెండును నొక్కటియే యగుట చేతను, విక్రమాంకదేవచరిత్రకర్త యగుబిల్హణుఁడును నొక్కఁడే యని సిద్ధాంతము.



## II

## అనువాదప్రశస్తి

నవ్యాంధ్రసాహిత్యజగత్తులోఁ బ్రాచీనప్రబంధకవిసంప్రదాయములను బునరుజ్జీవింపఁ జేసిన దీవిక్రమాంకదేవచరిత్రానువాదము. మూలమునఁ బదునెనిమిదిసర్గలు గలయీకావ్యమును దెలుఁగున నేడాశ్వాసములలో, రెండువేల పద్యములకు మించి యొకమహాప్రబంధముగా దిద్ది తీర్చినవా రిరువురు :

(1) [1]శిరోమణి కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారు.

(2) కీర్తిశేషులు మాదిరాజు విశ్వనాథరావుగారు.

సంస్కృతాంధ్రములవలె వీరిరువురును నీకృతిని రచించుటవలన దీని కొక విశిష్టత చేకూరినది. ఇందుఁ దొలివా రైన శ్రీలక్ష్మణశాస్త్రిగారు వెలనాటివారు - 'వెలనాటివారు కవితకు వెల నాఁటినవారు' - రెండవవారు విశ్వనాథరావుగారు ఆర్వేలనియోగులు ఆంధ్రభారతి ఆర్వేలవారింటియాఁడుబిడ్డ. కవితా - సాహిత్యములు శాఖాభేదముల కతీతము లని నిరూపించిన దీకావ్యము.

ఇష్టదేవతాస్తుతి, షష్ఠ్యంతములు, ఆశ్వాసాద్యంత గద్య - పద్యములు - రస - భావవర్ణనలతో నీకృతి సర్వప్రబంధలక్ష్య - లక్షణ - లక్షిత మై యలరారు చున్నది -

### కావ్యావతారికా విశేషములు

(1) మనకావ్యము లన్నియు శ్రీకారముతోఁ బ్రారంభింపఁ బడునవియే. అందుఁ బ్రథమపద్యమునఁ బ్రారంభమున శ్రీకార ముండును. కాని, తక్కిన మూడుపాదములయాదియందును శ్రీకార ముండదు. ఇందు 4 పాదములయాది యందును శ్రీకారము నుండుట విశేషము.

---

1. శ్రీలక్ష్మణశాస్త్రిగారియింటిపేరు 'కప్పగంతులవా' రని నేఁడు వాడుకలో నున్నను - వాస్తవముగా వారియింటిపేరు 'కప్పగొంతులవారు'. ఇది వైదికసంబంధము గలది. వేదమున మండూకసూక్తములు ప్రసిద్ధములు. మండూకసూక్తధ్వని యెప్పుడును వీరిపూర్వులయింటిలో విన బడుచుండుటచే కప్పగొంతులవా రని వీరి గృహనామ మేర్పడినది. దీనిని దొలుతఁ దెలిపినవారు. సుప్రసిద్ధవిద్వాంసులు బులుసు వేంకటరమణయ్యగారు. (భారతి - మార్చి 1946).

(2) ఇది తెలుఁగువారియిలువేల్పైన శ్రీపద్మావతీ - వేంకటేశ్వరస్వామివారికిని, శ్రీలక్ష్మీ-నరసింహస్వామివారికిని సంకితము. శ్రీలక్ష్మణశాస్త్రిగారియిష్టదైవము శ్రీవేంకటేశ్వరస్వామివారు. అంతేకాక, వారితలిదండ్రులు - పద్మావతీ - శ్రీనివాసశాస్త్రిగార లగుటయు నొకవిశేషమే. శ్రీవిశ్వనాథరావుగారియిలువేల్పు శ్రీలక్ష్మీనరసింహస్వామివారు. ఈకారణముచేత నీకవులు షష్ఠ్యంతములలో నిలువేల్పు లిరువురుస్వాములను శ్లిష్టసమాసములతో స్తుతించినారు.

(3) గురుస్తుతియందు, మతిలోకోత్తరులు మానవల్లి రామకృష్ణకవిగారి స్తుతి యుండుట.

(4) సాధారణముగా నిష్టదేవతాస్తుతియందు నొక్కొక్క దేవతకు నొక్కొక్కపద్యమే యుండును. ఇం దట్లు గాక రెండుమూడుపద్యము లున్నవి

(5) కృత్యవతారిక ఒకచక్కనిఖండకావ్యమువలె భాసించు చున్నది.

## అనువాదసరణి - ఒకయుదంతము

ప్రస్తుత మీప్రబంధ మనువదింపఁ బడినవిధానమునుగూర్చి తెలుపుటకు ముం దొకయుదంతమును బాఠకులదృష్టికిఁ దెచ్చుట యావశ్యకము-

ఇప్పటికి నాలుగుదశాబ్దులక్రిందటిమాట-క్రీ. శ 1934లో నేను ఇంపీరియల్ బ్యాంక్ (నేఁడు స్టేటుబ్యాంక్ ఆఫ్ ఇండియా) లో విజయనగరమున గుమాస్తాగాఁ బని చేయు చున్నరోజు లవి. ఉద్యోగనియమితకాలముతప్పఁ దక్కినకాలమంతయు నాకు సాహిత్యవ్యాసంగముననే కడచెడిది - ఆసమయమున నేను యాదృచ్ఛికముగాఁ. తిరుపతివేంకటకవులు రచించినవచనవిక్రమాంకదేవచరిత్ర చదువుట తటస్థించినది - విక్రమాంకదేవచరిత్ర తెలుఁగులోని కనువదించుటలో వారే మొదటివారు. నే నావచనగ్రంథము చదివి, అం దవతారికలో బిల్హణుఁడు కవులనుగూర్చి - కావ్యమునుగూర్చి వ్రాసినభాగములకు ముగ్ధుఁడనై యాభాగములను ముప్పదిపద్యములలో ననువదించితిని. వానిని మిత్రులు కీ శే. గంటి సూర్యనారాయణశాస్త్రిగారు తమ 'కల్యాణి' పత్రికలోఁ బ్రకటించిరి, ఆపద్యములను నాకుఁ జిరకాలమిత్రు లగు శ్రీమాన్ రఃయ్యాణ్ణి వేంకటవీరరాఘవాచార్యులుగారు చూచి. "మూలమును మీరు చూచితిరా" అని యడిగిరి. 'చూడ లే' దంటిని. వెంటనే వారు బూలరుదొర ప్రకటించిన విక్రమాంకదేవచరిత్ర నిచ్చి చదువుఁ డనిరి.



మూలముతోఁ దిరుపతివేంకటేశ్వరకవికృతాంధ్రానువాదమును బోల్చి చూతునుగదా - ఆయనువాదమంతయు సరిగా లే దని పొడఁగట్టినది. మూలములో నున్నచారిత్రికాంశములనేకాక, బిల్హణకవికవితాసామర్థ్యమును వ్యక్తీకరించు రసవద్ఘట్టములును బ్రదర్శితములు కాలేదు - ఎన్నఁడైనను నీకావ్యమునకు మూలముతో సరితూఁగఁ గలయనువాద ముదయించునా యని యువ్విళ్లూరు చుంటిని. ఈనాఁటికి నీవిక్రమాంకదేవచరితమున కట్టియనువాద మవతరించినది.

మూలగ్రంథమును నేను బూర్తిగాఁ జదివి యానందించినవాఁడ నగుటచేతఁ బ్రస్తుతానువాదము నన్నెంతగానో యాకర్షించినది. మూలమందలియొక్కపదమును గూడ విడువకుండ, నీరచన జాగరూకతతో సాగినది. ఈయనువాదమున నిది ముఖ్యవిషయము. ఏల ననఁగా, నీసంస్కృతకావ్యము చరిత్రకు సంబంధించినది అందలిపదములను విడిచినఁ జరిత్రకు లోపము కల్గును. ఇట్లు చారిత్రికదృష్టితోడనే కాక సాహిత్యదృష్టితోఁ జూచినను నిది ద్వితీయానువాద మైనను నద్వితీయమై యున్నది.

ధారాశుద్ధిలో, రచనరీతిలో, భావవిన్యాసములలోఁ, బాండితీస్ఫోరక ప్రౌఢప్రయోగములలో నీప్రబంధము పూర్వప్రబంధములను బుణికి పుచ్చుకొన్నది. సమాసబంధుర మైనప్రసన్నసంస్కృతభాషావిశేషములతో, ముచ్చటఁ గూర్చు నచ్చతెలుఁగుపలుకులపొంకము మెచ్చుఁ గొల్పు చున్నది. కావ్యకర్త లిరువురు నిరాఘాటకవనధారాపారీణు లగుటచే నిది "సానలఁ దీరినజాతిరత్నము" వలె నొప్పు చున్నది.

శ్రీకప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారు, గురుకులక్లిష్టులై, యనవద్య మగు సంస్కృతసాహిత్యవిద్య నార్జించుటయేకాక, యాంధ్రభాషా-సాహిత్యసంప్రదాయ సంప్రవిష్టు లగుటచేత, నీకృతి వారియుభయభాషావైదుష్యమునకుఁ బతాకగా నున్నది. వా రుభయభాషా కవులే కాదు - అష్టభాషావిశారదులు (హిందీ, ఉర్దూ, మహారాష్ట్రము, తమిళము, కన్నడము, తెలుఁగు, సంస్కృతము ఇంగ్లీషు).

చారిత్రికకావ్యములు ప్రాయికముగా రసప్రమేయములు గావు. అయినను బిల్హణకవి రసబంధురముగా నీకావ్యము నిర్మించినాఁడు అనువాదమున నిది మూలముకన్న రసస్నిగ్ధ మై పఠితలను దన్మయత్వముఁ జెందించు చున్నది.

## ప్రౌఢపదప్రయోగములు -

ఈనాఁడు, పద్యకావ్యములు వెలువడినవి. మహాకావ్యములు వెలువడినవి. కాని, యీకృతియందు వానియన్నింటిలో లేనివిశిష్టత యొకటి గలదు. అది పదప్రయోగపాండిత్యము - ఇం దన్నింటిని వివరించుటకు వీలు లేదు. రెండుమూ డుదాహరణముల నిచ్చు చున్నాను.

విగూర్వణము (1–107)

సంస్కృతమున "గుర్వీ - ఉద్యమనే" అన్నధాతువునుండి "విగూర్వణము" అనుశబ్ద మేర్పడు చున్నది – 'అతిశయించుట లేక విజృంభించుట' యని దీని కర్థము. కాని తెలుఁగుభాషలో నిది, 'విగుర్వించు, విగుర్వణ' యను రూపముతోఁ బ్రయుక్త మైనది–

నన్నయ– 'విగుర్వింపుము చూత మనిన గోత్రభిదుండున్'. ఆది. 7-274.
నన్నెచోడుఁడు– 'తలతల మని విగుర్వించి' – 2-189.
'పటుదోర్బలగర్వవిగుర్వణంబునన్' – 8-28.
యథావాక్కుల అన్నమయ్య – 'రైక్యాలి న్విగుర్వించి' – 16 ప.

ఇట్లు మహాకవులు 'విగుర్వణము'–అని హ్రస్వద్వితీయముగాఁ బ్రయోగించుటచే నీపదము వివాదముల కాస్పద మైనది. ఇది తత్సమపద మని – తెలుఁగుకవుల ప్రయోగములవలన – ముష్టాముష్టి మొదలగువానివలె సాధు వైన దని నిర్ణయించిరి[1]

క్రీ. శ. 13వ శతాబ్దినుండి కవు లెవ్వరును వాడనియావిగూర్వణపద మిందు సరిగా వాడఁబడుట యెంతయుఁ బ్రశంసనీయము.

'నభఆభోగ' (6-69)
'యశయావళి' (7-6).

నభశ్శబ్దము - యశశ్శబ్దము సంస్కృతమున సాంతపదములు - 'నభ - ఆభోగము' అని సంధి చేయక ప్రయోగించుట ప్రౌఢరీతి - నన్నెచోడకవి యిట్లే - 'జాతవేదఆహ్వానంబు' (2-16) అని ప్రయోగించినాఁడు –
'యశయావళి' - యశశ్శబ్దము సాంతమైనను తెలుఁగుకవులు దీనిని అదంతముగా వాడినారు –

ఎఱ్ఱనభారతములో

"సమ్యగ్యశశాలి"[2] యని అరణ్య – 6-92లోఁ బ్రయోగించినాఁడు.

యశశ్శబ్దముసాంత మగుటచే పదాంతసకారమునకు రుత్వము వచ్చి దానికి యాదేశము వికల్పముగా వచ్చును. కనుక 'యశఆవళి' లేక 'యశయావళి' అని రెండురూపములును సాధువులు. కనుక 'యశయావళి' యిట విశిష్టప్రయోగము.

1. ఈ శబ్దమును గూర్చిన సంపూర్ణవివరణము శబ్దరత్నాకరము – అనుబంధము. సవరణలు – వివరణలు – పుటల 858-860. లోఁ గలదు.

2. శబ్దరత్నాకరానుబంధము – పుట 34.



'నిర్గహనము–(6-79) 'నిర్గహనుఁడు' (6-92) అనుపదము లపూర్వములు. 'నిర్గహనము' అనఁగాఁ 'గ్లేశము లేనిది' అని యర్థము. ఇది కేవలము నైఘంటిక మైనను – నిందుఁ బ్రయోగింపఁ బడుటచేఁ బ్రచారములోనికి రావచ్చును

ఇంకను "హైమన" = 'హిమసంబంధ మైనది' మున్నగువిశిష్టప్రయోగము లిందుఁ గలవు.

ఈనాఁడు శబ్దమునుగూర్చినవిచారణ లేకపోవుటచేతఁ బ్రత్యేకముగా నిందుఁ గొంచెము సూచింప వలసి వచ్చినది[1].

వర్ణనలు

ఇందలి గ్రీష్మ - హేమంతఋతువర్ణనలను జూచినఁ గావ్యకర్త కవితా కౌశల్యము తేఁటపడఁ గలదు. వాని నన్నింటిని మించినది.

కాశ్మీర వర్ణన

ఇంతవఱకు, "అంగ - వంగ - కళింగ - కాశ్మీర"[2] అని బడబడశబ్దాల ధోరణితో "నేకరువు పెట్టుటే" కాని మనసాహిత్యమునఁ బ్రసిద్ధ మైనకాశ్మీరదేశమునుగూర్చి వివరములు మన మెఱుఁగము. కాశ్మీరదేశవర్ణన విక్రమాంకదేవచరిత్రములోఁ జివరిసర్గమునం దున్నది. భూలోకనందన మని పొగడ్త నందిన యాదేశపువర్ణనమిం దద్భుతముగాఁ బ్రపంచింపఁ బడినది. ఈకావ్యము మూలమునందలి కాశ్మీరదేశవిశిష్టతను దెలుఁగువారికిఁ బరిచితముఁ జేసినందులకు ననువాదకర్తలెంతయేని సభినందనీయులు.

తిరుపతి - వేంకటకవులలోఁ దిరుపతిశాస్త్రిగారు ముందే కీర్తిశేషు లైనను, చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు–తిరుపతి–వేంకటకవు లను పేరితో నే ప్రచురించినట్లుగా, నేఁడీకావ్యమును కీ. శే. విశ్వనాథరావుగారి పేరితోఁగూడఁ బ్రకటించుట యెంతయు నంస్తవనీయ మై శ్రీలక్ష్మణశాస్త్రిగారి "సహృదయత్వము - సౌమనస్యము" వెల్లడి సేయు చున్నవి.

శ్రీనాథుఁడు శ్రీహర్షునినైషధీయచరిత్రను 'శృంగారనైషధము'–అనుపేర–బంగారుమెఱుఁగులు పెట్టి మూలము నతిశయించునట్లు చేసినరీతిగా, నేఁడు, శ్రీలక్ష్మణశాస్త్రిగారు, కీ. శే. శ్రీవిశ్వనాథరావుగారును బిల్హణునివిక్రమాంకదేవచరిత్రమ్ము నాంధ్రీకరించి, మూలాతిశాయిగా దానిని దెలుఁగున సువర్ణమయాలంకారముగా నొనర్చినారు– అందువలననే వారికి–

1. నేను శబ్దరత్నాకరమును 40 వేలపదములతోఁ దిరిగి సంస్కరణప్రతిఁ దయారు చేసినాను – అం దీపదములను గ్రహించినాను.

2. పానుగంటివారి 'విమర్శాదర్శ'. తృతీయభాగము.

## “ఆంధ్ర బిల్హణ”

అను బిరుదము సార్థక మైనది. తెలుఁగుసాహిత్యమున 'అభినవదండి' - 'ఆంధ్రకాళిదాసు' నామములవలె-ఈ నామము శ్రీలక్ష్మణశాస్త్రి - విశ్వనాథరావుగారల యందు లక్షణవంత మై వెలయుఁ గాక.

విశ్వవిద్యాలయములలోఁ బాశ్చాత్యవిమర్శనపద్ధతిమూలమునఁ బ్రాచీన ప్రబంధసాహిత్యాధ్యయనము, ప్రబంధపఠనాభినివేశము ప్రాయికముగా నంతరించు చున్నది. ఈసందర్భమునఁ బ్రఖ్యాతభాషావేత్తలు, ప్రాచీనసాహితీవిమర్శకులు నైనశ్రీతిరుమల రామచంద్రగా రొకపర్యాయ మొక[1]సదస్సులోఁ జెప్పినమాటల నుదాహరించుట యావశ్యకము.

తెలుఁగు - కన్నడలిపులసమ్మేళనమునుగూర్చి వారు ప్రసంగించుచు నిట్లు చెప్పినారు:-

“ఈనాఁటికే ప్రాచీనకావ్యాధ్యయనము, శబ్దార్థవిచారణ, సాహితీవిమర్శన మున్నగునవి లుప్తము లగు చున్నవి. మహితసాహిత్యజీవి శ్రీమానవల్లి రామకృష్ణ కవిగా రన్నట్లు “ఇంకఁ గొన్నాళ్ళకుఁ దెలుఁగుపద్య మర్థము కాకుండఁ బోవునేమో నండీ” అన్నది వాస్తవ మగు చున్నది” - ప్రస్తుతస్థితి ఇదే-

వేయేండ్లనుండి యవిచ్ఛిన్నధారాప్రవాహ మై ఆంధ్రసాహిత్యసౌధమునకు మూలస్తంభాయమాన మైనప్రాచీనప్రబంధసాహిత్యాధ్యయనమును బునరుజ్జీవింపఁ జేయ వలసినసమయము తటస్థించినది. అట్టిపునరుజ్జీవనమునకు నేఁడు వెలువడిన “విక్రమాంకదేవచరిత్రప్రబంధము” ఎంతయేని దోహదము చేయఁ గలదు. ఆంధ్రవిద్వల్లోకము దీనిపై సమీక్షలను వెలయించి, ప్రాచీనప్రబంధాధ్యయనమును బ్రోత్సహింతురుగాక. ఈకావ్య మాంధ్రసాహిత్యప్రపంచమునఁ బ్రచురప్రచారముఁ బడయుఁగాక !

ఇట్లు

నిడుదవోలు వేంకటరావు

లక్ష్మీకాంతనిలయం
2-2-1137/5, క్రొత్తనల్లకుంట,
హైదరాబాదు - 500044.
10-9-1974.

1. తెలుగులిపిసంస్కరణసదస్సు - హైదరాబాదు - 1972.

## 'ఆంధ్ర బిల్హణ' బిరుద ప్రదానము

శ్రీః
శ్రీనివాస పరబ్రహ్మణే నమః

శ్రీమత్కవితల్లజేభ్యః శ్రీవనపర్తిసంస్థానవిద్వదగ్రేసరేభ్యః ఏతత్కలాశాలాప్రాచీనవిద్యార్థిభ్యః బ్రహ్మశ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిమహోదయేభ్యః, తత్సోదరకవితల్లజేభ్యః తన్మిత్రవర్యేభ్యః శ్రీ మాదిరాజు విశ్వనాథరావుమహాశయేభ్యశ్చ శ్రీవేంకటేశ్వరసంస్కృతకలాశాలాప్రాచీనవిద్యార్థిసమిత్యా సాదరప్రేమానుబద్ధం సమర్పితమిదం సన్మానపత్రం.

మహాశయాః !

ప్రౌఢరమణీయపదబన్ధం రసఖణ్డం సకలసహృదయహృదయాఽఽహ్లాదకం సముద్దణ్డకవితల్లజ-శ్రీమద్బిల్హణకవివరప్రణీతం శ్రీచాళుక్యనవసాహసాఙ్క-విక్రమాదిత్యనృపతికులతిలకచరితం నిబద్ధాఽన్ధ్రభాషాయాం మూలానుయాయిరసభావాలఙ్కారాఽఽది-పరికర-పరిష్కృతం పద్యప్రబన్ధమారచితవద్భ్యాం భవద్భ్యాం ప్రౌఢిమానం తత్తాదృశం భావగామ్భీర్యం చాఽవలోక్య ప్రముదితాన్తరఙ్గైరస్మాభిః సమితిసదస్యైః భవద్భ్యః 'ఆంధ్ర బిల్హణ' బిరుదం సాదరప్రేమానుబద్ధం సమర్ప్యతే. శ్రీ వృషభాద్రిశేఖరమణిః కమలాజానిః నిరన్తరమాయురారోగ్యైశ్వర్యాఽఽదికం ప్రకల్పయతు నితరాం భవద్భ్య ఇతి నిసర్గసమ్యఞ్చి కవికులాని చ నిత్యం రక్షయన్త్వితి చ మంగళాన్యాశాస్మహే.

శ్లో॥ శ్రీమాన్ వేఙ్కటశైలశేఖరమణిః కారుణ్యవారాంనిధిః
శ్రీవిద్యుల్లలితః సువర్ణకలికాసాన్ద్రోన్నీలద్యుతిః।
సంసారాఽఽతపశోషితాఽఽర్తిహరణః భక్తాబ్జకరప్రీణనః
శ్రీమల్లక్ష్మణ-విశ్వనాథసుకవీ చాఽకల్పమాకల్పతామ్॥

శ్లో॥ పూర్వం గ్రన్థసహస్రశాణకషణప్రత్యుత్కలత్కైర్గిరామ్
ఉల్లాసైః ప్రణినాయ యాం రసకలాం శ్రీబిల్హణః సంస్కృతే,
శ్రీమల్లక్ష్మణ-విశ్వనాథసుకవీ తత్తాదృశాం చక్రతుః
తాం చాళుక్యనృపాలవిక్రమకథాం దివ్యాఽఽన్ధ్రభాషామయీమ్॥

శ్లో॥ సర్వజ్ఞః సుమనోజ్ఞబిల్హణకవిస్త్వాన్ధ్రీవనీపణ్డితః
ఉద్దణ్డో నవసాహసాఙ్కనృపతిశ్చాన్ధ్రీవనీవల్లభః।
ఆన్ధ్రీ దివ్యరసప్రకర్షసుభగా సర్వార్థదా నిస్తులా
తత్సర్వం సువిచిన్త్య బిల్హణకవేర్వాగాన్ధ్రిభాషాఽభవత్॥

శ్లో॥ ఆన్ధ్రీ సంస్కృత-దేశవాగ్విలసితా భాషాఽమలా రాజతే
శబ్దద్వన్ద్వమిదం మనోజ్ఞమధురం కర్తుం సుధీర్బిల్హణః।
శ్రీమల్లక్ష్మణ-విశ్వనాథకవిరాడ్రూపేణ విద్యోతతే
ఏతావాన్ధ్రిసరస్వతీపతివరౌ శ్రీబిల్హణౌ రాజతామ్॥

శ్లో॥ రసభావాలఙ్కృతి-గుణపరిపాకాత్
రీతి-వృత్తిరమణీయైః॥
లలితోచితసన్దర్భైరనుకురుతే
మూలమేవ సన్దర్భః॥

శ్లో॥ ఉద్దణ్డపణ్డితత్వప్రకర్షరమ్యౌ
గభీరసన్దర్భౌ।
అనుకుర్వాతే బిల్హణసుకవిం
సుకవీ మనోజ్ఞమన్త్రజ్ఞౌ॥

శ్లో॥ ఇతి తాదృశగుణగణసమ్మోదితైః
భ్రమరైరగాయి గుణగుమ్ఫః॥
'తిరుపతి' నగరీ-సంస్కృత-విద్యాఽఽలయ
లబ్ధవర్ణసఙ్ఘస్థైః॥

తిరుపతి సంస్కృతకలాశాలా
ప్రాచీనవిద్యార్థి సమితిః
శ్రీపదపురి 2-1-1944

ఇతి నివేదయితా

(తి-కు-వేం-న-సుదర్శనాచార్యః)
కార్యదర్శీ.

శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారియధ్యక్షతన జరిగినసన్మానసభయందు నొసంగఁ బడినసన్మానపత్రము.

శ్రీ వేంకటేశ్వరాంధ్ర సాహిత్యపరిషత్తు
తిరుపతి.

శ్రీ శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారికి
శ్రీ శ్రీ మాదిరాజు విశ్వనాథరావుగారికి
సమర్పించు సన్మానపత్రము

*సర్వవిద్యాభూష - లక్ష్మణశాస్త్రివర్యా!*

విద్యాలతలకు నాలవాలమైన శ్రీ వేంకటేశ్వరసంస్కృతకళాశాలామతల్లికిఁ గొంగుబంగారంబ వై కవితాపరిమళంబుల దశదిశలఁ వెదఁజల్లఁ జాలు విద్యార్థిపారిజాతకుసుమంబవు. నిన్ను వేనోళ్లఁ గొనియాడుచుంటిమి.

*కవివతంసులార!*

యుష్మదాంధ్రీకృతవిక్రమాంకదేవచరిత్రము మీయపారపాండితీప్రతిభల దిగంతమ్ముల వ్యాపింపఁ జేసి మిమ్మునయంబుఁ బ్రోచుఁ గాత. మీకు సమర్పింపఁ బడిన 'ఆంధ్రబిల్హణ' బిరుదము, మీగ్రంథమును విన్నమాకు ఎంతయో సమర్థమని విశ్వసించుచున్నాము.

*అలంకార విద్యాప్రవీణులార!*

చదివినచదువుల జీర్ణింపఁ జేసికొని దేశభాషల నలంకరింపఁ జేయుప్రతిభావిచిత్రితచరిత్రల ననేకంబుల వ్రాసి యద్వితీయభాషావైదగ్ధ్యంబున రసమయంబగు కావ్యజగత్తును నిర్మించుకవిబ్రహ్మల రగుదురుగాక.

*ఉభయభాషాపాండితీవైదగ్ధ్యులార!*

సర్వగుణవిశిష్టమ్మగుసంస్కృతాంధ్రసాహిత్యపాథోధిం దఱచి కథామృత

నవనీతం బుభయలోకంబుల కందిచ్చుసుమనసులరు సహృదయులరు రసజ్ఞులరు మాపురంబున కరుదెంచుట మాభాగ్యము.

*విమర్శకశిరోభూషణులార !*

దేశకాలంబుల నవలోకించి దేశసేవ, భాషాసేవ చేయుటకు నడుము కట్టి ముందంజ వేయుసాహసగుణంబు సర్వులమ్ములం గూర్చి మున్ముం దనేకకావ్యరత్నమ్ముల సేకరింపఁ బండితసంఘమ్ములు, రాజవంశమ్ములు మిమ్ము ఆదరించి ప్రోత్సహించుఁగాత.

ఇట్లు

తిరుపతి
2-1-1944

(చేబోలు సుబ్రహ్మణ్యశర్మ)
కార్యదర్శి

# పండితాభిప్రాయములు

## విక్రమాంకదేవ చరిత్రము

**ఆచార్య బ్ర॥ శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు ఎం. ఏ.**

బిల్హణమహాకవిప్రణీత మగునీమహాకావ్యము నింతవఱకు నెవ్వరును దెనిఁగించినవారు కారు. బ్రహ్మశ్రీ తిరుపతి-వెంకటేశ్వరకవులు వచనరూపమున ననువదించిరి అది పెక్కుఘట్టముల మూలానుసారి కాకున్నది. ఇప్పుడు వనపర్తి సంస్థానమున నివసించు బ్రహ్మశ్రీ లక్ష్మణశాస్త్రియు, మ॥రా॥రా॥శ్రీ కాఖాపురము విశ్వనాథరాయోపాధ్యాయుఁడును గలిసి దానిఁ బద్యరూపమున యథామూలముగాఁ దెనిఁగించుట భాషకుఁ బరమోపకారము సేసినట్లే. వీరి పద్యకావ్యములోఁ జాలభాగము మూలముతోఁ బోల్చి చదివినాఁడను. అర్థగాంభీర్యము, భావరసవిశేషములు, చరిత్రాంశములు చెడిపోక రసవంతముగా వీరు దీని రచించి రనుట నిస్సంశయము. అనేకపద్యములు సంస్కృతము నుండి యనువాదము లని తోఁచక యిది మూలగ్రంథమువలెనే కవితాప్రౌఢిమ వహించి విలసిల్లుచున్నది. ఇట్టిరచన చాలదుర్ఘటము. భావికాలమున నింకను రసవత్తరము లగుసంస్కృతకావ్యములఁ దెనిఁగించియైనను నూతనముగా నాంధ్రమున నిర్మించియైనను వీరు శాశ్వతకీర్తిఁ గాంచుచు భాషామహాసేవ సేయుటకుఁ దగినకవితాశక్తి వీరిలోఁ గల దని యీగ్రంథ ముద్ఘోషించుచున్నది. ఇట్టి గ్రంథమును బలువు రాదరించి ప్రచురింపఁ జేయుదురుగాక యని నా ప్రార్థనము. వీరలకు సర్వేశ్వరుఁడు కీర్త్యాయురారోగ్యము లొసంగి వీరిజన్మజీవితములు లోకమున కుపకరించునట్లు సార్థకము సేయుఁగాక యని వేడుచున్నాను.

తిరుపతి
22-1-1948

కళాప్రపూర్ణ
బ్ర॥ శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు

వనపర్తి సంస్థానవాస్తవ్యులు శ్రీ విశ్వనాథరావుగారు, శ్రీ లక్ష్మణశాస్త్రిగారు- వారు స్వయముగఁ దెలిఁగించిన గ్రంథమును, విక్రమాంకదేవచరిత్రమును, హృద్యముగాఁ జదివి వినిపింపఁగా విని తనిసితిని. మహాకవి బిల్హణుఁడు, చాళుక్యవిక్రమాంకదేవునాస్థానమున నెలకొని నేఁటి కించుమించు వేయియేండ్లకు ముందు, తుంగభద్రా - కృష్ణాతీరాంధ్రదేశపుఁ బాఁడిపంటల ననుభవించి వెలయించిన మహాకావ్యమును, నానాఁటి యాంధ్రదేశ చరిత్రాత్మకము, నగు విక్రమాంకదేవచరిత్రమును వీరు పద్యరూపమునఁ బరివర్తింపఁ బూనుటే మిక్కిలి కొనియాడఁ దగినది. బిల్హణరచనము ప్రాయికముగా వర్ణనాత్మకము, శబ్దాడంబరప్రధానము- కాళిదాసాదులరచనలవలెఁ బ్రతిపదరసస్యంది గాదు. అట్టి దానిని దెనిఁగించుట కష్టసాధ్యము- అయినను నిర్దుష్ట మగుభాషతో శయ్యాసారళ్యముతో వీ రీగ్రంథమును దెలిఁగించిరి. వడిగా దీనిని వీరు ప్రకటింతురుగా కని కోరుచున్నాను. ఆంధ్రు లభిమానింపవలసినగ్రంథ మిది.

తిరుపతి
22-1-1948

వేటూరి ప్రభాకరశాస్త్రి

---

కళాప్రపూర్ణ-కావ్యస్మృతితీర్థ-అభినవాంధ్ర వాల్మీకి
బ్ర॥ శ్రీ జనమంచి శేషాద్రిశర్మగారు

బ్రాహ్మ్యరాజ్యోభయశ్రీవిరాజమానులు వనపర్తిసంస్థానవిద్వాంసులు సాహిత్యశిరోమణి కప్పగంతుల లక్ష్మణశాస్త్రులుగారును మాదిరాజు విశ్వనాథరావుగారును గలిసి విక్రమాంకదేవచరితము మహాకవి బిల్హణకవికృతము నాంధ్రీకరించిరి, ఇది పదునెనిమిదిసర్గములు గల ప్రౌఢకావ్యము. ఈయాంధ్రకృతి కవిద్వయముముఖమునఁ జెక్కుటావుల వినుభాగ్యము నాకుఁ గల్గినది, వీరి కవితాధార హిమవన్నగశృంగనిస్సరన్మందాకినీప్రవాహమువలెఁ బరమపావనమై యలరారుచున్నది. సంస్కృతాంధ్రములు రెండును సమానముగ నీకావ్యమున వెలయుచున్నవి. కవిత్వము సహజగాంభీర్యముఁ గలిగి వెలయు



చున్నది. ఈకాలమున నిట్టికవిత యున్నదే యని యచ్చెరువు నొందుచున్నాను. ఈకృతి యాంధ్రదేశమునందు వ్యాపించి యీకవుల నిర్మలయశశ్చంద్రికల వెదఁజల్లుఁగాత మని వారల కోరుచున్నాను. వీ రింకను నిట్టియుత్కృష్టగ్రంథముల వ్రాసి త్రిలింగదేశవిఖ్యాతినిఁ బెంపొందింతురుగాత మనియు, సర్వేశ్వరుఁడు వీరి కాయురారోగ్యభాగ్యముల నొసంగుఁగాత మనియు నాశీర్వదించుచున్నాను. భావకవులకు గుండెగాలముగా నున్న యీమహాకావ్యము ప్రాచీనకవులఁ దలపింపఁ జేయుచు నిల నాచంద్రతారార్కము వెలయుచుండుఁగాత.

శ్రీ లలితావిలాసము
కడప
16-1-1948

జనమంచి శేషాద్రిశర్మ

---

శ్రీ మన్మహామహోపాధ్యాయ-కళాప్రపూర్ణ-కవిసార్వభౌమ-కవిరాజ-ఆంధ్రవ్యాస-
అభినవ శ్రీనాథ-వేదవిద్యావిశారద
బ్ర॥ శ్రీ॥ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు

ఇది సంస్కృతభాషలోఁ బ్రసిద్ధిం గాంచిన బిల్హణకవి రచించినమహాకావ్యము. ఈకావ్యమును నైజామురాష్ట్రమందలి వనపర్తిమహారాజావారి సంస్థానమందుఁ బండితులై యున్న శ్రీ కప్పగంతుల-లక్ష్మణశాస్త్రిగారు, శ్రీ మాదిరాజు-విశ్వనాథరావుగారు ననుకవు లిద్దఱుం గలిసి యాంధ్రీకరించి యున్నారు. లక్ష్మణశాస్త్రిగారు బహుభాషాప్రవీణులు, పండితులు, కావ్యనాటకాలంకార సాహిత్యము, వ్యాకరణములం జదివి యున్నారు. విశ్వనాథరావుగారు సంస్కృతాంధ్రసాహిత్యములేకాక బహుభాషాపండితులై కొన్ని కొన్ని లలిత కళల యందు నేర్పరులై కొనియాడఁ బడుచున్నవారు. అట్టివా రిర్వురుం గలిసి దీనికిఁ గర్తలైరి.

ఈ యాంధ్రానువాదమును నేను జాలభాగము విని యున్నాఁడను. అక్కడక్కడ సందేహములు కలిగినపట్టున మూలముతోఁ బోల్చి చూచి యున్నాఁడను. ఈయనువాదము మూలమునకు సరిగా నున్నది, ఇందు ధారాశుద్ధి చక్కనిది. గ్రంథము గంగానదివలెఁ బ్రవహించుచుండును. కొన్నిఘట్టములు అచ్చతెనుఁగుపద్యములు గలిగి యున్నవి. గ్రంథము క్లిష్టార్థసంఘటితము

గాదు. ఇందలిసంస్కృతసమాసములు సరసములుగాను మనోహరములుగాను నుండును. బిల్హణునిసంస్కృతకవిత్వ మెంతమనోహరమో వీరితెలుఁగుకవిత్వము నట్లు మనోహరముగా నున్నది. ఈతెలుఁగుగ్రంథమును వినునప్పుడు నాకుఁ గృష్ణదేవమహారాజకృతవిష్ణుచిత్తీయము జ్ఞప్తికి వచ్చినది.

వీరియాకవిత్వము నిర్దుష్ట మై పూర్వకవిమార్గమునకు లవమాత్రమైనను దొలంగి యుండ లేదు. ఇది బి. ఏ , ఎం. ఏ. పరీక్షలకుఁ బఠనీయగ్రంథ మైనచో విద్యార్థు లెంతయో వివేకవంతు లై విజ్ఞానముం గలిగి యుందు రని నా నమ్మకము.

వీ రీగ్రంథమును మక్కికిమక్కిగాఁ దెనిఁగింపక అక్కడక్కడ వీరిమార్గము లిందుఁ జక్కగాఁ బొందుపఱచినారు.

ఇది సర్వజనగ్రాహ్య మై సర్వోన్నతిం బొందుఁగాక యనియుఁ గర్త లైనవా రిద్దఱు నిట్టిమహాగ్రంథములు మఱికొన్ని వ్రాసి యాంధ్రభారతి నలంకరింతురుగాక యనిఁ గోరుచున్నాను.

రాజమండ్రి
30–6–1943

---

తింకవీంద్రఘటాపంచానన-కళాప్రపూర్ణ-శతావధాని-

బ్ర॥ శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు

(తిరుపతి–వేంకటకవులలో నొకరు)

పై నుదాహరించినబిల్హణమహాకవివిరచిత మైనకావ్యమును వనపర్తి నివాసులు, శ్రీయుత మాదిరాజు విశ్వనాథరావుగారు, కప్పగంతుల లక్ష్మణ శాస్త్రిగారు, వీరుభయులును జంటకవులుగా నుండి యాంధ్రీకరించిరి. కొన్ని ఘట్టములు కేవలాంధ్రముగా నుండునట్లుకూడ ననువదించిరి. అనువాద మైనను స్వతంత్రరచనముగా నున్నయది

ఉ॥ వ్యాకరణమ్మునం గలుగు ప్రజ్ఞయు సాహితియందు నుండును
శ్రీకళ తక్కుగల్గినవిశేషము వీరికవిత్వమందు విం
దై కనుపట్టు చున్నవి మహాకవు లంటకుఁ దగ్గవీరు స
ద్ధీకులు సర్వథా యశముఁ దేకువయున్ గణియంత్రుగావుతన్.



అందఱకును వ్రాయుమాటలు-'ధార ధారాళముగా నున్నది'-లోనైనవి వ్రాయవలసినకవిత్వము వీరిది కా దని కవితామర్మజ్ఞులు తెలిసికోఁ గల రని నాదృఢ మైననమ్మిక. విద్యాశాఖవా రీయనువాదమును దప్పక యాదరించి వీరికిఁ దోడ్పడుదు రనియు నాయాశయము. వీరిని భగవంతుఁడు సర్వదా శ్రేయఃప్రదుఁ డై యనుగ్రహించుఁగాక.

క్షీరసాగర బిల్డింగ్సు
బెజవాడ
2–6–1943

వెం॥ శా॥
శతావధాని

---

కళాప్రపూర్ణ

బ్ర శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు

సంస్కృతమున బిల్హణమహాకవి రచియించినవిక్రమాంకదేవచరిత్ర యనుమహాకావ్యమును వనపర్తిసంస్థానపండితు లైన బ్రహ్మశ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారు మాదిరాజు విశ్వనాథరావుగారు ననుమహాకవు లిద్దరు పద్యకావ్యముగఁ దెనిఁగించిరి. ఆగ్రంథమందలికొన్నిభాగములు నేను వింటిని. ఇది సలక్షణ మై శ్రావ్య మైనభాషతో రచియింపఁ బడినది. కవిత్వము మృదు వై మనోహరముగా నున్నది. ఈ గ్రంథము శ్లాఘాపాత్రముగా నున్నది. ఈగ్రంథము మూలము ననుసరించి యెంతో నేర్పుతో వ్రాయఁ బడినది.

కాకరపఱ్ఱు
తణుకుతాలూకా
30–5–1943

---

కళాప్రపూర్ణ

ఆచార్య బ్ర॥ శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు

శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారును శ్రీమదిరాజు విశ్వనాథరావు గారును గలిసి రచియించినవిక్రమాంకచరితమును జదివి యానందించినాను. భాషయుఁ గవితాశైలియు మనోహరములు. ఈగ్రంథము పాఠకులహృదయ మాకర్షించు చున్నది. ఈకృతి ముద్రిత మై యాంధ్రవాణి కొకయలంకార మగుఁగాక.

అవధాని శిరోమణి–మహోపాధ్యాయ–కళాప్రపూర్ణ

**మధ్వ శ్రీ కాశీకృష్ణాచార్యులుగారు**

క॥ సమలక్షణ వై శివిటో,
సమలక్షణవిశ్వనాథసంభవ వగుటన్;
విమలం బగునీవృత్తము
సమ మగుఁ బూర్వకవివృత్తసరణికి ధరణిన్.

క॥ నవకవు లొకరిర్వురు నిన్
ఆవి చూడక యున్న నీప్రశస్తతఁ దలపై
న వహించెదుకవిసారస
భవు లుండక పోవ రోప్రబంధమ! యెపుడేన్.

ఉ॥ భాసురవాక్యమత్కృతి, సుధావసమంచితఁ, జిత్రపాదవి
న్యాసవిలాసఁ, బ్రౌఢకవితాంగనఁ, గుత్తుకఁ గట్టికొట్టి రిం
తాసయొ! "శాస్త్రసమ్మతమె యయ్యెది"! యం చనరాదు; శారదా
శాసన 'మెంట దాని నవశాస్త్ర మనం గల రెవ్వ రోకవుల్ !

గుంటూరు
4-6-1943

---

**ఆచార్య సర్ కట్టమంచి రామలింగారెడ్డిగారు కే. టి. (ఆనర్స్) డి. లిట్.**

శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారును మాదిరాజు విశ్వనాథరావుగారును గలిసి ప్రబంధరూపేణ తెనిఁగించిన–బిల్హణకృత – విక్రమాంకదేవచరిత్రమును శ్రీశాస్త్రిగారు చదువఁగా విని ఆనందించితిని. ఇదివరలో విక్రమాంకదేవచరిత్రము పద్యరూపమున ఆంధ్రములో నవతరించి యుండ లేదు. ఈలోప మీకవులకృషిచేఁ బూరిత మైనది.

వీరి ఆంధ్రీకరణము నిర్దుష్ట మైనమంచిశైలిలోఁ జేయఁ బడి యున్నది. ఈ కవులు ఉభయభాషాప్రవీణు లగుటవలన, ఆచ్ఛికమునను, తత్సమమునను రెంటను మనోహరముగ వ్రాయుట సంభవించినది. ఇది సర్వవిధములఁ బ్రశస్త మైనగ్రంథము. అందఱుఁ జదువఁ దగినది.

చిత్తూరు
4-1-1944



కళాప్రపూర్ణ

**ఆచార్య డా॥ చిలుకూరు నారాయణరావుగారు, ఎం. ఏ., పి. హెచ్-డి.**

వనపర్తి సంస్థానవిద్వత్కవీంద్రులు బ్రహ్మశ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి, మాదిరాజు విశ్వనాథరావులచే రచితమయిన విక్రమాంకదేవచరితకృతిని వినుభాగ్యము నాకుఁ గలిగినది. ఈకావ్యము ప్రబంధకవితకు లక్ష్యప్రాయముగ నున్నది కావ్యబంధము చక్కఁగఁ గుదిరినది. అనర్గళధారాశోభిత మై ఔచితీబంధుర మై యొప్పునీకావ్య మాంధ్రభారతీకంఠహారమున నొకయమూల్యరత్న మై వెలుఁగొందుఁగాక. ఇప్పటిఖండకావ్యయుగమున నిట్టియఖండకావ్యములు పొడచూపుట ఆంధ్రకావ్యసంప్రదాయపునఃస్మరణమునకుఁ దోడ్పడి, యానందహేతు వై యొప్పు నమటకు సందేహము లేదు. కృతికర్తలకు నామనఃపూర్వకాభివందనము లర్పించు చున్నాను.

అనంతపురము
31-8-1946

---

**ఆచార్య శ్రీమాన్ కొమాండూరు కృష్ణమాచార్యులుగారు, ఎం. ఏ.**

బ్ర॥ శ్రీ సాహిత్యశిరోమణి కప్పగంతుల లక్ష్మణశాస్త్రులుగారు, మాదిరాజు విశ్వనాథరావుగారును గలిసి రచించినయాంధ్రవిక్రమాంకదేవచరిత్రమును గవిపుంగవులముఖమున విని యానందించితిని. విద్వత్కవిత్వము గౌరవడిన యీకాలమున నిట్టిరచనలు పండితహృదయాఽహ్లాదకరము లనఁ దగును. కావ్యశ్రవణోత్తరకాలమున నాకుఁ గలిగినయానందము నీక్రిందిపద్యములలో గ్రంథకర్తలకు వెలివుచ్చి కృతార్థుఁడ నగు చున్నాను.

మ॥ కవితారీతులఁ గాంచి మెచ్చితి; భవత్కావ్యంబు విద్వజ్జన
స్తవనీయం బగు; విక్రమాంకుకథ భాషాకావ్యముం జేయఁగాఁ
గవు లెవ్వారుఁ దలంప రింతకు; వియద్గంగాప్రవాహంబుతో
సవతై మించెను వాగ్విలాసము రసాఽసారప్రకర్షంబుగన్ ॥

క॥ రచియించె సంస్కృతంబున
రుచి పుట్టఁగ బిల్హణుండు రుచిరపుఫణితిన్
రచియించినారు విస్సన
సచివాగ్రణి 'లక్ష్మణార్యశాస్త్రి' తెనుఁగునన్,

గీ॥ రససుధావర్షి యైనగీర్వాణఫణితి
తేనె చిప్పిలు తెనుఁగులతీపిపలుకు
నుభయకవిమిత్రులం దింత యొప్పు చున్కిఁ
దలఁప నూహింప మదికి సంతసము వొడమె॥

క॥ శాసల శైతలు సంస్కృత
వాసనలం గలిసి కావ్యబద్ధము లై భా
షాసతికిఁ గ్రొత్తసొబఁగుల
వేసము లొడఁగూర్చె మీకవిత్త్వవుఁ దెఱఁగుల్॥

గీ॥ మూలమున నొప్పు చుందునమూల్యభావ
సరణి వర్ణనములలోన సడలకుండ
సరసరీతుల ముత్తెంపుసరులఁ బోలఁ
గూర్చినారలు సుకవులగుండె లరుర

గుంటూరు
24-1-1974

---

సహజ విద్వత్కవితా విశారద

బ్ర॥ శ్రీ అనుముల వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు

విక్రమాంకదేవచరిత్ర మనునీకావ్యము సంస్కృతమున బిల్హణుఁ డను ప్రసిద్ధకవిచే రచింపఁ బడినది. ఈమహాకవిచరిత్ర మను పేరఁ గొన్నిపుక్కిటి పురాణముల నాశ్రయించి రచింపఁ బడినబిల్హణీయ మనునాంధ్రకావ్య మొకటి చిరకాలముక్రిందటినుండి మనదేశమున వాడుకలో నున్నది. ఇంతేకాని యాంధ్రులలోఁ బెక్కండ్ర కీయనకావ్యరసాస్వాదభాగ్యము నేఁటివఱకును లభించినది గాదు.



ఈమహాకవి కాశ్మీరదేశసంభవుఁడైనను నేతత్కథానాయకుఁ డగువిక్రమాదిత్యులిరదాంచిత్తుఁ డైన విక్రమాంకదేవచక్రవర్తి క్రీ. శ. 11 వ శతాబ్ది మధ్యమునఁ బశ్చిమాంధ్ర-కర్నాట-మహారాష్ట్రములఁ బాలించినపశ్చిమచాళుక్య వంశజుఁ డగురా జగుటచే నాంధ్రుల కీచరిత్రముతోఁ గొంతసంబంధముగూడ నున్నది.

ఈయుదాత్తకావ్యమును నేఁటికి మామిత్రులు విశ్వనాథరావుగారు, కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారును సలక్షణ మైనచక్కనిశైలిలో నాంధ్రీకరించి యాంధ్రులకృతజ్ఞతకుఁ బాత్రు లైరి.

సంప్రదాయశుద్ధ మైనప్రయోగకౌశలము వెలయుతెలుఁగుసుడికారమునకు గొరంతయుఁ గొఱంత రానివిధమున వీరు రచించిన యీయాంధ్రానువాదకావ్యము స్వతంత్రకృతియో యనునంతమనోజ్ఞముగా నున్నది.

పరమేశ్వరుఁడు వీరికిఁ జిరాయురారోగ్యభాగ్యములు ప్రసాదించి యేతాదృశకృతిరత్నరచనమునకు నిరంతరముఁ బ్రోత్సహించు చుండుఁగాత మని నాప్రార్థన.

కర్నూలు
3-1-1944

---

అవధాని పంచానన-కవిసింహ-కావ్యకళానిధి

బ్ర॥ శ్రీ డి. రాజశేఖరశతావధానిగారు

చ. మణులను స్వర్ణమున్ గలిపి మంచినగన్ రచియించినట్లు బి
ల్హణకవి విక్రమాంకవసుధాఽధిపుసచ్చరితన్ రచించె; నా
గుణనిధికావ్య మిద్ధ తెలుఁగున్ బొనరించిన 'విశ్వనాథ-ల
క్ష్మణ' కవులార! సర్వబుధసన్నుతి గుత్తకుఁ గొంటి రెంతయున్.

శా. అన్నా! లక్ష్మణ! విశ్వనాథ! భవదీయం బైన పాండిత్యమున్
విన్నాణంబు కవిత్వవైభవము మున్ విన్నంత కిన్నాళునున్
మున్నాళ్లంతలుగా నెసంగి కుతుకంబున్ బెంచె! ముద్రించి మా
కెన్నం డిత్తురొ విక్రమాంకచరితం బెల్లప్డు వీక్షింపఁగన్.

మ. ఒకచో దీర్ఘసమాసముల్ నడువఁగా నొండొక్కచో నచ్చతె
ల్గొకచోఁ గోమలసంస్కృతాంధ్రగతితో నొప్పారి మీశైలి, మా
తృక పీఠింపనివారి కందలిరసోదీర్ణప్రభావప్రథల్
సకలంబున్ విశదంబు చేయు ననుటల్ సత్యంబు ముమ్మాటికిన్.

మ. వదునార్వందలపెద్దసంస్కృతపుఁగావ్యం బెత్తి యాంధ్రంబునన్
గొదవల్ చొప్పడ నీక దొడ్డకృతిగాఁ గూర్పంగ సామాన్యమే!
అది మీయిర్వుర కబ్బె మిత్రమణులారా! నాదుప్రేమాంజలిన్
ముద మారన్ గొని దేశమెల్లఁ యశంబున్ బెంచి శోభిల్లుఁడీ!

ప్రొద్దుటూరు
6-1-1944

శ్రీ. రాజశేఖర శతావధాని

---

విద్వత్కవి
బ్ర॥ శ్రీ మేడవరం రామబ్రహ్మశాస్త్రిగారు

సంస్కృతాంధ్రసాహిత్యపరిశ్రమమునం దుల్లాదరంబు లేమి నెగుడు దిగు డై స్వప్రతిభ మందీభవించుట నెఱుంగక యులుసుపోకమాత్రమ ఫలితం బుగాఁ గావ్యరచనంబునకుం గడంగుచుండు కవులయం దప్రౌఢియుఁ గొందఱయం దతిప్రౌఢియుఁ గాన నై సహృదయహృదయాందోలనముం గూర్ప వికృత మై సన్నగిలినయాంధ్రకవితాసామ్రాజ్యముకొఱంతఁ దీర్ప సంస్కృతవాఙ్మయమునందలికావ్యసంపద నుచితగతి నాంధ్రభారతికిం గూర్చు తలంపు మిక్కిలి వినుతిపాత్రము. ఈయాచారము నేటిదేకాక శ్రీనాథాదిమహాకవులకును బ్రహతమార్గమే.

నేఁడు వనపర్తిసంస్థానవిద్వాంసు లై యుభయభాషాపండితశిరోమణు లైన, శ్రీ, కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారును, శ్రీమాదిరాజు విశ్వనాథకవి వర్యులును బ్రాచీనసంస్కృతకవితిలకులలోఁ బ్రథితకీర్తి బిల్హణకవీంద్రుఁడు రచించిన విక్రమాంకదేవచరితంబు నాంధ్రీకరించుట ముదావహము. వీరుభయులును స్వరచిత మగునీగ్రంథరాజమునఁ బెక్కురసవద్ఘట్టములను వివిధవర్ణన భాగములను వినిపింప విన నబ్బుట మహాభాగ్యము. తదాకర్ణనంబున నాకొదవినయుత్సాహమును, దదభినందనరూపమును, సహృదయసంప్రార్థనా రూపము నగు నీదిగువ పద్యద్వయమున వెల్లడించికొను చున్నాఁడను.



మ॥ పదచాతుర్యము నర్థసంగతి రసప్రాచుర్య మౌచిత్య సం
పద భావోన్నతి వర్ణనప్రతిభ శాబ్దప్రక్రియాప్రాభవం
బుదితాలంకృతి వ్యంగ్యవైభవము నేయోజం గనన్ లేవ యే
కొదవల్: బిల్హణకావ్యవైఖరికి మీకుం బెల్లె నాంధ్రీకృతిన్.

చం. సుకవులు మెచ్చ సాధుపటుసూక్తుల లక్ష్మణశాస్త్రి - విశ్వనా
థకవులు విక్రమాంకచరితం బల బిల్హణకావ్యభక్కి వీ
డక తెలిఁగింపఁ బూనినకతంకఁ గృతార్థతఁ బొంది రౌర! త
త్సుకృతిసుధాంశుచంద్రికలఁ దొక్కరె యాంధ్రసుహృచ్చకోరముల్.

కర్నూలు
8-1-1944

మేడవరం రామబ్రహ్మశాస్త్రి

---

కవిసార్వభౌమ
శ్రీ అచ్యుతుని వేంకటాచలపతిరావుగారు

గీ. సల్లలిత సంస్కృతపదాలచల్లఁదనము
తొల్లి తెల్గుకై తలతేఁటతెల్లఁదనము
పల్లవగ్రాహిపాండిత్యవల్లభులను
తల్లక్రిందుగ నాడించుమల్లబలము
'విశ్వనాథ-లక్ష్మణశాస్త్రి' విహితకావ్య
విక్రమాంకచరితలోన వెలయు చుండు,

(మకాం) కొల్లాపురము
1-12-1941

అచ్యుతుని వేంకటాచలపతిరావు

---

ఆచార్య శ్రీ తొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు. ఎం. ఏ.

రసభరిత మై, ధ్వనిగర్భితమై, ఔచిత్యసమన్విత మై, సౌందర్యసందీపిత మై, ఉదారాశయప్రదీప్త మైనకావ్యసృష్టి గావించినవారిలో సంస్కృతకవులు

జగతియందు అద్వితీయు లని ఋజువు చేయ వచ్చును. గురుగుణాన్విత మైన సంస్కృతవాఙ్మయము ఇట్టిరచనముతో విలసిల్లునదిగావున జ్యోతిర్మయ మనఁ బఱఁగినది.

అట్టిసంస్కృతమహాకవులలో బిల్హణమనీషి యొక్కఁడు. ప్రాచీనకవుల వలెఁ బురాణగాథలపై నతఁడు మనసు నిలుప లేదు. దేశచరిత్రపైఁ గన్నుంచి నాఁడు. కావ్యసృష్టికిఁ బురాణములు సహకారు లైనట్లు చరిత్రలు కావు. అతిలోకచిత్రములను, ఇంద్రజాల-మహేంద్రజాలములను జారిత్రికసంఘటన ములందు జొనుపుటకై యేకవియును సాహసింప రాదు.

మహాకావ్యలక్షణముల నెఱిఁగినకవీంద్రుఁడు బిల్హణుఁడు. 'విక్రమాంక దేవచరిత' మనఁ బఱఁగినను నీతనిగ్రంథము చరిత్ర కాక 'కావ్య' మనియే తెలుపఁ దెల్లును. భావనాశక్తికిఁ బరిశీలనానుభూతులు తో డైనప్పుడు కవిత్వము ఘనతరప్రభావముతోఁ బరిఢవిల్లును. కథాంశములకు నాటపంది తైనతావులందు మసలి వానిని బరిశీలించియే బిల్హణకవి 'భావాంబరవీథీవిశ్రుతవిహారి'యైనాఁడు.

కళోపాసకు లైనశ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారును శ్రీమాదిరాజు విశ్వనాథరావుగారును రచియించిన ఆంధ్ర 'విక్రమాంకదేవచరితము'ను బఠించు భాగ్యము నాకుఁ గలిగినది. విశేషకౌశలముతో వీరు బిల్హణకృతి నాంధ్రీకరించిరి. కృష్ణరాయల యాస్థానమున నున్నట్లు భావించి వీ రీగ్రంథమును రచించిరి. రాయలు రచించిన 'ఆముక్తమాల్యద' తక్క దీని కీ డైనకృతి మఱియొకటి ఆంధ్రవాఙ్మయమునందు లే దని ముక్తకంఠముతోఁ దెలుపవచ్చును. ఈనాలుగు శతాబ్దులలో దీనిని బోలు మహాప్రబంధము ఆంధ్రజగతిలోఁ బుట్ట లే దనుట అతిశయోక్తి కాదు.

గ్రంథము గంభీరభావవిలసిత మై, సర్వాంగసుందర మై యొప్పు చున్నది. సౌష్ఠవ-మాధుర్యములు మేలియుక్తితో నిండలికై లియందు వెలయు చున్నవి. పయంకిలి నెఱుఁగక సరి త్తిలకమువలె నీకావ్యమందలి కవిత యొప్పు చున్నది.

సారస్వతాంగణమునఁ దప్పటగు లిడువారు ఈగ్రంథమహత్త్వమును గుర్తింప లేరు. సాహిత్యాశయములను హృదయంగమ మొనరించుకొని కావ్యలక్షణముల నెఱిఁగినవారు విజ్ఞానదృష్టిని, విశాలదృష్టిని నలవఱచుకొనిన వారు ఈగ్రంథమును బఠించి, యిందలివరమార్గమును గ్రహించి యాశ్చర్యానందముల నోలలాడెదరు.



విశ్వవిద్యాలయములందు ఉన్నతపరీక్షలకై యిది పాఠ్యగ్రంథముగా నుండఁ దగినది.

తెలుఁగుతల్లి చల్లఁగా నున్నంతకాలము, ఆంధ్రశారద మని యున్నంత కాలము ఈకృతి అవనియందు వఱలు నని నేను విశ్వసించు చున్నాను.

(ముకాము) వనపర్తి
1-6-1947

---

కవితిలక-కవితావిశారద-విద్వాన్

## ఆచార్య శ్రీమతి కాంచనపల్లి కనకమ్మగారు

సంస్కృతమహాకవిసార్వభౌములలోఁ బ్రథితకీర్తి యగుబిల్హణమహాకవి రచించినవిక్రమాంకదేవచరిత మనుచాళుక్యనరేంద్రచరితరూప మైనమహాప్రౌఢ ప్రబంధము 18 సర్గలు గలిగి 2000 శ్లోకములతో నున్నది. దానిని మహాకవులు, వనపర్తిసంస్థానపండితులు నగు-బ్రహ్మశ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారును, మాదిరాజు విశ్వనాథరావుగారును జంటకవులుగా మిక్కిలి కష్టించి సుమారు 2000 పద్యములు గలప్రౌఢప్రబంధముగ రచించి యున్నారు.

ఔచిత్య ముట్టిపడుపదముల, జాతీయముల, నలంకారముల నీకవులు చేర్చి కూర్చుటలో నఖండప్రజ్ఞ కలవారు. నిరర్థకపదరాహిత్యనిర్దుష్టత, ధారాశుద్ధి గనఁ గాఁ బ్రాచీనకవిత్వమునకుఁ దీసిపోవక యిది యున్నది. ఇట్టియుత్తమగ్రంథము లిప్పట్టునఁ జాల యవసరము. కళాశాలలందు బి.ఏ. ఎమ్. ఏ. విద్వాన్ మొదలగు తరగతులఁ జదువువిద్యార్థినులకు, విద్యార్థులకు దీనిని బఠనీయగ్రంథముగ నిర్ణయించి దేశక్షేమ మొనగూర్తురుగాక యని యాశించు చున్నాను.

కనకప్రాసాదము
బెజవాడ
20-10-1943

## ఆచార్య శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు

బ్రహ్మశ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారును, శ్రీ మాదిరాజు విశ్వనాథరావుగారును గలిసి యాంధ్రీకరించినవిక్రమాంకదేవచరిత మనుప్రౌఢ కావ్యమును రెండుతడవలు విని యానందింపఁ గలభాగ్య మబ్బినది.

బిల్హణకవివిరచిత మయినవిక్రమాంకదేవచరితము సంస్కృతమునందలి ప్రౌఢకావ్యములలో నొకటి. ఆంధ్రీకృతకావ్యము శబ్దార్థాలంకార-సమాసభూయిష్ఠ మై చక్కనిశయ్యాపాకములఁ బడి మిగులఁ బ్రౌఢ మై సంస్కృతకావ్యమున కన్నివిధములఁ దీటు వచ్చుచు మనస్సు నలరించు చున్నది. రచయిత లుభయులును నుభయభాషాపారంగతులును, కవితారహస్యవేదులును. వారికి సంస్కృతమునవలెనే అచ్చతెనుఁగునను మంచిపాండిత్యమును బ్రజ్ఞయుఁ గలవు. కేవల మచ్చతెనుఁగున వ్రాసినప్రకరణములే యిందుకు నిదర్శనము. గ్రంథకర్తల కవితాధార అనర్గళ మయినది. ఆంధ్రీకరణమైనను దెనుఁగుకావ్యము హృద్యముగ నుండి యది స్వతంత్రగ్రంథమే యనిపించు చున్నది. ఇది పశ్చిమచాళుక్యజననాథుఁడును, కళ్యాణపురవరాధీశ్వరుఁడును నయిన విక్రమాదిత్యునికి సంబంధించినచరిత్రగ్రంథ మగుటచేత నా కింకను బ్రియ మయినది.

ఇటీవలనే శ్రీమాదిరాజు విశ్వనాథరావుగారు స్వర్గతు లైనట్లు విని విచారించినాము. శ్రీలక్ష్మణశాస్త్రిగారు మిత్రవియోగవ్యథవలన నిరుత్సాహులు కాక యింకను నిట్టియుత్తమకావ్యములు రచించి యశస్సు నార్జింపవలె నని కోరు చున్నాము.

మల్లంపల్లి సోమశేఖరశర్మ

మద్రాసు
25-10-1949

---

### ఆచార్య బ్ర॥శ్రీ కురుగంటి సీతారామయ్యగారు, ఎం. ఏ.

శ్రీ లక్ష్మణ-విశ్వనాథకవులచే విరచిత మయినవిక్రమాంకదేవచరిత్రయొక్క యాంధ్రీకరణమునందలిచాలపద్యములు శ్రీలక్ష్మణకవిగారు దయతో



వినిపింపఁగా వింటిని. ఆంధ్రీకరణము చాల సంతృప్తికరముగ నున్నది. సుప్రసిద్ధపండితులును, పరిశోధకులును, చారిత్రికులును నగుశ్రీమానవల్లిరామకృష్ణకవిగారిమన్నన నీగ్రంథము వడసిన దన్న దీనిప్రాశస్త్యము వేఱుగాఁ జెప్ప ననావశ్యకము. చారిత్రకప్రఖ్యాతి గల యీగ్రంథము తెనుఁగున ననువదింపఁబడుట మిక్కిలి ముదావహము. ఈగ్రంథము తెనుగుతల్లి కొకయమూల్యాభరణము. ఏతద్రచయితలకు నాహృదయపూర్వకాభివాదములు.

హైదరాబాదు
28-6-49

---

న్యాయశిరోమణి

### శ్రీమాన్ వేదాంతతిరువెంగళాచార్యులుగారు

శ్రీయుతులు కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారు మాదిరాజు విశ్వనాథరావుగారు, వీరుభయులు గలిసి తెలుఁగులోనికిఁ బరివర్తించినవిక్రమాంకదేవచరితమును బిల్హణకృతమును ముమారుగాఁ జాలవరకు విని సంతసించితిని. మూలములోని భావములను సుపరిచితము లగుపదములతోఁ బ్రౌఢబంధమున నలవరించి యనర్గళ మగుధారతో నాస్వాదనీయములుగా నొనర్చినవీరికవిత మిక్కిలి ప్రశంసాపాత్ర మైనది.

శ్లో॥ పరిచితపదజాలైః ప్రౌఢయా బంధరీత్యా
మధురమధురభావాన్ బిల్హణస్యాఽత్తకీర్తేః।
వయమనుపమధారాధోరణీసారపూరే
కవియుగపరివర్తే స్వాదు చాఽస్వాదయామః॥

శ్లో॥ అచ్ఛాంధ్రీభారతీధారాపూరితేఽపి ప్రఘట్టకే।
సౌష్ఠవౌదార్యయో రమ్యం విద్మహే వినివేశనమ్।

గుంటూరు
24-1-1948

వేదాంతి తిరువేంగళాచార్యులు

---

విద్వత్కవి శిరోమణి

**శ్రీమాన్ బుక్కపట్టణం అణ్ణయాచార్యులుగారు**

శ్లో॥ రసభావాలంకృతిగుణశయ్యారీత్యాదిభిస్సమాకలితమ్ ।
మృదుగంభీరపదాంచితమనవద్యం రసికజనసమాస్వాద్యమ్ ॥

శ్లో॥ శ్రీవిశ్వనాథ-లక్ష్మణకవివరయుగళీవినిర్మితం కావ్యమ్ ।
శ్రీవిక్రమాంకచరితం ద్రాక్షామధురం సమక్షమద్రాక్షమ్ ॥

శ్లో॥ రసలహరీభరితేఽస్మిన్ కావ్యాబ్ధౌ తృష్ణయా నిమగ్నోఽహమ్।
ఆత్మానం రసతుందిలమనీశ ఏవాభవం సముద్ధర్తుమ్ ॥

బుక్కపట్టణ అణ్ణయాచార్యః

వనపర్తి
25-12-42

---

**శతావధాని శ్రీమాన్ దూపాటి వేంకటరమణాచార్యులుగారు**

(శేషాద్రి - రమణ కవులలో నొకరు)

శా. ఓ సాహిత్య శిరోమణీ ! రసికలోకోత్సాహసంధానధీ
వ్యాసంగోక్తినిబద్ధవిక్రమకథావ్యాకోచపుష్పంబు నా
కాసక్తిన్ గలిగించె మూలమున విద్యారాశి శ్రీబిల్హణుం
డేసాహిత్యపరీమళం బిడెనొ నాకుం దద్దియే తోఁచెడిన్.

మ. ప్రతిపద్యంబు రసాఽస్పదం బయి తలిర్పన్ బిల్హణోక్తిక్రమ
ప్రతిరూపంబుగ నాంధ్రవిక్రమచరిత్రం బీవు నిర్మించి స్వా
దుతరం బైనకవిత్వవైఖరులరీతుల్ చూపినా వద్దిరా !
ప్రతిభాసంపద, సంస్కృతాంధ్రయుగళీపాండిత్య వైచిత్ర్యముల్.

మ. సమరక్షోణిని చోళు గెల్చి జయమున్ సర్వస్వముం గొన్నప
శ్చిమచాళుక్య నృపాలవర్యు విజయశ్రీ విక్రమాదిత్య భూ
రమణున్ బిల్హణుఁ డెట్లు కావ్యమునఁ దీర్పం గల్గె నట్లే మహో
త్తమభంగిన్ వెలిఁగించినాఁడవు ప్రమోదం బయ్యె విద్వత్కవీ !



మ. కవితాచాతురి వర్ణనాతిశయముం గావ్యంబులో నింపె స
త్కవిచూడామణి బిల్హణుం డిది చరిత్రం బౌట మూలానుసా
రవిధిన్ దెల్గొనరించి వాఙ్మయమునన్ రత్నాలవంటన్ సుధీ
నివహార్థంబుగఁ గుప్పఁబోసినకవీ ! నిన్నుం బ్రశంసించెదన్.

సీ. రసవత్తరంబుగా రాజిల్లు వర్ణనాంశ
మ్ములఁ జవుబార సంతరించి,
మూలమందలియర్థమును భావమును నున్న
విధముగాఁ దెలుఁగున వెలయఁ జేసి,
ఒకసర్గమున రసాభ్యుచితశుద్ధాంధ్రభా
షాకవిత్వంబును సంఘటించి,
సమవేగమునఁ జారుశైవలినీవిధం
బున నిరర్గళధార యనువుపఱచి,

గీ. విక్రమాంకచరిత్రంబు వినిచి నాకుఁ
బ్రమద మొనరించి తివు నీ ప్రౌఢకవిత
నన్ను నలరించె నోరసస్విన్నహృదయ !
సరసవాగ్ధుర్య ! లక్ష్మణశాస్త్రివర్య !

హనుమకొండ
14-2-1949

---

ఆంధ్రపితామహ

**పద్మభూషణ డా॥ మాడపాటి హనుమంతరావుగారు**

మీవిక్రమాంకదేవచరిత ఆంధ్రీకరణమును చదివి ఆనందించితిని. విద్వద్వర్యు లగుతమవంటి వారిగ్రంథమును విమర్శించుటకుఁగాని, దానిపై నభిప్రాయ మొసఁగుటకుఁగాని తగినపాండిత్యము నాకు లేదనునంశము తమకును విదితమే. కనుక పుస్తకమును చదివియు, నిజాంరాష్ట్రవాసు లగుపండితు లగుకవివర్యులలో, బిల్హణాదిమహాకవులసంస్కృతగ్రంథములఁ జక్కఁగ ననువదించువారు కలరని గ్రహించియు నేను ఆనందించితిని.

తమవంటికవియుగ్మము సంస్కృతభాషలోనియుత్తమరత్నములను త్రవ్వి బయటకు దీసి వానికాంతి విద్వత్ప్రపంచమున కందఁ జేయుదురుగాక.

ఆంధ్రకుటీరము
హైదరాబాద్
29-4-47

కవిసామ్రాట్ - కళాప్రపూర్ణ
ఆచార్య బ్ర॥శ్రీ విశ్వనాథసత్యనారాయణగారు, ఎం. ఏ.

శ్రీమాఁ విశ్వనాథరావుగారును శ్రీ క॥ లక్ష్మణశాస్త్రిగారును విరచించిన విక్రమాంకదేవచరిత్రమును వారు చదివి వినిపింపఁగా విన్నాను. వారిరచన మధురముగా నున్నది. వారిపాండిత్యము కవితాశక్తియు నుత్తమతరగతికిఁ జెందినవి. ఈప్రౌఢకావ్యము తెలుఁగులో ప్రౌఢి చెడకుండ మాధుర్యము చెడకుండ నింతయచ్చెరువు గొల్పునట్లు తెనిగించుట గొప్పప్రతిభను సూచించు చున్నది. వీరిప్రయత్నము సర్వథా ప్రశంసనీయము. వీరికిఁ బరమేశ్వరుఁడు దీర్ఘాయువు నితోఽధికగ్రంథరచనాశక్తియుఁ బ్రసాదించుఁగాత.

బెజవాడ
7-1-47

ఆచార్య శ్రీమాన్ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు

మీవిక్రమాంకదేవచరిత్ర చదివినాను. సుప్రసిద్ధ మైనమీయుభయ భాషాపాండిత్యము అందలిప్రతిపద్యమునందును స్ఫూర్తి కెక్కినది. నిరర్గళ ముగా మీలేఖిని సాగినది. అందువలననే కొన్నియపుణ్ణశబ్దములకుఁ గ్రింద టీకను మీరే వ్రాయ వలసి వచ్చిన దని తలఁచు చున్నాను. ఎట్లును అది పెక్కుచదు వరులకు సహాయకరముగా నున్న దనుట నిస్సంశయము. మూలము నే నెప్పుడో చూచి మఱచినది. కనుకఁ బోల్చి చూచుట కిక్కడ నాకు వీలు లేదు. మఱి మీవంటికోవిదులరచన కావని అనావశ్యకముగదా.

బెంగుళూరు
26-11-73



శిరోమణి
ఆచార్య బ్ర॥ శ్రీ సన్నిదానము సూర్యనారాయణశాస్త్రిగారు పి. ఓ. ఎల్.

పూజ్యమిత్రులు 'శిరోమణి-ఆంధ్రబిల్హణ-సుధీంద్రమౌళి' బిరుదవిరాజమానులు శ్రీకప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారును, కీర్తిశేషులు మిత్రవర్యులు శ్రీమాదిరాజు విశ్వనాథరావుగారును గలిసి యాంధ్రీకరించిన విక్రమాంకదేవ చరిత్రమును జాలకాలముక్రిందటనే వీరివలన విని యానందించితిని. నేనే కాదు, విన్నవాఁడును జదివినవాఁడును ఆనందింప కుండ లేఁడు. ఈ గ్రంథమున కొకరి యభిప్రాయముతోఁ బని లేదు. ఎవరియభిప్రాయమును నీ గ్రంథవిశిష్టతను సమగ్ర ముగా నిరూపింపఁ జాలదు. ఇది తథ్యము. అయినను నన్ను గోరుటచే మిత్రుని మాట కాదనఁ జాలక వ్రాయు చున్నాను.

శృంగారనైషధముపిమ్మట నిట్టిగ్రంథము ఆంధ్రభాషలో వెలువడ లే దని పెక్కుమాఱులు సభలలో నేను వాక్రుచ్చితిని. బిల్హణునికావ్యమును బిల్హణుఁడే తప్ప నితరు లనువదింపఁ జాల రనుట తథ్యము, అనఁగా బిల్హణుఁడే శాస్త్రి గారుగా నవతరించి తనగ్రంథమును దానే యనువదించుకొనెను. కావుననే యనువాదము మూలమున కన్యూనాతిరిక్తముగా సాఁగినది. కావుననే ఇది యనువాదము గాక స్వతంత్రకావ్యముగానే కనిపించు చున్నది.

అతిశేరినరచన. ఇరువురును గావ్యరచనలోఁ జేయితిరిగినవారు.

ఇంకను శ్రీశాస్త్రిగారు సంస్కృతమునుండి యిట్టియుత్తమోత్తమగ్రంథ ముల నాంధ్రీకరించి ఆంధ్రసరస్వతి నారాధింతు రని యాశంసింతును.

44, ఊరా
సికిందరాబాదు
17-2-1974

కళాప్రపూర్ణ-విద్వాన్
ఆచార్య బ్ర॥ శ్రీ దువ్వూరి వేంకటరమణశాస్త్రిగారు

'ఆంధ్రబిల్హణు' లని మహామహత్సభాంతరసీమలందుఁ బెక్కువత్సరము లకు మున్నే పేరు వడసిన 'లక్ష్మణ-విశ్వనాథ' కవిసోదరులు ఆంధ్రీకరించిన 'విక్రమాంకదేవ చరితము'నందలి కొన్ని భాగములు సావధానముగాఁ జదివితిని,

చదివినకొలఁది చవు లూరించు నిందలికవితారీతి కడుంగడు తృప్తి నొందించినది. పురాతనాద్యతనరచనభంగులరామణీయకమును సాకల్యముతో నాకళించిన యీప్రౌఢకవులకూర్పులీరు అన్నివిధములను ననవద్యము. అత్యంతహృద్యము.

కవితామార్గమునకు వలసినదానికంటె అధిక మగువ్యుత్పత్తిని సంతరించుకొని, సాహితీమర్మజ్ఞులై, శాబ్దికశిరోమణులై, ప్రతిభానుభవశాలురయిన విద్వత్కవులరచనములు హృద్యములుగాక యితరము లగుట అసంభవము. అనవద్యము లగుట సహజము. తెలుఁగు-సంస్కృతముల-కలయికలోని-తీరు-తీయముల-సొబఁగుతో నక్లిష్ట మయి పరిణత మయినప్రౌఢశైలితో వెలసినయీకృతి బహుమాన్యత నందఁ గలదు. సందియము లేదు.

ఒక్క విశేషము :

ఈ కవిసోదరులలో 'సుధీంద్రమౌళి' లక్ష్మణశాస్త్రిగారు బహుభాషాప్రగల్భు లగుటయు, వాగ్మిశేఖరు లగుటయు నేఁటివారి కెల్లరకుం దెల్లమయినయంశములు. అవి యటుండ;

వీరు నిగమాఽగమసంప్రదాయనిష్ఠామహనీయ మయిన కప్పగంతుల వంశమున నుదయించినవారు. అసలు వీరు కప్పగంతులవారు కారఁట. కప్పగొంతులవారఁట, వీరి పూర్వులు పెద్దపెద్దగొంతులతో నిరంతరము వేదశాస్త్రముల నావర్తించుచుండెడివారఁట. ఆ ఉదారతారకంఠస్వరములంబట్టి వారికి కప్పగొంతులవా రనుపేరు కలిగినదఁట. ఆగొంతు గంతుగా మాఱినదఁట. ఇది వృద్ధగోష్ఠులలో వినఁ బడునిర్వచనము: వాస్తవికమే కానోపును,

పూర్వపూర్వులసంప్రదాయసంస్కారములు వంశక్రమానుగతము లయి ఉత్తరోత్తరులకు సంక్రమించుట సహజసంపన్నము.

ఇట్టిప్రాక్తనసంస్కారములును, శ్రమించి సమార్జించినకావ్యశాస్త్రాదితత్త్వజ్ఞతాపాటవమును నీకవిసోదరులకవితావాహినిలో నచ్చటచ్చటఁ బ్రతిబింబించుచుండును. అట్టితావులను 'ఇదమిద'మ్మని యెత్తి చూపుటకు నోపిక చాలదయ్యెను. వానినెల్లఁ జదువరులే గుఱుతింపఁ గలరు.

మసకపల్లి
తూర్పుగోదావరిజిల్లా
12-5-1979



కళాప్రపూర్ణ
## శ్రీ తుమ్మల సీతారామమూర్తిగారు
(తలపోఁత)

ఆ॥ వె॥ అలరినాఁడ విక్రమాంక దేవరిత్ర
తీరు సూచి పలుకుసొరు నరసి
తెనుఁగుసేఁతవోఁతెఁ గనిపింప దీకైత
కవులనేర్మి పేర్మి గన్న దగుట.

ఆ॥ వె॥ తెనుఁగు సంస్కృతమ్ము తీయతీయగ రవా
ళించు, నన్నయాఽదు లంచితాంధ్ర
కవులు చన్ననడలు కన్పించు నిం; దిది
యాంధ్రవాణి కుచిత మైనతొడవు.

ఆ॥ వె॥ తావి లేనివిరులఁ దలబరువై తెల్గుఁ
దోఁట క్రుంగి కుములుపూఁటలందు
రసికభోగ్యసౌరభసమృద్ధ మీకావ్య
సుమము విరిసి తల్లిస్రుక్కు దూల్చె.

అప్పికట్ల
గుంటూరుజిల్లా
17-12-1978

---

## బ్ర॥ శ్రీ చతుర్వేదుల అమరేశ్వరశాస్త్రిగారు

మ. జటిలాక్లిష్టపదప్రకృష్టము, విశిష్టప్రౌఢభావార్థసం
ఘటనోత్కృష్టము, పాకపుష్టము, సమీక్షాస్పష్ట. మాఱిల్లెనో
ద్భటవాక్సృష్టము - విక్రమాంకవిభుసచ్చారిత్ర; మద్దాని మీ
కెటు లాంధ్రంబున నోకవుల్ ! పలుక నయ్యెన్ శిష్టజుష్టంబుగన్ ?

మ. సరసంబో, విరసంబో మూలకృతిసంస్థావస్తువిన్యాసవై
ఖరి ; తద్రీతికి భిన్నముండె యగుఁ ద్రేతావద్విమృశ్యంబు; ని
ర్భరనిర్దుష్టవచఃప్రచారరుచి నాంధ్రంబందునన్ దాని క
క్షరనిక్షేపముఁ గూర్చు మీ ప్రతిభ సంశ్లాఘ్యంబహో, సత్కవుల్ !

మ. అనురూపాన్వయభావభవ్యనిజదివ్యశ్యాఖ్యపుంగూర్పుకం
బెను, గట్టా ! యనువాదముం గొలువు బెంతే ప్రాణగొడ్డంబె యై
నను, వళోక్యుక్తుల రౌట బిల్హణకృతిన్ భాషించినా రాంధ్రమం
దున, నో లక్ష్మణ-విశ్వనాథకవిచంద్రుల్ ! మీర ధన్యోదయుల్.

గుంటూరు
20-6-43

---

కళాప్రపూర్ణ

**ఆచార్య శ్రీ మత్తిరుమల గుదిమెళ్ళ వరదాచార్యులుగారు**

శ్లో॥ పణ్డితోఽసౌ కవిర్వక్తా ఆపులభాషాస్వవర్గళః।
'గవ్వగన్తుల' వంశీయో లక్ష్మణాఽర్యో మహాయశాః॥

శ్లో॥ వ్యవహర్తా కవిర్విద్వాన్ ప్రతిభావాన్ యశోనిధిః।
'మాదిరాజు' కులః శ్రీమాన్ విశ్వనాథాఽహ్వాయః కృతీ॥

శ్లో॥ విక్రమాఙ్కస్య చరితం బిల్హణీయమనూద్య తౌ।
ఉపచక్రతురాన్ధ్రాఖ్యాళ్ళ సతాం ప్రీతిం ప్రచక్రతుః.

చిట్టిగూడూరు
మచిలీపట్నం
12-5-1978

---

వ్యాకరణ-సాహిత్య-వేదాంతశాస్త్రమహావిద్వాంసులు

**శిరోమణి ఆచార్య బ్ర॥శ్రీ ఖండవల్లి నరసింహశాస్త్రిగారు**

శ్లో॥ శ్రీవిక్రమాఙ్కదేవప్రభుచరితం బిల్హణాఽర్యకృతిరత్నమ్।
శ్రీవిశ్వనాథ-లక్ష్మణశాస్త్రిభ్యామాన్ధ్రితం యథామూలమ్॥

శ్లో॥ దేశేషు కతిపయేషు స్వచ్ఛాన్ధ్రగిరా క్వచిత్సుసై ర్వ్యాఖ్యా।
వాచా గ్రథితృకవీంద్రాఽన్ధ్రాఽమరవిద్యాయుగేఽతిపాణ్డిత్యమ్॥

శ్లో॥ సన్దర్భోచితపదగణకలనాద్వ్యాచష్టం వివక్షితం లఘుభిః।
వృత్తైర్మహో న్నమర్థం కృతిరఖిదధతీయమాదృతా విబుధైః॥



శ్లో॥ ఆచన్ద్రతారకర్కం పరివర్తు గ్రన్థ ఏష; కవియుగళమ్।
ఏవం కృతిరపూర్వా రచయజ్జయశాత్సుధీశనుతియోగ్యా॥

శ్లో॥ అపూర్వార్థైర్విద్వత్కవిగణమనస్తోషనిపుణైః
సుధాసధ్రీచీనైరలఘువచసాం గుంభనశతైః।
నిబద్ధేయం సమ్యక్కృతిరలమమన్దాం వితరితుమ్
ముదం దోషజ్ఞానామితి భృశమహం విశ్వసిమి హి॥ ర

సీతారాంబాగు
హైదరాబాదు.
సుభాను-భాద్రపద-
కృష్ణ-తృతీయ

---

**బ్ర॥ శ్రీవాజపేయయాజుల రామసుబ్బారాయడుగారు**

గీ. విక్రమాంకుని చరితంబు వేడ్క లలరఁ
జూచినాఁడను దని దీఆఁ జూచినంతఁ
బరవశుఁడ నైతి; మీకవిత్వవిభవంబు
నేర్పుగరిమంబుఁ జక్కగా నివ్వటిల్లె.

మ. అనువాదం బని ధార కుంటు వడ తే దావంతయున్; శైలిలోఁ
గనరా రెందును లోటు; చక్కని ప్రయోగంబుల్ కళాసారముల్
గొని రాజిల్లుచు నుండె; మేటియశమున్ గూర్పంగ నౌ నిద్ధి; యెం
దున 'శ్రీలక్ష్మణ-విశ్వనాథ' కవిచంద్రుల్ కీర్తిసంపన్నులే.

గీ. వ్రాయఁగా నేటికో పెక్కుగ్రంథములను
జాలు యశ మెంతయైనఁ దేఁ జాలునిట్టి
కావ్య మొకఁడైన; విక్రమాంకచరితంబు
పృథ్విలోఁ జిరంజీవి యై వెలయుఁగాత.

స్నేహలతాకవితాసంఘము, కొల్లాపురం,
1-12-1941

మహాకవి

బ్ర॥ శ్రీ గడియారం వేంకటశేషశాస్త్రిగారు.

తే॥ శ్రీనిలయ-వనవర్తి సంస్థాన-విబుధ
మౌళిలక్ష్మణపండిత-మాదిరాజు
విశ్వనాథరాయకవీంద్రవిరచితంబు
వింటి శ్రీవిక్రమాంకపవిత్రచరిత.

చ॥ అతులవచస్వి బిల్హణమహాకవి సంస్కృతకావ్యబంధ మ
ద్భుతకవితామహత్త్వములు పొంపిరి వో రచియించె; దాని సం
గతరసభావశుద్ధి సరిగా నుడివోవనిప్రౌఢశైలి వ్రా
సితిరి తెనుంగుబాస బుధశేఖరు 'లౌ' నని మెచ్చ లాడఁగన్-

మ॥ అనువాదంబునఁ జెక్కుచిక్కులకు లోనై స్రుక్కు చేకాక, శ్రీ
యనిపద్యంబులఁ గన్న మూలకృతి 'నాహా!' యంద్రు, లేకున్న నీ
యనువాదంబున లోప మెంత్రు; కవులారా! యన్నిటిన్ దాఁటి మీ
యనువాదంబు స్వతంత్ర మై యుభయకావ్యశ్రావ్యతన్ గూర్చెడిన్.

చ॥ నవకవితావిలాసము లనంతము లై జనతావినోద హే
తువు లగు; నైనఁ బూర్వకవిధూర్వహధీరగభీరభావబం
ధువులకుఁ బ్రౌఢబంధరసతుందిలతత్కవితాబ్ధిరత్నలి
ప్సువులకు మోదదాయక మవున్ దమకావ్య ముదాత్తవృత్త మై.

చ॥ ఒకయెడ మిమ్ముఁ దీర్చినమహోన్నతసద్బుధవర్యదేశికా-
ళికి వరకీర్తిదాయక, మశీకజనుర్ధ్రువతార, ఆంధ్రభా
షకుఁ బరమోపకారము యశస్యము మీ కృతి యారవిందుతా
రకము బుధోపభోగ్యము చిరం బయి వెల్గెడుఁగాత మీధరన్.

గడియారము, వేంకటశేషశాస్త్రి

ప్రొద్దటూరు
7-1-1944



"వ్యాకరణ విద్యాప్రవీణ", "భాషాప్రవీణ"

ఆచార్య శ్రీ ఖండ్ల వేంకటరమణయ్యగారు, ఎం. ఏ.

ఆర్యా,

మీ 'విక్రమాంకదేవచరితము' నామూలచూడము, మూలముతోఁ బోల్చి చూచుచు శ్రద్ధగాఁ బఠించితిని. సంస్కృతవిక్రమాంకదేవచరిత్రము నందునంబోలె వైదర్భీరీతి మీయనువాదమునందును నాదరింపఁ బడినది. మీ కృతి యనువాదమయ్యును స్వతంత్రకావ్యమువలె రాణించుచున్నది. మూలభావ మేపద్యమునందును గోలుపడ లేదు. మూలములోని యర్థచమత్కృతి, శ్లేషసౌభాగ్యము, పదబంధవైచిత్రియు ననువాదమునందు నతిజాగరూకతతోఁ బొందుపఱుపఁ బడినవి.

ప్రథమాశ్వాసమున ఆహవమల్లుని వర్ణించునెడ రచింపఁ బడినపద్యమున శ్లేషసౌభాగ్యము అధిక మై యున్నది. ఆ పద్యమిది:

తే. గీ. అతఁడు కాలాంబుదశ్యామలాసి, సకల
రాజహంసలఁ దఱిమి తర్వాత నిలక
భోజరాడ్భుజపంజరమున రహించు
కీర్తిహంసినిఁ గూడ దా భేదపఱచు. 1-189

ఇందు 'రాజహంస' శబ్దము శ్లేషానుప్రాణితరూపకము నభివ్యక్తీకరించుచు మూలమునందువలె హృదయము నలరించుచున్నది. 'అంబుద' శబ్దము మనోహరముగాఁ గూర్పఁ బడినది. 'నీటి నిచ్చునది' అనునర్థము అంబుదశబ్దమున నుండుటంజేసి, వానచినుకులు పడిన ఱెక్కలయీకలు జాఱిపోవు ననుభయముచే రాజహంసలు పరుఁగెత్తి పోయిన వనుభావము సమర్థ మై యున్నది. అతని 'అసిమేఘము' రాజహంససముదాయమునకు బాధక మగుటయేకాక భోజరాజ భుజపంజరమునందు నివసించుకీర్తిహంసికిఁగూడ బాధక మగుచున్న దను మూలభావము చక్కఁగా నిర్వహింపఁ బడినది. ఆజిరంగమునఁ బ్రవేశించినరాజు లేకాక యసూర్యంపశ్య లగురాజకాంతలకుఁగూడ నతనిప్రతాపము బాధాకర మనునర్థ మీపద్యమునఁ బ్రతీయమాన మగుచున్నది. భుజపంజర-హంసీ శబ్దములు పరస్పరము సాధువినివేశమును బొంది యున్నవి. అనువాద మెంతేని నాహ్లాదజనకము.

మూలమునందలిపదబంధ మనువాదమునందు ననుసంధింపఁ బడుట మీకృతియందు మఱియొక విశేషము.

కం. బింబారుణమిత్రప్రతి
బింబం బంబునిధిఁ జెంది ద్విరసనవరళ
య్యం బవళించినతపనీ
యాంబరుకౌస్తుభవిలాస మంది యొసంగెన్. (5 ఆశ్వా. 11)

'బింబ', 'బింబం', 'బంబు', 'య్యంబ' ఇత్యాదిగా బిందుపూర్వబకారంబు వృత్త్యనుప్రాసముగా నిర్వహింపఁ బడినది. ఇది యనువాదమునందుఁ బాటింపఁ బడిన మెలకువ.

మూలములోనియర్థచమత్కృతి నీక్రింది పద్యమొక్కటి వెల్లడించుటకు సమర్థము.

తే. గీ. త్రిభువనాంగణదీప మద్దినకరుండు
పవనమానఁబోలె బ్రహ్మచేఁ బ్రళమ మొందఁ,
బ్రబలముగఁ బర్వధూమ్యావరంవర యన
నీలతిమిరవితానంబు నిక్కె నగతి. 1-18

ఇందు బ్రహ్మచే నన 'విధిచేత' నని యర్థముగావున నియతివశముచే ముల్లోకములకు దీప మగుభానుఁడును నస్తమించినాఁ డనుట వాచ్య మై, యెట్టివానికేనియు విధివిధానముఁ దప్పింప నలవి గా దను నర్థాంతరమును సైతము వెల్లడించు చున్నది. మూలార్థమిందు నావంతయుఁ గడమపడలేదు.

అలఁతియలఁతితెలుఁగుపదములు, ఎడనెడ నాతిదీర్ఘసమాసములు, 'సతత రజస్తమోయుతభూపతిప్రజావైరాపనోదనప్రతిభగల్గి, ఇత్యాది సీసపద్యనిర్మాణ చాతురి, కదళీపాకమునఁ బడినమీరచనకుఁ గడుంగడుమాధుర్యమును జేకూర్చు చున్నవి. వీనికిఁదోడు వైదర్భిరీతి మీరచనకు 'హేమ్నః పరమామోద' యను సూక్తి యనుగుణమైనది. మీకావ్య మమృతభాండమయ్యుఁ బ్రౌఢసాహిత్య పరిజ్ఞానము గలవారికే ఆస్వాదయోగ్య మగు చున్నది. ఇది సాహిత్య ప్రణయులయింట నుండఁ దగినగ్రంథరాజము. ఇంతటిప్రౌఢప్రబంధము రచించిన మిమ్ము ఆంధ్రప్రదేశప్రజానీకము సర్వవిధముల గౌరవించి, ప్రోత్సాహపఱుపఁ గల దని యాశించు చున్నాఁడను.



మీకవితకు నుపహారముగా నీపద్యము సమర్పించుకొను చున్నాను.

ఉ॥ మీకవితాకుమారిక యమేయగుణాఢ్యయ సాధువృత్తి, భా
వైకరసార్ద్రి, భావుకసమాహితశయ్య, సువర్ణరమ్య య
స్తోకపదార్థపోషిత, యదోష, సువృత్త, యుదారరీతి, యె
ట్లాకులితాత్ముఁ జేయదు సమాగమ మొనెడ నెట్టిధీరునేన్ !

శ్రీ మళయాళస్వామి సంస్కృత కళాశాల
ప్రొద్దుటూరు
కడపజిల్లా
7-11-78

[illegible]

---

ఆచార్య డా॥ దివాకర్ల-వెంకటావధానిగారు ఎం-ఏ., పి.హెచ్-డి.

మ॥ సురభాషం గవిరాజు బిల్హణుఁడు వాక్స్ఫూర్తిన్ రసాలంక్రియా
భరితం బై తగ విక్రమాంకధరణీపాలాన్వవాయంబుస
చ్చరితంబున్ రచియించెఁ గావ్యముగఁ; దత్సారస్య మాంధ్రావనిన్
బరఁగం జేసినయీమహాకవులవిన్నాణంబు నగ్గించెదన్.

తే॥ గీ॥ ఒకఁడు లక్ష్మణశాస్త్రి శాస్త్రోదరాశి
కవరకుంభాత్మజుఁడు ప్రతిభాఢ్యకరుండు,
రెండవయతండు విశ్వనాథుండు తెలుఁగు
కవితపారము ముట్టినఘనయశుండు,

ఉ॥ మూలగతార్థభావపరిపుష్టి సముజ్జ్వల మై చెలంగ, దృ
శ్యాదృతిఁ జారకాంతియుగశాగ్రమున న్నిలఁ బెట్టువర్ణనల్
చాల వెలుంగ, నయ్యయిరసంబులపోషణ మింపు నింప, మే
ల్మే లని పండితుల్ కవులుమెచ్చఁ గృతిన్ రచియించి రీకవుల్.

సీ॥ సంస్కృతపదసమాసములసంఘటనమ్ము
గిరినుండి నిర్ఝరం బుఱికినట్లు,
లలితంబు లగుతెల్గుపలుకులకూర్పు పూఁ
దేనెకాల్వలు పాఱు దెంచినట్లు,

ప్రకృతిసుందరవస్తువర్ణనంబులతీరు
　　　　వర్ణచిత్రము ముందు పఱచినట్లు,
పాత్రలశీలస్వభావచిత్రణరీతి
　　　　విరిమొగ్గ క్రమముగా విరిసినట్లు,
తే॥ గీ॥ తనర ననువాదమయ్యు స్వతంత్రకావ్య
కామనీయక మెల్లెడఁ గానఁ బడఁగ
ప్రౌఢసుందరభంగి యొప్పంగఁ గవులు
సంతరించినయీకృతి సంస్తుతింతు.

చ॥ వితతపదప్రయోగవిధివిత్తము లీకవిచంద్రు లార్యసం
స్తుతగతి నర్థభావపరిశోభిత మై, యనవద్య మై. రసాం
చిత మయి యొప్పఁగా రచన చేసినయీకృతి పూర్వకావ్యస
మ్మిత మయి తెల్గువారల కమేయముదం బిడుఁగాత నిచ్చలున్.

బర్కత్‌పురము
హైదరాబాదు.

దివాకర్ల వేంకటావధాని

---

### ఆచార్య బ్ర॥శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు

బ్రహ్మశ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారును శ్రీమాదిరాజు విశ్వనాథ రావుగారును కలిసి తెనిగించిన విక్రమాంకదేవచరితమును వినిపించిరి. అవధానం తోను అనురక్తితోను విని ఆనందించితిని. ఇంచుమించు ఎనిమిదిగంటలకాలం కనబడకుండా గడచిపోయింది.

బిల్హణమహాకవిసంస్కృతకావ్యం దీనికి మాతృక. అనువాదమును యథానేదిష్ఠంగా సాధించుటకై కష్టించినకవులు కృతార్థులు. కావ్యమయినప్ప టికీ చరిత్రచిత్రణ మైనఇలాంటికృతులను ప్రతిబింబములుగా తీర్చడమే న్యాయము.

గ్రంథములో ఆయాసంనివేశములను నేను కావలెనని కాంక్షతో చదివించి వింటిని. ఋతుచక్రంలో వర్షోత్కర్ష రాపిల్లాడినా ఋజ్వీగా నిలిచింది. మత్తేభ వర్ణనలలో గతిగాంభీర్యముమీద కవికి గలమమత గోచరించింది. కాని చూలా



లిచొక్కులతో చివిరించి కాలెంతభాగ్యోదయంతో ప్రసవించిన వాచాప్రసాధనం ప్రసన్నంగాను భావనాసంపన్నంగానూ నాకు స్ఫురించింది. కాశ్మీరమండల ప్రశస్తిలో అభిజనసౌభాగ్యంపట్ల కవిఅంతఃకరణసుకుమారాభిమానం ధ్వనించక పోదు.

కవి ఎంతసమర్థుడయినా అనువాదసంఘటనలో ఉండేఅస్వతంత్రత, అన్యానుసరణపరతంత్రత తప్పనది కాదు. ఈసంకోచసంకటాలను సవరించి సవదరించుకోవడంలోనే అతనిసామర్థ్యసంపత్తులను గుర్తించవలెను. అనివా ర్యము లైనఇరుకులలో ఈకవులు కుశలంగా కృతకృత్యు లైనా రని నేను విశ్వసిస్తున్నాను.

బిల్హణుడు వైదర్భి తన కిష్టరీతిగా చెప్పికొన్నాడు. అనువాదకులరచన అన్నిరీతులలోనూ అనర్గళంగా విస్తరించింది. చక్కనిశైలి, సళ్లు లేనిపదబంధము, సౌష్ఠవ-మాధుర్యములు గలభాష అనువాదకులరచనకు వన్నె పెట్టుచున్నవి. విషయగౌరవాన్నిబట్టి రచనాపటిమనుబట్టి ఇలాంటిమనోహరగ్రంథములు విద్యాలయములలో పాఠ్యగ్రంథములుగా ఎన్నుకోదగినవి. గ్రంథరచయితలు ఇంకనూ ఇట్టివిలక్షణకావ్యములను తెనిగింతు రని ఆశించుచున్నాను.

తెలుగుశాఖ అధిపతి
ఉస్మానియా విశ్వవిద్యాలయము
హైదరాబాద్.
వైశాఖ శు॥ ౧౫

---

### ఆచార్య బ్ర॥ శ్రీ నరిపల్లి విశ్వనాథశాస్త్రిగారు, ఏం. ఏ.

I heard with much pleasure a free poetic rendering into Telugu of the Sanskrit Kavya, Vikramankadeva Charita, written by Bilhana Kavi. The work is the combined effort of the Twin poets, Viswanatha-Lakshmana Kavulu of wanaparty. I had the opportunity of spending a couple of days with the poets. They read their creation, whose language is chaste and sweet, of

lucid and fluent in style, a worthy production of a scholarly mind. The flights of imagination of the original are ably brought out in its Telugu form. I heartily congratulate for their laudable service to "Andhra Bharati".

CAMP WANAPARTY

ఆంధ్ర-సంస్కృతాచార్యులు
నిజాం కళాశాల
హైద్రాబాద్.

---

విద్వత్కవి
బ్ర॥ శ్రీగుంటూరు శేషేంద్రశర్మగారు, బి. ఏ.

శా. ప్రాశస్త్య ప్రణుతాంధ్రదేశమున శుంభత్కావ్యపీయూషభా
షాశేషాహి, రసప్రసిద్ధరచనాసందర్భగర్భీకృత
శ్లేశజ్ఞానమనీషి యెవ్వఁ డనినన్, గీర్వాణసాహిత్యవా
రాశిన్ లక్ష్మణశాస్త్రివర్యునిఁ గదా శ్లాఘించు దిగ్దేశముల్.

ఉ. ఆతతవిక్రమాంకచరితామృతపానముఁ జేసి సాహితీ
గీతపరీమళమ్ము లొలికించి యనుంగుతెనుంగుతోఁ బటున్
నూతనవైభవోల్బణము నూల్కొనఁ జేసినశాస్త్రిగారికిన్
జేతులు మోడ్చి యంజలి రచింపఁగరాదె రసజ్ఞశేఖరుల్.

మ. నరులే కాదు సురాసురాఽద్యఖిలత్రింశత్కోటి బృందారకుల్
సరియే, లక్ష్మణశాస్త్రిఁ గావ్యలతికాసంజాతమల్లీవిక
స్వరకింజల్కపరాగకీర్తిని సమస్తగ్రంథసందర్భని
ర్భరవిద్యామహనీయమూర్తి నెర సంభావించి వర్ణింపఁగన్.

మ. అతులప్రజ్ఞుఁడు, 'మాదిరాజు' కులదుగ్ధాంభోధిచంద్రుండు, స
త్ప్రతిభాఽలంకృతసత్కవిత్వరచనాధౌరేయమూర్ధన్యుఁ, డం
చితవాక్ప్రౌఢిమ 'విశ్వనాథ'కవి, వాక్శ్రీచాతురిన్ గావ్యని
ర్మితసౌధంబున నిల్పె లక్ష్మణునికీర్తిన్ దెల్లువా రా నన్.



చ. తెలుఁగున వేల్పువల్కనను దియ్యనికబ్బము లల్లునేర్పుతోఁ
బలుకులతల్లికిన్ బలుకుపందిరులందున నాణిముత్తెపుం
దళుకులయుయ్యెలన్ నిలిపి వెల్గులఁ జూపిరి గూర్పునేర్పుతోఁ;
నల సరి లేరు తెల్గుమడి 'లచ్చన' 'విస్సన' తెల్గుకైతకున్.

హైదరాబాదు,
1-9-74,

---

శిరోమణి-విద్వాన్
విద్వత్కవి బ్ర॥ శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రిగారు

ఉ॥ ధన్యుఁడు విక్రమాంకచరితంబును సంస్కృతసత్కవీంద్రమూ
ర్ధన్యుఁడు బిల్హణుండు కడుప్రౌఢి రచింపఁగ దానిఁ దెల్గునన్
మాన్యగుణాఢ్యకావ్యముగ మల్చిరి లక్ష్మణ-విశ్వనాథధీ
మాన్యులు, కావ్యలక్షణసమంచితబుద్ధులు, తజ్జ్ఞ లౌ ననన్.

మ॥ కవులై మిత్రులునై ప్రలంధరచనాకౌతూహలోద్యగ్రధీ
సువిశాలామలధోరణీయుతులునై జోడైన మీ రియ్యరున్
గవనప్రక్రియఁ దన్పినారలు మహాకావ్యైకదీక్షారతిన్
భువిపై విక్రమదేవకావ్యమును పే పూరించి కావ్యజ్ఞులన్.

చ॥ పదములకూర్పునన్ మధురభావసమున్నతియందు, శబ్దసం
పద-విపులార్థదీప్తియును భాసిలుశైలినిఁ గావ్యమెల్ల శా
రద నడయాడుపుష్పమయరత్నహిరణ్మయకుట్టిమంబుగాఁ
త్రిదులనిరీక్షఁ గూర్చి, సుకవిప్రియులైరి భారతావనిన్.

కం. నన్నయ-తిక్కనపలుకుల
వన్నెలు చిన్నెలును గన్న భారతి మీవా
గున్నతపీఠస్థిత యై
పున్నమవెన్నెలలు నాల్గుమూలల విరిసెన్.

సీ. మాధుర్యధుర్యవాఙ్మంజుతామంజుల
ఘటనావిధికి నమగలము కలము,
సాధుభావవిభావసారస్యసర్వస్వ
శోభితశబ్దమంజూష భాష,
మృదులపాకవిపాక మేదురమధురతా
రసనీయగుణ మతిరసము రసము,
విక్రమాంకషమాలికసాహసౌదార్య
వైభవగుణపుంజభరిత చరిత,

గీ. గలుగ ననితరసాధ్య మౌకావ్య మిటులఁ
గూర్చి సుకవీంద్రతతి మెచ్చుకోలుఁ గంటి
ఔర! లక్ష్మణకవిచంద్ర! యతులకీర్తి
సాంద్ర! శ్రీవిశ్వనాథభాషాఫణీంద్ర!

కేశవపంతుల నరసింహశాస్త్రి

బర్కత్‌పుర, హైదరాబాదు.
30-11-1978

---

అభినవపోతన

శ్రీమాన్ వానమామలై వరదాచార్యులుగారు

సీ. బహుముఖమ్ములు తాము బహుభాష లై
యొప్పి జిహ్వాగ్రనృత్యముల్ సేయుచుండ,
నహిశీర్షమంచు నిమ్మహిఁ దాల్చు ననఁ దలన్
గావ్యప్రపంచము గ్రాలుచుండ,
జాతిమణుల్ శిరస్థలి వెలుంగు ననంగ
దివ్యదలంకారదీప్తు లెసఁగ,
రసనిమగ్నక్రీడపస గల్గిమండూక
విప్లుతి యై కావ్యవీథి వెల్గ,



గీ. నాదిశేషుండె శ్రీలక్ష్మణాఖ్యఁ దెలఁగి
వసుధ నవతరించుట వాస్తవమ్ముగాదె!
పాండితీ-ప్రతిభామణిమండితుండ!
కప్పగంతుల లక్ష్మణ కవిబుధుండ!

గీ. మూలమునకు వన్నియ లిడ ముద్దుగుల్కు
నీదుబిల్హణకృతియనువాద మొప్పు
'ఆంధ్రబిల్హణ ఖ్యాతి' నీ కంద మిడెను
కప్పగంతుల లక్ష్మణ కవిగురుండ!

ఉ. ధారణి నాదిశేషునవతారమె లక్ష్మణుఁ డంచు నెంచఁ గూ
పారసమంబు పాండితియుఁ బ్రజ్ఞయుఁ గైకొని కైతనిగ్గులన్
దేరి రసమ్ము లూరి గుణదీప్తి వెలుంగిడ నీకుఁ దోడుగాఁ
జేరెను విశ్వనాథుఁడు వసించి నెసంగెఁ బరిమళ మ్మహో!

గీ. అమలగీర్వాణపదముల నందగించు
కావ్యగంగ నౌదలఁ దాల్చి ఘనతరాంధ్ర
విశ్వమున కొసంగుటనేమొ విశ్వనాథ!
సార్థనాముఁడ వైతి వీజగతి సుకవి!

గీ. ఆదిలోనె సర్వజ్ఞుఁడు నౌదల నిడ
రసహిమమ్ము వర్షించు నీ రమ్యకవిత;
కన్దొవ ల్విప్ప దశదిశల్ కళల నింపి
'సూరి రాజ'వంశం బని మదికిఁ జాటు.

ఉ. ఈవును లక్ష్మణాహ్వయుఁడు నేరము లై రచియించుసత్కృతుల్
పూవులఁ దావు లై మరియుఁ బుత్తడినిం దళుకొత్తురవ్వ లై
తేవురుపట్టుపుట్టమునఁ దెన్నెసలారుజరీమతాలు లై
గోవులగుమ్మపాలరుచిఁ గొల్పెడిచక్కెర లౌ నిఁకే మనన్.

ఉ. సానలఁ దీరురత్నములచాడ్పున హృద్యము లైనపద్యముల్
గానఁగ నయ్యె మీసరసకావ్యసుధార్ణవమందు నాంధ్రస
ద్వాణికి భూషణమ్ము లయి పొల్పమరెన్ భళి! మీదు కావ్య సం
తానము మీదుసత్కృతివిధానము లప్రతిమానము ల్భువిన్.

ఉ. తెనుఁగులు సంస్కృతంబులును దేనెల ముంచరసాలసత్ఫలా
ర్చన లయి కావ్యవాణికిఁ బసం దగువిందు లొసంగు చుండె; మీ
ఘనతరపాండితీపటిమ, కాల్పనికప్రతిభామహత్వ మెం
దనితరసాధ్యముల్ సహృదయాభినుతమ్ములు తెన్గుసొమ్ము లౌ.

క. వాచస్పతి బిల్హణకవి
ధీచాతురి నెసఁగుసత్కృతి న్దెనిఁగింపన్
మీచరిత మాంధ్రమేదిని
నాచంద్రార్కము వెలుంగు నతులితకీర్తిన్.

చెన్నూరు ఆదిలాబాదు జిల్లా,
80–11–78

---

వచనకవితా పితామహ

## శ్రీ కుందుర్తి ఆంజనేయులుగారు

సుప్రసిద్ధసంస్కృతాంధ్రపండితులు, కవివర్యులు శ్రీకప్పగంతుల లక్ష్మణ శాస్త్రిగారితో నాపరిచయం యీనాటిది కాదు. సమాచారశాఖలో మే మిద్దరము సహోద్యోగులుగా నుండుట ఒకవిధంగా విశేషమే. అంతకంటే ఎక్కువగా చెప్ప దగినది మాయిద్దరిమధ్య గలమైత్రీబంధము. శ్రీశాస్త్రిగారు, కీ.శే.శ్రీమాదిరాజు విశ్వనాథరావుగారును కలిసి వ్రాసిన విక్రమాంకదేవ చరితమును వ్రాతప్రతిలోనూ, అచ్చు అగుచున్నసమయంలోనూ నేను చదవడం తటస్థించింది. నాకు గలఛందఃపర్యవిజ్ఞానము పరిమితమే అయినప్పటికీ, దానిని చదివి చాలాచోట్ల నేను ముగ్ధుడ నయ్యానని చెప్పక తప్పదు. మాదిరాజు వారు పరమపదించి యెంతోకాలము గడచినా యిప్పటికి శ్రీ శాస్త్రిగారి సహృదయతాపూర్వక మైనకృషివలన యీమహాకావ్యము వెలుగు చూడడం ఆంధ్రసాహితీవేత్తలఅదృష్ట మనే చెప్పాలి. ఈకార్యమును నిర్విఘ్నంగా పూర్తి చేసినశ్రీలక్ష్మణశాస్త్రిగారు అభినందనీయులు.

హైదరాబాదు
17–9–74



విమర్శక శిరోమణి

## శ్రీ తిరుమల రామచంద్రగారు

కృష్ణరాయల భువనవిజయాస్థానంలో 'అనుష్టుప్-చక్రవర్తి' అనే కవీశ్వరుడు ఉండేవాడు. స్రగ్ధరలలోనో, దండకవృత్తాలలోనో విస్తరించిన భావాన్ని అనుష్టుప్‌వంటి చిన్నపద్యంలోనే ఇముడ్చడంవల్ల అతనికి 'అనుష్టుప్ చక్రవర్తి' అనేపేరు వచ్చింది. కృష్ణరాయలు ఓఢ్రగజపతిని ఓడించి విజయనగరానికి మరల వచ్చి పేరోలగంలో ఓలలాడినప్పుడు పెద్దన మొదలు పలువురు కవులు తెగబారెడు వృత్తాలతో అతనిని వర్ణిస్తే, అనుష్టుప్ చక్రవర్తి మాత్రం అలవోకగా,

> "కృష్ణరాయ! స్తువంతు త్వాం కవయో; న వయం స్తుమః।
> నరసింహకిశోరస్య కియాన్ గజపతేర్జయః. ॥

ఓ కృష్ణరాయా, కవులు నిన్ను పొగిడితే పొగడనీ! నేనుమాత్రం పొగడను, నీవు కొదమసింగం. నీవు గజపతిని గెలవడం పంగొప్ప? అని చమత్కరించాడట.

అట్లాగే ప్రియమిత్రుడు, బాల్యమిత్రుడు కప్పగంతుల లక్ష్మణశాస్త్రి బిల్హణుని 'విక్రమాంకదేవ చరితం' ను పద్యాల ప్రబంధంగా ఆంధ్రీకరించాడంటే, ఎందరు మహామహోపాధ్యాయులు, ఎందరు కవిసార్వభౌములు ఎంతగా పొగిడినా, నేనుమాత్రం పొగడను. ఎందుకంటే;

ప్రియమిత్రుడు లక్ష్మణశాస్త్రి మురారివలె గురుకులక్లిష్టుడు. పండిత ప్రకాండులకు పట్టుగొమ్మయిన తిరుపతి శ్రీవేంకటేశ్వర సంస్కృతకళాశాలలో పదేండ్లపాటు అలంకార-వ్యాకరణ శాస్త్రాలలో పరిశ్రమించి స్నాతక పరిణతి పొందినవాడు; చెన్నపురి సంస్కృతకళాశాలలో స్నాతకోత్తరం అద్వైత విద్యలో ఆరితేరిన విద్వచ్ఛిరోమణి; ఈమూడు శాస్త్రాలకు 'ఉపాంగంగా, న్యాయపూర్వమీమాంసలను అధ్యయనం చేసినవాడు. వివిధశాస్త్రజ్ఞుల వ్యాఖ్యానాలకు, ప్రవచనాలకు, ఆంధ్ర-సంస్కృత కవితాకల్లోలినులకు కూడలి అయిన వనపర్తి సంస్థానంవాడు కావడంవల్ల కవిసహృదయాఖ్యమయిన సరస్వతీ తత్త్వం కటాక్షానికి పాత్రమయినవాడు; వివిధభాషలను పుక్కిట బట్టినవాడు. చిన్ననాటినుంచే ఉపాసించినగీర్వాణి, తల్లిభాస అయిన తెలుగు, దాని

తోబుట్టువులయిన కన్నడ-తమిళాలు, పరిసరభాష అయిన మహారాష్ట్రి, పూర్వపు అధికారభాష అయిన ఉరుదూ, ఇప్పటి అధికారభాష అయిన హిందీభాషలలో గద్గదనదద్గోదావరివలె కాన్పూరువద్ద గంగానదివలె సుందరగంభీరంగా ఉపన్యసించగల మహావక్త; ప్రతిపదాన్ని పలవింతలతోను పుట్టుపూర్వాలతో ప్రత్యక్షం చేసుకొని, పాణినీయ ప్రమాణాలతో వ్యాకరించగల విపశ్చిదగ్రేసరుడు; పాండురంగ సుకవి తన కవితనుగురించి చెప్పినట్టు నన్నయ - భీమన-తిక్కన - శ్రీనాథుల ఫణితులలో కవితను కదం తొక్కించగల కవితల్లజుడు; గంటలతరబడి సంభాషణలో తనియింపజేసే ప్రసంగచతురుడు; ఉత్తరభారతంలోని పెక్కువిశ్వవిద్యాలయాలలో గౌరవాచార్యుడుగా విద్యార్థులను ఉపాధ్యాయులను తనియింపజేసిన "సుధీంద్రమౌళి" అయినప్పుడు విక్రమాంకదేవచరితాన్ని ఆంధ్రీకరించడంలో అబ్బురమేముంది? అందుకే అన్నాను: నసేమిరా పొగడను-అని.

కాని, ఒక్క విషయాన్ని మాత్రం కొనియాడక తప్పదు, పాతరోత అయి కొత్త వింత అయిననేడు; వృత్తరచన వెర్రి అయి, గేయ-వచనకవిత పులకండపు పలుకయిననేడు; ప్రబంధాలపై పగ పెరిగి, పిలికలపై, ఖండికలపై చండికలపై ప్రేమ పెరిగిననేడు; వ్యుత్పత్తిని వ్యాధిగా, పరిశ్రమను పరమశత్రువుగా భావిస్తూ, పుర్రెలో పుట్టినదంతా 'పులుగడిగిన కవిత' అనే విర్రవీగుడు విస్తరిస్తున్న నేడు; "మురారేః తృతీయః పంథాః" అన్నట్టు ప్రబంధమార్గం తొక్కి కవితను వల్గిత-రేచిత-ప్లుతగతులలో నడిపించి, మార్గకవితకు ముకురంపట్టిన ధైర్యాన్ని, ప్రాచీన ప్రతిభావ్యుత్పత్తులకు ప్రతిమా పరిపాటిని కల్పించిన సాహసాన్ని ప్రశంసించక తప్పదు. ఇలా సాహసించడానికి ఒడిగట్టినాడు గనుకనే, నేడు ఇలాటి చారిత్రిక మహాకావ్యాన్ని మౌలిక మనదగినట్టు అనువదించి యశశ్శ్రీని వరించాడు. ఔను! సాహసే ఖలు శ్రీర్వర్తతే" అన్నాడు భాసుడు,

చారిత్రికకావ్యాల అనువాదంలో ఒకగట్టి చిక్కు ఉంది. కేవల కవితాధార చాలదు. ధారకు వ్యుత్పత్తికి చరిత్రజ్ఞానం జతపడాలి. లేకపోతే, అనువాదం చరిత్రవిశేషాలను మరుగుపరచి, పఠితలను పెడదారి పట్టించి, సాహిత్యానికి ద్రోహం చేయగల ప్రమాదం ఏర్పడుతుంది, అందువల్ల లక్ష్మణశాస్త్రి కల్యాణీ-చాళుక్య చరిత్రను క్షుణ్ణంగా పఠించవలసి వచ్చింది. (బిల్హణుడు



తెలిపిన చారిత్రికాంశాల నిజానిజాలు ఎలా ఉన్నా.) కనుకనే ఈ అనువాదం చరిత్రకారులూ 'ఇదిగో ఇక్కడ చరిత్రాంశం తప్పుగా అనువదించాడుసుమా!" అని ఆక్షేపించడానికి ఆస్కారం లేకపోయింది. ఏ పనిలోనైనా కర్తస్వభావం ప్రతిబింబిస్తుందని, రచనలలో ఇది మరింతగా ప్రస్ఫుటమవుతుందని మనోవైజ్ఞానికులు అంటారు. లక్ష్మణశాస్త్రిచిత్తశుద్ధి చిన్ననాటినుంచి చెరగనిది, 'నీతో ఈపని కావాలి' అని ఎవరు అన్నా, నెత్తిన పెట్టుకొని పూర్తిచేసికొని కాని ఊపిరి తీసుకొనేవాడు కాడు. ఆచిత్తశుద్ధే ఈఅనువాదంలో అడుగడుగునా ప్రస్ఫుటమవుతుంది ఇదొక అసిధారావ్రతం, ఇదొక రచనాయోగం, ఏ పద్యాన్ని మూలంతో పోల్చినా, 'నామూలం లిఖ్యతే కించిత్', మూలానికి మార్పులు, చేర్పులూ, కూర్పులూ లేని చక్కని తీర్పు ఇది.

ఈతీర్పులో భాగస్వామి నామిత్రునిసోదరకవి యశఃకాయులు మాదిరాజు విశ్వనాథరావుగారు. వారిని దర్శించేభాగ్యం నాకు కలుగ లేదు. వారు తెలుగు-సంస్కృత-ఉరుదు-ఫార్సీ-ఇంగ్లీషుభాషలలో అద్భుతరచనాచాతుర్యం గలవారని, గొప్పప్రతిభావంతులని నామిత్రుడు తరచు చెప్పేవాడు. వారు వ్రాసినప్రత్యేకపద్యాలనుకూడా అక్కడక్కడ వినిపించాడు. వారిలిఖితప్రతిని కూడా చూచాను.

ఈగ్రంథముద్రణసమయంలో సంవత్సరంపాటు పెక్కుప్రయోగాల విషయంలో నామిత్రునితో నిరంతరం చర్చించడం జరిగింది. 'నిర్గహన-విగూర్ణ-లటభ' ఇత్యాది అపూర్వప్రయోగాలచర్చలో నేను పాల్గొన్నాను. వాటిఅర్థనిర్ణయంలో నామిత్రునిప్రతిభను గ్రహించాను.

ఆ ఆధారంతో దీనిలోనికొన్నిపద్యాలను మచ్చుకు ఉదాహరిస్తాను :—

నీలచ్ఛత్రోన్మదగజఘటాపాత్రముత్త్రిస్తచోలాత్
చాళుక్యేంద్రాదలభత కృతీ యోఽత్ర విద్యాపతిత్వమ్ ।
అస్మిన్నాసీత్తదను నిబిడాఽఽశ్లేష హేవాకలీలా
వేల్లద్బాహుక్వణితవలయా సంతతం రాజలక్ష్మీః ॥

దీనికి వీరిఅనువాదం :—

చోళాఽఖిలచళుక్యభూమిపతిచే సూరీంద్రుఁడొందెన్ మహా
నీలచ్ఛత్రమదేభరాడ్ధ్వజముతో న్విద్యాపతిత్వంబు నా

పై లాలించె దృఢోపగూహనకళావాల్లభ్యవేల్లద్భుజా
హేలాశింజితహస్తభూష యయి యెంతే వానిరాలచ్చియున్'(7-109)

మూలం :—

బ్రూమః కిమన్యదయముత్సవతేస్మ యత్ర
ద్వయ్యేవ తత్ర గతిరావిరభూన్నృపాణామ్।
కారాగృహే పతనమాశు పలాయనం వా;
చోళోఽపి శీఘ్రమపసార మతశ్చకార॥ (17-67)

అనువాదం :—

"వేయు వచింపనేలఁ బృథివీపతి యెచ్చట మచ్చరించినన్
దీటుఁ దెరంగుగా వసుమతీతిలకంబులకున్ ద్వయంబె, పెన్
గాఱియఁ గారఁ గాంచుట, విశావిక లై దవువాఱుటల్; ద్వరన్
జాతె ననిన్ ద్యజించి గరువం బఱి చోళుఁడు ప్రాణభీతి మై'' (6-219)

ఇలా ఏపద్యాన్ని మూలంతో పోల్చినా ఇదే తీరు.

ప్రసన్నతకు ఒకపద్యం ఉదాహరిస్తాను :—

"చెందం గంటి నృపప్రసాదకణికన్, శ్రీలేశమున్ గంటిఁ గా
సంతోవిద్యను నేర్చితిన్; గుణగణం బాధార మై కొందఱ
న్నిందం జేసితి; నిట్లు జ్ఞాన మటి యెన్నే నేరముల్ సేసితి;
న్నెందం బిప్పుడు శేఁటతెల్విఁ గనె, వాంఛింతు న్వియద్వాహినిన్.
(7-106)

మిత్రునితత్సమధార యెంతవేగంగా ప్రవహిస్తుందో అచ్చతెనుగువాక గూడ అంతటివడితోనే పారుతుంది.

సరములు దెగినను దిగవడి
వఱఁగిడెదవు చెఱఁగువల్వ వడిన నిలువ వీ
వరయుమ! నిజ మగుఁ; జాజెదు
తొరఁగినక్రీఁగోకఁ దెగడి తొయ్యలి! తోడ్తోన్ (5-90)

వెలిముత్తెంబులచాలుఁ బోల్ చెమటసొ ర్వెల్లిన్ మెయిన్ జెంది జేఁ
డలరెన్ దీటుగఁ 'దామ్రపర్ణి' యనువాగం దిమ్మగన్ సంద్ర మై;



వెలిగందంబున వెల్ల నౌచనులతీవెంబోండ్ల కౌఁగిండ్లలో
గెలిచెన్ వేసవియుమ్మ గాక మరు నేగిన్ గూడు పెన్వేఁడియున్.
(5-106)

"యశయావళీ—నభఆభోగ-వయఉదయం" వంటి ప్రయోగాలకు ఈ అనువాదం అకరమంటే అతిశయోక్తి కాదు. ఇలా ఎన్నైనా ఉదాహరించవచ్చు. ఈ ఉదాహరించడం సహృదయుల కుతూహలపానకంలో పుడక కానూవచ్చు.

ఇంతటి విద్వత్కవులకై వాదంతో కమనీయ మైనఈఅనువాదం మూలానికి అన్యూనానతిరిక్త మున్నది సహృదయహృదయైకవేద్యం.

నేను ఇన్నిమాటలలోచెప్పినలక్ష్మణశాస్త్రిని కాశీవాసి, సార్వభౌమ-సంస్కృత - ప్రచారసభాస్థాపక - నిర్వాహకుడు, సాహిత్య - వేదాచార్యుడు, మిత్రుడు శ్రీవాసుదేవ ద్వివేది ఒక్కశ్లోకంలో మధుర-గంభీరంగా చిత్రించాడు, దానిని ఇక్కడ ఉట్టంకిస్తాను.

మూర్తిర్మత్తగజేంద్రగర్వదళనీ వాణీ వినోదప్రియా
వ్యాఖ్యాలేఖ-కవిత్వకౌశల కలాపారంగతా శేముషీ।
శక్తిః సంస్కృత భాషసేవ్యనుపమా విద్వజ్జనేష్వాదరః
శ్రీమల్లక్ష్మణశాస్త్రిణాం గుణగణాః కేషాం న తోషావహాః॥

హైదరాబాద్
1-8-1974

తిరుమల రామచంద్ర

శ్రీ

కవితాసమితి

తిరుపతి

సన్మానపత్రము

బ్రహ్మశ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారికి

బ్రహ్మశ్రీ మాదిరాజు విశ్వనాథరావుగారికి

ఆంధ్ర విక్రమాంకదేవచరితను

వినిపించినసందర్భమున సమర్పింపఁ బడినది.

మ. సరసాలంకృతగద్యపద్యకవితాసారస్య సంపాదకుల్
విరచింప న్సమకట్టి రంచితసభావిఖ్యాతసంపన్నులై
కర మాంధ్రమ్మున విక్రమాంకచరితన్ కవ్యాగ్రణుల్ లక్ష్మణు
డరయన్ మిత్రుఁడు విశ్వనాథకవియున్ వ్యాఖ్యానసంపత్తిమై.

ఉ. కేవలతత్సమంబులను గేవలవైకృతభాషలన్ బలే
తీవిగ మిశ్రభాషలను డీకగ వ్రాసిరి విక్రమాంకమున్
పావనవిజ్ఞులుం గొని సభల్ కొనియాడఁగ నాంధ్రమందుఁ దా
రావనవర్తికీర్తి దెస లల్లఁగ లక్ష్మణ-విశ్వనాథులున్.

ఉ. నన్నయతిక్కనాదికవినాథులపోకడ శైలి, లో రసం
బెన్నఁగ విజ్ఞతాదర్యమతి నించుక వీడనిరీతి, భావసం
పన్నతఁ బోతనాదర్యగతి పాడుకొనం దగ విక్రమాంకమున్
వన్నెయు వ్రాసియుం గని యవారితశక్తినిఁ జూపి రీకవుల్.

ఉ. పూర్వకవీశ్వరాళిఁ బరిపూర్ణచమత్కృతి నారగించి యే
గర్వము లేక సర్వరసకాంతులు చిప్పిల విక్రమాంకమున్
బూర్వకవీశకీర్తిఁ గనుపుణ్యులు లక్ష్మణ-విశ్వనాథులున్
సర్వము నాంధ్రమందు సరసంబుగ వ్రాసిరి రీతిచాతురిన్.



తే. గీ. విజ్ఞతార్జితరత్నముల్ పేరు చేసి
యాంధ్రకవితామతల్లికి హార మొసఁగి
'ఆంధ్రవిజ్ఞాన' బిరుదంబు నందు టన్న
విశ్వనాథ-లక్ష్మణులకుఁ బెద్ద గాదె!

కం. 'తిరుపతి' కవితాసమితికి
నరుదెంచినయతిథిభాగ్య మందినమే మీ
సరసకవీంద్రుల నిర్వుర
సరసంబుగ గౌరవించుశక్తం బత్పెన్.

అధ్యక్షులు

[illegible]

2-1-44

[illegible]

కార్యదర్శి.
ది. 2-1-44

# మనవి మాటలు

జయంతి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః ।
నాస్తి యేషాం యశఃకాయే జరామరణజం భయమ్॥

అని భర్తృహరి చెప్పినచొప్పున రససిద్ధులైనమహాకవీశ్వరులు పుణ్యాత్ములు. వారికీర్తిశరీరము జరా-మరణములు లేక శాశ్వతముగా వారికృతిసౌధనములలో నిలిచి యుండును. అట్టిమహాకవులు ఏకొందఱో జగతియందు నిలిచి యున్నారు. వారిలో బిల్హణమహాకవీంద్రుఁ డొకఁడు.

"బిల్హణునివంశచరిత్ర, యాతనిజీవితచరిత్ర, తత్కృతిభర్త విక్రమాదిత్య చక్రవర్తివంశచరిత్ర, ఆరాజుజీవితచరిత్ర, వీనినిగూర్చి శ్రీవేదము వెంకటరాయ శాస్త్రిగారు, శ్రీఅవధానము చంద్రశేఖరశర్మగారు, శ్రీనిడుదవోలు వెంకట రావుగారున్ను నతివిపులముగాఁ జర్చించి ఉపోద్ఘాత-సమీక్షలలో వ్రాసి యున్నారు. కాఁబట్టి యావిషయములనుగూర్చి మఱల నేను దడవినఁ జర్విత చర్వణ మగును. నేను వ్రాయవలసిన విషయము లన్నియు వారు వ్రాసినారు. సహృదయపాఠకులు వానిని జదివి, గ్రహింతురుగాక. ఇప్పుడు ఈగ్రంథమును అనువదించుటకుఁ గారణమును అసందర్భమున మాకుఁ గలిగినయనుభవములను, నాకవ్యగ్రజుఁడు కీ. శే. శ్రీవిశ్వనాథరావుగారికవిత్వ-ప్రతిభావిశేషములను గూర్చి నే నిటఁ దెలుపుట నాకర్తవ్యము.

నేను తిరుపతి శ్రీవేంకటేశ్వరసంస్కృతకళాశాలయందుఁ జదువు చుండి నప్పుడు ప్రాతఃస్మరణీయులు, సంస్కృతాంధ్రసాహిత్యపాథోధికుంభసంభవులు, ప్రథితయశులు నైన కీ.శే. శ్రీమానవల్లి రామకృష్ణకవిగారు 1930 సం. ప్రాంత మునందు తిరుపతిదేవస్థానకార్యాలయమునందు విద్యాశాఖాఽధికారిగా నుండిరి. నే నప్పుడు ధ్వన్యాలోకము చదువు చుంటిని. అప్పుడు అచ్చులో నున్న లోచనవ్యాఖ్యానమునందుఁ జాలతప్పులు ఉండుటచేత శ్రీకవిగారివద్ద శుద్ధప్రతి యున్న దని విని వారిని దర్శించి యడిగితిని. వారు మిక్కిలి యాదరముతో నన్ను జేరఁ దీసి 'నాయనా! మీదేయూరు?' అని ప్రశ్నించిరి. 'మాది వనపర్తి' యంటిని, వెంటనే వారు నన్ను గౌఁగిలించుకొని యాశీర్వదించి, 'యెవరి కొడుకవు?' అని యడిగిరి. మాతండ్రిపేరు చెప్పఁగనే వారుకన్నుల నీరు గార్చుచు



'నాయనా! నీవు నాకు మనుమఁడవోయీ! నీవు నావద్ద నుండుము నీ కేది వలసినను ఆపుస్తకము తీసికొని చదువుము. నీసంశయములను దీర్చెదను.' అని యెంతయో యాత్మీయతతోఁ బలికిరి.

శ్రీరామకృష్ణకవిగారు మావనపర్తి రామేశ్వరప్రభుపుఁకోరికపై 1900 నుండి 1908 సం. వరకు వనపర్తిలో నివసించి 'శ్రీరంగమహాత్త్వము-ప్రబంధ మణిభూషణము ఇత్యాదివిస్మృతకవిగ్రంథములను ఉద్ధరించి ముద్రించిరి. అప్పుడు మాతండ్రిగారేకాక వయస్సు మీరినవారు అనేకులు వారికడ విద్యాభ్యాసము చేసిరి. వారిలో నాకవిసోదరుఁ డగువిశ్వనాథరావుగూడ నొకవిద్యార్థి. ఈ కారణముచేత శ్రీకవిగారు నన్ను సమాదరించిరి.

తిరుపతికళాశాలలో నేను విద్య ముగించి మావనపర్తి చేరినపిదప నొకసారి నేనును-మావిశ్వనాథరావుగారున్ను మద్రాసులో శ్రీకవిగారిని దర్శించితిమి. అప్పుడు కవిగారు అత్యానందము నంది వారివద్దనే మమ్ము 2-3 దినములు ఉంచుకొని అనేకవిషయములను బోధించి 'బిల్హణునివిక్రమాంకదేవ చరిత'కావ్యమునకు నింతవఱకు తెలుఁగులో నిర్దుష్టమైనయనువాద మవతరించ లేదు. మీరిరువురుఁ గలిసి దానికిఁ బద్యానువాదము చేయుఁడు. అని ఆజ్ఞాపించి, జర్మన్‌విద్వాంసుడు, డా-జార్జి బుల్హార్ 19వ శతాబ్దియంతమునఁ బ్రచురించిన ప్రాచీన సంస్కృత ప్రతి నొకదానిని మాకిచ్చి యాశీర్వదించిరి.

అప్పుడు ద్వితీయప్రపంచమహాయుద్ధము ముమ్మరముగా జరుగు చుండెను. దాదాపు 1938-39 సం॥ములకాలము. మేము వనపర్తికి వచ్చి కవిగారియాజ్ఞ మేరకు ఒకమంచిముహూర్తమున ననువాదమున కారంభించితిమి. విక్రమాంకదేవచరితమునకు సంస్కృతమున వ్యాఖ్యానము లేదు. మేమిరువు రము తొలుత పదిశ్లోకములను అన్వయించుకొని ఒక్కొక్కశ్లోకమునకు నర్థ నిర్ణయము చేసి చెరియైదుశ్లోకములను దీసికొని యిండ్లకుఁ బోయి యనువదించి మఱునాఁటియుదయమున నిరువురము చేరి పరస్పరము పద్యములు వినిపించు కొని దిద్దుబాట్లు చేసికొని గ్రంథస్థము చేయు చుండెడివారము. కొన్ని నేను వ్రాసినవి వారు మార్చుటయో వారు వ్రాసినవి నేను మార్చుటయోకూడ జరుగుచుండెను. ఇది మాయనువాదసరణి. ఇందొక్కవిశేషము :-

శ్రీమాదిరాజు విశ్వనాథరావుగారు నాకన్న నప్పటికే వయస్సులోఁ బెద్ద వారు. వారిప్రజ్ఞ అతినిశితము. గొప్పప్రతిభాసంపద గలవారు. సంస్కృతాంధ్ర

ములేకాక, ఫార్సీ-ఉర్దూ-ఇంగ్లీషు-న్యాయశాస్త్రము-గణితము-శిల్పము-చిత్రకళ-ఇత్యాదివిద్యలలో నతిచతురులు. అచ్చతెలుఁగురచనలో వారు అందెవేసిన చేయి. సంస్కృతములోఁ నుత్తమవ్యుత్పత్తి గలిగి యుండిరి మేము ఒండొరు సంస్కృతాంధ్రసాహిత్య - వ్యాకరణ- ఛందోవిషయములందుఁ బరస్పరము తోడ్పడుచు రచన సాగించితిమి. నేను నామిత్రుని ప్రోత్సాహముచేతనే తెలుఁగులోఁ గవితాఽభివృద్ధి చేసికొనఁ గలిగితిని. దానికి నేను జదివినసంస్కృతము చాలసహకారిగా నుండెను. అప్పటికి నిప్పటికి నతనికి నేనెంతయో ఋణపడి యున్నాను. పగలు హైస్కూలులో నాంధ్రోపాధ్యాయవృత్తిని నెఱవేర్చుచు రాత్రి గ్రంథరచనమును సాగించుచుండుటచేత యౌవనదశలోనే నాయారోగ్యము కొంత చెడినది. విశ్వనాథరావుగారికి ఉబ్బసముజబ్బు ఉండెను. ఆయనకడనే విద్య నభ్యసించి మంచివిజ్ఞానమును సంపాదించిన ఆయనతృతీయపుత్రి శ్రీమతి శారదమ్మ, మేము వ్రాసిన చిత్తుపద్యములప్రతిని శుద్ధప్రతిగా వ్రాయుచుండెను.

ఇట్లు దాదాపు మూడుసంవత్సరములు నిర్విరామముగా రచన సాగించి ఒకచిత్తుప్రతిని సిద్ధము చేసి, దానిని విద్వత్కవులకుఁ జూపి సవరించుకొనవలెననుద్దేశముతోఁ దొలుత గురువర్యులు శ్రీమానవల్లి రామకృష్ణకవిగారివద్దకు తిరుపతికేగితిమి. అప్పుడు వారక్కడ లిఖితపుస్తకభాండాగారములో, 'క్యురేటర్' గా నుండిరి. వారికే తొలుతఁ జూపవలెనని మాయాశ. మూడునాలుగుదినములు ఓపికతో ననువాదమంతయుఁ జూచి దిద్ది మా కిచ్చిరి. వారియధ్యక్షతలో కీ. శే. శ్రీవేటూరి ప్రభాకరగురువులసమక్షమున నొకసభ చేయించి మాచేఁ బద్యములు చదివించిరి. అది విని యానందించి మాకు 'ఆంధ్రబిల్హణ' బిరుదము దిరుపతిసాహితీబంధువు లిచ్చిరి. ఆతరువాత ననేకులు పెద్దలకుఁ జూపి వారిమన్ననల నందితిమి.

శ్రీశ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రిగారివద్దకు, రాజమహేంద్రవరమునందు, మేము పోయినప్పుడు, వారు' మీకవిత్వము' వినుటకే కూర్చొని యున్నామా! హైదరాబాదులోఁ దెలుఁగుకవిత్వ మున్నదా! తురకదేశము' అని మమ్ము ఈసడించుకొని గ్రంథము వినుటకు నిరాకరించిరి. అప్పుడు యువకుఁడుగా నుండిననేను మాప్రాంతమున మీరు 'ఎంతో సహృదయులు గొప్పవారు' అని ప్రశంసించుటచే వచ్చితిమి. ఇప్పుడు 'మీ రిట్టివా'రని తెలిసినది.



పోయి వచ్చెద' మని యంటిని. ఆమాటకు వారు భ్రాంతిఁ జెంది నన్ను ఆపాదమస్తకముఁ జూచి, 'నీకు అరగంట సమయము ఇచ్చెదను. వినిపింపుము' అని వరము ప్రసాదించిరి. కూర్చుంటిని. నామిత్రుఁడును నాపార్శ్వమున నుండెను. 'ఏమి చదువు మనెదరు?' అని యడిగితిని 'మీకావ్యమునం దేమున్నది?' అనిరి. 'అన్నివర్ణన లున్న'వంటిని. 'వసంతఋతువర్ణనము వినిపింపు' మనిరి. నేను జదివిన మొదటిపద్యమునందే తప్పుపట్టి మమ్ము పంపఁ దలఁచి, వారు, 'ఈపదమున కర్థ మేమి?' అనిరి. చెప్పితిని. 'కా'దనిరి. సమర్థించితిని. ఇట్లు వారు ప్రతిపద్యమును బరీక్షించుచు విను చుండిరి. తొమ్మిదిపద్యములు విన్నతరువాత 'మీరిచ్చిన అరగంట యైనది. ఇంకొకపద్యముమాత్రము చదివి ముగించెద'నని పదవపద్యము చదివితిని. ఆ పద్యముయొక్క అన్వయమునందు, మాయిరువురికి వాదము జరిగెను. వారు చెప్పినయన్వయక్రమము ఏకదేశాన్వయదోషదూషిత మని నిరూపించితిని. వారు సంతోషించి నావీఁపు తట్టి 'నీవు వ్యుత్పన్నుఁడవోయీ! నీగ్రంథము బాగున్నది. గ్రంథము వినెదను. నేఁడు నాతోనే యిరువురు భోజనము చేయుఁడు' అని నాగోత్రముగూడ వారి గోత్రము 'కౌశిక' గోత్రమే యగుటచేత 'మనగోత్రమువారిరచన బాగుండు ననియు, మనమిరువురము నేకశాఖీయులము గనుక నీచనవు తీర్చెద ననియుఁ జెప్పి మాకు భోజనము వారిపంక్తిలోఁ బెట్టి ఆసాయంత్రమువఱకు గ్రంథము వినిరి.

అప్పుడు బెజవాడయం దున్న శ్రీచెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారిని దర్శించి "మీరు విక్రమాంకదేవచరితమునకు గద్యానువాదము చేసితిరి. కనుక మీకు వినిపించి మాసంశయములను దీర్చుకొనుటకు వచ్చితిమి" అని చెప్పఁగనే వారు సహృదయతతో నాదరించి వినిరి. ఒకచోట సవరణ తెలిపిరి. 'అది బాలవ్యాకరణ విరుద్ధ' మంటిని. అప్పుడు వారు వ్యాకరణముపై నొక బూతుమాట విసరి నవ్వి మమ్మాశీర్వదించి పంపిరి. కాశీ కృష్ణాచార్యులుగారు, జనమంచి శేషాద్రిశర్మగారు, చిలకమర్తి వారు, "చాల దినములకు మంచికావ్యము విను నవకాశము కలిగిన"దని నన్ను గౌఁగిలించుకొని యాశీర్వదించిరి. శ్రీకట్టమంచి రామలింగారెడ్డిగారు చిత్తూరులో నాలుగుగంటలకాలము ఏకాగ్రతతో గ్రంథము విని యభినందించిరి.

ఆనాటిపెద్దలందఱిమన్ననల నందిన యీకావ్యము చిత్తుప్రతిగానే ఉండెను. ఇంతలో నేను వనపర్తియుద్యోగము విడిచి హైదరాబాదు సిటీ కాలేజి

యందుఁ దెలుఁగుపండితుఁడనుగా 1947 సం॥లోఁ జేరితిని. ఆతరువాత నొకసంవత్సరములోనే శ్రీవిశ్వనాథరావుగారు ఉబ్బసమువ్యాధితో దివంగతులైరి. 'ఈ కావ్యము ముద్రించి ప్రకటించినచో నాకుఁ బరలోకమున శాంతి చేకూరును' అని నాకు వారిచివరిమాటలుగాఁ జెప్పిరి.

ఈయనువాదమున నేను అనేకపర్యాయములు పునఃపరిశీలనము చేసితిని. ఆసందర్భమునందు నాకు నుభయభాషావ్యాకరణ-సాహిత్యములలోఁ గలిగిన సందేహములను దీర్చినపూజ్యులు బ్ర॥శ్రీ సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారికిఁ గృతజ్ఞతాంజలి నర్పించుచున్నాను.

ఎప్పుడో కడచినబిల్హణకవికిని నాకును బాదరాయణసంబంధము కలదు. మేమిరువురము 'కౌశిక'గోత్రులమే. అతనిగ్రంథము ననువదించునవకాశము లభించుట నాభాగ్యము. మావిశ్వనాథరావుగారు తలఁపునకు వచ్చినపుడు నాకుఁ గంటఁ దడి రాక మానదు. ఆయనఋణము దీర్చుకొనలేను. మే మనువదించినబిల్హణకవి 'కర్ణసుందరి' నాటికాప్రచురణ సమయమునందు మావిశ్వనాథరావుగారికిఁ గలిగినసంతసము నేఁడు నే ననుభవించఁ జాలక పోయితి నని చింతించు చున్నాను.

ఇది చారిత్రికకావ్య మగుటచేత దీనియుపోద్ఘాతము వ్రాయుటకుఁ గేవలము సంస్కృతాంధ్రపాండిత్యముమాత్రము చాలదు. పశ్చిమచాళుక్యవంశచరిత్ర నెఱిఁగినవారిలో నిష్ణాతులై యుండవలెను. సంస్కృతాంధ్రవైదుష్యములతోపాటు కల్యాణీచాళుక్యచరిత్రలో సమకాలికులలో నిష్ణాతులైన శ్రీవేదము వెంకటరాయశాస్త్రిగారినిఁ బ్రార్థించినతోడనే వారు ప్రేమపూర్వకముగా నంగీకరించి దీనికి ననన్యసాధ్యమైనచక్కనియుపోద్ఘాతము వ్రాసి దీనిశోభ నినుమడింపఁ జేసిరి. వారియుపోద్ఘాతము దీనికి మకుటాయమానము. వారికిని, వారిపేరు సూచించినమిత్రుఁడు శ్రీతిరుమల రామచంద్రకును నే నెంతయుఁ గృతజ్ఞుఁడను.

సంస్కృతాంధ్రసాహిత్య-వ్యాకరణపాథోధినిఁ దఱచి మణులను వెలికిఁ దీసి అలంకరించుకొనినమిత్రుఁడు శ్రీఅవధానము చంద్రశేఖరశర్మగారు పాండితీస్ఫోరకమైనసమీక్షచేత ఈకావ్యము నలంకరించిరి: వారికిఁ గృతజ్ఞతఁ దెలుపక యుండఁ జాలను. ఇఁక విమర్శకాగ్రేసరులైన శ్రీనిడుదవోలు



వెంకటరావుగారు నే నడిగినదేతడవుగా నద్భుత మగుసమీక్షను వ్రాసిరి. అది 'పీఠికయా? సమీక్షయా? ఉభయమా?' అని అనుకొని 'ఉభయరూప' మని నిర్ణయించుకొంటిని. వారికిఁ జాలఁ గృతజ్ఞుఁడను.

అనేకవిద్వత్కవు లీయనువాదమును బొగడుచు సదభిప్రాయములను వ్రాసి యిచ్చిరి. ఆ పెద్దల కందఱకును గృతజ్ఞతాంజలు లర్పించు చున్నాను. వారిలో ననేకులు దివంగతులైనవారుగనుక, వారిస్మరణార్థము వారి సంతకములను బ్లాకులు చేయించి ముద్రింపఁ దలఁచితిని. వానితోఁబాటు నేఁడు జీవించి యున్న విద్వత్కవులసంతకములనుగూడ బ్లాకులు చేయించి ముద్రించితిని. ఇట్టిశుభముహూర్తమున మావిశ్వనాథరావుగారు జీవించి యుండిన నెంతగా సంతసించెడివారో. ఈనాయల్పకృషి వారియాత్మకు శాంతినిఁ జేకూర్పుఁగాక యని భగవంతునిఁ బ్రార్థించు చున్నాను. ఈకావ్యమును దీర్చి దిద్ది ప్రచురించుటకు నా కనేకవిధములుగ సహకరించినమిత్రులందఱకును నావందనములు

దాదాపు మూడు దశాబ్దములుగా నీగ్రంథము ముద్రింపఁ బడ కుండుటకెన్నియో యంతరాయములు కారణము లయ్యెను. వానిలో నార్థికమైన యిబ్బంది ప్రధానము. ఏడెనిమిదియేండ్లక్రిందటియంచనా ప్రకారము దీనిముద్రణమునకు రు. 6000/-లు అవసరమై యుండెను. ఇప్పుడు అవ్యయము త్రిగుణీభూతమైనది. ఆచిక్కులనన్నింటిని నేనొక్కఁడనే యెదుర్కొన వలసినవాఁడనై యున్నందున ననేకప్రయాసల కోర్చి యిప్పటి కీకార్యము, భగవంతునికృపచేతనో మావిశ్వనాథరావుగారు స్వర్గమునుండి నన్నాశీర్వదించుచుండుటచేతనో సంపూర్ణమైనందుకు నన్ను నేను ధన్యునిఁగా భావించుకొను చున్నాను.

ఆధునికయుగమునం దీమహాప్రబంధమును జదువువారు ఏకొలఁదివిద్వాంసులో యుందురుగనుక దీనివలన భవిష్యత్తులో నార్థికలాభ మేమియు లేకున్నను, దీనిని జదువఁ గలిగి యానందించువా రెప్పటికైనఁ బుట్టక పోవుదురా యని, 'కాలో హ్యయం నిరవధిః విపులా చ పృథ్వీ' యనుభవభూతివాక్యమును దృష్టియం దుంచుకొని దీనిని బ్రచురింప సాహసించితిని.

ఈగ్రంథముద్రణమునకు నార్థికసహాయము చేసినభారతకేంద్రప్రభుత్వమునకును, నాంధ్రప్రదేశప్రభుత్వమునకును, నిజాం ధర్మనిధివారికిని, ఆంధ్రప్రదేశ సాహిత్యఅకాడెమీవారికిని నేనెంతయుఁ గృతజ్ఞుఁడను.

ఈముద్రణమునకుఁగాను చౌకవెలకు కాగితము నిచ్చిన శ్రీబిర్లావారికిని, వారినిఁ బ్రోత్సహించిన శ్రీపన్నాలాల్ భండారిగారికిని నాకృతజ్ఞతాంజలులు.

విక్రమాదిత్యునివంశీయుఁ డైనసర్దార్ ఏ.ఏ.చాళుకేయపాటీల్-ఐ.ఏ.ఎస్ గారు, కల్యాణపత్తనదేవాలయభిత్తిశిల్పచిత్రమును సంరక్షించి యున్నారు. దానిని బనారస్ హిందూ విశ్వవిద్యాలయమువారు సంస్కృతవిక్రమాంకదేవచరిత్రలోఁ బ్రచురించిరి. ఆచిత్రముచేత నీయాంధ్రకావ్యమునుగూడ నలంకరింపఁ దలఁచిననాకు ఆవిశ్వవిద్యాలయమువారు, శ్రీచాళుకేయపాటీలుగారును అనుమతి నిచ్చిరి. వారికిఁ గృతజ్ఞుఁడను.

మావిశ్వనాథరావుగారితో నేను మూడుదశాబ్దులక్రితము తీయించుకొనిన చిత్రమును, జక్కఁగాఁ దాను వ్రాసి యుంచుకొనినవ్రాఁతప్రతిని నా కిచ్చిన మావిశ్వనాథరావుగారికూఁతురు శ్రీమతి శారదమ్మకును నేను గృతజ్ఞుఁడను. ఆచిత్రమువలన విశ్వనాథరావుగారిరూపమును నేను పాఠకుల కందింపఁ గలిగితిని. విక్రమాదిత్యునిచిత్రమును, మాయిరువురిచిత్రమును సర్వాంగసుందరముగాఁ దీర్చి యిచ్చినకళాతపస్విలు, మిత్రులు శ్రీపి.టి.రెడ్డిగారికిని, శ్రీప్రభుజీత్ సింగ్ గారికిని గృతజ్ఞుఁడను.

ఈప్రబంధమునందలిసంతకములబ్లాకులను, చిత్రములబ్లాకులను, సిద్ధము చేయించుటలో నాకు అమూల్యసహకారమును జేసినప్రభుత్వపాఠ్యపుస్తకముద్రణాలయపుడిప్యూటీడైరెక్టరు శ్రీరామకృష్ణరావుగారికిని, బ్లాకులు చేయించి సకాలములో నిచ్చిన 'అమరావతిప్రోసెస్' వారికిని గృతజ్ఞుఁడను.

ఈగ్రంథమును సుందరముగా ముద్రించి యిచ్చిన శ్రీశివాజీముద్రణాలయాధికారి జనాబ్ బడేసాహెబుగారికిని, ఆముద్రణాలయోద్యోగులకును నేను జాలఁ గృతజ్ఞుఁడను. జనాబ్ బడేసాహెబ్, శ్రీనాగేందర్ గారల అవ్యాజమైన శ్రద్ధను నేను గొనియాడక యుండఁ జాలను.

ఎంత జాగ్రత్తతోఁ బరిశీలించినను గొన్ని ముద్రణదోషములు దొరలక తప్పలేదు. వానిని సవరణపట్టికలోఁ జేర్చితిని. సహృదయవిద్వత్కవిశేఖరులు మన్నించి సూచన లిచ్చినచోఁ గృతజ్ఞతాపూర్వకముగ స్వీకరించి పునర్ముద్రణమున సవరించుకొనెదను. ఈగ్రంథప్రకాశనమునకు నాకుఁ జేదోడు-వాఁదోడుగా నుండిననాకూఁతురు ఆయుష్మతి శ్రీమతి కమలకు (సంస్కృతమునందు ఎం.ఏ.పట్టమునంది-ఉస్మానియావిశ్వవిద్యాలయమునందు సంస్కృతాచార్య)కును. నాశ్రీమతి, అన్నపూర్ణకును నాశుభాశీస్సులు.

నాకవ్యగ్రజులు, కీ.శే.శ్రీమాదిరాజు విశ్వనాథరావుగారికి స్మృత్యంజలి సమర్పించి యీకావ్యమును సహృదయవిద్వత్కవులకరకమలములయం దిడుచున్నాను :—

## స్మృత్యంజలి

శా. శ్రీవాణీవరరంభవిభ్రమలసచ్ఛ్రేయోఽనుభూతిన్, గళా
శ్రీవిభ్రాజితు, నన్యోక్తివిదమతిశ్రీ మించుబ్రాహ్మీసుతున్,
భావప్రోద్యతనైకకావ్యకలనాభ్రాజిష్ణుఁ, 'గౌండిన్య'గో
త్రాఽవిర్భూతుని, 'విశ్వనాథ'కవి, నాయన్నన్ స్మరింతున్ దమిన్.

ఉ. పూతుఁడు, 'మాదిరాజు'కులభూషణుఁ, డాంధ్రకవిత్వతత్త్వని
ష్ణాతుఁడు, సంస్కృతాంగ్లయవనస్తుతభాషలఁ గోవిదుండు, రా
జ్యాఽతతకార్యదక్షుఁ, డనయచురదీక్షుఁడు, న్యాయవర్తనుం
డై తగు'విశ్వనాథ'విబుధాగ్రణి నిశ్చలుఁ గొల్తు నిచ్చలున్.

చ. అనయము నాకు నన్న యయి యన్నిట మన్నన నన్ను దీర్చుచున్
నను విడకుండ నెప్పుడును నన్నొకసత్కవిఁ జేసినట్టి ధీ
వినుతుని 'విశ్వనాథునిఁ' బవిత్రచరిత్రుని సంస్మరించి నే
నన్నృణుఁడ నయ్యెదన్ సతత మంజలి సంఘటియించు చాత్మలోన్.

ఉ. జాముతెలుంగుగీము నుడిచానకుఁ గట్టినదిట్ట, కబ్బముల్
మేన గగుర్పొలర్ప గడి మీఱఁగఁ గూర్చినమేటి, కైతలో
సానలఁ దీఱుతీర్పరుల సాగఁగ నీయనిజెట్టి, కర్తముల్
పూనికఁ దీర్పునేర్పు చలమున్ గల 'విస్సన' లెస్సఁ గొల్చెదన్.

మ. కని శాస్త్రాస్త్రములందుఁ 'దిక్కన' యనంగా నొప్పుసత్కీర్తిఁ, దా
దనువున్ బాసెను భౌతికంబు; నయినన్ దత్కీర్తికాయంబు ని
ల్చెను శ్రీ'బిల్హణు' 'విక్రమాంకచరి'తాక్లిష్టాంధ్రకావ్యంపుద
ర్పణమం దారవితారకంబుఁ గవి- విద్వద్వర్యసంస్తుత్య మై.

మ. వ్యవహార-వ్యవసాయ-శిల్ప-కృషివిద్యా-నైకభాషాచణ
త్వవదాతస్థిరకీర్తి, లౌకికపటుత్వంబందు, నీఁగన్ సదా
సువిచారప్రథమానమానసమునన్, సుశ్లోకతన్, వాగ్మిత
న్నవ లే రాదురు? 'విశ్వనాథ'కవి కాంధ్రక్ష్మాతలంబందునన్.

ఉ. తమ్ములకన్న నెక్కుడుగ దత్పరతన్ నను నాదరించి యాం
ధ్రమ్మున సంస్కృతమ్మునఁ బరస్పరశిష్యత మేము మేలొనన్
ఐమ్మిననెమ్మితోడ 'వనవర్తి' ని నాత్మలు నొక్కఁడే యనన్
సమ్మతి నన్ను దీవిచినసత్కవిఁ గొల్చెద 'విశ్వనాథునిన్'

ఉ. నిండుమనమ్ము నవ్యనవనీతసమానము, నాల్క దారుణా
ఖండలశస్త్ర మంచు నుతిఁ గాంచెను సన్నుత'మాదిరాజు' వం
శుం డగు 'విశ్వనాథ'కవిసోముఁడు, వండినగుండెలో సుధా
భాండము నిండినట్టిఋజువర్తను నన్నను సంస్మరించెదన్.

శా. నాకన్నన్ భువి నన్నిటన్ మిగుల మిన్నన్ గాఁగ ని న్నెన్నితిన్.
నాకంబున్ గయికొంటి మున్నుగనె యన్నా! నీదునగ్రేసర
త్వాఽఽకాండల్ మినుముట్టె;నిప్పుడు'సుధర్మా'ఽలంకృతిన్;మిన్ను మ
న్నేకం బై తగె నీదుసత్కవియశం బీరేడులోకంబులన్.

శా. అన్నా! నీ కిదె పంపుచుంటిని 'సుధర్మా'ఽఽస్థానికన్నన్ గడున్
తె న్నో'విక్రమకావ్య'సౌధమును నిర్మింతుండ వై సౌఖ్య మొ
ప్ప న్నానాటికి నుండు మిందు దివిలో స్వర్వాసు లర్చింపఁగా
న న్నాశీస్సుమవృష్టిఁ దేల్చుచు మహానందమ్ముతో నిచ్చలున్.

తే॥ గీ॥ అరయ 'లక్ష్మమ్మ-రామేశ్వరమ్మ-శార
దమ్మ-రామరా' వన నల్గు రనుఁగుసుతుల
నిచ్చ దివినుండి కృపఁ గంచు నీకుభాఽశి
షములఁ గురియించు మని ప్రార్థనములు సేతు.

క. అమరత్వ మొందితివి నీ
వమరం బగుకావ్యమందు నమరపురిని; నీ
కమరెను భువి దివి సుఖములు;
నమస్కరించెదను దీవనను మముఁ గనుమా!

'అమరభారతి'
5-9-22/97, ఆదర్శనగరము
హైదరాబాదు-500004
ఆనంద-విజయదశమి
25-10-1974

# సవరణ పట్టిక

| పుట | పంక్తి | దీనికి | ఇది |
|---|---|---|---|
| 4 | 1 | వసను | వసను |
| 5 | 16 | సన్నిష్ట | సన్నివిష్ట |
| 11 | 16 | ప్రాశ్రా | పాశ్రా |
| 17 | 1 | ఈపద్యము | పునర్ముద్రితము |
| 17 | 5 | జముం | జయుం |
| 17 | 19 | రాజు | రావు |
| 17 | 21 | రాజు | రావు |
| 18 | 20 | ధీయ | ధీయు |
| 21 | 4 | 'సర్కా'ధీ | 'సర్కా'రధీ |
| 23 | 17 | అభ్యుదయ పరంపరాభివృద్ధిగా | సాష్టాంగనమస్కా రంబు లాచరించి |
| 25 | 8 | రచో | రవచో |
| 30 | 14 | ధన్మ | దన్మ |
| 34 | 10 | ధారిణీ | ధారణీ |
| 35 | 25 | లంత | లంకా |
| 45 | 16 | బిల్హణ | శ్రీ బిల్హణ |
| 45 | 19 | దితకవితా | దితగీర్వాణాంధ్రకవితా |
| 45 | 19 | రద్యలు | రద్య |
| 45 | 20 | చితులు | చిత |
| 45 | 21 | నగులక్ష్మణ | లక్ష్మణ |
| 48 | 12 | శించుం | శిన్ గన్ |
| 50 | 5 | వాయితు | వాఽయతు |
| 50 | 12 | దాయిత | దాఽనత |
| 60 | 18 | జబిష్ఠు | జంబిష్ఠు |
| 60 | 6 | భ్రాజ | భ్రాజి |
| 62 | 22 | దలంన్ | దలంపన్ |

| పుట | పంక్తి | దీనికి | ఇది. |
|---|---|---|---|
| 126 | 25 | లంచు | లించు |
| 126 | 25 | ౖ | 2 |
| 127 | 2 | త్రితం | త్రితవినం |
| 128 | 15 | వగము | వరమహాము |
| 129 | 6 | నిదాఁచు | నిఁగాచు |
| 132 | 5 | దుఁగొను | దుఁగవును |
| 134 | 9 | పవును | వసువు |
| 139 | 25 | ముద | ముద్ర |
| 142 | 21 | కర్మ | కకర్మ |
| 143 | 21 | నటె | నటు |
| 151 | 16 | క్లామ్య | కామ్య |
| 158 | 6 | ఘనరూ | ఘనురూ |
| 160 | 4 | న్వవ | నృవ |
| 160 | 20 | సెన | సిర |
| 163 | 3 | గొనును | గొనుచు |
| 165 | 15 | ర్వవ | రవ |
| 169 | 1 | ఱంచి | ఱంచి తా |
| 171 | 25 | లుము | లువలు |
| 181 | 13 | కేకత | కేతక |
| 181 | 20 | యితలు | యితులు |
| 184 | 4 | వీమేనన్ | నీమేనన్ |
| 184 | 7 | నరతు | నరుతు |
| 184 | 8 | వేశి | వెళ |
| 186 | 9 | పని | వని |
| 187 | 23 | కండ్ల నిల్పు | కన్నులొందు |
| 189 | 18 | 137 | 138 |
| 190 | 4 | కాలుఁ | కాలిఁ |
| 191 | 17 | వివిం | నివిం |



| పుట | పంక్తి | దీనికి | ఇది |
|---|---|---|---|
| 196 | 6 | మీన్ చా | మించా |
| 197 | 6 | చుక | చుచు |
| 201 | 23 | పత్వ | పర్వ |
| 203 | 2 | ఖేది | ఖేది |
| 215 | 7 | గర్జాఘ | గర్జన్ ఘ |
| 215 | 15 | పు గా | పుం గా |
| 217 | 18 | చేంగి | వేంగి |
| 223 | 2 | గా కా | గా |
| 226 | 16 | పంనాన్ | పంక్తినాన్ |
| 227 | 16 | యోద్భత | యానక |
| 230 | 5 | సమిద్రంగమున్ | రణక్షోణిపం |
| 230 | 17 | అన | అనఁగ |
| 232 | 19 | స్వాతు | నతు |
| 234 | 18 | నవృద్ద | నవివృద్ధ |
| 240 | 2 | నృపుఁడు | నపుడు |
| 241 | 7 | ప్రవా | ప్రవ్యా |
| 243 | 4 | శిధ్ర | శిధ్ర |
| 244 | 13 | ముబ్కు | ముల్కు |
| 249 | 14 | ్రేశా | దేవా |
| 253 | 4 | స్పృత | ప్రస్తుత |
| 259 | 2 | నుండియ | నుండినయ |
| 269 | 1 | త్తంగ | తుంగ |
| 275 | 1 | సృషి | సృష్టి |
| 280 | 6 | దృటి | త్రుటి |
| 280 | 7 | రాణ్న | రాణ్డ |
| 280 | 9 | భృగా | భృంగా |
| 281 | 19 | కరా | కర్ణా |
| 281 | 20 | ంతా | కంతా |